# విషయసూచిక.

విషయసూచిక

| విషయము. | | | పుట. |
|---|---|---|---|

విషయము. | పుట.

షష్ఠస్కంధము

| విషయము. | | | పుట. |
|---|---|---|---|

| విషయము. | | | పుట. |
|---|---|---|---|

అష్టమస్కంధము

## నవమస్కంధము

శ్రీ ర స్తు

# శ్రీ దొడ్డ భాగవతము

## పంచమ స్కంధము

### సంసారాసక్తులకు భగవత్ప్రాప్తి కలుగునా?

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షి వచనంబులను విని 'మునివర్యా! ప్రియవ్రతుఁ డాత్మవిద్యను గఱచి యాత్మారాముఁ డయ్యుఁ బదంపడి గృహాసక్తుఁడై రాజ్యపాలనాదికము చేసి తుదకుఁ బరమపదంబు నొందెనని తెలిపితిరి. గృహాసక్తి యనునది కర్మబంధనంబునకు మూలం బగును. కర్మబద్ధునకు స్వరూపజ్ఞానంబు మఱుగుపడును. తత్ఫలంబుగా నతఁడు బద్ధజీవుఁడై వివిధ క్లేశవశుఁ డగును. సంసారక్లేశంబులకు రోసి సర్వసంగపరిత్యాగం బొనర్చి యాత్మజ్ఞానులై భగవత్పాదంబు నాశ్రయించి మనశ్శాంతినిబడసిన భాగవతులకు గృహాసక్తి మఱల జనించునా? గృహాసక్తి పైకొన్నచో నెట్టివారికిని సంసారసాగరమగ్నత తప్పదుగదా! అట్లు సంసారమగ్నుఁడైనవానికి మఱల నిశ్చలమతియు నీశ్వరపదప్రాప్తియుఁ గలుగునా? సంసారాసక్తికిని భగవత్ప్రాప్తికిని నైజవిరోధము గదా? ఈసందేహంబులను దీర్ప వేఁడుదు' ననెను. వానికి శుకమహర్షి యిట్లనియెను.

### సంసారిగానుండియుఁ సిద్ధిఁ గాంచవచ్చును

రాజేంద్రా! సంసారాసక్తియు భగవత్ప్రాప్తియుఁ బరస్పర విరుద్ధంబు లనుట నిజము. అయిన నందొక్క విశేషము గలదు. సంసారముఖుఁడు భగవంతునకు విముఖుఁ డనరాదు. సంసారమందుండియు సిద్ధులైనవా రెందరో గలరు. సర్వము మనస్థితినిబట్టి యుండును. సంసార

మందుండియు భగవత్పరులైనవారిమనస్సు తామరాకుమీఁది నీటిబిందువు వలె నుండును. సర్వము భగవదాత్మకంబను భావంబుతో నట్టివారు వర్తింతురు. భావము ప్రధానము.

పునస్సంసారాసక్తులకు భగవద్భావం బెట్లు గలుగునని శంకించితివి. భగవత్పాదారవిందమకరందరసంబు నొక్కసారి చవిచూచిన చిత్తం బేదే నొకయంతరాయంబునఁ గొండొకకాలంబు తద్రుచిని మఱచినను బూర్వాభ్యాసఫలంబు దానిని మఱల నవ్వంకకు నీడ్చును. శుభమార్గఫలం బెన్నఁడు స్వరూపనాశనంబు నొందదు.

## ప్రియవ్రతునిచరిత్ర

రాజేంద్రా! నీప్రశ్నకుఁ బ్రియవ్రతునిచరిత్రయే సమాధానం బగు. దానిని జెప్పెద వినుము. ప్రియవ్రతుఁ డట్లు నారదునివలనఁ బరమార్థతత్త్వంబును గ్రహించి యాత్మజ్ఞాననిరతుఁ డయ్యెను. అత్తఱి వానితండ్రి ముదిమిం జెసి రాజ్యభారంబును వహింపఁజాలఁడయ్యెను. రాజ్యము సురక్షితముగానిచో నరాజకమై గోడుచెందును. అంతకన్నఁ బాపకార్యంబు రాజునకుఁ గలుగదు. ప్రియవ్రతుఁడు వయస్సునుబట్టియు గుణంబులఁబట్టియు రాజ్యభారవహనంబునకు నెంతయుఁ దగియుండెను. ఆకారణంబునఁ బ్రియవ్రతునితండ్రి యతనిని ధాత్రీభరణంబునకుఁ బ్రేరేపించెను. ప్రియవ్రతుఁడు నిరంతరసమాధియోగవ్రతుఁడై సకలేంద్రియంబులను భగవదర్పణంబు గావించుటం జేసి,రాజ్యపాలనంబునకు నియ్యకొన్నచో మనస్సు మఱల ననాత్మభూతప్రపంచాదులందుఁ దగులుకొను టయు, నాత్మజ్ఞానచ్యుతి గలుగుటయుఁ దప్పవని తలంచి పితృవాక్యం బెదురాడరానిదైనను దండ్రిమనంబు నేయ నతఁడు సమ్మతింపఁడయ్యెను.

## బ్రహ్మ ప్రియవ్రతునకు నుపదేశించుట

రాజా! బ్రహ్మదేవుఁడు సృష్టికర్తగావున సృష్టిసంప్రదాయవృద్ధికిగా నెంతో జాగరూకుఁడై యంతరాయంబులను నివారించుచుండును. చతు

రాస్యుఁడు ప్రియవ్రతునిభావంబు గ్రహించి హంసారూఢుఁడై మూర్తి గొన్న వేదంబులతో మరీచ్యాదిమహర్షులతో సత్యలోకంబునుండి తరలి మార్గమధ్యంబున సురలు విమానారూఢులై గావించుపూజలందుచు, సిద్ధసాధ్యగంధర్వచారణకిన్నరుల ప్రస్తుతులు చిత్తగించుచు గంధమాదన పర్వతకందరంబునకు నరుదెంచెను. నారదమహర్షి వానిని జూచి "అహో! నా జనకుఁడు వచ్చినాఁడ'ని తటాలున లేచెను. వానివెంట స్వాయంభువమనువును బ్రియవ్రతుఁడును లేచి యప్పరమేష్ఠిని బూజించిరి. బ్రహ్మయు వారిపూజలంది దయార్ద్రమందహాసవిలోకనంబుల వారి నాచరించి ప్రియవ్రతునివంక మఱలి యిట్లనియెను.

'వత్సా! ప్రియవ్రతా! నీ కొకసంగతి తెలుపవచ్చితిని. నా చెప్పనున్నది నీ మనోనిశ్చయంబునకుఁ బ్రతికూలంబుగా నుండవచ్చును. ఆకారణంబున నీవు నాయెడ నసూయపడవలదు. మఱియు నా వచించునది భగవద్వచనంబుగాని నా భావము గాదు. భగవానుఁడు నా ముఖంబున ని న్నాజ్ఞాపించుచున్నాఁడు.'

'నాయనా! నేనుగాని యీ నారదమహర్షిగాని నీ తండ్రిగాని స్వతంత్రులము గాము. ఎల్లరము భగవదాజ్ఞాప్రకారము వర్తింతుము. భగవన్నిర్మాణంబును మార్పరాదా! యనియందువా? పరమాత్ముని నిర్మాణంబును మార్చుటకు నర్థపతులొండె ధర్మపరులొండె మనీషామతులొండె విద్యానిధులొండెఁ దపోధనులొండె యోగీశ్వరులొండె స్వయముగాఁగాని బలవదాశ్రయంబునఁగాని సమర్థులు గారు. వేయేల? పరమేశ్వరవిధిప్రకారము జీవునకు దేహయోగంబు గలుగుచున్నది. దేహంబులన్నవో జీవు లనుభవింపనైన శోకమోహసుఖదుఃఖాదులకుఁ దగినట్లుగాఁ గల్పింపఁబడుచున్నవి. భోగ్యఫలంబు భుక్తమైనంతనే యాదేహము పతనమగుచున్నవి. జననమరణవిషయంబులందే జీవునకు స్వాతంత్ర్యములేని దగుచుండఁగాఁ దక్కినవానింగూర్చి చెప్పనేల?

కర్మాచరణమందుఁగూడ జీవునకు స్వాతంత్ర్యము లేదా యని యందువా? అందును జీవునకు స్వాతంత్ర్యము లేదు. కర్మంబులు వేదప్రతిపాదితంబులు; వేదంబులు పరమేశ్వరుని యాజ్ఞాజాలమగును. జీవులు వేదసూత్రనిబద్ధకర్మపరులై ముకుఁద్రాటఁ గట్టిన యెడ్లవలె వర్తింతురు.'

వత్సా! దేహయోగకర్మాచరణంబులందు స్వాతంత్ర్యము లేకపోయినను భోగవిషయమందేనియు స్వాతంత్ర్యము గలుగదా యని యందువు గాఁబోలు! భోగవిషయంబునఁగూడ జీవునకు స్వాతంత్ర్యము లేదు. ఎట్లందువా? గుణంబులనుబట్టి కోరికలును, కోరికలనుబట్టి కర్మంబులును దత్ఫలంబులును, గర్మఫలంబులనుబట్టి నరతిర్యగాది భోగశరీరంబులును ఆశరీరంబులతో ననుభవింపనైన సుఖదుఃఖాదులును గలుగుచున్నవి. ఆసుఖదుఃఖాదుల ననుభవింపకతీఱదు. సృష్టియెల్ల నిట్లు నియమబద్ధమైయున్నది. ఇదే భగవదాజ్ఞయగు. ఆయాజ్ఞ నతిక్రమింప నేరికిని సాధ్యముగాదు.

వత్సా! ముక్తసంగులసంగతి యేమందువా? వారికిఁగూడఁ బ్రారబ్ధశరీరసంబంధకర్మఫలభోగంబు తప్పదు. అయినను వారి కర్మఫలానుభవంబునకును, దదితరుల కర్మఫలానుభవంబునకు నొక్క భేదము గలదు. వారికర్మఫలానుభవం బెప్పుడు నభిమానరహితంబుగా నుండును. అందువలన స్వప్నార్థంబును మేల్కాన్నవాఁ డెట్లు భావించునో, యట్లు కర్మఫలానుభవంబును వారు భావింతురు. ఆకారణంబున వారికి దుఃఖాదులు గలుగవు. అన్యులన్ననో 'అయ్యో! నా కిది దాపురించెగదా' యని యేడ్చుచు, ననుభవించుచు, దుఃఖము పాలగుచున్నారు. అనుభవవిధి యిఱువెగలకు నొక్కటేయైనను అభిమానముయొక్క కలిమిలేములనుబట్టి దుఃఖాదుల కలిమిలేములు గలుగుచున్నవి. అభిమానం బెట్టిదో యెంతటిదో గ్రహింపుము!'

వత్సా! కర్మఫలంబు పునర్జన్మాంకురం బగుననియు, జన్మముతోడ భోగ్యఫలవాసన లుండుననియు, ఆవాసనలు వాని స్వభావప్రకారము

పునఃకర్మంబును జేయించుననియు, ఆవాసనలు శుభాశుభమిశ్రంబులుగా నుండుననియు, అశుభవాసనాప్రేరితకర్మంబులెల్ల నశుభప్రదంబులే యగుననియుఁ, దత్కర్మంబులకు మఱల నశుభఫలంబులు గలుగుటయు వాని ననుభవించుటకు నై తత్తద్భోగ్యశరీరంబులు వచ్చుటయుఁ దప్పదనియు, సంసారం బిట్లు తెంపులేనిదగుచుండఁగా ముముక్షువుమాత్రము దీనిని దప్పించుకొనుట యెట్లనియు శంకింతువా? ముముక్షువునకు నభిమానము లేనందున వాసనాప్రేరితకర్మంబులఫలంబులు భుక్తంబులై దగ్ధబీజన్యాయంబున నశించును. అతఁడు ప్రారబ్ధకర్మఫలంబుల నెట్లనుభవించునందువా? నిరభిమానబుద్ధితో నప్రతీకారంబుగా ననుభవించును. దగ్ధబీజంబు లంకురింపనోపనట్లు, వానికర్మఫలంబులు పునర్జన్మకారణంబులుగానేరవు. కారణములేక కార్యము గలుగదుగదా! అప్రతీకారమతితో ననుభవించుట యనఁగానేమి యని యడుగుదువా? రోగాదులు సంభవించినప్పుడు వానికిఁ దగుచికిత్స సేయక మిన్నకుండుట యప్రతీకారబుద్ధి కానేరదు. అది మౌఢ్యమగును. రోగాదులు వచ్చినందులకై దుఃఖింపక సహించుచుఁ దన్నివారణోద్యమంబులు సాగించుట యప్రతీకారసహనంబగును.

"గృహమందున్నప్పుడు తద్భోగాదుల ననుభవింపక తప్పదనియు, భోగ్యంబుల నొక్కప్రక్క భోగించుచు నభిమానరహితంబుగా నుండుట సాధ్యముగాదనియు, అభిమానం బున్నంతకాలము మోక్షంబు గలుగదనియు, గృహపరిత్యాగంబు గావించి సన్న్యాసియై వనాంతరము చొచ్చినచో మోక్షము సిద్ధించుననియుఁ దలంతువా? వత్సా! శరీరధారులకుఁ గామక్రోధాది నిత్యవైరు లార్గురు గలరు. ఆ వైరిషట్కంబు మనలో నెందాఁక యుండునో, యందాఁక నింటనున్నను మింటనున్నను వనాంతరముచొచ్చినను సంసారభయము తొలఁగదు. వేయేల? ఆవైరిషట్కంబుతోడిసంబంధమే సంసారంబగును. అట్టి హితశత్రువులను దప్పు

చేయుటయే సన్న్యాసమగును. ఆవైరులను సన్న్యసింపవలయునేగాని వారినీ మన్నించుచు గృహాదులను సన్న్యసించుటవలన ఫలము లేదు. వారిని దొలఁగించుట యెట్లందువా? వారు వట్టిమాటలతోఁ దొలంగరు. కారణ మేమందువా? వారు బహిశ్శత్రువులు గారు; అంతరశత్రువులు. వారు మనయింద్రియంబుల నాశ్రయించియుందురు. ఇంద్రియంబులను జయింతు మేని వారు నిరాశ్రయులై నిలువనీడలేక వారికై వారే తొలఁగిపోవు దురు. ఈవిధానంబు నింద్రియజయమందురు. జితేంద్రియుఁ డింటనున్నను మఱెందున్నను వానికి సేగిలేదు.

'ఆశత్రువులను గృహాశ్రమమందు జయించుట యెట్లందువా? వారికార్యమేమో మొట్టమొదట గ్రహించి వారిచేతలకు భంగంబు గలిగింపవలయును. వారుచేయుపని యేమందువా? వారు మనస్సులోపల దాఁగియుండి తఱివచ్చినప్పుడు తలయెత్తి విహరింతురు. వారివిజృంభణం బును నిగ్రహింతుమేని వారు బందీకృతులై క్రమక్రమంబుగా శక్తిసంపద లుడిగి సన్నగిలి నశింతురు. అప్పుడు నీగృహము శత్రువులకు దుర్గమంబగును.'

'వత్సా! ఇదియెల్ల సామాన్యులఁగూర్చి చెప్పితిని. నీవన్ననో పరమేశ్వరపాదకమలకోశదుర్గంబు నాశ్రయించి యంతస్థులైయున్న వైరులను నిర్మూలించితివి; ఇఁక నీకు భయమేల? నెంజలిమాని భగవదా దిష్టంబులైనభోగంబులను నిస్సంగబుద్ధితో ననుభవించి, తర్వాత నాత్మ నిష్ఠను గ్రహింపుము. భోగకాంక్ష పైకొనునని వెఱవవలదు. నీ నిస్సంగ బుద్ధియే ని న్నుద్ధరించు' నని బోధించెను.

రాజా! ఆపరమేశ్వరశాసనంబును బ్రియవ్రతుఁడు తలఁదాల్చి బ్రహ్మకు యథోచితపూజలు గావించెను. నలువయు వాని నభినందించి వాచామగోచరంబును వ్యవహారశూన్యంబునైన స్వరూపంబును జింతిం చుచు నంతర్హితుఁడయ్యెను. స్వాయంభువమనువు [illegible] బరికించి

కృతార్థుఁడనైతినని భావించి నారదునియనుమతిం బడసి ప్రియవ్రతునందు రాజ్యభారంబుంచి, విషయవిషజలాశయాత్మకంబు నత్యంతదుస్తరంబునైన గృహాసక్తినివదలి పరమార్థసాధనోన్ముఖుఁ డయ్యెను.

## ప్రియవ్రతుని సంతానము

రాజేంద్రా! ప్రియవ్రతుఁ డట్లు రాజయి విశ్వకర్మయనెడి ప్రజాపతికిఁ బుత్రికయైన బర్హిష్మతి యనుకన్నియను వివాహమయ్యెను. వారికి అగ్నీధ్రుఁడు, ఇధ్మజిహ్వుఁడు, యజ్ఞబాహుఁడు, మహావీరుఁడు, హిరణ్యరేతుఁడు, ఘృతపృష్ఠుఁడు, సవనుఁడు, మేధాతిథి, వీతిహోత్రుఁడు, కవి యనుపుత్రులు నూర్జస్వతి యనుపుత్రికయు జనించిరి. ఆపుత్రులు రూపవీర్యగుణశీలంబులఁ దండ్రికి సాటియై వెలసిరి.

ఆపుత్రకులలోఁ గవియు మహావీరుఁడును సవనుఁడును బాల్యముఁ దొట్టి యాత్మవిద్యాపరులు నూర్ధ్వరేతస్కులునై సంసారభావంబును వదలి పరమహంసాశ్రమంబును గ్రహించి యుపరతిఁగాంచి సకలజీవనికాయావాసంబును భవభీతిజనపరమశరణభూతంబునైన భగవత్పాదారవిందమందు భక్తిపూతచిత్తంబుల నిలిపి తదేకచింతను లైరి. తత్ఫలంబుగా వారి యంతఃకరణంబులు పరమపవిత్రంబు లయ్యెను. ఆశుద్ధాంతఃకరణములందు సర్వభూతాత్మభూతుఁడు ప్రత్యగాత్ముఁడు యథాస్థితి సన్నిధి చేసెను. ఆదర్శనమహాభాగ్యఫలంబుగా వారికి దేహాదులందలి మమకారశేషంబుగూడ నశించెను. వారికిఁ దాదాత్మ్యంబు గలిగెను.

రాజా! ప్రియవ్రతునకు మఱియొకభార్య యుండెను. అతఁడామెవలన ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁ డనుపుత్రుల ముగ్గురఁ బడసెను. వారు మన్వంతరాధిపతులైరి.

ప్రియవ్రతుఁడు పదునొకండర్బుదంబులయేండ్లు నిరాతంకముగా రాజ్యమేలెను. వానిబాహుదండంబులు పురుషకారసారపరిపూర్ణంబు లగుటంజేసి యతఁడు విల్లుఁబూని నారి సారించినంత నే తచ్ఛరాసనగుణానిస్వా

దంబునఁ బ్రతిపక్షులగుండియలు వ్రీలుచుండెను. ఆకారణంబున వానికి యుద్ధాదిక్లేశంబులుగాని పరిపాలనశ్రమంబులుగాని గలిగెడివి కావు.

రాజా! ప్రియవ్రతుని ప్రథమభార్య బర్హిష్మతియు స్త్రీజననైజ లలితలజ్జాశృంగారానుభావంబులను దరహాసంబులను గటాక్షవీక్షణంబులను బతియెడఁ బఱపుచు స్వప్రేమాతిశయంబును వెల్లడించుచుండెను. ఆయింతి మేలంపుమాటలు వానికి నానాఁటికిఁ గ్రొత్తలగుచుఁ దల్లోలు నిగా వానినొనర్చెను. అతఁ డట్లు సతీలోలుఁడై వివేకంబును నోలుఁ గెనో, తన్నుఁ దా మఱచెనో యనఁనై యాయింతితోడిదే లోకంబుగా భావించుచు, దానింగూడి వివిధభోగసౌఖ్యంబులఁ జూలలాడసాగెను.

## దివారాత్రుల నిర్మాణము

రాజేంద్రా! సూర్యుఁడు లోకాలోకపర్యంత ధాత్రీతలంబును వెలిఁగించుట చూచుచున్నాముగదా! భాస్కరుఁ డట్లు సమస్తభూభాగంబు నొక్కకాలమందే వెలిఁగించుటలేదు. కారణమేమందువా? సూర్యుఁడు మేరుపర్వతంబును జుట్టి సంచరించును. అతఁ డాగిరిని జుట్టి వచ్చుటకు నొక్కదినము పట్టును. సూర్యుఁ డట్లాగిరిని జుట్టివచ్చునప్పు డతఁ డాపర్వతంబునకు నేప్రక్కనుండునో యాప్రక్క వెలుఁగుండును. అట్లు వెలుఁగున్నకాలం బాదెసకుఁ బగలగును. వానిప్రకాశం బాకొండకు నేప్రక్కనుండదో యాదెస చీఁకటిగా నుండును; ఆకాలం బచ్చటకు రాత్రియగును. అట్లు భూలోకంబున దివారాత్రంబు లేర్పడు చున్నవి.

## సప్తసముద్ర - సప్తద్వీపనిర్మాణము

ప్రియవ్రతుఁడు రాత్రులనుగూడఁ బగలుగాఁ జేయఁదలంచి, తేజోమయంబుల సూర్యరథంబునకు సాటియైనరథం బెక్కి, సూర్యుని వెంటనంటి యేడుపర్యాయములు తిరిగెను. ఆపని వాని కెట్లు సాధ్యమయ్యెనందువా? భగవదుపాసనాత్మకప్రభావవంతులకు నసాధ్యంబు

గలదా ? ప్రియవ్రతుఁ డట్లు సప్తపర్యాయంబులు సంచరించినప్పుడు వాని రథచక్రాంచలంబులరాపిడివలన భూభాగంబునఁ బ్రత్యేకమ్ములైన గర్తంబు లేడుగా నేర్పడెను. ఆ యేడుగర్తంబులను సప్తసముద్రంబు లనిరి. ఆసప్తసముద్రంబులమధ్య నిల్చిన యేడుభూభాగంబులు సప్త ద్వీపము లయ్యెను.

### సప్తద్వీపాధిపతులు

ప్రియవ్రతుఁ డంతట వానికొడుకులలో వాని ననువర్తించియున్న యేడ్వుర నొక్కొక్కని నొక్కొక్కద్వీపంబునకు నధిపతినిగాఁ జేసి, వానిపుత్రికయైన యూర్జస్వతిని శుక్రునకు వివాహము గావించెను. శుక్రునకు నూర్జస్వతివలన దేవయాని యనుసుత జనించెను.

### ప్రియవ్రతుఁడు విరక్తుఁ డగుట

రాజా ! ప్రియవ్రతుఁ డట్లు పరిపాలించుచుండఁగాఁ, గొండొక నాఁడు వానికి నారదోపదేశము తలంపునకు వచ్చి 'కటా ! రాజ్యాది ప్రపంచసంగమంబున నింద్రియవశుఁడనై వివేకము గోల్పోయి విషయ విషపూర్ణ మహాంబోధిఁగూలి కామభోగంబులకుఁ జిక్కి స్త్రీమాత్రురాలికి వినోద క్రీడామృగంబ నైతిని. ఛీ ! నాబ్రదుకేల ?' యని యాత్మనిందఁ గావించికొని సంసారవైముఖ్యంబంది భుక్తభోగంబైన సామ్రాజ్యంబును శవంబునట్లుత్యజించెను. దానితోడ వానిమనంబు విమలంబయ్యెను. ఆపరిశుద్ధమానసంబున భక్తి సుస్థిరమై ప్రకాశించెను. ప్రియవ్రతుఁ డంతట జ్ఞానంబుఁ బడసి చరితార్థుఁ డయ్యెను. రాజా ! ప్రియవ్రతుని మహిమంబులను బుధులు నేఁడును వేనోళ్ళఁ గీర్తింతురు.

### అగ్నీధ్రుఁడు

రాజేంద్రా ! ప్రియవ్రతుని జ్యేష్ఠపుత్త్రుఁడు అగ్నీధ్రుఁడు పితృ వాక్యప్రకారము సప్తద్వీపములలో నడిమిదైన జంబూద్వీపంబునకు నేతయై యా ద్వీపవాసులను గన్నబిడ్డలనట్లు ధర్మపురస్సరంబుగాఁ బాలింప

సాఁగెను. వానికిఁ బుత్రవాంఛ జనించెను. అతఁడు వానికోరికఁ బడ యుటకై ప్రజాపతి నారాధింప సంకల్పించి సురనారీక్రీడాస్థానమైన మందరగిరి సానుప్రదేశంబునకుఁబోయి పుష్పాదికపూజాద్రవ్యములు గూర్చి బ్రహ్మదేవుని బూజించి యేకాగ్రమతితోఁ దపం బొనర్చెను. పితామహుఁడు వానితపంబునకు మెచ్చి తనసభలోఁ బాడుచున్నట్టి యప్సరోరత్నంబును 'బూర్వచిత్తి' యనుదానినిబిలిచి యగ్నీధ్రునికోరికఁ దీర్పఁ బనిచెను.

## అగ్నీధ్రుఁడు - పూర్వచిత్తి

ఆయింతియంతట బ్రహ్మసభను వదలి మందరగిరి సానుప్రదేశంబునకు వచ్చి, యచ్చోటి శుభ్రజలపూర్ణకమలాకరంబులను, వానిం జుట్టిపెఱచి నింగి ముట్టుచున్న వివిధతరువులను, ఆవృక్షంబులమీఁదికిఁ బ్రాఁకి బంగరు తీవియలఁబోని పుష్పితలతాహస్తంబులను జాచి పథికులను బిలచుచున్నవో యనఁనొప్పు పొదరిండ్లను జూచుచు, నవ్విటపశాఖాగ్రంబుల నధిరోహించి షడ్జాదిస్వరంబులఁ గూయుచున్న మయూరాదివిహంగంబుల మనోజ్ఞరుతంబు లాలకించుచు, సరోవరాంతర హంసకారండవాది పక్షుల విచిత్రకూజితంబుల ప్రతిరుతంబులు వినుచు, విలాసగతు లేర్పడ నటునిటుఁ దిరుగాడసాగెను. ఆసుందరీలలితగతి విన్యాసవిలాసంబులఁ దన్మణినూపురఘుణఘుణారవంబు ప్రకటించి యగ్నీధ్రునిచెవిసోఁకి యావంకకు వానిచిత్తంబు నాకర్షించెను. అతఁడు సమాధియోగముద్రితంబులైనవాని నయనంబులను మెలమెల్ల విచ్చి యా ధ్వనివచ్చినవంకకుఁ దల ద్రిప్పి మధుకరాంగనావృత్తి ననుకరించుచున్నదో యనఁ బూలతావుల నానుచుఁ, గ్రీఁగంటిచూపులుపఱచుచు, మధురమధురంబుగాఁ బాడుచు, హాయలుదనంపుమురుపులు వెలయించుచు, మోవితేనియలకుఁగాఁ బ్రాఁకులాడుచున్న కొదమతేఁటిగములకుఁ దలంకి పఱచు తడబాటునం జేసి కంపించు చందోయిమీఁదిపయ్యెదను సవరించుకొనుచు, వీడినకచభరంబును జక్కనొత్తుచు, నసియాడు నెన్నడుముసుండి జాఱుచున్న

బంగరు నొడ్డాణంబును గిలించుచున్నన్న యొకమోహనాంగిని జూచి మదనపరవశుండై వివేకముదక్కి జడుండట్లగుచు నయ్యిందుముఖిని జేరం బోయి 'మునివర్యా! నీ వెవ్వరు? ఈగిరితటంబునకు వచ్చు టేల? పర దేవతయైన యాభగవానునిమాయవా? ధనుర్ద్వయంబును దాల్చితివి; ఆ విండ్లకు నారులు గలుగవు. ఆశరాసనంబు లాత్మరక్షణార్థమో, లేక అజితేంద్రులై మృగతుల్యులైన మాయట్టివారిని వేటాడుటకో యూహింపరాదు. భగవంతుని శతపత్రంబులే పత్రంబులైన బాణముల జంటం గూర్చితివి. అవి పుంఖరహితంబులయ్యు నిశితాగ్రంబులై తోచు వాని నెవ్వానిపయిం బ్రయోగింపందలంతువు? నిన్నుంజూడ వెఱపయ్యెడు. నీ విక్రమంబు మాకు క్షేమార్థంబగుంగాక. ఋషిగణంబులు వేద శాఖలంబోలె నీశిష్యులు నిన్నుంజుట్టి సరహస్యసామగానంబు లొనర్చుచు భవత్కబరీభారవిలులితసుమనోవర్షలాలసులై చరింతురు. నీ చరణపద్మ నూపురరత్నంబు లరూపముఖరభాషితంబులు పల్కుచు మాకుం జెవిపం డువు గావించుచున్నవి. కదంబకాంతినీనుచున్న నీనితంబమండలంబుపయిం బరివేషంబు కొఱవివలె నుండుచున్నది. ఈవింత యేమి? నీయెద రెండు కొమ్ములు కఠోరపూర్ణంబులు గానవచ్చుచున్నవి. వానిలో నేమి నింపి యీగుణంబులను వానికిం గూర్చితివి? నీమధ్యము కడుంగడుం గృశించి యసియాడుచున్నది. అట్టిది యీశృంగభరంబును మోయంజాలునా? నీశృంగంబులందు నాచూడ్కి తగులుకొనెను. మఱియు నీశృంగంబుల పయి కెంజాయసురభిపంకంబు నెత్తావులు నాయాశ్రమాంతరం బెల్లం బఱచి పిసాళించుచున్నవి?

చెలీ! ఉరమ్మున నిట్టి యపూర్వావయవంబులును, వక్త్రంబున నిట్టి మధురాలాపవిలాసంబును, మోవియందు నిట్టి సుధాదరహాసితంబులును, గలజను లేలోకంబున నుందురు? వారి నొక్కసారి నాకుం జూపింతువా? నీవదనంబు కమ్మనితావి వెదంజల్లుచున్నది. ఏమి భుజింతువు? నీవు శ్రీమహా విష్ణుకళ వని భావింతును. కాకున్నచో విష్ణునేత్రంబులంబోలె నీనేత్రం

భూలు రత్నకాంతు లీనుచు మోడ్పు లేకయుండ నేర్చునా? నీ నెమ్మోము చలన్నీనయుగంబుఁ గలిగి ద్విజపఙ్క్తి-రుచిరంబును భ్రమరసంకులంబు నై సరోవరంబును దలపించుచున్నది. నీకరసరోజములయొక్క తాఁకునకుఁ గ్రీడాకందుకంబు పరిభ్రమించుచు నాకందోయికి విభ్రమంబుఁ గలిగించు చున్నది. నీ కుటిలజటాభరంబు వీడుట యెఱుంగవా? ధూర్తుఁ డనిలుఁడు నీ నీవీబంధంబును సడల్చెను. అదియు గ్రహింపవా? నీరూపంబు తపో ధనులతపంబును భగ్నముచేయును. ఎట్టితపం బొనర్చి యిట్టిరూపంబును సంపాదించితివి? చెలీ ! నాతోఁడఁ దపంబొనర్చుట నీకెంతయుఁ దగు. సంసృతి విస్తారకుఁడా బ్రహ్మదేవుఁడు నాయెడఁ బ్రసన్నుఁ డగుఁగాక. ఆబ్రహ్మదత్తవైననిన్ను నా ప్రియ నిఁక విడనాడఁజాల. నా మనోనయనం బులు నీయందు లగ్నంబులయ్యెను. వాని నెంత మఱలించినను మఱలవు. చారుశృంగీ! నేను నీయనువ్రతుఁడ నైతిని. నన్నుఁ బాలింపుము. నీ సచివలు నాకు ననుకూలింతురుగాక." అని పలికెను.

పూర్వచిత్తి అగ్నీధ్రుల సంతానము

అగ్నీధ్రుఁ డట్లు లలనానునయవిశారదుఁడై పల్కిన విషయసుఖ వైదగ్ధ్యవచనంబులు పూర్వచిత్తి విని, తదీయబుద్ధిరూపశీలవిద్యావయశ్శ్రీ మహౌదార్యహృతచిత్తయై వానికి వశవర్తిని యయ్యెను. వారు జంబూ ద్వీపాంతరంబెల్ల నిచ్ఛావిహారంబు లొనర్చుచు బహుసహస్రవత్సరంబులు వివిధభోగంబులఁ జూఱలాడిరి.

వారికి నాభి, కింపురుషుఁడు, హరివర్షుఁడు, ఇలావృతుఁడు, రమ్య కుఁడు,హిరణ్మయుఁడు,కురువు, భద్రాశ్వుఁడు, కేతుమాలుఁడు అనుపుత్రులు తొమ్మండ్రుగురు గలిగిరి. పూర్వచిత్తి యంతట నక్కుమారులను వదలి నలువకొలువునకుఁ జనెను. ఆబిడ్డలు దృఢగాత్రులును బలోపేతులునై పెరిగి యుక్తవయస్కులైరి. అగ్నీధ్రుఁడు జంబూద్వీపంబును నవఖండం బులుగా విభజించి యొక్కొక్కని నొక్కొక్కఖండంబునకు నభిషేకిం

చెను. ఆఖండంబులు వారివారి పేర నాభివర్షము, కింపురుషవర్షము, హరి వర్షము, ఇలావృతవర్షము, రమ్యకవర్షము, హిరణ్మయవర్షము, కురు వర్షము, భద్రాశ్వవర్షము, కేతుమాలవర్షము నని ప్రసిద్ధిగాంచెను.

అగ్నీధ్రుఁడు కామభోగతృప్తిఁ గాంచక యయ్యప్సరముచ్చు కంటినిఁ దలపోయుచు వేదోక్తకర్మంబు లాచరింపసాగెను. తత్ఫలం బుగా వానికి దానిలోకంబు ప్రాప్తించెను. రాజా! మతియెంతో గతి యంతే యన వినమా? నాభి మున్నగువారు తొమ్మండ్రుగురు మేరు పుత్రికలను మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్ర, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవవతి యనువారిని నొక్కొక్క రొక్కొక్కరెను బెండ్లియాడిరి.

## నాభి పుత్రేష్టి చేయుట

రాజేంద్రా! నాభికిఁ బుత్రసంతానము గలుగకుండెను. అతఁడు వానిపత్నియైన మేరుదేవితోడ యజ్ఞదీక్షఁ బూని యజ్ఞపూరుషుని శ్రద్ధాభక్తులతో యజించెను. యాజ్ఞికులు యజ్ఞఫలదాతయొక్క యను గ్రహంబును బడయుటకై ద్రవ్యదేశకాలమంత్రబుత్విగ్దక్షిణావిధా నంబు లనెడి సప్తోపాయంబులవానిని యజింతురు. భగవానుఁడు భక్త వత్సలుఁడు గావున శ్రద్ధాశుద్ధభావంబులనే పెద్దసేయుఁగాని యన్యసాధ నంబులకు నంతగా సులభసాధ్యుఁడు గాఁడు. ఎవనిని భగవానుఁ డనుగ్ర హించునో వానికోర్కెలు కూర్పుటకై తానే స్వయముగా దివ్యమంగళ విగ్రహముఁ దాల్చి ప్రసన్నుఁడగును. భగవానుఁడు నాభికిఁ బ్రీతుఁడై దీర్ఘబాహుచతుష్టయంబుతో శ్రీవత్సలాంఛ నాంచితవక్షోభాగముతో విరాజిల్లుచుఁ బీతాంబరముఁ గట్టి స్ఫురత్కిరణమణిమయమకుటకుండల కటకకటిసూత్రహారకేయూరనూపురాద్యంగభూషణంబులు ధరించి శంఖ చక్రగదాపద్మకౌస్తుభవనమాలాపరిష్కృతుఁడై తేజరిల్లుచుఁ దదధ్వ వాటి సన్నిధి గావించెను.

## ఋత్విజులు పరమేశ్వరుని స్తుతించుట

ఆపరమేశ్వరునిఁ గాంచినంతనే యందున్న ఋత్విక్సదస్య యజమానులయంతరంగంబులు పెన్నిధిఁ గన్నపేదచిత్తంబువోలె నుప్పొంగెను. వారు భక్తివినమ్రులై యాదేవదేవుని యథావిధి నర్చించిరి. ఋత్విజులు కేలుమోడ్చి 'పూజ్యాతిపూజ్యా! పరిపూర్ణుఁడవుగావున నీకు సమర్పింపనైన పదార్థం బెద్దియుఁ గలుగదు. అయినను నీభృత్యులము మేము భక్తిపుష్పంబు నర్పించుచున్నాము. ఇంతకు మిక్కిలిగా నేమియుఁ జేయఁజాలము. మాపూజల నంగీకరింపఁదగు. స్వామీ! పదార్థరూపపూజలను గాకున్నను వాగ్రూపపూజనేనిఁ జేయరాదా యని యడుగుదువా? నిన్ను వాక్కుచేతఁ బూజించుటకు నీదివ్యస్వరూపగుణక్రియలు తెలియవలయును. వాని నెఱుంగము. ఇఁక ని న్నెట్లుగ్గడింపనేర్తుము? నీకు "నమోనమ" అనుటకన్న నుత్తమమార్గంబును సాధువు లెవ్వరు నుపదేశింపరైరి. కారణ మేమందువా? నీరూపాదులు వారికిఁగూడ దుర్విజ్ఞేయమగుటయే కారణము. నీరూపమైనవిశ్వము స్పష్టముగాఁ గాన్పించుచుండఁగా దుర్విజ్ఞేయం బనిచెప్పుట యెట్లు చెల్లునందువా? దృశ్యప్రపంచంబెల్లఁ బ్రకృతిగుణవ్యతికరమాత్రం బగును. ప్రపంచమందు మఱిచొచ్చినవానికి వట్టి నామరూపాకృతులు స్ఫురించునేగాని యంతకుమించి యేమియు లభింపదు. ఈనామరూపాదులు ప్రకృతి విలాసంబులు. నీ వన్ననో ప్రకృతిపురుషులకుఁ బరుండవును నామరూపాతీతుండవు నగుదువు. ఎల్లస్తుతులు నామరూపాకారాస్పదంబు లగు. ఆమాటకి నతీతుఁడవైన నిన్ను ఆమాటచేతఁ బరిగణించుట యెట్లు? మాబోంట్లకు నేమి సాధ్యమగు నందువా? ఏ నీగుణంబులు సకలజీవకోటి పాపహారణంబులగునో యా నీగుణంబులను బల్క • సాధ్యమగును. అదియు సమగ్రంబుగా నొనర్పఁజాలము. వాని నించుకంతేనియుఁ బల్కనోపుదుమేని యసాధ్యంబును సాధించినవార మగుదుము. ఎట్లందువా? నీ వవాఙ్మానసగోచరుండవయ్యు భక్తులకు సులభారాధ్యుఁడవు. గావున

భక్తులైనవా రనురాగపూర్వకంబుగా నేమి పల్కినను సంతోషింతువు; వారేమియిచ్చినను గ్రహింతువు. నీ కిచ్చునది తులసీదల మగుఁగాక. దూర్వాంకురం బగుఁగాక; గరిటెడు నీ రగుఁగాక. ఆయిచ్చుట యను రాగపూర్వకమగునేని యది నీ కెంతయుఁ బ్రియంబగు. భక్తియొక్కటే ప్రధానంబగు గాని పదార్థంబులు ప్రధానంబులు గావు.

స్వామీ! అవాప్తకాముండవైన నీకు నియ్యనైనది యేమియుఁ గలుగకున్నను నీస్వరూపంబులైన పురుషార్థంబులఁగోరి నిన్ను భజింతురు. ఆపక్షంబున బహ్వంగపూర్వకంబులైన యీయజ్ఞాదిరూపకభజనం బేల యందువా? ఇవియెల్ల నీయారాధకుల భావనావిశేషంబు లగు. అంతియ గాని వానికై నీ వాసపడుట గాదు. యజ్ఞాదిపూజల నభిలషింప కున్నచో నిష్ఫ లిచ్చుటకు దానుగదా యని యందువా? దేవా! ఏది మాకు నిక్కముగా హితమో యది యెఱుంగని బాలిశులమై నీప్రేమను బడయుటకుఁగా యజ్ఞంబు సాధనమగు నని భావించి యందులకుఁ బూని తిమి. ఈయజ్ఞంబుగూడ నీమహిమ మేగాని వేఱుగాదని మాకు బోధిం చుటకై యిందు వచ్చితివి. అంతియగాని పూజ నపేక్షించివచ్చినవాఁడవు గావు. నీవు పరమవరదుఁడవు; ఎవ రేభావంబుతో ని న్నర్థింతురో వారికి నట్టిభావంబులఁ గూర్చుట నీకు వ్రతమైయున్నది. నిన్ను సందర్శింపఁగోరి యీయజ్ఞరూపంబున ని న్నారాధించితిమి. ఇది నిమిత్తము చేసి మాకు సందర్శనం బొసంగితివి. ఈమహానుగ్రహంబునకుఁ బాత్రులముగా నోచిన మాభాగ్యం బిం తనరాదు.'

'దయానిధీ! సర్వసంగపరిత్యాగపూర్వకంబుగాఁ దీవ్రజ్ఞానావలం బులై నిఖిలమలంబులను బాసి నీస్వభావులైన యాత్మారాములకుఁగూడ నీగుణకథనంబు పరమమంగళం బగు ననఁగాఁ జంచలత్వాధివిక్షేపరూప దురవస్థలకుఁ బుట్టిల్లయిన మాబోఁటిబాలిశులకు నీస్మరణగుణకథనంబు లెంత యవసరంబులో చెప్పఁదరమా? శ్రీమంతంబులైన నీచరణార

విందంబులను స్మరించుటయు, నీగుణనామంబులఁ గీర్తించుటయు సామాన్య స్థితియందే గాక జ్వరమరణాద్యవస్థలలోఁగూడ మాకుఁ గలుగునట్లను గ్రహింపుము. ఇదే మాకోరు పరమవరము.'

'దేవా! సంతానవంతుఁడే పురుషార్థవంతుఁడని యీ రాజర్షి భావించి యపత్యకాముఁడై నీయట్టిపుత్రుని గోరి యీయజ్ఞంబున నిన్నారాధించెను. స్వర్గాపవర్గంబులనేగాక సమస్తపురుషార్థంబులనుగూడఁ బ్రసాదించు నిన్నిట్లు గోరుట దరిద్రుఁడు మహారాజుం జేరి తుషకణాదికంబును గోరుట యగు. ఇట్లుకోరుటకుఁ గారణ మేమందువా? సంసారిభావం బిట్లు కోరించుచున్నది. అట్టిభావంబు గలుగుట యేల యందువా? ప్రకృతి యావరించినప్పు డట్టిభావంబు గలుగుచున్నది. అది తొలంగుట యెట్లందువా? పెద్దల నుపాసించినచో నీమాయాతత్త్వంబు దెలియును. అప్పుడు నీమాయకుఁ జిక్కుటయు, మాయావృతుఁడై విషయవిషరయంబునకు లోఁబడుటయుఁ దత్ఫలంబుగాఁ బ్రకృత్యావరణంబునఁ బడుటయుఁ దప్పును.

స్వామీ! ఈరాజునకుఁ దోడ్పడి యీయజ్ఞంబున మంత్రమూలకంబుగా నిన్నిటకు నాహ్వానించి గొప్పతప్పు చేసితిమి. మాయపరాధంబును సైరింపవేడుదుము' అని ప్రస్తుతించిరి. నాభియు సాష్టాంగనమస్కారం బొనర్చెను.

భగవానుఁడు వారిప్రస్తుతుల నాలకించియు నాభి సాష్టాంగ నమస్కారంబు నంగీకరించియు 'యాజ్ఞికులారా! నాయట్టిసుతుఁ డీరాజున్యనకు జనింప వరంబు వేఁడితిరి. మీకోరినవరం బత్యంత దుర్లభంబు. అద్వితీయుండనైన నాకు నేన సాటియగుదుఁగాని మఱియొకండు సాటి గలుఁగఁడు. మీరు బ్రహ్మజ్ఞులు; మీవచనంబులు రిత్త కారాదు. నాకు సాటి లేమిం జేసి నేనే నాయంశంబున నిక్ష్మేరుదేవియం దవతరింతు' నని పలికి భార్యని ఘిదో్కని యంతర్హితుఁడయ్యెను.

### ఋషభావతారము

రాజేంద్రా! మేరుదేవి కొన్నాళ్లకు గర్భవతియై యొకపుత్రుని గాంచెను. ఆబాలుఁడు వజ్రాంకుశాది లక్షణలక్షితపాదాద్యవయవంబులు గలిగి శమదమవైరాగ్యమహైశ్వర్యవిభూతుల నొప్పుచుఁ, బుట్టువు దొట్టి సర్వభూతసమదృష్టి నెఱపసాగెను. ఆబాలుని తేజోబలంబులను సంపత్కీర్తులను ప్రభావోత్సాహంబులను వానితండ్రి గ్రహించి 'ఋషభుఁ' డను పేరు వానికి నిడెను. వాని గుణవిశేషంబులకు బ్రాహ్మణులే గాక ప్రజలెల్లరు మహానందంబునొంది వానిపయి నెంతయుఁ గూర్మి నింపుచు నతఁడు రాజ్యపాలనంబునకు నర్హుఁడని యేకగ్రీవంబునఁ బల్కిరి.

### నాభి సమాధి నొందుట

ఋషభుఁడు యుక్తవయస్కుఁ డైనంతనే వానికి రాజ్యాభిషేకంబు గావించి నాభి భార్యాద్వితీయుఁడై బదరికాశ్రమంబునకుఁ బోయి యట నరనారాయణరూపంబున వెలసియున్న వాసుదేవుని సమాధి యోగపూర్వకంబుగా నుపాసించి కృతార్థుఁడయ్యెను. ఋషభుఁడు రాజ్యాభిషిక్తుఁ డైనంతనే వానిరాజ్యంబునకు 'అజనాభవర్షం' బను పేరు పెట్టిరి.

### ఋషభుఁ డాశ్రమధర్మంబుల ననుష్ఠించుట

రాజా! అజనాభవర్షము కర్మక్షేత్రమగు. కర్మమనఁగా ధర్మము. ప్రజలు వర్ణాశ్రమోచితధర్మంబులు నడపుటయే ధర్మం బగును. రాజెట్లో ప్రజలు నట్లే వర్తింతురు. ఋషభదేవుఁడు భగవత్కళావతారుఁడైనను బ్రజలకు స్వధర్మానుష్ఠానమార్గంబును జూపుటకై గురుకుల వాసము గావించి విద్యలను గఱచి గురుదక్షిణ లొసంగి, మొదటి యాశ్రమధర్మంబును యథాక్రమము నడపెను. రెండవయాశ్రమ ధర్మంబునకుఁ దఱియయ్యెను.

ఋషభుని ద్వితీయాశ్రమము

ఋషభుఁ డంతట నింద్రదత్తయైన జయంతి యనుదానిని బెండ్లియై గృహస్థాశ్రమంబును స్వీకరించి యాయింతియందు నూర్గురు కొడుకులఁ బడసెను. వారిలో భరతుఁడు పెద్దవాఁడు. తక్కిన తొంబది తొమ్మండ్రుగురలోఁ గుశావర్తుఁడు, ఇలావర్తుఁడు, బ్రహ్మావర్తుఁడు, ఆర్యావర్తుఁడు, మలయకేతువు, భద్రసేనుఁడు, ఇంద్రసేనుఁడు, ఇంద్రస్పృక్కు, విదర్భుఁడు, కీకటుఁడు - అను తొమ్మండ్రుగురుఁ బ్రధానులైరి. వారి తర్వాతివారైన కవి, హరి, అంతరిక్షుఁడు, ప్రబుద్ధుఁడు, పిప్పలాయనుఁడు, ఆవిర్హోత్రుఁడు, ద్రమిళుఁడు, చమసుఁడు, కరభాజనుఁడు - అను తొమ్మండ్రుగురు భాగవతధర్మరహస్యంబులను గ్రహించి పరమభాగవతులైరి. తక్కినవారు తండ్రియాజ్ఞను జవదాటక వినయమతులై శ్రుతి వచనంబుల నాదరించుచు యజ్ఞంబు లొనర్చుచుఁ గర్మశుద్ధిం బడసి బ్రాహ్మణులైరి.

రాజేంద్రా! భగవానుఁడు సర్వస్వతంత్రుఁడును సర్వేశ్వరుఁడును గేవలానందమూర్తియు నగు. అట్టివాఁడు ఋషభావతారం బెత్తినప్పుడు వానియందుఁ గైలక్షణంబులెల్ల నిత్యసిద్ధంబులై యుండు. అట్లున్నను ఋషభుఁడు సామాన్యునిరీతిఁ గర్మంబులఁ దవిలి యేయేకాలమం దేయే ధర్మంబుల ననుష్ఠింపవలయునో, యేయేయాచారంబుల వర్తింపవల యునో, గృహమేధి యెట్లు శమము మైత్రి కరుణ మొదలగువానిని బాటింపవలయునో, ధర్మార్థంబుల నెట్లు రక్షింపవలయునో, యశస్సు నెట్లు గూర్పవలయునో, ప్రజారంజనం బెట్లు గావింపవలయునో, మోక్షంబు నెట్లు సంపాదింపవలయునో స్వయముగా నాచరించి గృహ ధర్మనిరూపణంబునకు లోకమార్గదర్శి యయ్యెను. ఇదంతయుఁ బ్రజా శిక్షార్థమేగాని వేఱుగాదు.

రాజా! భగవానుఁడు ధర్మస్వరూపుఁడు. సర్వధర్మప్రతిపాదిరైన వేదంబు వానివలన వెలువడెను. అట్టి భగవదవతారమైన ఋషభుఁడు

గూడ బ్రాహ్మణ నిరూపితమార్గంబును దలఁదాల్చి సామాద్యుపాయంబులచేతఁ బ్రజాశాసనంబు గావించుచు, దేశకాలద్రవ్యంబుల నేమరక వయశ్శ్రద్ధలను బాటించుచు, ఋత్విక్సంపత్తిని బెంపుసేయుచు, నానాదేవతోద్దేశపూర్వకంబుగా సమస్తయజ్ఞంబుల నొక్కొక్కదానిని నూఱేసిమాఱులు యథావిధిఁ గావించెను. వానిరాజ్యకాలంబున నెవ్వనికి నెందును లేమిగాని యొకఁడు మఱియొకని నర్థించుటగాని గలుగవు. ప్రజలెల్లరు ఱేనియందు భక్తివాత్సల్యాదులను వర్షించుచుండిరి.

### ప్రజానాయకత్వధర్మము

రాజా! ప్రజానాయకత్వము కత్తిమీఁది సామువంటి దగును. నాయకుఁడు త్రొక్కినదారిఁ బ్రజలు నడతురు. ఏరాజ్యమందైనను రాజు మార్గదర్శి యగును. ఱేఁడు స్వధర్మంబు నుపేక్షించునేని జనులు గూడ నట్లే చేయుదురు. దేశమెల్ల నధర్మపరమగును. తత్ఫలముగా లెక్కలేనిదుఃఖంబులు దాపరించును. కాఁబట్టి రాజు లెల్లప్పుడు జాగరూకులై నిలువెల్లఁ గన్నులుగాఁ బ్రజాసౌఖ్యార్థము పాటుపడుట విధి యగుచున్నది.

### ఋషభుని యుపదేశములు

ఋషభుఁడు దేశసంచారంబు వెడలి నానాదేశంబులు చుట్టి కొండొకనాఁడు బ్రహ్మావర్తదేశంబునకు వచ్చెను. అచ్చట బ్రహ్మర్షులు సభ దీరిరి. ప్రజలు గుంపులు గుంపులుగాఁ జేరిరి. ఋషభునిపుత్రులును వచ్చిరి. ఆపుత్రులు ప్రణయవినయాన్వితులును బరమజాగరూకులు నై యున్నను ఋషభుఁడు వారిని నిమిత్తముగాఁగొని ప్రజోపదేశార్థంబు ధర్మంబులను బోధించువాఁడై యి ట్లనియెను.

### మర్త్యశరీరము - ధర్మసాధనము

'సుతులారా! విషయలాలసయు, దాని ననుభవించు నిచ్ఛయుఁ బ్రాణికోటి కెల్లఁ గలదు. అందులకుగా మనుష్యజన్మం బెత్తి నష్టపరమ్ము

లేదు. శరీరంబులలోనెల్ల మర్త్యశరీరం బుత్తమోత్తమం బగును. ఆశరీరము బహుజన్మకృతపుణ్యఫలంబుగాఁ గలుగుచున్నది. అట్టిదానిని దానికిఁ దగినకార్యములందే వినియోగింపవలయును. అట్లుచేయుట స్వధర్మానుష్ఠానమగు. ఒండుచో ధర్మవ్యతిక్రమంబును బాతకంబు నగు.

మనుష్యశరీరంబునకు యోగ్యమైనకార్యమేది యని యందురా ? భగవదారాధనం బొక్కటే దానికి యోగ్యమైనకార్యంబగును. దానినే తపం బందురు. తపఃఫలంబుగాఁ జిత్తశుద్ధి యగు. శుద్ధచిత్తునకు బ్రహ్మసుఖంబు గలుగును. ఆసుఖమే మోక్ష మనఁబడును.

### మోక్షము - మహాత్ములసేవ

వత్సలారా ! మోక్షంబును బడయుటకు సాధనంబెద్ది యని యందురా ? మోక్షప్రాప్తికి మహాత్ములసేవయే పరమసాధనం బగు. మహాత్ములనఁగా నెట్టివారందురా?సర్వభూతంబులందు నుండునది యొక్క భగవంతుఁడే యనుభావంబు నలవరించికొని, జీవకోటినెల్ల నాత్మసమముగాఁ జూచుచు, మిన్నులు మీఁద వ్రాలినను జలింపక, యపకారులకుఁ గూడ నుపకరించుచుఁ, బరమేశ్వరునందు సుహృద్భావం బుండుటయే జన్మసాఫల్యంబని నిశ్చయించుకొని, దేహము ధర్మానుష్ఠానార్థమేగాని భోగార్థముగాదను నిర్ణయము గలిగి, యయాచితప్రాప్తంబుతోడ సంతుష్టులగుచు దేహధారణమాత్రవ్రతులై పుత్రకళత్రాదులందలి మమకారంబును బాసి, గృహాదులు స్వధర్మానుష్ఠానయోగ్యోపకరణంబులని భావించుచు నుండువారు మహాత్ము లగుదురు. అనఁగా నపరిచ్ఛిన్నాత్ములు మహాత్ము లనఁబడుదురు.

పైఁజెప్పిన నియమంబుల ననుసరించుటవలని ఫల మేమందురా? అట్లు వర్తించుటవలన నంతఃకరణమలంబులెల్ల నశించును. నిర్మలాంతఃకరణమందు నాత్మప్రకాశము యథారూపంబున దీపించును. ఆ దీప్తి ఫలంబుగా జ్ఞానశక్తి విజృంభించును. తత్ఫలంబుగా యథార్థం బనుభూతమగును. అప్పుడు వారియం దొకయపూర్వతేజస్సు గానవచ్చును.

### ఉపదేశము

అట్టిమహాత్ములను సేవించినప్పుడు వా రనుగ్రహించి యుపదే శింతురు. ఆ యుపదేశవాక్యము వారితేజశ్శక్తితోడ శ్రవణరంధ్ర ద్వారంబున శ్రోతృహృదయాంతరము చొచ్చి, యందు శేషించియున్న సంశయాదిమాలిన్యంబులనెల్లఁ బటాపంచలు గావించును. తత్ఫలముగా నుపదిష్టునకు నాత్మస్వరూపంబు యథాస్థితిఁ బొడసూపును. అది నిదా నంబుగా నతఁడు గురూపదేశప్రకారము వర్తించి క్రమక్రమముగా సిద్ధిఁ గాంచును. సామాన్యులయుపదేశంబులకు నంతతేజశ్శక్తి గలుగదు గావున, నవి యొకచెవిదూఱి మఱియొకచెవిగుండా బహిర్గతంబు లగునే గాని యంతఃకరణంబును బ్రవేశింపవు. నీ రొక్కటైనను బాత్రశుద్ధిం బట్టి పూజ్యంబగునట్లుగా, నుపదేశం బొక్కటేయైనను దదుపదేశకుని మాహాత్మ్యంబునుబట్టి ఫలకారి యగుచుండును. కావున నెల్లరు నుప దేశకులు గానేరరు.

### శరీరధారణము

పుత్రులారా! జీవులకు శరీరధారణము ప్రారబ్ధఫలభోగార్థమై యున్నది. ఆఫలము శుభము నశుభము నని రెండుతెఱంగుల నుండును. ఇంద్రియప్రీతియే పరమార్థంబుగా భావించి తదర్థము ధర్మాధర్మంబులనెంచక వర్తించుటవలన నశుభఫలంబు గలుగును. ఇంద్రియ ప్రీతికి లోనుగాక ధర్మదృష్టితో వర్తించుటవలన శుభఫలంబు గలుగును. అశుభఫలంబును బాపంబనియు, శుభఫలంబును బుణ్యంబనియు వచిం తురు. ఏది పరమపురుషార్థప్రాప్తికి నడ్డుపడునో యది పాపంబును, ఏది యద్దానికిఁ దోడ్పడునో యది పుణ్యంబు నాఁబడును. ఒకవంక పాపంబు ననుభవించుచు మఱలఁ దచ్ఛరీరంబుచేతనే యట్టిపాపంబులను జేయుదురు. అంతకన్న నజ్ఞానులు గలుగరు. అజ్ఞానమనఁగా నెట్టి దందురా? నిక్క మైన మే లెద్దియో దాని నెఱుంగకపోవుటయే యజ్ఞానమగును. అనఁగా విపరీతజ్ఞానం బజ్ఞానమనఁబడును.

### అజ్ఞానఫలము

వత్సలారా! అజ్ఞానఫల మేమందురా? ప్రాణికోటియెల్ల నాసందానుభవార్థము ప్రాకులాడుచుండును. ఆయానందము శాశ్వతికంబనియు క్షణికంబనియు రెండువిధములు. క్షణికంబులను వదలుటయు శాశ్వతంబు నాశ్రయించుటయు నైజము. అట్టి శాశ్వతానందంబును గూర్చునది యేదో మున్నుగాఁ దెలిసికొనవలయును. అజ్ఞానం బట్టి యెఱుక నడ్డుపఱచుచున్నది. తత్ఫలంబుగా నిత్యానిత్యంబు లెఱుంగక కన్నవిన్నదానినెల్ల నాశ్రయించుదురు. అంతతో నది ముగియదు. అట్టి యానందప్రాప్తికై వివిధకర్మంబు లొనర్చుటయుఁ దత్కర్మంబులకుఁ ఫలంబు లుదయించుటయుఁ దత్ఫలభోగార్థము పునఃపునశ్శరీరధారణంబు తప్పమియు నగుచున్నది. ఇది యొకనాటికిఁ దీఱదు. ఇదియే యజ్ఞాన ఫలము. అజ్ఞానంబునకుఁ గారణం బేమందురా? సాధనలోపమే కారణము. కంటియద్దము మలినవంతమైనప్పుడు వస్తువు యథారూపంబునఁ గాన్పింపమియే యిందులకు నిదర్శనము.

### శరీరబంధమోచనమార్గము

పుత్రులారా! ఈశరీరబంధము తొలఁగు మార్గం బేది యని యడుగుదురా? జీవరాశియెల్ల సుఖార్థము వర్తించుచున్న దనియు, ఆసుఖము పరము అపరమని రెండువిధంబు లనియు, పరసుఖంబు శాశ్వతంబు అపరసుఖంబు క్షణికంబు నగుననియు, క్షణికసుఖం బింద్రియంబునకు నింద్రియార్థంబులతో సంబంధము గలిగినప్పుడు ప్రాప్తమగుననియుఁ దెలిపితిని. ఇట్టిసంబంధములలో స్త్రీపురుషమైథునసంబంధము గాఢమైన దగును. అట్టిసంబంధఫలంబుగా స్త్రీపురుషులకు హృదయబంధనం బేర్పడుచున్నది. అట్టిబంధనఫలంబుగా జనులకు గృహ క్షేత్ర పుత్ర కళత్ర ధన దేహాదులయెడ 'నేను, నాది' అనునట్టి భావంబులు దృఢమగుచున్నది. దీనినే హృదయగ్రంధి యని చెప్పుదురు.

ఈమైథునక్రియ యథోచితమై సుఖమాత్రానుభవంబు కారాదా? యనియు, అట్లగునప్పు డయ్యది యెట్లు తాపకరం బగుననియుఁ దలంతురు కాఁబోలు! స్త్రీజాతికిని బురుషజాతికిని వేఱువేఱురూపంబు లైనహృదయ గ్రంథు లుండును. అవి రెండుఁగలసినప్పుడు డాముడి దృఢతరమై దుర్భేద్యంబుగా నుండు. ప్రతివ్యక్తికి హృదయగ్రంథి గలదు. అది తద్వ్యక్తికి వానిదేహేంద్రియాదులందుమాత్రమే 'నేను, నాది' అను మోహంబును గలిగించును. స్త్రీపురుషులహృదయగ్రంథులు కలసి పెన గొన్నప్పుడు, 'నేను, నాది'అను ప్రత్యేకభావంబులుపోయి 'మేము,మాది' అని మాఱి, గృహధనాదిపరంపరను బుట్టించి వానియెడ వదలనిమోహం బును గలిగించును. అట్టిమోహం బున్నంతకాలము పరసుఖంబు లభింపదు. అట్టి పరసుఖంబునే ముక్తి యందురు.

ఇట్టి బంధంబు నుపాయమూలకంబుగా విడఁదీసికొనవలయును. అట్టియుపాయమును సాధనమందురు. బంధవిమోచనంబునకు నిరువదిర్యైదు సాధనంబులు గలవు. ఆసాధనంబులను వివరింతు వినుము.

## 25 సాధనములు

భగవంతునెడ గురుభక్తి చేయుట, భగవత్పరమై యుండుట, తృష్ణ లేకుండుట, సుఖదుఃఖాదిద్వంద్వంబుల నప్రతీకారబుద్ధితో సహిం చుట, ఐహికంబులువలె నాముష్మికంబులుగూడ దుఃఖపూరితంబులే యను నిశ్చయము గలిగియుండుట, పరమార్థతత్త్వం బేదో యని విచారించుట, మనస్సు ఏకాగ్రమగుటకై తపం బొనర్చుట, కామ్యకర్మంబులను వద లుట, స్వధర్మంబులనెల్ల భగవదర్థముగా దృఢనిశ్చయముతోఁ జేయుట, భగవత్కథలను వినుట ప్రచురించుట, భగవద్భక్తులతో నివసించుట, భగవద్గుణంబులను గీర్తించుట, ఏప్రాణియందుఁగూడ వైరభావంబు లేకుండుట, జీవరాశినెల్ల నాత్మసమముగాఁ జూచుట, ఉపశాంతుఁడగుట, దేహగేహాదులందు 'నేను, నాది' అనుభావంబు నేయకుండుట, ఆత్మబోధక,

శాస్త్రంబులను జదివి యందలిభావంబు నభ్యసించుట, అట్టి యభ్యాస కాలంబున మనస్సునకు విక్షేపంబుఁ గలుగకుండుటకై నిర్జనప్రదేశంబున నివసించుట, ఇంద్రియమనః ప్రాణంబులను జయించి స్వాధీనముచేసికొనుట, సాధువులయెడ శ్రద్ధఁజూపుట, బ్రహ్మచర్యవ్రతం బాచరించుట, కర్తవ్యమైనదానిని వదలక చేయుట, మితభాషి యగుట, భగవానుఁడు సర్వవ్యాపి యనుజ్ఞానంబు ననుభవసిద్ధము చేసికొనుట, బుద్ధిని భగవంతునందే సమాధిచేయుట-ఇవి యిరువదిరైదుసాధనంబు లగును. (గీత-xvi 1,2, 3)

ఈసాధనంబులను సాధించినవాఁడు ధైర్యప్రయత్నవివేకయుక్తుఁడై తనలో నున్నట్టి యహంకారరూపోపాధిని నిరసింప సమర్థుఁడగును.తత్ఫలంబుగా అవిద్యాప్రాప్తంబును గర్మాశయంబునైన హృదయగ్రంధిబంధంబు తనంతట తానే వీడును. అటుతర్వాత నతఁడు సాధింపవలసినసాధనంబు లెవ్వియు నుండవు.

### లోకప్రబోధము - తత్ఫలము

పుత్రులారా! లోకంబెల్లఁ దత్త్వజ్ఞానవిమూఢజనులతో నిండియుండును. అట్టిలోకంబునకు నావచించినయర్థంబు నుపదేశించి దానినెట్లయిన నుద్ధరింపవలయును. అట్లుచేయక మూఢలోకంబును మఱలఁ గర్మపరం బొనర్చి యధోగతికి లాగరాదు. మూఢలోకంబునకు నుపదేశించుట యెట్లందురా? తండ్రులు పుత్రులకును, గురువులు శిష్యులకును, రాజులు ప్రజలకును బోధింపవలయును. ఆబోధ క్రమక్రమముగా విస్తరించి లోకవ్యాప్తిఁ గాంచును. తత్ఫలముగా లోకోద్ధారకమగును. మఱియు నట్లుపదేశించువారు భగవదనుగ్రహపాత్రు లగుదురు.

### భక్తి - అనుష్ఠానము

సుతులారా! ఈభక్తిమార్గంబును సంసారమగ్నునకు నుపదేశించుట గ్రుడ్డివానిని మంచిత్రోవ నడపించు టగును. అట్లుచేయనట్టిగురువు గురువుగాఁడు; తండ్రి తండ్రిగాఁడు; తల్లి తల్లిగాదు.

పుత్త్రులారా! నన్నుఁ బ్రాకృతునట్లు తలంపవలదు. నా యీ మనుష్యాకారశరీరము నాయిచ్ఛావిలసితంబుగాని ప్రాకృతులకువలెఁ గర్మఫలాధీనము గాదు. నాహృదయము శుద్ధసత్త్వాత్మకము. అధర్మంబు నావంకనేనిఁ దలఁ ద్రిప్పఁజాలదు. ఆకారణంబున నన్ను ఋషభుఁ డందురు. నాకు మీరు పుట్టితిరి గావున మీరెల్లరు నాకు సమానులే యగుదురు. నాపల్కులు రాగద్వేషరహితంబులు గావున నామాటఁ దలఁదాల్పనగు. భరతుఁడు మీకెల్ల జ్యేష్ఠుఁడు. మీ రెల్లరు నిర్మత్సర బుద్ధితో వానిని శుశ్రూషింపవలసినది. అట్లుచేయుట నన్ను సేవించు టయుఁ బ్రజలకు సాధుమార్గము చూపి వారిని బాలించుటయు రెండు నగును.

### భూతంబుల తరగతులు

వత్సలారా! సృష్టియెల్లఁ జేతనాచేతనభూతజాలంబుతోఁ గూడి యున్నది. చేతనంబు లచేతనంబులకన్న నుత్తమంబులు. చేతనంబులు మఱల స్థావరంబు లనియు జంగమంబు లనియు రెండుతెఱంగులు. లతా వృక్షాదులు స్థావరంబు లగును; చలిచీమ మొదలు బ్రహ్మపర్యంతము జంగ మంబు లగును. స్థావరంబులనఁగాఁ బుట్టినచోటనే కదలక యుండునవని భావము. ఒకచోటినుండి వేఱొకచోటికిఁ బోఁగలుగునవి జంగమంబు లనఁబడును.

ఈచేతనంబులలో లతాదులకన్నఁ బిపీలికాదులును, వానికన్నఁ బశ్వాదులును, వానికన్న మనుష్యులును, వారికన్నఁ బ్రమథాదులును, వారికన్న గంధర్వులును, వారికన్న సిద్ధులును, వారికన్నఁ గిన్నరులును, వారికన్న నసురులును, వారికన్న నమరులును, వారికన్న నింద్రుఁడును, వానికన్న దక్షాదిబ్రహ్మపుత్త్రులును, వారికన్న భవుండును, వానికన్న బ్రహ్మయు నుత్తము లగుదురు. జ్ఞానాధిక్యతనుబట్టి యీతారతమ్యము గలుగుచున్నది. నేను సర్వోత్తముఁడ నగుదును. ఏల యందువా? నేనే

పరమజ్ఞానపూర్ణుఁడను. పైనఁజెప్పఁబడినవన్నియు నాయంశములు; నంశాంశములు నగును.

### ఉత్తమపూజనీయులు

పుత్త్రులారా! నేను సర్వోత్తముఁడ నగుటంజేసి పరమపూజనీయుఁడనైనను నాకు బ్రాహ్మణులు సర్వవిధపూజనీయు లగుదురు. బ్రాహ్మణులకు సాటి గలుగరు. బ్రాహ్మణుఁడు శ్రద్ధతో నిచ్చినయన్నము నాకెంతయుఁ దృప్తికరంబగును. యజ్ఞము లొనర్చి యగ్నిముఖంబున నాకుగా ఘృతాదులను వ్రేల్చుదురు గాని యవి బ్రాహ్మణదత్తాన్నంబువలెఁ దృప్తికరంబులు గావు.

### బ్రాహ్మణాధిక్యతకుఁ గారణము

బ్రాహ్మణుల నంత పెద్దసేయుట యేల యని యందురా? వేదము నామూర్తి యగును. ఆతనువును బ్రాహ్మణులు ధరింతురు. అంతియగాదు. వారికి మదన్యంబెద్దియుఁ బ్రార్థనీయంబుగాదు. మఱియు సత్వము, శమము, దమము, సత్యము, అనుగ్రహము, తపస్సు, తితిక్ష, అనుభవము-అనునట్టి యెనిమిదింటికి వారు స్థానభూతులై నిరంతరము మద్భక్తిభావంబుతో నిండియుందురు. అట్టివారికి రాజాధిరాజులవలనఁగూడ గోరంత ప్రయోజనంబేనియుఁ గలుగదు. మీఁదుమిక్కిలి వారివలన సర్వలోకోపకారం బగుచుండును. ఈకారణంబులఁజేసి బ్రాహ్మణు లగ్రగణ్యులగుదురు. అట్టి బ్రాహ్మణులను మీ రెప్పుడు నారాధింపనగు. బ్రాహ్మణారాధనము భగవంతుఁడనైన నన్నారాధించుట యగును.

### ఉత్తమపూజావిధానము

వత్సలారా! ఉత్తమపూజ యెట్టిదందురా? భగవత్పూజయే యుత్తమపూజ యగును. నిరాకారుఁడైన భగవంతుని బూజించుట యెట్లందురా? సృష్టిలోని సమస్తభూతంబులు భగవదధిష్ఠానంబు లగును. అట్టిభూతంబులను జంగమాజంగమంబులను నిర్మత్సరబుద్ధితో సంభావించు

టయే భగవత్పూజయగును. మఱియొక విశేషము. సర్వవ్యాపారంబులు మనోవాఙ్మయనాదీంద్రియంబుల మూలకంబున జరుగుచుండును. ఆవ్యాపారంబులనెల్ల మత్పరబుద్ధితో నొనర్చుచు వానిఫలంబును నాకు సమర్పించుచుండుము. అట్లు చేయుటే యింద్రియంబులకు సాఫల్యకృత ఫలం బగును. అట్లు చేయనినాఁడు కాలపాశకారణమైన విమోహంబు తొలఁగదు.

(భగవంతుఁడు నిరాకారుఁడని భావించి కొందఱు ధ్యానింతురు (గీ. XII-3). నిరాకారుఁడైనను సగుణుఁడని భావించి కొందఱు ధ్యానింతురు (గీ. VIII-9.). సర్వశక్తిమంతుఁడు, సర్వాధారుఁడు, సర్వవ్యాపి, సర్వాతీతుఁడు, సర్వకళ్యాణమూర్తి యని భావించి కొందఱు ధ్యానింతురు. (గీ. XV-15, 17, 19.) సర్వమయుఁడని భావించి కొందఱు ధ్యానింతురు (VII-7-12; IX-16-19.) సాకారసగుణుఁడని భావించి కొందఱు ధ్యానింతురు. (IV-8; IX- 26.)

ఇట్లు మూర్తికల్పనము వివిధమైనప్పుడు ఫలముగూడ వివిధముగా నుండదా ? యని శంకింపవచ్చును. ప్రథమంబున మూర్తిభేదంబున్నను క్రమక్రమంబుగా నట్టిభేదభావము నశించి యభేదసిద్ధి గలుగును. అభేద భావముతోనే ప్రారంభించిన వారికిఁ గలుగుఫలంబును XII-4; XIV-19; XVIII-55 లోను, భేదభావంబుతోఁ బ్రారంభించినవారికిఁ గలుగు పర్య వసానఫలము XVV-26; IX 31; VII 29; XVIII 56లోను జెప్పఁ బడియున్నది. ఎల్లరకుఁ బర్యవసానఫలం బొక్కటే యగును. ఆఫల మెట్టి దందురా ? అది పరమశాంతియని XVIII-62లోను, పరమధామమని XV-6లోను, అమృతమని XIII-12లోను, ఉత్తమగతియని VII-13 లోను, సిద్ధియని XVIII-45లోను, అవ్యయమని XV-5లోను, బ్రహ్మ మని V-24లోను ఇట్లు వివిధంబుల వర్ణింపఁబడియున్నది.. అంతకన్న జానింకూర్చి చెప్ప సాధ్యముగాదు.)

(పరమహంసధర్మములు)

పరీక్షిన్నరేంద్రా! ఋషభుఁ డట్లు రాజభక్తియు బ్రాహ్మణసేవయుఁ బ్రజలకు నిహపరకళ్యాణార్థము బోధించి భరతునకు బట్టముఁ గట్టి మునులకుఁ బరమహంసధర్మంబును బోధింపఁ దలంచి 'పుత్రకులారా! మునియైనవాఁడు పరమోపశమయుక్తుఁడై కర్మంబులను వదలును. కర్మంబులను వదలినను వానియం దభిమానంబు భాసమాత్రమేనియు శేషించి యుండును. అదియు నశించినఁగాని పరమహంసుఁడు గానేరఁడు.' అని తెలిపెను.

ఋషభుఁడు సన్యసించి యవధూత యగుట

రాజా! ఋషభుఁ డట్లు పలికి యామార్గంబును దానే నడచి చూప నిశ్చయించి భార్యాపుత్రగృహాదులను విడనాడి, యగ్నులను నాత్మారోపణం బొనర్చి, బ్రహ్మావర్తంబును వదలి కాలు లాగినట్లు చరింపసాగెను. ఎవరు పిలిచినను బలుకఁడు; ఎవ రేమన్నను వినఁడు. అతఁ డట్లు గోచియును లేక విరిసినవెండ్రుకలతోఁ బురంబులు గ్రామంబులు ఆకరంబులు ఖేటకంబులు పుష్పారామంబులు శిబిరంబులు గొల్లపల్లెలు మందభూములు బిడారులు గిరివనాశ్రమంబులు దిరుగాడసాగెను. అతఁ డట్లు సంచరించునప్పు డాయాచోట్ల నెవ్వ రైననదియు, వానియం దెట్టివి శేషంబులున్నదియు నతఁ డెఱుంగఁడు. వానియునికిఁ జూచి యతఁడు చెవిటియని కొందఱును, మూగయని కొందఱును, గ్రుడ్డియని కొందఱును, పిచ్చివాఁడని కొందఱును, పిశాచగ్రస్తుఁడని కొందఱును దలకొక్కమాటగాఁ బల్కిరి. వానిమార్గమధ్యమందుఁ గొందఱుమూఢులు చేరి యొకచోట వాని నదలించిరి; ఒకచోటఁ బయిఁబడి కొట్టిరి; ఒకచోట నుమిసిరి; ఒకచోట మూత్రము చల్లిరి; ఒకచోట ఱాలు రువ్విరి; ఒకచోట మలము నెత్తిపయిఁ బైచిరి; ఒకచోట దుమ్ము చల్లిరి. అట్లు మూఢులు పలువిధంబులఁ బరిభవించినను ఋషభునకు నవియెల్ల మృత్తికంబుపయిని తోమలుకున్ ప్రాలున

ట్లుండెను. ఎందునను వానికి మనశ్చాంచల్యంబు గలుగదు. అందులకు నిదర్శనంబుగా వానిముఖమండలము నిరంతరదరహాసమనోజ్ఞమై గ్రాలుచుండెను.

రాజా! ఋషభుఁ డొకప్పుడు వల్లకాటఁ బరుండును; ఒకప్పుడు ధూళిలోఁ బొరలాడును; ఒకపటి అజగరంబువలె కదలక మెదలక దినంబులపేరటఁ బడియుండును; ఎందేనియు మూత్రపురీషంబులను విసర్జించును; వానిలోనఁ బొర్లాడును. వానిపురీషంబునుండి సువాసనలు లేచి దవ్వు వీచుచుండును. ఎవ రేది నోటఁ బెట్టినను దానిని మ్రింగుచుండును. వేయేల? వానిచర్యలెల్లఁగాక మృగగవాదులచర్యల మఱపించుచుండెను. ఋషభుఁ డట్లు స్నానాదులు లేక వర్తించుచున్నను వానిశరీరము దివ్యతేజోమండలంబువలెఁ బ్రకాశించుచుఁ బ్రజాదృష్టి నాకర్షించుచుండెను.

రాజా! ఇట్టినడతల భావం బేమని యడుగుదువా? వాసుదేవు నెడ నాత్మతాదాత్మ్యంబు చేసినవారికి భేదభావంబు లేశమాత్రంబు గూడ నుండదు. భేదబుద్ధి నశించినవారికి సర్వము భగవదాత్మకంబై యుండు. అట్టివారు నిత్యపరిపూర్ణులు గావున నాత్మారాములై యుందురు. అణిమాదిసిద్ధు లెల్లవారి నాశ్రయించియుండును. అట్లున్నను వా రాసిద్ధులను లోలోనఁగూడ స్మరింపరు.

### ఆత్మారాములు యోగైశ్వర్యంబులకు వెఱవనేల?

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు విని శుకయోగిని 'మహాత్మా! ఆత్మారాములందు జ్ఞానాగ్ని యోగబలసముద్దీపితమై కర్మబీజంబులనెల్ల దగ్ధమొనర్చియుండును. అట్టివా రేమిచేసినను ఫలకాంక్ష లేమింజేసి పునర్జన్మాంకురంబులైన కర్మబీజంబులు మొలవనేరవు గదా! అట్టివారు యోగైశ్వర్యంబులకు వెఱవనేల? వానిని ద్యజింపనేల?' యని యడిగెను. శుకుఁ డిట్లనియెను.

'రాజా! చక్కనిప్రశ్న చేసితివి. కిరాతుఁడు చచ్చిపడియున్నను వాని నెఱింగినమృగంబు ఒతనిపాటు నిజమని నమ్మదు. చెంతకేవిధమున

జనవుగదా! అట్లే మనస్సు వాంఛారహితమై మృతప్రాయమై యున్నను దానిని విశ్వసించుటఁగాని, యజాగ్రతతో నుండుటఁగాని తగదు. మనస్సునకుఁ జంచలత్వము నైజము. అందువలన నది యొకచోట నిలువక కామాంబులఁ బెంచుచుఁ దదర్థంబుల వెంటఁబడి పఱచుచుండును. కామంబు నంటికొని క్రోధాదు లుండును. అట్టిమనస్సుతో యోగి చెలిమి చేయుట జారభార్యతోడి పొందగును. జారస్త్రీ తనకోరిక తీఱుటకుగా నవసరమైనచోఁ బతిప్రాణంబుల నేనిఁ గుదువ పెట్టునట్లుగా మనస్సు దాని కోర్కి నెఱవేఱుటకు నెంతటిపనికైనను బురికొల్పును.

మనశ్చాంచల్యశక్తికి నిదర్శనంబు వలయునా ? సౌభరి ప్రముఖుల లెందఱనో పేర్కొనవచ్చును. వారు మహాతపోవంతులయ్యు, శ్రీమహావిష్ణువుయొక్క మోహినీరూపంబు కంటఁబడినంతనే బహుకాలార్జిత తపశ్శక్తినిగూడఁ గోల్పోయి భ్రష్టులైరి. వారు వారిమనస్సును నమ్మినందున నట్లయిరి. చాంచల్యంబు మనస్స్వభావంబు గావునను, స్వభావంబవకాశము గలిగినప్పుడు విజృంభింపక మానదు గావునను, అది తనయధీనంబని యెవ్వరుగాని యెప్పుడుగాని తలంచి పరాకు చెందరాదు. ఈసంగతిని పెద్దలెందఱో స్వానుభవపూర్వకంబుగాఁ బల్కిరి. కాఁబట్టి మనోవిషయంబున నింతమాత్రపుజాగ్రత చాలునని చెప్పఁ దరముగాదు. దాని నెప్పుడు నొకకంటఁ గనిపెట్టియే యుండవలయును. అట్లుచేయక యేమాత్రము పరాకుచెందినను మనస్సు తలయెత్తి కామక్రోధమదలోభశోకమోహభయాదులకు నప్పగించును. తత్ఫలముగాఁ గర్మబంధము తగుల్కొనును.'

## ముక్తి - దేహాభిమానాభావము

'రాజా! ఋషభుఁడు భగవంతుఁడయ్యు వాని ప్రభావంబును దాఁచి లోకోపకారార్థమై యవధూతత్వమును గ్రహించి జడునివలెఁ గాన్పించుచు దశాశ్రమతత్వంబును అనఁగా సర్వావిషయానువృత్తిని

వదలుట, ఆత్మపరమాత్మల నభేదముగాఁ జూచుట, అవ్యవహితుఁడగుట, దేహాభిమానము త్యజించుట మున్నగు లక్షణంబులను బ్రకటించెను.

రాజా! అభేదవృత్తివలన నాధారాధేయభావము నశించును. అవ్యవహితత్వంబున ఉపాసనాబుద్ధికి నవకాశము తొలంగును. మనోనిగ్రహబలంబున దేహాభిమానము వీడిపోవును.

దేహాభిమానము నశించినప్పుడు దేహపతనము గాదా యని యడుగుదువా?

ఏదేనొక సంస్కారకారణంబున దేహాభిమానము భాసమాత్రంబు శేషించియుండును. తత్ఫలముగా దేహము కులాలునిచక్రమువలెఁ జరించుచుండును. అట్టియభిమానాభాసము అవిద్యావాసనవలన జనించి నదిగాదు గావునను, మఱియు నది యోగమాయావాసనాత్మకంబు గావునను, భాసమాత్రమైన యయ్యభిమానము భుక్తమైనంతనే దేహపతనము గలుగును. అట్టివారు జీవన్ముక్తు లగుదురు.

ఋషభుఁ డగ్నిదగ్ధుఁ డగుట

రాజా! ఋషభుఁ డట్లు యోగమాయావాసనం జేసి త్రిమ్మరుచుఁ గొంకణకుటకాది దక్షిణకర్ణాటదేశంబులు దిరిగి కుటకగిరివనంబుఁ జేరి నోటఁ బాషాణకబలం బుంచి యటునిటు సంచరింపసాగెను. ఆయడవిలో వెదురుపొదలు మెండు. ఆపొదలు గాలివడికి నొండొండుఁ దాఁకి యొరసి యగ్గిఁ బుట్టించెను. ఋషభుఁ డాపొదలలో నుండినందున వానిదేహముగూడ నమ్మంటలలోఁ గాలి బూదియయ్యెను. వానికి బహిర్భావంబు నశించుటం జేసి వెదురుపొదలు మండుట మొదలగు సంగతియే తెలియదు.

పాషండమతప్రచారము - కలియుగ ప్రథమబీజము

రాజేంద్రా! అవధూతవర్తనము చతురాశ్రమధర్మములకు నతీతమై యుండును, ఋషభదేవుఁడు లోకకల్యాణార్థం బవధూతవేషంబున

స్వీకరించి వర్తించెను. ఆమహాత్ముఁ డట్లు దక్షిణకర్ణాటకాదిదేశంబులకుఁ జన్నప్పు డాదేశవాసులు వానివేషంబును జూచుటయు వినుటయు నయ్యెను.

కలియుగారంభమున అర్హనుఁ డనువాఁ డాదేశంబును బాలించు చుండును. వానికి నవధూతవేషంబునుగూర్చి చెప్పుదురు. అతఁ డామహానుభావుని పరమార్థవృత్తి నెఱుంగక వాని బాహ్యలక్షణంబులను మెచ్చి వానిని దా నవలంబించుటయేగాక, వానిప్రజలచేతఁగూడ నట్లే చేయించును. ఆకార్యము పులిని జూచి నక్క వాతలు పెట్టుకొన్న ట్లగును; ఆమార్గము వృద్ధియై పఱచుకొలఁది శౌచాదులు హేయము లగును. దేవహేళనంబులైన యసవ్రతంబులందు రుచి పెరుఁగును. ఎల్లరు బోడతల లగుదురు. బ్రాహ్మణదూషణంబులును యజ్ఞపురుషనిందలును బరలోకనిరసనంబులును మితిమీఱును. వేదబాహ్యమైనట్టి స్వేచ్ఛా ప్రవర్తనము వ్యాపించును. ఒకరిం జూచి యొక రట్టి పెంజీఁకటిలో మునుఁగుదురు. వారిమతము పాషండమతం బనఁబడును. తత్ఫలంబుగా నధర్మంబు పెంపొందును. అదియే కలియుగప్రథమబీజం బగును. భవితవ్యము తప్పదు గదా!

రాజా! సకలవేదంబులకును సమస్తలోకంబులకును దేవబ్రాహ్మణ గోవులకును బరమగురువైన ఋషభదేవుని విశుద్ధచరిత్రను వినిపించితిని. ఈచరిత్ర చెవి సోకినంతనే సమస్తదుశ్చరితంబులు నశించి, పరమమంగళం బొదవును. దీనిని శ్రద్ధాన్వితులై పఠించినను విన్నను వాసుదేవునందు నేకాంతికభక్తి జనించును. ఆభక్తిప్రవాహములో మునిఁగినవారికి విషయనివృత్తి గలిగి నిఖిలపాపమూలమైన సంసారతాపం బుపశమించును. వారు ప్రాప్తసమస్తార్థు లగుదురు. కైవల్యము తనంతట తాను తలఁచి వచ్చినను వారు దాని నాదరింపరు.

రాజేంద్రా! భగవత్ప్రాప్తికై లోకము పలువగలఁ బ్రాఁకులాడు చుండును. అట్టి భగవంతుఁడు మీకును యాదవులకును ప్రభువు

గురువుఁ బ్రియుఁడు సుహృత్తు దైవంబును గులపతియు నగుటయేగాక దూతయు భృత్యుఁడు నై వానియనుగ్రహంబును మీయెడఁ బ్రసరింపఁజేసెను. మీభాగ్యం బేమనఁదగు! ఆ దేవదేవుఁడు తన్నుఁ గొల్చువారికి ముక్తినైన నొసంగునుగాని, పరాభక్తి నంతసులభముగా నీయఁడు.

రాజా! దేహాద్యభిమానంబునఁ జేసి హితాహితవివేకనష్టులై శ్రేయోమార్గం బెడసి జనులు నశింతురు. ఎవఁ డట్టి మూఢమతుల మేలునకుగా నాత్మతత్వంబును బోధించెనో యాఋషభదేవునకుఁ బ్రణమిల్లుదు.

### భరతుని చరిత్ర

రాజేంద్రా! భరతుఁడు తండ్రియాజ్ఞ మేరకు రాజ్యభారంబు వహించి, విశ్వరూపునిపుత్రికయైన పంచజని యను కన్యను బెండ్లియై సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుఁడు, ఆచరణుఁడు, ధూమ్రకేతుఁడు అనుకుమారుల నేవురఁ బడసెను. సర్వభూతాదియైన యహంకారంబునకుఁ బంచసూక్ష్మభూతంబులువోలె భరతునకు నయ్యేవురు ననురూపులైరి. ఆదేశంబు తత్పూర్వం బజనాభ మని పేర్కొనఁబడుటఁ జెప్పితిని. భరతుఁడు రాజైనంతనే యాదేశంబునకు భరతవర్షం బను పేరిడిరి.

### భరతుఁడు యజ్ఞములు చేసి భగవంతు నారాధించుట

రాజా! భరతుఁడు స్వధర్మంబును యథావిధి ననువర్తించుటయే గాక ప్రజల నెల్లరను వారివారిధర్మంబులందు నియమించి వారిని మహావాత్సల్యంబుతోఁ బాలించెను. మఱియు నతఁడు సర్వజ్ఞుఁడు గావునఁ బ్రజాక్షేమార్థము దర్శపూర్ణమాస చాతుర్మాస్య పశుయాగ సోమయాగంబులను, అయూపంబులైన యజ్ఞంబులను, సయూపంబులైన క్రతువులను గొప్పవానిని జిన్నవానిని శ్రద్ధాభక్తులతో నొనర్చి, చాతుర్హోత్రవిధానంబున యజ్ఞేశ్వరుఁడైన భగవంతుని నారాధించెను.

కర్మఫలము కర్తృభావనాధీనము

రాజా! ఎట్టి కర్మమునకైనను ఫలము తప్పక జనించును. యాగంబులుగూడఁ గర్మంబులే గావున, వానిని సాంగోపాంగంబుగాఁ జేసినప్పుడు ధర్మం బనెడిఫలం బుదయించుచున్నది. ఆఫలంబునే యపూర్వ మందురు.

ఒక్కొక్కయజ్ఞమందు నొక్కొక్కమంత్రముచేత నొక్కొక్క దేవత నామంత్రింతురు. దేవతలెల్లరు నధికారమాత్రు లగుదురు. కావున వా రిచ్చునట్టిఫలము వారియధికారంబునుబట్టి యుండును. అందువలన దేవత లిచ్చుఫలంబులు సమగ్రంబులుగాక స్వల్పమాత్రంబులై యుండును. యాగంబులను ఫలార్థులై చేయుదురు. ఆఫలం బనుభవింపక తప్పదు. ఫలభోగార్థము జన్మాంతరంబులు గలుగుచుండు.

సర్వదేవతలకు భగవానుఁడు పరదేవత యగును. ఆపరమేశ్వరుని నిష్కామబుద్ధితో భావించుచు స్వధర్మంబుల నాచరించుచు నాత్మార్థము గోరక ఫలంబు భగవదర్పణంబు చేయుదురేని, ఆకర్మంబువలన జనించు ఫలంబు చిత్తశుద్ధికరమై తుదకు ముక్తిదాయకం బగును. కర్మరహస్యం బిది గావున నెవ్వ రెట్టికర్మంబు నొనర్చినను దత్కర్మదేవతను బరిచ్ఛిన్న భావంబుతో నారాధింపక పరమేశ్వరవిరాడ్రూపంబు ననుసంధించి ధ్యానించుచుఁ గర్మంబు నొనర్పవలయును. అట్లు చేసినప్పుడు చిత్తశుద్ధి జనించును. శుద్ధచిత్తుని హృదయాకాశమందు భగవానుఁడు ప్రకాశించును.

రాజేంద్రా! భరతుఁడు వానియాగంబులనెల్ల నట్టిభావనముతోఁ జేసెను గావున, భగవానుఁడు సాకారుఁడై యాతని హృదయాంతరమందు నిత్యనివాసం బొనర్చెను. రాజా! కర్మం బొక్కటియయ్యుఁ గర్తృభావనవిశేషంబునుబట్టి ఫలవిశేషంబు గలుగుట గ్రహించితివా?

రాజా! భావనయన్ననో యది స్వభావసిద్ధము. స్వభావం బనఁగా నేమందువా? ప్రారబ్ధకర్మఫలవాసనాసముచ్చయంబు. ఆస్వభావము

త్రిగుణాత్మకముగా వ్యవహరించును. గుణవ్యవహారంబునుబట్టి వర్ణాదు లేర్పడుచున్నవి.

### భరతుఁడు తపోవ్రతియై చనుట

భరతుఁ డట్లు పెక్కువేలయేండ్లు పరిపాలించి తండ్రి తాతలనాటి నుండి వచ్చిన యారాజ్యంబును విభజించి పుత్రులకు నప్పగించి, సర్వ సంపన్నిలయమైన గృహంబునుద్యజించి తపస్సుచేయుటకై పులహాశ్రమంబునకుఁ బోయెను. ఆయాశ్రమంబును హరిక్షేత్ర మనియు వచింతురు.

### హరిక్షేత్రమహిమము

రాజా! ఆక్షేత్రమహిమం బింతనరాదు. అచ్చటిభక్తులు భగవంతు నేరూపంబున ధ్యానింతురో, యారూపంబున భగవానుఁడు వారికి దర్శనమిచ్చును. ఇది నాఁటికి నేఁటికి జరుగుచున్నది. అచ్చట గండకి యను నది ప్రవహించుచున్నది. ఆనదిలో సాలగ్రామశిలలు వెలసి తత్తో యంబులకుఁ బావనత్వంబుఁ గూర్చుచుండును.

### భరతుని తపక్రమము

భరతుఁ డయాశ్రమముచేరి యేకాకియై తదుపవనమందలి వివిధ కిసలయ కుసుమ తులసీదళంబులతోఁ గందమూలఫలోపహారంబులతో శుద్ధోదకంబులతో భగవంతు నారాధింపసాగెను. పరమేశ్వరానుగ్రహ ఫలంబుగా వానికి విషయవాంఛలెల్ల నశించి యుపశాంతి సిద్ధించెను. రాజా! భరతునిభక్తి యింతనరాదు. అతఁడు భక్తిపారవశ్యంబునఁజేసి యానందాశ్రువులు గురియుచుఁ దన్మయుఁడై యుండెను.

భరతుఁ డట్లు భగవద్వ్రతుఁడై మృగచర్మముఁ గట్టి యనుసవ నాభిషేకార్ద్రంబును గపిశంబునైన కుటిలజటా కలాపంబుతో నెంతయు విరాజిల్లుచు సూర్యోదయమైనంతనే సూర్యునియెదుట నిలిచి 'ఏతేజంబు రజోరూపప్రకృతికిఁ బరంబై ప్రకాశించునో, ఏతేజము సర్వేంద్రియ ప్రేరకుఁడైన సవితృని స్వరూపభూతమో, ఏతేజము సర్వకర్మప్రదమో,

ఏ తేజము విశ్వంబున కెల్ల నంతర్యామియై నిజశక్తిచేతఁ గాంతూపరజీవులఁ బాలించుచు వారి బుద్ధిగతుల గ్రహించుచునుండునో యా పరమ తేజంబు నాకు శరణం' బని ధ్యానించుచు దినకృత్యంబులను బ్రారంభించుచుండెను.

### భరతుఁడు ప్రారబ్ధకర్మఫలమమకారంబునకుఁ జిక్కుట

రాజా! అట్లు ప్రవ్రజితుఁడైన భరతుఁడు కొండొకనాఁడు గండకీనదిలో యథాప్రకారము నీరాడి నిత్యకృత్యములు తీర్చి తత్తీరంబునఁ గూర్చుండి బ్రహ్మాక్షరమైన ప్రణవంబు జపించుచుండఁగాఁ జూడి లేడి యొకటి దప్పిగొని యటకు వచ్చి నీరు గ్రోలసాగెను. అత్తఱిఁ దత్సమీపంబున సింహం బొండు మహాభయంకరముగా గర్జించెను. జింకలు నైజభీరుజంతువులు. ఆ లేడి తద్గర్జనధ్వనికి బెదరి నీరు గ్రోలుట మాని తటాలున నెగసి దూఁకెను. భయవిహ్వలవేగంబులకు దాని చూలు జాఱి యేటిలోఁ బడెను. ఆ లేడియుఁ దన యొంటితనంబునకును జూలు జాఱుటకును సింహభయంబునకును దిగులొంది యొకగవిలోఁ బడి చచ్చెను.

భరతుఁ డదియెల్లఁ జూచి 'కటా! ఈమృగశిశువు నదిలోఁ బడి పోవుచున్నది. రక్షింపనిచో నిది చచ్చుట సిద్ధ' మని తలంచి జాలిగొని తటాలున నీటిలో దిగి దానిని బట్టితెచ్చి యాశ్రమములో నుంచి పూఁటపూఁట దానికిఁ దగినమేఁత గొనివచ్చి పెట్టుచుఁ; గ్రూరజంతువుల నుండి కాపాడుచు దువ్వుచు లాలించుచు 'అయ్యో! దీనికిఁ దోడునీడ గలుగదు; సర్వము నేనే యని యిది భావించుచున్నది. వేఱొండుదిక్కు దీనికిఁ గానరాదు. నమ్మి శరణుచొచ్చినవారిని రక్షించుటకుఁగాఁ బెద్దలు స్వార్థము నెంతటిదైనను ద్యజింతురు' అని తలపోసి యాభారము వహించి, యా లేడిపిల్లను దనతోడఁ గూర్చుండఁజేయుచుఁ, బూజార్థము ఫలకుసుమాదులు సేకరించుటకుఁగాఁ జనునప్పుడెల్ల దానిని వెంటఁ గొని

పోవుచుఁ, జీమ చిటుక్కుమన్నంతనే దానికి నేదేనియుఁ గీడుగల్గెనో యని తహతహపడుచు, దవ్వు నడువనేరదని మూఁపున మోయుచుఁ దాను బరుండునప్పుడు దానినిఁ దనయురంబునఁ బరుండఁబెట్టుచు, నది యెప్పుడేనిఁ గనుమొఱంగినప్పుడు సర్వముఁ గోల్పోయిన దీనుఁ డట్లు గడుంగడు స్మరించుచు 'బిడ్డా! ఎందుఁ బోయితివి? తల్లి చన్నది మొదలు నన్ను నమ్మి చేరితివి. నేను నీ కేదేనియుఁ దప్పుచేసితినా? ఈనిర్భాగ్యునితప్పు మన్నించి మఱలిరమ్ము. అయ్యో! నీవు మఱలివచ్చి యాశ్రమంబులో యథామతి సంచరించుటఁ జూచుభాగ్యము నాకుఁ గలుగునా? తోడేలువాతఁ బడవుగదా! నక్కనోటఁ జిక్కవుగదా! పులి మ్రింగదుగదా! అదిగో భానుఁడు సర్వలోకక్షేమోదయుఁడు క్రుంకుచున్నాఁడు. ఇంతదనుక నీవు రాకుండుట యేల?' అని దీనచిత్తుఁడగుచు నుండెను. వానికి దానితోడిదే లోకమయ్యెను.

రాజా! అతఁడు సమాధిగతుఁడై కన్నుమూసినప్పుడా లేడిపిల్ల వచ్చి వానిశరీరంబును నిమిరి యోగభంగము గావించినను, దర్భాసనంబును జెఱచినను గోపపడఁడు. ఎప్పుడేని నతఁ డించుక యదలింపఁగా నయ్యది వెఱచి యాటలు చాలించి దవ్వుచన్నచో నతఁడు దానిని వెదుకఁ బోవుచు దాని చిఱుగిట్టలజాడలఁ జూచి 'అహా! ఈకురంగపోతఖుర లాంఛనంబులు భూదేవికిఁ బెట్టని యలంకారంబు లగుచున్నవి. ఈధరా కాంత యెట్టినోములు నోచెనోగదా!' యని భావించుచు, 'చంద్రా! నాహరిణబాలకుఁడు వనంబునకు నేగెను. లోకతాపంబును జల్లార్చు నీవు నాహరిణకుమారకుని సింహాదిక్రూరమృగభయతాపంబునుండి కాపాడుదువుగదా. ద్విజరాజా! కురంగపుత్రకవియోగతాపదవాగ్నికిఁ జిక్కి యీ ద్విజరాజుమనంబు వేసవినాఁటి మెట్టదామవలె నయ్యెను. నాపుత్రకుని జూపి నీశీతశాంతకిరణామృతంబుల నన్ను దడుపవా?' యని వివిధగతుల వ్యాకులపాటొందును.

రాజా! ఆమమకారఫలంబుగా స్నానాచారాది నియమంబులును యమాద్యనుష్ఠానంబులును భగవత్పరిచర్యాదులును భరతునకునానాఁటికి సన్నగిల్లెను. అది వాని ప్రారబ్ధకర్మఫలవిశేషం బగును. అట్లు కాదేని, విడువరానట్టి దారాపుత్రగృహాదులను విడిచి యభిమానంబును జయించిన రాజర్షి యేడ? ఆత్మకళ్యాణంబునకు భంగకారియైన యిట్టి తుచ్ఛమమ కారం బేడ? అదియు సజాతియందుఁ గాక చతుష్పాదజంతువునందు జనించుట వింతగదా!

### అంత్యకాలభావము మఱుజన్మబీజము

రాజా! ఎలుకబొఱియ వెదకుచు వచ్చుపాముపగిది, భరతుని వెదకుచు మృత్యువు వచ్చెను. ఆమరణసమయంబున నతఁడు తత్కురంగ బాలకునియందు మనం బుంచి దానినే తలపోయుచు ప్రాణంబులు వదలెను. అంత్యకాలంబున నేభావంబుతో శరీరంబును వదలుదురో యాభావఫలంబు ముందుగా ననుభవింపవలసియున్నది. అందులకై యాజీవి తదనుకూలశరీరంబును ధరించును. ఈనియతి తప్పదు. (గీత-8-6)

### మృగభరతుఁడు

భరతుఁడు వాని యవసానకాలంబున మృగంబును దలంచుచుఁ బ్రాణంబులు విడిచెను గావున మఱుజన్మంబున నతఁడు మృగమై పుట్టెను. అతఁ డట్లు మృగమై జనించినను బూర్వతపోబలంబున వానికిఁ బ్రాక్తన జన్మజ్ఞానం బుండెను. మృగభరతుఁ డాజ్ఞానబలంబున వానిపూర్వంబును బరిశీలించి కర్మగతిని గ్రహించి 'కటా! సర్వసంగంబులు విడనాడి విజనా రణ్యంబుఁ జేరి భగవంతునియందు మనంబును నిశ్చలభక్తితోఁ జేర్చి, తచ్చింతాస్మరణకథాకర్ణనంబులతోఁ గాలముఁ గడపి సమాహితచిత్తుండ నైతిని. ఎట్టకేలకు లేడిపిల్లనిమిత్తంబున నాబుద్ధి చెదిరి యాత్మవేత్తల దారికి దూరుఁడనై యీతనువుఁ దాల్చితిఁగదా!' యని హృదయముఁ జింతిం చెను. ఆచింతా ఫలంబున నమ్మృగరూపభరతునకుగాఢవైరాగ్యము జనిం

చెను. ఆవైరాగ్యఫలంబుగా నక్కురంగము తల్లిని విడనాడి పులహాశ్రమంబునకుం బోయి పునస్సంగదోషంబునకు వెఱచి యేకాకిగా నుండి యెండుటాకులు గడ్డిపఱకలు దిని శరీరయాత్ర గడపుచు, సమయము వచ్చినంతనే యామృగశరీరంబును వదలెను.

గహనా కర్మణో గతిః

భరతుని కర్మబంధం బంతతో ముగియదయ్యెను. అతఁడు మఱలఁ దనువు దాల్చి ప్రారబ్ధశేషంబు ననుభవింపవలసియుండెను. రాజా! కర్మ ఫలం బెంతదూరక మీఁదుచునో చెప్పరాదు. అందువలననే 'గహనా కర్మణో గతిః' అని చెప్పిరి. జ్ఞానాగ్ని యుదయించినంతనే సంచితప్రారబ్ధాగామి రూపత్రివిధకర్మఫలంబులు నశించు ననియు, జ్ఞానికిఁ బునర్జన్మాంకురకర్మంబు శేషింపనందున వాఁడు ముక్తుఁ డగు ననియుఁ జెప్పుదు రందువా? సమగ్రజ్ఞానము గలిగినప్పుడు కర్మఫలంబు వాసనలతోడ నశించును. అప్పుడు పునర్జన్మకారణం బుండదు. వాఁడు ముక్తుఁ డగును. వాసన యేమాత్రం బున్నను జన్మాంతరము తప్పదు. ఈరహస్యంబును గ్రహింపవలయును.

కర్మం బారబ్ధము అనారబ్ధము అని రెండువిధములు. ప్రకృతశరీర కారణమైన కర్మము ప్రారబ్ధం బనఁబడును. జ్ఞానములేనట్టి తత్పూర్వ జన్మంబులలోను, ప్రకృతజన్మములో జ్ఞానము గలుగకపూర్వమును జేసినట్టియు భోగ్యముఖము కానట్టియు కర్మఫలంబు అనారబ్ధమనఁబడును. బాణంబును వదలినతర్వాత దానితీవ్రత యెంతో, యంతదూరం బడి పోయి తీఱును. ఆలోపల నెద్దేనియు దానికి నడ్డుపడినప్పు డేమగు నందువా? ఆతీవ్రత యడ్డుపడినదానికిఁ దగిలి తత్ఫలంబు నది యనుభవించును. ఎట్లైన నేమి? దాని తీవ్రత ఫలం బెద్దేనొకదానియందు భుక్తమగుచున్నది. మఱియొకవిషయము. అడ్డుపడువస్తువు అత్యంతశక్తిమంతము దుర్భేద్యము నగునేని, ఆ బాణంబు మొక్కపోయి క్రింద పడు

చున్నది. వేఱొకఫలంబును గలిగింపనేరదు. అడ్డుపడనైనవస్తువులలో భగవంతుఁ డొక్కఁడే యుత్తమోత్తముఁడు. కావుననే 'మామేకం శరణం వ్రజ' అని చెప్పఁబడెను.

కర్మము ధర్మాధర్మరూపము. వానిఫలంబులు క్లేశంబు లనఁబడును. అవి అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశములరూపంబున నుండును. జ్ఞానోదయముతోడ ఈ క్లేశబీజంబులు పునర్జన్మకారణంబులైనవి దగ్ధంబులై ప్రతీతిమాత్రంబులుగా నుండును. అవి కేవల కర్మాభాసంబులు గావున దగ్ధబీజంబులు పునరంకురంబునకు నెట్లు సమర్థంబులు గావో యట్లే వీనిగతియు నగును. బాణంబును సంధించుటయు వదలుటయు లేనప్పు డది యేమియుఁ జేయలేదు. అట్లే అనారబ్ధఫలంబు లెట్టివైనను జ్ఞానోదయానంతరము చచ్చినట్లుండును. బీజం బంకురించుటకుఁ దగిన పరిస్థితులుండవలయును. అట్టిపరిస్థితులు లేనినాఁడు బీజము స్వస్థానమందే నశించుచున్నది. అట్లే అనారబ్ధకర్మంబులకు వ్యవహారయోగ్యపరిస్థితులు లేనప్పు డవియు స్వరూపనాశంబు నొందుచున్నవి.

ఆకాలంబున నాంగిరసగోత్రప్రవరుం డొక్కఁడు శమదమతపోనిష్ఠుఁ బూని స్వాధ్యాయనాధ్యాపనంబులు గావించి, సంతోషతితిక్షా ప్రశ్రయవంతుఁడై బ్రహ్మకర్మంబుల తాత్పర్యంబు గ్రహించి యతిథులకు నభ్యాగతులకు నన్నదానాదు లొసంగుచు, ధర్మసంపత్ఫలంబైన యానందంబు ననుభవించుచు నుండెను. వానికి నిరువురుభార్య లుండిరి. అందుఁ బెద్దభార్యకుఁ దొమ్మండ్రుగురు పుత్రులు శ్రుతశీలాచారరూపౌదార్య గుణంబులఁ దండ్రికి సాటియైనవారు జనించిరి. రెండవభార్యకు నొక పుత్రికయు నొకపుత్రుఁడు నమడలుగాఁ బుట్టిరి.

### యోగభ్రష్టుల జననము

రాజా! ఐశ్వర్యాదులఁ గోరి కొందఱును, ముక్తిని గోరి కొందఱును యోగం బాచరింతురు. ఆ యోగము సమాప్తము గాకమున్నె

వారు మరణించినచో మొదటితరగతివారు శ్రీమంతులయిండ్లలోను, రెండవతరగతివారు శుచిమంతులయిండ్లలోను వారికి యుక్తమైనచోట్ల జనింతు రని శాస్త్రము. భరతుని కర్మఫలంబు రెండవతరగతిలోనిది గావున నతఁడా బ్రాహ్మణగృహమందు వాని రెండవభార్యకు జనించెను. (గీ. 6-41).

### జడభరతుఁడు

భరతుఁ డట్లు జన్మించి పుట్టువుదొట్టి సంగఫలజ్ఞానము గలిగి తత్కర్మబంధనిరసనం బెట్లో యని తలపోసి, భగవచ్చరణాశ్రయమే మార్గమని నిశ్చయించి యెవ్వనితోను గలయక, నిరంతరభగవదాయత్తచిత్తుఁడై హరికథాశ్రవణస్మరణకీర్తనంబులు గావించుచు, నున్మత్తునివలెను జడునిరీతిని నంధునిమాడ్కిఁ జెవిటికైవడి లోకంబునకుఁ గాన్పింపసాగెను. ఆకారణంబున వానికి జడభరతుఁ డనుపేరిడిరి.

### జడభరతుని విద్యాభ్యాసము

అతఁ డట్లు జడుఁడుగాఁ దోఁచినను వానిని వానితండ్రి యుపేక్షింపక స్వధర్మతత్పరుఁడై వానికి నుపనయనంబొనర్చి, శౌచాచమనాది కర్మనియమంబులు బోధించి, సమావర్తనాదిసంస్కారంబుల యథావిధిఁ గావించెను. రాజా! జడునకు గార్హస్థ్యధర్మంబులందు నధికారము లేదు. శాస్త్రవిధి యట్లున్నను దండ్రులను బుత్రవాత్సల్యంబు వదలదుగదా.

రాజా! వేదవ్రతాద్యనంతరము శ్రావణాదిమాసంబులందు వేదాధ్యయనంబుఁ జేయింతురు. అందులకు మొదటిమెట్టుగాఁ జైత్రాది మాసచతుష్టయమందుఁ బ్రణవశిరస్సహ త్రిపదగాయత్రీజపంబుఁ గావింతురు. ఆబ్రాహ్మణుఁడా జడభరతునకు నది చెప్పెను; గాని యతఁడు దానిని గ్రహింపఁడయ్యెను. బ్రహ్మచారులు వివాహంబు నపేక్షించి యధ్యయనము దాఁక దీక్ష వహింతురు. ఆదీక్షను ఉపకుర్వాణ మందురు. ఆదీక్షాకాలమందు శౌచాచమనాధ్యయనవ్రతనియమపూర్వకంబుగా

గురుసేవాగ్నిపరిచర్యాదులు సలుపుట బ్రహ్మచారిధర్మం బగును. పుత్త్రు నను శాసించుట తండ్రిధర్మము గావున నవ్విప్రుఁడు జడభరతునకుఁ దద్ధర్మంబుల నెంతో యోపికతోఁ జెప్పెను. అవియు నబ్బాలుఁడు గ్రహింపఁడయ్యెను. కన్నబిడ్డ యట్లగుటకు నవ్విప్రుఁ డెంతయు దుఃఖించి యాదుఃఖంబునకు శరీరంబు నప్పగించెను. వాని రెండవభార్య పతితోడఁ జన నిశ్చయించి, తాను గన్న యా కొడుకు కూఁతులను సవతికి నప్పగించి భర్తృలోకంబును సాధించెను.

### జడభరతుఁడు - సహోదరాదులు

రాజా! జడభరతుని పెదతల్లిపుత్త్రులు కర్మమాత్రనిష్ఠులుగా నుండిరి. వారికి భరతుని ప్రభావంబు గోరంతయు గోచరింపదయ్యెను. మీఁదుమిక్కిలి వారెల్ల నతనిని జడునిగా భావించి శాసించుట మానిరి. ప్రజలుగూడ భరతు నట్లే తలంచి యతఁడు గానవచ్చినప్పుడెల్ల 'ఉన్మత్తా!' అనియు 'జడా' అనియు. 'బధిరా' అనియుఁ గేలిసేయసాగిరి. భరతుఁ డాపిలుపులను లెక్కసేయక వానిలోకములోఁ జరించుచుండెను. ఎవరేనియుఁ గూలికిఁ బిల్చినచో నతఁడు పోయి యాపని చేయుచు, వెట్టి పనులు చెప్పినచో వానిని గొనసాగించుచు, వెట్టికూడంతో యింతో వైచినప్పు డది యెట్టిదైనను గుడిచి దేహయాత్రఁ గడపుచునుండెను. ఇంద్రియప్రీతి యెట్టిదో యతంఁ డెఱుఁగఁడు. అతఁడు నిత్యనివృత్తుఁడు గావున విశుద్ధానందానుభవము వానికి స్వభావసిద్ధమయ్యెను. అతఁడా పరమానందసాగరములో నోలలాడుచు నుండెను. ఆకారణంబున వానికి ద్వంద్వనిమిత్తసుఖదుఃఖంబు లెప్పుడు స్ఫురణకేనియు రావయ్యెను. అభిమానరహితుఁడు గావున శీతోష్ణవాతవర్షంబుల నతఁడు లెక్కచేయక యెండగానీ వానగానీ యెద్దువలె బయట నేలఁబడి యుండుచుండెను. అతఁ డట్లు మట్టిలోఁ బొర్లాడుటవలనను సంస్కారంబు లేనికారణంబునను వానిశరీరము ధూళి కప్పుటంజేసి వాని బ్రహ్మవర్చస్సు సానఁదీర్చనిమణి వోలె నిగూఢమై యన్యులకు గోచరింపకుండెను.

భరతుఁడు బ్రాహ్మణబీజంబున జనించి బ్రాహ్మణుఁడై యున్నను,వాని మొలయందు నూగులాడు మురికిజన్నిదంబును జూచియేని తత్కుల గోత్రంబులను గ్రహింపరైరి. వానియన్నలు వానికిఁ బిడికెడుగూడేనియు నుచితంబుగా నిడక 'భరతా! ఎవనిబత్తెమును వాఁడే స్వయముగా సంపాదించుకొనవలయు' నని పలుకుచుఁ గూలికిగా వానిని మళ్లు చక్కనొత్తు పనికిఁ బంపుచుండిరి. అతఁ డట్లే పోయి పనిఁబూనుచుండెను గాని, మిట్ట పల్లంబుల నెఱింగి పనిచేయఁడయ్యెను. ఏలయందువా? వానిభావం బన్యపరమైయుండుటే కారణము. వానికిఁ బిండి యిత్తురుగాక, పురుగుపట్టిన మాషంబు లిత్తురుగాక, తవిలయడుగంట్లు వైతురుగాక, ఏదియిచ్చినను దాని నతఁ డమృతమువలె భక్షించుచుండెను.

### జడభరతునిఁ గాళికాదేవికి బలియిచ్చుట

రాజా ! ఆదేశంబున శూద్రుఁ డొకఁడు చోరనాయకుఁ డుండెను. వానికి సంతానము లేదయ్యెను. భద్రకాళికి నరబలి యిచ్చినచో సంతాన ప్రతిబంధము తొలఁగు నని వానికిఁ జెప్పిరి. అతఁ డట్టి దీక్షఁబూని వధార్థము పురుషపశువును సాధించితెచ్చుటకై నిజపరిచారకుల నాజ్ఞాపించెను. వారు బయలుదేరి దేశమెల్ల వెదకి యెందును గాంక్షితార్థంబును గానక ఖిన్నులై తిరిగివచ్చుచుండిరి.

ఒకనాఁటిరేయి భరతుని వానియన్నలు చేనికాపుదలకుఁ బంపిరి. అతఁ డట్లేపోయి యాచేనిలోని మంచెపయిఁ గూర్చుండియుండెను. అత్తఱిఁ జోరనాయకునిసేవకు లమ్మార్గంబున వచ్చుచు మంచెపై నొంటిగానున్న యాభరతుని జూచి 'అహో! మనపంట పండినది. మన స్వామికార్యార్థం బితఁ డెంతయుఁ దగు', నని నిశ్చయించి సంతోషపడుచు, వానినిఁ ద్రాటఁగట్టి కాళికాలయంబునకుఁ గొనిపోయిరి. ఆలయమువారు కొందఱ అతనికి జలకమార్చిరి; కొందఱు పట్టంబులు గట్టిరి;కొందఱు గంధంబులు పూసిరి; కొందఱు పూమాలలు దొడిగిరి;

కొందఱు పంచభక్ష్యపరమాన్నంబులు కుడువఁబెట్టిరి; కొందఱు బలి పూజావిధానంబులు సాగించి మృదంగపణవఘోషపూర్వకంబుగా నప్పురుషపశువును గాళీగర్భాలయంబునకుఁ దరలించిరి.

రాజా! కాళికాదేవి మద్యప్రియ యనియు, మద్యమునకు మాఱుగాఁ బురుషరక్తంబును సమర్పించినచో నద్దేవి సంతోషించి యభీప్సితార్థంబులను వెంటనే యిచ్చు ననియు నొకమతము గలదు. దేవీస్తోత్రమందు మద్యప్రియాదిశబ్దంబులు కొన్ని గలవు. భక్తుల మదోన్మత్తాదులను హరించు నని యాశబ్దంబులభావంబు. ఆరహస్యం బెఱుంగక మూఢలోకము విపరీతభావంబుతో వర్తించుచుండును. కాళికాదేవి యనునది భగవచ్ఛక్తివిలాసమే గాని వేఱుగాదు. ఆశక్తి వలన సర్వము సృష్టిస్థిత్యాదులు గాంచును. ఆకారణంబున నద్దేవిని లోక మాత యందురు. అట్టి లోకమాత యెక్కడ? ఆమె తనబిడ్డలరక్తముఁ గోరుట యెక్కడ? ఇంతకన్న మౌఢ్యము గలదా?

రాజా! చిత్తము రజస్తమోమలినావృతమైనప్పుడు హితాహితంబులు స్ఫురింపవు. ఆకారణంబున మలినస్వభావంబు విపరీతాశయంబులకు మూలమై హింసాది దారుణకార్యంబులను జేయించును. అట్టిస్వభావము పైకొన్నప్పు డది యుక్తాయుక్తవిచారమునకు నెడ మీయకపోవుటయే గాక, తత్స్వభావజనితభావమే యుక్త మని తోపించును. భరతుఁడు బ్రహ్మభూతుఁడు, బ్రహ్మర్షిపుత్త్రుఁడు, నిర్వైరుఁడు, సర్వభూతసుహృదుఁడు; స్వప్రాణంబులను గోరినను గాదనక యిచ్చువాఁడు. అట్టివానికిఁగూడ నిట్టిగతి గలిగెను. ఇదంతయుఁ గర్మఫలవిశేషముగాని వేఱుగాదు.

రాజా! భరతుని దెచ్చి దేవిమ్రోల నిలఁబెట్టినంతనే పురోహితుఁడు ఖడ్గంబెత్తి వానితలఁ దఱుగ నుంకించెను. అంతలోన భరతుని బ్రహ్మతేజము కాళివిగ్రహముఁ జొచ్చి యామెకు నిలువెల్ల మంటలు రేఁచెను. ఆదేవి చివుక్కున లేచి క్రోధాకారము దాల్చి మహాట్టహా

సంబుఁ గావించి క్రూరదంష్ట్రాకరాళకాంతుల వెదఁజల్లుచుఁ గన్నుల నిప్పుకలు రాల్చుచుఁ దదఖడ్గంబును బెఱికికొని యాకత్తితోన నందున్న పాపాత్ములతలలు తఱిగి యావేడినెత్తురులు గ్రోలి, వారిపుత్రులను గందుకంబు లట్లాడి పాడి విహరించెను. ఒకరికిఁ జేయఁదలంచిన కీడు తుదకుఁ గర్తనే చెఱచును సుమా.

రాజా! భరతునకు నియ్యది యేమియుఁ దెలియదు. కారణ మే మందువా? వానిమనంబు సర్వాంతర్యామియైన భగవంతునియందే లీనమైయున్నందున వానికి వే ఱొకటి గోచరింపదయ్యెను. మఱియు భయసంభ్రమంబులు దేహాత్మభావం బున్నప్పుడుమాత్రమే గలుగును. దేహాత్మభావరూపహృదయగ్రంథి యెప్పుడు నశించునో యప్పుడే విప రీతభావంబులు వలసపోవును. అట్టివాఁడు సర్వభూతసుహృత్తయి వర్తిం చును. దేహాభావమే లేనివాఁడు దేహరక్షణం బెట్లందువా! ప్రారబ్ధకర్మ ఫలంబు భోగమగువఱకుఁ బిడుగుపడినను దద్దేహమునకుఁ బతనము గలుగదు. అందాఁక తద్దేహరక్షణాధికము భగవంతుఁడే భరించి యెప్పు డేమి సేయనగునో యది చేయుచుండును. కారణ మేమందువా? భాగ వతపరమహంసులకును దనకును భేదము లేదని భగవంతుఁడు ప్రతిజ్ఞా పూర్వకంబుగాఁ బల్కియున్నాఁడు గదా!

### జడభరతుఁడు రహూగణుని పల్లకి మోయుట

రాజా! సింధు సౌవీరదేశంబులు గలవు. వానికి రహూగణుఁ డను వాఁడు రాజుగా నుండెను. అతఁ డొకనాఁ డిక్షుమతీ నదీతీరంబునకుఁ బోయి యటనున్న కపిలమహర్షిని సందర్శించి, వానివలనఁ దత్త్వజ్ఞానంబు నెఱుంగఁదలంచి పల్లకిని సిద్ధపఱచ నాజ్ఞాపించెను. పెద్దబోయ మోఁత గాండ్రకై యూరిలోనికిఁ బోయి కొందఱను జేర్చికొని వచ్చుచుండఁగా, మార్గమధ్యంబున నొకయెలప్రాయపువ్యక్తి దృఢాంగుఁ డెదురయ్యెను. ఆబోయ యతనిఁ జూచి 'ఇతఁ డెంతయు బలశాలిగా నున్నాఁడు. ఎంత

బరువైనను గాడిదవలె మోయనోపు' నని తలంచి వానినిగూడ వెంటఁ గొనివచ్చెను.

ఱేఁడు పల్లకీలోఁ గూర్చుండెను. బోయలు పల్లకీని భుజముల మీఁద నుంచి యడుగులు ద్రొక్కుచు నడువసాగిరి. ఆక్రొత్తబోయ తన యడుగుల క్రిందఁ జలిచీమలు పడి చచ్చునేమో యని భయపడుచు, బాణపాతదూరము ముందుఁ జూచుచు మెల్ల మెల్ల నడువసాగెను. వాని యడుగులకుఁ దక్కినబోయల యడుగులకు జత కుదురక పల్లకి యూగు లాడసాగెను. రహూగణుఁ డది చూచి 'బెస్తలారా! పల్లకి యూగు లాడుచున్నది. సంగతి యేమి? చక్కనడువుఁ' డని మందలించెను. వాహకులు తేనిమాటకు వెఱచి 'దేవా! మేము యథాప్రకారము మోయుచున్నాము. ఎవఁడో యితఁడు క్రొత్తబోయ మాకు నేఁడు దాఁపరించెను. వీనితోఁ గలసి పల్లకి మోయరాకున్న' దని విన్నవించిరి. రహూగణుఁ డామాట విని 'సంసర్గదోషంబున నిర్దోషులుగూడఁ గష్టంబుల పాలగుదు రనుమాటకు వేఱునిదర్శం బేల?' యని లోలోనఁ దలంచి, యాక్రొత్త బోయను బల్కరించి 'అన్నా! నీవొక్కండవే యింతదవ్వు మోచి సొలసితివి. వగ్గు ముదుసలివి గాఁబోలు. తోడిబెస్తలకు నీకు సాటిగలుగ'దని నిందాగర్భంబుగాఁ బలికెను. ఆపల్కుల నతఁడు చెవిఁబెట్టక యథాపూర్వము నడువసాగెను.

### రహూగణునకుఁ గ్రొత్తబోయకు సంవాదము

రాజా! పల్లకి యథాపూర్వం బూగులాడసాగెను. రహూగణుఁ డాగ్రహ మొంది 'బోయరాజా! నామాట వినవా? వినియు లెక్కసేయవా? నీకు బ్రదుకుపైఁ గోరిక లేదా? బ్రదుకఁగోరుదువేని రాజాజ్ఞ నుల్లంఘింతువా? ఇదిగో చూడు నీమాంద్యము పోనడంతును. అట్లు చేసినఁ గాని నీవు స్వస్వరూపంబును గ్రహింపనట్లు తోఁచదు' అని పరుషంబుగాఁ బల్కెను.

ఆక్రోత్తబోయ తేనిపల్కులు విని 'కటా! రాజాభిమానం బితని నిట్లు పల్కించుచున్నది. రజస్తమోవృత్తులకు నిది సహజమే గదా!' యని లోలోన నవ్వుచు 'రాజా! నీపల్కులు సోపాలంభములైనను సత్యము లే యగు. నే నెంతో బరువు మోచి డస్సితి నని చెప్పితివి. బరువనునది యొకటి గలదా? అట్టిది గల్గినఁ గల్గుగాక. ఆబరువును మోయున దేది? చక్కఁగా నడువనైతి నంటివి. నడుచున దేది? గతిశ్రమ గల్గెనంటివి. ఆశ్రమ దేనికి? మోయునదిగాని నడచునదిగాని శ్రమచెందునదిగాని దేహంబని చెప్పుదువా? దేహము పంచభూతాత్మకంబును జడంబునగును. జడంబునకు లాఘువభారంబులు తెలియునా? మఱియు దేహము జడంబు గావున దానికిఁ జలనాదులు గలవా? నేను బలియుఁడ నంటివి. బలము దేహధర్మమో యాత్మధర్మమో విచారించితివా?'

'రాజా! నీపల్కిన వక్రోక్తులెల్ల దేహాత్మబుద్ధి పల్కినపల్కులు గాని వేఱుగాదు. నీచెప్పిన వ్యవహారమెల్ల నజ్ఞానకల్పితము. అది దేహాభిమానులకుఁ జెల్లుఁగాని యట్టియభిమానము లేని నాయెడఁ జెల్లవు. మఱియు నన్ను జీవన్మృతుఁడ వని యంటివి. ఆగతి నాకేగాదు. సమస్త పరిణామవస్తువులకు నియతంబగును. వికృతికి నాద్యంతంబులు తప్పవు గదా! రాజాజ్ఞ నుల్లంఘించితి నంటివి. రాజభావం బొక్కటి కలదేని శాసించువాఁడును, శాసనంబును బట్టి గర్తవ్యంబు నను భేదం బేర్పడును. రాజభృత్యభావంబులు భేదబుద్ధివ్యవహారంబులు; సత్యములు గావు. ఈశ్వరుఁడ ననునట్టి యభిమానంబు నీకుఁ గలదేని, ఈశిత్వం బెద్దియో? మేము చేయనైన దెద్దియో తెల్పుము. నాకుఁ బ్రతీకారం బొనర్తు నంటివి. నేను బ్రహ్మభూతుఁడను; బ్రహ్మభూతునకు నీప్రతీకారరూప చికిత్సలవలనఁ బ్రయోజన మేమి? నీమాటలెల్లఁ బిష్టపేషణంబులు' అని బదులుపలికి, 'ఎట్టివానికేనియుఁ బ్రారబ్ధకర్మఫలభోగము తప్పదు. ఆ ఫలము భుక్తమైగాని నశింపదు. నాప్రారబ్ధకర్మఫలంబు న న్నీపనికి నియు

మించెను. ఈవిధంబునఁగాని యది నశింపదు.' అని లోలోనఁ దలంచి మఱల మోయసాగెను.

రహూగణుఁడు క్రొత్తబోయను క్షమాపణంబు వేఁడుట

రాజా! రహూగణుఁడు తత్త్వవిచారపరుఁడు గావున నమ్మాటలు ములుకులై వానిని నాటెను. అతఁడు వెంటనే పల్లకినుండి దిగివచ్చి రాజాభిమానంబుఁ ద్యజించి యాబోయ యడుగులకుఁ దలతో మ్రొక్కి 'మహాత్మా! నీ వెవ్వండవు? ఈ నీయజ్ఞోపవీతచిహ్నంబులు నీవు బ్రాహ్మణుండ వని తోపించుచున్నవి. అవధూతలు దత్తాత్రేయాదులు గల రందురు. వారిలో నీ వొక్కండవా? నీతండ్రి యెవఁడు? ఎందుండుదువు? ఇందు నీవు వచ్చిన కారణమేమి? కపిలాచార్యుఁడవు నీవు మామేలునకై వచ్చితివా? ఇంద్రుని వజ్రంబునకుఁగాని, మహేశ్వరుని త్రిశూలంబునకుఁ గాని, యముని దండంబునకుఁగాని, మఱి యెద్దానికేనియు వెఱపుచెందవు. నీధీరత్వం బపూర్వము. బ్రాహ్మణావమానంబన్న నాయెడ లెల్ల వడంకును. నీవిజ్ఞానవీర్యంబు లత్యంతనిగూఢంబు లని నీపల్కులు ప్రకటించుచున్నవి. నీ వెవ్వండవో తెలుపవేఁడెద. నీవచనంబులభావంబులు సూక్ష్మదర్శను లైన మహాత్ములకుఁగూడ నభేద్యంబు లనఁగా నాబోంట్లసంగతి చెప్ప వలయునా? మహాత్మా! ఈసంసారసాగరంబునకు దరియేదో యూహింప రాకున్నది. అది యెఱుంగఁగోరి, యాత్మతత్త్వజ్ఞమణియు యోగీశ్వరుండును మీఁదుమిక్కిలి శ్రీహరిజ్ఞానకలావతారంబునైన కపిలాచార్యు నుపాసింపఁ జనుచున్నాను. నా వెదకునట్టి యయ్యోగీశ్వరుఁడు నీవే యనుశంకఁ జనించుచున్నది. మహాయోగులు లోకనిరీక్షణార్థము ప్రచ్ఛన్నగతి సంచరింతురు. వారిగతి సంసారాంధువులకుఁ దెలియరాదు.'

'మహాత్మా! భరించువారికి భారశ్రమంబును నడుచువారికి గమ నాయాసంబును స్వానుభవసిద్ధములు. అవి నీయెడఁ గల్గ వంటివి. అది యెట్లు? లోకమెల్ల వ్యవహారమాత్రమేగాని సత్యము గాదంటివి.

ఘటాదులతో నీరు మున్నగునవి కొనివత్తురు. ఘటాదులు వస్తురూపం బులు గానియెడల జలాహరణాదిక్రియ లెట్లు కొనసాగును? కార్యంబు లను గన్నారఁ జూచుచున్నాము. కార్యమునకుఁ గరణం బుండవల యును. ఆరెంటికి సత్యత్వము లేదనుట ప్రమాణవిరుద్ధమని తోఁచు చున్నది. సత్యముగానివి మిథ్య లగును. ఇంద్రియగోచరంబులు మిథ్య లెట్లగును? భారవహనాదిక్లేశంబులు నీకు లేవంటివి. నీకు అనఁగా నీయాత్మ కని నా భావము. గిన్నెలో నీరుపోసి నిప్పుమీఁద నుంచినప్పు డాయగ్ని వేడిమి మొట్టమొదట గిన్నెకుఁ గలుగును. తర్వాత గిన్నె వేడిమి దానిలోని నీరునకు వ్యాపించును. అటుపిమ్మట నీటివేడిమి యందున్న తండులాదులకుఁ బ్రాఁకును. ఆతండులంబు లావేడిమికి నుడికి యన్నమగుచున్నవి. అట్లే తాపాదులు మొదట దేహంబునకును, తర్వాత దేహాంతరంబులైన యింద్రియంబులకును, ఇంద్రియంబులతాపము తదం తరమైన ప్రాణంబునకును, దానితాపంబు మనస్సునకును, మనస్తాపము తత్సమీపవర్తియైన యాత్మకును సంసర్గకారణంబునఁ గలుగును గదా!'

'మహాత్మా! స్వామి భృత్యన్యాయము నిత్యము గాదనియు, జడు నకుఁ బ్రతీకారము నిరర్థకమనియు వచించితిని. మొదటిది నిత్యమో కాదో యటుండనిమ్ము. ప్రజాపరిపాలనంబు వలయునన్నచో శాసకుఁ డుండవలదా? స్తబ్ధునకుఁ బ్రతీకారము పిష్టపేషణమైన నగుఁగాక. చెడు త్రోవఁ జనువారిని దండింపవలదా? దండనంబు నీశ్వరుఁడే విధించెను. వానియాజ్ఞను దలఁదాల్చి వర్తించుటయే భగవదారాధనం బగును. భగవంతు నట్లారాధించువారికిఁ బాపక్షయం బగుచున్నది. ఇది మహా ఫలము గదా!'

'మహాత్మా! రాజాభిమానాంధుఁడనై మహాత్మునెడ నపరాధం బొనర్చితిని. నాతప్పును మన్నించి నన్ననుగ్రహింపుము. నీకరుణావిశే షంబున నాపాతకంబెల్ల దగ్ధమగుఁగాక. మదోన్మత్తుల యకార్యంబులు

పెద్దల నేమియుఁ జేయఁజాలవు గాని యవి తత్కర్తలనే చెఱుచును. అట్టిభీతి నన్నుఁ గలవరపఱచుచున్నది; అని వినయవినమ్రుఁడై వచించెను.

## శ్రోత్రియుఁడు రహూగణునకు జ్ఞానోపదేశము చేయుట

రాజా! ఆబోయ వానిని విని 'అయ్యా! విద్వాంసునిమాటలు పల్కుదువు. నీయందు విద్వత్తు కానరాదు. ఎట్లందువా? నీవు స్వామి వనియు మేము భృత్యుల మనియు భావింతువు. ఈసంబంధము లౌకిక వ్యవహారమాత్ర మగు. ఇట్టిదానిని సత్యం బని తత్త్వవేత్త లెన్నడును దలంపరు. ఏల యందువా? సత్యపదార్థం బెట్టిదో ముందుగా గ్రహింపుము. త్రికాలంబులందు దేనికి నెట్టిమార్పు గలుగదో యది సత్య మగును. సంబంధము వియోగాంతము. కావున నయ్యది త్రికాలా బాధ్యము గాదు. దానంజేసి యది సత్యముగాదు.'

'అయ్యా! లోకముసంగతి యేమని యడుగుదువా? లోకము దృశ్యమాత్ర మగును. దృశ్యము నశ్వరము. తార్కాణ మేమందువా? జాగ్రదవస్థయందుమాత్రమే ప్రపంచము గానవచ్చుచున్నది. గాఢ నిద్రావస్థలో నయ్యది లేశమాత్రమేనియుఁ గానరాదు. కలలో నెన్నో చూతుము. మేల్కాంచినప్పుడు కలలోఁ గన్నవెల్లఁ గల్లలగుచున్నవి గదా! ఇట్లు స్వప్నదృష్టాంతంబునను అనుమానప్రమాణంబునను బ్రపంచ తత్వంబును నిశ్చయింప నగు.'

'అయ్యా! వేదాంతులుగూడఁ గర్మంబుల నీశ్వరార్పణబుద్ధితోఁ జేయుదు రనియు, లోకంబును గర్మంబులును సత్యంబులు గానిచో వా రట్లేల చేయుదు రనియు, కర్మంబులు సత్యము లగుననియు, కర్మంబులు సత్యములు గావుననే వానికి ఫలం బుదయించుచున్నదనియు, ఈశ్వరార్పణబుద్ధితోఁ జేసిన కర్మంబునకుఁ బరమార్థప్రాప్తి ఫలంబగు ననియు, కర్మసత్యత్వంబునుబట్టి కర్మాత్మకమైన సంసారంబు సత్యమే యగు ననియు వాదింతువా?'

అయ్యా! సంసారముగూడ మనఃకల్పితమేగాని సత్యముగాదు. మనస్సనఁగా నేమో గ్రహింపుము. మూఁడుగుణంబుల వాసనాసంపుటంబును మన స్సందురు. ఆవాసనలప్రేరణంబున జ్ఞానేంద్రియంబులును వాని ప్రేరణంబునఁ గర్మేంద్రియంబులును వ్యవహరించుచున్నవి. ఇంద్రియ వ్యవహారంబు తత్తద్గుణవాసనాప్రేరణంబునుబట్టి యుండు. ఎట్టివ్యవహారంబునకేనియు ఫలంబు తప్పదు. ఫలము భుక్తమైగాని నశింపదు. ఫల భోగార్థము తత్తదనురూపదేహాదులు గలుగును. అనఁగా భోగ్యఫల భేదంబులఁబట్టి యాఫలంబుల భోగించు దేహంబులు చిత్రవిచిత్రంబులగుచున్నవి. ఈవిధానంబును సంసారచక్ర మనిరి. కావున సంసారము మనఃకల్పితముగాని వేఱుగాదు.'

'మఱియు మనస్సు గుణాభిమానంబును బడసినప్పుడు మాత్రమే సంసారము గలుగుచున్నది. అట్టి యభిమానము నశించినప్పుడు కళ్యాణము సిద్ధించుచున్నది. దీనింబట్టి సంసారంబునకుఁ గాని, నిశ్శ్రేయసంబునకుఁ గాని రెంటికి మనస్సే కారణంబని యేర్పడుచున్నదిగదా!'

'సంసార ప్రవృత్తి నివృత్తులు దేనికి? అని యందువా? ఇవి యభిమానంబునకుఁ గలుగుచున్నవి. ప్రమాణ మేమందువా? అభిమానము తలచూపినప్పుడు ప్రవృత్తియు, అది లీనమైనప్పుడు నివృత్తియుఁ గలుగుట యెల్లరకు స్వానుభవమే గదా!'

'అయ్యా! ఈ యభిమానమునే జీవుఁ డందురు. అభిమానము జడపదార్థ మనియు, జడమునకు వ్యవహారం బెక్కడి దనియు శంకింతువా? అభిమానము జడమగుట సత్యము. జడంబునకు స్వతంత్ర వ్యవహారము లే దనుటయు సత్యమే. ఎల్లదేహంబులలోపల నాత్మ యున్నది. ఆ యాత్మ సాక్షిమాత్రుఁడై యుండును. ఆత్మసాన్నిధ్యంబునఁ జేసి యభిమానము వ్యవహరించుచున్నది. సూదంటురాయి సాన్నిధ్యంబున నినుపముక్క చలించుటయే యిందులకు నిదర్శనము. ఈరహస్యంబు

నైయుంగక యభిమానరూపజీవునికార్యంబు నాత్మయం దారోపింతురు. అభిమానంబునకు నంతరాత్మతోడి సాన్నిధ్యం బెట్లు గలిగె నందువా ?

ఆత్మ యనునది శరీరాంతరంబుననే యున్నందునఁ దత్సాన్నిధ్యం బభిమానంబునకుఁ గలుగుచున్నది. ఆత్మ యెప్పుడు శరీరంబును వదలునో యప్పు డభిమానము వ్యవహరించుటలేదు గదా! మరణావస్థయే యిందు లకు నిదర్శనము.

ఆత్మసాన్నిధ్యంబున నభిమానంబు వ్యవహరించునంటిని. ఆపక్షం బున నభిమానకృత పుణ్యపాపంబు లాత్మకు సంసర్గరూపంబున నంటవా? యని యందువా? కర్తకు ఫలకాంక్ష యున్నప్పుడు తత్కర్మఫలంబు గలు గును. ఫలకాంక్ష లేనినాఁడు ఫలం బంటదు. సూదంటురాయి సాన్ని ధ్యంబున నినుపముక్క చలించునప్పుడు దాని చలనవిశేషంబుల సూదం టురాతి కంటుటలేదు గదా! కారణమేమి? ఇనుపముక్కచలనాదులను సూదంటురాయి కోరలేదు. కోరికలేనికారణంబును సూదంటురాతికి నినుపముక్కతో సంగమము లేదు. సంగంబున్నప్పుడే యభిమానాదులు జనించును. అదేవిధంబున నాత్మసిద్ధియు గ్రహింపనగును.

'అయ్యా! మనస్సనునది యొక్కకరణ మగునేగాని భిన్నకరణాత్మ కంబు గాదనియు, మనస్సట్లొక్కటయ్యు సంసారంబునకును మోక్షంబున కెంటికి నెట్లు కారణం బగుననియు శంకింతువా? మనస్సనునది యేక కరణం బనుట సత్యము. మనస్సునకు రూపభేదము లేకున్నను అవస్థా భేదముగలదు. అవస్థాభేదంబునుబట్టి యేకమైనమనస్సు సంసారమోక్షంబు లకు రెంటికిఁ గారణంబగుచున్నది. అవస్థాభేదం బెట్లు గలుగుచుండు నందువా? గుణంబునుబట్టి యవస్థాభేదము గలుగుచున్నది. మనస్సు గుణ బద్ధమైనప్పుడు సంసారహేతువగును. అట్లు గుణబద్ధము కానప్పుడు మోక్షహేతు వగును. దీపంబు నుదాహరణంబుగా గ్రహింపుము. దీప కాంతి నైజముగాఁ దెల్లని ప్రకాశరూపంబున నుండును. వత్తిని నూనె

లోఁ దడిపి వెలిగించినప్పుడు దాని ప్రకాశము పొగ చూఱియుండును. దీపకాంతియొక్క శుద్ధాశుద్ధ ప్రకాశంబులకుఁ దైలముయొక్క అసంబంధ సంబంధంబు లెట్లు కారణమో, యట్లే మనస్సునకు గుణాగుణసంబంధంబులు సంసారమోక్షంబులకుఁ గారణమగును.

### అభిమానములు - తత్కార్యములు

అయ్యా! మనస్సునకుఁ బదునొకండువృత్తులు గలవు. అందైదు వృత్తులు పంచజ్ఞానేంద్రియపరంబులు, ఐదువృత్తులు పంచకర్మేంద్రియపరంబులు నగు. పదునొకండవవృత్తి యభిమానవృత్తి యనఁబడును. జ్ఞానేంద్రియంబు లైదింటికి శబ్ద స్పర్శ రూప రస గంధంబులు విషయంబు లగును. కర్మేంద్రియంబు లైదింటికి విసర్గరతిగవి వచనశిల్పంబులు క్రమంబుగాఁ గార్యంబు లగును. అభిమానముసంగతి యేమందువా? దానికి జ్ఞానేంద్రియంబులకువలెఁ బ్రత్యేకవిషయంబుగాని, కర్మేంద్రియంబులకువలెఁ బ్రత్యేకకార్యముగాని గలుగదు. అది 'నాది' అనెడి కేవల భోగాయతనత్వభావంబుననుండు. స్వీకార్యమే దానికి విషయంబగును. అనఁగా అభిమానంబునకు దేహము విషయం బగును.

అయ్యా! దేహము వే అనియు అభిమానము వే అనియుఁ గొంద ఱందురు. ఆపక్షంబున దేహవృత్తి యనునది మఱియొకటి యేర్పడి అభిమానవృత్తి పండ్రెండవది యగును. అయ్యభిమానము ఆత్మసాన్నిధ్యంబున నహంకారరూపముఁ దాల్చి జీవుఁ డనఁబడును.

### విషయభేదములు - తత్కారణము

పైనిఁజెప్పిన శబ్దాది పంచవిధవిషయంబులు స్వభావసంస్కార కర్మకాలంబుల నిమిత్తంబునఁ బెక్కుభేదంబుల నొందుచున్నవి. ఆభేదంబులకు లెక్కయే గలుగదు. ఆభేదంబులు విషయంబులయొక్క స్వశక్తివలన నేర్పడుచున్నవా? లేక, పరస్పరసంయోగకారణంబున నేర్పడుచున్నవా? అని శంకింపవచ్చును. విషయంబులు జడంబులు. గావున వానికిఁ బ్రత్యేక

మైనస్వశక్తి గలుగదు. స్వశక్తి లేనప్పుడు వానికిఁ బరస్పరసంయోగంబు గలుగనేరదు. కావున స్వశక్తిగాని సంయోగముగాని విషయంబుల విభేదంబులకుఁ గారణంబులు గావు. మఱి యెట్లు విషయవిభేదము గలుగుచున్న దందువా? జీవుని సాన్నిధ్యప్రభావంబున విషయంబుల వ్యవహారంబులును దదంతర్భేదంబులును గలుగుచున్నవి.

ఈమనోవిభూతులు నిత్యానిత్యంబులు రెండు నగును. ప్రవాహరూపంబున వానికి నిత్యత్వంబు గలుగుచున్నది. జాగ్రత్స్వప్నదశలందు వానికి జననంబును సుషుప్తిసమయంబున వానికిఁ దిరోభావంబును గలుగుచున్నందన అనిత్యత్వంబు సంప్రాప్తమగుచున్నది. పైమూఁడవస్థలందు జీవుఁడు వానిని జూచుచున్నాఁడు గావున క్షేత్రజ్ఞుఁ డనఁబడును. అతఁడు పై మూఁడవస్థలందు మార్పులేక చూచుచు నుండుటంజేసి జననస్థితిలయాదిశూన్యుఁ డగును. క్షేత్రజ్ఞుని సాన్నిధ్యంబున మనోవిభూతులును తద్విభూతులకార్యమైన ప్రపంచంబును గలుగుచున్నది. కావున క్షేత్రజ్ఞుఁడు జగత్కారణభూతుఁ డగుచున్నాఁడు. క్షేత్రంబులు నానా విధంబులై పెక్కురూపంబుల నున్నవి. ప్రతిక్షేత్రమందు నొక్క క్షేత్రజ్ఞుఁడు ప్రత్యేకమైనవాఁ డున్నట్లు తోఁచుచుండును. ఏకము నద్వితీయము నైన పరమాత్మ వివిధక్షేత్రంబులందుఁ బ్రకాశించుటంజేసి, క్షేత్రభేదములనుబట్టి క్షేత్రాంతర ప్రతిబింబంబులకుఁగూడ నానాత్వంబు కల్పింపఁబడుచున్నది. క్షేత్రజ్ఞులను ఆత్మ లందురు. ఈయాత్మలకెల్ల మూలమైన యావస్తువును బరమాత్మ యందురు.

### జీవుఁడు - ఈశ్వరుఁడు

అయ్యా! ఈ క్షేత్రజ్ఞుఁడు రెండువిధములఁ బ్రకాశించును. అతఁడు త్వంపదార్థవిషయుఁడైనప్పుడు, అనఁగా 'నీవు' అను భావంబును బ్రకాశింపఁజేయునప్పుడు జీవుఁ డనఁబడును; తత్పదార్థవిషయుఁడైనప్పుడు, అనఁగా భగవద్భావంబును బ్రకాశింపఁజేయునప్పు డీశ్వరుఁ డనఁబడును.

జీవుఁడు పరిచ్ఛిన్నుఁడు, పరప్రకాశితుఁడు, జ్ఞానవిషయుఁడు, పరోక్షుఁడు నగును. ఈశ్వరుఁడు సర్వవ్యాపియుఁ బూర్ణుఁడును స్వయంజ్యోతియు నగుటం జేసి జ్ఞానవిషయుఁ డొండెఁ దదాశ్రయుఁ డొండెఁ బరోక్షుఁ డొండెఁ గాక యపరోక్షుఁ డగును. ఆభగవానుఁడు సర్వవ్యాపి గావున నిఖిలస్థావరజంగమంబులలో బ్రాణస్వరూపంబునఁ బ్రవేశించి వానికి నియామకుఁడై యుండును. విశ్వమెల్ల వాని మాయా(శక్తి) విలాసమే గాని వేఱు గాదు.

### మాయను జయించుట

అయ్యా! మాయను నిరసించినవాఁ డాత్మతత్త్వవేత్త యగును. మాయను నిరసించుట యెట్లందువా? జ్ఞానోదయం బైనంతనే మాయ తనంతట తానే తొలఁగుచున్నది. జ్ఞానోదయం బగుట యెట్లందువా? మనోజయంబున జ్ఞానోదయం బగును. మనోజయం బెట్లందువా? మనస్సు మమకారరూపంబున వర్తించుచుండును. ఆమమకారంబును వదలిననాఁడు మనస్సనునది స్వరూపనాశం బగును. మమకారమును వదలుటకు నుపాయం బేది యని యడుగుదువా? భగవచ్చరణోపాసనమే యుపాయము. ఎందాఁక భగవత్పాదమూలంబు నాశ్రయింపఁడో యందాక మనస్సు దానియాటలను మానదు. మనస్సుయొక్క యాట లెవ్వి యందువా? శోక మోహ రాగ ద్వేష వైరాదులు మనోనాటకంబు లగును. ఆయాటలవిలాసమే సంసార మనఁబడును. ఈసంగతి గ్రహించి వర్తించునందాఁక సంసారభ్రమణంబు తప్పదు.

మనోవ్యవహారం బెల్ల నానందానుభవార్థమే గాని వేఱు గాదు. అందులకుగా నయ్యది యేదే నొకపదార్థంబు నాశ్రయించుచుండును. లౌకికపదార్థంబు లెల్ల క్షణికానందదాయకంబులును దుఃఖాంతంబులు నగు. ఆకారణంబున మనస్సు ఒకపదార్థంబునుండి మఱియొకపదార్థంబునకు నెగయుచు నెందును దనివినొందక పరిభ్రమించుచుండును. భగవంతుఁడు

పూర్ణుఁడు నవ్యయశాశ్వతానందస్వరూపుఁడు నగును గావున, మనస్సు నకు భగవదాలంబనంబును గూర్చినచో నయ్యది తన్నిత్యపదార్థంబును దవిలి యందే లీనమగును. అట్లు లీనమైన ఫలంబుగా మనోభ్రమణంబు లుడుగును. ఈవిధానంబును మనోనాశన మందురు. ఏవస్తువుగాని దాని నైజవ్యవహారంబును మానినప్పు డది నశించినట్లేయగుఁ గదా! మనస్సు నిట్లు భగవత్పరంబుఁ జేయుటను బరాభక్తి యందురు.

అయ్యా! మనస్సునునది యొకదర్పణంబునకు సాటి చేయవచ్చును. దర్పణమందు మూలవస్తువు ప్రతిఫలించును. అట్లు ప్రతిఫలించిన ప్రతి బింబంబును జూచునప్పుడు మూలవస్తువువంక మనస్సు తిరుగదు. మూల వస్తువును జూచునప్పుడు దర్పణమందలి ప్రతిబింబము గానరాదు. అట్లే మనస్సు భగవత్పరమైనప్పుడు భగవద్విలాసమైన ప్రపంచము గానరాదు. భగవద్విలాసంబును జూచునప్పుడు భగవంతుఁడు గానరాఁడు. భగవద్వి లాసము క్షణక్షణపరిణామంబులతోఁ గూడి శాశ్వతైకరూపంబు లేకుం డును గావున, అట్టిదాని నాశ్రయించినప్పుడు మనస్సునకుఁ గూడ నట్టి గతులే గలుగుచుండు. అందువలన క్షణికానందకరమైన ప్రపంచంబును మాని శాశ్వతానందకరమైన భగవన్మూర్తి నాశ్రయింపనగు నని తాత్పర్యము' అని తెలిపెను.

రాజా! రహూగణుఁ డావచనంబులు విని 'స్వామీ! నీవు పరమేశ్వరావతారస్వరూపుఁడవు గాని యేతన్మాత్రుఁడవు గావు. ఆత్మా నందప్రకాశకుఁడవు గావున నీయందు దేహాభిమానం బావంతయు గలుగదు. ఈ బ్రాహ్మణవేషంబునఁ జరించుట యేలకో యూహింపరాదు. ఇదే నీకు సాష్టాంగప్రణామము. ఇతోధికము చేయఁజాలను. జ్వరగ్రస్తు లకు శీతలౌషధంబువలె, గ్రీష్మసంతప్తులకుఁ బన్నీరు క్రియ, దేహాభిమాన సర్పదష్టుఁ నగు నాకు మీావచనంబు లమృతంబగు.

స్వామీ! అధ్యాత్మయోగతత్త్వంబునుగూర్చి బోధించితివి. నా మందమతి మీాతాత్పర్యంబును గ్రహింపఁజాలకున్నది. బరువులు మోచుట

నడచుట మున్నగు వ్యాపారంబులెల్ల దేహమూలంబున జరుగుచున్నవి. భారవహనగమనాది క్రియలవలన నాయాసాదులు గలుగుట యెల్లరకు స్వానుభవసిద్ధము. అట్టి యనుభవస్థిరవిషయంబులుగూడ మిథ్య లంటివి. నీభావంబు తేటపడదు. నాసంశయమును దీర్చి నన్నుఁ గృతార్థునిఁజేయ వేఁడుదు' ననెను.

రాజా! అవధూత వానిసంశయంబులు విని 'అయ్యా! ఏదేది కంటికిఁ గాన్పించునో యది రూపంబుఁ గలిగియుండును. ఆరూపంబులను దేహంబు లందురు. తాయిమొదలు మనుష్యులవఱకు దేహంబులు గలవు. ఆదేహంబులలోఁ గొన్ని చలనాదులు గలవిగాను, కొన్ని చలనాదులు లేనివిగా నుండు. చలనాదులు లేనివానిని జడంబు లనియుఁ, జలనాదులు గలవానిని జరంబు లనియుఁ బల్కుదురు. జీవరాశి మఱలఁ జరంబు లనియు స్థిరంబు లనియు రెండువిధంబులు. వృక్షాదులు స్థిరవర్గంబునకును, బశుపక్షిసరీసృపమనుష్యాదులు చరవర్గంబునకు సంబంధించును.

ఈ జడజీవభేదంబన్ననో కేవలం బుపాధినేపట్టి కలుగలేదు. ఉపాధుల చలనాదివ్యాపారంబులఁబట్టి కలుగుచున్నది. ఈ చలనాదులు నిమిత్తవిశేషంబు లగును. ఉపాధు లన్ననో పార్థివంబులు అనఁగా బృథ్వీతత్వమయంబులై యుండును. అవి మట్టిలోఁ బుట్టి మట్టిలోఁ బెరిఁగి మట్టిలోనే తుదకుఁ గలయుచున్నవి. అన్నిటియం దున్నది మన్నేగాని వేఱుగాదు. ఆదేహంబులకు వానిరూపచలనాదివ్యాపారంబులఁబట్టి నామభేదంబు గలుగుచున్నది. ఈనామభేదంబులను బట్టికొని యూఁగులాడుచు మూలవస్తువును మఱచుచున్నారు.

'అయ్యా! దేహంబులకు భారవహనాది వ్యాపారంబులవలన నాయాసంబు గలుగుచున్న దనియు, నట్లు గలుగుట స్వానుభవసిద్ధమనియుఁ దెలిపితివి. ఈదేహంబునందుఁ బాదాద్యవయవంబులు పెక్కు గలవుగదా! నీచెప్పినయాయాసం బీయవయవంబులలో దేనికిఁ గలుగు

చున్నది? నడచునప్పుడు పాదంబులకును, బరువు మోచునప్పుడు భుజంబులకును శ్రమ గలుగుచున్నదని నిరూపింతువా? అయ్యా! ఆయాసంబును జెప్పునప్పుడు నా కాళ్ళకనియు నా భుజంబులకనియుఁ జెప్పుదురుగదా. దాని భావమేమి? నేను అనుపదార్థం బొకటి యుండుటయు, ఈ యవయంబులెల్లఁ దత్సంబంధంబు లగుటయు నేర్పడుచున్నది. మఱియు ఆ 'నేను' అనుపదార్థమే లేనిచో అయ్యవయవాయాసభావంబు జనించుటకే యవకాశము లేదనిగూడ సిద్ధమగుచున్నది. ఆ 'నేను' అనుపదార్థ మేది? అది దేహంబుగా నేరదు. ఏలయందువా? నా దేహం బనుచున్నాముగాని, నేను దేహ మనుటలేదుగదా! ఈసంగతి యటుండనిమ్ము; పల్లకి సంగతి విచారింతము.

పల్లకి పార్థివంబగును. దానిని మోచునది యేది? దేహము. అదియుఁ బ్రార్థివంబే యగును. పల్లకీలో నున్నది యేది? ఒక దేహము. అదియుఁ బ్రార్థివమే యగు. పల్లకియు దానిని మోచు దేహంబును, పల్లకీలో నున్న దేహంబును మూఁడును బార్థివంబులే గావున, నవి జడంబులగు జడంబులకు సుఖదుఃఖభావం బెందున్నది? సౌవీరపతియైన రహూగణుఁడు పల్లకీలో నున్నాడందువా? రహూగణుఁ డనుపేరు నీదేహంబునకే గాని నీదేహంబులోనున్న 'నేను' అనుపదార్థమునకుఁ గాదుగదా. సంగతి యిట్లుండఁగా 'నేను' అను భావంబును అజ్ఞానవశంబున రహూగణనామక దేహంబునందు నారోపించితివి. దానితోడ దుర్మదాంధత్వంబు నీకన్నుఁ గప్పెను; తత్ఫలంబుగా దయాదాక్షిణ్యంబులు వలసపోయెను; దీనులనుబట్టి వెట్టిపనులకు నియోగించితివి. ఈపని జనపరిపాలనం బనుచుఁ బొగడికొందువు. జ్ఞాను లిది మెత్తురా?'

అయ్యా! నిప్పుమీఁది నీటిగిన్నె సాదృశ్యమును జెప్పితివి. భారవహనాద్యాయాసంబులు పై యవయవమునుండి దానిలోని యవయంబునకు వ్యాపించుచుఁ బోవునని నీభావంబు గాఁబోలు! దేహంబంతయుఁ

బృథ్వీవికారం బగును; పృథ్వియన్ననో యసత్పదార్థమేగాని సత్పదార్థంబు గాదు. పృథ్వి యనునది పరమాణుసంయోగంబున నేర్పడుననియు, ఆపరమాణువులు నిత్యమైనసత్పదార్థం బగుననియు, క్లేశాదికంబు తత్పరమాణువులకుఁ గలుగుచున్న దనియుఁ జెప్పుదువా? ఈ యణుకవాదము కేవల యుక్తివాదమే గాని సత్యము గాదు. ఒక్కమాట వినుము. పృథ్వి జడమన్నప్పుడు పృథ్విగా నేర్పడిన పరమాణువులుగూడ జడములే యగుఁగదా! అణువులు చైతన్యాత్మకములందువా? ఆపక్షంబున వానిసంయోగఫలమైన పృథ్వియుఁ జైతన్యాత్మకమే యగును. పృథ్వి జడమని మున్నే నిశ్చయింపఁబడెను. కావున నీ తలంచిన వాదము నిలువదు. మఱియు నీయభిమానం బెప్పుడు దేహమువంక మఱలునో, యప్పుడు మాత్రమే దేహబాధ నీకు గలుగుచున్నది. అభిమానము లేనప్పు డాబాధ నీకుఁ దెలియుటలేదు. ఈ రహస్యంబునుగూడ గ్రహింపుము.

మఱియు దేహాంతర్గతుఁడైన యాత్ముఁడు నిర్వికారుఁడు, నిస్సంగుఁడు, జ్యోతిస్స్వరూపుఁడు నగును. నిర్వికారునకు దేహవికారంబు లంటవు. నిస్సంగునకు దేహముతో సంబంధ ముండదు. జ్యోతిస్స్వరూపుఁడు గావున సర్వముఁ దత్ప్రకాశితమై వెలుఁగును. అగ్నిచేత మండింపఁబడుచున్న పదార్థం బయ్యగ్నికిఁ దాపము గలిగింపనేర్చునా? ఆత్మసాన్నిధ్యంబున వ్యవహరించు దేహావయవంబుల తాపాదు లాత్మకుఁ గేవల జ్యోతిరూపమైన దానికిఁ దగులనేరవు గదా.

అయ్యా! సృష్టియెల్ల మాయావిలాసం బగును. ఆవిలాసంబు ద్రవ్య సభావాశయ కాలంబుల రూపంబునఁ గాన్పించుచుండును. వాని వలన స్థూలత్వ కృశత్వంబులును, అణుత్వ బృహత్వంబులును, సత్త్వాసత్త్వంబులును, చేతనత్వాచేతనత్వంబులు ననెడి ద్వైతవ్యవహారం బెల్లఁ గలుగుచున్నది. ఆవ్యవహారంబులు త్రికాలబాధితంబులు గావున సత్యం

బులు గావు. అట్టి యసద్వస్తువులతోఁగూడి యేర్పడిన ప్రపంచంబు మిథ్యయగుట తప్పదు. ఈ సంగతి గట్టిగా గ్రహింపుము.

సత్పదార్థ మేది?

సత్పదార్థమేది? యని యడుగుదువా! ఏది త్రికాలబాధితము గాక యేకరూపంబున నుండునో, యదియొక్కటే సత్పదార్థం బగును. ఆదృష్టితో విమర్శించినచో జ్ఞానంబొక్కటే సత్పదార్థం బగును. జ్ఞాన సత్యత్వము వ్యావహారికమా? లేక, పారమార్థికమా? అని శంకింతువా! వ్యావహారికసత్యత్వము అశుద్ధము సద్వితీయము, బాహ్యాంతరసహితము, పరిచ్ఛిన్నము, విషయాకారము, సవికారము నై యుండును. పారమార్థికసత్యత్వము శుద్ధము, అద్వితీయము, బాహ్యాభ్యంతరశూన్యము, పూర్ణము, నిర్విషయము, నిర్వికారంబు నగును. ఈలక్షణంబులఁబట్టి పరిశీలించినచో జ్ఞానసత్యత్వము పారమార్థిక మని స్పష్టపడును. ఆజ్ఞానమునే పరమాత్మయనియు, పరబ్రహ్మ మనియు, భగవంతుఁ డనియు, వాసుదేవుఁ డనియు వివిధనామంబులఁ బేర్కొందురు. జ్ఞానమనునది సద్వస్తువునకు స్వరూపలక్షణం బగును. ఆలక్షణంబునే యావస్తువునకుం బేరుగా గ్రహింతురు. వేఱొకమార్గంబున దానిని బేర్కొన సాధ్యము గాదు.

జ్ఞానము నిత్యప్రాప్తము

రఘూగణా! ఈజ్ఞానంబును బడయుట యెట్లందువా? ఈజ్ఞానము నిత్యప్రాప్తము. దానిని గ్రొత్తగాఁ బడయ నవసరములేదు. అది నిత్యప్రాప్తమైనను దాని నజ్ఞానావరణంబు చుట్టియుండును. అయ్యావరణంబు తొలంగినంతనే జ్ఞానము స్వతఃప్రకాశమాన మగును.

అజ్ఞానావరణ నివారణము

అజ్ఞానావరణంబు తొలంగుట యెట్లందువా? అయ్యావరణంబు తొలంగుటకై తపోవ్రతంబులు, యజ్ఞదానపరోపకారంబులు, వేదాధ్యయన జలాగ్నిసూర్యోపాసనంబులు సాధనంబులుగాఁ జెప్పుదురు గాని,

వానివలన ఫలము గలుగదు. ఫలకారిరైయైన సాధనం బెద్ది యందువా? మహాత్ములసేవయొక్కటే సకలావరణంబులను హారించును. అదెట్లందువా? మహాత్ములు భగవత్కథాకీర్తనంబులు గావించుచుందురు. ఆకథాకీర్తనంబులు ప్రస్తావవశంబుననేని చెవి సోఁకినచో, గ్రామ్యకథారుచి సన్నగిల్లును; వాసుదేవునివంకకు బుద్ధి మరలును. ఎప్పుడు బుద్ధి వాసుదేవముఖమగునో యప్పుడు తత్ప్రకాశము సర్వాంతరాయంబులఁ బటాపంచలు చేయును. తత్త్వము గోచరంబగును. అట్లగుటయే జ్ఞానోదయం బనఁబడును.

### అవధూతచరిత్రము

ఇందులకు నిదర్శనంబు వలయునా? నా చరిత్రయే యీసంగతిని స్పష్టీకరించును. నేను తొల్లి భరతుఁ డనుపేర రాజుగానుండి సర్వసంగంబులను వదలి భగవంతు నారాధించుచుంటిని. నా కొకనాఁడు మృగశిశురక్షణరూపసంగమంబు గలిగెను. తత్ఫలంబుగాఁ బరమార్థంబును గోల్పోవుటయేగాక మృగంబుగా జనించుటయు నయ్యెను. అయినను నా చేసిన భగవదారాధనప్రభావంబునఁ బూర్వస్మృతి యుండి, యామృగజన్మంబునఁగూడ భగవద్భక్తిని వదలనైతిని. ఏ కర్మఫలానుభవార్థము నాకు మృగశరీరము వచ్చెనో, యాకర్మఫలంబు భుక్తమైనంతనే యాశరీరము పతనమయ్యెను. ఇప్పు డీజన్మం బెత్తి జనసంగంబునకు నోడి నిగూఢంబుగాఁ జరించుచుందును. న న్నిప్పుడు జడభరతుఁ డందురు.

రహూగణా! నీ వెవ్వండ వని యడిగిన ప్రశ్నకు జవాబు చెప్పితిని. జ్ఞానప్రాప్తి యనునది ప్రాప్తప్రాప్తి యగుటఁ దెలిపితిని. జ్ఞానప్రాప్తియన్నను ముక్తియన్న నొక్కటే యగు. ఎట్లందువా? బంధము తొలఁగుట ముక్తియగు. అజ్ఞానావరణమే బంధము. అది తొలఁగినప్పుడు జ్ఞానము (ముక్తి) స్వతస్సిద్ధమగుచున్నది.

అజ్ఞానావరణము అభిమానరూపంబున నుండు. అభిమానంబున మోహము జనించుచున్నది. మొట్టమొదట దానిని ఛేదింపవలయును.

స్మృతిలాభంబునఁ గాని మోహవిచ్ఛేదము గాదు. స్మృతిలాభము సత్పురుషసేవాపూర్వకహరికథాకర్ణనాదులవలనఁ గలుగును. స్మృతిలాభంబును బడసి యజ్ఞానరూపసంసారసాగరంబును దాఁటనగును. భగవత్పద ప్రాప్తియు సంసారసాగరతరణంబు నేకకాలంబుననే సంప్రాప్తము లగుచున్నవి.

### సంసారమహారణ్యావర్ణనము

'రహూగణా! సంసారంబును మహారణ్యంబునకు సాటిచేయ వచ్చును. బేహారులబిడారు ధనార్జనంబునకుఁగాఁ గీకారణ్యంబును బ్రవేశించుపగిది, జీవకోటి సుఖార్థము సంసారంబును జొచ్చుచుండును. ఈసంసారారణ్యమందుఁ గామము క్రోధము మోహము మదము మాత్సర్యము అహంకారము అనునట్టి పెనుదొంగలు పొంచియుందురు. ఆదొంగలను బుద్ధి యనునాయకుఁడు నడపించుచుండును. వారు తన్నాయకప్రేరితులై జీవులను బిడారు సంసారారణ్యము దూఱి దూఱి సంపాదించునట్టి సుఖమనెడి ధనంబును గొల్లగొట్టుచుందురు.

మఱియు నయ్యరణ్యమందు దారపుత్రాదు లనెడి నక్కలు దిరుగాడుచుఁ, గొల్లపోఁగా మిగిలిన సుఖధనంబును దోఁడేళ్లు గొఱియలనట్లు హరించుచుండును. ఆకాననంబు కామకర్మాదులనెడి తృణలతాగుల్మంబులతోఁ నిండి చొఱరాక దుర్జనులనెడి మశకమక్షికాదులవలని బాధతోఁ గూడియుండును. ఆవనాంతరంబున విహరించునప్పు డందందు నఘటన దేహాదిరూపగంధర్వనగరంబులు గాన్పించుచుండును.. అందు సువర్ణ మనెడి కొఱవిదయ్యము వెన్నాడి తిరుగుచుండును.

జీవులబిడారు గృహధనదేహాదులందు స్వాత్మాభిమానం బుంచి యయ్యడవిలోఁ జనునప్పు డొకొక్కయెడ స్త్రీరూపఝంఝానిలంబు వీచును. ఆ సుడిగాలివడికిఁ గోరిక లనెడి రేణువులు చెలరేఁగి కప్పివైచును. అట్లు దుమ్ము గప్పుటం జేసి కన్నులు మూఁతపడి కర్మసాక్షి

దేవత లనెడి దిక్కులఁ గానక దారితప్పి చరించు టగు. అట్లు తిరుగాడు నప్పు డొక్కొకవేళఁ గొండీడు లనెడి నల్లపురువులు చెవిఁ గఱచుటయుఁ, బ్రల్లదు లనెడి గూబలరొద బాధకరంబగుటయు సంభవించును. ఆ బిడారు దాహదీనమై యెండమావుల వెంటఁ బఱచిపఱచి డస్సి యధర్మ వృక్షంబుల నీడలకుఁ బ్రాఁకుటయుఁ, భాషండమతంబు లనెడి నిర్జల నదులు చొచ్చి దేబెరించుటయు, దుఃఖాత్మక గృహదావాగ్నిఁ బడి పరి తపించుటయు, రాజులనెడి యక్షులచేతఁ జిక్కి ధనంబనెడి ప్రాణంబును గోల్పోయి నిర్వేద మందుటయు, సాహసికులు ముట్టగించి సర్వము నిట్టనిలువున దోపిడిచేయఁగా, నిర్విణ్ణులై శోకమోహమూర్ఛావశులగు టయుఁ బ్రాప్తంబగుచుండును. ఆబిడా రట్టిబాధల నెట్లో తప్పించికొని తుదకు మనోరథమాత్ర పితృపుత్రాదిసౌఖ్యరూపనగరంబుఁ జేరి, యట ముహూర్తకాలము నిర్వృతులవలె మోదంబునొంది, యంతలోన బహిర్గతులై యసాధ్యంబులనెడి నునుకొండలపయికిఁ బ్రాఁకఁ బ్రారం భించును. ఆమార్గము విఘ్నంబులనెడి ముండ్లతోను గఱకురాళ్ల తోను నిండి యాబాటసారుల పాదంబులఁ గ్రుచ్చుకొనును. ఆనొప్పికి వారు విమనస్కులగుదురు. అంతలోన జఠరాగ్ని రేఁగి దుస్సహమగును. కుటుంబభరము దుర్భరమగును. తత్ఫలముగా విసువు జనించును. వారు దానిని లోలోన నడంచికొననేరక జనులపయిఁ జూపుదురు. అంతలోన నిద్రయనెడి యజగరంబు వారిని మ్రింగఁజొచ్చును. అప్పుడు బంధుపుత్రాదులెల్లరు వారికి దవ్వగుదురు. దుష్టు లనెడి దందశూకంబులు గఱచును. దిక్కుదోఁపక వారు మోహంబనెడి మోహాంధకూపంబునఁ బడుదురు.

అట్లు పడియుఁ గంటికిఁ గానవచ్చు పరస్త్రీరూపక్షుద్రరసంబులకై యఱ్ఱు చాతురు. అప్పుడు పరస్త్రీస్వాములనెడి జుంటీఁగలు వారిని గఱ చును. ఆబాధ నెట్లో యోర్చి యీప్సితంబు నెట్లో ఛాయామాత్రంబు పడయుదురు. అంతలోఁ లాఁతిబలవంతులు పైకొని యారవంతలాభం

బును హరింతురు. అట్లు నష్టులై గోడుగోడుమందురు. అంతట నేనియు వారు తమయడియాసలు విడువరు. ఆత్మసుఖార్థంబు పరద్రవ్యంబుల మీఁద నాసచేయుదురు. వారికి నెట్టకేలకు నాశాభంగమేగాక యవ మానంబుగూడ గలుగును; విరోధంబులు పెరుఁగును. అట్లు ధనహీను లును స్థానభ్రష్టులును సహాయరహితులును నై వారు మృతప్రాయు లగుదురు. బిడారు వారిని వదలివైచి క్రొత్తవారిని జేర్చికొని తనపని సాగించును. అట్లు సాగించినను సంసారమహారణ్యంబును దాఁటి, యది గంతవ్యస్థానంబు నెన్నఁడుఁ జేరినట్లు గానరాదు.

రహూగణా! ఈయడవిని దాఁటుటకై యొక్కొక్క రొక్కొక్క విధమైన సాధనసామగ్రిని గూర్చికొని పయనము సాగింతురు. ఎట్లందువా? ఒకఁడు స్త్రీ యనెడి లతను దోడుకొని యరణ్యంబు దాఁటఁ గడఁగును. ఆ లతనాశ్రయించియున్న పుత్రులనెడి విహంగంబులు మధురరుతంబులు గావించుచుండును. అతఁ డాధ్వనులను విని తన్మయుఁడగును. ఆస్థితిలో నతఁ డెంత నడచినను గాలము గడచునే గాని దారి జరుగదు. అంతలోఁ గాలచక్రం బనెడి సింహసమూహంబు వానిని దారొక్కొనును. ఒక్కొక్క సారి వానికిఁ గ్రూరపాషండులనెడి ఒక కంక గృధ్రంబులతోఁ జెలిమి వాటిల్లును. ఆపొందు మేలుగాదని యతఁడు గ్రహించి వానిని విడనాడి, బ్రాహ్మణులనెడి హంసకులంబును జేరఁబోవును. ఆహంసలశీలంబు వానికి రుచింపదు. అతఁడు వానిని వదలి యాచారభ్రష్టులైన శూద్రు లనెడి కోఁతులను గూడును. వానికి నక్కోఁతిచేష్టలు రుచించును. వాఁ డాయానందములో మునిఁగి జీవితావధిని మఱచి, కేవలదృష్ట ప్రయోజనంబు లైన గృహంబులనెడి చెట్లమీఁదఁ గ్రీడించుచు, సురతేచ్ఛతోఁ గొంత కాలము పుచ్చును. తత్ఫలముగా నాలుబిడ్డలతోడి సంబంధము దృఢతరం బగును. అతఁడు రాగాదులనెడి కొండలోయ లలోఁ బడును. అచ్చట మృత్యువనెడి మత్తగజము వాని నెదు ర్కొనును. దానిం జూచి యతఁడు భయగ్రస్తుఁడై ప్రాక్తనకర్మంబనెడి

తీఁగను బట్టుకొని వ్రేలాడి యాముప్పు నెట్లో తప్పించికొని యెట్టకేలకు బిడారు చేరును. రాజా! వానిగతి తిరుగుడుకపిలెయెద్దగతి యగునే గాని యొకనాఁటికి నతఁడు గంతవ్యంబును జేరఁడు.

## గంతవ్యప్రాప్తికి సాధనము

'రహూగణా! గంతవ్యంబును జేరవలయు ననెడికోర్కి నీకు నిక్కముగాఁ గలదేని, మొట్టమొదట నిన్నుఁ గొల్చుచున్న దండును విడనాడుము; భూతంబులే నీకు మిత్రంబులుగా గ్రహింపుము; విషయ సంగంబును ద్యజింపుము; హరిసేవచేయుము. భగవత్సేవాఫలంబుగా నీకు జ్ఞానఖడ్గంబు ప్రాప్తంబగును. ఆఖడ్గంబును జేతఁబూని నీవు చనుదారి లోని కంటకాదిగుల్మంబులను ఛేదించుచుఁ బయనము సాగింపుము. ఎట్ట కేలకు గంతవ్యస్థానంబును జేరుదువు. వేఱువెఱవు గలుగదు.'

## రహూగణుఁడు అవధూతను బ్రార్థించుట

రాజా! రహూగణుఁ డాయుపదేశసారంబును సాకల్యంబుగా విని 'మహాత్మా! జీవులు కోటిజన్మంబు లెత్తుదురు. ఎల్లజన్మంబులలో మనుష్యజన్మం బుత్తమంబగు. స్వర్గలోకజన్మంబు మేలుగాదా యని శంకిం తురు. అందలిజన్మము భోగార్థమేగాని పరమార్థసాధనార్థంబు గాదు. ఏలయందురా? పరమార్థమును సాధించుటకు భాగవతమహాత్ములతోడి సమాగమంబు వలయును. అది నరలోకమందు సులభముగా సిద్ధించును; స్వర్గమందు దొరకదు. మీపాదపరాగంబు నాపయి సోఁక నోర్చితిని. నాజన్మము నేఁడు సఫలమయ్యెను. మీబోంట్లచరణధూళి సోఁకినవారికి భగవద్భక్తి గలుగుట వింతగాదు. మీయనుగ్రహంబునం జేసి దుస్తర్క మూలమైన నా యవివేకంబు బలం బుడిగెను. మహాత్మా! అవధూత లిట్టి వారని యెఱుంగరాదు. వారు వృద్ధులుగా నొండె, బాలురుగా నొండెఁ బెద్దలుగా నొండెఁ బిన్నలుగా నొండె వటువులుగా నొండె నుండ వచ్చును. శరీరంబులో నయ్యవధూతత్వము లెఱుంగుట . కేవలం

బుపాధులనుబట్టి యూహింపరాదు; కావున నెల్లరకు నేను బ్రణమిల్లు దును. రాజులు పదవీగర్వాంధులై యుత్తములనవమానించి చేటొందు దురు. అందులకు నేనే నిదర్శనము. రాజులకు నేమం బనుగ్రహింపు' మని ప్రార్థించెను.

పరీక్షిన్నరేంద్రా ! ఆబ్రహ్మర్షికుమారుఁ డట్లు నిజమహానుభావత్వం బును గప్పిపుచ్చి చరించుచుండినను, రహూగణునకు వానిపుణ్యవిశేషం బునఁ దత్సమాగమభాగ్యము లభించెను. ఆమహాత్ముఁడు రహూగణుని విని వానియెడఁ గరుణించి యాత్మతత్త్వంబును వానికి నుపదేశించి నిస్త రంగసాగరంబువలెఁ గాన్పించుచు యథామతిఁ జనియెను.

రహూగణుఁ డట్లు తత్త్వజ్ఞానంబుఁ బడసి యవిద్యారోపితమైన యాత్మాభిమానంబును వదలెను. రాజా ! భాగవతులసేవాప్రభావం బెట్టిదో గ్రహింపుము. నరేంద్రా ! ఈ భరతునిచరిత్రము క్షేమకరంబు నాయుర్వర్ధనము ధన్యము యశస్యంబునై స్వర్గాపవర్గప్రదం బగును. దీనిని విన్నను బఠించినను గొనియాడినను నిఖిలశ్రేయంబులు నప్రయత్నం బుగా నొనఁగూడు ననెను.

## భరతవంశానుక్రమము

### సుమతి

'పరీక్షిన్నరేంద్రా ! ఋషభుని పుత్త్రుఁడైన యా భరతునకు సుమతి యనుపుత్త్రుఁడు జనించి తాతకుసమ్మతమైనట్టి జీవన్ముక్తిమార్గంబు ద్రొక్కెను. ఆ సుమతియే బుద్ధావతారం బని కొందఱుపాషండులు కలియుగంబున భావింతురు. ఆభావము వేదసమ్మతము గాని యార్య సమ్మతముగాని రెండును గానేరదు.

ఆ సుమతికి ధ్రువసేనయందు దేవతాజితుం డనువాఁడు పుట్టెను. దేవతాజితునకు నాసురియందు దేవద్యుమ్నుఁడును, వానికిఁ గేతుమతి యందుఁ బరమేష్ఠి యనువాఁడును, వానికి సువర్చలయందుఁ బ్రతీహుఁ

డును గలిగిరి. ప్రతీహుఁడాత్మవిద్యను బెక్కండ్రకు వివరించుటయే గాక స్వయముగా ననుష్ఠించి యపరోక్షజ్ఞాని యయ్యెను. ప్రతీహునకుఁ బ్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత యను తనయులు మువ్వురు జనించి యజ్ఞకర్మనిపుణులైరి. ప్రతిహర్తకు స్తుతి యనుదానియందు వ్యోముఁడు, భూముఁడు ననుసుతులు పుట్టిరి. భూమునకు ఋషికుల్యయందు ఉద్గీథుఁడు జనించెను. వానికి దేవకుల్యయందుఁ బ్రస్తోత యనువాఁడు గలిగెను. అతనికి వరరుత్సయందు విభుఁ డనువాఁ డుద్భవించెను. వానికి భారతియందుఁ బృథుషేణుఁడు గలిగెను. వానికి నాకూతియందు నక్తుఁడును, వానికి గయుఁడు పుట్టెను.

### గయుని చరిత్ర

రాజా! భరతుఁడు జగద్రక్షాదీక్షితుఁడు గావున వానికళ గయునిరూపంబున నవతరించెను. గయుఁడు దయార్ద్రధర్మబుద్ధితోఁ బ్రజాపరిపాలనం బొనర్చుచు, దుష్టులను శాసించుచుఁ, బరమేశ్వరార్పణంబుగా యజ్ఞాదిసత్కర్మంబులు సేయుచు, రాజర్షిప్రవరుం డనుకీర్తిఁ గాంచెను. మఱియు నతఁడు బ్రహ్మవేత్తలను సేవించి భక్తియోగరహస్యం బెఱిఁగి పరిశుద్ధచిత్తుఁడై దేహాత్మభావంబుఁ బాసి భగవత్తాదాత్మ్యంబు నొందెను. గయునింబోలు బ్రహ్మవిదుండును ధర్మరక్షకుండును శ్రీయుతుండును సాధుసేవకుండును వివిధయజ్వయు సత్సభాపూజ్యుండు నైనరాజు వేఱొక్కఁడు గలుగుట మిక్కిలి యరిది యనవచ్చును. సత్కర్మాచరణంబున వానికి నతఁడే సాటి యనవొప్పెను.

### గయుని ప్రభావము

రాజా! దక్షప్రజాపతికన్యకలు శ్రద్ధామైత్రీదయాప్రముఖలు గయునకు నెంతయు మెచ్చి నదీజలంబుల నతని నభిషేకించి రనుటకన్న వానియాధిక్యతను వేఱ చెప్పవలయునా? అతఁడు నిష్కాముఁడై యున్నను ధాత్రీదేవి వానిగుణంబును వత్సంబుగాఁ గొని చేఁపి, వాని

ప్రజలకు సర్వకామంబులను బిదికెను. మఱియు గయుఁడు కామునిందై నను వానికి వేదంబు లప్రార్థితంబుగా సకలకామంబులను సమకూర్చెను. వానిమాటకు వెఱచి రాజులెల్లరు ధర్మమార్గంబును దప్పరైరి. బ్రాహ్మణులు వారిధర్మంబునందు నాఱవపాలు కప్పంబుగాఁ దమకై తామే వానికి నర్పించిరి. ఇంద్రుఁడు స్వయముగా వచ్చి గయునియజ్ఞంబులందు సోమంబును దిగద్రావి మైమఱచుటయ్యెను. గయుని శ్రద్ధావిశుద్ధభక్తియోగంబునకు భగవానుఁ డెంతయుఁ బ్రీతుఁడై వానిపూజలను మహాసంతోషంబుతో గ్రహించెను. వేయేల? గయునిమహిమంబు పురాణవిదులకు గాథలై లోకమెల్లఁ బ్రాఁకెను.

### గయుని సంతానము

రాజా! గయునకు జయంతియందుఁ జిత్రరథుఁడు, స్వాతి, అవరోధనుఁడు అను పుత్రులు మువ్వురు జనించిరి. చిత్రరథునకుఁ బూర్ణయందు సమ్రాట్టనువాఁడు పుట్టెను. వానికి ఉత్కళయందు మరీచి జనించెను. మరీచికి బిందుమతియందు బిందుమంతుఁడును, భోజయందు మన్యువు ప్రమన్యు వనువారు నుద్భవించిరి. మన్యువునకు సత్యయందు భువనుఁడును, వానికి దోషయందుఁ ద్వష్టయు, వానికి విరోచనయందు విరజుండును బ్రభవించిరి. విరజుఁడు విషూచియందు సత్యజిత్తు మొదలగు కొడుకులు నూర్గురను నొక్కకూఁతును బడసి ప్రియవ్రతువంశంబునకు వన్నెఁగూర్చి నిజయశశ్చంద్రికలను బెద్దయుం దవ్వు పఱపి విబుధస్తవనీయుఁడయ్యెను.

### భూగోళ పరిమాణాదులు

మహర్షులారా! పరీక్షిన్నరేంద్రుఁడు విని శుకయోగిని 'మహాత్మా! ప్రియవ్రతుని చక్రనేమియొక్క రాపిడికి భూమండలంబున సప్తసాగరంబులేర్పడి ధరాతలంబు నేడు ద్వీపంబులుగాఁ విభజించె నని తెల్పితివి. ఎంతదాఁక సూర్యరశ్మి సోఁకునో, ఎంతదాఁక చంద్రతారాగణంబు గాన్పిం

చునో, యెందాఁక భూమండలంబు వ్యాపించియున్న దనిరి. అట్టి భూమండలముయొక్క పరిణామలక్షణంబుల నెఱుంగ నెంతయుఁ గుతూహలం బయ్యెడు. అది యెఱింగిన ఫలం బేమందువా ? భూమండలంబు భగవద్గుణాత్మకస్థూలరూపం బగును. ఆ రూపంబు ప్రత్యక్షగోచరంబు గావున దానియందు మనస్సు ప్రవేశింప నోచనేని, దర్వాత నదియే తనంతట తానే క్రమక్రమంబుగా నిర్గుణంబును సూక్ష్మంబునైన పరబ్రహ్మంబునందుఁ జొఱనేర్చును. పరబ్రహ్మతత్త్వంబు నెఱింగి స్వానుభవసిద్ధము చేసికొనుటయేగదా జన్మఫలము! ఆకారణంబున మిమ్మిట్లు కోరుచున్నా' ననెను.

శుకమహర్షి యాప్రశ్నకు హర్షించి 'రాజేంద్రా! భగవంతుని విభూతివిశేషంబుల నడుగుచున్నావు. వాని మాయావిభూతిస్థానవిశేషంబులకు నియ్యది యంతం బనియు, నియ్యది రూపం బనియు, నియ్యవి లక్షణంబు లనియు సహస్రదివ్యవర్షంబు లూహించినను బుద్ధికిఁ గూడ నందవు. ఇఁక మాటసంగతి చెప్పనేల ? అయినను నీకోరికను రిత్తపుచ్చరాదు గావున, భూగోళమండలి ప్రధానవిషయంబులను సూచింతుఁగాక!'.

### సప్తద్వీప సప్తసాగరములు

ఆ చక్రనేమి తిరుగునప్పుడు మొట్టమొదటి రాపిడికి విభాగమైన భూభాగంబును జంబూద్వీప మందురు. అది భూగోళంబునకు మధ్యద్వీపం బగును. ఆద్వీపము లక్షయోజనంబుల విస్తీర్ణము. దానిని జుట్టి యేర్పడిన గర్తంబును క్షారోదం బందురు. దానికి లవణసముద్ర మను నామాంతరముగూడఁ గలదు. ఆ సముద్రవిస్తీర్ణముగూడ లక్షయోజనంబులు. ఆలవణసముద్రంబును జుట్టియున్న భూభాగంబును ప్లక్షద్వీప మందురు. దానివిస్తీర్ణము రెండులక్షలయోజనంబులు. ప్లక్షద్వీపంబును జుట్టి యేర్పడిన గర్తంబు ఇక్షుసముద్ర మనఁబడును. దానివిస్తీర్ణము

రెండులక్షల యోజనంబులు. ఇక్షుసముద్రంబును జుట్టి యేర్పడినభూభాగము శాల్మలీద్వీపం బనఁబడును. దానివిస్తీర్ణము నాలుగులక్షల యోజనంబులు. శాల్మలీద్వీపంబునుజుట్టి యేర్పడిన గర్తంబు సురాసముద్ర మనఁబడును. దానివిస్తీర్ణము నాలుగులక్షల యోజనంబులు. సురాసముద్రంబునుజుట్టి యేర్పడిన భూభాగంబు కుశద్వీపం బనఁబడును. దాని విస్తీర్ణము ఎనిమిదిలక్షల యోజనంబులు. దానిని జుట్టి యేర్పడిన గర్తంబు ఘృతసముద్ర మనఁబడును. దానివిస్తీర్ణం బెనిమిదిలక్షల యోజనంబులు. ఘృతసముద్రంబును జుట్టి యేర్పడిన భూభాగంబు క్రౌంచద్వీపం బనఁబడును. దాని విస్తీర్ణము పదునాఱులక్షల యోజనంబులు. క్రౌంచద్వీపంబును జుట్టి యేర్పడిన గర్తంబు దధిసముద్ర మనఁబడును. దధిసముద్రంబును జుట్టి యేర్పడిన భూభాగము శాకద్వీప మనఁబడును. దాని విస్తీర్ణము ముప్పదిరెండులక్షల యోజనంబులు. దానిని జుట్టి యేర్పడిన గర్తంబు క్షీరసాగరం బనఁబడును. అదియు ముప్పదిరెండులక్షల యోజనంబుల విస్తీర్ణము గలిగియుండును. క్షీరసాగరంబును జుట్టి పుష్కరద్వీపం బఱువదినాల్గులక్షల యోజనంబుల విస్తీర్ణముగలది యున్నది. దానినిజుట్టి స్వాదూదకసముద్రం బంతవిస్తీర్ణము గలది యున్నది.

భూమండలంబు మొత్తముమీఁదఁ గోటియిరువదియేడులక్షలు యోజనంబుల విస్తీర్ణము గల భూభాగంబుతోను, అంతవిస్తీర్ణముగల జలభాగముతోఁ గూడియున్నది. భూ జలభాగంబులు రెండును గలిసి రెండుకోట్లు ఏఁబదినాల్గులక్షలు యోజనంబుల విస్తీర్ణమగును.

రాజేంద్రా! స్వాదూదసముద్రంబును జుట్టి యేమి యున్నదందువా? లోకాలోక పర్వతం బుండును. కంటికిఁ గాన్పించునది లోకంబును, కాన్పింపనిది అలోకంబు నగును. ఆపర్వతము దృశ్యాదృశ్యంబుల రెంటి మధ్య నిలిచి రెంటిని వేర్వేఱు చేయుచున్నది గాన, దానికి లోకాలోక పర్వతం బని పేరువచ్చెను. ఆపర్వతముయొక్క యవ్వలిభాగం బగోచరంబు.

### జంబూద్వీపము

భూమధ్యభాగమం దేర్పడిన ద్వీపమునందు నొక్క మహాజంబు వృక్షము గలదు. ఆవృక్షంబునుబట్టి యాద్వీపంబునకు జంబూద్వీప మనుపేరు వచ్చెను.

### జంబూద్వీపకులగిరులు

జంబూద్వీపంబునకు మధ్యభాగంబున మేరుపర్వతం బున్నది. దానికి నుత్తరంబున నీలపర్వతంబును, దానికి నుత్తరంబున శ్వేతపర్వతంబును, దానికి నుత్తరంబున శృంగపర్వతంబును గలవు. అట్లే మేరుపర్వతంబునకు దక్షిణంబున నిషధపర్వతంబును, దానికి దక్షిణంబున హేమకూటంబును, దానికి దక్షిణంబున హిమాచలంబు నున్నవి.

### జంబూద్వీప నవఖండములు

జంబూద్వీప నవఖండములలో మధ్యభాగమున మేరుపర్వతం బున్నదని తెలిపితిని. ఆపర్వతం బున్న భాగము 1. ఇలావృతవర్ష మనఁ బడును. ఆప్రదేశం బుత్తరంబున నీలపర్వతమువఱకును దక్షిణంబున నిషధపర్వతంబువఱకును వ్యాపించియుండు. నీలపర్వతంబునకును శ్వేత పర్వతంబునకును మధ్యనున్న ప్రదేశము 2. రమ్యకవర్ష మనఁబడును. శ్వేతపర్వతంబునకును శృంగపర్వతంబునకును మధ్యనున్న ప్రదేశము 3. హిరణ్మయవర్ష మనఁబడును. శృంగపర్వతంబునకు నుత్తరభాగము లవణసముద్రమువఱకు నున్నది 4. కురువర్ష మనఁబడును. అట్లే నిషధ పర్వతంబునకును హేమకూటంబునకును మధ్యనున్న ప్రదేశంబు 5. హరివర్షం బనియు, హేమకూటంబునకును హిమాచలంబునకును మధ్యనున్న ప్రదేశము 6. కింపురుషవర్ష మనియు, హిమాచలంబునకును దక్షిణపార్శ్వ లవణసముద్రంబునకును మధ్యనున్న ప్రదేశము 7. భారతవర్షం బనియుఁ బిలువఁబడును.

నీలపర్వతంబును గడిసి దానికిఁ బశ్చిమభాగంబున మాల్యవంత పర్వతము గలదు. మాల్యవంతంబునకు నవ్వలిభాగము కేతుమాలవర్ష మనఁబడును. నిషధపర్వతంబునంటి దానికిఁ దూర్పుభాగమున గంధ మాదనపర్వతము గలదు. దానికి నంటియుండు ప్రదేశంబును భద్రాశ్వ వర్ష మనిరి. ఇట్లు నవఖండంబు లేర్పడెను.

### పర్వతంబుల విస్తీర్ణాదులు

మేరుగిరికి నుత్తరపార్శ్వంబునున్న నీల శ్వేతశృంగపర్వతంబులు మూఁడును దూర్పుదెసకు రెండువేల యోజనంబులు సాగి లవణాబ్ధిని దాఁకు చుండును. ఆ మూఁడింటిలో నీలపర్వతంబునకంటె శ్వేతపర్వతం బును, దానికంటె శృంగపర్వతంబును నిడుపులో దశాంశమునకన్నఁ గొంచెము హెచ్చుగాఁ దగ్గియుండును. మేరుపర్వతంబునకు దక్షిణభాగం బుననున్న నిషధాదిగిరులుగూడఁ దూర్పుదెస నిడుదలై పదివేల యోజనం బుల పొడువు గలిగియుండును. మాల్యవంతమును గంధమాదనంబు నొక్కొక్కటి పదివేల యోజనంబుల యాయామము గలిగియుండును.

### మేరుపర్వతము

రాజేంద్రా! మేరుపర్వతము కనకమయమై కులగిరులకు రాజగుచు భూమండలపద్మంబునకుఁ గర్ణికయో యన నొప్పారును. ఆపర్వతంబు లక్ష యోజనంబుల యెత్తు; అందులోఁ బదునాఱువేల యోజనంబులు భూమిలోనికిఁ గ్రాఁకియుండును. భూమిమీఁద నయ్యది యెనుబది నాలుగువేల యోజంబుల పొడవును బదునాఱువేల యోజనంబుల తనర్పునై గాన్పించును. ఆ గిరిశిరోభాగము ముప్పదిరెండు యోజనంబుల వెడల్పు గలిగియుండును.

### ఉపపర్వతములు

మేరుగిరికిఁ దూర్పున 1. మందరపర్వతంబును, దక్షిణంబున 2. మేరుమందరపర్వతంబును; పడమటిభాగంబున 3. సుపార్శ్వపర్వతం

బును, ఉత్తరదిశయందుఁ 4. కుముదపర్వతంబును నిలిచి యొక్కొక్కటి పదివేలయోజనంబుల పొడవు నంతియ తనర్పుఁ గలిగి యమ్మేరువునకు నూఁతకట్టిలో యన నొప్పుచుండును. అందు మందరశిఖరంబునఁ జూత వృక్షంబును, మేరుమందర శిఖరంబున జంబూవృక్షంబును, సుపార్శ్వ శిఖరంబునఁ గదంబవృక్షంబును, కుముదశిఖరంబున వటవృక్షంబును గలవు. ఆవృక్షంబు లొక్కొక్కటియుఁ బదునొకండుపందల యోజనంబుల యెత్తు నంతవెడల్పు గలిగి శాఖోపశాఖలతోఁ బఱచి యాగిరులకు నెత్తిన టెక్కెంబులో యన నొప్పారును.

### క్షీరాది తటాకంబులు

ఆ పర్వతశిఖరంబులందు గొప్పమడువులు నూఱుయోజనములవిస్తీర్ణము గలిగియుండును. వానిలో నొకటి పాలతోను, ఒకటి తేనెతోను, ఒకటి చెఱకురసంబుతోను, ఒకటి తేఁటనీటితోను నిండి యుబుకులాడుచునుండును. ఉపదేవగణంబు లా క్షీరాదులఁ ద్రావి యోగైశ్వరాదులఁ బడయుచుందురు.

### నందనాది వనంబులు

అచ్చట నందనము, చైత్రరథము, వైభ్రాజికము, విశ్వతోభద్రము అను దేవోద్యానంబులు నాల్గు గలవు. వేల్పులు వారిప్రియకాంతలతోడ నవ్వనవిహారంబుల నానందించుచుందురు. ఆవిహారసమయంబులందు నచ్చట సిద్ధగంధర్వాదుల సంగీతాదులు చెవులకు విందుఁ గూర్చుచుండును.

### అరుణోదప్రవాహము

మందరగిరినెత్తమ్మున నున్న చూతవృక్షాగ్రమునుండి యమృతమధురంబులైన ఫలంబులు గిరిశిఖరంబులంత పెద్దవి పండి రాలి పగిలి రసంబులఁ గ్రమ్మరించుచుండును. ఆరసంబులు గూడి యేఱై యిలావృతవర్షంబునఁ దూర్పుముఖముగాఁ బ్రవహించుచుండును. చూతరసం

బరుణాంబుగావున నయ్యేటికి నరుణోదం బనుపేరు గలిగెను. అటకుఁ బార్వతీపరిచారికలైన దేవవనితలు వచ్చి యాజలంబును సేవించి పోవు చుందురు. అట్లు వారు చనునప్పుడు తజ్జలదివ్యవాసనలను వారి శరీరం బులనుండి లలితమారుతంబులు గొనిపోయి చుట్టుప్రక్కలఁ బదియోజ నంబుల పర్యంతము పఱచును.

## జంబూనది

మేరుమందరశిఖరంబున మహాజంబూవృక్షము గలదు. ఆవృక్ష ఫలంబులు గజప్రమాణముగా నుండును. ఆపండ్లు రాలినప్పుడు తద్రస ములు కూడి జంబూనది పేరఁ బాఱి క్రిందికిఁ దిగి యిలావృతవర్షము యొక్క దక్షిణభాగంబునఁ బ్రవహించును. ఆయేటి యిఱుదరులనున్న మన్ను తజ్జంబూఫలరసంబునఁ దడిసి మాగి వాతార్కపుటపాకంబు నొంది సువర్ణం బగును. అది జంబూనదీరసంబునఁ గలుగుటంజేసి దానిని జాంబూనదం బందురు. ఆసువర్ణంబును దేవతాదులు గొనివచ్చి, కటకకటీ సూత్రమకుటాది భూషణంబులుగా నిర్మించి ధరింతురు.

## పంచముఖి

సుపార్శ్వగిరినెత్తంబున గొప్ప కదంబవృక్షంబు గలదు. ఆవృక్ష వివరంబునుండి రైదుమధుధారలు పంచముఖంబుల వెడలి తన్నగశృంగం బులం బడి కూడి యిలావృతవర్షపశ్చిమభాగంబును దడుపుచుఁ బ్రవహిం చును. ఆ తేనియలను మహాప్రీతితోఁ గ్రోలుదురు. వారిముఖంబులనుండి కమ్మని వాసనలు వెడలి మారుతానీతములై నూఱుయోజనంబులు వ్యాపించుచుండును.

## శతవల్కజాతనదంబులు

కుముదపర్వతశిఖరంబున వటవృక్షము గలదని చెప్పితిని. ఆవృక్షం బును శతవల్క మందురు. దానిస్కంధమునుండి పెన్నదంబులు వెడలి క్రిందికిఁ బాఱుచుఁ బయోదధిఘృతమధుగుడాన్నంబులను, వస్త్రశయ

నాసనాది సమస్తవస్తుసామగ్రిని గోరినవారికిఁ గోరినంతఁ గూర్చుచు, నిలావృతవర్షంబునకు నుత్తరదిశఁ బ్రవహించును. ఆ నదీజలంబులను సేవించినవారికి మేన ముడతలు గలుగవు; వెండ్రుకలు నరియవు; చెమట వాసనలు పుట్టవు; శ్రమ గలుగదు; ఆధివ్యాధులుగాని శీతోష్ణవివర్ణతలు గాని జరామరణంబులుగాని చేరరావు. వారు యావజ్జీవమునిరతిశయసుఖ జీవులై యుందురు.

## మేరుపరిసరపర్వతంబులు

మేరుపర్వతంబునకుఁ గ్రిందిభాగంబున నలువలంకులఁ గురంగ, కురర, కుసుంభ, వైకంకత, త్రికూట, శిశిర, పతంగ, రుచక, నిషధ, శితివాస, కపిల, శంఖ, చారు, విహంగ, ఋషభ, నాగ, కాలాంజన, నారదాది గిరులు పద్మకర్ణికకుఁ గేసరంబులువలె, నయ్యచలంబునకు నొప్పారుచుండును. మేరుగిరికిఁ దూర్పుభాగంబున జఠరదేవకూటంబులును, దక్షిణభాగంబునఁ గైలాసకరవీరంబులును, బశ్చిమంబునఁ బవనపారియాత్రంబులును, నుత్తరంబునఁద్రిశృంగమకరంబులును నిల్చి యమ్మేరుభారంబును మోయుదిగ్గజంబులో యన నుండును. అందు జఠరదేవకూట పవనపారియాత్రంబులు నాల్గు దక్షిణోత్తరంబులుగా నుండును. అవి యొక్కొక్కటి పదునెనిమిదివేలయోజనంబుల నిడుపు నురెండు వేలయోజనంబుల వెడల్పు నుండును. కైలాస కరవీర త్రిశృంగ మకర పర్వతంబులు నాల్గు పూర్వపశ్చిమంబులకు సాఁగి, పదునెనిమిదివేలయోజనంబుల నిడుపును రెండువేలయోజనంబుల వెడల్పు నై యుండును.

## బ్రహ్మపురము

మేరుపర్వతశిఖరమధ్యభాగంబున బ్రహ్మపురం బుండును. అది పదివేలయోజనంబుల నిడుపును నంతవెడల్పును గలిగి సమచతురశ్రంబయి సువర్ణమయముగా నుండును. ఆపురంబునకు మనోవతి యను నామాంతరము గలదు. ఆపురంబు నెనిమిదిదెసల లోకపాలకులపట్టణంబు

అమరావతి, తేజోవతి, సంయమని, కృష్ణాంగన, శ్రద్ధావతి, గంధమతి, మహోదయ, యశోవతి యనునవి యుండును. ఆనగరంబు లొక్కొక్కటి రెండువేలయేనూఱు యోజనంబుల విస్తీర్ణము గలిగియుండును.

గంగానిర్గమము

రాజేంద్రా! భగవానుఁడు తొల్లి వామనావతారమెత్తి బలిచక్రవర్తి దాతృత్వంబును బరీక్షించుటకై వానిని మూఁడడుగులనేలఁ గోరుటయు, బలిచక్రవర్తి యట్లే యిచ్చుటయు, వామనుఁడు దక్షిణ పాదంబుఁ జాచుటయు, దానికి భూభాగంబెల్లఁ జాలకుండుటయుఁ, దర్వాత వామపాదంబుయొక్క యడుగులోపల నూర్ధ్వకటాహంబెల్ల నిమిడిపోవుటయు వినియుందువు. భగవానుఁడు వామపాదంబును జాచినప్పుడు తత్పాదాంగుష్ఠనఖాగ్రము సోఁకి యూర్ధ్వకటాహము వ్రీలి యందు బొరియ యేర్పడెను. ఆవివరంబునుండి జలధార వెడలి భగవత్పాదపద్మప్రక్షాళనభాగ్యంబు నోచి తచ్చరణకుంకుమకింజల్కంబు కెంజాయఁ దాల్చి శోభిల్లెను. భగవత్పాదస్పర్శ గల్గుటంజేసి యానదికి భగవత్పది యనుపేరు వచ్చెను.

అట్లు వెడలినజలధారను ఉత్తానపాదునిపుత్రుఁడు ధ్రువుఁ డను పరమభాగవతుఁడు చూచి 'అహో! ఇది నా కులదేవతాపాదారవిందోదకం' బని భక్తిపరవశుఁడై యానందాశ్రువులు గురియుచుఁ దజ్జలంబును నాఁటికి నేఁటికి సేవించుచుండును. ధ్రువపదంబునకుఁ గ్రింద సప్తర్షు లుందురు. వారు మోక్షార్థంబై యన్యపురుషార్థంబుల నుపేక్షించు చాడ్పున నితరయోగంబులనెల్ల వదలి, తన్నదీజలనిరంతరసేవాయోగంబే యుత్తమోత్తమతపం బని భావించి తమజటాజూటంబులఁ దన్నీరంబును దాల్తురు.

ఆప్రవాహంబు ధ్రువపదసప్తర్షిమండలంబులు దాఁటి చంద్రమండలంబు నావరించి మేరునగశిఖాగ్రస్థబ్రహ్మసదనంబుఁ జొచ్చి యట వాల్గ

పాయలుగాఁ జీలెను. ఆ నాల్గింటిని సీత, అలకనంద, చక్షుస్సు, భద్ర యని పేర్కొందురు. వానిలో సీతయనది బ్రహ్మసదనంబునుండి తూర్పు పార్శ్వంబున వెడలి కేసరావష్టంభాది పర్వతశిఖరంబులమార్గంబునఁ జని కుముద కుకురాదిగిరిశృంగంబుల దాఁటి, క్రిందికి జాఱి మేరుప్రాగ్భాగంబునఁ బడి, గంధమాదనశిఖరంబుల దాఁటి భద్రాశ్వవర్షముఁ బ్రవేశించి తన్మధ్యప్రదేశంబునకు భాగ్యంబుఁ గూర్చుచుఁ, దూర్పులవణసముద్రంబును జేరుచున్నది. చక్షుస్సు పశ్చిమపార్శ్వమునఁ జని మాల్యవంత శిఖరంబులకు దిగి, యందుండి జాఱి కేతుమాలవర్షమధ్యభాగంబును బునీతము గావించుచుఁ బశ్చిమలవణాబ్ధిఁ గూడుచున్నది. భద్ర యను నది యుత్తరమార్గంబు ద్రొక్కి శృంగవంతశిఖరంబుఁ బ్రవేశించి, యందుండి యుత్తరకురువర్షంబుఁ జొచ్చి యుత్తరలవణార్ణవంబుఁ గలయుచున్నది. అలకనంద బ్రహ్మసదనంబునుండి దక్షిణద్వారంబున వెడలి నానాగిరికూటంబులు దాఁటి మహావేగంబుతో హేమకూటహిమకూటంబుల నతిక్రమించి కర్మక్షేత్రమైన భారతవర్షంబుఁ జొచ్చి దక్షిణలవణోదధిఁ గూడుచున్నది.

మఱియు మేరువు మున్నగు పర్వతంబులకుఁ బుత్రికలై ప్రవహించునదులు ప్రతివర్షంబున వేనవేలు గలవు. వానిలోఁ గొన్ని పశ్చిమవాహినులును, గొన్ని పూర్వవాహినులును నై పాఱుచుండును. పశ్చిమముఖవాహినులను నదంబు లనియుఁ బూర్వముఖవాహినులను నదు లనియు వచింతురు.

### భూలోకస్వర్గంబులు

రాజేంద్రా! జంబూద్వీపమందున్న నవవర్షంబులలో భారతవర్షం బొక్కటిమాత్రమే కర్మక్షేత్ర మగును. తక్కినవర్షంబు లెనిమిది భోగక్షేత్రంబులగును. స్వర్గగతులు వారివారి పుణ్యశేషంబుల నయ్యావర్షంబులందు భోగింతురు. ఆకారణంబున వానిని భూలోకస్వర్గంబు లందురు.

అచ్చటిపురుషులకుఁ బదివేలసంవత్సరంబు లాయుఃప్రమాణము. వారు దృఢాంగులును గజబలులు నై వయోబలమోదంబుల నొప్పుచు సురత భోగంబుల దేవతుల్యులై యనుభవింతురు. వారికి నాయుశ్శేషంబు సంవత్సరమాత్రమే యున్నదనఁగా వారిభార్యలు గర్భవతులగుదురు. ఆ కారణంబున నంతవఱకు వారికి సురతభోగవిషయంబున నెట్టి యంత రాయము గలుగదు. మఱియుఁ బురుషుఁ డెవ్వఁడేనియుఁ బ్రమాదవశం బుననేని ఇలావర్షంబుఁ బ్రవేశించునేని వాఁడు స్త్రీ యగును. ఇది భవానీ దేవీశాపంబు గావున నందుఁ బురుషులెవ్వరుఁ జనరు.

అయ్యష్టవర్షంబులందుఁ బెక్కువనాశ్రమంబులు గలవు. అవి సర్వర్తులందుఁ గిసలయకుసుమఫలభరితంబులై సొబగారుచుండును. అంచెలి గిరినెత్తంబులందు సరోవరంబులు పెక్కులు గలవు. వాని జలం బులు కమలకల్హారపరాగమనోజ్ఞంబులై హంసకారండవాదివిహంగమ్ములు మధురరవసంకులంబులై శ్రవణాది సర్వేంద్రియపర్వంబుఁ గూర్చుచుం డును. దేవతలు వారివారి సుందరీమణులతోడను బరిచారికాబృందము తోను జనుదెంచి యాసరస్సులందు యథేచ్ఛాజలక్రీడలు సలుపుదురు.

### నవవర్షంబులందు భగవత్సేవాప్రకారములు

రాజేంద్రా! భగవానుఁడు రూపనామరహితుఁ డయ్యు వాని భక్తులకు సేవాభాగ్యంబును గూర్చుటకై వివిధమూర్తులు ధరించి సన్నిధి చేయుచుండును. భగవానుఁ డిలావృతవర్షమందుఁ జంద్రశేఖరరూపం బునను, భద్రాశ్వవర్షమందు హయగ్రీవమూర్తిరూపంబునను, హరివర్ష మందు నృసింహరూపంబునను, కేతుమాలవర్షమందుఁ గామదేవస్వరూపం బునను, రమ్యకవర్షమందు మత్స్యావతారరూపంబునను, హిరణ్మయ వర్షమందుఁ గూర్మావతారరూపంబునను, ఉత్తరకురువర్షంబున యజ్ఞ వరాహమూర్తిరూపంబునను, కింపురుషవర్షంబున సీతాలక్ష్మణహనుమ త్సమేత శ్రీరామమూర్తిరూపంబునను, భారతవర్షమందు నారాయణావ తారరూపంబునను సేవింపఁబడుచుండును.

### మూర్తిభేదములంబట్టి మంత్రభేదములు

రాజేంద్రా! ఆయావర్షమందలి భగవన్మూర్తిభేదంబులంబట్టి మంత్రభేదములు గలవు. ఇలావృతవర్షంబున 'ఓం నమో భగవతే వాసుదేవాయ సర్వగుణ సాంఖ్యానాయా వ్యక్తాయ నమః' అను మంత్రంబును; భద్రాశ్వమందు 'ఓం నమో భగవతే ధర్మా యాత్మవిశోధనాయ నమః' అను మంత్రంబును; హరివర్షమందు 'ఓం నమో భగవతే నరసింహాయ నమస్తేజ స్తేజసే, ఆవిరావిర్భవ - వజ్రనఖ - వజ్రదంష్ట్ర - కర్మాశీయాన్ రంధయ రంధయ - నమ ఉగ్రస్వభావాయ మహాత్మనే తమోగ్రసగ్రస స్వాహా - అభయమభయమాత్మని భూయిష్టా' అను మంత్రంబును; కేతుమాలయందు 'ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వగుణవిశేష విలక్షితాత్మనే - ఆకూతీనాం - చిత్తానాం - చేతసాం చ - విశేషాణాం చాధిపతయే - షోడశకలాయ, ఛందోమయాయ, అన్నమయాయ, అమృతమయాయ, సర్వమయాయ, సహసే-ఓజసే, బలాయ, కాంతాయ, కామాయ నమస్తే - ఉభయత్ర భూయాత్' అను మంత్రంబును; రమ్యకమందు 'ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమస్సత్వాయ, ప్రాణాయోజసే సహసేబలాయ మహామత్స్యాయ నమః' అను మంత్రంబును; హిరణ్మయమందు 'ఓం నమో భగవతే అకూపారాయ సర్వతత్త్వగుణవిశేషణాయ నోపలక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమోఽవస్థానాయ నమస్తే' అను మంత్రంబును; ఉత్తరకురువర్షమందు 'ఓం నమో భగవతే మంత్రతత్త్వలింగాయ యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహీధరాయ మహాపురుషాయ నమః, కర్మశుక్లాయ త్రియుగాయా గుణాయ నమస్తే' అను మంత్రంబును; కింపురుషవర్షమందు 'ఓం నమో భగవతే ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణశీలవ్రతాయ నమ ఉపశిక్షితాత్మనే నమ ఉపాసితలోకాయ నమస్సాధువాదనికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజాయ నమః' అను మంత్రంబును, భారతవర్షమ్మందు 'ఓం నమో భగ

వతే ఉపశమశీలాయ ఉపరతానాత్మ్యాయ నమోఽకించనవిత్తాయ ఋషి. ఋషభాయ నారాయణాయ పరమహంసాయ పరమగురవే ఆత్మారామాధిపతయే నమో నమః' అను మంత్రంబును జపమంత్రంబు లగును.

### భారతవర్ష విశేషములు

#### 1. ముఖ్యశైలములు

రాజేంద్రా! భారతవర్షమందుఁ బెక్కుశైలంబులు గలవు. వానిలోఁ గెల్ల మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటరము, కొల్లము, సహ్యము, వేదగిరి, ఋశ్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధరము, వింధ్యము, శుక్తిమంతము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కకుంభము, నీలము, కాకముఖము, ఇంద్రకీలము, రామగిరి యను నిరువదియేడు ముఖ్యపర్వతము లగును.

#### 2. నలువదిమూఁడు ముఖ్యనదులు

రాజేంద్రా! పైనఁజెప్పిన పర్వతంబులందుఁ బుట్టి ప్రవహించుచు భారతజనులకు నామస్మరణపానాదులవలనఁ బావనత్వంబుఁ గూర్చుచున్న నదులు పెక్కులు గలవు. వానిలోఁ జంద్రపట, తామ్రపర్ణి, యవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, శిల, సురస, నర్మద, చరణ్వతి, సింధువు, శోణనద, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయు,భోగవతి, సుషమ, శతద్రు, చంద్రభాగ,మరుద్వృధ, వితస్త, యసిక్ని, విశ్వ యనునట్టి నలువదిమూఁడు ముఖ్యనదు లగును.

#### 3. పురుషార్థసంపాదనయోగ్యస్థానము

రాజా! కర్మము సాత్త్విక రాజస తామసగుణప్రేరితమై కొనసాగుచుఁ దత్తద్గుణానురూపఫలంబుల నిచ్చుచుండు ననియు, దత్ఫలం

బుల ననుభవింపక తీఱదనియు, ఫలభోగార్థము జీవులు తదనురూపగుణ శరీరంబులు దాల్చి పుట్టి ప్రారబ్ధఫలంబు ననుభవించి యాతనువులను వదలి సంచితకర్మఫలశేషభోగార్థము మఱలమఱలఁ దత్తదనుగుణదేహంబులఁ దాల్చుచుందు రనియుఁ దెలిపితిని. అట్టికర్మంబు ననుభవించుటకును జన్మకారణంబైన యవిద్యాబంధంబును దెగనాడి పురుషార్థంబు నొందుటకును జీవులు భారతవర్షంబునఁ బుట్టుదురు. భారతవర్షజులకు నవిద్యానిరసనోపాయం బెద్ది యందువా? మహాపురుషసంగంబు ముఖ్యోపాయం బగు. తత్సంగఫలంబుగా ననన్యభక్తియోగంబు సిద్ధించును. ఇవియే పరమ సాధనములు. ఈరెండును భారతవర్షజులకు వర్ణాశ్రమక్రమంబున నల వడుటకు నెంతయు నవకాశము గలదు.

### దేవతలు భారతవర్షజన్మముఁ గోరుట

రాజేంద్రా! నరులు స్వర్గసుఖంబునకై దుష్కరంబులగు తపోవ్రతక్రమదానాదు లొనర్చి దానిని సాధింతురు. స్వర్గలోకవాసులైన సురలు స్వర్గసుఖంబులు తుచ్ఛంబు లని తలపోసి 'అహో! ఈస్వర్గ భోగంబులకు నెన్నఁడో యొకనాఁ డంతంబు గలుగును. తర్వాత జన్మింపక తప్పదు. ఆజన్మంబు లెట్టివో యూహింపరాదు. మఱియు భోగపరులకు భగవత్పాదపద్మస్మరణం బెంతయు నరుదగు. జన్మరాహిత్యం బొక్కటే యుత్తమోత్తమసుఖంబు. అది భగవత్సేవవలనఁ దక్క వేఱొంటఁ గలుగదు. హరిసేవకు, నరజన్మంబునందువలె నన్యంబుల నవకాశము కలుగదు. కల్పాంతస్థానమును సాధించియు మఱల జన్మంబు లెత్తుటకన్న సర్వసంగత్యాగమూలకంబున నిత్యమైనహరిపదంబుఁ జేర నోచిన భారతవర్షపురుషజన్మంబు క్షణావస్థాయియైనను సర్వవిధంబుల వాంఛనీయము గదా! మాకును భారతవర్షంబున మనుజజన్మంబు గలుగుఁ గాక. కటా! శ్రీవైకుంఠునికథాసుధానదులందుఁ గ్రుంకులాడి భాగవతుల తోడి సంగమభాగ్యంబుఁ బడసి యానందించునట్టి కలిమి లేనినాఁడు బ్రహ్మలోకంబైనను మఱి యేలోకంబైనను గర్హ్యమగునేగాని సుంతే

నియుఁ గోరఁదగదు. భగవదాశ్రయసంపద గల్గియు, మోక్షార్థము యత్నింపనివానిగతి యెంతయు శోచ్యము. వృక్షంబు నాశ్రయించిన పక్షులు బోయవలలో నొకసారి చిక్కి యెట్లో తప్పించికొనియు, మఱల నవ్విటపంబునే చేరి తిరిగి యాబోయవలకుఁ జిక్కి నశించుచున్నవి. అట్లే జీవులు మనుష్యత్వంబు నెట్లో పడసియు ముక్తికాములు గాక భోగార్థు లగుదురేని,వారిగతి పైనిఁజెప్పిన పక్షులగతియే యగుఁ గదా.'

'భగవానుఁడు నిత్యపూర్ణుఁడు. అట్టివాఁడుగూడ భారతజనకృత పురోడాశాదుల నెంతో ప్రీతితో గ్రహించును. భారతవాసులభాగ్యమే భాగ్యము. భగవానుఁడు సర్వకామప్రదుఁడు. కోరినవారికిఁ గోరిన దానినే యిచ్చును. నిష్కామబుద్ధితో భగవాను నారాధించినప్పు డెట్టి ఫలము గలుగు నందురా ? కామఫలములెల్లఁ గాలగతంబులై నశించును. ఏదియుఁ గోరక భగవంతు నారాధించువారికి నిత్యమైన మోక్షంబును భగవానుఁ డనుగ్రహించును. తొల్లి మేముచేసిన యజ్ఞాధ్యయనసత్యాది సత్కర్మములఫలంబుగా మా కిప్పుడు స్వర్గలోకనివాసమయ్యెను. ఆకర్మములలో నేదేని శేషించి పునర్జన్మమునకుఁ గారణముగా నుండునేని మాకు భారతవర్షంబున నరజన్మంబు లభించుఁగాక. అట్లు జన్మించి భక్తవత్సలుఁడైన భగవానుని భక్తిచేసి పరమార్థముఁ బడయుదుముగాక' అని లోలోనఁ బరితపింతురు. రాజా ! భారతవర్షమందలి నరజన్మవిశేషం బెంతయో నీవే యూహింపుము.

### ఉపద్వీపములు

రాజేంద్రా ! జంబూద్వీపంబునకు నెనిమిది యుపద్వీపంబులు గలవు. వానిని స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందేహారుణము, పాంచజన్యము, సింహళము, లంక అని పేర్కొందురు. తొల్లి సగరచక్రవర్తి యశ్వమేధయాగంబునకుఁ దొడఁగి యజ్ఞాశ్వంబును వదలెననియు, దాని నింద్రుఁడు హరించెననియు, సగరునిపుత్రులు తదశ్వ

న్వేషణపరులై ధాత్రిని ద్రవ్విరనియుఁ, దత్ఫలంబుగా జంబూద్వీప మందు నెనిమిది యుపద్వీపంబు లేర్పడె ననియుఁ గొందఱందురు.

### ప్లక్షాదిద్వీపపరిమాణాదులు

### 2. ప్లక్షద్వీపము

రాజేంద్రా! ఈద్వీపంబున మహాప్లక్షవృక్షము గలదు. దానిని బట్టి దానికిఁ బ్లక్షద్వీపమని పేరువచ్చెను. ఆద్వీపంబున నగ్నిదేవుఁడు సప్తజిహ్వుఁ డనుపేర విలసిల్లుచుండు.

### ప్లక్షద్వీప సప్తఖండములు

తొల్లి ప్రియవ్రతునిసుతుఁడు ఇధ్మజిహ్వుఁ డా ప్లక్షద్వీపంబు నేలుచుండెను. వానికి నేడ్వురు పుత్త్రులు జనించిరి. అతఁ డా ద్వీపం బును ఏడుఖండములుగా విభజించి యేడ్వురుతనయుల కిచ్చెను. ఆయేడు గురపేర నయ్యేడుద్వీపములు శివము, యశస్యము, సుభద్రము, శాంతము, క్షేమము, అభయము, అమృతము అని పరఁగును.

### ప్లక్షద్వీప సప్తపర్వతములు

ఆ ద్వీపమందు మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, ధూమ్రవర్ణము, హిరణ్యగ్రీవము, మేఘమాలము అనఁ బడు కులపర్వతంబు లేడు గలవు. ఆపర్వతంబు లేడు నయ్యేడువర్షం బులకు హద్దులగును.

### ప్లక్షద్వీప సప్తమహానదులు

ఆద్వీపమందు అరుణ, నృమణ, ఆంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర అను మహానదు లేడు గలవు.

### ప్లక్షద్వీపచాతుర్వర్ణ్యములు - సూర్యోపాసనము

ప్లక్షద్వీపమందలి జనులు హంసులు, పతంగులు, ఊర్ధ్వాయనులు, సత్యాంగులు అనుపేర్ల నాల్గువర్ణములుగా నుందురు. వా రా ద్వీప

మందలి నదీజలంబులను స్నానపానాదిరూపంబుల సేవించుటంజేసి తజ్జల ప్రభావంబున నిరస్తరజస్తమోగుణులై యాయుర్వృద్ధి గలిగి వేయేండ్లు జీవింతురు. వారి దేహంబులు దేవతలశరీరంబులెట్లో యట్లు చెమర్పవు; బడలికలు పొందవు; వారు సూర్యోపాసకులు. స్వర్గద్వారభూతుండును వేదమయుండు నైన యాసూర్యభగవానుని త్రయీవిద్యాపూర్వకంబుగా నుపాసించి 'ప్రత్నస్య విష్ణోరూపం యత్సత్యస్య బ్రహ్మణ అమృతస్య మృత్యోశ్చ సూర్యమాత్మాన మీమహీ' అను మంత్రంబును జపింతురు. ప్లక్షాది సప్తద్వీపములందుఁ బురుషులకుఁ బుట్టువుతోడనే యాయురింద్రియోజస్సహోబలబుద్ధివిక్రమంబులు పెచ్చుగాఁ గలుగుచుండును.

### 3. శాల్మలీద్వీపము

రాజేంద్రా ! ఆ ద్వీపమందుఁ బ్లక్షవృక్షమంతటిది శాల్మలీవృక్షము గలదు. ఆవృక్షంబునుబట్టి యాఖండఁబునకు శాల్మలీద్వీపం బనుపేరు వచ్చెను.

ఆశాల్మలీవృక్షమూలంబున గరుత్మంతుఁడు నివసించుచుండును. ఆపక్షిరాజు రెక్కలల్లార్చినప్పుడు బృహద్రథంతరాది వేదానువాద శబ్దంబులు వెడలును. ఆవిహంగమేశ్వరుఁ డట్లు నిజావయవభూతంబులైన యాశబ్దంబులతో శ్రీమహావిష్ణువును స్తుతించును.

#### శాల్మలీద్వీపసప్తఖండంబులు

ఆద్వీపంబును బ్రియవ్రతుని సుతుఁడు యజ్ఞబాహుఁ డేలెను. వానికి నేడ్గురుకొడుకులు జనించిరి. అతఁ డాద్వీపంబు నేడు భాగంబులుగా విభజించి యయ్యేడుగురకుఁ బంచియిచ్చెను. ఆఖండంబులు వారిపేర సులోచనము, సౌమనస్యము, రమణకము, దేవబర్హము, పారిబర్హము, ఆప్యాయనము, అభిజ్ఞాతం బనఁ బరఁగును.

### శాలలీద్వీప సప్తగిరులు

ఆసప్తఖండములలో సులోచనమందు స్వరసపర్వతము, సౌమనస్యమునందు శతశృంగపర్వతము, రమణకమందు వామదేవగిరి, దేవబర్హమందుఁ గుముదాద్రి, పారిబర్హమందు ముకుందపర్వతము, ఆప్యాయనమందుఁ బుష్పవర్షనగము, అభిజ్ఞాతమందు శతశ్రుతిపర్వతము వెలయుచుండును.

### శాల్మలీద్వీప సప్తనదులు

మఱియుఁ దద్ద్వీపమందు అనుమతి, నినీవాలి, సరస్వతి, కుముపు, రజని, నంద, రాపు అనునదు లేడు ప్రవహించుచుండును.

### శాల్మలీద్వీపచాతుర్వర్ణ్యము — సోమోపాసనము

ఆద్వీపమందలి పురుషులు శ్రుతధరులు, విద్యాధరులు, వసుంధరులు, ఇధ్మధరు లనుపేర నాల్గువర్ణముల నుందురు. వారు వేదమయుఁడు నాత్మఁడు నైన సోముని వేదపూర్వకంబుగా యజించి 'స్వగోభిః పితృదేవేభ్యో వ్యభజన్ శుక్లకృష్ణయోః, అంధః ప్రజానాం సర్వాసాం రాజా న స్సోమ అస్తు' అను మంత్రంబును జపింతురు.

### 4. కుశద్వీపము

ఇందొకకుశస్తంభము దేవనిర్మితమైనది గలదు. ఆస్తంభముఁను బట్టి దానికిఁ గుశద్వీప మనుపేరు వచ్చెను. ఆద్వీపంబును ఘృతసముద్రము చుట్టియుండును. దానివిస్తీర్ణం బెనిమిదిలక్షలయోజనంబులు.

### కుశద్వీపసప్తఖండములు

కుశద్వీపంబును బ్రియవ్రతుని సుతుఁడు హిరణ్యకేతుఁ డనువాఁడేలెను. వానికి వసుదానుఁడు, దృఢరుచి, నాభి, గుప్తుఁడు, సత్యవ్రతుఁడు, విప్రుఁడు, వామదేవుఁడు అను పుత్త్రు లేడ్వురు జనించిరి. హిరణ్యరేతుఁడు కుశద్వీపంబు నేడుఖండంబులుగా విభజించి యాయేడ్వురుసుతుల కిచ్చి తాను తపంబునకుఁ బోయెను. ఆయేడుఖండంబు లాయేడ్వురుపేర వెలయుచుండు.

### కుశద్వీప కులగిరులు

కుశద్వీపమందుఁ బభ్రుగ్రీవు, చతుశ్శృంగము, కపిలము, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము, అను పేర్లుఁ గలపర్వతంబు లేడు గలవు. ఆపర్వతంబు లొక్కొక్కవర్షంబునకు హద్దుగా నైయాద్వీపంబును సప్తభాగంబు లొనర్చెను.

### కుశద్వీపసప్తవాహినులు

ఆద్వీపమందు రసకుల్య, మధుకుల్య, శ్రుతవింద, మిత్రవింద, దేవగర్భ, మృతచ్యుత, మంత్రమాల అనునదు లేడు గలవు. కుశద్వీపవాసు లా నదులజలంబులను సేవించి పవిత్రులై యుందురు.

### కుశద్వీపచాతుర్వర్ణ్యము - అగ్న్యుపాసనము

కుశద్వీపవాసులు కుశు లనియు, కోవిదు లనియు, అభియుక్తు లనియు, కుశకు లనియు నాల్గుతెగలుగా నుందురు. అగ్ని దేవుఁడు వారికి నుపాస్యదైవము. వా రద్దేవుని వహ్ని దేవతాకంబులైన వివిధకర్మంబులతో నారాధించుచు 'పరస్య బ్రహ్మణ స్సాక్షా జ్జాతవేదోఽసి హవ్యవాట్, దేవానాం పురుషాంగానాం యజ్ఞేన పురుషం యజ' అను మంత్రంబును జపింతురు.

## ౫. క్రౌంచద్వీపము

రాజా ! ఇందుఁ గ్రౌంచమనుపర్వతము గలదు. ఆగిరి పూర్వము మదించి సూర్యమార్గంబు నవరోధించెను. అప్పుడు కార్తికేయుఁడు తన ఖడ్గంబును దానిపై విసరివైచెను. ఆకత్తి తాఁకువేడిమికి నగ్గిరియందలి పొదలెల్ల నిట్టనిలువున దగ్ధమయ్యెను. అంతలోన వరుణుఁడు తద్గిరిని గరుణించి యడ్డుపడి కాపాడెను. ఆక్రౌంచపర్వతముపేర నద్వీపము పరఁగును.

### క్రౌంచద్వీప సప్తఖండములు

క్రౌంచద్వీపంబును బ్రియవ్రతుని సుతుఁడు ఘృతపృష్ఠుఁ డను వాఁడు పరిపాలించెను. వానికి ఆమోదుఁడు, మధువహుఁడు, మేఘ పృష్ఠుఁడు, సుదాముఁడు, ఋషిజ్యుఁడు, లోహితార్ణుఁడు, వనస్పతి యను కుమారు లేడ్వురు జనించిరి. ఘృతపృష్ఠుఁడు క్రౌంచద్వీపంబును సప్త ఖండంబులుగా విభజించి యొక్కొకఖండంబునకు నొక్కొక్కపుత్త్రు నభిషేకించి భగవత్పాదార విందసేవారతుఁడై తపోవనంబునకుఁ బోయెను. ఆ యేడుఖండంబు లాసప్తపుత్త్రకులపేరఁ బరగును.

### క్రౌంచద్వీపసప్తకులగిరులు

రాజా! క్రౌంచద్వీపమందు శుక్లము, వర్ధమానము, భోజనము, ఉపబర్హణము, ఆనందము, నందనము, సర్వతోభద్రము అను కులగిరు లేడు గలవు. అవి యొక్కొక్కటి యొక్కొక్కఖండంబునకు హద్దుగా నుండును.

### క్రౌంచద్వీపసప్తనదులు

ఆద్వీపమందు అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల యనుపేర్ల నొప్పు నదీసప్తకము గలదు. ఆద్వీపవాసులు తన్నదీజలంబులఁ బూర్ణాంజలులతో నాపోమయదేవు నారాధించి 'ఆపః పురుషవీర్యాః స్థపునంతో భూర్భువ స్సువః, తా నపునంత్వమీరాతఘ్నశ్శ స్సపృశతామాత్మా నా భవః' అను మంత్రంబును జపింతురు.

### క్రౌంచద్వీపచాతుర్వర్ణ్యము - వరణోపాసనము

ఆద్వీపవాసులు గురువులు, ఋషభద్రులు, విణకులు, దేవకులు ననుపేర్ల నాల్గుతెగలుగా నుందురు. వారికి వరుణుఁ డుపాస్యదైవం బగును.

### 6. శాకద్వీపము

రాజా! ఈద్వీపంబున నొక గొప్ప శాకవృక్షము గలదు. ఆ శాకవృక్షమునుబట్టి యాఖండంబునకు శాకద్వీపం బనుపేరు వచ్చెను.

### శాకద్వీపసప్తఖండములు

ఆద్వీపంబును బ్రియవ్రతునిసుతుఁడు మేధానిధి పరిపాలించెను. వానికిఁ బురోజవుఁడు, మనోజవుఁడు, వేపమానుఁడు, ధూమ్రానీకుఁడు, చిత్రరథుఁడు, బహురూపుఁడు, విశ్వచారుఁ డనుపేరి తనయు లేడ్వురు గలిగిరి. మేధానిధి తనరాజ్యంబును సప్తవిభాగంబులు చేసి యేడ్వురు పుత్రులకుఁ బంచియిచ్చి తాను తపోవనంబునకుఁ బోయెను. ఆ యేడ్వురు పేర నయ్యేడుఖండంబులు వెలయును.

### శాకద్వీపసప్తకులగిరులు

ఆద్వీపమందు ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రస్రోతము, దేవపాలము, మహాసనము అనుపేరి కులగిరు లేడు గలవు. అవి యొక్కొక్కఖండంబునకు హద్దుగా నుండును.

### శాకద్వీపసప్తవాహినులు

ఆద్వీపమందు అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపది, సహస్రధృతి, నిజధృతి యనఁబరఁగు నదు లేడు తద్వర్షంబును బవిత్రీకరించుచుఁ బ్రవహించుచుండును.

### శాకద్వీపచాతుర్వర్ణము - వాయుదేవోపాసనము

శాకద్వీపవాసులు ఋతవ్రతులు, సత్యవ్రతులు, దానవ్రతులు, సువ్రతు లనుపేర్ల నాల్గువర్ణములుగా నుందురు. వారు ప్రాణాయామాది యోగంబు లభ్యసించి రజస్తమస్సులను జయించి పరమసమాధి నుందురు. వారికి వాయుదేవుఁ డుపాసనాదైవం బగు. ఆదేవుని వారు 'అంతః ప్రవిశ్య భూతాని యోబిభ ర్త్యాత్మ కేతుభిః, అంతర్యామీశ్వరస్సాక్షా త్పాతు నో యద్వశే ఇదమ్' అనుమంత్రంబున జపింతురు.

## 7. పుష్కరద్వీపము

ఈద్వీపమందుఁ బరమేష్ఠికిఁ బ్రీతికరమైన యొకమహాపుష్కరము గలదు. ఆపుష్కరము సువర్ణమయములై వహ్నిశిఖలువలె విరాజిల్లు

చుండు లక్షోపలక్షలతేకులతో విరాజిల్లుచుండును. ఆపుష్కరంబును బట్టి యాదీవికిఁ బుష్కరద్వీపం బనుపేరు గలిగెను.

### మానసోత్తరపర్వతము

పుష్కరద్వీప మధ్యభాగంబున మానసోత్తరమనుపర్వతము పది వేలయోజనంబుల పొడవు, నంతియ వెడల్పుఁ గలిగి యొప్పారుచు నద్దీవిని రెండుగా విభజించును. ఆ గిరినెత్తంబున నలుదెసల దేవేంద్రాది లోకపాలకులపురంబులు నాల్గు గలవు. సూర్యరథచక్రము మేరుగిరిని వలగొనుచు దివారాత్రంబు లేర్పఱచుచు నమ్మానసోత్తరగిరిమీఁదనే తిరుగుచుండును.

### పుష్కరద్వీపసప్తఖండములు

ఆద్వీపంబును బ్రియవ్రతునిపుత్త్రుఁడు వీతిహోత్త్రుఁడు పాలించెను. వానికి రమణకుఁడు, ధాతకుఁ డనుసుతు లిద్దఱు గలిగిరి. అతఁ డాదేశం బును రెండుగా విభజించి యిరువురుపుత్త్రులకుఁ బంచిపెట్టి, వనవాసి యయ్యెను. ఆపుత్త్రులపేర నయ్యిరుఖండంబులు రమణకము ధాతకం బని పేర్కొనఁబడును.

ఆద్వీపవాసులు బ్రహ్మసాలోక్యపరులై యుందురు. అందులకుఁగా వారు భగవంతుని బ్రహ్మరూపంబునఁ దత్తత్కర్మంబులతో నారాధించుచు 'యత్తత్కర్మమయం లింగం బ్రహ్మలింగం జనోఽర్చతి, ఏకాంత మద్వైతం తస్మై భగవతే నమః' అనుమంత్రంబును జపింతురు.

### లోకాలోకపర్వతము

రాజేంద్రా! స్వాదూదకసముద్రంబునకు నవ్వల నొకమహాపర్వ తము గలదు. అది పదిరెండుకోట్లయేఁబదిలక్షలయోజనంబుల విస్తారమై యేఁబదికోట్లయోజనంబుల విస్తృతమై భూమండలంబులో నాల్గవభాగం బాక్రమించియుండును. సూర్యచంద్రధ్రువాదులకిరణంబు లాపర్వతంబు వఱకు వ్యాపించునే గాని యవ్వల వ్యాపింపవు.

రాజా! సూర్యాదులరశ్మి యెందాఁక ప్రకాశించునో యాప్రదేశంబును లోకంబనియు, తర్వాతిప్రదేశంబును అలోకంబనియు వచింతురనియు, లోకాలోకప్రదేశంబులకు మధ్య నిలిచి యప్పర్వతం బారెంటిని వేఱుచేయుచునుండుటంజేసి దానికి లోకాలోకపర్వతం బనుపేరు వచ్చెననియుఁ జెప్పితిని. అలోకప్రదేశములోకప్రదేశమంత విశాలమై మహావిశుద్ధస్థానముగా నుండును. ఆకారణంబున నయ్యది యోగీశ్వరులకుఁ దక్క నన్యులకుఁ జొఱరాకుండును.

### స్వర్ణదేశము

రాజేంద్రా! మానసోత్తరగిరికిని మేరుపర్వతంబునకును మధ్య నుండు భూభాగము స్వర్ణమయమై యద్దమో యన నుండును. ఆకారణంబున నచ్చోట నేవస్తువుగాని జనింపదు; అం దెట్టిప్రాణియుఁ గలుగదు. ఆప్రదేశము దేవతలకుఁ గ్రీడాయోగ్యం బగును.

### దిగ్గజములు

ఆపర్వతాగ్రమందు నాల్గుదిక్కుల నుత్తరాదిగా నాల్గుదిగ్గజంబులు ఋషభము, పుష్కరచూడము, వామనము, అపరాజితము అనునవి నిల్చియుండును. జగదీశ్వరుఁడు సర్వలోకస్థితికై వాని నట్లు నియమించెను.

రాజా! భగవానుఁడు వాని మాయాకల్పితమైన మహాలోకంబు సురక్షితముగా నడచుటకై కేవల శుద్ధతత్త్వమూర్తిని గ్రహించి శంఖ చక్రగదాధారియై యచ్చటఁ గల్పాంతమువఱకు వెలసియుండును. ఆదేవదేవుని విష్వక్సేనాదిపార్షదులు గొలుచుచుందురు. మహేంద్రాదులు వాని కలాంశభూతు లగుదురు. భగవానుఁ డంతర్యామియై వారివలనఁ దత్తత్కార్యంబులు చేయించుచుండును.

### బ్రహ్మాండక పాలములు

రాజా! సృష్టియెల్ల నొకగోళరూపంబున నుండును. అగోళం బింత దని చెప్పఁ దరముగాదు కావున దానిని బ్రహ్మాండ మనిరి. ఆబ్రహ్మాండంబు

నకు భూభాగంబు క్రిందిచిప్పయు, నంతరిక్షంబు మీఁదిచిప్పయు నగును. ఆచిప్పలను గపాలంబు లందురు. అరెంటిమధ్య సూర్యుఁడు వర్తించును.

ఆయండం బచేతనంబుగావున మృతంబని పేర్కొనఁబడును. అట్టి మృతమందుఁ దోఁచినకారణంబున సూర్యునకు మార్తాండుఁ డనుపేరు వచ్చెను. ఆయండంబు హిరణ్మయంబుగా నుండును. బ్రహ్మదేవుఁ డయ్యాం డంబున జనించినకారణంబున హిరణ్యగర్భుఁ డనఁబడును.

రాజా! ఆకాశభూనభోదిక్కు లనెడి కల్పనంబును, స్వర్గాపవర్గనర కంబు లనెడి కల్పనంబును సూర్యునివలన నేర్పడుచున్నవి. మఱియు సూర్యుఁడు దేవతిర్యఙ్మనుష్యసరీసృపఖగనగలతాది సర్వచరాచరవర్గంబు నకు నాత్ముఁడు నాయకుఁడు నధిష్ఠాతయు నగును.

### బ్రహ్మాండకపాలపరిమాణనిర్ణయవిధానము

రాజా! బ్రహ్మాండగోళంబునకు భూమండలము గగనమండలము రెండును రెండుచిప్పలగు నని తెలిపితిని. వాని పరిమాణంబును నిర్ణయిం చుట యెట్లందువా? ఒకగింజను రెండుసమభాగములుగాఁజీల్చి యందొక చీలికను గొల్చి దానిపరిమాణంబును నిశ్చయించినచో రెండవదాని పరిమాణముగూడ నంతే యని యేర్పడును. అట్లే బ్రహ్మాండమందలి యొకచిప్పయైన భూమండలముయొక్కపరిమాణంబును నిశ్చయించి నప్పుడు గగనమండలముయొక్క పరిమాణముగూడ నంతే యని యేర్ప డును.

### సూర్యగతులు

సూర్యుఁడు భూగగనమండలంబుల మధ్యభాగంబున మంద తీవ్ర సమములనెడి మూఁడుగతుల వర్తింపుచుండును. ఆమూఁడుగతులకు ఉత్తరాయణము దక్షిణాయనము విషువు అనుపేర్లు క్రమముగా నిడిరి.

### మకరాదిరాసులు

మకరాదిరాసులు సూర్యుని యారోహణావరోహణస్థానంబు లగును. సూర్యుని యారోహణావరోహణగతినిబట్టి దివారాత్రంబులకు

దీర్ఘ హ్రస్వ సమాన భేదంబు లేర్పడుచున్నవి. సూర్యుఁడు మేషతులా రాసులలో సంచరించునప్పుడు దివారాత్రులకాలము సమముగాను, వృషభాదిరాశిపంచకములో సంచరించునప్పుడు పగటికాలం బొక్కగడియ హెచ్చుగాను రాత్రికాలం బొక్కగడియ తక్కువగాను, వృశ్చికాదిరాశి పంచకంబులో సంచరించునప్పుడు పగటికాలం బొక్కగడియ తక్కువగాను రాత్రికాలం బొకగడియ హెచ్చుగా నుండును. ఇది స్థూలనిర్ణయము. వృషభాది రాశిపంచకసంచారకాలము దక్షిణాయనం బనియు, వృశ్చికాదిరాశిపంచకసంచారకాలం బుత్తరాయణం బనియు వచింతురు.

### అహోరాత్రములు

సూర్యుఁ డట్లు మందాదిగతులతో మానసోత్తరగిరి నొక్కసారి చుట్టివచ్చుటకు నగుకాలం బొక్కయహోరాత్రం బగును. మానసోత్తర పర్వతము చుట్టుకొలత తొమ్మిదికోట్లు నేఁబదియొకండులక్షల యోజనంబులు. అనఁగా సూర్యుఁ డొక్కయహోరాత్రంబునకు నంతదవ్వు సంచరించుచున్నాఁడు.

### ఉదయాదికాలనిర్ణయము

ఆమానసోత్తరగిరికిఁ దూర్పుదెస దేవధాని అనునట్టి యింద్రపురంబును, దక్షిణపార్శ్వంబున సంయమని అను యమపురంబును,పశ్చిమపార్శ్వంబున నిమ్లోచని యను వరుణపురంబును, ఉత్తరభాగంబున విభావరి అను సోమునిపురంబును గలవు. సూర్యుఁడు దేవధానిపురంబును జొచ్చినప్పుడుదయకాలంబును, సంయమనిపురంబుఁ జొచ్చినప్పుడు మధ్యాహ్నకాలంబును, నిమ్లోచనిపురంబుఁ, జొచ్చినప్పు డస్తమయకాలంబును, విభావరిఁ జొచ్చినప్పుడు నిశీథికాలంబు నగును. ఈ కాలవిశేషంబునుబట్టి మేరునగంబు నలుదెసలనుండు భూతంబులకుఁ బ్రవృత్తినివృత్తులకు నవకాశం బేర్పడుచున్నది. సూర్యుఁడు మేరువును వలగొనునప్పు డాగిరి దక్షిణవర్తిగా, భానుఁడు దానికి వామభాగవర్తిగా నుండును.

### దిశలదూరము

పూర్వదిశనున్న యింద్రనగరంబునుండి దక్షిణదిశనున్న యమపురంబునకు రెండుకోట్లు ముప్పదియేడులక్షలు డెబ్బదియైదుయోజనంబులు దూరమగును. సూర్యుఁ డా దూరంబును బదునేనుగడియలలో నడచును. యమపురంబునుండి నిమ్లోచనికిని, నిమ్లోచనినుండి విభావరికి నట్లే యని గ్రహింపనగును.

### ఉదయాస్తమయస్థానములు

సూర్యుఁ డెచ్చట నుదయించునో, యచ్చటకు నేరుగా దారము పట్టిన ట్లొకచోట నస్తమించును. అనఁగా నుదయాస్తమయస్థానంబులొకదానికి నొకటి సూత్రపట్టిన ట్లుండును. ఎచ్చట మధ్యాహ్నముగా నుండునో యచ్చోటునుండి క్రిందిస్థానంబునకు సూత్రమును నిర్వక్రముగాఁ బట్టుదుమేనిఁ దత్ప్రదేశము నిశీథిగా నుండును.

సోమాదులైన యితరగ్రహంబులయు నక్షత్రంబులయు నుదయాస్తమయంబులు జ్యోతిశ్చక్రంబునఁ బైనిఁజెప్పినవిధముగా జరుగుచుండును.

### సూర్యరథము

రాజోత్తమా ! సూర్యరథముయొక్కయిరుసు మేరుశిఖరము మొదలు మానసోత్తరమువఱకు వ్యాపించి, కోటియేఁబదియేఁడులక్షలు నేఁబదివేలుయోజనంబుల పొడవుగా నుండును. ఆయిరుసునకు రవిరథచక్రం బమర్పఁబడి తైలయంత్రచక్రంబువలె మానసోత్తరంబునఁ దిరుగుచుండును. అనఁగా సూర్యరథం బేకచక్రాత్మకమాత్రంబని గ్రహింపవలయును.

### రథచక్రవర్ణనము - మాసాదినిర్ణయము

ఆచక్రంబునకు మూఁడురంధ్రంబులు నాలుపూఁటిలుఁ బదురెండాకులు నుండును. రెండేసియాకులసందు గడచుకాలంబు మాసం

బనియు, రెండేసి పూటీలమధ్యస్థలము గడచుకాలము ఋతు వనియు, ఒక్కొక్కరంధ్రము దాటుకాలము చాతుర్మాస్యం బనియు నిర్ణయించిరి. ఇట్లు ద్వాదశమాసంబులును,షడృతువులును, మూఁడుచాతుర్మాస్యంబులు నేర్పడుచున్నవి.

ఆయిరుసుయొక్క నాల్గవభాగంబున మఱియొకయిరుసు ముప్పది తొమ్మిదిలక్షలు ముప్పదియేడువేలు నేనూఱుయోజనంబులు పొడవు గలది యమరి, గానుగబండివిధంబున నై ధ్రువునివఱకు సాఁగియుండును.

సూర్యరథమందు సారథి కూర్చుండుస్థానము ముప్పదియాఱు లక్షలయోజనాయతము నవలక్షయోజనవిశాలంబునై యుండును. ఆ రథంబునొగలుగూడ నంతపరిమాణము గలిగియుండును. అరుణుఁడు సూర్యునకుముందుఁ బశ్చిమముఖుఁడై కూర్చుండి ఛందస్సులనెడి గుఱ్ఱంబుల నేడింటిని బూన్చి యారథంబును నడపును. వాలఖిల్యఋషులు అంగుష్ఠప్రమాణశరీరు లఱువదివేవురు సూర్యునెదుర నిలిచి వానిని సూక్తవాకంబుల నుతించుచుందురు. గంధర్వాప్సరాదులు పదునల్గురు చేరి యిద్దఱిద్దఱు జతలై ప్రతిమాసము సూర్యుని వివిధనామకర్మంబుల నుపాసింతురు.

రాజేంద్రా! భూమండలంబు తొమ్మిదికోట్ల యేఁబదియొక్కలక్షల యోజనంబులని తెలిపితిని. సూర్యుఁ డొక్కక్షణములో నందు రెండు వేలుయోజనంబులు నన్నూఱుక్రోసులు గడచును.

### సూర్యాదిగ్రహప్రదక్షిణవిచారము

మునులారా! శుకమహర్షి యట్లు చెప్పఁగాఁ బరీక్షిన్నరేంద్రుఁడు విని 'మునివర్యా! సూర్యుఁడు మేరువును ధ్రువుని వలగొనుననియు, అప్పుడు మేరుగిరి దక్షిణవర్తిగాను సూర్యుఁ డాగిరికి వామభాగవర్తిగా నుండుననియుఁ దెలిపితిరి. ఎవరేని యొకవస్తువును బ్రదక్షిణము చేయు నప్పు డావస్తువు వానివలకేలు దెస నుండును. మీరు చెప్పినది చూడఁగా

లోకరీతికి వ్యతిరిక్తముగా నున్నది. ఇది యెట్లో వివరింపవేడుదు' ననెను. శుకమహర్షి వాని కిట్లనియెను.

'రాజేంద్రా! కుమ్మరిచక్రము దిరుగుట చూచి యుందువుగదా. ఆచక్రంబు తిరుగునప్పుడు పిపీలికాదిజంతువులు తచ్చక్రాంతరప్రదేశంబు లందుండి తిరుగుచుండును. అప్పుడు చక్రగమనం బొకవంకను దజ్జంతువులగమనంబు వేఱొకవంకను నగుచున్నవి. కారణ మేమందువా? తిరుగుచున్నచక్రముయొక్క ప్రదేశాంతరంబులనుండి యాజంతువులు తిరుగుటయే కారణము.

అట్లే కాలచక్రము నక్షత్రాదిరాశితోడ మేరువును ధ్రువునిఁ బ్రదక్షిణీకరించునప్పుడు తచ్చక్రాంతరమునందుండు సూర్యాదిగ్రహం బులు నక్షత్రాంతరరాశ్యంతరంబులఁ బొందుచుండును. అప్పు డాగ్రహ ములగతి చక్రగతికి భిన్నముగా నేర్పడుచున్నది.

### కాలనియతికిఁ గారణము

రాజా! కాలనియతికిఁ గారణం బేమందువా? భగవంతునకుఁ గల లోకానుగ్రహము కాలమగును. భగవానుఁడు లోకక్షేమముఁ గోరి తనరూపంబును బదిరెండురూపంబులుగా విభజించి, రెండేసిమాసం బుల నొక్కొఋతువుగాఁ గల్పించి, తత్తదృతువులకుఁ దగినట్లు కర్మ భోగానుసారంబుగా శీతోష్ణాదిగుణంబులను గూర్చెను. ఆపోకర్మఫలం బుగా నిచ్చటిపురుషులు సూర్యనారాయణుని వారివారి వర్ణాశ్రమా చారంబులప్రకారము వేదోక్తవివిధకర్మంబులచేతను ధ్యానాదియోగం బులచేతను శ్రద్ధాభక్తులతో నారాధించి ముక్తకర్ములై పరమశ్రేయంబును బడయుదురు.

భూనభోభాగంబుల మధ్య కాలచక్రము తిరుగుచున్నప్పుడు దానిగతినిబట్టి మేషాదిరాశినామక చైత్రాదిద్వాదశమాసంబు లేర్పడును. ఆమాసంబులకుఁ జాంద్రమానంబున శుక్లకృష్ణపక్షంబులును సపాత

నక్షత్రద్వయమును అహోరాత్రంబులును సంవత్సరాయనంబులు గలుగు చున్నవి. సూర్యభగవానుఁడు సంవత్సరములోని యోజవపాలుకాలం బున రెండురాసులు నడచును. ఆకాలంబు ఋతు వనఁబడును. సంవత్సర ములో సగభాగకాలం బయనం బనఁబడును. మఱియు సూర్యభగవా నుఁడు ద్యావాపృథివీమండలంబులతోడ నభోమండలంబునందు వర్తించు నప్పుడు వాని గమనభేదంబునుబట్టిసంవత్సరము, పరివత్సరము, ఇళావత్స రము, అనువత్సరము, ఇద్వత్సరము అనునవి గలుగుచున్నవి.

పదమూఁడు మండలంబులు

రాజా! భూమండలంబునకు నూఱుయోజనంబుల దవ్వున మేఘమండలంబును, దానికిఁ బది వేలుయోజనంబులదవ్వున రాహుమండ లంబు నుండును. రాహుమండలముమీఁదఁ బదివేలయోజనంబులదవ్వున సూర్యమండలం బుండును; భూమండలము నరాదులకువలె మేఘమండ లము సిద్ధాదులకు స్థానమగును. రాహుమండలము పదుమూఁడువేల యోజనంబులు, సూర్యమండలము పదివేలయోజనంబులు విస్తారమై యుండును.

చంద్రమండలము

రాజేంద్రా! సూర్యమండలముమీఁద లక్షయోజనములదూరం బునఁ జంద్రమండలం బున్నది. దానివిస్తారము పదురెండువేలయోజనం బులు. సూర్యునిగతికన్నఁ జంద్రునిగతి ద్రుతతరముగావున సూర్యుఁ డొక్కసంవత్సరము నడుచు మార్గంబును జంద్రుఁ డొక్కనెలలో నడ చును. సూర్యునకు నొక్కమాసము పట్టుదూరము చంద్రుఁడు సపాద నక్షత్రద్వయంబునను, రవికి నొక్కపక్షము పట్టుదవ్వు శశి యొక్కదినము లోను జనును. చంద్రుఁ డొక్కొక్కనక్షత్రమును గడచుటకు ముప్పది ముహూర్తంబు లగును.

చంద్రగతి ద్రుతముగావునఁ జంద్రుఁ డెప్పుడును రవికి నగ్ర చారియై యుండును. చంద్రకళలవృద్ధిక్షయంబులఁబట్టి శుక్లకృష్ణపక్షవిభా

గం చేర్పడును. పితృదేవతలకు శుక్లపక్షంబు పగలును గృష్ణపక్షంబు రాత్రియు నగును.

చంద్రుఁడు సర్వజీవకోటికిఁ బ్రాణజీవమయుఁ డగుటయేగాక మనోమయుఁడు, అన్నమయుఁడు, అమృతమయుఁడు నగును. దేవపితృమనుష్య భూతపశుపక్షిసరీసృపల తాదులెల్లఁ జంద్రునివలనఁ బ్రాణాప్యాయంబుఁ బడయుచున్నవి. ఆకారణంబున వానిని సర్వమయుఁ డనియు వర్ణింతురు.

### నక్షత్రమండలము

పరీక్షిన్నరేంద్రా! చంద్రమండలంబునకుమీఁద లక్షయోజనంబులదూరంబున నక్షత్రంబు లుండును. అవి యభిజిత్తుతోఁ గలిసి యిరువదియెనిమిదినక్షత్రంబు లగును. ఆనక్షత్రంబులు కాలచక్రంబున నీశ్వరయోజితంబులై మేరుగిరికి దక్షిణంబుననే వర్తించును.

### శుక్రమండలము

నక్షత్రమండలముమీఁద రెండులక్షలయోజనంబుల దవ్వున శుక్రమండలం బున్నది. శుక్రునిగతిగూడ సూర్యగతితోఁపాటుండును. ఆకారణంబున శుక్రుఁడు సూర్యునకుఁ గొంచెము ముందో వెనుకనో చరించును. శుక్రుఁడు తఱుచుగా లోకంబునకు శుభమే తలంచుచుండును. శుక్రచారమునుబట్టి వర్షము నిర్ణయింపఁబడును. వర్షప్రతిబంధము గలిగినప్పుడు దానిని శుక్రుఁడే యుపశమింపఁజేయును.

### బుధమండలము

శుక్రమండలముమీఁద రెండులక్షలయోజనంబుల దూరంబున బుధమండలం బుండును. బుధుఁడు శుక్రునివలెనే సూర్యు ననుసరించి వానికిఁ గొంచెము ముందో వెనుకనో నడచును. బుధుఁడు నైజముగా సౌమ్యుఁడై లోకహితం బొనర్చుచుండును. బుధుఁ డెప్పుడేనియు సూర్యు నతిక్రమించునేని నయ్యది యతిచారం బనఁబడును. అప్పు డతివాతమును గేవల మేఘాడంబరంబు ననావృష్టి మొదలైనయుత్పాతంబులు గలుగు నని పెద్దలు వచింతురు.

### అంగారకమండలము

బుధమండలంబునకుమీఁద రెండులక్షల యోజనంబుల దూరంబున నంగారకమండలం బుండును. అంగారకుఁడు మూఁడేసిపక్షంబులకు నొక్కొక్కరాశి నడచును. అతఁడు వక్రించినప్పుడు మిక్కిలి యశుభుఁడై లోకంబునకుఁ బీడఁ గావించును.

### గురుమండలము

అంగారకమండలముమీఁద రెండులక్షల యోజనంబుల దవ్వున గురుమండలం బుండును. గురు వొక్కొక్కరాశి దాఁటుటకు నొక్కొక్కవత్సరం బగును. అతఁడు వక్రింపఁడేని బ్రాహ్మణకులంబునకు మే లగుచుండును.

### శనిమండలము

గురుమండలముమీఁద రెండులక్షల యోజనంబుల దూరంబున శనిమండలం బుండును. శని మందగతుఁడు గావున వానికి శనైశ్చరుఁడను సార్థకనామంబు గలిగెను. అతఁడు ముప్పదేసిమాసంబులకు నొక్కొక్కరాశి దాఁటును. అతఁ డంతపర్యంతము తద్రాశిస్థులకు నశాంతికరుఁడుగా నుండును.

### సప్తర్షి మండలము

శనిమండలంబునకుమీఁదఁ బదునొకండులక్షల యోజనంబుల దూరంబున సప్తర్షిమండలం బుండును. అందు సప్తర్షులు లోకహితైకపరులై ధ్రువస్థానంబగు విష్ణుపదంబును వలగొనుచుందురు.

### విష్ణుపదము

సప్తర్షిమండలముమీఁదఁ బదుమూఁడులక్షల యోజనంబుల దూరంబున విష్ణుపదంబు వెలయుచుండును. అందు ధ్రువుఁడు నెలకొని కల్పాంతజీవులకు సేవ్యుఁడై యుండు. ధ్రువునితోపాటు అగ్ని, ఇంద్రుఁడు, ప్రజాపతి, కాశ్యపుఁడు, ధర్ముఁడు అనువారుగూడ నక్షత్రభావంబును గాంచిరి. వారెల్లరు ధ్రువునిఁ బ్రదక్షిణీకరించుచుందురు.

## ధ్రువస్థానబలము

రాజేంద్రా! ధ్రువుని ప్రభావంబును నీకుఁ దెలిపెదను. వడ్లను నలుచుతఱిఁ గళ్లములోఁ బశువులు మూఁడుబంతులై తిరుగును. వానికి మధ్యభాగంబున మేధిస్తంభం బుండును. అట్లే యవ్యక్తవేగ కాలచక్రం బను కల్లములోఁ బరిభ్రమించుచుండునట్టి గ్రహనక్షత్రాది సకలజ్యోతిర్గణంబులకు ధ్రువుఁడు నడిమి మేధిస్తంభమై యుండును. వాని నాలంబనము గొని గ్రహనక్షత్రాదిగణంబు బహిరంతరయోగంబునఁ గాలచక్రయోగంబు నొంది వాతోదీరితంబులకుఁ గ్రిందఁబడక సంచరించుచుండును. గ్రహాదులు నిరాధారంబున సంచరించుచుండియుఁ గ్రిందఁబడని కారణం బేమం దువా? విహంగంబులును మేఘంబులును గర్మసహాయంబున మింటఁ జరించుచు నెట్లు క్రిందఁ బడవో, యట్లే జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుష సంయోగానుగృహీతంబులై కర్మనిర్మితగతిఁ దొలంగక నిరాధారంబున సంచరించుచుండియు నందుండి భూమిం బడకుండును.

## శింశుమారచక్రము

రాజేంద్రా! ఈజ్యోతిశ్చక్రంబు భగవంతుని శింశుమార సంస్థానం బని యోగధారణాక్రమంబున వర్ణింతురు. ఆకల్పనావిధానం బును వినుము. శింశుమారము కుండలాకారంబుగాఁ దలక్రిందయి యుండును. దాని పుచ్ఛాగ్రమంబున ధ్రువుండును, లాంగూలంబునఁ బ్రజాపతియు నగ్నీంద్రధర్ములును, దాని పుచ్ఛమూలంబున ధాతృవిధాతృలును, దాని కటిప్రదేశంబున సప్తర్షులును, దక్షిణావర్తకుండలీభూతమైన దాని శరీరదక్షిణభాగంబున నుదగయనంబులైన యభిజిదాది పునర్వసు పర్యంతచతుర్దశనక్షత్రంబులును, దాని సవ్యభాగంబున దక్షిణాయనంబులైన పుష్యాద్యుత్తరాషాఢాంతచతుర్దశనక్షత్రంబులును, దాని పృష్ఠంబున దేవమార్గంబును, దాని పూర్వభాగంబున నాకాశగంగయు, కుడియెడమ శ్రోణిప్రదేశంబులందుఁ బునర్వసు పుష్యనక్షత్రంబులును,

దక్షిణ వామపాదంబులందు నార్ద్రాశ్లేషలును, దక్షిణ వామనాసికంబుల నభిజిదుత్తరాషాఢలును, దక్షిణ వామలోచనంబుల శ్రవణ పూర్వాషాఢలును, దక్షిణ వామకర్ణంబుల ధనిష్ఠామూలలును, వామపార్శ్వవక్త్రంబుల మఖాద్యష్టదక్షిణాయననక్షత్రంబులును, దక్షిణపార్శ్వవక్త్రంబుల మృగశీర్షాదులైన యుదగయననక్షత్రంబు లెనిమిదియు, దక్షిణ వామస్కంధంబుల శతభిషగ్జ్యేష్ఠలును, ఉత్తరహనుప్రదేశంబున నగస్త్యుండును, అధరహనుప్రదేశంబున యముఁడును, ముఖంబున నంగారకుండును, ఉదరంబున శనియు, కకుదంబున గురువును, వక్షంబున సూర్యుండును, హృదయంబున నారాయణుండును, మనస్సునఁ జంద్రుఁడును, నాభిప్రదేశంబున శుక్రుండును, స్తనంబుల నశ్వినులును, ప్రాణాపానంబుల బుధుఁడును, గళంబున రాహువును, సర్వాంగంబులఁ గేతువును, రోమంబులఁ దారాగణంబు నున్నట్లు కల్పింతురు.

రాజేంద్రా! ఇది భగవంతుని సర్వదేవతామయరూపంబు. ప్రతిదినంబు రేపు మాపు సంధ్యాకాలంబులందు శుచిరై మౌనవ్రతంబు పూని యీదివ్యమూర్తిని మనోనేత్రంబునఁ జూచుచు 'నమోజ్యోతిర్లోకాయ కాలాయనాయ అనిమిషాంపతయే మహాపురుషాయాభిధీమహి' అను మంత్రపూర్వకంబుగా నావృత్తిపూర్వకంబుగా జపించి మ్రొక్కి స్మరించువారికిఁ దత్తత్కాలజ పాపంబులెల్ల నశించును.

### రాహుమండలము

రాజేంద్రా! సూర్యమండలంబునకుఁ గ్రిందఁ బదివేలయోజనంబుల దూరంబున నొకమండలం బుండుననియు, రాహు వను రాక్షసాధముఁడు సింహికాసుతుఁడు భగవత్కారుణ్యవిశేషంబున నమరత్వగ్రహత్వంబులు పడసి నక్షత్రరూపంబున నటనుండు ననియు, వాని యునికిం జేసి యామండలంబునకు రాహుమండలం బనుపేరు వచ్చె ననియుఁ గొంద ఱందురు. రాహుజన్మకర్మంబులఁ గూర్చి ముందు వివరింతును.

## సూర్యచంద్రగ్రహణములు

రాజా! తొల్లి సముద్రమథనకాలంబున రాహువు సుధాపాన మందుఁ బాల్గొన సాహసించెను. ఆసంగతి రవిచంద్రులు చూచి వెల్ల డించిరి. అందులకుఁగా నతఁడు వారిపయిఁ బగఁబూని త్రయోదశ సహస్రయోజనవిస్తారంబైన నిజమండలంబుతోఁ బదివేలయోజనంబుల నాయామంబు గల సూర్యమండలంబును పదురెండువేలయోజనంబుల యాయతంబైన చంద్రమండలంబును మ్రింగఁబూనెను. భగవంతుఁ డప్పుడు వానిపయిఁ జక్రాయుధంబును బ్రయోగించెను. రాహు వందు లకు వెఱచి రవిచంద్రులనుండి తొలంగెను. రాహువుయొక్క యుప సర్పణంబు సూర్యచంద్రగ్రహణం బందురు.

| | | | | |
|---|---|---|---|---|
| 13. | 1300000 | పదుమూఁడులక్షలు | ధ్రువమండలము (విష్ణుపదము) | |
| 12. | 1100000 | పదునొకండు | ,, | సప్తర్షిమండలము |
| 11. | 200000 | రెండు | ,, | శనిమండలము |
| 10. | 200000 | రెండు | ,, | గురుమండలము |
| 9. | 200000 | రెండు | ,, | అంగారకమండలము |
| 8. | 200000 | రెండు | ,, | బుధమండలము |
| 7. | 200000 | రెండు | ,, | శుక్రమండలము |
| 6. | 100000 | ఒకలక్ష | | నక్షత్రమండలము |
| 5. | 10000 | పదివేలు | | చంద్రమండలము [12 వేల యోజనంబుల విస్తారము] |
| 4. | 10000 | పదివేలు | | సూర్యమండలము [10 వేల యోజనంబుల విస్తారము] |
| 3. | 10000 | పదివేలు | | రాహుమండలము [13 వేల యోజనంబుల విస్తారము] |
| 2. | 100 | యోజనములు | మేఘమండలము (సిద్ధాదులస్థానము) | |
| 1. | | భూమండలము | | |
| | 3530100 | భూమికి ధ్రువమండలమునకు ముప్పదిఅయిదులక్షలు ముప్పదివేలు నూఱుయోజనములు దూరము. | | |

### అధోలోకసప్తకము

రాజా! అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము అని యధోలోకంబు లేడు భూలోకము క్రిందఁ గలవు. అందు అతలము భూలోకంబునకుఁ గ్రిందఁ బది వేలయోజనంబులదూరంబున నుండును. అట్లే వితలాదు లొకదానికి నొకటి పదివేలయోజనంబుల క్రింద నుండును. భూలోకంబునకును బాతాళంబునకును డెబ్బదివేలయోజనంబులదవ్వు గలదు. ఆలోకంబులందు స్వర్గాధికకామభోగైశ్వర్యానందాలకు యోగ్యంబులైన భవనంబులును వనోపవనంబులును గలవు. ఆకారణంబున వానిని బిలస్వర్గంబు లందురు. అందు దైత్యదానవనాగాధిపులు పుత్రకళత్రబాంధవాదులఁ గూడి వివిధవినోదరతులై కామభోగంబులకు నీశ్వరప్రతిహతి యేనాఁడును గలుగనేరదని తలంచి యథామతి నిత్యసంతోషంబున నుందురు.

### అధోలోకములు

భూలోకము క్రింద

| | | |
|---|---|---|
| 10000 | యోజనములు | అతలలోకము |
| ,, | ,, | వితలము |
| ,, | ,, | సుతలము |
| ,, | ,, | రసాతలము |
| ,, | ,, | తలాతలము |
| ,, | ,, | మహాతలము |
| ,, | ,, | పాతాళము |
| 70000 | యోజనములు. | |

### మయనిర్మాణకౌశలము

... రాజేంద్రా! మాయావిద్యుఁడైన మయుఁడు మహానిర్మాణకౌశలంబు గలవాఁ డందురు. వాని నిర్మాణకౌశలంబుఁ జూడవలయునన్నచో

నయ్యధోలోకంబులందుఁ జూడనగును. అందలి ప్రాకారగోపురంబులును సభాచైత్యంబులును జత్వరప్రాసాదంబులును వివిధరత్నరచితంబులై నానాకాంతు లీనుచుండును. అచ్చట శుకశారికలును బారావతంబులును నానామణికృతంబులై సజీవంబు లట్లొప్పారును. తరువులు మహోన్నతములై లలితలతాలింగితంబు లగుచుఁ గిసలయకుసుమస్తబకఫలంబులతో నిండారియుండును. ఆతీవెడోలికలందుఁ బలువిధములైన విహంగంబు లూఁగుచు లేఁజివుళ్లను నిండారఁబండినపండ్లను మెసవుచు మృదుమధుర రుతంబుల వీనులకు నానందము గూర్చుచు నుండును.

అట నుద్యానవనాంతరంబులందు విశాలసరోవరంబులు నిర్మల శీతోదకంబుల నిండియుండును. అందలి కమలకువలయంబులు హంస కారండవాదిపక్షుల పక్షవాతంబులకు రేఁగిన తరఁగలకుఁ గదలియాడు చుండును. ఆపక్షు లాపద్మాదులపయిఁ గూర్చుండి యుయ్యెల లూఁగుచుఁ గలధ్వనులు గావించుచుండును. ఆయిందీవరంబులమకరందంబును భ్రమ రంబులు గ్రోలి మైమఱచి యథేచ్ఛగా ఝంకారంబులు గావించుట చూచి యానందింపనగునేగాని చెప్పఁ దరముగాదు.

### అధోలోకములు - రవిప్రచారము

రాజా! అధోలోకంబులందు రవిప్రచారము గలుగదు. ఆకారణంబున నచ్చట రేయుంబవళ్లను కాలవిభాగము లేదు. అందలివారికి వెలుతు రెట్లందువా? అందున్న ఫణీంద్రుల ఫణాగ్రమణికిరణంబులు సూర్యకిరణంబులకు మాఱుగా వారికి వెల్తురు గూర్చుచుండును. ఆలోకంబులందలి యన్నపానంబులు దివ్యౌషధిరసరసాయనాత్మకంబు లగుటంజేసి తన్నివాసు లాధివ్యాధులుగా జరాపలితంబులుగాని వైవర్ణ్యంబుగాని స్వేదాదిదుర్గంధాదులుగాని యెట్టివో యెఱుంగరు.

### అతలవిశేషంబులు

రాజేంద్రా! అతలలోకంబున మయునిపుత్త్రుఁడు బలుఁ డనువాఁ

దుండును. వాఁడు షణ్ణవతిమాయలను సృష్టించెను. ఆమాయలలోఁ గొన్ని యిప్పటికిని మాయావంతులయొద్దఁ గలవు. బలునిమాయలలో నొక్కటి యుదాహరణార్థము చెప్పెద వినుము. అతఁ డావులించును. అయ్యావు లింతతోడ స్వైరిణులును గామినులును బుంశ్చలులు ననెడి త్రివిధస్త్రీగణంబు జనించును. ఆస్త్రీ లయ్యతలలోకముఁజొచ్చిన పూరుషునకు హాటకం బనురసంబును ద్రావనిత్తురు. ఆరసంబును గ్రోలినంతనే యాపురుషుఁడు తానే యీశ్వరుండ ననియు సిద్ధుండ ననియు అయుత మహాగజబలుండ ననియు భావించుచు, నుపభోగచతురుఁడై యా యింతుల క్రీఁగంటిచూపులకుఁ జిఱునగవులకు సల్లాపాలింగనంబులకుఁ బారవశ్యతఁ జెందును. అప్పుడు వా రతనితోడ యథేచ్ఛాభోగంబు లనుభవింతురు.

### వితలవిశేషములు

వితలంబున స్మరహరుఁడు హాటకేశ్వరుఁ డనుపేరఁ బ్రజాసృష్టివృద్ధినిమిత్తము భవానీమిథునీభూతుఁడై పారిషదవర్గంబుతోడ నుండును. ఆపరమేశ్వరునివీర్యము హాటకి యనునదీరూపంబునఁ బ్రవహించుచుండును. ఆనదీరసంబు ననలుండు వాయుసహాయంబునఁ ద్రావి యుమిసెను. ఆ యుమ్మి హాటకసువర్ణం బనుపేరు గాంచి, దేవేంద్రాంతఃపురకామినీకాముకులకు వివిధభూషణయోగ్యమై వెలయును.

### సుతలవిశేషములు

తొల్లి భగవానుఁడు మహేంద్రునకుఁ బ్రియముసేయువాఁడై యదితిగర్భంబున వామనుఁడై జనించి బలిచక్రవర్తిని మూఁడడుగులనేల యాచించి రెండడుగులలోన లోకద్వయంబు నాక్రమించెను. మూఁడవ యడుగునకు బలి వానితల నిచ్చెను. అప్పుడు భగవానుఁడు బలిసత్యంబునకు మెచ్చి వానికి సుతలలోకాధిపత్యంబు నొసఁగెను. నాఁడుసుత బలి యందుఁ జేరి దేవేంద్రాదులకుఁగూడ దుర్లభమైన సర్వశ్రీల ననుభ

వించుచు స్వధర్మంబున నిలిచి భగవంతుని నారాధించుచు సుఖం
బుండును.

రాజేంద్రా! బలికి నంతటిదైన యైశ్వర్యంబుఁ గలుగుటకుఁ గారణ మేమందువా? ఉత్తమపాత్రంబునకుఁ జేసిన భూదానఫలంబని కొంద అందురు. ఆమాట యుక్తముగాదు. అట్లనుటవలన దానంబులకు ఫలంబు లేదని చెప్పుచున్నానని భావింపవలదు. దానంబులకు ఫలము గలదు. అది తావన్మాత్రమగునే గాని వేఱుగాదు. బలి యైశ్వర్యంబునకు వాని భగవద్భక్తియే కారణము.

కర్మబంధంబును బాయుటకై సాంఖ్యయోగాది నానోపాయం బుల నాశ్రయింతురు. అట్టివానికిఁగూడ నతీతమైన కర్మబంధము భగవన్నామోచ్చారణమాత్రాననే పటాపంచలగును. తుమ్మినప్పుడో యావులించునప్పుడో భగవన్నామంబు నుచ్చరింతురు. అంతమాత్రానఁ గూడఁ గర్మబంధ మెడయును. ఇఁక బుద్ధిపూర్వంబుగా భక్తితో భగవన్నామకీర్తనము గావించినప్పుడు తత్ఫలము చెప్పఁదరమా! బలి చక్రవర్తి వానిశరీరంబుఁదక్క సర్వము భగవంతునకు శ్రద్ధాభక్తులతో సమర్పించుకొనెను. అట్టిభక్తునకు నట్టిభాగ్యంబు నిచ్చుట వింతగాదు.

రాజా! ఐశ్వర్యం బెప్పుడు నాత్మజ్ఞానవిస్మృతికారణం బగునదై యుండఁగా, భక్తునకు నట్టిదానిని భగవంతుఁ డిచ్చుటకు వానిభావ మేమని యడుగవచ్చును. ఈశంకకు బలియే సమాధానము చెప్పెను. వానివాక్యములను దెలిపెద వినుము.

'దేవేంద్రుఁడు మహావిద్వాంసుఁడు; వానికి బృహస్పతి యాలో చనగురు వగును. అట్లుండియు నయ్యమరేశ్వరుఁడు త్రైలోక్యాధి పత్యభోగంబునే భగవంతు నర్థించెను గాని పరమార్థంబును వేఁడఁ డయ్యెను. కటా! కాలవేగం బింతనరాదు. అది మన్వంతరంబులకుం గూడ మార్పుఁ గలిగించుచుండును. అట్టికాలమ్ము మ్రోల నిట్టియాధి

సత్యంబు లెందాఁక నిల్చు ? ఐశ్వర్యాదులెల్ల క్షణభంగురంబులు. నా పితామహుఁడైన ప్రహ్లాదునకు వాసుదేవుని ప్రసాదంబు లభించెను. అదియే పదివేలుగా నాతాత భావించెను. భగవానుఁడు నాతాతను బిలిచి 'వత్సా! నీతండ్రిరాజ్యంబును గ్రహించి పరిపాలింపు' మని స్వయముగాఁ జెప్పెను. నాతాత యామాట విని 'స్వామీ! నీపరిచర్యయే నాకుఁ జాలు' నని పలికి తత్సేవాభాగ్యంబును వరించెను. ఆమహానుభావుని మార్గంబునకన్న నుత్తమమార్గంబు గలదా ? నాబోఁటిరాగలుబ్ధులను నంతటి మహాభాగ్యము గలుగునా ?' అని బలిచక్రవర్తి యాత్మతృప్తిఁ బడసెను.

రాజేంద్రా! భగవంతుఁ డట్లు బలిచక్రవర్తిని నిలువుదోఁచి కొండలోయంబోని సుతలంబున వానిని ద్రోయుట వాని ననుగ్రహించుటయే గాని వేఱుగాదు. ఆమాటకుఁ దార్కాణ మేమందువా ? భగవానుఁడు గదాపాణియై బలివాఁకిట కావలి కాచుటయే నిదర్శనము. రావణుఁడు దిగ్విజయార్థము వెడలి బలిపురంబునకు వచ్చి వానియనుమతిం బడయకయే లోనఁ బ్రవేశింప యత్నించెను. భగవానుఁడు నిజపాదాంగుష్ఠంబున నయ్యసురేశ్వరునిఁ జిమ్మెను. అతఁడు పదివేలయోజనంబుల దవ్వునఁ బడెను. బలిచక్రవర్తి మహిమం బెంతో యూహింపుము. ఆమహనీయునిచరిత్ర వినఁదగు. దానిని సవిస్తరంబుగా వేఱొకసారి వివరింతును.

### తలాతలవిశేషంబులు

తలాతలమందు మయుఁడు వసించును. అతఁడు త్రిపురాధిపతియై కొండొకనాఁడు లోకంబులకు నెగ్గు సేయసాగెను. శంకరుఁడు లోకక్షేమార్థము త్రిపురంబులను దహించెను. అంతట మయుఁడు గర్వంబు మాని శంకరుని శరణిల్లెను. ఆభగవానుఁడు కరుణించి వానికి వాని పూర్వవైభవంబు ననుగ్రహించెను. మహాదేవుని ప్రాపు గల్గుటంజేసి

మయునకు విష్ణుచక్రభయంబు తొలంగెను. అతఁడు మాయావులకు నాచార్యుఁడై యం దుండును.

### మహాతలవిశేషములు

కద్రూతనయులు తక్షకకాళియాదులు మహామస్తకులును మహాక్రోధవశులు నైనవారు గరుడునకు వెఱచి పుత్రకళత్రంబులతోడ మహాతలమందుఁ గాపురం బుందురు.

### రసాతలవిశేషములు

ఫణులును నివాతకవచకాలకేయాది దైత్యదానవులును సాహస బలగర్వితులై సురలను బాధింపసాగిరి. ఇంద్రుఁడు సరమ యనుదానిని వారికడకుఁ బంపెను.ఆసరమ వారిమ్రోల నింద్రప్రభావంబును స్తుతించెను. అదివిని వారు భయకంపితులై రసాతలమందు నణఁగియుందురు.

### పాతాళవిశేషములు

పాతాళమందుఁ బంచశీర్షులు సప్తశీర్షులు శతశీర్షులు నైన ఫణి రాజులు వాసుకి శంఖ కులికమహాశంఖ శ్వేతధనంజయ ధృతరాష్ట్రశంఖ చూడ కంబలాశ్వతర దేవదత్తప్రముఖు లుందురు. వారిఫణాగ్రమణి మరీచు లందలి చీఁకట్లను విరియించి వెల్తురుఁ గూర్చుచుండును.

### ఆదిశేషువు

రాజేంద్రా! ఆదిశేషువు వేయితలలతో నొప్పుచుఁ బాతాళ మందు ముప్పదియోజనంబుల యంతరంబు నాక్రమించియుండును. అతఁడు భగవంతుని తామసాంశంబనియు, ద్రష్టృదృశ్యంబులకు రెంటికి నేకీకరణలక్షణంబైన యహంకారంబునకు నధిష్ఠాత యనియుఁ, దత్కారణంబున వానికి సంకర్షణుం డనుపేరు వచ్చె ననియుఁ జెప్పుదురు. సాత్వత తంత్రనిష్ఠులు వానిని జతుర్వ్యూహోపాసనంబుల నారాధింతురు.

ఆదిశేషువును అనంతుఁడనియుఁ బేర్కొందురు. అతఁడు వాని వేయిపడగలలో నొక్కపడగమీఁద భూమండలంబునెల్ల నావగింజవలె

ధరించియుండును. అతఁడు విశ్వోపసంహారంబును దలంచునేని వానికను బొమలు ముడివడును. అప్పుడు వాని భ్రూమధ్యప్రదేశంబునుండి సన్నికర్షణుం డనురుద్రుఁడు త్రిశూలధారియై మూఁడునేత్రంబులతోడను నేకాదశవ్యూహంబులతోడను జనించును. అదియే వానితామసత్వ లక్షణం బగు.

అయ్యనంతుని యరుణనఖమణిరుచిరంబులైన పాదకమలంబులకు నాగరాజులు వారిమణిమయమస్తకంబులతో నేకాంతభక్తి చేయుదురు. అయ్యనంతుని భుజంబులు రజతస్తంభంబులఁ బోలియుండును. నాగకన్యలు తద్భుజాలింగనలాంఛనంబులైన చందనాదులతో నొప్పుచుఁ దమయను రాగంబులను లలితస్మితలోలవిలోకనంబులఁ బ్రకటింతురు. ఇది వాని సుభగత్వలక్షణం బగును.

అయ్యనంతుఁడు రోషామర్షంబులు మాని లోకక్షేమపరాయణుఁడై నీలాంబరముఁ గట్టి నవతులసీగంధలోలమధుకరమధురఝుంకారంబులతోడి వైజయంతీవనమాలికను గంఠసీమ ధరించి, యేకకుండలంబును దాల్చి భుజంబున నాఁగలి యుంచి, నిజసంతోషాతిశయంబును సూచించు మ్రాఁగన్నుతో, స్నేహార్ద్రభావంబును బ్రకటించు క్రీఁగంటి చూపుతో నున్నప్పు డామూర్తిని బలభద్రరూపంబున సురోరగసిద్ధగంధర్వవిద్యాధరమునిగణం బుపాసించును. ఆదేవదేవుఁడు వారి ధ్యానంబులను గ్రహించి యందు ముముక్షువులకు నంతర్గతుఁడై అనాది కాలకర్మవాసనాగ్రథితంబును అవిద్యామయంబును త్రిగుణాత్మకంబునైన హృదయగ్రంథిని విదళించును. వాని మహానుభావత్వంబును వినఁగోరుదువేని, నారదుఁడు తుంబురసహితుఁడై బ్రహ్మసభలో వానిం గూర్చి కావించిన ప్రస్తుతినిఁ జెప్పెద నాలకింపుము.

## నారదకృతబలభద్రస్తుతి

ఎవని వీక్షణమాత్రంబున సత్త్వాదిప్రకృతిగుణంబు లుత్పత్తిస్థితి

లయంబులు గాంచునో, ఎవ్వఁ డనాదియు ననంతుఁడు నొకరుఁడు నయ్యు నానారూపకార్యప్రపంచంబును దలలో నుంచునో, ఎవఁడు సదసద్భావ కారణశుద్ధసత్త్వమూర్తియయ్యు భక్తుల యనుగ్రహార్థంబు పెక్కు రూపంబులు దాల్చి వారిహృదయాంతరసీమల నధిష్ఠించునో, ఎవని నామంబును బరిహాసంబున నొండె నాకస్మికంబుగా నొండె విన్నను దలంచినను బల్కినను మహాపతితుఁడు గూడఁ బుసీతుఁ డగునో, అట్టిబ్రహ్మాత్మునితత్త్వం బెఱుంగ నెవ్వనికిఁ దరంబగు."

రాజేంద్రా! సకాములకుఁ బొందనైన వివిధప్రవృత్తిధర్మపరిపాకగతులను దెలిపితిని. కర్మకారులు వారివారి కర్మానుసారగతులను బడయుదురు. ఇంక నెద్దియేనియు వినవలతువేని నడుగనగు."

## కర్మఫలవైచిత్రి

మునులారా! శుకమహర్షి యట్లు పలుకఁగాఁ బరీక్షిన్నరేంద్రుఁడు వానిని విని యట్టె యోచించి 'మునీంద్రా! 'ఒక్కరూపకర్మంబునే పెక్కు రాచరింతురు. ఫలంబన్ననో యది యొక్కరూపంబున నుండక బహువిధంబు లగును.' అని చెప్పితిరి. ఏకవిధకర్మంబునకు ఫలగతివైషమ్యంబు గలుగుటకుఁ గారణమేమి?' అని యడిగెను. వానికి శుకమహర్షి యిట్లనియెను.

"రాజేంద్రా! కర్మంబులెల్ల స్వభావప్రేరితంబులై జరుగుచుండును. స్వభావరహితమైనపదార్థమే సృష్టిలోఁ గలుగదు. స్వభావము సత్త్వరజస్తమోగుణరూపంబున వ్యవహించును. అనఁగాఁ బ్రారబ్ధకర్మఫల వాసనాసముచ్చయము స్వభావం బగుఁ గావునను, ఆ స్వభావవర్తనము త్రిగుణాత్మకంబుగా నుండుఁగావునను, ఏసమయంబున నెట్టివాసన వీచునో దానికి సరియైన సంకల్పంబు పుట్టుటయు, ఆసంకల్పము ప్రకారము గుణశక్తి పైకొని వ్యవహరించుటయు నగును. ఆ వ్యవహారంబునే కర్మ మందురు. కాఁబట్టి భోగ్యఫలవాసనల భేదంబులనుబట్టి సంకల్పభేదంబు

లును, వానింబట్టి కర్మ ఫలభేదంబులు గలుగుచున్నవి. కావున బాహ్య దృష్టికిఁ గర్మం బేకరూపంబునఁ గాన్పించినను గర్మానుష్ఠాతలసంకల్ప భేదంబులనుబట్టి ఫలభేదంబులు గలుగుచున్నవి. మఱియు వాసనలందుఁ గోట్లపర్యంతంబుగా నంశాంశ భేదంబు లుండును. ఆభేదంబులనుబట్టి ఫలంబులందుఁ గూడనంశాంతభేదంబులు గలుగుచున్నవి. కావుననే 'గహనా కర్మణో గతిః' అనిరి.

### శుభాశుభములు

కర్మానుష్ఠాతయొక్క సంకల్పశుభాశుభంబులఁబట్టి కర్మము శుభము అశుభము అని రెండువిధంబు లగును. కర్మశుభాశుభతత్త్వంబులఁబట్టి ఫలముగూడ శుభాశుభంబు లని రెండువిధంబు లగును. శుభఫలంబునకుఁ బుణ్యగతు లెట్లో యశుభఫలంబునకు నరకగతులు గలుగును. ఆ రెండుగతులలోఁగూడ శ్రద్ధాతారతమ్యములఁబట్టి లెక్కింపరాని భేదంబులు గలుగును.

### నరకములు - వాని స్థానములు

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షిని విని 'మునివర్యా! నరకంబు లనునవి యనుభవవిశేషంబులా? లేక, దేశవిశేషంబులా? దేశవిశేషంబు లగునేని అవి ముల్లోకంబులలోపల నుండునా? వానివెలుపల నుండునా?' యని యడిగెను. వానికి శుకుఁ డిట్లనియెను.

'రాజేంద్రా! నరకంబులు దేశవిశేషంబు లగును. అవి ముల్లోకంబులలోపలనే దక్షిణదిశయందు భూమికిఁ గ్రిందిభాగంబున, నండజలాశయంబునకు మీఁదిభాగంబున నుండు. పితృపతియైన వైవస్వతయముఁడు భగవదాజ్ఞాప్రకారం బందుండి వానిదూతలు తనలోకంబునకుఁ గొనివచ్చునట్టి మృతపురుషులకు వారివారి దుష్టకర్మానుసారంబుగా శిక్షలు విధించుచు నుండును. అగ్నిష్వాత్తాది పితృగణంబులుగూడ నందే వసించుచు వారిగోత్రజులకు మేలు గోరుచు సమాధినిష్ఠులై యుందురు.

### నరకములసంఖ్య

నరకంబు లిఱువదియొక్కండని కొందఱిమతము. అవి తామిస్రము, అంధతామిస్రము, రౌరవము, మహారౌరవము, కుంభీపాకము, కాలసూత్రము, అసిపత్రవనము, సూకరముఖము, అంధకూపము, క్రిమిభోజనము, సందంశము, తప్తోర్మి, వజ్రకంటకశాల్మలి, వైతరణి, పూయోదము, ప్రాణరోధము, విశసనము, లాలాభక్షము, సారమేయాదనము, అవీచిరయము, రేతఃపాతము అనుపేర్లం బరంగును.

ఇవిగాక క్షారకర్దమము, రక్షోగణభోజనము, శూలప్రోతము, దందశూకము, అవటనిరోధనము, అపర్యావర్తనము, సూచీముఖము అనునరకంబు లేడు గలవని మఱియొకమతము. ఈమతప్రకారంబు నరకంబు లిఱువదియెనిమిది యగును.

## నరకబాధలు

### 1. తామిస్రము

ఎవరు పరులభార్యలనుగాని ధనాపత్యంబులనుగాని హరింతురో, వారిని యమకింకరులు కాలపాశంబులం గట్టి బలాత్కారంబుగాం దామిస్రనరకమందుం బడవేసి యాహారంబు నిడక పడతిట్టుచుం, గట్టియలతోం గొట్టుచుం, గొండలమీందికి నెక్కించి యందుండి క్రిందికిం ద్రోయుచు వివిధకష్టంబులం గుడుపురు. ఆపాపాత్ము లట్టిబాధలకు లోనై యెట్టకేలకు మూర్ఛిల్లుదురు. అంతలో వారిని వదలుదురు.

### 2. అంధతామిస్రము

భర్తను మోసగించి వానిభార్యతో నుపభోగించువానిని నంధతామిస్రంబునం ద్రోసి బాధింతురు. అతం డాబాధలు పడి దృష్టితప్పి స్మృతివెడి మొదలునఱికినమ్రానువలె వికలాంగుండై యయ్యాతనల ననుభవించుచుండు.

### 3. రౌరవము

నేను; నాది అనెడి స్వాభిమానము గలిగి, యాత్మార్థము పర భూతంబులకు ద్రోహంబొనర్చి, తన్నుఁ దనకుటుంబమును రక్షించుకొను వారికి రౌరవప్రాప్తి యగును. ఏభూతంబులకు వా రట్లు ద్రోహ మొనరించిరో, యాభూతంబు లచ్చట రురుమృగంబులై వేచియుండి యా ద్రోహు లటకు వచ్చినంతనే వారిని నానాహింసలఁ గాఱించును. ఏమృగంబులకొమ్ములు సర్పదంష్ట్రలకన్న నతిక్రూరంబులుగా నుండునో యా మృగంబులను రురువు లందురు.

### 4. మహారౌరవము

ఎవ్వఁడు కేవలాత్మార్థమై భూతద్రోహము చేయునో, యానరాధముని మహారౌరవంబునఁ ద్రోయుదురు. అచ్చట మహారురువు లుండు. అవి వాని వాడికొమ్ములతో నప్పాపాత్ముని జీల్చిచీల్చి తన్మాంసంబును గబళించును.

### 5. కుంభీపాకము

పశుపక్ష్యాది ప్రాణులను హింసించు నిర్దయాత్ములకుఁ గుంభీపాకపతనం బగును. అచ్చట వారిని సెలసెలక్రాగుమూనియభాండంబులలో వైచి యదిమి పెట్టుదురు.

### 6. కాలసూత్రము

ఇది పదియోజనంబుల విస్తారము. తలిదండ్రులకును బ్రాహ్మణులకును ద్రోహం బొనర్చినవారి నిందువైచి, వారి క్రింద నగ్నిమంటలు పెట్టుదురు. మఱియు వారికి నన్నపానంబు లియ్యరు. అట్లు వారు తదగ్నితాపంబునకుఁ గ్రాఁగుచు నాఁకలిదప్పులకుఁ జిక్కియు సొక్కియు నిలువనేరకఁ బడుచు లేచుచు 'అయ్యో! అయ్యో!' అని యేడ్చుచుఁ బరితపింతురు. పశువునకు నెన్ని రోమంబు లుండునో యన్నివేలసంవత్సరంబులు వా రచ్చట ఘోరవేదనల ననుభవింతురు.

### 7. అసిపత్రవనము

కొందఱు స్వధర్మమైన వేదమార్గంబును నిర్నిమిత్తంబుగా వదలి పాషండమతంబును గ్రహించి చరింతురు. అట్టివారికి నసిపత్త్రవనప్రాప్తి యగు. అచ్చటి తాటియాకులు రెండువైపుల అంచములువలెఁ బదనై యుండును. దానంజేసి యా నరకదేశంబునకు నట్టిపేరు గలిగెను. పాషండుల నచ్చట నట్టి అంచంబులతోఁ గోయుదురు. వా రట్లు కోఁతలంబడి తుత్తునియలైన తనువులతో నెత్తురు లొల్కుచు నొచ్చితిమి చచ్చితి మని యార్చుచుఁ బేర్చుచు నుందురు.

### 8. సూకరముఖము

రాజులుగాని రాజపురుషులుగాని యదండ్యులను దండించినను బ్రాహ్మణునకు శరీరదండనంబు విధించినను, వానిచేత నకార్యంబుఁ జేయించినను దద్దోషఫలంబుగాఁ దద్రాజాదులకు సూకరముఖనరక ప్రాప్తి గలుగును. అట యమభటులు వారిని బట్టి చెఱుకుగడలనట్లు నిలువున విఱిచి నలిగులి చేయుదురు. ఆదుష్టు లటఁ గూయుచుఁ దెలివితప్పి పడి యుందురు.

### 9. అంధకూపము

రాజా ! ఈశ్వరుఁడు ప్రతిజీవికిఁ దగినవృత్తిని గల్పించును. ఆజీవులలోఁ గొన్నిటివృత్తులు పరబాధకరంబులుగా నుండును. నల్లులు దోమలు మున్నగు క్షుద్రజంతువు లీకోటిలోఁ జేరును. వానికి మనుష్యరక్తపానాదులు వృత్తియగును. అవి వానివృత్తిని గావించునప్పుడు వానివలనఁ బరులకుఁ గల్గుబాధ నవి గ్రహింపవు. అయినను వాని కార్యము బుద్ధిపూర్వకము గాదు. అట్టి జీవరాశిని జంపువారికి నంధకూపప్రాప్తి యగు. అట మత్కుణాదులు పూర్వము వారిచేతఁ జంపఁబడినవి వారికై వేచియుండి వా రందుఁ జొచ్చినవెంటనే వివిధగతుల వారిని బాధించును. వారు తత్పీడితులై నిద్రానిర్వృతులు లేక కుశరీరంబున జీవాత్మఁ డట్లు పరితపింతురు.

10. క్రిమిభోజనము

ఎవఁడు తనకుఁ బ్రాప్తమైనయన్నంబు నతిథిభృత్యాదులకుఁ బంచి పెట్టకయుఁ బంచయజ్ఞంబులు గావింపకయుఁ దా నొక్కరుఁడే భుజించునో, వానిని వాయసతుల్యుఁ డందురు. అట్టివానినిఁ గ్రిమిభోజననరకమందుఁ ద్రోయుదురు. ఆనరకమందు నూఱువేలయోజనంబులయాయతమైన క్రిమికుండంబు గలదు. అతఁడా కుండంబునఁ బడినంతనే యందున్న పురువులు వానిని దిన నారంభించును. అతఁడు నాఁకటికిఁ జిక్కి యాపురువులఁ దినసాఁగును. అట్లతఁడు స్వపాపపరిహారాంతమువఱకు నందు దుఃఖభాగియై యుండును.

11. సందంశము

బ్రాహ్మణధనంబును బలాత్కారంబుగా నొండె దొంగతనంబుగా నొండె హరించువారును, మహాపత్సమయందుఁ దక్క పరులసొమ్మును ముచ్చిలించువారును సందంశనరకంబునఁ బడుదురు. అట వారిని నెఱ్ఱగాఁ గాఁగిన యినుపపటకార్లతోఁ బట్టి యగ్నిపిండంబులనట్లు గ్రుచ్చి బాధింతురు.

12. తప్తోర్మి

స్త్రీలుగాని పురుషులుగాని మదనాంధులై పొందరానివారిని బొందిరేని, వారినిఁ దప్తోర్మియందుఁ ద్రోసి కశాఘాతంబుల పాలొనర్తురు. మఱియు లోహముచేత స్త్రీపురుషరూపంబులను నిర్మించి యావిగ్రహంబుల నెఱ్ఱగాఁ గాల్చి స్త్రీప్రతిమను బురుషునిచేతను, బురుషప్రతిమను స్త్రీచేతను గౌఁగలింపఁజేసి పడరానియిడుమలఁ గుడుపుదురు.

13. వజ్రకంటకశాల్మలి

పశ్వాదులతో సంగమించువారిని వజ్రకంటకశాల్మలినరకంబునఁ బడవైచి యందున్న ముండ్లబూరుగమానునందుఁ గొఱతవేయుదురు. ఆవృక్షానిముండ్లు వజ్రపుముండ్లకంటెఁ దీవ్రమైయుండును. ఆముండ్లు నిలువెల్లఁ గ్రుచ్చి యోర్వరానిబాధఁ గలిగించును.

## 14. వైతరణి

సత్కులమందు జనించియుఁ దత్కులాచారంబులను ద్యజించి పాషండులై వర్తించువారికి వైతరణిశరణం బగును. వైతరణి యనునది విణ్మూత్రపూయశోణితంబులతోఁ గేశనఖాస్థిమేదో మాంసవసలతో నిండి మరిగి దుర్భరదుర్గంధబంధురమై యగత్తైగా నుండును. అందుఁ ద్రోయఁబడిన యాపాపాత్ముల నంవలి జలజంతువులు పొడిచిపొడిచి చీల్చిచీల్చి తినసాగును. వారు స్వకర్మఫలంబు ననుభవింపవలసి యున్నందున నట్టిపాట్లకు లోనయ్యుఁ బ్రాణంబులను బాయరు. వారి కప్పుడు స్వకృతపూర్వదుష్కృతంబులు తలంపునకు వచ్చును. వారు వానిని దలంచి తలంచి చింతపడుచుందురు.

## 15. పూయోదము

బ్రాహ్మణులకుఁ బుట్టియు శూద్రస్త్రీసక్తులై శౌచాచారనియమం బులను దిగనాడి సిగ్గువిడిచి స్వైరవృత్తి నుండువారు పూయోదప్రాప్తు లగుదురు. ఆపూయోదము పూయవిణ్మూత్రశ్లేష్మలాలాపూర్ణమై యత్యం తాసహ్యముగా నుండును. వారందుఁ బడి యాపూయాదులఁ దినుచు దుఃఖించుచు నుందురు.

## 16. ప్రాణరోధము

బ్రాహ్మణులు కుక్కలను గాడిదలను బెంచి వానిని వెంటఁగొని పోయి వేటలాడినను, మృగంబులను నిర్నిమిత్తంబుగాఁ జంపినను, వారినిఁ బ్రాణరోధంబున యమభటులు ద్రోసి క్రూరనారాచంబుల బాధింతురు.

## 17. వైశసము

కేవల దాంభికులై యజ్ఞంబులు సంకల్పించి పశుహింస చేయు వారిని వైశసంబున వైతురు. వారి నచ్చట యమకింకరులు వివిధహింసల పాలు గావించి చంపుదురు.

## 18. లాలాభక్షము

ఎవఁడు కామాంధుఁడై సవర్ణయగు భార్యచేతఁ దనశుక్లంబును ద్రావించునో, వానిని లాలాభక్షమందలి రేతఃకుల్యలోఁ బడవైచి వాని చేత రేతఃపానంబు చేయింతురు.

## 19. సారమేయాదనము

గృహాదులకు నగ్గిపెట్టుట, ప్రాణులకు విషము పెట్టుట, గ్రామంబు లకును బిడారులకును గీడుగావించుట మున్నగునట్టి యక్రమంబులను జేయునట్టి రాజులుగాని చోరులుగాని సారమేయాదనప్రాప్తులై, యందున్న వజ్రకఠోరదంష్ట్రాభయంకరసప్తశతశునకదష్టులై నవిసి నశింతురు.

## 20. అవీచిరయము

మోమోటము వలనఁగాని, లంచము గొనిగాని తప్పుసాక్ష్యము చెప్పువారిని, క్రయవిక్రయంబులపట్ల బొంకువారిని అవీచిరయంబున వైతురు. అందు తాయియొకటి జలమువలె గాన్పించుచుఁ బఱచి యుండును. ఆపాపాత్ములను శతయోజనోన్నతశిఖరాగ్రంబులనుండి తలక్రిందుగా నబ్బండపయిఁ ద్రోయుదురు. వా రాశిఖరాగ్రంబులనుండి దొరలి దొరలి నూగింజంతతునియలై యాబండపయిఁ బడియుఁ గర్మాను భవకారణంబునఁ బ్రాణంబులు వాయరు. వారిని మఱల నట్లే గావింతురు.

## 21. రేతఃపానము

బ్రాహ్మణుఁడుగాని వానిభార్యగాని కల్లు ద్రావినను, రాజులొండె వైశ్యులొండె వ్రతకారణంబుననో ప్రమాదంబుననో సోమపానముచేసి నను, సుర ద్రావినను వారిని రేతఃపాననరకంబున వైచి రొమ్ముమీఁదఁ గాలుంచి త్రొక్కి, కళకళ గ్రాగుచున్న యుక్కునీటిని వారినోటిలో బల వంతముగాఁ బోయుదురు.

### 22. క్షారకర్దమము

ఎవఁడు తా నధముఁడయ్యు నాత్మాభిమానగర్వంబునఁజేసి మైమఱచి, జన్మవిద్యాచారవర్ణాశ్రమములందుఁ దనకంటె నధికులైనవారిని జుల్కనసేయునో వానిని క్షారకర్దమంబున వైతురు. అతఁ డందుఁ దల క్రిందుగాఁ బడి పలుబాధ లొందును.

### 23. రక్షోగణభోజనము

భైరవాదులకు నరబలి పెట్టువారును, కామరూపగణంబులై పురుషులను బీడించుస్త్రీలును రక్షోగణభోజననరకప్రాప్తు లగుదురు. అట రక్కసులు వారిని గటికవారు గొఱియలనట్లు, ముక్కముక్కలు చేసి భక్షించి తద్రక్తంబులు ద్రావి యాటపాటనవ్వుల నానందింతురు.

### 24. శూలప్రోతము

నిరపరాధులను నమ్మించియో మోసగించియో యడవిలోనొండె నూరనొండె కొఱతవేసిగాని యురితీసిగాని హింసించుటయే క్రీడగా నున్నవారికి శూలప్రోతప్రాప్తి యగును. అట వారిని యమభటులు గొఱతకో యురికో యప్పగింతురు. అట్లుచేసినను వారిప్రాణంబులు కర్మానుభవకారణంబున వెడలవు. వారిని గాకులు గ్రద్దలు మున్నగు పక్షులు నిలువునఁ బొడిచి పొడిచి తినును. అప్పుడు వారు స్వదుష్కర్మంబులను స్మరించి దుఃఖింతురు.

### 25. దందశూకము

ధూర్తస్వభావంబునఁజేసి జంతుపీడనంబుఁ గావించువారు దందశూకనరకప్రాప్తులై యటనున్న పంచశీర్ష సప్తశీర్ష పన్నగంబులకు మూషికంబులు వలె నాహారమై వగతురు.

### 26. అవటనిరోధము

బాలురను గుడ్డివారిని బలహీనములైన యితరప్రాణులను బట్టి గుంటలలోఁ ద్రోసియో గాదెలలోఁ బూడ్చియో గుహలలో

దాచియో బాధించువారు గలరు. అట్టివారికి నవటనిరోధము శరణం బగు. అట్టివారిని విషవహ్నిశిఖలవైచి యడఁచి కాటెంతురు.

## 27. అపర్యావర్తనము

తనయింటికి వచ్చిన నతిథుల నభ్యాగతుల యథావిధి నాదరింపక క్రోధదృష్టిఁ జూచువాఁడు అపర్యావర్తననరకంబునఁ బడి, కాకి గ్రద్ద మున్నగుపక్షుల వజ్రకఠోరనాసికాగ్రంబులకుఁ బాలై కన్నులుపోయి యుమ్మలింతురు.

## 28. సూచీముఖము

ఎవఁడు కలిమిగలదని విఱ్ఱవీఁగుచు నన్యులయెడ నిరసనభావంబును గుంటియోఱఁజూపులను వెల్లడించుచు,గురువైనను దనయొద్దకు నేదేనొక నిమిత్తంబున వచ్చినప్పుఁ డతఁడు తన్నేమి యడుగునో యని లోలోన శంకించుచు, ఏసత్కార్యంబునకేనియు స్వధనంబు నెవ్వఁడు వినియోగింపక రేయుంబవలు నిద్రాసుఖంబులు లేక పిశాచమువలెఁ దనముల్లెను గాపాడుచుండునో యాలీచునకు సూచీముఖనరకము గల్గును. అట వానిని యమభటులు పగ్గములతో నాపాదమస్తము గట్టివైతురు. వాఁడు కదలమెదలలేక యాందురవస్థకుఁ గారణమైన నిజపూర్వదుష్కృతంబును దలపోసి తలపోసి వనటనొందును. రాజేంద్రా! ఇట్టినరకంబులు యమలోకంబున వేనవేలు గలవు. పాపాత్ములు వారివారిపాపంబులకుఁ దగిననరకస్థానంబులఁ బడి పాపఫలంబుల ననుభవింతురు.

రాజేంద్రా! పాపాత్ములకువలెఁ బుణ్యాత్ములకు వారివారి పుణ్యంబులకుఁ దగిన భోగస్థానంబులు స్వర్గలోకంబునఁ గలవు. పాపపుణ్యంబులను రెంటిని జేసినవారిసంగతి యేమందువా? వారు పాపపుణ్యఫలంబుల నాయాలోకంబుల ననుభవించి, కర్మానుష్ఠానార్థము మరల మర్త్యలోకంబున జన్మింతురు. నివృత్తిలక్షణమైన మోక్షమార్గంబునుగూర్చి తెలిపి యుఖున్నాను.

రాజేంద్రా! బ్రహ్మాండకోశమునందుఁ బదునాల్గుకోశంబులు గలవని పురాణంబులందు వికల్పింపఁబడిన లక్షణంబులను దెలిపితిని. ఈ బ్రహ్మాండము భగవంతుని స్థూలరూపంబగు. ఆపరమేశ్వరుని సూక్ష్మరూపంబు వేఱుగా నుండును. ఆరెంటిని దెలిసికొనవలయును. సూక్ష్మరూపగ్రహణం బంత సులభసాధ్యము గాదు. దానిని గ్రహించుటకుఁబూర్వము స్థూలరూపంబును గ్రహించి దానిని ధ్యానింపవలయును. ఆధ్యానఫలంబుగా స్థూలరూపము హృదయంబునఁ బాదుకొనును. దాని నాధారంబుగాఁ గొని సూక్ష్మరూపంబును గ్రహించి దానియందుఁ జిత్తలయంబు గావింపవలయును. ఎవఁడు శ్రద్ధాభక్తివిశుద్ధమతియై భగవంతునియొక్క స్థూలసూక్ష్మరూపంబులను యథాక్రమం బారాధించునో, వానికిఁ బరతత్త్వము సుబోధ్యమై పొందనగును.

పంచమస్కంధము సంపూర్ణము.



శ్రీ ర స్తు

# శ్రీ దొడ్డభాగవతము

## షష్ఠస్కంధము

మునులారా! పరీక్షిన్న రేంద్రుఁడు శుకమహర్షి వచనంబులు సాంతముగా నాకర్ణించి 'ఋషిచంద్రమా! నివృత్తికర్మపరు లర్చిరాదిమార్గంబున బ్రహ్మలోకంబునకుఁ బోయి యట బ్రహ్మతోడ నుండి కల్పాంతంబున వానితోడ ముక్తిని బడయుదు రనియు, ప్రవృత్తికర్మపరులు గుణత్రయ వ్యవహారము నశింపనివారు గావున వారివారికర్మఫలంబులను భోగించుటకై తత్తదనురూపదేహంబులతో జన్మించుదు రనియు, కర్మములు కర్తృసంకల్పంబులఁబట్టి శుభాశుభంబు లని రెండు తెఱంగు లగుటంజేసి శుభకర్మంబుఁ జేయువారు తత్ఫలక్షయాంతమువఱకు స్వర్గాదిభోగంబుల ననుభవింతు రనియు, స్వర్గలక్షణంబు లిట్టివనియు, అశుభకర్మంబు లొనర్చువారు నరకప్రాప్తు లగుదురనియుఁ దెలిపి; వివిధనరకంబులను వానివాని యాతనావిశేషంబులను బోధించితివి. మఱియు స్వాయంభువ మన్వంతరచరిత్రంబును, ప్రియవ్రతోత్తానపాదుల వంశక్రమంబును భూమండలసన్నివేశలక్షణంబులను, జ్యోతిర్గణలోకస్వరూపంబును, అధోలోకప్రకారంబును దెలిపి యీశ్వరసృష్టి వైచిత్ర్యంబును బోధపఱచితిరి. నరులు నరకంబులఁ బడక తప్పించికొను మార్గమేదో యెఱుకపడదు. ఆమార్గంబును దెలుపవేఁడుదు' నని ప్రార్థించెను. శుకమహర్షి వానిభావంబు గ్రహించి,

### పాపము - ప్రాయశ్చిత్తము

'రాజేంద్రా! పాపకర్మఫలంబుగా నరకప్రాప్తి గలుగుచున్నది. పాప మనఁగానేమి? ఏది శ్రేయస్సునకు విరోధమో యది పాపం బనఁ

బడును. ఆపాపంబు మనోవాక్కాయకర్మంబులమూలంబునఁ జేయఁబడు చున్నది. ఏదేహముతో నట్టిపాపము చేయఁబడుచున్నదో యాదేహం బుండఁగానే యాయాపాపంబులకుఁ దగినప్రాయశ్చిత్తం బొనర్తురేని వారు నరకంబులకుఁ బోవుటయు, అందుఁ దీవ్రయాతనంబు లనుభవించుటయుఁ దొలంగును. రోగము గల్గినప్పుడు రోగనిదానజ్ఞుఁడైన వైద్యుఁడు తగినమం దిచ్చుటయు రోగోపశాంతి గలిగి యారోగగ్రస్థుఁడు సుఖంబుండుటయు లోకానుభవమే గదా! అట్లే పాపంబులకుఁగూడఁ దన్నిదానజ్ఞులు విధించిన ప్రాయశ్చిత్తంబులఁ గావించి పాపపరిహారం బొందవచ్చును. తత్ఫలముగా నరకయాతనలు తప్పును. ఆయాపాపంబుల గౌరవలాఘువంబులను బట్టి ప్రాయశ్చిత్తంబులు వివిధగతుల నుండును. పాపంబునకుఁ దగుప్రాయశ్చిత్తంబును వెనువెంటనే చేయవలయును. అట్లు చేసినప్పుడే బాధ తప్పును." అని చెప్పెను.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁ డావచనంబులు పర్యాలోచించి 'మునిసత్తమా! మీమాటలఁ బట్టిచూడఁగాఁ బ్రాయశ్చిత్తముగూడ నొకవిధమైన దండనంబే యనియు, రాజదండాదులవలన దోషంబులు కొన్ని యుపశమించునట్లు ప్రాయశ్చిత్తంబువలనఁ బాపం బుపశమించు ననియుఁ దేలుచున్నది. అట్లే యగుఁగాక! ఒకతప్పును బ్రాయశ్చిత్తంబున నుపశమింపఁజేసియు నంతతో మిన్నకుండక మఱల నతఁ డదేతప్పు చేయుట గలదు. అట్టివారికిఁ బ్రాయశ్చిత్తంబులు గజశౌచమాత్రంబులు గావా?' యని యడిగెను. శుకమహర్షి యిట్లనియెను.

## ప్రాయశ్చిత్తఫలము

రాజా! చక్కగా విమర్శించి యడిగితివి. దోషము బుద్ధిపూర్వకకృతమో అబుద్ధిపూర్వకకృతమో మొట్టమొదట నిశ్చయింపవలయును. ఏలయందువా? దండనతాత్పర్యముగాని ప్రాయశ్చిత్తతాత్పర్యముగాని యేమి? దోషియొక్కబుద్ధియందు మార్పు గలిగించుటయే వాని తాత్పర్యము. అట్లు బుద్ధిమార్పు గలుగదేని కోటిదండనంబులుగాని శతకోటి

ప్రాయశ్చిత్తంబులుగాని నిరుపయోగంబులగుసు. అబుద్ధిపూర్వకంబుగాఁ దప్పుచేసినవాఁడు దండనప్రాయశ్చిత్తాదులచేత స్వకృతాపరాధంబును గ్రహించి యాతప్పునకుఁగా ననుతాపం బొంది మఱల నట్టిదోషంబునకు నెడమీయక వర్తించును. బుద్ధిపూర్వకంబుగాఁ దప్పుచేసినవానిసంగతి యట్టిదిగాదు. వానిబుద్ధియందు మార్పు అంతసులభంబుగాఁ గలుగదు. ఎట్లైనియు వానికి బుద్ధిమార్పు గలిగింపవలయును. అట్లు బుద్ధిమార్పు గలిగినప్పుడే యతఁడు మఱల నట్టిదోషంబును జేయుట మానును. దోష పరిహారార్థము ప్రాయశ్చిత్తం బొనర్చియు మఱల నట్టిదోషమునే చేయు నేని, ప్రాయశ్చిత్తంబువలన వానికి బుద్ధిమార్పు గలుగలేదని ప్రకటితం బగును. అట్టివానివిషయంబునఁ బ్రాయశ్చిత్తంబులు నీ వన్నట్లు గజ శౌచమే యగును.

### కర్మమువలనఁ గర్మఫలము నశించునా ?

ఒకకర్మమువలన మఱియొకకర్మఫలంబు నశించునా యని యడుగ వచ్చును. కొంతకుఁ గొంత తగ్గునేగాని సంపూర్ణముగాఁ బరిహృతము కాదు. ఆకారణంబుననే ఫలవాసనలు శేషించియుండి పునఃప్రవృత్తికి బీజంబు లగుచున్నవి. కర్మఫలము సమూలధ్వంసము కావలయునన్నచో జ్ఞానం బొక్కటే పరమప్రాయశ్చిత్తంబగును. జ్ఞానసంపత్తి లేనివా రెట్లు చేయవలయు నందువా ? రోగబాధకు వెఱచువాఁడు పథ్యాహారంబును గ్రహించి రోగంబునకు నెవ్విధి నెడ మీయకుండునో, యట్లే జ్ఞానసంపత్తి లేనివాఁడు జ్ఞానప్రతిబంధకంబులను నిషేధించుచు జ్ఞానోత్పత్తిసహకార కార్యంబుల నాచరింపవలయును. అట్లు చేయుచురాఁగాఁ గాలక్రమంబున వానికి జ్ఞానోత్పత్తి యగును.

### జ్ఞానోత్పత్తిసహకారకర్మంబులు

అట్టి సహకారకర్మంబు లెవ్వి యని యడుగుదువా ? ఎల్లసహకార కర్మంబులకు మనోనిగ్రహము ప్రాప్యమగును. మనోనిగ్రహంబునకుఁ

దపస్సు ప్రధానాంగమగు. తపస్సనఁగా నేమియందువా? మనస్సు నింద్రియంబులను దీనిరెంటి నేకీకరణం బొనర్చుట తప స్సనఁబడును. తపస్సునకు బ్రహ్మచర్యం బూతకఱ్ఱ యగు. అష్టాంగలక్షణంబులు బ్రహ్మచర్యమం దిమిడియున్నవి. తపస్సుతోడ శమము, దమము, త్యాగము, అహింస, స్నానశౌచజపాదులను ద్రిశుద్ధికి బాటింపవలయును. శమఫలంబుగా మనోనిగ్రహంబును, దమఫలంబుగా బాహ్యేంద్రియ విధర్మ నిగ్రహంబును, త్యాగఫలంబుగా 'నాద' అనెడి అభిమానంబును, అహింసాఫలంబుగా సర్వభూతంబులు తనవంటివే యనుభావంబును రూఢియగును. రాజా! వెదురుగుమిలో వెదుళ్లొండొంటి నొరసి నిప్పు రగిల్చి యానిప్పులోఁ దామెల్ల దగ్ధమై నశించునట్లుగాఁ, బైనిఁజెప్పినవియెల్లఁ గర్మంబులేయైనను వానివలన జ్ఞానాగ్ని జనించి యావహ్నిచేత మనోవాక్కాయకృత సర్వ పాపంబులు సమూలంబుగా దగ్ధములై నశించుచున్నవి.

### భక్తిరూపప్రాయశ్చిత్తము

రాజా! ఈ జ్ఞానమార్గరూపప్రాయశ్చిత్తంబు మహాదుష్కరంబు గావున నెల్లరు నందులకుఁ జాలరు. సర్వసౌలభ్యమైన ప్రాయశ్చిత్తంబు వేఱొండు గలదు. దానిని భక్తిమార్గ మందురు. ఆమార్గంబునకుఁ దపస్సు మున్నగునవి యంతముఖ్యములు గావు. మనస్సును భగవదాధీనం బొనర్చినఁజాలును. అంతకుమించి యేమియుఁ జేయ నవసరములేదు. సూర్యుఁడు తుహినరాశినట్లు, భక్తియోగము సమస్తపాపంబుల రూపు మాపును.

భక్తిమార్గమందు మఱియొకవిశేషము గలదు. ఇతరమార్గంబులందు యత్నవిఘాతభయము గలదు. భక్తిమార్గంబున నిర్భయంబుగా సంచరింపనగు. ఇంతియగాదు. భక్తి గోరంతయేనియుఁ గలిగినప్పుడు మాత్రమే యితరమార్గంబులు ఫలకారు లగును. భక్తిలేనినాఁడు కోటి ప్రాయశ్చిత్తంబులవలనఁగూడ హృదయమలంబు తొలఁగదు. భక్తిలేని ప్రాయశ్చిత్తము లోకపావన గంగాజలంబున సురాభాండముఁ గడ్గు

టగు. మఱియుఁ గర్మకలాపంబు సాకల్యంబుగా జరిగినఁగాని జ్ఞానం బంకురింపదు. భక్తిసంగతి యట్లుగాదు. గోరంతభక్తి గలిగినను జ్ఞానాంకురజనకంబునకుఁ గారణంబగును. కావున బుద్ధిని భగవంతునెడ నిల్పినఁ జాలును. ఆపని బుద్ధిపూర్వకముగాఁ గాకపోయినను గారణాంతరంబుననేనిఁ జేసినఁ జాలు. మనఃపూర్వకంబుగా నట్లు చేసినప్పుడు తత్ఫలము వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

మఱియు భక్తికి జాతి మత దేశాదినియమంబులు గలుగవు. అనురాగం బొక్కటి యుండినఁ జాలును. ఇందులకు నిదర్శం బేమం దువా? చెప్పెద వినుము.

### అజామిళోపాఖ్యానము

తొల్లి కన్యాకుబ్జపురమందు అజామిళుఁ డను బ్రాహ్మణకుమారుఁ డొకఁ డుండెను. వానికి నొకదాసితోఁ బొందుఁ గలిగెను. తత్ఫలంబుగా నతఁడు సదాచారంబులనెల్ల మాని, దాసితోడిదే లోకంబుగా నుండెను. వారికిఁ బదుగురుకొడుకులు జనించిరి. బహుకుటుంబపోషణభారం బజామిళుని తలపయిఁ బడెను. అట్టిభారంబును సన్మార్గంబునఁ బోషించు వెఱవు తోఁపక యతఁడు జూదంబాడియో దొంగిలించియో వంచించియో నాలుగురూకలు సంపాదించుచు నాలుబిడ్డలను బోషింపసాగెను. అట్టియకార్యంబులను జేయునప్పు డతం డొక్కొక్కవేళ రాజభటులకుఁ జిక్కుటయు, శిక్షితుఁడై బందియగుటయుఁగూడ వానికి సంభవించు చుండెను.

అట్లు వానికి యౌవనంబెల్లఁ గడచి ముదిమి పైకొనెను. ఎనుబది ఱెనిమిదియేండ్లు నిండారెను; మరణకాలంబు డాకొనెను. ఒకనాఁడు యమభటులు ముగ్గురు మహాభయంకరాకారులు పాశహస్తులై యజామిళుని డాయవచ్చిరి. వారిని జూచినంతనే వానికిఁ బ్రాణంబులు నిలువున లేచుచున్నట్లయ్యెను. వాని కడపటికొడుకు నారాయణుఁ డనువాఁ

డతనికి ముద్దులమూటగా నుండెను. అతఁ డట్లు భయపడి సహాయార్థం బౌసుతుని 'నారాయణా!' యని యఱచెను.

ఆ యఱపుతోడ శ్రీవిష్ణుపార్షదులు తటాలున నచ్చటకు వచ్చిరి. అత్తఱి యమకింకరు లయ్యజామిళునిహృదయంబును పాశంబులఁ గట్టి యీడ్చుచుండిరి. విష్ణుపార్షదులు వారిని నవ్వలకుఁ ద్రోసిరి. యమ భటులు వారినిఁ జూచి 'అహో! పీతాంబరంబులు ధరించి కిరీటకుండల మండితాంగులై పుష్కరమాలికలు కంఠసీమకుఁ బెట్టని భూషణంబులై గ్రాలుచుండఁగా, ధనుస్తూణీరఖడ్గగదాశంఖచక్రపద్మంబులు నాల్గుహస్తం బులఁ దాల్చి దెసలెల్ల వెలిఁగించుచున్న మీరూపంబులు లోకాద్భుతం బులు. మీరెల్లరు నొక్కప్రాయపువారుగా నున్నారు. మీ రెవరు? దేవతలో, ఉపదేవతలో, సిద్ధసత్తములో యూహింపరాకున్నది. యమ కింకరులము మేము. ధర్మరాజశాసనంబును పాఁగించుచున్నాము.మమ్మిట్లడ్డ గించి మారాజశాసనంబును నిషేధింతురేల?' యని యడిగిరి.

### ధర్మాధర్మ దండాదండనల విచారము

శ్రీవిష్ణుదూతలు వారిని విని చిఱునవ్వు దాల్చి 'యమదూతలారా! మీరు నిక్కముగా ధర్మరాజునాజ్ఞ నడుపువారేనా? అట్లగునేని ధర్మా ధర్మలక్షణంబున నెఱింగియుండవలయును. అవి యెట్టివో చెప్పుము. దండంబు నెట్లు ధరింపవలయును? దానికిఁ దగినస్థానం బెయ్యది? ఏమి చేసినవారు దండనార్హు లగుదురు? వారిలో నెల్లఱు దండ్యులగుదురా? కొందఱుమాత్రమే దండ్యులగుదురా?' యని ప్రశ్నించిరి.

యమదూతలు వారిని 'వేదచోదితవిధానము ధర్మంబగును. వేద నిషిద్ధమైనది యధర్మంబగును. వేదము సాక్షాన్నారాయణునివలనఁ జనించె ననియు, అది భగవంతుని నిశ్వాసమాత్రం బనియుఁ, దత్కారణంబున స్వయంవ్యక్తం బనియు శ్రుతులు పల్కుచున్నవి. నారాయణుఁ డనఁగా నెవ్వం డందురా? ఎవనిలోఁ ద్రిగుణాత్మకప్రాణిజాలంబెల్ల శాంత్యాది

గుణంబులతో, బ్రాహ్మణాదినామంబులతో, అధ్యయనాది క్రియలతో, వర్ణాశ్రమాది భేదంబులతో వర్తించునో యాతఁడే నారాయణుఁడు.

### ధర్మాధర్మంబులకు సాక్షులు

దేహిచేయునట్టి ధర్మాధర్మంబులకు సాక్షు లెవ్వ రందురా? సూర్యుఁడు, వహ్ని, ఆకాశము, వాయువు, గోవులు, చంద్రుఁడు, సంధ్య, అహోరాత్రంబులు, దిక్కులు, జలము, భూమి, కాలము, ధర్మము-ఇవియెల్ల సాక్షులగును. మూఢులు తమ రహస్యకృత్యంబుల నెవ్వరుఁ జూడరని యజ్ఞానాంధులై తలంతురు. అంతకన్నఁ భ్రమాదభ్రాంతులు గలుగవు. సూర్యాదులను గనుగప్పి గిల్లింతపనినిగూడఁ జేయ నెవ్వనికిఁ దరముగాదు. బాహ్యకృత్యంబులు వారికి గోచరించిన గోచరింపవచ్చు ననియు, మానసికంబులు వారి కెట్లు గోచరించు ననియు శంకింతురా? వారు సర్వసాక్షులు. వారికి గోచరింపని బాహ్యాభ్యంతరంబులు గలుగవు. ఏపనియైనను వారికి వెనువెంటనే స్పష్టమగుచుండును.

### దండస్థానము - దండ్యులు

ఇట్టి సాక్షిమూలకంబుగాఁ దెలియఁబడునట్టి యధర్మంబు దండస్థానం బగును. అధర్మకారులు దండ్యు లగుదురు. దండనము వారివారి దోషంబులఁబట్టి యుండును. పుణ్యపాపంబులు గుణతత్త్వంబునుబట్టి యుండును. గుణసంగమంబు కర్మమునకుఁ గారణంబగును. జీవులెల్లరును గుణబద్ధులుగావునను, గుణసంగమంబు కర్మకారణం బగును గావునను, గర్మంబు నంతో యింతో చేయనిజీవి యొక్కటియుఁ గలుగదు. జీవులు చేయునట్టికర్మంబులకు ఫలంబు తప్పదు. ఆఫలంబు శుభమో యశుభమో మిశ్రమమో యగును. అది కర్తలబుద్ధినిబట్టి యుండును. అట్లుదయించిన ఫలంబు ననుభవింపకతీఱదు. ఆయనుభవంబు లోకాంతరంబుల నగుచుండును.

### కర్మము - పాపము

కర్మము కేవలశుభము గాదా? యని శంకింపవచ్చును. అగ్ని యందుఁ బొగవలెఁ గర్మమందు పాపంబంతో యింతో యంతర్భూతమై

యుండును. ఆకారణంబున నెంతధర్మాత్ముఁడైనను బాపంబు నంతో యింతో చేయుటయుఁ దత్ఫలంబు ననుభవించుటయుఁ దప్పనివగుచున్నవి.

### ధర్మాధర్మజ్ఞాపకములు

ధర్మాధర్మజ్ఞాపకులు సూర్యాదులు గలరని చెప్పితిమి. వారు మాత్రమేగాదు. వారివారి గుణంబులే వారివారిధర్మాధర్మంబులకు జ్ఞాపకంబు లగును. గుణంబును దాఁచిపెట్టి వ్యవహరించుట గలదుగదా యని యందురా ? ఎంత దాఁచినను గుణంబు దాని తఱివచ్చినప్పుడు తలయెత్తక మానదు. వృక్షాదులు చిగిర్చి పుష్పించుట వానికి నైజము. అయినను తత్కార్యంబునకుఁ దగిన యదను వసంతఋతువు వచ్చినప్పుడుమాత్రమే యది జరుగుచున్నది. ఇతరఋతువులందు జరుగదు. వసంతఋతువునందుఁ దప్పదు. అట్లే యేగుణముగాని దానికి సమయమువచ్చినప్పుడు వ్యవహరించును; వ్యవహరింపకమానదు. తక్కినకాలమందు దాఁగియుండును.

ఈసంవత్సరంబున నెట్లో యట్లే పూర్వపరసంవత్సరంబులందుఁ గూడ వసంతకాలగుణధర్మంబు ప్రకటితంబగుచున్నది. కావునఁ బూర్వపరసంవత్సరంబుల వసంతకాలగుణధర్మంబునకుఁ బ్రకృతసంవత్సర వసంతకాలగుణ ధర్మం బభిజ్ఞాపక మగుచున్నది. అట్లే ప్రకృతజన్మమందలి గుణధర్మాధర్మంబులు పూర్వపరజన్మంబులందలి ధర్మాధర్మంబులకు నభిజ్ఞాపకంబు లగును. అనఁగాఁ బ్రకృతజన్మమందలి వ్యక్తియొక్కకర్మంబును బరిశీలించినచోఁ దత్కర్మకుమూలమైన గుణము స్పష్టమగును. అట్టి గుణము గలుగుటకుఁ దద్వ్యక్తి పూర్వజన్మంబునఁజేసిన కర్మము బోధపడును. మఱియు నిప్పుడుచేయుకర్మంబునకు నెట్టిఫలంబు గలుగునదియుఁ దత్ఫలానుభవంబునకు నుత్తరజన్మం బెట్టిది రానున్నదియు గ్రహింపనగును.

### ధర్మదేవత

ధర్మదేవత భగవత్స్వరూపముగాని వేఱుగాదు. కావున వానికిఁ త్రికాలజ్ఞానము స్వతస్సిద్ధము. మఱియు నతఁ డెల్లజీవులందు నంతర్యా

మిన్నై వారివారిధర్మాధర్మంబుల తత్త్వంబులను స్వయముగాఁ జూచుచు వారొనర్పు ధర్మాధర్మంబులఫలంబుల ననుభవించుటకుఁ దత్తదుచిత భోగాయతనంబులను నియమించుచుండును. విత్తొకటిదైనఁ జెట్టు వేఱొకటి మొలవదుగదా! ఆచెట్టు వేఱొకగుణముగల విత్తు నొసంగదు గదా!

### జీవుఁడు - పూర్వాపరస్మృతిజ్ఞానము

నిద్రించువానికి స్మృతిజ్ఞానంబుఁ గలుగదు. ఆకారణంబున నతఁడు నిద్రాకాలమందు ననుభూయమానమైన స్వప్నశరీరంబును మాత్రమే గాంచునుగాని పూర్వోత్తరజాగ్రదాదిదేహంబులను గాంచుటలేదు. అట్లే జీవుఁ డవిద్యోపాధిగతుఁడై నప్పుడు తత్కాలశరీరంబును మాత్రమే యెఱుంగునుగాని పూర్వోత్తరశరీరంబుల నెఱుంగఁజాలకుండును.

### జీవుని సంసారవృత్తాంతము

జీవుని సంసారముసంగతి యెట్లందువా ? కర్మేంద్రియంబు లైదును, జ్ఞానేంద్రియంబు లైదును, శబ్దాదివిషయంబు లైదును, మనస్సు కలసి పదునాఱగును. వానిలోఁ గర్మేంద్రియంబులు వానివాని పను లొనర్చుచుండును. జ్ఞానేంద్రియంబులైదును వానివాని విషయంబుల నెఱుంగుచుండును. జీవుఁడు పదునాఱింటిలో నుండి జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులనెల్ల ననుభవించుచుండును. ఈయనుభవమే జీవుని సంసారవృత్త మనఁబడును.

ఈపదునాఱింటితోఁ గూడినశరీరంబును లింగశరీర మందురు. ఈ లింగశరీరమే జీవునకు గుణత్రయకార్యములైన హర్షశోకభయార్తులను గలిగించుచుండును. సాలెపురువు తనకై తానే తంతువులను నిర్మించి కొని యాతంతువులలోనే తాను చిక్కి యందుండి వెలువడనేరక యుండువిధంబున, జీవుఁడు వాని యజ్ఞానరచితంబులైన షడ్వర్గంబునఁ జిక్కి యావర్గంబు నియమించుపనుల నిచ్ఛయున్నను లేకున్నను జేయుచు

బద్ధుఁడై యుండును. అందుండి వెలువడరాదా యని యందురా? ఆ షడ్వర్గంబు వానికనులు గప్పి నిర్గమనోపాయంబును దెలియరాకుండు నట్లు చేయుచుండును. ఆకారణంబున నతఁ డందుండి వెలువడనేరక బద్ధుఁడై యందే యుండును. ఈ గుణత్రయకార్యం బెప్పుడు ప్రారంభ మయ్యె నందురా? ఇది యనాది యగును.

### కర్మంబును జేయకుండరాదా?

'బురద ద్రొక్కనేల? కాలు కడుగుటేల?' అన్నట్లు కర్మంబులను జేయుటేల? తత్ఫలానుభవార్థము జన్మాంతరంబు లెత్తుటేల? యని యడుగవచ్చును. ఎట్టికర్మంబు నొనర్పక యొక్కక్షణకాలమైన నూరకుండఁ జాలరు. ఏల యందురా? కర్మంబులు నేఁడు క్రొత్తగా జీవులు కల్పించి చేయునవి గావు. ప్రారబ్ధకర్మఫలవాసనలైన రాగాదులు తత్తద్వ్యాపకర్మంబులకుఁ బురిగొల్పుచుండును. ఆవాసనలన్నవో పూర్వజన్మసంస్కారజనిత గుణకార్యంబులగును. జీవు లట్లు స్వాభావికగుణబలంబులకుఁ జిక్కి స్వాతంత్ర్యహీనులై వర్తింతురు. మఱియు వారికి వారికర్మఫలానుభవంబునకు యోగ్యంబులుగా స్థూలసూక్ష్మశరీరంబులు స్వతస్సిద్ధంబులగును. కాఁబట్టి శరీరం బున్నంతకాలము దానిస్వభావంబు తప్పదు. స్వభావం బున్నంతకాలం బది వ్యవహరింపకమానదు. ఆవ్యవహారములే కర్మంబు లనఁబడును. కావున జీవరాశికిఁ గర్మంబు నైజమగుచున్నది.

### సంసృతినివారణమార్గము

పురుషునకుఁ బ్రకృతిసంగమంబే సంసారం బగుటయు, సంసారం బెట్లు వర్తించుటయుఁ దెలిపితిమి. అట్టిసంసారబంధనంబు తొలఁగుమార్గం బేమందురా? దేహి యెప్పుడు ప్రకృతిసంగమంబును విడచునో యప్పుడు సంసారబంధనంబు తొలంగును. బంధనము తొలంగుటయే ముక్తి యనఁబడును. ప్రకృతిసంగమం బెట్లు తొలఁగునందురా? ప్రకృతి యనఁగాఁ బరమేశ్వరుని శక్తివిలాసముగాని వేఱుగాదు. శక్తివిలాసమే పరమార్థమని యుండక శక్తిమంతుఁడైన పరమేశ్వరునందు బుద్ధి లీనమైనచోఁ బ్రకృతిసంగమంబు తొలంగుటగు.

### అజామిళ పాశబంధ కారణము

ఇ య్యజామిళునిసంగతి 'యేమందురా? ఇతఁడు తొలుదొల్త మంచిస్వభావము గలిగి సదాచారసంపన్నుఁడై క్షమాదయాదిసద్గుణ లక్షణంబుల నొప్పుచు, ధృతవ్రతుఁడును మృదుచిత్తుండును దాంతుండునై సత్యంబు వదలక శుచియు మంత్రవిదుఁడు నై గురువుల నగ్నిని నతిథులను వృద్ధులను యథావిధి సేవించుచు, నిరహంకారుఁడును సర్వభూత సుహృదుఁడును మితభాషియు ననసూయారహితుఁడు నై పరమసాధువుగా నుండెను. ఒకనాఁ డితనితండ్రి వీనిని ఫలసమిత్కుశకుసుమాదులను దెచ్చుటకై వనమునకుఁ బంపెను. అట దాసి యొకతె కల్లుఁ ద్రావి మైమఱచి పోకముడి వీడుటగూడఁ దెలియక పరాకున నుండెను. శూద్రుఁడొకఁడు దానితోఁగూడి యాడుచుఁ బాడుచుఁ దదేకలోకంబున నుండెను. వా రిరువురు నజామిళుని కంటఁబడిరి. అదినిమిత్తంబుగా నజామిళుని మదనుఁ డావేశించెను. అతఁడు స్వవిద్యాధైర్యంబుల నాశ్రయించి మదనుని ధిక్కొనయత్నించెను గాని వానియాటలు మరుని మ్రోలసాగవయ్యెను. ఆదాసి సర్వకాల సర్వావస్థలందు వానికన్నులలో మెలంగఁజొచ్చెను. తత్ఫలంబుగా వానికిఁ జదువుసంధ్యలు నానాఁటికి నుడిగెను; స్వధర్మంబు వలసపోయెను. ఇతఁ డెట్టకేలకు నద్దాసికి బంటయి యిల్లాలిని వదలి దానియింటఁజేరి పిత్రార్జితంబునెల్ల దానికి ధారవోసి దానితోడ గ్రామ్యసుఖంబు లనుభవించుచుఁ దత్క్రీడామృగమయ్యెను.

ఇతనికి దానివలన సంతానము వృద్ధియయ్యెను. కుటుంబపోషణార్థము వలయుధనంబు దుర్లభమయ్యెను. ఇతఁ డంతట కుటుంబభరణమే పరమార్థంబుగా భావించి శాస్త్రంబు నుల్లంఘించి న్యాయాన్యాయంబుల దవ్వుచేసి స్వేచ్ఛాచారియై జూదంబాడుటయో మోసగించుటయో దొంగిలించుటయో వృత్తిగా గ్రహించి యెట్లో నాల్గుకాసులు దెచ్చి కుటుంబమును బోషింపసాగెను. ఇతఁ డివ్విధంబునఁ బరమపాపుఁ డయ్యెను. దండనంబునఁదప్ప వేఱొకట నితనికిఁ బాపపరిహారంబు గలుగదు. తదర్థము వీనిని దండపాణియొద్దకుఁ గొనిపోవుచున్నా' మనిరి.

### విష్ణుదూతల సమాధానము

విష్ణుదూత లామాటలు సాంతంబుగా విని 'యమదూతలారా! ధర్మదర్శనులసభలో నధర్మంబు ప్రవేశించెను. అట్లు కానినాఁడు దండింప రాని పుణ్యాత్ములను దండసభాసభ్యులు నిష్కారణంబుగా దండనము పాలు చేయుదురా? ఏసాధువులు ప్రజలకుఁ దండ్రులును బాలకులును సములు నగుదురో, యట్టిసాధువులయందే యిట్టివైషమ్యంబుఁ గాన్పించు నేని నిఁకఁ బ్రజలకు శరణం బెవ్వరు? పెద్దలు దేని నంగీకరింతురో యదే లోకంబునకుఁ బ్రమాణంబగును. ఆకారణంబున లోకము పెద్దలత్రోవఁ ద్రొక్కుచుండు. లోకం బట్లు ధర్మాధర్మవిమర్శనచింత మాని యెవ్వని తొడపయిఁ దలనుంచి హాయిగా నుండునో, యట్టిభూతవిశ్వాసుఁడు తన్ను నమ్మి తనకు సర్వార్పణం బొనర్చినవారిని గొంతులు కోయనగునా? కటా! ఇఁక గతియేమి?'

'యమదూతలారా! ఈ యజామీళుఁడు దురంతపాపంబు నొనర్చె నంటిరి. పాపంబులకుఁ బ్రాయశ్చిత్తంబులు గలుగవా? ప్రాయశ్చిత్తంబుల చేతఁ బాపంబులు నిస్సత్వంబులు గావా? చౌర్యము, సురాపానము, మిత్రద్రోహము, బ్రహ్మహత్య, గురుదారసంగము, స్త్రీహత్య, రాజ పితృ హత్య మున్నగునవి మహాపాతకంబు లందురు. ఇవియేగాక యింతకన్న కోటిరెట్లు హెచ్చగుపాతకంబులుగూడ హరినామస్మరణమాత్రంబునఁ దొలఁగిపోవును. అంతియగాదు. కోటికోట్లజన్మంబుల పాపరాశికిఁగూడ హరినామస్మరణంబు పరమప్రాయశ్చిత్తమగును. భగవన్నామంబును స్మరించువాఁడు పాపరహితుఁ డగుటయేగాక పునీతుఁడుగూడ నగు చున్నాఁడు. ఎప్పుడు పునీతుఁ డగునో యప్పుడే యతఁడు భగవత్కారుణకుఁ బాత్రుఁడగును.

పాపపరిహారార్థము మన్వాదిబ్రహ్మవాదులు వ్రతాదిరూపప్రాయశ్చిత్తంబుల విధించియుండఁగా వానిని గాదని హరినామస్మరణరూప ప్రాయశ్చిత్తంబు నింతగా నుగ్గడించుట తగునా యని శంకింపవలదు.

వ్రతాదులు పాపపరిహారార్థమాత్రంబు లగునేగాని చిత్తశుద్ధికరములు గానేరవు. హరినామస్మరణంబన్ననో పాపమలంబు నూడ్పుటయేగాక చిత్తంబును శుద్ధిపఱచి యుత్తమశ్లోకునిగుణంబులను మనోగతం బొనర్చును. దానిఫలం బేమందురా ? అది పునఃపాపాచరణప్రవృత్తి నడంచివైచును. ఇతరంబు లందులకుఁ జాలవు. కారణం బేమందురా ? చిత్తము సర్వపాపనిలయంబు. పాపమలంబు చిత్తంబునంటి తద్విధవాసనల వీచుచుండును. ఇతరప్రాయశ్చిత్తంబులు తద్వాసనలనుమాత్రమే తొలఁగించును. చిత్తమలంబును హరింపనేరవు. హరినామస్మరణంబు సర్వమలాపహారంబగు. చిత్తము మఱలఁ బాపముఖము గాదు.

### అజామిళుని పాపపరిహారాదికము

అజామిళుఁడు వాని యవసానకాలంబున భగవన్నామస్మరణంబు గావించెను. ఆకారణంబున నితనిపాపంబులెల్లఁ బరిహృతంబులయ్యెను. ఇతఁడు భగవన్నామస్మరణంబును మనఃపూర్తిగాఁ జేయలేదనియు, భయాతురుఁడై వానిపుత్త్రుని నారాయణుఁ డనువానిని బిలిచెననియు, అయ్యది భగవన్నామస్మరణం బెట్లగుననియుఁ బ్రశ్నింతురా ? బుద్ధిపూర్వకముగానొండె అబుద్ధిపూర్వకముగానొండె (అనఁగాఁ గాలుజాఱి పడుటో, తేలు కుట్టుటో, పాము కఱచుటో, జ్వరాదితాపంబులు గలుగుటో సంభవించి నప్పుడు) హరి యను రెండక్షరంబు లుచ్చరించునేని వాఁడు నరకయాతనలకుఁ దగఁడు. ఎట్లందురా ? తెలిసియొండెఁ దెలియకయొండె నగ్నిని దాఁకినప్పు డది కాల్పకమానదు. అట్లే హరినామస్మరణంబు తెలిసిచేసినను దెలియకచేసినను బాపంబు హృతమగును. ఔషధమే యిందులకు నిదర్శనము. వస్తుగుణము బుద్ధి నాశ్రయింపదుగదా !

దూతలారా ! మా వచించిన యీధర్మంబునుగూర్చి మీకు సందేహము గలదేని మీరు మీతేనియొద్దకుఁ జని యెఱుంగనగు. వానికిఁ దెలియని ధర్మరహస్యంబులు గలుగవు.' అని చెప్పిరి.

రాజా! విష్ణుపార్షదు లట్లు పలికి యయ్యజామిళుని యమపాశబంధంబునుండి విడిపించిరి. అతఁడు మృత్యుబారినుండి తొలఁగి భయంబు మాని యెదుటనున్న హరిపార్షదులకు సాష్టాంగప్రణామం బొనర్చి యేమో పలుకనుండెను. హరికింకరులు వానిభావంబు నూహించి యం దుండరాదని తలంచి యంతర్ధానులైరి.

అజామిళుఁడు వారి సంవాదంబును విని 'ఒకరు బోధించుధర్మంబు త్రయీబోధ్యంబు గుణాశ్రయంబునై యున్నది. రెండవవారు బోధించు ధర్మంబు శుద్ధనిర్గుణంబైన భాగవతధర్మంబుగా నున్నది.' అని నిశ్చయించుకొనెను. హరిమహిమ చెవిసోఁకుటంజేసి వానియందు భగవద్భక్తి తలయెత్తెను. అతఁడు వాని చెడునడతలనెల్లఁ దలపోసి పశ్చాత్తాప మొంది 'కటా! అజ్ఞానవశంబున నిన్నియిడుమలపాలైతిని. శూద్రస్త్రీయందుఁ బుత్రరూపంబున జనించితిని; బ్రాహ్మణజాతిని బాడుచేసికొంటిని; దుష్కృతంబులొనర్చి కులంబునకుఁ దీఱనిమచ్చ దెచ్చితిని; సాధువులకు దూషణపాత్రమైతిని; సతిని బాసితిని; జఱభిని గూడితిని; సోమంబును వదలితిని; కల్లు ద్రావితిని; కనిపెంచినతలిదండ్రులను వదలి కృతఘ్నుఁడనైతిని; కేవల కామాంధుఁడనై ధర్మహాని చేసితిని. నాకు నరకము దప్పదు.'

'నన్నుఁ బాశములఁ గట్టి యీడ్చిరి. అత్తఱి సిద్ధపూరుషు లెవ్వరో నల్వురు తటాలున వచ్చి యాపాశంబులనుండి నన్ను విడిపించిరి. నేను స్వస్థతఁగాంచి కనువిచ్చి చూచునప్పటికి నన్నుఁ గట్టినవారుగాని విడిపించినవారుగాని కాన్పింపరు. ఇది కలయో కల్లయో యూహింపరాకున్నది. ఏది యెట్లున్నను నాకు నాత్మప్రసాదము లభించెను. ఇది యా మహాపూరుషుల దర్శనభాగ్యముగాని వేఱుగాదు. మఱియు నిట్టి భాగ్యము నాపూర్వపుణ్యఫలంబు గావలయును. అట్లుకానినాఁడు దాసీసంగమంబున నశుచియైన నా యీనాల్కకు హరినామోచ్చారణ భాగ్యంబు గలుగునా? బ్రాహ్మణ్యంబును ద్యజించి సిగ్గువదలి వంచనా

వృత్తి జీవించుచుండిన యీ మహాపాతకి యెక్కడ ? పరమమంగళకరం బైన 'నారాయణ' నామోచ్చారణం బెక్కడ ? ఇంక నేనియు నాకు సంసారగాఢాంధరకారకూపపతనంబు గలుగకుండుఁ గాక!'

'ఇదంతయు మనఃకార్యంబని నా కిప్పుడు స్పష్టమయ్యెను. మనం బును నియమింతుఁగాక! అట్లు చేసినవారికి దృశ్యమెల్ల మిథ్యాభూతం బగును. సత్యము స్పష్టపడును. బంధనంబన్ననో యవిద్యాకామకర్మజ మగును. బంధనంబును ద్రెంచివేయవలయును. అట్లు త్రెంచుటకు మన శ్శక్తి తగినంత వలయును. అట్టిశక్తి గలుగుటకు శాంతియు మైత్రియుఁ గారుణ్యంబు. సర్వభూతహితత్వము, ముఖ్యాంగకంబులగును. వాని నలవఱచికొని యాత్మవంతుఁడై నఁగాక, వేఱొండువిధంబున నాత్మమాయ యను స్త్రీకిఁ జిక్కి తద్వశుఁడై క్రీడామృగంబువోలె వర్తించు మహా దౌర్భాగ్యంబు తొలఁగదు. దేహగేహాదు లెన్నండును స్థిరములుగావు. అట్టి యస్థిరంబులయెడ 'నేను, నావి,' అనునట్టి యభిమానంబు నుంచితిని. ఇదియు మాయావిశేషముగాని యొండుగాదు. అట్టి యభిమానం బును మొట్టమొదట గెంటింపవలయును. అందులకు మనశ్శుద్ధి వలయును. మనశ్శుద్ధియన్ననో భగవన్నామసంకీర్తనంబునఁ దక్క వేఱొంట సిద్ధిం పదు.' అని లోలోన నిశ్చయించికొని, పుత్త్రాదిస్నేహబంధంబును ద్రుంచివైచి గంగాద్వారంబునకుఁ జనియెను.

### అజామిళుఁడు వైకుంఠంబునకుఁ బోవుట

రాజేంద్రా! అజామిళునకు నింతమాత్రపుభాగ్యంబు గలుగుటకుఁ గారణమేమందువా ? అది క్షణకాలసాధుసంగఫలంబని గ్రహింపుము. అతఁడట్లు గంగాద్వారముచేరి యోగంబుఁ బూని యింద్రియనిగ్రహంబు గావించి మనశ్చాంచల్యంబు నుడిపి బుద్ధి నేకాగ్రంబొనర్చి సమాధినిష్ఠుఁ డయ్యెను. అత్తఱి వానికిఁ బూర్వము దర్శనం బిచ్చినమహాపురుషులు మఱలఁ బ్రత్యక్షమైరి. అతఁడు వారికి సాష్టాంగప్రణామంబుఁ గావించి నిజకళేబరంబును గంగాజలంబులఁ దక్షిణంబుచేసెను. వానికి వెనువెంటనే

హరిపార్షదరూపంబు గలిగెను. అంతలోనఁ గాంచనవిమానం బరుదెంచెను. విష్ణుదూతలు వాని నవ్విమానంబునఁ గూర్చుండఁబెట్టి హరిలోకంబునకుఁ గొనిపోయిరి.

రాజేంద్రా! నిఖిలధర్మంబులఁ దెగనాడి దాసికిఁ బతియై యదే లోకంబుగానుండి చెప్పరాని నింద్యకృత్యంబు లొనర్చి నరకంబునఁ బడనున్న మహాపాపాత్ముఁడు సయితము భగవన్నామకీర్తనపుణ్యఫలంబునఁ జేసి ముక్తుఁడు కాఁగా, హరిభక్తులసంగతి చెప్పనేల? ముముక్షువులకు భగవన్నామంబునకు మించిన పాపక్షయసాధనంబు వేఱొండు గలుగదు. ప్రాయశ్చిత్తంబు లెంతకఠినంబులైనవైనను దాత్కాలికపాపహరంబు లగునేగాని, పాపపునరావృత్తిమూలకరజస్తమఃకృతమనోమాలిన్యంబును వదలింపఁజాలవు.

రాజేంద్రా! మనుష్యులు వివిధకర్మంబులు చేయుట నైజము. ఆకర్మంబులు శుభాశుభంబులుగా నుండును. ప్రతికర్మంబునకుఁ దదనుగుణఫలం బుదయింపకమానదు. ఆఫలంబును గర్త యనుభవింపకతీఱదు. ఫలానుభవార్థము తగినశరీరంబులు గలుగుచుండును. ఆశరీరంబులు తత్తత్కర్మఫలంబుల ననుభవించి నశించును. శరీరంబు లట్లు అనుభవింపవలసిన కర్మఫలముల వాసనలసముచ్చయంబు అంతఃకరణం బనఁబడును.

ఏయే తఱి యేయే కర్మఫలంబు భోగ్యం బగునో యాయాతఱి తత్కర్మఫలవాసనలు విజృంభించి మఱలఁ దత్తద్రూపకర్మంబులకుఁ బ్రేరేపించును. అట్టికర్మంబుల నింద్రియంబులు కొనసాగించును.శుభకర్మఫలవాసనలు వీచునప్పుడు శుభభావంబులు గలిగి ధర్మకార్యంబులఁ జేయఁబడి యుత్తమగతికి జీవుఁడు పోవును. అశుభకర్మఫలవాసనలు వీచుతఱి నశుభాశయంబులు జనించి యధర్మకార్యంబులు చేయఁబడి జీవుఁ డధోగతి పాలగును.

అశుభకర్మంబులవలనఁ గలుగు దోషము మలము - విక్షేపము - ఆవరణము అని మూఁడువిధంబులు. మలరూపదోషము విషయాసక్తిని

గలిగించి నిషిద్ధకర్మంబులకుఁ బ్రేరేపించును. ఇది మలదోషలక్షణము. మనస్సు నిల్కడఁ గాంచక యావంకకు నివ్వంకకుఁ బఱుగెత్తుచుండును. ఇది విక్షేపదోషలక్షణము. ఘటము దీపంబుపై నుంచఁబడినప్పుడు దీప కాంతి నెట్లు బహిఃప్రకాశమానముగా నీయక నిరోధించునో, యట్లే యావరణదోషము ఆత్మప్రకాశంబును గప్పిపుచ్చును. ఆత్మప్రకాశము గలుగనినాడు బుద్ధి సత్యమును అనఁగాఁ దా నెవ్వఁడో యనుసంగతిని గ్రహింపక ప్రమాదపడుచుండును. ఇది యావరణదోషలక్షణము.

### దోషత్రయనివారణప్రక్రియ

రాజేంద్రా! ఈదోషత్రయము పోవుట యెట్లందువా? గంగా స్నాన భగవన్నామోచ్చారణ భూతదయా నిష్కామకర్మానుష్ఠానంబులు నాలుగును దోషనివారణప్రక్రియ లగును. ఈ నాల్గింటిలో నే యొక్క దానివలననైనను మలదోషము పోవును. మలదోషమునకంటె విక్షేప దోషము తీవ్రతరము. భగవద్ధ్యానము, అజపాజపము, యోగము, భగవద్బుద్ధితో గురువును సేవించుట, వేదాంతప్రవేశము - ఈయైదింటిలో నే యొక్కదానిచేతనేని విక్షేపదోషంబును మలదోషంబును రెండుఁ దొలంగును. ఆవరణదోషము తీవ్రతమము. అపరోక్షజ్ఞానంబుచేతఁ దక్క మఱి దేనిచేతను దద్దోషము నివృత్తినొందదు.

రాజా! మలవిక్షేపదోషనివారణసాధనంబులలోనెల్ల భగవ న్నామోచ్చారణము శ్రేష్ఠమగు. ఆనామస్మరణము తెలిసి చేసినను దెలి యక చేసినను శుభఫలము తప్పదు. వస్తుశక్తి యిచ్ఛ నాశ్రయింపదని మున్నే తెలిపితినిగదా.

రాజేంద్రా! ఈ యితిహాసము సర్వపాపహరంబును బరమరహ స్యంబు నగు. దీనిని శ్రద్ధాభక్తులతో విన్నను బఠించినను నరకము దూర మగుటయేగాక యమకింకరులు డాయనోపరు. మఱియు మహాపాపాత్ము లును గూడ విష్ణులోకప్రాప్తి యగు. అచట వారు పూజితు లగుదురు.

## యమభటులు యమునితో మొఱయిడుట

రాజేంద్రా! యమదూత లట్లు నిరాకృతులై చని యముని సందర్శించి 'దేవా! జీవలోకంబెల్లఁ ద్రివిధకర్మంబు లాచరించుచుఁ దత్తత్కర్మఫలంబుల ననుభవించుచుండును. ఏజీవి యేఫలంబు నెప్పు డెట్లనుభవింపవలయునో విధివిధానం బుండవలయును. ఆవిధానంబును విధించునట్టి యధికారియు నుండవలయును. అట్లు శాసించువాఁడు ఏకవ్యక్తిగా నుండవలయునేగాని బహువ్యక్తు లుండరాదు. బహువ్యక్తులైనచో నభిప్రాయభేదంబులు గలిగి కార్యక్రమము యథావిధి నడువనేరదు. ఎట్లందువా? ఒక్కనికి దండనీయుఁడైనవాఁడు వేఱొక్కనికి రక్షణీయుఁడుగాఁ దోఁపవచ్చును. అప్పుడు దండనవిధానమే తాఱుమాఱగును. కర్మకారులు పెక్కురైనప్పుడు వారివారికిఁ దగినవ్యవస్థను గావించువారుగూడ పెక్కురు వలదా? యని యడుగవచ్చును. పలువు రుండుట యుపచారమాత్రమే గాని వేఱుగాదు. చక్రవర్తి యొక్కఁడే యెల్లరకును శాసనకర్త యగును. తక్కినవారెల్లరు వానియాజ్ఞలను గొనసాగించువారై యుందురు. ఎట్లు విచారించినను శాసనకర్త యేకవ్యక్తి కావలయు నని తేలుచున్నది.'

'దేవా! సర్వలోకంబునకు నీ వొక్కరుండవే శాసనకర్త వనియు నరులపుణ్యపాపంబులను విచారించి యథార్థదండనంబు విధించు శాస్తవు నీ వొక్కరుండవే యనియుఁ దలంచి నీయాజ్ఞఁ దలఁదాల్చుచుంటిమి. నేఁడు మాతలంపు కల్లయయ్యెను. ఎట్లందురా? నీయాజ్ఞప్రకారము మేము చని యొకమహాపాతకిని బాశంబుల బంధించి యీడ్చుకొని రా నుంటిమి. అంతలోఁ దత్పాపాత్ముఁడు భయగ్రస్తుఁడై 'నారాయణా' యని యఱచెను. ఆయఱపుతోడ నల్వు రెవ్వరో వచ్చి వానికి నభయంబు పలికి మా కట్టినపాశంబులను సడలించి వానిని వదలిపెట్టిరి. వా రెవరో? యట్లు చేయు టేలనో? నీయాజ్ఞను వా రుల్లంఘించుట యెట్లో యూహింపరాకున్న' దని విన్నవించిరి.

దండధరుఁడు వారిని విని 'భటులారా! ఈ ప్రపంచంబు స్థావరజంగమాత్మకమై యున్నది. ఈ ప్రపంచంబునకు 'నేనే' యీశ్వరుఁడ నని మీరు భావించితిరి. ఇది మహాప్రమాదము. ఆ ప్రమాదఫలంబు ననుభవించితిరి. ఎట్లందురా? మనల నెల్లరను శాసించు మహాపురుషుం డొకఁడు గలఁడు. తంతువులలో గుడ్డ యెట్లో, యట్లే వానిలో నివ్విశ్వంబెల్ల నోతప్రోతమై యున్నది. బ్రహ్మవిష్ణు రుద్రులుగూడ వాని యంశంబులై విశ్వసృష్టిస్థితిలయంబులు గావింతురు. సమస్తలోకంబు నమ్మహాపురుషునివశమై ముకుఁద్రాటఁగట్టిన యెద్దువలె వర్తించును. ఆ మహాపురుషుని పాశంబు లెట్టివందురా? వానివాక్కులే పాశంబులు. ఆ వాక్సముచ్చయంబే వేదం బనఁబడును.

'దూతలారా! ఆమహాపురుషునిచేష్టితంబు లెట్టివందురా? వాని చేష్టితంబులను గ్రహింపవలయునన్నచో రజస్తమోగుణంబులను జయించి కేవల సత్త్వప్రధానులు కావలయును. అట్టివారికిమాత్రమే సృష్టి రహస్యంబు కొంత స్పష్టమగును. అష్టదిక్పాలకులమైన మేమును, బ్రహ్మయు, సురసిద్ధసాధ్య మరుద్రుద్రగణంబును, విశ్వవసువులును, లోక సృష్టికర్తలైన ప్రజాపతులును, భృగువు మొదలగు మహర్షులును రజస్తమస్సులకుఁ దవులక సత్త్వప్రధానులమై యుందుము. అట్టి మాకుఁగూడ నమ్మహాత్ముని భావంబులుగాని కార్యంబులుగాని గోచరింపవు. ఇఁక నన్యుల సంగతి చెప్పనేల? నేత్రంబులు రూపంబును గ్రహించును; రూపంబులు తమ్మెఱుంగు నేత్రంబుల నెఱుంగవు. అట్లే యామహాత్ముఁడు హృదయాంతర్యామియై చిత్తేంద్రియప్రాణవాక్కులనెల్లఁ జూచుచుండును. ఆచిత్తేంద్రియాదులు వాని నెఱుంగఁజాలవు. అట్టిచిత్తాదులు తా మెఱుంగనివానింగూర్చి యేమి చెప్పఁగలవు?

**హరిపార్షదులు - వారి ధర్మము**

భటులారా! ఆమహాత్ముఁ డాత్మతంత్రుఁడు; వానిశక్తిని మాయ యందురు. ఆమాయ వానియిచ్ఛానుసారము వ్యవహరించును. ఆమహా

త్ముని సేవించినప్పుడు తద్గుణస్వభావంబులు కొంతకుఁగొంతయెఱుంగుటయు, వానినిఁ గొంతకుఁగొంత యలవరించుకొనుటయు నగును. వానిపరిసేవకు లట్టిమహాభాగ్యంబును బడసి యీలోకంబునఁ జరింతురు. వారిని హరి పార్షదు లందురు. వారిపని యేమందురా? హరిభక్తులకు నెవ్వరివలనఁ గూడ గోరంతయేనియు వెఱపు గలుగకుండ వారినిఁ గాపాడుటయే హరి పార్షదుల ధర్మమైయుండును.'

### భాగవతధర్మము

భటులారా! భాగవతధర్మం బెద్ది యందురా? ఆధర్మము మహా విశుద్ధము దుర్బోధము నగుఁ గావునఁ బరమగుహ్యము. ఆధర్మంబును బ్రహ్మయు శంకరుఁడును నారద సనత్కుమార కపిల మను ప్రహ్లాద జనక భీష్మ బలి శుకులంతటివారుగూడఁ గొంతకుఁ గొంతమాత్రమే యెఱుంగుదురు. నేనుగూడఁ గొంతమాత్రమే గ్రహించితిని. కాఁబట్టి భాగవత ధర్మంబు నిట్టిదని సమగ్రంబుగా నెవ్వరుఁ జెప్పఁజాలరు.

### లోకుల పరమధర్మము - తత్సాధనము

దూతలారా! లోకులకుఁ బరమధర్మం బెద్ది యందురా? భగవద్భక్తి నలవరించుకొనుటయే లోకులకుఁ బరమధర్మం బగును. అట్టిభక్తి యెట్లు సిద్ధించునందురా? భగవన్నామంబును గీర్తించుటవలన నట్టిభక్తి క్రమక్రమంబుగా సిద్ధించును. హరినామకీర్తనంబునకు నంతటిమాహాత్మ్యము గలదా యని యందురా? ఆసంగతి మీరే కన్నారఁ జూచితిరి. అజామిళుఁడు భక్తితో నట్లు చేయలేదనియుఁ, బ్రాణోత్క్రమణసమయంబున మిమ్ముఁ జూచి వెఱచి వానిపుత్త్రుని నారాయణుఁడనువేరి వానిని 'నారాయణా!' యని కేకవైచె ననియుఁ జెప్పుదురా? పుత్త్రవ్యాజంబుననేని నారాయణశబ్దంబు నుచ్చరించినంతమాత్రాననే యజామిళునకు ముక్తిగలుగుట మీరు చూచితిరిగదా! ఇఁక నియమపూర్వకంబుగా భగవద్గుణకర్మనామంబులను గీర్తించుపుణ్యాత్ములసంగతి చెప్పవలయునా?

### వేదసారము - భక్తియోగము

భటులారా! హరినామోచ్చారణమం దింతమహిమ యుండఁగా దాని వదలి యజ్ఞకర్మంబులతో జీవితంబును గడుపుట యేల యందురా? అజ్ఞానమే యందులకుఁ గారణము. యజ్ఞాదులు వేదవిధులు గదా యని యందురా? వేదవచనంబులు పూఁచినతీవెవలె నర్థవాదరుచిరంబులై యుండును. అనఁగా నెట్టికర్మంబులకు నెట్టిఫలంబులు గలుగునో వేదంబులు నిరూపించును. అంతియగాని యాకర్మంబులను జేయవలసినదని వేదంబులు విధింపవు. జడమతులు తద్వచనంబులు పరమార్థంబుగా భావించి వర్తింతురు. ధీమంతులన్ననో సర్వము విమర్శించి సారముతీసి యాప్రకారము వర్తింతురు. సార మేమందురా? భక్తియోగమే వేదసారము. అట్టిభక్తికిఁ జిత్తశుద్ధి వలయును. చిత్తశుద్ధి యనఁగా నేమని యందువా? చిత్తము దానిచాంచల్యంబును మాని యేకాగ్రమగుట చిత్తశుద్ధి యనఁబడును. చంచలమతులకు నేకాగ్రత కలుగుటకై యజ్ఞాది కర్మంబులు సాధనంబులుగాఁ జెప్పఁబడెను. ఆకర్మంబుల నొనర్చుచుండఁగాఁ గొంతకాలంబునకుఁ జిత్తంబు కర్మఫలదాతవంకఁ జేరి యందు నిల్కడఁ గాంచును. ఇదే వేదవిధుల తాత్పర్యము.'

### హరిభక్తులు - పూర్వపాపము

భటులారా! భగవద్భక్తు లెన్నడును దండ్యులు గారు. ఈసంగతి మఱువవలదు. భగవద్భక్తులైనను వారికిఁ బూర్వపాపంబు గలుగదా యనియు, దాని ననుభవింపక తప్పించుకొనుట యెట్లనియు శంకింతురా? భగవద్భక్తుల పూర్వపాపంబులెల్ల హరిగుణకీర్తనమాత్రాననే నశించును. అంతియగాదు. వారియెడఁ బాపపునరంకురంబునకు నవకాశంబుగూడఁ గలుగదు.

### హరిభక్తుల లక్షణములు

హరిభక్తులను గుఱితించుట యెట్లందురా? ఎవరు సాధువులుగాను సమదర్శనులుగా నుందురో, వా రెల్లరును హరిశరణాగతు లని గ్రహిం

పుఁడు. అట్టివారియొద్దకు మీరు పోవంగూడఁ దగదు. ఏల యందురా? భగవంతుఁడు గదాధారియై నిరంతరము వారిని గాపాడుచుండును. హరిభక్తులను దండింప నేనుమాత్రమే గాదు కాలముగూడ నోపదు.

### పాపాత్ముల లక్షణములు

మీరు పోఁదగినవా రెవ్వరందురా? పాపాత్ములకడకు మీరు పోనగును. వారిలక్షణంబు లెట్టి వందురా? ఎవరు భగవత్పాదారవింద మరందంబును మెచ్చక నిరయమార్గంబైన గృహాద్యభిమానమునకుఁ జిక్కియుందురో వా రెల్లరు నసాధువు లగుదురు. వారి నిటకుఁ దోడి తెండు. ఏనిర్భాగ్యుఁ డొక్కనాఁడేనియు భగవన్నామంబును బల్కుటగాని, భగవంతుని భజించుటగాని, వానికి మ్రొక్కుటగాని, సేవ లొనర్చుటగాని యొనర్పఁడో యట్టివాఁడు దండ్యుఁ డగును."

భటులారా! మీరు తెలియక యపరాధం బొనర్చితిరి. తెలియక తప్పుచేసినను దర్వాత నేనియుఁ దప్పును గ్రహించి క్షమాపణంబు వేఁడుట ధర్మంబగు. మన్నన వేఁడినవారిని మన్నించుటయు ధర్మంబగును. భగవానుఁడు పరమధర్మస్వరూపుఁడు గావున మీకుగా నేను వానిని క్షమాపణంబుఁ బ్రార్థించుచున్నాను.' అని చెప్పి 'భక్తవత్సలా! నాభటుల తప్పునకుగా నేను నమస్కరించుచున్నాను.' అని సాగిలఁ బడెను. నరేంద్రా! భగవత్కీర్తనము సకలపాపప్రాయశ్చిత్తమేగాక లోకమంగళకరంబు నగును. ఆమహనీయుని చరితలు చెవిసోకినంతనే హృదయమం దొకవిధమైన మార్పు గలుగును. అదియే భక్తిబీజము! ఆభక్తివలనఁ జిత్తశుద్ధి గలుగును. చిత్తశుద్ధికి వ్రతాదులు లేవా యని యందువా? వ్రతాదులు పైపై మలంబుల నూడ్చునేగాని చిత్తంబును మలరహితం బొనర్పఁజాలవు.

భగవత్పాదపద్మమరంద మన్ననో మలంబును సబీజంబుగా నూడ్చి వైచును. మఱియుఁ దన్మరందంబు నొక్కసారి గ్రోలినవానికి గుణ కార్యంబులైన యైహికభోగకర్మంబులు రుచింపవు. చిత్తమాలిన్యంబు

లెల్లఁ గోరికలవలనఁ గలుగుచున్నవనియుఁ, గోరికలను జయించినవాఁడు శుద్ధచిత్తుఁడు కాఁడా యనియు, భగవద్భక్తి యేల ? యనియు శంకింతువా ? చిత్తశుద్ధినిమిత్తము కోరికలను జయింప యత్నింతురు. కేవలము వట్టిప్రయత్నంబులవలననే కామము పూర్ణముగాఁ దొలఁగదు. అది బీజమాత్రమై యుండును. అదనువచ్చినప్పు డది తలయెత్తి పునః ప్రవృత్తికరకర్మంబులను జేయించును. భగవద్భక్తి యన్ననో కామంబును మొదలంటఁ బెకలించివైచును. భక్తులు భగవదిచ్ఛాప్రేరితకర్మంబులనుమాత్రమే యొనర్తురు. కావున వారికిఁ దత్కర్మఫలంబు లంటవు."

### ప్రారబ్ధము - శాంతి

మునులారా ! పరీక్షిన్నరేంద్రుఁ డామాటలు విని 'మహాత్మా ! శాంతివలనఁ బ్రారబ్ధముగూడ నశించునా ?' యని యడిగెను. శుక మహర్షి వానిభావంబును గ్రహించి 'రాజా ! భోగ్యకర్మఫలము ప్రారబ్ధ మనఁబడును. వింటినుండి విడిచినబాణంబువలె భోగ్యకర్మఫలగతి యుండును. ప్రయోగతత్త్వంబునుబట్టి బాణగతి మందమధ్యమ తీవ్రంబులుగా నుండునట్లు భోగ్యకర్మఫలగతిగూడ నుండును. నారినుండి వెడలినతర్వాత బాణంబును మఱలించుట యెట్లు సాధ్యముగాదో, యట్లే ప్రారబ్ధకర్మగతిని మఱలింపరాదు. బాణగతిని మఱలింపఁ దరముగా కున్నను, దగునట్టి యుపాయంబులచేత దానిగతి నడ్డగింప నెట్లు సాధ్యమో యట్లే ప్రారబ్ధకర్మఫలగతి నడ్డగింపవచ్చును. శాంతులు తావన్మాత్రంబులు. బాణగతి మహోత్కటమైనచో దాని నడ్డగింప నిడినవస్తువు తగినంత శక్తిగలది గానిచో, బాణం బావస్తువును దూటాడి యవ్వలకుఁ బఱచును. అట్లే ప్రారబ్ధకర్మఫలగతిగూడ మహాతీవ్రంబగుచోఁ దదర్థశాంతి తగినంత శక్తిగలది గానిచోఁ దత్ప్రారబ్ధకర్మఫలంబు ననుభవింపకతప్పదు. రాజా ! నివారణార్థ ప్రయుక్తవస్తు బలాబలంబులనుబట్టి ఫలభోగ స్థితిగతు లుండును. ఒక్కటిమాత్రము మఱువరాదు. భోగ్యఫలం బనుభవోన్ముఖము గాకమానదు. అయినను దాని తీవ్రతను దగ్గింప

వచ్చును. భోగ్యంబును మున్నుగా జ్యోతిశ్శాస్త్రంబునుబట్టి నిశ్చయించి తత్ప్రతీకారము చేయరాదా! యని యందువా? మృత్యురూపకర్మ ఫలంబును దక్క తక్కినవానికి నుపశాంతులు గలిగింపవచ్చునేగాని, ప్రారబ్ధ కర్మవిధానంబునకు స్వరూపనాశంబును గలిగింపరాదు. శరీరం బనెడి వృక్షంబు తలెవచ్చినప్పుడు కర్మఫల మనెడి చిగురును ధరింపకమానదు. చిగురును గిల్లివేయవచ్చునట్లు కర్మఫలంబు ప్రారంభమైనతర్వాతఁ దొలఁ గింపనగును. ప్రారబ్ధంబును భోగించి తీఱవలయు నన్నప్పుడు దాని భావంబు పైఁజెప్పినవిధం బని గ్రహింపవలయును. అనఁగాఁ బ్రారబ్ధంబు దానిశక్తికొలఁది పోవలసినంతదూరము పోయితీఱుననియు, ప్రతీకారా దులవలన దాని నడ్డగించినప్పుడు దానితీవ్రత నడ్డపడువస్తువు గ్రహించు టగుననియు, ఎట్లయినను ప్రారబ్ధఫలము స్వయముగానో పరప్రాపక రూపంబుననో భుక్తమై నశించుచున్నదనియుఁ దాత్పర్యము. మఱియు నడ్డపడువస్తువు సామాన్యమైనదగుచోఁ దత్కర్మతీవ్రతకు నయ్యది గుఱియై యాబాధ ననుభవించుచున్నది. ఆవస్తువు దుర్భేద్యమైన దగుచోఁ గర్మతీవ్రత దాని నేమియుఁ జేయఁజాలదు. వస్తువు నడ్డము వైచునప్పుడుత్తమోత్తమవస్తువుఁ దెచ్చి వైవవలయును. ఉత్త మోత్తమవస్తు వేది యని యందువా? పరమేశ్వరుఁడే యావస్తువు. వానిచాటుచొచ్చినచో నమ్మహాత్ముఁడు సర్వకర్తయైనవాఁడు గావున వానిలో నెల్లకర్మఫలంబులు లయించిపోవును. కావున భగవచ్ఛరణా గతికంటె నుత్తమరక్షకవస్తువు గలగదు. భగవంతుని శరణొల్లుటకంటె నుత్తమసాధనంబును లేదు.

రాజేంద్రా! తొల్లి యగస్త్యమునీంద్రుఁడు మలయపర్వతశిఖరం బున భగవంతుని నర్చించుచుండెను. అటకు మునులు కొందఱు చనిరి. ప్రస్తావవశంబున వారికి నియ్యితిహాసంబు నమ్మహానీయుఁడు చెప్పెను. దీనిసారంబును గ్రహించి వర్తించి చరితార్థుఁడ వగుము." అని వచించెను.

### స్వాయంభువమన్వంతరసృష్టివిస్తారకథనము

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షిని విని 'మునీంద్రా! తొల్లి స్వాయంభువమన్వంతరమందు దేవాసురనరమృగపక్షినాగాదుల సృష్టినిగూర్చి తృతీయస్కంధమందు సంక్షేపంబుగాఁ దెలిపితిరి. భగవానుఁ డేశక్తి నుద్రేకింపఁజేసి యేప్రకారంబు సృష్టిని విస్తరింపఁజేసెనో వినఁ గుతూహలంబగుచున్న'దని యడిగెను. వానికి శుకమహర్షి యిట్లనియెను.

### ప్రాచేతసులు భూమిమీఁది వృక్షజాలంబును దహించుట

'రాజా! ప్రాచీనబర్హికిఁ బ్రచేతసు లను పుత్రులు పదిమంది జనించి సముద్రాంతరంబునుండి వెలువడి భూమిపయి నిలిచి నలువలంకులఁ జూచుటయు, ధరాతలంబెల్ల వివిధవృక్షంబులతో నిండి ప్రాణిసంచారంబు నకు సందియ్యకుండుటయు, వా రదిగాంచి 'అహో! ప్రాచీనబర్హి నారదోపదిష్టుఁడై నివృత్తిమార్గంబును ద్రొక్కుటంజేసి దేశమెల్ల నరాజక మయ్యెను. కృష్యాదులు సన్నగిల్లెను. భూమిని దున్ని చక్కఁజేయువారు లేమింజేసి భూభాగంబెల్ల నిట్లయ్యెను.' అని తలపోసి కోపావేశులై లతాగుల్మవృక్షాదులను దహించుటకుగా వారిముఖంబులనుండి యగ్ని మారుతంబులను బుట్టించుటయు, ఆ నిప్పుగాడ్పులు వృక్షాదులనెల్లఁ గాల్చి బూదిచేయుటయు వినియుందువు.

### సోముఁడు ప్రాచేతసులకు స్వధర్మంబుఁ దెల్పుట

'నరేంద్రా! వనస్పతులకెల్ల సోముఁడు ప్రభువగును. సోముఁడు వనస్పతు లట్లగుటకు నెంతయుఁ జింతపడి ప్రాచేతసులను డాయఁబోయి 'మహాభాగులారా! ప్రజాపతులు లోకవృద్ధిని గావింతురు. మీ రట్టివారయ్యు దీనంబులైన వృక్షంబులకు నిట్లు కీడుచేయనగునా? మఱియు వృక్షకోటి ప్రత్యుపకారాపేక్షారహితంబుగా జీవకోటికి నాహారంబును గూర్చును. భగవానుఁడు సృష్టికిఁ గడఁగి, తాను సృష్టింపనున్న సపాద నిష్పాద సహస్తాహస్తద్విపాద చతుష్పాదాది చరాచర సకలజీవరాశికి నాహారార్థంబై యోషధులను దొలుదొల్తఁ బుట్టించి వానిని జీవకోటికి

నన్నంబుఁ గూర్ప విధించెను. అంతటఁ బ్రజాసర్గనిమిత్తము మిమ్ము నిర్దేశించెను. మీతండ్రియు మీతాతముత్తాతలును బ్రజాసర్గభరంబు వహించి వన్నెఁగాంచిరి. మీపెద్దలత్రోవ మీరు వదలరాదు. మీకోపంబులను వదలుఁడు. బాలురకుఁ దల్లిదండ్రులును, గంటికి ఱెప్పయు, సతికిఁ బతియు, భిక్షువులకు గృహస్థుఁడును, అజ్ఞానులకుఁ బ్రాజ్ఞుండు నట్లుఁ బ్రజలకు రాజు సుహృత్తగును.'

'ప్రాచేతసులారా! మఱియొకమాట. భగవానుఁడు సర్వభూతశరీరంబులందు నాత్మభూతుఁడై యుండు. వేయేల! లోకంబెల్ల భగవన్నిలయం బగు. లోకములో దేనికి నపకారంబు గావించినను భగవంతునకు నపకారంబు చేయుటగు. నిదర్శ మేమందురా? మీరే యిందులకు నిదర్శకు లగుదురు. ఎట్లందురా? మీర లింతకుఁబూర్వము భగవత్ప్రీతికిఁ బాత్రులైతిరి. కారణమేమి? మీ సమదృష్టియేగదా కారణము. అది యింతలో మఱవవచ్చునా? ఆత్మవిచారంబు సుంతగావింపుఁడు. కోపంబును జల్లార్పుఁడు. అట్లుచేయుట గుణంబులను జయించుటగు. ఇంతటనేని వృక్షదహనంబును నివారించి శేషించినవానికి మేలు గూర్పుఁడు.'

'ఇదిగో యీకన్య వార్క్షి యనునది వృక్షపాలితయై యున్నది. దీనిని గ్రహించి తదాశ్రయవృక్షంబులను రక్షింపుఁడు.' అని పలికి యాకన్నియ నిచ్చెను. వారు దానిని ధర్మపురస్సరంబుగా గ్రహించి పెండ్లాడిరి.

### దక్షుఁడు ప్రజాసర్గం బొనర్చుట

రాజా! ప్రాచేతసులకు నక్కన్యవలన దక్షుఁడు జనించి ముల్లోకంబులను బ్రజాపూరితం బొనర్చెను. ఎట్లందువా? దక్షుఁడు వాని మనశ్శక్తిచేత దేవాసురమనుష్యులను బుట్టించి వారిని గ్రమంబుగా నభఃప్రదేశంబునను జలప్రదేశంబునను భూప్రదేశంబునను వసింపఁజేసెను. వారివలనఁ బ్రజాసర్గంబు వర్ధిల్లదయ్యెను. దక్షుఁ డందులకు నెంతయుఁ

జింతపడి వింధ్యగిరిప్రాంతపర్వతంబులకుఁ జని యందున్నట్టి యఘమర్షణ తీర్థంబున నీరాడి శుచియై నియతితో మహాతీవ్రతపం బొనర్చి భగవాను నిట్లు స్తుతించెను.

హంసగుహ్యస్తోత్రము

'సర్వోత్తమా! నమస్కారము. నీవు సర్వోత్తముండ వగుట యెట్లందువా? సర్వము నీ చిచ్ఛక్తివిలాసంబగును. ఆశక్తియో యవిత థము. నీ చిచ్ఛక్తివిలాసం బెట్టిదందువా? గుణత్రయవ్యవహారంబు నీశక్తి విలాసంబగు. జీవుఁడన్ననో గుణత్రయాభాసుఁడు గాని వేఱు గాఁడు. జీవుఁ డట్లగుటకుఁ గారణం బేమందువా? నీ మాయయే కారణము. అట్టిమాయకు నీవు నియంతవగుదువు. నీ వట్టివాఁడ వగుట జీవుఁ డెఱుంగఁడా యని యడుగుదువా? ఎఱుంగఁడు. ఏల యందువా? జీవుఁడు బాహ్యదృష్టిమాత్రుఁ డగుటయే కారణము. గుణంబు లెప్పుడును వానిని బ్రకాశింపఁజేయు గుణి నెఱుంగనేరవుగదా!'

'గుణంబులు జడంబులు గావున గుణి నెఱుంగలేకుండిన నుండుఁ గాక యనియు, జీవుఁ డట్టివాఁడు గాదు గావున నతఁడు నిన్నేల నెఱుంగఁ డనియుఁ బ్రశ్నింతువా? జీవుఁడు దేహేంద్రియప్రాణాంతఃకరణభూత తన్మాత్రల స్వరూపంబులను దేవతావర్గంబును దన్మూలభూతగుణంబులను దెలియనేర్చునేగాని నిన్నెఱుంగఁజాలఁడు. ఏల యందువా? నీ వన్ననో యనంతుఁడవు. జీవుని జ్ఞానశక్తి పరిచ్ఛిన్నము. పరిచ్ఛిన్నుఁ డపరిచ్ఛిన్ను నెఱుంగుట యెట్లు సాధ్యమగు?'

జీవునకు నిన్నెఱుంగుశక్తి గలుగుట యెట్లందువా? సృష్టియెల్ల నామరూపప్రతీతిమాత్రంబగు. ఆప్రతీతికి మనస్సు కారణంబగు. మనస్సునకు దర్శనస్మరణవృత్తులు నశించునేని జీవునకు నిన్నెఱుంగు శక్తి గలుగును. మనోవృత్తులన్ననో యుపరతివలన నశించును. మన స్సట్లు పరతినొంది సమాధిగతమైనప్పుడు దర్పణమువలెఁ బరిశుద్ధముగా

నుండును. అట్టి పరిశుద్ధచిత్తమందు నీవు కేవలజ్ఞానస్వరూపహంసుఁడవై తోఁచుదువు. ఇదే జీవుఁడు నిన్నెఱుంగుట యగును.

దేవా! సమాధి యన నేమందువా? గాఢనిద్రయందువలె మనోలయంబొందక, జాగ్రత్స్వప్నంబులందువలె విక్షేపకమొందక గాక జ్ఞానమాత్రంబుగా నుండుస్థితిని సమాధి యందురు. కావునఁ దద్దశ యందు నీవు గాన్పించుటయు నిన్నెఱుంగుటయు రెండును సిద్ధించును. నీవు సర్వాంతర్యామివి గావున నెల్లచోట్ల నుండుటంజేసి యెచ్చోటనైనను నిన్నుఁ జూడరాదా యని శంకింపవచ్చును. నీవు సర్వాంతర్యామివైనను నీప్రతీతిస్థానంబు శుద్ధముగా నుండవలయును. అట్టి చోటనే నీ ప్రతిబింబంబు గానవచ్చును. మురికియద్దమందు ప్రతిబింబము గానవచ్చునా? కావున నీ దర్శనము శుద్ధమనస్సునందుమాత్రమే గానవచ్చును. నీవు ఆత్మస్వరూపంబున నెల్లరయందు నుందువు. అట్లున్నను నిన్నెల్లరుఁ గానరు. ఏల యందువా? ప్రకృతి, పురుషుఁడు, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు - ఇవియెల్ల నీ శక్తులగును. ఆశక్తులు త్రిగుణాత్మకంబులును షోడశవికారరూపంబులు నై వ్యవహరించును. వానిలో నీవు నిగూఢుఁడవై యుందువు. దారువునందు నంతర్గతుఁడై యున్నయగ్నినిఁ బంచదశ సామధేనిమంత్రంబుల ఋత్విజులు ప్రకాశింపఁ జేయునట్లుగా, అహంకారపరిచ్ఛిన్నుఁడవై యున్న నిన్ను వివేకంబునఁ బ్రకాశింపఁజేయనగును. అహంకారము తొలంగినంతనే నీవు గానవత్తువు. ఎవ్విధంబునఁ గానవత్తువందువా? కేవల నిర్వాణసుఖానుభవ రూపంబున నిన్ను సందర్శింతురు.

దేవా! నీరూపం బెద్ది యందువా? రూపనామంబులు గుణకార్యంబులు. నీవో నిర్గుణుండవు; అనఁగా గుణాతీతుఁడవు. కావున నీరూపము గుణకార్యంబులైన మనోవాగాదీంద్రియంబులకు నందదు. దానంజేసి నీ విట్టివాఁడవని యూహింపనుగూడ సాధ్యముగాదు. అట్లగునేని నీవిశ్వరూపత్వము సంగతి యేమగునందువా? విశ్వరూపముగూడ నీమాయా కల్పితమేగాని సత్యముగాదు.

అన్ని కారణంబులకు మూలకారణంబవై, యందువలన నాదికారణం బనఁబడుచు, నేకము నసదృశము నై సర్వదృశ్యంబులకు బీజంబును సర్వాధారంబుగా నేది కలదో, దేనియాధారంబున సర్వము వ్యవహరించునో, సర్వసంబంధమూర్తియు సర్వలయస్థానంబు నేది యగునో యట్టి యనాదిసిద్ధంబును సజాతీయ 'విజాతీయశూన్యంబును సత్యస్వరూపంబు నైన పరబ్రహ్మంబును నిన్నుఁగూర్చి యిదమిత్థమని నిర్ణయింప నెవరికి సాధ్యమగును ? దేవాదిదేవా ! నీవు కలవని యోగులు వచింతురు; నీవు లేవనిసాంఖ్యులు వాదింతురు. ఈ వాదవివాదంబులు నీ మాయాశక్తుల కోలాహలమే గాని వేఱుగాదు. నీవే లేకున్నచోఁ బ్రపంచం బుండునా? ఏల యందువా ? ప్రపంచం బనఁగా నీ శక్తివిస్తారమేగదా. మఱియు నీ వుండుట నీ యవతారంబులు వేనోళ్లఁ జాటును. నీయవతారకార్యంబు లెట్టివందువా ? నీపాదంబుల నాశ్రయించినవారి ననుగ్రహించుటకై దేశకాలానుగుణంబుగా నీవు రూపుదాల్చి నీభక్తులకు మేలుగూర్తువు. వాయువు ఏకరూపమయ్యు నానాపుష్పసంబంధకారణంబున వివిధగంధవంతమై తోఁచునట్లు నీ వేకరూపంబున నెల్లరియందు నంతర్యామివై యున్నను వారివారి పూర్వవాసనలకారణంబున వివిధగతులఁ గాన వత్తువు. అట్టి నీకుఁ బునఃపునర్నమస్కారంబులు.

### దక్షునకు భగవంతుఁడు ప్రత్యక్షమగుట

రాజేంద్రా ! దక్షుఁడట్లు స్తుతించినంతట వానియెదుట నొక దివ్యమూర్తి నీలమేచకశరీరంబు గలిగి పీతాంబరంబు ధరించి శంఖచక్ర ఖడ్గచర్మబాణధనుఃపాశగదాయుధంబుల నెనిమిదిహస్తంబులఁదాల్చి, కిరీట కటకమకరకుండలకాంచికాంగుళీయవలయనూపురాంగదభూషణంబులు క్రొమ్మెఱుంగు లీనుచుండఁగా శ్రీవత్సకౌస్తుభవనమాలలు హృదయపీఠి నలంకరించుచుండఁగా నెంతయు నొప్పారుచుఁ దోఁచెను. ఆమంగళ మూర్తిని నారదాదిమహర్షులును నందాదిపార్షదులును లోకపాలురును

జుట్టి కొలుచుచుండిరి. సిద్ధచారణగంధర్వులు ప్రస్తుతులు గావించుచుండిరి.

ఆ పరమాశ్చర్యరూపంబును దక్షుఁడు చూచి గతవడి సాధ్వసుడయ్యెను. అతని సర్వేంద్రియద్వారంబులనుండి హర్ష జలంబు చిప్పిలెను. వానినోట మాట రాదయ్యెను. అతఁ డొండేమియుఁ జేయనోపక యాదివ్యమూర్తికి సాగిలఁబడెను.

భగవంతుఁడు దక్షునకుఁ బ్రజావృద్ధిమార్గంబుఁ దెలుపుట

రాజేంద్రా! భగవానుఁడు దక్షునకు సంతసించి 'ప్రాచేతసా! ప్రజావృద్ధికై నీయత్నంబు విఫలంబగుటయు, దానిని సాధించుటకుగా నీ విట్లు శ్రద్ధాభక్తిపూర్వకంబుగాఁ దపం బొనర్చుటయు నెఱుంగుదు. ఈ నీతలంపు నాదిగాని నీదిగాదు. నాతలంపును గొనసాగింప నీ చేసినతపం బెంతయు నాకుఁ బ్రీతిని గూర్చెను. నీవు తపస్సిద్ధుండవై తివి. నీవును బ్రజాపతులును మనువులును విబుధేశ్వరులును బ్రహ్మయు భవుండును నా యంశంబులై భూతోద్భవహేతువు లగుదురు. వత్సా! యమనియమాదిరూపతపస్సు నాకు హృదయంబును, విద్య తనువును, ధ్యానాది క్రియ యాకృతియు, క్రతువు లంగంబులును, ధర్మం బాత్మయు, దేవతలు ప్రాణంబులు నగును.'

దక్షా! ఈ జగత్సర్గంబునకుఁ బూర్వము నే నొక్కఁడ నుంటిని. మఱియొండు గలుగదు. అప్పుడు గ్రాహ్యగ్రాహకంబులైన బాహ్యాంతరంబులు గలుగవు. నేను చైతన్యమాత్రుండనై సర్వతః ప్రసుప్తంబురీతి నుందుఁ గావున నింద్రియవృత్తులకుఁ గాన్పింపను. నాలో లీనమైయున్న నామాయాశక్తికి నుంతమాత్రము చలనం బంగీకరించితిని. ఆశక్తి తోడ్తోడ గుణమయి యయ్యెను. తత్ఫలంబుగా బ్రహ్మాండం బేర్పడెను. అందు బ్రహ్మ యుద్భవించెను.

ఆ బ్రహ్మ మహావీర్యవంతుఁడయ్యు సృష్టిశక్తి తనకు లేనట్లు భావించి చింతింపసాగెను. వానిచింతను గ్రహించి తపంబు నేయుమని వాని

నాజ్ఞాపించితిని. అతఁడు నాయాజ్ఞప్రకారము వర్తించి శక్తిమంతుఁడై లోకసర్గసమర్థులైన మిమ్ము సృజించెను.

నీకు సంతతి గలుగుటకు నుపాయంబు చెప్పెద వినుము. ఇదిగో యీచిన్నది రసిక్ని యనునది పంచజనుఁ డను ప్రజాపతి పుత్రిక. దీనిని నీవు భార్యగా గ్రహించి మిథునధర్మంబు ననుష్ఠింపుము. ప్రజాసర్గంబునకు వృద్ధి గలుగును. నిన్నుఁజూచి నీక్రిందివారు నామాయామహిమంబున మిథునీభావంబు నర్థించి ప్రజలంగాంచి తద్విధంబున నన్నుఁ బూజింతురు.' అని చెప్పి యంతర్ధానుఁడయ్యెను.

### హర్యశ్వులజననము

రాజేంద్రా ! దక్షుఁ డంతటఁ బాంచజనిని బెండ్లాడి విష్ణుమాయా ప్రేరితుఁడై యాకాంతవలనఁ బదివేవురుపుత్రులను హర్యశ్వు లనువారిని బడసెను. వారెల్లరు నొక్కరూపమ్మైన యాచారస్వభావులుగా నుండిరి. దక్షుఁడు వారిని బ్రజసర్గార్థము నియమించెను.

### హర్యశ్వులు ప్రజాసర్గార్థము తపంబు సేయుట

హర్యశ్వులు పశ్చిమదిశంబట్టి సింధునదీసాగరసంగమప్రదేశంబు నకుఁ జని, యట మునిసిద్ధసేవితనారాయణసరస్తీర్థంబుఁ జేరి తపోవ్రతాను ష్ఠానపరులై తత్పుణ్యతీర్థమం దాచమించిరి. ఆక్షణంబ వారిహృదయం బులు రాగాదిమలరహితంబు లయ్యెను; వారికిఁ బరమహంసనిష్ఠాభావము జనించెను. అంతట వారు తండ్రియాజ్ఞఁ దలంచి ప్రజావృద్ధికై యుగ్ర తపంబుఁ బూనిరి.

### నారదుఁడు హర్యశ్వులకు నుపదేశించుట

కొండొకనాఁడు నారదమహర్షి యటకు వచ్చి తపోనిష్ఠులై యున్నవారిని జూచి 'బాలకులారా! మీరు సృష్టికై పూనితిరి. ఇంత పెద్దపనికిఁ బూనినవారు కార్యయుక్తాయుక్తంబులఁ గూర్చి ముందుగాఁ దెలిసికొనవలసిన ముఖ్యవిషయంబులు కొన్ని గలవు. ఎవ్వి యందురా? మొట్టమొదట భూవిస్తారాదికంబు దెలియంగవలయును. ఆ భూమిలో

నేకపురుషకంబైన రాష్ట్రంబు గలదు. దాని నెఱుంగవలయును. ఆ రాష్ట్రమందు బిలంబొకటి గలదు. ఆ బిలాంతరంబునుండి వెలికివచ్చు మార్గంబు లేదు. ఆరాష్ట్రములో బహురూపయైన స్వైరిణి యొకటి గలదు. దానిచెంతఁ బురుషుఁ డొకఁ డుండును. మఱియుఁ దద్రాష్ట్రంబున నది యొకటి రెండు దరులు నొరసి పాఱుచుండును. ఆ నదీగర్భంమున 'పంచవింశతి యను వద్భుతగృహంబు గలదు. అందుఁ జిత్రకథుఁడను హంసుఁ డుండును. ఆ గృహాంతరమందు నొకయంత్రము వజ్రనిర్మితమో యన నైజ తనకై తానే తిరుగుచుండును. ఇవన్నియు నెఱుంగక సృష్టికిఁ బూనుట వెఱ్ఱితనము గాదా?' యని చెప్పెను.

నారదుని గూఢాభిప్రాయంబు వారికి వెనువెంటనే బోధపడ దయ్యెను. వా రొకచోటఁ గూడి యామునివాక్యంబుల నొక్కొక్కటి యథామతి విమర్శింపసాగిరి. 'భూవిస్తారాదికంబు నెఱుంగవలయు' నని మహర్షి చెప్పెను. భూశబ్దంబునకు క్షేత్రంబని యర్థంబు గలదు. క్షేత్రమనఁగా మన మేమి గ్రహింపవలయును? లింగశరీరంబని గ్రహింపనగును. లింగశరీరంబు నెఱుంగుట యన నేమి? శరీరంబులెల్ల నశ్వరంబులనియుఁ బరమసాధ్యము మోక్షం బనియు, తదర్థము సాధనంబు వలయుననియు, అట్టి సాధనంబుగా నశ్వరపదార్థమైన శరీరంబు నాశ్రయించి యసత్కర్మంబు లెన్ని చేసినను ఫలము లేదనియు గ్రహింపనై యున్నది.' అని యొకఁడు పలికెను.

రెండవవాఁడు వానిమాట నందికొని 'ఏకపురుషరాష్ట్రక మనఁగా నేమి? భగవానుఁ డద్వితీయుఁడు నేకైకపురుషుఁడు నగు. వానిరాష్ట్రమేది? భగవానుఁడు స్వాశ్రయుఁడును స్వాధారుఁడును సర్వసాక్షియు నగును. వానియాధారంబున భూమియెల్ల నుండును. కావుట్టి రాష్ట్రమనఁగా నిచట జగంబే యని గ్రహింపవలయును. అట్టి జగదీశ్వరుని తత్త్వం బెఱుంగక యసత్కర్మంబు లాచరించుటవలనఁ బ్రయోజనము గలుగదని ఋషి పల్కిన రెండవవాక్యముయొక్క తాత్పర్య' మని చెప్పెను.

### బిలము

మూఁడవవాఁడు వానిమాట నందికొని 'బిలమునుగూర్చి మహర్షి పలికెను. ఆబిలముఁ జొచ్చినవాఁడు మఱల వెలికి రాఁడట! దీని భావమేమి? పరతత్త్వముఁ జొచ్చినవానికిఁ బునరావృత్తి గలుగదని విందుము. కాఁబట్టి మహర్షి చెప్పిన బిలము పరతత్త్వముగా నుండవలయును. పరతత్త్వంబును జేరుటకు నసత్కర్మంబు లుపయోగింప' నని మహర్షి భావంబుగా నుండనోపునని మూఁడవవాఁడు చెప్పెను.

### స్వైరిణి

అంత నాల్గవవాఁడు మునుపడి బహురూపధ్యైన స్వైరిణి యటఁ గలదని చెప్పెను. స్వైరిణి యనఁగా నిల్కడ లేని దని భావము. నిల్కడ లేకుండుట యనఁగాఁ జాంచల్యం బని యర్థము. చాంచల్యంబు మనస్సునకు నైజము. చాంచల్యంబునకుఁ గారణం బేమని విచారించినచో గుణసంసర్గము కారణంబగును. మనస్సు గుణవశమై వర్తించు ననియు ఆకారణంబున మనస్సు స్వైరిణిఁ బోలు ననియు మహర్షి హెచ్చరిక చేసె నని పలికెను.

ఏనవవాఁడు వానిమాట నందికొని 'ఆస్వైరిణి నాశ్రయించి పురుషుఁ డొకఁ డుండునని మహర్షి పలికెను. పురుషుఁడు కుత్సితభార్య నాశ్రయించి స్వాతంత్ర్యము వీడి దాని సుఖదుఃఖంబులే తనసుఖదుఃఖంబులుగా భావించుచు జీవితముఁ గడపుట లోకమందుఁ జూతుము. అట్లే జీవుఁడుగూడ గుణసంగబుద్ధికి లోఁబడి స్వాతంత్ర్యము దక్కి యది యాడ్చినట్లు వ్యవహరించి చెడుచున్నాఁ డని మహర్షి తాత్పర్యం' బని వచించెను.

### ప్రవాహము

ఆఱవవాఁడు వానిమాట నందికొని 'ప్రవాహముసంగతి మహర్షి చెప్పెను. ప్రవాహంబును దేనికిఁ బోల్పనగును? మాయకుఁ బోల్పనగును. ఏటికి దరు లట్లు మాయకు సృష్టిలయంబులు రెండును తీరంబు

లగును. ఆ మాయానదిలోఁ గ్రోధాహంకారంబు లనెడి మెసుమకర తిమింగిలంబులు గలవు. వానికిఁ జిక్కినవారు మఱల వెలికిరారని మహర్షి సూచించెనని పలికెను.

### పంచవింశతి యను నద్భుతగృహము

వానిమాటను మఱియొకఁ డందుకొని 'పంచవింశతి యను నద్భుతగృహం బెద్ది ?' 'తత్త్వంబు లిరువదియై దనియు సృష్టియెల్లఁ బంచవింశతితత్త్వాత్మకం బనియుఁ జెప్పిరి. ఋషిభావంబుగూడ నదే యగు' ననెను.

### చిత్రకథకుఁడైన హంసుఁడు

వానిమాటను బ్రక్కనున్నవాఁ డందుకొని 'ఆగృహములో నున్న చిత్రకథకుఁ డెవఁడు ? భగవానుఁ డంతర్యామియై యుండు నందురు. కావున హంసుఁ డంతర్యామియైన చిత్రకథకుఁ డగును. హంస యేమిచేయుచున్నది. క్షీరనీరంబులను వేఱుచేసి క్షీరంబును గ్రహించుచున్నది. అట్లే హంసుఁడుగూడఁ జిజ్జడప్రపంచంబునుండి చిత్తును వేఱుచేసి గ్రహించుచున్నాఁడు. వాని చిత్రకథ యెట్టిది ? బంధమోక్షణంబులఁ దెలుపుటయే వానిచిత్రకథ యగు' ననెను.

### యంత్రము

వానిని మఱియొకఁ డందుకొని 'స్వయముగాఁ దిరుగు యంత్రమును మహర్షి ప్రస్తావించెను. ఆయంత్రము కాలచక్రంబుగా నోపును. కాలచక్రసంచారవిధానంబు శాస్త్రంబగును. శాస్త్రంబు గుణంబుల నాశ్రయించియుండు. గుణధోరణిఁ జన్నవానికి నివృత్తిమార్గము గాన రాదు' అని పలికెను.

రాజేంద్రా ! హర్యశ్వు లట్లు ఋషివచనంబుల విమర్శించి తాత్పర్యంబును గ్రహించి వానికిఁ బ్రదక్షిణనమస్కారంబు లొనర్చి నివృత్తి మార్గపరులై రి. నారదుఁ డంతట వీణవాయించుచు స్వరబ్రహ్మమునందుఁ

జిత్తంబును లయింపఁజేసి సాక్షాత్కరించిన భగవానుని స్మరించుచు లోకయాత్రాశీలియై చనెను.

### దక్షుఁడు పుత్రులకుఁగా విచారపడుట

రాజా! దక్షుఁడు వానిపుత్రులైన హర్యశ్వులు నివృత్తిమార్గపరులగుట విని 'కటా! నాసుతులు శీలవంతులనియుఁ బిత్రాజ్ఞను బాలింతురనియుఁ దలంచితిని. సత్సంతానలాభముగూడ దుఃఖహేతువయ్యెఁగదా' యని చింతపడసాగెను. బ్రహ్మదేవుఁడు వాని నూరార్చి 'దక్షా! పాంచజనియందు మఱలఁ బుత్రులను బడయు' మని చెప్పి చనెను. దక్షుఁడట్లే యాకాంతయందు శబలాశ్వులను వారిని వేయిమందిపుత్రులను బడసి వారినిఁ బ్రజాసర్గంబునకు నియమించెను.

### శబలాశ్వులు నివృత్తిమార్గంబుఁ బట్టుట

వారు పిత్రాజ్ఞను దలఁదాల్చి నారాయణసరస్తీర్థంబునకుఁ బోయి యం దాచమించి వెలువడిరి. ఆతీర్థసేవాఫలంబుగా వారి మనోమలినంబు జిడ్డూడెను. వా రంతటఁ బ్రణవజపం బాచరించుచు జలాహారులై కొన్ని మాసంబులును, వాయుభక్షులై కొన్ని నెలలును దీవ్రతపంబు సలిపిరి. వా రట్లు నారాయణమహామంత్రంబును జపించుచుండఁగా నారదుఁడు వచ్చి హర్యశ్వులకునట్లు వారికిని బోధించి 'దాక్షాయణులారా! మీరును మీయన్నలత్రోవఁ జనుఁడు. అట్లు చేయుట భ్రాతృవత్సలత్వంబగు. అట్టి ధర్మవిదులకుఁ బుణ్యంబు వీడనిచుట్టమై చరించును. భ్రాతృవత్సలులు మరుత్తులతోడ సుఖింతు' రని చెప్పి చనియెను. శబలాశ్వులు తదుపదేశవచనంబులను విని వారియన్నలతెరవుఁ ద్రొక్కి పరమపురుషుని బొందిరి. గతరాత్రులు మరల రానికైవడిఁ బరమపదస్థులు మరల జనింపరు.

### దక్షుఁడు నారదుని శపించుట

రాజా! శబలాశ్వు లట్లయినంతనే వివిధమహోత్పాతంబులు గలిగెను. దక్షుఁ డాయుత్పాతంబులఁ జూచి కారణమేమో యని తల

పోయసాగెను. అత్తఱిఁ జారులు వచ్చి శబలాశ్వులవృత్తాంతంబును దక్షునకుఁ దెలిపిరి. ఆమాటతోడ నతఁడు పుత్రశోకార్తుఁ డయ్యెను. అంతలో నచ్చటికి నారదుఁడు వచ్చెను. వానినిఁ జూచినంతనే దక్షుఁడు రోషవివశుఁడై యీాడుగఁబలికి 'కటా! నాకొడుకులు సాధువులును ధర్మప్రవృత్తులు నగుదురు. అట్టివారికి భిక్షావృత్తిని బోధించి యసాధుకార్యం బొనర్చితివి. ఉభయశ్రేయఃకాములు ఋణత్రయంబుఁ దీర్చి కర్మవిచారం బొనర్పవలయు ననియు, అట్లుచేయక నివృత్తిమార్గనిష్ఠులైనచో నుభయలోకభ్రష్టు లగుదురనియు శాస్త్రము పలుకుచున్నది. పెద్దలు నట్లే యాచరింతురు. నారదా! నీవు ధర్మవేత్తవయ్యు నాసుతులకు నధర్మమార్గంబు నుపదేశించి వారి నుభయలోకభ్రష్టులఁ జేసితివి. బాలకుల నిట్లు చెఱచువాఁడు భగవత్కీర్తికి ముప్పుగావించువాఁడు గాఁడా? భగవత్కీర్తికి నెగ్గుచేసిన నీవు నొకభాగవతుఁడ ననుచుఁ దిరుగుదువు. భాగవతులు భూతానుగ్రహపరవశు లగుదురు. నీతో నిర్వైరులకు వైరంబుఁ బుట్టించి వారిసౌహార్దంబును జెఱచితివి. బుద్ధిభేదంబు గల్గినంతనే వైరాగ్యంబగునా? వైరాగ్యము జ్ఞానఫలముగదా? కర్మోపశాంతిమాత్రాననే మమకారబంధంబు తెగునా? విషయంబు లెంతతీవ్రంబులో వట్టిమాటలవలనఁ దెలియదు. వాని ననుభవించునప్పుడుమాత్రమే యది బోధపడును. విరక్తి యెప్పుడు గలుగును? విషయంబులు సారరహితంబులును బహుదుఃఖమయంబులు నని బుద్ధిస్థమైనప్పుడు వానియందు విరక్తి జనించును. ఆసంగతి యెప్పుడు బుద్ధిస్థమగును? అనుభవముమీాఁద నగును. విషయస్వరూపానుభవజ్ఞానంబు గలుగక పరోపదేశమాత్రంబున వైరాగ్యంబు నొందుట పచ్చికాయను బండవేయుట యగుఁగదా! సాధుమార్గంబును మెట్టి గృహస్థులమై కర్మంబు లాచరించి భగవత్ప్రీతికిఁ బాత్రులము గానున్న మాకు నీవు సైరింపరాని యెగ్గు గావించితివి. నాకుఁ గావించిన యీాయపకారంబు నెట్లో నేను సైరింతునుగాక! నాసంతానంబునకుఁ గావించిన కీడు సహింపరాదు. నీవు నీయకార్యంబు

నకు ఫలంబు ననుభవింపకతీఱదు. ఒకచోట నిలువక సర్వకాలము సర్వ లోకసంచారశీలి వగుదువుగాక ! యని శపించెను. నారదుఁడు మాఱు తలంపక యాశాపంబును గ్రహించి 'దక్షా ! సాధువులు తాము కష్టపడి రైనను బరోపకారము చేయుట ధర్మంబగు. నేను నీసుతులకుఁ బరమ శ్రేయోమార్గంబును దెలిపితిని. నన్ను నిష్కారణంబుగా శపించితివి. అయినను దానిని గ్రహించుచున్నా' నని చెప్పి చనియెను. రాజా! శాంతము సాధుశీలముగదా!

### దక్షుని పుత్త్రికలు – వారి యన్వయంబులు

రాజేంద్రా! దక్షుని పరితాపంబును బ్రహ్మదేవుఁడు చూచి వాని నూరార్చి పాంచజనివలనఁ బుత్త్రికలను బడయు మనిచెప్పిపోయెను. దక్షుఁ డట్లే పాంచజనివలన నరువదిమందిపుత్త్రికలను బడసెను. వారెల్లరుఁ బితృప్రియలైరి. అందుఁ బదిమందిని ధర్మునకును, బదుమువ్వురను గశ్యపున కును, ఇరువదియేడ్వురను జంద్రునకును, ఇద్దఱను భూతునకును, ఇద్దఱను అంగిరసునకును, ఇద్దఱను కృశాశ్వునకును, తక్కిన నల్వురను మఱలఁ గశ్యపునకు నిచ్చెను.

### ధర్ముని సంతానము

ధర్ముని పత్నులు భానువు, లంబ, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప యనుపేళ్ల నొప్పిరి. భానువునకు వేదఋషభుఁడును, వానికి నింద్రసేనుఁడును జనించిరి. లంబకు విద్యోతుఁ డును, వానికి స్తనయిత్నువులును బుట్టిరి. కకుప్పునకు సంకటుండును, వానికిఁ గీకటుండు నుదయించిరి. జామికి భూదుర్గాభిమానదేవతలును, వారికి స్వర్గనందులును గలిగిరి. విశ్వకు విశ్వదేవులు ప్రభవించిరి. వారికి సంతానము గలుగదు. సాధ్యకు సాధ్యగణంబును బుట్టెను. ఆగణంబునకు నర్థసిద్ధి యుద్భవించెను. మరుత్వతికి మరుత్వంతుఁడును జయంతుఁడు నుదయించిరి. జయంతుఁడు వాసుదేవాంశభూతుఁడు గావున నుపేంద్రుఁ డనఁబరఁగెను. ముహూర్తకు మాహూర్తికదేవగణంబు జనించెను.

ఈగణంబు భూతంబులకుఁ ద త్తత్కాలఫలంబు నిచ్చును. సంకల్పకు సంకల్పుఁడును, వానికిఁ గాముఁడును బుట్టిరి. వసువునకు ద్రోణుఁడు, ప్రాణుఁడు, ధ్రువుఁడు, అర్కుఁడు, అగ్ని, దోషుఁడు, వస్తుఁడు, విభావసుఁడు ననఁబరఁగు వసువు లెనిమిదిమంది పుట్టిరి.

### వసుసంతానము

వసుపుత్త్రులలో ద్రోణునకు అభిమతి యనుదానియందు హర్ష శోక భయాదులు జనించెను. ప్రాణునకు నూర్జస్వతియనుదానివలన సహుఁడు, ఆయువు, పురోజవుఁడును గలిగిరి. ధ్రువునకు ధరణివలన నానాపురంబు లావిర్భవించెను. అర్కునకు వాసన యనుదానివలనఁ దర్షాదిపుత్త్రులు జనించిరి. అగ్నికి వసోర్ధారయందు ద్రవిణకాదిసుతవర్గం బుద్భవిల్లెను. మఱియు నగ్నికిఁ గృత్తిక యను ద్వితీయభార్యయందు స్కంధుఁడు పుట్టెను. స్కంధునకు విశాఖాదులు గలిగిరి. దోషునకు శర్వరియందు హరియంశంబున శింశుమారుఁ డుదయించెను. వస్తునకు నంగిరస్సునందు శిల్పాచార్యుఁడు విశ్వకర్మ పుట్టెను. విశ్వకర్మకుఁ జాక్షుషమనువును, వానికి సాధ్యులును జనించిరి. విభావసునకు ఉష యనుదానివలన వ్యుష్టియు, రోచిస్సు, ఆతపుఁడు జనించిరి. ఆతపునకు దివసుఁడు పుట్టి మనుష్యుల కర్మజాగరణంబులకు నిమిత్తుఁడాయెను. భూతునకు సురూప యందుఁ గోటిరుద్రగణంబులు పుట్టెను. మఱియు వానికి వేఱొకభార్య వలనఁ బ్రేతవినాయకాదిఘోరులు జనించి యేకాదశరుద్రులకుఁ బార్షదులైరి.

### ఏకాదశరుద్రులు

రాజా! ఏకాదశరుద్రు లెవరందువా ? రైవతుఁడు, అజుఁడు, భవుఁడు, భీముఁడు, వాముఁడు, ఉగ్రుఁడు, వృషాకపి, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, బహురూపుఁడు, మహాన్తు - వీరు ఏకాదశరుద్రు లనఁ బడుదురు.

### అంగిరస్సు మున్నగువారి సంతానము

అంగిరస్సు స్వధవలనఁ బితృదేవతలను అథర్వాంగిరోనామక వేదంబును గాంచెను. కృశాసుఁడు అర్చివలన ధూమ్రకేశుని, ధిషణ యను పత్నివలన వేదశిరోదేవుఁడు, వయుఁడు, మనువు అనువారలను బడసెను. కశ్యపునకు రెండవసారి భార్యలుగా నీయఁబడిన దక్షసుతలు వినత, కద్రువ, పతంగి, యామిని యనఁబడుదురు. వారిలో వినతకు విష్ణువాహనం బైన గరుడుఁడును, సూర్యసారథియైన యనూరుఁడును బుట్టిరి. కద్రువకు సర్పకులంబు జనించెను. పతంగికిఁ బక్షిగణము పుట్టెను. యామినికి శలభంబులు గలిగెను. చంద్రునిపత్నులు కృత్తికాదులు ఇరువదియేడ్గురు నిరువదియేడు తారలై వెలయుదురు.

### దక్షుఁడు చంద్రుని శపించుట

రాజేంద్రా! చంద్రునకు దక్షశాపము గలిగెను. తత్ఫలముగా నతఁడు క్షయరోగపీడితుఁడును సంతానహీనుఁడు నయ్యెను. తద్రోగఫలంబుగా వానికిఁ గళలు తగ్గుట యేర్పడెను. అతఁడు మఱల దక్షానుగ్రహపాత్రుఁడై కళాక్షయంబును బాపికొనెను. ఆకారణంబునఁ జంద్రునకుఁ గళాక్షయవృద్ధు లేర్పడెను.

### కశ్యపుని మొదటి పదిమందిభార్యల సంతానము

రాజేంద్రా! దక్షుఁడు వానిపుత్రికలలోఁ బదుమువ్వురను కశ్యపునకు మొదటిసారిభార్యలుగా నిచ్చెనని చెప్పితిని. వారు అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ఠ, సురస, ఇళ, ముని, క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి యనుపేర్ల లోకమాత లైరి.

వారిలోఁ దిమికిఁ దిమింగిలాదిజలజంతువులును, సరమకు సారమేయాదిశ్వాపదంబులును, సురభికి గోమహిషాదులైన యేకశఫంబులును, తామ్రకు శ్యేనగృధ్రాదులును, క్రోధవశకు దందశూకాదిసర్పంబులును, మునికి నప్సరోగణంబును, ఇళకు భూజంబులును, సురసకు యాతుధాను

లును, అరిష్టకు గంధర్వులును, కాష్ఠకు గిట్టలులేని మృగంబులును, దనువునకు ఏకషష్టికుమారులును గలిగిరి.

రాజా! ఆ యఱువదియొక్కరలో ద్విమూర్ధుఁడు, శంబరుఁడు, అరిష్టుఁడు, హయగ్రీవుఁడు, విభావసుఁడు, అయోముఖుఁడు, శంకుశిరుఁడు, స్వర్భానుఁడు, కపిలుఁడు, అరుణి, పులోముఁడు, వృషపర్వుఁడు, ఏకచక్రుఁడు, అనుతాపకుఁడు, ధూమ్రకేతుఁడు, విరూపాక్షుఁడు, విప్రచిత్తి, దుర్జయుఁడు అనువారు పదునెనమండ్రు ముఖ్యులగుదురు. దనువునకు వైశ్వానరుఁ డనుకొడుకు మఱియొకఁడుగూడఁ గలఁడు.

స్వర్భానునకు సుప్రభ యనునది జనించెను. దానిని నముచి పెండ్లాడెను. వృషపర్వునకు శర్మిష్ఠ పుట్టెను. దానిని యయాతి వివాహమయ్యెను. వైశ్వానరునకు ఉపదానవి, హయశిరస్సు, పులోమ, కాలక యనుకూఁతులు నల్వురు జనించిరి. ఉపదానవిని హిరణ్యాక్షుండును, హయశిరస్సును గ్రతువును వివాహమాడిరి. పులోమాకాలకలను బ్రహ్మప్రేరితుఁడై కశ్యపుఁడు పెండ్లాడెను. పులోమకుఁ బౌలోములును, కాలకకుఁ గాలకేయులును జనించిరి. వారికి నివాతకవచు లనువారు నలువదివేవురు గలిగిరి.

రాజేంద్రా! నివాతకవచులు మహాయుద్ధశాలురై యజ్ఞంబులకు విఘ్నంబులు గావింపసాగిరి. అత్తఱి దేవేంద్రుఁడు నీపితామహుఁడైన యర్జునుని స్వర్గలోకంబునకు రప్పించెను. పార్థుఁడా నివాతకవచులను బరిమార్చి యింద్రునకుఁ బ్రీతిఁ గూర్చెను.

విప్రచిత్తికి సింహికవలన నూటొక్కసుతులు పుట్టిరి. వారిలోఁ బెద్దవాఁడు రాహు వనియుఁ దక్కిననూర్గురును గేతువు లనియుఁ బరగిరి. వారెల్లరు గ్రహము లైరి.

నరేంద్రా! అదితివంశంబును జెప్పెద వినుము. అదితికిఁ గశ్యపుని వలన వివస్వంతుఁడు, అర్యముఁడు, పూషుఁడు, త్వష్ట, సవితృఁడు, భగుఁడు, ధాతృఁడు, విధాతృఁడు, వరుణుఁడు, మిత్రుఁడు, శక్రుఁడు,

ఉరుక్రముఁడు, నను వారు జనించిరి. వారిలో వివస్వంతునకు సంజ్ఞయందు శ్రాద్ధదేవుఁడు, మనువును, యమీయము లనెడి మిథునంబును బుట్టుటయ్యెను. ఆమిథునము బడబయై యశ్వినులను గనెను.

ఛాయ యనునది శనైశ్చరుని సావర్ణిమనువును దపతి యను పుత్రికను గాంచెను. ఆ తపతి సంవరణుని బతిగా వరించెను. అర్యముఁడు మాతృక యనుదానివలనఁ జర్షణులను గాంచెను. వారు కృతాకృతజ్ఞానవంతులై వెలసిరి. బ్రహ్మదేవుఁడు వారియం దాత్మానుసంధానంబుఁ గావించి మానుషజాతిని గల్పించెను. పూష్ణుఁడు తొల్లి దక్షయజ్ఞంబునఁ బండ్లుతెఱచి గేలిచేయుటయు వానికి దంతభగ్నమగుటయుఁ దెలిపితిని. అదిసుత యతఁడు దంతహీనుఁ డగుటంజేసి పిష్టభోజనుఁ డయ్యెను. వానికి సంతానము గలుగదు. త్వష్ట యనువాఁడు దైత్యసోదరియైన రచన యనుదానియందు సన్నివేశుఁడు, విశ్వరూపుఁడు నను వారిని బడసెను.

రాజా! బృహస్పతి సురలకు గురువుగా నుండెను. దేవతలు గురువు నుపేక్షించిరి. అదికారణంబుగా బృహస్పతి వారిని వదలెను. సుర లంతట నసురులకు భాగినేయుఁడైన విశ్వరూపుఁ డనువానిని బురోహితునిగా వరించిరి.

పరీక్షితు వానిని విని 'మునీంద్రా! సురలు వారిగురువునెడ నేమి యక్రమంబు గావించి' రని యడిగెను. వానికి శుకుఁ డిట్లనియెను.

### బృహస్పతికి సురలు గావించిన యపచారము

రాజా! కొండొకనాఁడు దేవేంద్రుఁడు పేరోలగంబు తీఱెను. బ్రహ్మవాదులైన మహర్షు లొకవంకను, మరుద్వసురుద్రాదిత్యు లొకవలను, విశ్వదేవసిద్ధసాధ్యచారణగంధర్వు లొకక్రేతను, విద్యాధరాప్సరఃకిన్నరపతగోరగు లొకయొయ్యను, అశ్వను లొకప్రక్కను యథార్హస్థానంబు లలంకరించిరి. శచీదేవి యింద్రునితోడ నర్థాసనంబు నధిష్ఠి

చెను. మహారాజ లాంఛనంబులైన శ్వేతచ్ఛత్రచామరంబులు వెలసెను. వందిమాగధాదులు స్తుతిగీతంబులఁ బాడసాగిరి.

అత్తఱి బృహస్పతి యాసభకు వచ్చెను. దేవేంద్రుఁడు త్రిభువనైశ్వర్యమదోన్మత్తతంజేసి యట్లువచ్చినగురువునకు నెదురేగుటయు వానిని బూజించుటయు నుపేక్షించెను. అయ్యాంగిరసుఁ డదిగాంచి 'అహో! ఇది యైశ్వర్యమదవికారవిశేషం' బని గ్రహించి వచ్చినదారిం బట్టి వానియింటికిఁ బోయెను. సురగురుఁ డట్లు మఱలిపోవుట యింద్రుఁడు చూచి నిజాపరాధంబును గ్రహించి 'కటా! ఐశ్వర్యమదంబు నాకన్ను గప్పెను. నీచమతినై గురుతిరస్కారం బొనర్చితిని. ఇతరులకుఁ బ్రార్థనీయంబేనియుఁ గానట్టి మహేంద్రశ్రీ నాకు లభించుటంజేసి దేవేశ్వర్యపదవి సంప్రాప్తమయ్యెను. ఆలక్ష్మితోడ గర్వంబు నన్నుఁ బైకొనెను. తత్ఫలంబుగా నసురభావంబునకు లోనైతిని. రాజు సింహాసనాధిష్ఠుఁడై యున్నతఱి నెట్టివారు వచ్చినను దనస్థానంబును వదలి చని ప్రత్యుత్థానాదులు సేయరాదని కొందఱు చెప్పుదురు. ఆమాట ధర్మబాహ్యము. అది పాటింపఁదగినది గాదు. అట్టిబోధనలు కేవల గాఢాజ్ఞానజనితంబుగాని వేఱు గానేరవు. అట్టిమాటల నమ్మి చరించువారిగతి ఱాఁతితెప్ప నెక్కి జలాశయంబును దాఁటువారిగతి యగును. ఇంతటనైనఁ దెలివితెచ్చికొని గురుపదంబుల వ్రాలి తత్ప్రసాదంబుఁ బడయుదుఁగాక!' అని చింతించి గురుగృహంబునకుఁ దరలెను. దేవేంద్రుఁ డట్లువచ్చుట బృహస్పతి నిజయోగబలంబున గ్రహించి యిల్లు వెడలిపోయి యథ్యాత్మమాయామహిమంబున నదృశ్యుఁడయ్యెను. ఇంద్రుఁడు గురునింటికిఁ బోయి వానితోలఁకువ గానక వెల్లు దుఃఖించి తహతహపడసాగెను.

### గుర్వవజ్ఞాఫలము

అసురు లయ్యది యవసరంబుగాఁ దలంచి వారిగురువైన భార్గవుని సమ్మతిఁ బడసి యాయుధపాణులై సురలపయి ధాడివెడలి క్రూరనారా

చంబులఁ గురిపించిరి. దేవతలు కాళ్లు తెగి కొందఱును, చేతులు విఱిగి కొందఱు నై యసురులతాఁకునకు నోర్వలేక తాఱుమాఱైరి. ఇంద్రుఁడును గత్యంతరము గానక యాసురలను వెంటఁగొని బ్రహ్మయొద్దకుఁ జని వానిని శరణవోచ్చెను.

### సురలకు బ్రహ్మోపదేశము

చతురాస్యుఁడు వారికి నూఱటఁ బల్కి- సురలారా! ఎల్లవిధంబుల మీరు సమృద్ధులు. అసురులన్ననో మాకు నోడి వర్తింతురు. అట్టి వారిచేత నేడు మీకిట్టిపరాభవంబు గలిగెను. కారణంబును గ్రహించితిరా ? మీరు మీగురునకుఁ గావించినయపరాధం బిట్లు ఫలించెను. గురువు నతిక్రమించి మీ రిట్లయితిరి; యసురులు వారిగుర్వాజ్ఞను దలఁదాల్చి మీతలఁ దన్నిరి. అంతియగాదు. వారు స్వర్గలోకంబునేగాదు నాసదనంబునుగూడ నిప్పు డాక్రమింపఁజాలుదురు. సురలారా! గోవిప్ర విష్ణువులను సేవించునట్టిరాజులకు నశుభంబు లెన్నడును గలుగవు. మీ గురువు విప్రమాత్రుఁడేగాక పరమశాంతుఁడును బ్రహ్మనిష్ఠుఁడు నగును. అంతటివాని కృపాదృష్టికి మీరు దూరులైతిరి. ఇప్పుడేమిసేయనగు నందురా ? త్వష్టృపుత్త్రుఁడైన విశ్వరూపు నాశ్రయింపుము. అతఁడు మీయర్థంబు నొనగూర్చును. అతఁ డసురపక్షపాతి యని యందురా ? అగుఁగాక; అది మీరు సైరింపవలయు' నని తెలిపెను.

### దేవేంద్రుఁడు విశ్వరూపునిఁ బురోహితునిగా వరించుట

రాజా! దేవేంద్రాదు లంతట బ్రహ్మను వీడ్కొని విశ్వరూపు నొద్దకుఁ బోయి 'వత్సా! అతిథులమై నీయాశ్రమంబునకు వచ్చితిమి. నీకు శుభమయ్యెడు. సాధువులైనపుత్త్రులు తాము పుత్త్రవంతులైనను పితృశుశ్రూషయే పరమధర్మంబుగా నుందురు. ఇఁక బ్రహ్మచారులసంగతి చెప్పనేల ? వత్సా! ఆచార్యుఁడు వేదమూర్తి యనియు, తండ్రి బ్రహ్మమూర్తి యనియు, తల్లి ధాత్రీమూర్తి యనియు, భ్రాత యింద్రమూర్తి యనియు, భగిని దయామూర్తి యనియు, అతిథి ధర్మమూర్తి యనియు,

అభ్యాగతుఁ డగ్నిమూర్తి యనియు సర్వభూతంబు లాత్మమూర్తి యనియుఁ బాటింతురు. తండ్రులకుఁ బరులవలనఁ బరాభవరూపమహార్తి గలిగినప్పుడు పుత్త్రు లయ్యార్తిని వారితపశ్శక్తివలనఁ దొలఁగింపవల యును. వత్సా! మావచ్చినపని యేమందువా? మమ్ముఁ బరిభవించిన వారిని జయింపఁగోరుదుము. అందులకై నిన్నుఁ బురోహితునిగా వరించి తిమి. ఇదే నీకు నమస్కరింతుము. పెద్దవారు పిన్నవారికి మ్రొక్కరా దందువా? కార్యములపట్ల నది తప్పుగాదు. మఱియు బాలుఁడైనను జ్ఞానియగునేని వాఁడే జ్యేష్ఠుఁడగును. మావిన్నపము ననుగ్రహింపు' మని వేఁడిరి.

రాజా! విశ్వరూపుఁడు వారిని విని చిఱునవ్వు దాల్చి 'సురవరు లారా! మీకుఁ దెలియనిధర్మము గలుగదు. పౌరోహిత్యంబు బ్రహ్మ వర్చసంబును హరించునని ధర్మవేత్తలు నుడివిరి. అయినను మీయట్టి లోకేశ్వరులు వచ్చి యడిగినప్పుడు కాదనుట నాబోఁటివానికిఁ దగదు. ఒక్కసంగతి వినుము. పురోహితుఁడు గురువగును. గురునాజ్ఞను దలఁ దాల్చుట శిష్యులకు నాత్మధర్మంబగు. శిష్యులసంగతి యటుండనిమ్ము. పురోహితునిసంగతి యేమందురా? పౌరోహిత్యంబు ధనలాభంబు నిచ్చు ననియు, ఆవృత్తిని స్వీకరించి ధనంబు నార్జించి సత్కర్మంబులు చేయవచ్చు ననియుఁ గొందఱు తలంపవచ్చును. అంతకన్న హ్రస్వదృష్టులును నీచ మతులును గలుగరు. దరిద్రులైనను జోలిగట్టి భిక్షమెత్తి దొరకినంతలో సత్కర్మంబు లాచరింపనగును. సత్కర్మానుష్ఠానార్థమై యమ్ముడు పోరాదు. నాకు ధనకాంక్ష గలుగదు గావున నిందద్యవృత్తిని నామది యంగీకరింపదు. ద్రవ్యార్థము నేను మీయిచ్చ నేయనొల్లను. మీరు నాకు గురువులగు దురు. తండ్రులమాట యెట్టిదైనను బుత్త్రులు శిరసావహింపక తీఱదు. మీకార్యార్థము నాకుఁగల కలిమినేగాక నాప్రాణంబునుగూడ సమర్పిం తును.' అని చెప్పి దేవపౌరోహిత్యంబు నంగీకరించెను.

### విశ్వరూపుఁడు దేవకార్యము చేయుట

రాజా! విశ్వరూపుఁ డట్లు సురపౌరోహిత్యము నంగీకరించిన తోడనే దేవతలకు హితము గూర్చుట వానికి విధియయ్యెను. సురహితం బెద్ది యందువా? అసురసమృద్ధిని తగ్గించుటయే సురహితం బగును. అసురులన్ననో వారిగురువైన శుక్రాచార్యులవిద్యాబలంబున సర్వ సమృద్ధులును సురక్షితులు నై యుండిరి. శుక్రుని విద్యాబలం బేతన్మాత్రము గాదు. విశ్వరూపుఁ డది తలపోసి వైష్ణవవిద్య నాశ్రయించెను. ఆవిద్యా ప్రభావంబున నసురులు జితులైరి. అంతట విశ్వరూపుఁ డసురసమృద్ధిని దానితోడ వైష్ణవవిద్యను దేవతలకు ననుగ్రహించెను. ఆవిద్యను నారాయణకవచ మందురు.

### నారాయణకవచమహిమ

రాజేంద్రా! ఈకవచమహిమం బింతనరాదు. ఒక్క నిదర్శనము వినుము. తొల్లి కౌశికుఁ డనుబ్రాహ్మణుం డొకఁ డుండెను. అతఁ డీవిద్యను ధరించి యొకానొకనిర్జలప్రదేశముఁ జేరి యట యోగధారణాప్రభావం బున వానిశరీరంబును వదలెను. కొండొకనాఁడు చిత్రరథుఁ డనుగంధర్వ రాజు వానిస్త్రీలతోడ విమానంబెక్కి గగనమార్గంబునఁ బోవుచుండఁగా వానివిమానంబు కౌశికదేహత్యాగప్రదేశంబునకు సూటిగా మీఁది భాగంబునకు వచ్చి యటనుండి కదలక తటాలున నేలఁగూలెను. అట వాలఖిల్యాదిమహామును లుండిరి. వా రదిచూచి 'చిత్రరథా! కౌశికునియస్థు లిందుఁ గలవు. అవి యాకర్షించుటంజేసి నీవిమానం బిచ్చట వ్రాలుటయ్యెను. ఆయస్థులను నీవు కొనిపోయి ప్రాకృతవాహిని యైన సరస్వతీనదిలోఁ దన్మధ్యభాగంబున నిక్షేపించి కృతస్నానుండవై చను' మనిరి. చిత్రరథుఁ డాయస్థులను గొని విమానం బెక్కెను. అది యథాపూర్వము గగనమార్గంబునఁ బఱచెను. గంధర్వపతి సరస్వతీనదిని డాసి తన్మధ్యప్రదేశంబునఁ గౌశికునియస్థులను నిక్షేపించి నీరాడి చనియెను.

రాజా! ఈకవచపారాయణంబునకు నియమం బేమందువా? శుచియై యాచమించి యథాస్థానంబున నుత్తరాభిముఖుడై కూర్చుండి మౌనియై మనంబును శ్రీమన్నారాయణమూర్తియందు నిలిపి యంగన్యాసకరన్యాసపూర్వకంబుగా నిక్కవచంబును బారాయణము చేయవలయును. ఈమంత్రపారాయణంబునం జేసి యధ్యాత్మికాధిదైవికాధిభౌతిక భయంబులెల్లం దీఱును.

### ఇంద్రునకు బ్రహ్మహత్య గలుగుట

రాజా! విశ్వరూపునకు సోమపానము, సురాపానము, అన్నాదనము అనుతలలు మూఁ డుండెనఁట! అతఁడు హవిర్భాగంబులను బాహాటంబుగా నమరులకు నిచ్చుచు వానినిఁ బరోక్షంబుగా వానిమేనమామలైన యసురులకుఁ జెందఁజేయుచుండెనఁట! ఆకపటకృత్యంబును దేవేంద్రుఁ డెఱిఁగి యాగ్రహించి విశ్వరూపుని మూఁడుతలలు దునిమెనఁట. వాని సోమపానశిరస్సు కపింజలంబుగాను, సురాపానశిరస్సు కలవింకంబుగాను, అన్నాదశిరస్సు తిత్తిరిగా నయ్యెనఁట!

రాజా! విశ్వరూపుని వధించినఫలంబుగా బ్రహ్మహత్యాదోషం బింద్రునకుఁ జుట్టెను. అతఁడు సురరాజయ్యును దత్పాతకంబును సంవత్సరపర్యంతంబు వహించెను. అంతలో వానికి లోకాపవాదము మెండయ్యెను. అంతట నింద్రుఁ డాపాతకంబును నాల్గుపాళ్లుగా విభజించి భూమికి, జలంబులకు, వృక్షంబులకు, స్త్రీలకు నొక్కొక్కభాగంబుఁ బంచిపెట్టి తాను దోషరహితుఁ డయ్యెను.

### ఇంద్రకృతబ్రహ్మహత్యాదోష విభాగక్రమము

రాజేంద్రా! ఇంద్రుఁడు వానిదోషంబును బంచిన క్రమం బేమందువా? భూమియందు బావులు మున్నగు జలాశయంబులను ద్రవ్వుదురు. అట్లు త్రవ్వినగర్తంబుల నెవ్వరును బూడ్చరు. భూమికి నయ్యది యొక చింతాకరవిషయమయ్యెను. భూదేవి యింద్రునికడకు వచ్చి 'సురేశ్వరా! నాహృదయంబునఁ ద్రవ్వఁబడిన గర్తంబులు తమంతట

తాము కాలక్రమంబునఁ బూడునట్లు వరం బిత్తువేని నీ బ్రహ్మహత్యా దోషంబున నాల్గవపాలు నేను గ్రహింతు' ననెను. ఇంద్రుఁడు వల్లె యనెను. రాజా! భూమిమీఁద నెచ్చటెచ్చట నూషరక్షేత్రంబులు నేఁటికినిఁ గానవచ్చునో యవియెల్ల బ్రహ్మహత్యారూపంబులే యగును. ఇంద్రుఁ డంతట వానిపాపంబులో నొకభాగంబును గ్రహింపుమని జలం బులఁ గోరెను. జలంబులు వాని కోరికను విని 'దేవేశ్వరా! మాలో నేద్రవ్యంబు జేరినను దానికి నిజాకృతిపరిమాణంబు హెచ్చుగునట్లు వర మిత్తువేని నీతలంపు సేయుదు' మనెను. అది యింద్రుఁ డంగీకరించెను. జలంబులు సురేశ్వరునిదోషంబులో నొకభాగంబును గ్రహించెను. జలంబు లందలి నురుగు మొదలైనవి తత్పాపరూపంబులగును. ఇంద్రుఁ డట్లే వృక్షంబులను గోరెను. భూరుహంబులు వానితలంపు విని 'సుర రాజా! మమ్ములను నిష్కారణంబుగా నిట్టనిలువున నఱుకుదురు. ఆ యపకారంబును మే మెట్లో సహింతుము. నఱికినమ్రోడులు మఱలఁ దమంతటఁ జిగిర్చి పెరుఁగునట్లు వరం బిత్తువేని నీపాతకంబున నొకభాగం బును మేము భరింతు' మని చెప్పెను. ఇంద్రుఁ డట్లే వరంబిచ్చి తన పాతకంబునం దొకభాగంబును బాపుకొనెను. ఇఁక నొక్కభాగము శేషించియుండెను. ఆభాగంబును గైకొమ్మని యింద్రుఁడు స్త్రీలను గోరెను. వా రదివిని 'దేవేశా! మేము ప్రసవించునందాఁక సంభోగ సుఖంబునకు నంతరాయముగాని, మాధరించుగర్భంబులకు సేఁగిగాని లేకుండునట్లు వరంబు నిత్తువేని నీమది సేయుదు' మనిరి. ఇంద్రుఁడు తథాస్తు అనెను. వానిపాపశేషంబును స్త్రీలు గ్రహించిరి. స్త్రీలకుఁ బ్రతిమాసంబునఁ గలుగు రజస్స్రావంబు తద్దోషరూపం బగును. అట్లు దేవేంద్రుఁడు వానిపాపంబును బాసి సుఖముండెను.

రాజా! దోషంబులను బ్రతిఫలపూర్వకంబుగా గ్రహించినప్పుడు గృహీతలయందుఁ దద్దోషలక్షణంబులు వివిధరూపంబులఁ బ్రకటమగు చుండును. ఆదోషఫలంబుల ననుభవింపకతీఱదు. ఈరహస్యంబును

దెలిసినవారు పసులవలనఁ బద్దోషపరిహారార్థము దానాదులను గ్రహింప వెఱతురు. మఱియొకవిశేషము. సుకృతముఁగాని దుష్కృతముగాని గావించినప్పుడు తత్ఫలం బెట్లో యొకవిధంబున భుక్తమై నశింపవలయును. ఒండువిధంబున నశింపదు. ఇది విధివిధానము. ఈసంగతి తెలిసినవారు తమదోషంబులను దామే సహింపనోర్తురు గాని పరాక్రాంతంబులఁజేసి యన్యులను దమకై లాభపెట్ట దలంపరు.

## వృత్రుని జననము

రాజా ! విశ్వరూపుఁడు త్వష్టకొడుకని చెప్పితిని. త్వష్ట యింద్రుని య కార్యంబును స్వపుత్రమరణంబును దెలిసి 'కటా !, ఇంద్రుఁ డింతద్రోహి యయ్యెనా ? ఇతనిని బరిమార్పక తీఱ' దని నిశ్చయించి యందులకుఁ దగినవానిని బడయుటకై 'అభిచార' మనెడి ఇష్టికిఁ గడగి 'ఇంద్రశ్శత్రో వివర్ధస్వ' అని యుచ్చరించుచు నగ్నిముఖంబున వ్రేల్చెను. ఆ దక్షిణాగ్ని నుండి యొకఘోరాకారుఁడు యుగాంతకృతాంతుఁడో యన వెలువడెను. అతఁ డట్లు వెలువడి దినదినంబు నొక్కబాణప్రమాణంబుఁ బెరిఁగి కరఁగిన రాగిని బోలునట్టి రక్తశిఖాశ్మశ్రువులతో, మట్టమధ్యాహ్నసూర్య బింబంబునుబోలు నేత్రంబులతోఁ గాలినకొండయట్టి యాకారంబుతో ఘోరాకారుఁడై నక్షత్రంబులను నాకుటకో యన నాలుక చాచి, ముల్లోకంబులఁ గబళించుటకో యన నోరప్పళించి, భూమి కంపిల్లునట్లు నృత్యము సేయుచు, దెసలు వ్రీలునట్లుగాఁ బెల్లార్చుచు లోకంబునెల్ల నాక్రమించెను. ఆకారణంబున వానిని వృత్రుఁ డనిరి.

రాజా ! దేవత లావృత్రునిసంగతి విని సేనలఁ గూర్చికొని దాడి వెడలి వానిని దలపడి దివ్యాస్త్రంబులను వర్షించిరి. వృత్రుఁ డాయస్త్రంబులను దిగమ్రింగెను. అందులకు సురలు మహాశ్చర్యభయంబులంది దారిదోఁపక భగవానునొద్దకుఁ బోయి

## అమరకృతవిష్ణుస్తవము

'పంచమహాభూతంబులును, దన్నిర్మితజగత్త్రయంబును, తదధీశులైన బ్రహ్మాదులును, వారివెనుక మేమును ఏకాలంబునకు వెఱచి బలియిత్తుమో

యాకాలంబుగూడ నెవ్వనికి వెఱచునో యాసర్వేశ్వరుఁడు మాకు శరణం బగుఁగాక. దేవాదిదేవా! నిన్నే శరణిల్లుట యేల యందువా? నీవు నిఖిలోపాధిపరిచ్ఛేదరహితుండవును, బూర్ణుండవును రాగాదిరహితుండవును బరమేశ్వరుండవు నై వెలయుదువు. నిన్నుఁగాదని పరిచ్ఛిన్న మూర్తుల నాశ్రయించుట కుక్కతోఁక నూతఁగొని మహార్ణవంబు నీదుట గుసు. నిన్నాశ్రయించినవారికిఁ గోరిక లీడేరు ననుటకు నిదర్శనం బేమం దువా? తొల్లి మనువు మొఱయిడఁగా మత్స్యమూర్తివై కొమ్మునకొన యందు భూమినెల్ల నిలిపి దానిని నావంబోలెఁ జేసి మనుపరితాపంబును దీర్చితివి. పద్మసంభవుఁడు ప్రబలవాతవిక్షోభకల్లోలమాలికాకరాళప్రళయార్ణవజలంబులందు నిజాసనరాజీవంబునుండి డొల్లగా వాని నుద్ధరించితివి. పెక్కులు చెప్పనేల? దేవా! అద్వైతమూర్తివి. నీవు నిజమాయావిశేషంబున మమ్ముఁ బుట్టించి విశ్వసృష్టికిఁ బ్రేరేపించితివి. నీయాజ్ఞఁ దలఁ దాల్చి వర్తింతుము. నీవు నిరాకారుఁడవయ్యు నంతర్యామివై మమ్ము మా కార్యంబులకుఁ బ్రేరేపించుచున్నను వాస్తవస్థితిని గ్రహింపలేక మేము సర్వశక్తిమంతులమని భావించి ప్రమాదపడుచున్నాము. ఎవ్వఁడు నిత్యుఁడును నిర్వికారుఁడు నయ్యు మేము సారెసారెకు శత్రువశమైనప్పుడెల్ల మాబాధలను దీర్చుటకుఁగా యుగయుగంబున స్వమాయ నధిష్ఠించి తత్తత్కార్యంబులకుఁ దగినట్లుగా దేవర్షినరతిర్యగాద్యవతారంబులు ధరించి మమ్ము రక్షించునో యావిశ్వాత్మకుఁడు జగత్కారణస్వరూపుఁడు ప్రధానపూరుషుఁడు విశ్వాతీతుఁడు మాకు దిక్కగుఁగాక. దేవా! మే మెల్లరము నీవారము. మాకు మేలుగూర్పు' మని స్తుతించిరి.

రాజా! అంతలోనఁ బశ్చిమభాగంబున శంఖచక్రగదాధారియు శ్రీవత్సకౌస్తుభవక్షోవిశాలుఁడు నైన యొకదివ్యమంగళమూర్తి తోఁచెను. శ్రీవత్సకౌస్తుభంబులు దక్కఁ దక్కినవిషయంబులఁ దన్మూర్తికి సరూపులై కొందఱు వానినిఁ జుట్టి సేవించుచుండిరి. దేవతలు వారింజూచి శ్రీమన్నారాయణుఁడు పార్షదసహితంబుగా సందర్శనమిచ్చుట గ్రహించి పరమానందపరవశులై,

'నమ స్తే యజ్ఞవీర్యాయ వయసే ఉతయే నమః'

నమ స్తే అ స్త్రచక్రాయ నమస్సుపురుహూతయే' - అని సాగిలిబడి లేచి మఱల నిట్లు స్తుతించిరి.

'దేవా! నీవు నిర్గుణస్వరూపుండవును గుణత్రయనియామకుండవు నగుదువు. సృష్టియన్ననో గుణత్రయకార్యంబు. అట్టి సృష్టిలోనివాఁడు తత్సృష్టినియామకుని నిన్నెట్లెఱుంగఁజాలు? నారాయణా! వాసుదేవా! ఆదిపూరుషా! మహానుభావా! శుద్ధధర్మాధారా! పరమకళ్యాణా! నిరంతరకారుణికా! నీస్వరూపంబు కేవలాత్మసుఖానుభవమాత్రంబగును. ఆదివ్యరూపంబు ఆత్మోపలబ్ధం బగునేగాని వేఱొంటికిఁగానరాదు. అట్టి యుపలబ్ధి యన్ననో యెల్లరకు సాధ్యముగాదు. ఎవరికి సాధ్యమగు నందువా? పరమహంస పరివ్రాజకులకుమాత్రమే సాధ్యమగును. అదియు వారికి సర్వావస్థలందు లభింపదు. వారు నిష్పందమైన యాత్మయోగసమాధియందు నిష్ఠులై పరమహంసధర్మంబు నూతగొని వారిచిత్తంబును మూసియున్న తమఃకవాటంబును దెఱచినప్పుడుమాత్రమే యయ్యుపలబ్ధి వారికిఁ గలుగును. అదియుఁ బ్రత్యగ్రూపంబునఁ గలుగునేగాని పరాగ్రూపంబునఁ గలుగదు. కారణ మేమందురా? నీ పరాగ్రూపంబు జ్ఞేయమాత్రమేగాని దృశ్యం బెన్నఁడును గాదు.

స్వామీ! నీమాయావిలాసంబు లిట్టి వని యూహింపఁగూడ నందవు. ఇఁక వానిని మాటతోఁ జెప్పు టెట్లు? ఎట్లందువా? నీవు నిర్గుణుండవును నిర్వికారుండవును అశరీరుండవును అనాశ్రయుండవు నై వెలయుదువు. నీశక్తివలన సగుణంబైన యీవిశ్వంబు గలుగుచున్నది. నీశక్తికార్యంబును నీయం దారోపించుటంజేసి నీవే సృష్టిస్థితిలయకర్తవగుచున్నావు. ఈసృష్టికార్యంబునకు నీకుఁ గల సంబంధమేమి? యని వివిధంబుల నూహించి సమవాయసంబంధమని పల్కిరిగాని యెట్టిసంబంధమును లేకయే నీ వొక్కరుండవే దీనిని సాగింతువు. నీచిత్రగతి బుద్ధికి గోచరింపదు.

దేవా ! సృష్టియెల్ల గుణవిసర్గంబగును గావున నది జడంబగును. జడంబునందుఁ జైతన్యము గాన్పించుచున్నది. ఇది యెట్లని తర్కింతురు. కార్యమునందుఁ గారణం బనుస్యూతమైయుండును గావున కార్యమైన సృష్టియందుఁ గారణమైన నీశక్తి యనుస్యూతమయ్యే యుండును. శక్తికిని శక్తిమంతునకు వేర్పాటులేదు గావున నీశక్తి యుండుట యనఁగా నీ వుండుటేయగును. ఏరూపంబున నుందునందువా? జీవరూపంబున నుందువు. సృష్టియందెల్ల నీ వున్నప్పుడు సృష్టిలోఁ గొన్నిపదార్థంబులు నిర్జీవంబు లుండుట యెట్లు పొసఁగునని శంకింతురు. పదార్థము జడమైనంతనే నిర్జీవంబు గానేరదు. ఏపదార్థమందు నీశక్తి నిర్వ్యాపార స్థితినుండునో యాపదార్థమందుఁ జైతన్యకార్యము బహిర్దృష్టికిఁ గానరాదు. ఆరహస్యంబు నెఱుంగక తత్పదార్థము జడమందురు. జడమనఁగాఁ జైతన్యవ్యాపారరహితపదార్థమేగాని చైతన్యరహితపదార్థము కాదు.

దేవా ! నీప్రవేశఫలం బేమందువా ? నీప్రవేశఫలంబుగా నుపాధి వ్యవహరించును. నిదర్శన మేమందువా ? సూదంటురాయిప్రోల నినుపముక్క స్వయముగా నస్వతంత్రమైనదియయ్యు వ్యవహరించుటయే యిందులకు నిదర్శనము. ఆవ్యవహారంబునే కర్మమందురు. కర్మమునకు ఫలము స్వతస్సిద్ధము. ఆఫలము శుభాశుభంబులరూపంబున నుండును. ఉపాధి జడమనియు జడవస్తువు పరప్రేరితమై వ్యవహరించునప్పుడు ఫలము ద్వివిధమగుటకుఁ గారణ మేమనియు, ఫలభేదంబునకుఁ గర్త యెవరనియు శంకింతురు. ఉపాధిస్వభావంబునుబట్టి ఫలభేదం బుండును. అంతియగాని అంతర్యామియొక్క భేదభావంబునంజేసి భేదఫలంబులు గలుగుటగాదు. స్వభావభేదంబునకుఁ గారణ మేమందువా ? స్వభావ మనఁగాఁ బ్రారబ్ధభోగ్యకర్మఫలవాసనాసముచ్చయంబు. కర్మఫలవైచిత్రిని బట్టి స్వభావభేదం బేర్పడుచున్నది. కర్మము అనాది, అనఁగా సృష్టితో వచ్చెను. అంతియగాదు. కర్మఫలమే సృష్టియగు. కర్మవైచిత్రింబట్టి ఫల

వైచిత్రి గలుగుచున్నది. కర్మవైచిత్రికిఁ గారణం బేమందువా ? కారణము లేక కార్యంబు గలుగదు. ఆకారణంబు నీకే గోచరంబు.

దేవా ! కర్మఫలంబులైన శుభాశుభంబుల ననుభవించువాఁ డెవఁ డందువా ? నీవే పరతంత్రుఁడవై జీవరూపంబున వాని ననుభవింతువని కొందఱుందురు. నీవు కేవలాత్మారాముఁడ వనియు, అట్టి నీవు తుచ్ఛంబులైనకర్మఫలంబుల ననుభవింతువనుట పొసఁగదనియు మఱికొందఱుందురు. ఈవాదంబులన్నియు నిటీవలివారి యూహాలగును. నీ పుట్టుపూర్వంబులు వారి కెట్లు గోచరించును ? శాస్త్రంబులసంగతి యేమందువా ? వివిధమతభావంబులేగదా శాస్త్రంబు లనఁబడును. ఆభావంబులన్నియో వారివారి మేధాశక్తిదర్పణంబున స్ఫురించిన స్ఫురణంబు లగును. మేధాశక్తి యేకరూపంబున నుండదు. ఆకారణంబున భావభేదంబులు గలుగును. శాస్త్రంబు లేకముఖంబున నుండకపోవుటయే యిందులకు నిదర్శనము. ఏకవస్తు వొక్కనికి గుణవంతంబుగా వేఱొకనికి గుణరహితంబుగాఁ దోఁచుచున్నది. అంతియగాదు.ఒక్కవస్తువే ఒక్కవ్యక్తికే యొక కాలంబున హితకరంబు వేఱొక కాలంబున దోషవంతంబుగా నగుచున్నది. ఇదంతయు బుద్ధిరుచిభేదంబునఁ గలుగుట స్పష్టము.

దేవా ? వికల్ప వితర్కవిచారప్రమాణాభాసకుతర్కంబులతో నిండియున్న యాశాస్త్రంబులను బరీక్షించినచోఁ దత్తత్కర్తల దురాగ్రహంబు స్పష్టమగును. అట్టి దురాగ్రహగ్రస్తచిత్తులకు నీ వెన్నండేనియు బోధపడుదువా ? అట్టిశాస్త్రంబులఫల మేమందువా ? మాబోంట్లు బుద్ధికలవరంబు గలిగి యిదమిత్థమని నిశ్చయించుకొననేరక పలుపోకలకుఁ జిక్కి గంతవ్యముఁ జేర లేకుండుటయే ఫలము.

స్వామీ ! నీవు అనంతగుణుఁడవు. నీమాహాత్మ్యంబునకు లోతుపాతులు గలుగవు. సంసారము మాయామయము. నీవో ఉపరతుండవు. నీమాయ నీయిచ్ఛప్రకారము వర్తించును. నీకు దుర్ఘటం బెద్దియు గలు

గదు. నీకు సమవిషమభేదమే లేదు. ఎల్లరయందు నీ వొక్కరుండవే యంతరాత్మవై వర్తింతువు. ఆపక్షంబున సమవిషమంబులు లోకంబునఁ గానవచ్చుటకుఁ గారణ మేమందువా ? అవి వారివారిమతిభేదంబులఁ బట్టి జనించిన యభిప్రాయమాత్రంబులేగాని వాస్తవములు గావు. అది యెట్లందువా ? మునుజీఁకటిలోఁ ద్రాఁడు పడియున్నప్పుడు దాని స్వరూప జ్ఞానము లేనివాఁడు త్రాటిని జూచి సర్పమని భ్రాంతిపడుచుండుట సార్వలౌకికమే గదా. ఆభ్రాంతికి అజ్ఞానము కారణము. అజ్ఞానమనఁగా విపరీతజ్ఞానమని భావము. అట్టి యజ్ఞానంబునకుఁ గారణ మేమందువా ? సాధనలోపమే కారణము. మురికియద్దమందుఁ బ్రతిబింబము విపరీతం బుగాఁ గాన్పించుటయే యిందులకు నిదర్శనము. భ్రాంతి తీఱుట యెట్లం దువా ? వాస్తవజ్ఞానోదయంబున భ్రాంతి తీఱుచున్నది. త్రాటిని జూచి సర్పభ్రాంతి పడినవానికి దీపమును దెచ్చి చూపించినప్పు డతఁడే తన ప్రమాదంబును గ్రహించి భ్రాంతిని విడిచి యది త్రాఁడను జ్ఞానంబును బడయుచున్నాఁడుగదా భ్రాంతియు నొకకార్యంబగు. కార్యమునకుఁ గారణం బుండవలయును. కారణమేమో మాబుద్ధులకుఁ గోచరింపదు.

దేవా ! నీ స్వరూపజ్ఞానంబు గలుగుట యెట్లు ? భ్రాంతి తీఱుట యెట్లందువా? నీ మహిమామృతరసబిందు వొక్కటి గ్రోలినచో భ్రాంతి రూపవిషంబులెల్ల నశించును. నీస్వరూపంబు తేఁటపడును. ఏకాంత భక్తులు పరమభాగవతులే యిందులకు నిదర్శనము.

దేవా ! సురాసుర లిరువురును నీవిభూతులే యగుదురు. ఎల్ల రకు నీవే యీశ్వరుండవు. దండ్యులకు దండనరూపసంస్కారంబుఁ గలిగించుటకై సమయానుసారంబుగా వివిధరూపంబులు దాల్చి శిక్షించి సృష్టిని నిల్పితివి. నీవారమైన మాకు వృత్రుఁ డిప్పు డెంతయు నపకృతి గావించి తత్కారణంబున దండనార్హుఁ డయ్యెను. నీకు మాయెడ దయ గలదనుటకు నీ విట్లు ప్రసన్నుఁడవగుటయే నిదర్శనము. నీ మంగళ రూపంబును గాంచనోఁచితిమి; మా మొఱ విన్నవించితిమి. నీవే గతి

యని నమ్మితిమి. ప్రియంబును మధురంబునైన మాటయొక్కటి పల్కి మా యంతస్తాపంబును జల్లార్పుము.

ఎవనిశక్తియొక్క విస్తారవ్యవహారోపసంహారంబులు సృష్టిస్థితి లయంబు లగునో, ఎవఁ డట్టిశక్తి విలాసంబుల వినోదించునో, ఎవఁడు చరాచర సమస్తప్రపంచ బహిరంతరంబులఁ బ్రత్యగాత్మపరమాత్మ ప్రధాన రూపంబుల నుండునో, ఎవఁడు దేశకాల దేహావస్థావిశేషంబులకుఁ దగినట్లుగా నుపాదానంబు నుపలంభకుఁడునై యాత్మానందంబు ననుభవించుచుండునో, ఎవఁడు నిర్లేపస్వరూపుఁడును బరబ్రహ్మవాచ్యుఁడు నైన పరమాత్మ యగునో, వహ్నికిఁ దదంశవిస్ఫులింగంబు లట్లుగా నెవనికి మే మగుదుమో, ఎవఁడు బుద్ధ్యాదులకుఁగూడ సాక్షి యగునో యట్టివానికిఁ దెలియనిదియు మేము చెప్పఁగలదియు నేమి గలదు? సర్వజ్ఞా! వివిధపాపజనితసంసారపరిభ్రమశాంతిదాయకమైన నీ పాదపద్మంబులనీడఁ జేరితిమి. ఇదే నీకుఁ బ్రణామంబు' అని మఱల సాగిలఁబడిరి.

### భగవానుఁడు వృత్రవధోపాయంబుఁ దెలుపుట

రాజా! భగవానుఁడు సురలప్రణయంబులు విని 'అమరవర్యులారా! మీజ్ఞానంబునకు మెచ్చితిని. ఆత్మకు సంసారిత్వము లేదని మీరు పల్కిన పల్కులు పరమసత్యములు. మీభక్తి నా కెంతయు సంతసము గూర్చెను. నేను ప్రీతుఁడ నగుదునేని నాకు దుర్లభంబెద్దియుఁ గలుగదు. నాప్రీతిని బడయుటకు నేకాంతభక్తియే పరమసాధనము. తత్త్వవిదులెల్లరు నద్దానినే కోరుదురు. విషయంబు లెన్నడును సద్వస్తువులు గావు. అట్టి యసత్పదార్థంబులను సత్పదార్థంబులుగా భావించువాఁడు కేవల కృపణుఁడగును. కృపణులకు వారిశ్రేయమేదో తెలియదు. అట్టివారికిఁ గోర్కెఁ గూర్చువాఁడుగూడఁ గృపణుఁడే యగును. ఎవఁడు నిశ్శ్రేయసం బెఱుంగునో వాఁడే విద్వాంసుఁడు. విద్వాంసుఁ డజ్ఞునకుఁ గర్మప్రవృత్తిని బోధింపఁడు. మంచివైద్యుఁడు రోగికి నపథ్యంబు నిచ్చునా?

సురేశ్వరా! మీరు వెనువెంటనే దధీచిఋషిసత్తమునియొద్దకుఁ బోయి వానిశరీరంబును యాచింపుఁడు. అతఁడు శుద్ధబ్రహ్మజ్ఞానసంపన్నుఁడు. వానిశరీరము విద్యావ్రతతపస్సారము. ఆ మునీంద్రుఁడు అశ్వినులకు అశ్విశిరోనామకబ్రహ్మవిద్య నుపదేశించి జీవన్ముక్తుఁ డయ్యెను. మఱియు నతఁడు నారాయణకవచంబును దృష్టకు బోధించెను. ఆ మహాకవచంబును దృష్టవలన వానిపుత్త్రుఁడు విశ్వరూపుఁడును, వానివలన నీవును గ్రహించితివి. వారతనిని యాచించుటయేగాక అశ్వినులనుగూడ వానినిఁ బ్రార్థింపనిమ్ము. మీప్రణయంబు నమ్ముని యంగీకరించి నిజాంగంబుల నొసంగును. ఆయంగంబులతో నొకఖడ్గంబును విశ్వకర్మ నిర్మింపవలయును. ఇంద్రా! ఆఖడ్గంబును నీవు హస్తంబున ధరింపుము. ఆఖడ్గమును నీవు చేతఁ బట్టినంతనే నాతేజము నిన్నుఁ బ్రవేశించును. అంతట నక్కత్తియతో వృత్రునితల ఖండింపుము. అతఁడు తెగినంతనే మీరు మీమీయస్త్రాయుధంబులతేజంబును బడయుదురు. మీకు మేలయ్యెడు. నాభక్తులెందును దుఃఖమందరు.' అని పలికి యంతర్ధానుఁడయ్యెను.

## దేవతలు దధీచిని బ్రార్థించుట

రాజా! అంతట దేవతలు దధీచియొద్దకుఁ బోయి వానికి మ్రొక్కి- 'మునీంద్రా! మహాత్ములకు లోకకళ్యాణము ప్రధానంబగు. తదర్థము వారు ప్రాణంబులనేనియుఁ ద్యజింతురు. దిలీప, జీమూతవాహన, శిబి మున్నగువారిచరిత్రలు లోకప్రసిద్ధము. నేఁడు లోకకళ్యాణార్థము మీరు మీశరీరంబు నొసంగవలసిన ట్లేర్పడెను. తదర్థము వచ్చితిమి.' అని విన్నవించిరి. దధీచి వారిని విని 'సురలారా! శరీరమును మీ కిచ్చుటకుఁ జైతన్యంబును దానియాశ్రయంబునుండి తొలఁగించుటగు జీవింపఁ గోరువానికి దేహంబునకన్నఁ బ్రియమైనది గలదా? అట్టిదేహంబును గోరఁదగునా? విష్ణుప్రేరణంబున వచ్చితిమందురా? ఆవిష్ణువే స్వయముగా వచ్చి యడిగినను జీవితార్థి స్వదేహంబు నిచ్చునా?

లోకకళ్యాణార్థము నాశరీరంబును గోరుచున్నారు. లోకకళ్యాణ మనఁగా నేమి ? జీవరాశి సుఖంబుగదా! లోకకళ్యాణవాంఛ యెందుకుఁ గలుగునో విచారింతురా ? సుఖాభిలాష యెల్లరకుఁ గలదు. అది నైజము. సుఖమునుగోరువారు. 1. స్వార్థులు, 2. దీర్ఘదర్శి స్వార్థులు, 3. ఉదాత్తస్వార్థులు. 4. పరోపకారైకస్వార్థులు అని నాల్గు తెగలుగనుందురు. వారిలోఁ గేవలసుఖార్థి యెన్నఁడును బరసుఖంబును దలంపఁడు; దీర్ఘదృష్టి సుఖార్థిభావం బేమన్ననో పరులకు సుఖము గలిగించినచో వారివలనఁ దనకు సుఖంబు గలుగునని యట్లు చేయును. ఉదాత్త సుఖార్థిభావం బేమనఁగా నెల్లరు సుఖముగా నున్నచో నెల్లరలో నొకండనైన నాకును సుఖంబగునని తలంచును. పై ముగ్గురు ఇంద్రియగమ్యసుఖంబునే దృష్టినుంచి వర్తింతురు. నాల్గవవానిసంగతి యట్లుగాదు. ఇంద్రియగమ్యసుఖంబు తాత్కాలికమేగాని శాశ్వతంబు గాదనియు బుద్ధిగమ్యసుఖం బొక్కటే శాశ్వతంబనియు, ఆకారణంబులఁజేసి మొదటిది ప్రేయంబనియు రెండవది శ్రేయంబనియుఁ బేర్కొనఁబడు ననియు, ఆశ్రేయమే నిశ్చయమైన కళ్యాణంబనియు, అట్టి కళ్యాణంబునకుఁ బట్టుకొమ్మ 'నేను, నాది' అనుభావంబు పోవుట యేయనియు, అది త్యాగరూపంబనియు, శాశ్వతసుఖంబుఁ గోరువారికిఁ ద్యజింపరాని దుండదనియు నాల్గవతరగతివారి యంతర్భావంబగు. ఇదియే వాస్తవమైన ధర్మంబగు' ననియుఁ బల్కెను.

ఆఋషివచనంబులు దేవతలు వినిఅయ్యా ! 'మహాత్ము లెప్పుడును సర్వభూతహితైకచిత్తు లగుదురు. ఆకారణంబున వారు మహాశ్లోకులకుఁ గూడఁ గీర్తిపాత్రు లగుచున్నారు. అట్టి మహాత్ములకుఁ ద్యజింపరానివస్తు వొక్కటి గలుగునా ? లోకమన్ననో యది యెప్పుడును స్వార్థపరము. స్వార్థపరులందుఁ ద్యాగబుద్ధియే గలుగదు. వా రిచ్చునట్టిదానాదులు గూడఁ బ్రతిఫలాపేక్షాపూర్వకంబులుగా నుండును. మఱియొకవిశేషము. స్వార్థపరులకుఁ బరక్లేశవిచారంబు సుంతయుఁ గలుగదు. హితాహితవిచారంబున్నచో యాచించుటగాని లేదనుటగాని రెండు నుండ' వనిరి.

రాజా ! దధీచి వారిని విని 'బృందారకులారా ! మీ ధర్మదృష్టినిఁ దెలియఁగోరి యట్లంటినేగాని వేఱుగాదు. ఒక్కసంగతి వినుఁడు. నాశరంబును గోరుచున్నారు. నే నున్నంతకాలము నాశరీరం బుండును. అనఁగా నేను శరీరంబునకు నంతప్రియతముండ నగుదు. అట్టి నన్నుఁగూడ నా యీశరీరం బెన్నఁడో యొకనాఁడు తటాలునఁ ద్యజించుచున్నది. అట్టి దానిపయి మమకార మేల ? ఇదే యీతనువును మీ కిచ్చుటకు సంసిద్ధముగా నున్నాను. అనిత్యమైన యీ దేహంబువలన భూతంబులకు మేలు గలుగ నుండునేని భూతదయాపరుఁడు దేహత్యాగంబునకు వెనుదీయఁడు. పరోపకారమే పరమధర్మం బనియు, శరీరము పరోపకారార్థమే యనియుఁ దత్త్వవేత్తలు పలికిరి. అట్టి పరమధర్మార్జనంబునకుఁ దఱివచ్చుటయే దుర్లభము. ఎట్లో వచ్చినతఱినిఁ జేతులారఁ బోగొట్టుకొనువాఁడు చరంబులకేగాక స్థావరంబులకుఁగూడ మహాశోచనీయుం డగును. సురలారా ! భూతంబుల శోకహర్షంబులు తనశోకహర్షంబులుగా భావించి వర్తించుటయే పరమధర్మము. ఆభావంబు పుణ్యశ్లోకుల నెడఁబాయదు. మఱియొకటియు గ్రహింపవలయును. విత్తముగాని పుత్రాదులుగాని దేహంబులుగాని క్షణభంగురంబులు. అట్టివానిని బరోపకారార్థము వినియోగించినప్పుడే యవి సార్థకత్వంబును బడయును. అట్లు చేయనినాఁడు వానిగతి యేమగునో యోచించితిరా ? విత్తము పరహస్తగతమై నశించుచున్నది. పుత్రాదులు స్వలాభపరులును ధర్మదూరులు నై చెడిపోవుదురు. దేహంబులు కుక్కలపా లగుచున్నది.' అని చెప్పి ప్రాణేంద్రియమనోబుద్ధులను నియమించి సర్వబంధంబులఁ బాసి పరమయోగస్థుఁడై యాత్మను బరమాత్మయందుఁ దాదాత్మ్యంబుగావించి శరీరంబును వదలెను.

### వజ్రాయుధనిర్మాణము

అంతట దేవతలు విశ్వకర్మను జీరి 'నీవు పోయి దధీచియంగంబులఁ గొని వానితో ఖడ్గంబును నిర్మింపు' మని చెప్పిరి. విశ్వకర్మ యట్లగావించి యాఖడ్గంబు నింద్రున కిచ్చెను. ఆఖడ్గమే వజ్రాయుధము.

దేవేంద్రుఁడా ఖడ్గంబును జేతఁ బూనినంతనే వానియందు నొకనూత్న తేజస్సు గలిగెను. అతఁడంతట నైరావతం బెక్కి సురసేనాసహితంబుగాఁ దరలి వృత్రునిఁ దలపడెను.

### దేవదానవులయుద్ధము

రాజేంద్రా! ఇది యెప్పుడు జరిగె నందువా? తొలిమహాయుగ మందలి త్రేతాయుగముయొక్క ప్రారంభంబున జరిగెను. ఎచ్చట జరిగె నందువా? నర్మదాతీరంబున జరిగెను. దేవేంద్రుఁ డట్లు యుద్ధార్థము తరలినంతనే రుద్రులును, వసువులును, ఆదిత్యులును, అశ్వినులును, అగ్ని దేవతలును, మరుత్తులును, ఋభుసాధ్యవిశ్వేదేవులును, పితృదేవతలును వానిని వెంబడించిరి.

ఇంద్రుఁ డట్లు వచ్చుట తెలిసి వృత్రుఁడును యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. వానివెంట నముచియు, శంబరుఁడును, అనర్వుఁడును, ద్విమూర్ధుఁడును, వృషభుఁడును, అంబర హయగ్రీవ శంకు శిరోవిప్ర చిత్తులును, అయోముఖ పులోమ వృషపర్వ హేతి ప్రహేతులును, ఉత్కట ధూమ్రకేశ విరూపాక్ష కపిల విభావసులును, ఇల్వల పల్వల దందశూక వృషధ్వజ కాలనాభ మహానాభ భూతసంతాపనవృకులును, మాలి సుమాలి మున్నగు దైత్యదానవయక్షరాక్షసాదులు క్రోధపరీతులై సువర్ణకవచంబులు ధరించి రణరంగంబుఁ జొచ్చిరి.

రాజా! ఇరుసేనలుఁ దలపడెను. వృత్రునిసైన్యము గదా పరిఘ బాణప్రాసపరశుతోమర ముద్గరాదివివిధాయుధంబులను బ్రయోగించుచు నానాస్త్రశస్త్రంబులను వర్షించుచు దేవతలను నొప్పించిరి. అమరులు హస్తలాఘవంబును మెఱయించి దానవప్రయుక్త ఖడ్గాదులను మార్గ మధ్యంబుననే తుత్తునియలు గావించిరి. అసురులు తమ యాయుధంబు లెల్ల నట్లు వృథపోవుటఁ జూచి కోపక్రోధవివశులై పెనువృక్షంబులను గిరిశిఖరంబులను బెల్లగించి తెచ్చి సురలపై వైచిరి. నిర్జరులు వానిని గూడఁ బిప్పొడిచేసి మహాద్భుతవిక్రమాటోపంబులఁ జూపిరి. అసుర

వీరులు తమయత్నంబులెల్ల రిత్తయగుటకుఁ జింతించుచు నుక్కుదక్కి డీలుపడి వృత్రుని వదలిపఱచిరి.

వృత్రుఁడు స్వపరివారపలాయనంబుఁ జూచి నగుచు 'విప్రచిత్తీ! నముచీ! పులోమా! మయా! అనర్వా! శంబరా! పుట్టినది గిట్టక మానదు. చావునకుఁ బ్రతీకారమే లేదు. శరీరంబునకు మృత్యువు దప్పనిదైనను దానిపరిత్యాగంబునకు శ్లాఘ్యమార్గంబులు రెండు గలవు. అవి యెవ్వియందురా? యోగరతుఁడై బ్రహ్మనిష్ఠతోఁ గళేబరంబును వదలుట మొదటిమార్గము. రణంబున వెన్నుచూపక పోరి మడియుట రెండవమార్గము. ఈ రెండుమార్గంబులు ధర్మసమ్మతంబులేగాక యత్యంత దుర్లభంబులు నగు. వీనిని బాటించినవారికిఁ గీర్తియు స్వర్గంబును రెండును జేకూరును. మీరు త్రొక్కినదారి సరిగాదు; ఆమార్గంబునఁ జన్నచో నుభయభ్రష్టు లగుదు' రని గంభీరస్వరంబునఁ బలికెను. అసురులు వానిపిలుపును జెవిఁబెట్టక యూడంబారిరి.

ఇంద్రవృత్రులయుద్ధము

రాజా! వృత్రుఁ డట్లు పిలిచినను వానిపరివారము మఱలక పాఱి పోవుటఁజూచి యతఁ డెంతయు మండిపడసాగెను. అంతలోన నమరులు వారిపయి నురువడించిరి. వృత్రునికోపక్రోధంబులు రెట్టించెను. అతఁడు మహోగ్రమూర్తియై సురలారా! ఆపఱచుచున్నయసురులు మూత్ర పురీషప్రాయులు. వారిం బరిమార్చుట శౌర్యముగాదు. మీకు యుద్ధ శ్రద్ధయు ధైర్యంబును గలదేని గ్రామ్యసుఖలాలసులుగారేని ఱొమ్మిచ్చి యెదుట నిలిచి పోర రండు' అని యదలించి లోకంబెల్ల జడీభూతం బగు నట్లుగాఁ బెల్లార్చెను. వాని సింహగర్జనంబునకు దేవతలు పిడుగుపడినట్లు మూర్ఛిల్లి నేల రాలిరి. అట్లు తామరతూండ్లువలె నేలఁబడియున్న నిర్జరులను వృత్రుఁడు కాలఁ జమిరి నుగ్గుచేయసాగెను. వాని ఘోరకృత్యంబునకు దిక్కులందు హాహాకారంబులు ప్రతిధ్వనులీనఁజొచ్చెను.

ఇంద్రుఁ డదిచూచి గదయెత్తి వృత్రునిపయి వైచెను. వృత్రుఁడా గదను జెండుంబోలె డాకేలఁ బట్టి యైరావతకుంభస్థలిఁ బడునట్లు విసరెను. ఆవ్రేటునకు నగ్గజంబు తల ప్రీలి ఘూర్ణిల్లుచు నెత్తురులు గ్రక్కుచు నేడువిండ్లమేర వెనుకకుఁ బోయెను. ఇంద్రుఁడు తనవాహనముపాటునకు విషణ్ణచిత్తుఁ డయ్యెను. వృత్రుఁ డది గ్రహించి యుద్ధధర్మంబును దలంచి యింద్రునిపయిఁ దనగదను విసరుట మానెను. సురవల్లభుం డంతట సుధాస్రావియైన నిజకరతలంబున నగ్గజేంద్రంబును నిమిరి నేదతేర్చి మఱల యుద్ధోన్ముఖుఁ డయ్యెను.

రాజా! దేవేంద్రుఁ డట్లు వచ్చుట వృత్రుఁడు చూచి 'పురందరా! బ్రహ్మహత్యఁ గావించితివి; గురుద్రోహం బొనర్చితివి. ఇంతటి ఘోర పాపంబులు చేసియు లజ్జింపక నన్నెదురవచ్చితివి. నీ విట్లువచ్చుట నాభాగ్యంబని తలంతును. ఇదిగో నేను నా యీశూలాగ్రంబున నీ హృదయంబుఁ జీల్చి నాభ్రాతృప్రాణంబును దీర్చికొనెదఁగాక. సురాధమా! నాయన్న యాత్మవిదుఁడును దీక్షితుండును బ్రాహ్మణుండునై పేరొందెను. అతఁడు నీప్రార్థనంబుననీకు గురువయ్యెను. అట్టివానిని నమ్మించి చేరఁదీసి, స్వర్గకాముఁడు యజ్ఞపశువుతల నట్లు వానితలలు దఱిగితివి. నీయందు దయాభావము గోరంత యుండినచో నింతఘోరం బొనర్తువా? నీయట్టి పాతకిశరీరంబు పురుషాదులకుఁగూడ వెక్కసంబగుఁగదా! అంతియగాదు. నీదుష్టశరీరంబును దహించుటకు నగ్నిదేవుఁడు సయితము సిగ్గుపడును. నీవు గ్రద్దలకును నీతోడివారు భూతపరులకును బలియగుదురుగాక!'

ఇంద్రా! నీకు వజ్రంబు గలదందువా? నీవజ్రంబు నాతలఁ ద్రెంచునేని నేను కర్మబంధంబును బాయుదును. నా దేహంబుచేత భూతబలిఁ గూర్తును. నేను పరమసంతోషపూర్వకంబుగా నాత్మవంతులచరణపరాగంబు నాశ్రయింతును. సురేశ్వరా! వజ్రంబును జేతఁ బట్టితివి. ఇఁక జాగుసేయు టేల? కృపణుని యాచించుటవలన దరిద్రునకుఁ గలిగినఫలంబు నీగదకుఁ బ్రాప్తమయ్యెననియు, నీవజ్రాయుధంబుగూడ నట్లే యగు

నేమో యనియు శంకింతువా ? నీవజ్రంబు దధీచి తేజోవిరాజితంబు. నీవో విష్ణుప్రేరితుండవై వచ్చితివి. ఆభగవానుం దేవలను గలుగునో యావలను జయశ్రీ వెలయును. నాసంగతి యేమందువా ? నేను 'గ్రామ్యపాశంబులనెల్లఁ ద్రుంచివైచి భగవచ్చరణారవిందలీనచిత్తుండనై యుత్తమగతిం బడయ సిద్ధుఁడనై తిని. నాసిరిసంపదలసంగతి యేమందువా? అవి రాగద్వేషభయంబులకు మదకలహావ్యసనాయాసంబులకుఁ గార ణంబు లగునేగాని శాంతిప్రదంబు లెన్నడును గావు. అందువలననే శ్రీభగవానుఁడు వాని యేకాంతభక్తులకు సంపదలీయఁడు. ఆదయానిధి యెవనికిఁ ద్రివర్గాయాసంబును దొలఁగించునో వానికి నకించినగోచరం బును మహాదుర్లభంబు నైనభగవత్ప్రసాదంబు కొంగుబసిండి యని యెఱుంగుము' అని చెప్పి, భగవంతు నిట్లు స్మరించెను.

### వృత్రకృతభగవత్స్మరణము

'దేవా ! నీ దాసానుదాసునిగా నన్ను గ్రహింపుము. నామనంబు నీగుణస్మరణంబును, నావాక్కు నీగుణకీర్తనంబును, నాశరీరము నీపరిచర్యా పరంబు నిరంతరం బగునట్లుగా నాకుఁ బ్రసాదింపుము. వేయుకోర్కెలు లేవా యని యందువా ? రసాతలాధిపత్యంబు నిత్తు నన్నను, సార్వభౌమ పదంబు ననుగ్రహింతు నన్నను, బ్రహ్మలోకంబు నొసంగుదు నన్నను, సర్వ యోగసిద్ధులు గూర్తు నన్నను, దుదకు ధ్రువపదంబునం దధిష్ఠింతు నన్నను నాకు వలదు. వేయేల ? మోక్షంబుగూడ నాకు వలదు. నామనంబు దేనిని గోరుచున్నదందువా ? ఱెక్కలురాని పక్షిపిల్లలు క్షుధార్తిఁ దల్లి పక్షినివలె, త్రాటఁగట్టివైచినదూడ యాఁకటం దూలుచుఁ దల్లిగోవును వలె, విరహావిషణ్ణయైన సతి దేశాంతరగతపతినివలె, నామనంబు నిన్నుఁ జూడఁ దహతహపడుచున్నది. సర్వసౌభాగ్యనిధీ ! పూర్వకర్మఫలసం ప్రాప్తంబైన సంసారచక్రంబునఁ బరిభ్రమించి పరిభ్రమించి విసివితిని. ఎట్లో నీయనుగ్రహలేశంబు నాకు సిద్ధించెను. తత్ఫలంబుగా దేహగేహపుత్ర విత్తాదులందలి నామమకారంబు వలసపోయెను. అది మఱలఁ దలయెత్త

కుండునట్లు కృపసేయుము; ఉత్తమశ్లోకులైన నీభక్తులతోడి నెయ్యంబు తొలంగకుండునట్లుగా ననుగ్రహింపుము.'

రాజా! వృత్రుం డట్లు భగవంతుని బ్రార్థించి విజయంబునకంటె రణమరణంబె పరమశ్రేయంబని తలంచి శూలంబు నెత్తి దేవేంద్రునిపయి విసరెను. ఆశూలము యుగాంతాగ్నిజ్వాలాభీలమై యంతరిక్షంబునెల్లఁ బ్రదీపించుచు నింద్రునిమీఁదఁ బడవచ్చెను. సురరాజు దనవజ్రంబుచేత దానిని ఖండించి వృత్రుని దక్షిణభుజంబును భోగిభోగాకారమైనదానిని ద్రుంచెను. అట్లు దక్షిణబాహువు దెగియు వృత్రుఁడు సంరంభించి వామహస్తంబునఁ బరిఘంబునెత్తి యింద్రకపోలభాగంబును వానియైరావతంబు నడిచెను. ఆతాఁకుపడికి సురేంద్రునివజ్రంబు వానిచేతినుండి జాఱి క్రిందఁబడెను. ఆమహాద్భుతకర్మంబునకు ఖేచరులు వృత్రునిఁ బ్రశంసించిరి. ఇంద్రుని దురవస్థకు బృందారకులహాహాకారంబు లెగసెను. సురనాథుఁడు తనవజ్రంబును శత్రువుమ్రోలఁబడినదానిని మఱల గ్రహింప లజ్జించెను.

### వృత్రుఁడు దేవేంద్రునకు ధైర్యోత్సాహంబులు గలిగించుట

రాజా! వృత్రుఁ డింద్రునిభావంబు గ్రహించి 'నిర్జరేశ్వరా! వజ్రంబును గైకొని వైరిని దెగటార్పుము. ఏదే నొక్కగోరంత యోటమి గలిగినంతనే వెలవెలఁబోఁజనదు. ఓడుగెలుపులకు నిలుకడ గలుగదు. సర్వకాల సర్వవిధ సర్వజయంబు సర్వజగదుత్పత్తిస్థితిలయకర్తయైన యాసర్వేశ్వరునకు సర్వజ్ఞునకు నొక్కనికే చెల్లునుగాని తదితరులకు నెన్నఁడును గలుగవు. మఱియు నీవిట్లు విషాదమొందుటకు నిది సమయము గాదు.'

'స్వర్గాధిపా! ప్రాణులకు నోజస్సహోబల ప్రాణామృతంబులు గాని మృత్యువుగాని గలుగుటకు మూలకారణంబేమో గ్రహింతువా? అవి వారి యత్నాధీనంబులు గావు. మఱియేమన్నచో వాని రాకపోకలకు భగవానుఁ డొక్కఁడే హేతువగును. లోకంబెల్ల వలలోఁజిక్కిన

పక్షియట్లు వ_ర్తించును. మూఢు లీరహస్యంబు నెఱుంగక తామే సమ_స్తంబునకు హేతువులని భావించి విఱ్ఱవీఁగుదురు.'

'సురనాయకా ! పురుషుఁడు, ప్రకృతి, మహ_త్త_త్త్వంబు, అహం కారంబు, భూతేంద్రియాశయంబులు, ఇవి పరస్పరముఁ గూడి సర్గాదు లను గలిగించుచున్నవని కొందఱు తలంతురు. ఇంతకన్న వెఱ్ఱులు గలుగరు. భూతంబులెల్ల జడంబులు. జడంబులకు సంయోగవియోగ రూపస్వతంత్రశ_క్తి గలుగదు. కావున భూతంబులు భూతంబులను సృజిం చుటగాని, భూతంబులు భూతంబులను గ్రసించుటగాని యెన్నఁడును సంభవింపదు. ఈశ్వరనిర్మాణప్రకారం బవి వ_ర్తించును. యంత్రగాని చేతిబొమ్మలయాటలఁ జూతుముగదా!

'అమరేశ్వరా ! ప్రాణులకు స్వాతంత్ర్యము లేదనుటకు మఱి యొకనిదర్శనము వినుము. ఆపదల నెవ్వరును గోరరు. కోరకున్నను రానైనప్పు డవి తప్పక వచ్చుచునే యున్నవి. ఆయురారోగ్యయశ శ్శ్రీల నెల్లరు నెంతో వలతురు. తలచినంతనే యవి వచ్చుటలేదు. దీనింబట్టి యేమి యేర్పడుచున్నది ? ద్వంద్వాదులు పురుషాధీనంబులు గావనియు, వాని రాకపోకలకుఁ గారణాంతరము గలదనియు, ఎప్పు డేది యెవ్వనికి నెట్లు కలుగవలయునో యప్పు డది వానికి నవ్విధంబునఁ గలుగు చున్నదనియు, అనివార్యంబులు సంప్రా_ప్తమైనప్పుడు తలయొగ్గి యప్రతీ కారబుద్ధితో సహింపవలయుననియు, వేఱుమార్గంబు లేదనియు సిద్ధమగు చున్నదిగదా!'

'లోకపాలకా ! మఱియొకవిశేషముగూడ వినుము. భగవ చ్ఛ_క్తిని బ్రకృతి యందురు. ఆప్రకృతి తద్వ్యవహారదశయందు స_త్త్వ రజ_స్తమోగుణరూపంబులు దాల్చి వ్యవహరించును. ఆత్ముఁడు అనఁగా శ_క్తిమంతుఁడు సాక్షిమాత్రుఁడై యుండును. ఈరహస్యంబు నెఱుం గనివారు ప్రకృతిగుణంబులను ఆత్మునియం దారోపించి యవి తద్గుణం బులుగా భావించి వ్యవహరింతురు. ఈవ్యవహారమే బంధక మనఁబడును.

ఆత్ముఁడు సాక్షిమాత్రుఁడేయైనను వానిశక్తియైన ప్రకృతియొక్క వ్యవహారంబెల్ల వానివ్యవహారమే యగుఁగదా యనియు, ఆకారణంబునఁ బ్రకృతిగుణంబు లాత్మునిగుణంబు లెట్లు కాకుండునని యుఁ గొందఱు వాదింతురు. ఆత్మసాన్నిధ్యంబున గుణంబులకు వ్యవహారశక్తి గలుగు ననుట నిర్వివాదాంశము. అయినను బ్రకృతిగుణము దానిస్వభావము ప్రకారము వర్తించును. స్వభావం బన్ననో ప్రారబ్ధకర్మఫలవాసనాసముచ్చయంబగును. అనఁగాఁ బూర్వజన్మంబులందుఁ జేసిన వివిధకర్మంబుల ఫలంబులు వానిభోగ్యకాలమందు శరీరస్థములై వాసనారూపంబున నిలిచి మఱలఁ దత్తద్రూపకర్మంబులకుఁ బ్రేరేపించుచున్నవి. ఏవ్యక్తియందేనియు మూఁడుగుణంబులు నేకకాలంబుననే వర్తింపకుండుటయు, ఒకదానివెంట నొకటి వ్యవహరించుటయుఁ జూతుముగదా! సూదంటు రాయి మ్రోల నినుపముక్కల వ్యవహారం బెట్లో యట్లే యాత్మసాన్నిధ్యంబున గుణత్రయవ్యవహారంబనియు, ఆవ్యవహారమందలి మంచిచెడుగులు తత్కాలమందు వ్యవహరించుగుణముయొక్క స్వభావంబునుబట్టి గలుగుచున్నదనియు, గుణకార్యఫలంబునకు సాక్షిమాత్రుఁడైన యాత్మఁ డెన్నఁడును కారణభూతుఁడు గాఁడనియు గ్రహింపవలయును. అట్లు గ్రహించి వర్తించువాఁడు ముక్తుఁడగును.

నరేంద్రా! యుద్ధము సంగతి యేమందువా? అది జూదమువంటి దగును. ఎట్లందువా? బాణంబులు పాచికలకును, వాహనంబు పలకకు, బ్రాణం బనునది జూదంబులో నొడ్డుపణంబునకు సాటి యగును. జూదంబులో నోడుగెలుపులు మున్నుగా నెట్లు నిర్ణయింపరాదో యట్లే యుద్ధమందు జయాపజయంబులు మున్నుగా నిశ్చయింపఁదరముగాదు. జూదమునందు సర్వస్వముఁ గోల్పోవునందాఁక జూదరి యెట్లు మానఁడో, యట్లే యుద్ధమందుఁగూడఁ బ్రాణంబు వోవునందాఁక యుద్ధవీరుఁడు మానఁడు.

నా బాహువు తెగెను. అట్లని నాధర్మంబును విడవనేరను. ఇదిగో నాశక్తి కొలఁది పోరాడి నీప్రాణంబును హరింపనున్నవాఁడ' నని చెప్పెను.

రాజా! ఇంద్రుఁడు వానిని సాంతంబుగా విని తదీయనిష్కాపట్యంబునకు నెంతయు మెచ్చి క్రిందఁబడియున్న వజ్రంబు నెత్తి చేతధరించి 'వృత్రా! నీవు పరమాత్ముని సర్వాత్మకంబుగా భజించుటం జేసి నాయసుర భావంబు తొలంగెను. దానితోడ విష్ణుమాయను దరించితివి; మహాపురుషుఁడవైతివి. దానవులకు రజోగుణంబు నైజము. అట్టి రజస్స్వభావులు భగవంతునెడ నిట్టి దృఢవిశ్వాసంబుంచుట నెంతయు నాశ్చర్యకరంబగును. లోహము వహ్నితప్తమై శుద్ధిఁ గాంచునట్లు రజస్తమస్సులు భగవద్భక్తితప్తంబులైనప్పుడు శుద్ధినొందక మానవు. అగ్నికి నెట్లు వస్తువుయొక్క జాత్యాదిభేదము గలుగదో యట్లే భక్తికిగూడ దేవాసురాదిభేదము గలుగదు. మఱియు భక్తులు పరమానందసముద్రంబున నోలలాడుదురే గాని స్వర్గాదిభోగరూపపల్వలోదకంబులకై యాసింపరు. కాఁబట్టి నీ యాతత్త్వము వింతగాదు' అని చెప్పెను.

రాజా! వా రట్లు కొంతవడి ధర్మజిజ్ఞాసావచనంబులాడి సమరోన్ముఖులైరి. వృత్రుఁడు వానియినుపకట్లగుదియను డాకేల నెత్తి యింద్రునిపయి విసరెను. దేవేంద్రుఁ డాగుదియను వజ్రాయుధంబుచేత హరించి వృత్రుని వామహస్తంబునుగూడఁ ద్రుంచెను. వృత్రుఁ డట్లు హస్తద్వయంబును గోల్పోయి, ఱెక్కలు దెగినపక్షి మింటనుండి నేల రాలినట్లు, భూమిపయింబడి నెత్తుటఁ దోఁగుచు నొ రప్పలించెను. వానిక్రిందిహనువు నేలను మీఁదిహనువు నింగిని దాఁకెను. అతఁ డంతట నాకసంబును నాకుటకో యన నాలుక సాచి, ముల్లోకంబులను గబళించుటకో యనఁ బెన్కోఱల తోడి నోరువిచ్చి యింద్రుని వానినైరావతముతోడ మ్రింగెను. వృత్రునికార్యంబుఁ జూచి సురలును మహర్షులును బ్రజాపతులును 'హా! హా!' యని యాక్రోశించిరి.

### వృత్రసంహారము

ఇంద్రుఁ డట్లు వృత్రుని యుపకంబుఁజొచ్చియు నారాయణకవచ రక్షణంబునను యోగమాయాబలంబునను బొలివోవక నిజవజ్రాయుధంబు చేతఁ దత్కుక్షిని జీల్చి వెలువడివచ్చి తచ్ఛిరంబును దెగవైచెను. ఆవ్రేటునకు వానికుత్తుక పూర్ణముగాఁ దెగదయ్యెను. ఇంద్రుఁడు మఱల మఱల వానికంఠదేశంబును దెగవైచెను. అట్లొక యేఁడాది జరిగెను. ఎట్టకేలకు వానికుత్తుక తెగి తల నేలఁబడెను. ఆసంతోషంబునకు దేవ దుందుభులు మ్రోసెను; సిద్ధులు సెబాసనిరి; గంధర్వులు పాడిరి; మహర్షులు వృత్రసంహారవీర్యమంత్రంబుల దేవేంద్రునిఁ బ్రస్తుతించిరి. పుష్ప వృష్టి గురిసెను.

రాజా ! వృత్రుని తల తెగి యవ్వలఁబడినంతనే వానిదేహంబు నుండి దివ్యజ్యోతి యొకటి వెడలి యెల్లరుఁ జూచుచుండఁగానే పైకి నెగచి భగవంతుని జేరెను. వృత్రసంహారముతోడ ముల్లోకంబులు సంతాపంబు మాని స్వస్థచిత్తతఁ గాంచెను. లోకపాలురును దేవర్షి పితృ భూతదైత్యదేవానుచరులును బ్రహ్మేశ్వరులు వారివారి నెలవులకుఁ జనిరి.

రాజా ! ఇంద్రునకుమాత్రము వృత్రవధ సంతోషకారి కాద య్యెను. అతఁడు నెవ్వగతోడ స్వస్థానముఁజేరె ననెను. పరీక్షిన్నరేంద్రుఁ డామాట విని 'మునివర్యా ! వృత్రవధకు బ్రహ్మేశ్వరులుగూడ సంత సించి రంటివి. అట్టిది మహేంద్రునకు మాత్రము సంతోషకారి కాకుం డుటకుఁ గారణమేమి?' యని యడిగెను. వానికి శుకయోగీంద్రుఁ డిట్లనియెను.

### ఇంద్రుని చింతాకారణము

రాజేంద్రా ! వృత్రునివిక్రమంబు నోర్వఁజాలక సురలును మహర్షు లును దేవేంద్రునికడకు వచ్చి వృత్రవధను గోరిరి. సురరాజు వారిని విని 'శటా ! విశ్వరూపుని జంపి బ్రహ్మహత్య నొడిఁగట్టి యెట్లో దానిని

భూజలవృక్షస్త్రీల యనుగ్రహంబునఁ దొలఁగించికొంటిని. ఇంతలో వృత్రునిజంపుటయ్యెను. ఇదియు బ్రహ్మహత్యగాక మానదు. దీని నీఁగి కొనుట యెట్లు?' అనుచింత వానిని పైకొనెను. బ్రహ్మర్షులు దేవేంద్రుని తలంపు గ్రహించి 'నిర్జరేశ్వరా! నీవు బ్రహ్మహత్యాదోషంబునకు వెఱచు తువు. మాతాపితృలను గోబ్రాహ్మణాచార్యాదులను జంపినమహాపాతకి గూడఁ బరమేశ్వరారాధనంబునఁ బునీతుఁడై సుఖ ముండును. వేయేల? చరాచరప్రపంచంబును వధించినను దత్పాపము భగవత్కీర్తనమాత్రం బున భస్మీపటలంబగును. అది యట్లుండనిమ్ము. వృత్రుఁడు ఖలుఁడు. ఖలసంహారము దోషకారణంబుగాదు. ఒకవేళ నీ వట్టిదోషంబును శంకిం తువా? ఆపక్షంబున మేము నీచేత హయమేధయాగంబును జేయించి యమ్మహాధ్వరంబున భగవాను నారాధింతుము. వృత్రవధపాతకంబు నీ వలను గన్నెనియుఁ డిప్పఁజాల' దని చెప్పి యనునయించి వానివలన వృత్రుని జంపించిరి.

### ఇంద్రుఁడు బ్రహ్మహత్యకు వెఱచి దాఁగుట

రాజేంద్రా! ఇంద్రుఁ డట్లు వృత్రుని జంపి స్వస్థానంబును జేరిన తర్వాతఁ గొండొకనాఁడు వగ్గుముసలిచండాలి క్షయరోగపీడితయై దగ్గుచు గడగడ వడంకుచు నెత్తుట మాసినపుట్టంబుతో నెఱసినవెండ్రుకలతో మహాభయంకరంబుగాఁ దోఁచుచు నింద్రునొద్దకు వచ్చెను. ఇంద్రుఁ డా ఘోరరూపంబును గాంచి వెఱచి పఱుగెత్తసాగెను. ఆచండాలి వానిని వెన్నంటి నిలునిలు మనుచుఁ దఱుమసాగెను. వేయిగన్నులవేల్పు దాని బారినుండి తప్పించుకొనుటకై దెసలెల్లఁబఱచి యెట్టకేలకు నీశానుదిశఁ బట్టి చని మానససరోవరంబుఁజొచ్చి యందలి పద్మనాళతంతువులలో డాఁగెను. ఆచోటు బ్రహ్మహత్యకుఁ జొఱరాదు గావున నమ్ముసలిచండాలి తద్బహిఃప్రదేశంబునఁ గాచియుండెను.

రాజా! హవిర్భాగంబున నింద్రుఁడు శరీరధారణము చేయుచుం డును. హవిర్భాగంబును హవ్యవాహనుఁడు దెచ్చి వానికిచ్చుచుండును.

ఇంద్రుఁడు జలమధ్య నుండుటంజేసి యగ్నిదేవునకు నచ్చోటు ప్రవేశ యోగ్యము గాపయ్యెను. ఆకారణంబున నింద్రునకు యజ్ఞపురోడాశాది భాగంబు లందవయ్యెను. సురపతి యట్లు సర్వాహారదూరుఁడై కృశించుచు నందే వేయిసంవత్సరంబు లుండెను.

### నహుషుఁడు శచీదేవిని జెఱపట్టుట

ఇంద్రుఁడు స్వర్గలోకంబును వదలి చన్నంతనే నహుషుఁడు దాని నాక్రమించెను. అతఁడు విద్యాతపోయోగబలశాలి గావున వానికి నింద్ర పదవి వశమయ్యెను. అతఁ డట్లు స్వర్గాధిపతియైనంతనే వానిని నైశ్వర్య మదాంధత్వము పైకొనెను. నహుషుఁడు మైమఱచి ధర్మదృష్టిదప్పి యింద్రునిపత్నియైన శచీదేవిని జెఱపట్టెను. రాజా! అధర్మదోషంబు తప్పదు. నహుషుఁ డాదేవీనిమిత్తంబునఁ దిర్యగ్యోనిగతుఁడై యజగరంబుగా జనించెను.

### ఇంద్రుఁడు హయమేధయాగముఁ జేయుట

రాజా! ఇంద్రుఁ డట్లు మానససరోజలాంతరంబునఁ జింతాపరితప్తుఁడై క్రాఁగుచుండఁగాఁ గొండొకనాఁడు 'ఇంద్రాగచ్ఛ' అనుపిలుపు వాని చెవిఁబడెను. ఆపిలుపుతోడ నతఁడు భగవంతుని ధ్యానించెను. అంతలోన బ్రహ్మర్షు లటకు వచ్చి సురేంద్రుని హయమేధదీక్షితునిజేసి యథావిధి నయ్యజ్ఞంబును సాగించి యజ్ఞేశ్వరు నారాధించిరి. తత్ఫలంబుగా నింద్రుని బ్రహ్మహత్యాదోషంబు సూర్యాతపంబున మంచురీతి రూపుమాసెను. సురపతి యట్లు కృతార్థుఁడై స్వస్థానముఁజేరి యథాసుఖం బుండెను.

పరీక్షిన్నరేంద్రా! ఈ యుపాఖ్యానంబును బ్రతిపర్వమందు విన నోచువారు విముక్తపాపులై ధనసమృద్ధియుఁ గీర్తివృద్ధియు గలిగి శత్రుభయంబులేక యాయురారోగ్య క్షేమలాభంబులు పడయుదురు.

### దానవునకు భగవద్భక్తి గలుగుట యెట్లు?

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు వృత్రునిచరిత్ర విని శుకయోగిని జూచి 'మునీంద్రా! భూమిలోఁ బరమాణువు లెన్నిగలవో యన్ని

జంతువు లుండును. ఆజంతువులలో మనుష్యులసంఖ్య గోరంత యగును. ఆమనుష్యులలో నెవ్వరో కొందఱుమాత్రమే శ్రేయఃకాములగుదురు. అట్టివారిలో నేకొందఱో ముక్తిరూపపరమశ్రేయస్సును వరింతురు. మహాత్మా! ముక్తి యనునది కోరినంతనే యొడిలోఁ బడదు. ముముక్షువు పరమసత్త్వమూర్తియై సర్వాభిమానంబు వర్జించి యాత్మారాముఁడైన ప్పుడు ముక్తుఁడగును. కావుననే ముముక్షువులకోట్లలో నెవఁడో యొక్కఁడు ముక్తుఁ డగుచున్నాఁడు. అట్టిముక్తులకోట్లను వెదకివెదకి చూచితిమేని భాగవతుఁ డొక్కఁ డుండుట దుర్లభమగుచున్నది.'

'మహాత్మా! లోకవృత్తం బిట్లుండుట మీకుఁ దెలియనిదిగాదు. వృత్రునిసంగతి విచారింతము. వాఁడు రజఃప్రధానమైన దానవకులంబునఁ బుట్టెను. సర్వలోకంబులను వేధించెను. చేయరానిపాపంబులు చేసి మహాపాతకి యనఁబరఁగెను. అట్టివాఁడు ముక్తుఁ డగుట యెట్లు? మఱియు వానికి రణరంగంబులో భగవత్తత్త్వస్ఫురణంబును దద్భక్తియుఁ గలిగె నంటివి. భగవద్భక్తికి సత్త్వం బంతో యింతో యుండవలయునుగదా! సత్త్వంబున్నంతమాత్రాననే ఫలము లేదు. దానిని బ్రోదిచేయవలయును. సత్త్వము ప్రోదికొలఁది పెంపొంది శుద్ధసత్త్వముగాఁ బరిణమించి ముక్తి సాధనంబగు నందురు. వృత్రునిచర్యలంబట్టి చూడఁగా వానియందు సత్త్వం బుండుటకే యవకాశము దోఁపదు. ఈ నాసంశయంబును దీర్పు' మని వేఁడెను.

మునులారా! శుకమహర్షి యామాటలు విని 'రాజేంద్రా! నీకుఁ గలిగినసంశయమే తొల్లి నాకును గలిగెను. దానింగూర్చి నాతండ్రియైన వేదవ్యాసులను నారదమహర్షిని నిరువుర నడిగితిని. వారొక యితిహాసంబును జెప్పి నాసందేహంబును దీర్చిరి. దానిని నీకుఁ దెలిపెద విను' మని యిట్లు చెప్పెను.

### చిత్రకేతూపాఖ్యానము

రాజా! పూర్వము శూరసేనదేశంబును జిత్రకేతుండనురాజు పాలించుచుండెను. వానికి సర్వకామంబులను భూమియే పిదుకుచుండెను.

అతఁడు కోటిభార్యలను బెండ్లాడెను. పుత్రోత్పాదనసామర్థ్యము వానికిఁ జక్కఁగా నుండియు నొక్కభార్యయందేనియు గొడుకుపుట్టుతఁ డైనఁ గలుగకుండెను. ఆకారణంబున నతఁడు సర్వసంపదలు గలిగియు సంతానములేమికి లేనివాఁడుంబోలెఁ గృశింపసాగెను.

అట్లుండఁగా, బ్రహ్మర్షి యంగిరసుఁడు లోకసంచారముచేయుచుఁ గొండొకనాఁ డాకస్మికంబుగాఁ జిత్రకేతువునొద్దకు వచ్చెను. ఆతేఁడు యథావిధి నమ్ముని నర్చించి యుత్తమాసనంబున సుఖాసీనుని గావించి వినయవినమ్రుఁడై వానియెదుట నిలిచెను. అంగిరసుఁడు వాని నాదరించి 'రాజవర్యా! అనామయమేగదా! నీప్రజలు సుఖ ముందురుగదా! రాజా! జీవుఁడు మహదాదిసప్తప్రకృతిగుప్తుఁడై శుభంబుఁ గాంచునట్లు తేఁడు స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబులనెడి సప్తావరణం బులచేత గుప్తుఁడై ప్రకృతివశుఁడై మేలుపడయును. జీవపరిపాలితంబైన దేహంబట్లు రాజపరిపాలితంబైన రాష్ట్రంబు సుఖముండు. రాజా! అమాత్యులు మంత్రులు నీమాట మెలంగుదురుగదా? సామంతరాజులు నీకు హితవర్తులేగదా? పౌరజానపదులు నీయందు వాత్సల్యంబును గూర్తురుగదా? భార్యలు భర్తృభక్తివశలై నిన్నుఁ బ్రాణపదంబుగాఁ బూజింతురుగదా! పుత్రులు నీమాట దాఁటక నీకుఁ బ్రియంబుఁ గూర్తురు గదా?'

రాజా! ఎవఁడు తనమనస్సును స్వాధీనపఱచికొనునో వానికి లోకంబెల్ల వశమై వర్తించును. లోకమేగాదు లోకపాలురుగూడ నట్టివాని ననువర్తింతురు. నరేంద్రా! నీముఖచిహ్నంబులఁబట్టి నిన్ను నేదో యొకయతృప్తి కలంచుచున్నట్లు దోఁచుచున్నది. అది స్వకృత ఫలమా? పరకృతఫలమా?' యని యడిగెను.

చిత్రకేతుఁడు చేదోయి జోడించి 'ఋషిచంద్రమా! దివ్యజ్ఞాను లకు మీకు దేహధారుల బహిరంతర్వృత్తాంతంబులు స్పష్టంబులు. నా చింతాకారణంబు నెఱింగియు దానిని నానోటఁ బల్కఁజేయుచున్నారు.

జలాతురునకు ప్రక్చందనాదులు రుచింపనట్లు సంతానహీనునకు నాకు సామ్రాజ్యైశ్వర్యభోగంబులు లోకపాలకప్రార్థనీయంబులై నవయుష్య నింపుఁ గావింపవు. సంతానార్థము వగవనేల ? యని యందువా ? సంతానహీనత్వంబునంజేసి నేను నాపూర్వులకు నధోగతిఁ గలిగించినవాఁడనైతిని. తదర్థం బెంతయు వగతును. మహాత్మా ! నాకు సంతానంబు ననుగ్రహించి నన్నును నాపెద్దలను నరకపతనంబునుండి రక్షింపు' మని వేఁడెను. అంగిరసుఁడు వానికి నెంతయు జాలిపడి త్వష్టృయాగంబు గావించి యయ్యజ్ఞశేషంబును రాజుభార్యలలోఁ బెద్దదియు యోగ్యురాలునైన కృతద్యుతి యనుదానికి నొసంగి యాతని నామంత్రించి 'రాజా ! నీ కొక్కసుతుండు జనించును. వానివలన నీకు హర్షశోకంబులు రెండుఁ గలుగు' నని చెప్పి యథేచ్ఛఁ జనియెను.

### చిత్రకేతువునకుఁ బుత్త్రోదయము

రాజా ! ఆయజ్ఞచరుశేషంబును గృతద్యుతి మహాభక్తితో సేవించి, కృత్తిక యగ్నివలనంబోలెఁ జిత్రకేతువువలనఁ గొన్నాళ్లకుఁ జూలు దాల్చెను. ఆగర్భము శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధి నెనసెను. నెలలు నిండారెను. ఆమెకు నొక్కకుమారుఁ డుదయించి శూరసేనజనులకెల్లఁ బరమానందంబును గూర్చెను.

చిత్రకేతువును బుత్త్రప్రాప్తికి మహాసంతోషంబునొంది స్నానమాచరించి శుచియై యలంకరించికొని బ్రాహ్మణోత్తములను రావించి వారిచేతఁ బుత్త్రునకు స్వస్తివాచక జాతకర్మంబులు చేయించి యాశిశువునకు నాయుర్యశోధనంబులు గలుగుటకై బ్రాహ్మణులకు స్వర్ణాభరణ వస్త్రంబులను గజహయగ్రామంబులను షడర్బుదధేనువులను దానంబు లిచ్చి తదితరజన్నులకు సకలకామంబులను వర్షించెను.

రాజా! పేదకుఁ గష్టార్జితధనంబుపయిఁ బ్రేమ నానాఁటికి హెచ్చుచుండు తెఱఁగున రాజునకు నాబిడ్డపయి వలపు నానాఁటికి హెచ్చు పెరుఁగ

సాగెను. కృతద్యుతియు నబ్బిడుతను స్వమోహాకల్పఫలంబుగా గాంచుచు వానితోడిదే లోకంబుగా నుండెను.

## కృతద్యుతిసవతులసంతాపము

రాజా! కృతద్యుతి సంతానవతి యగుటంజేసి చిత్రకేతునృపుని ప్రీతి దానియందే మూర్తీభవించెను. ఆరహస్యంబును తక్కినభార్యలు గ్రహించి 'కటా! సంతానహీనలమగుటకుఁ దోడుగాఁ బతిప్రేమకుఁగూడ దూరమైతిమిగదా!' యని లోలోన దురపిల్లసాగిరి. వారిహృదయాంతరంబులు దుఃఖాగ్నికుండంబులయ్యెను. ఒక్కొక్కరుగావారుఁ దనయన పత్యతను దలంచికొని 'కటా! సంతానహీనురాలికి సుఖం బెక్కడిది? అట్టిదానిని దత్పతియు నిల్లాలుగాఁ దలంపఁడు. మఱియుఁ బుత్రవతియైన సవతి దానిని దనదాసిగాఁ జూచును. దాసి యనియుం జెప్పఁదగదు. ఏలయందువా? దాసి స్వామికి సేవచేసి వాని మెప్పుఁబడసి సుఖముండును. ఆభాగ్యంబుగూడఁ బుత్రహీనకుఁ గలుగదు. సవతిదాసికి దాసినై యూడిగంబుసేయునట్లు నానొసట వ్రాసియున్నది' అని స్వగతంబున నుమ్మలించుచు 'కటా! నా యీదుర్గతికి నబ్బిడుతగదా కారణం' బని తలంచుచు నప్పట్టిపయి నసూయాద్వేషంబులఁ బెంపసాగిరి.

## సవతులమత్సరము - కృతద్యుతిపుత్త్రునిచావు

రాజా! ఆసవతితల్లులు కొండొకనాఁడు రహస్యంబుగా మంతనంబులు సలిపిఁ చిత్రకేతువు సుతుఁడున్నంతకాలంబు తమకు గతులేక గలుగ వని నిశ్చయించి యాబిడ్డకు విషముఁ ద్రాపిరి. ఆపాపఁడు కొంతవడికిఁ బ్రాణంబులు దొఱంగెను. కృతద్యుతి యాకపటం బెఱుంగక తన పుత్త్రుఁడు గాఢనిద్రపోవుచున్నాఁడని తలంచి గృహకార్యతత్పరయై యుండెను. పెద్దయుం బ్రొద్దెక్కెను. బాలకుఁడు నిద్రలేవఁడయ్యెను. వానికిఁ బాలిచ్చుతఱిగూడ మించెను. కృతద్యుతి దాదిని బిలిచి 'దాదీ! ప్రొద్దయ్యెను, బిడ్డకుఁ బాలియ్యవలయును. ఆబుడుతను గొనిర' మ్మనెను.

దాది యంతట నుయ్యాలయొద్దకుఁబోయి శిశువునెత్తికొనివచ్చు టకై యుయ్యాలవంక వంగెను. ఆబుడుత గ్రుడ్లు మీఁదికి వైచియుం డెను. అదిచూచి దాది యచ్చెరువొంది వానిముక్కుదగ్గఱ వ్రేలుంచెను. ఊపిరి రాకపోకలు గానరావయ్యెను. అంతట దాది 'హా! ఇంకేమున్న' దని బిగ్గ నేడ్చుచు నేల రాలి రొమ్ము గుద్దుకొనసాగెను. ఆయేడుపు కృతద్యుతి విని పరువెత్తివచ్చి మృతపుత్రకుని జూచి నేలఁబడి పొరలి పొరలి శిఖయుఁ జీరయు వీడుటఁగూడ తెలియక యెలుగెత్తి యేడువ సాగెను. ఆరోదనంబులు విని యంతఃపురజనులు హాహాకారములు బరు గెత్తిరి. సవతులును గుంపులుగుంపులైవచ్చి తమతప్పును గప్పుటకుఁగా పగయేడ్పు లేడ్చిరి.

### చిత్రకేతుని పాటు

రాజా! ఆసంగతి చిత్రకేతునకుఁ దెలిపిరి. ఆమాటతోడ వాని చూపు దప్పెను. అతఁడు పడుచు లేచుచు మూర్ఛిల్లుచుఁ బ్రాకుచుఁ జని యాశిశుశవపాదంబుల వ్రాలెను. వాని కన్నీరు వెల్లువయయ్యెను; అతనికి నోట మాటరాదు. రాజు నంటి విప్రాదులువచ్చి సంగతి గ్రహించి యెచ్చటివా రచ్చటనే మ్రోడులై నిల్చిరి.

### కృతద్యుతివిలాపము

కృతద్యుతి నిజనేత్రకుంకుమపంకిలంబైన కన్నీటఁ దోఁగుచు విల పించి విలపించి 'హా! ధాతా! సృష్టికర్తవని నిన్నందురు. వృద్ధులు జీవించియుండఁగానే వానిబిడ్డలకుఁ జావుఁగూర్చిన నిన్నే మనవలయును? నీకంటె బాలిశుఁ డుండునా? నీ యీనేత లోకగర్హితంబని గ్రహింప వా? జననమరణంబులు వారివారికర్మాధీనంబులని సమాధానముఁ జెప్పుదువా? అట్లగునేని జీవసర్గంబెల్లఁ గర్మాధీనము కాకతప్పదు. ఆ పక్షంబున నీపనియేమి? కర్మఫలప్రదుండ నందువా? కర్మఫలంబులకు రాగద్వేషంబులు కారణంబులగును. రాగద్వేషంబులకు రజోగుణంబు మూలంబగును. రజోగుణవృద్ధితోడ రాగద్వేషంబులవ్యవహారంబులు

గలుగుచుండు. ఆవ్యవహారంబులే కర్మంబు లనఁబడును. కర్మములకు ఫలంబు పుట్టకమానదు. కాఁబట్టి కర్మఫలంబుగూడ స్వతంత్రసిద్ధమేగాని నీకల్పితము గానేరదు. కర్మఫలంబు స్వాతంత్రికమైనను దదనుభవకాలంబును జీవరాశికి విధింతు నందువా ? బురదఁ ద్రొక్కనేల ? కాలు గడుగ నేల ? రజోజనితరాగాదిపాశంబులను ద్రెంచివైవుము. నీక్లేశము తీఱును. ప్రజాసర్గంబును వర్ధిల్లి సుఖపడుము ?' అని బ్రహ్మను దూఱినాఁడి, మ్రోలనున్న పుత్రశవంబును జూచి 'తండ్రీ ! దిక్కులేనినన్నును శోకవివశుఁడైనతండ్రిని వదల నీకుఁ దగునా ? నీవలన మే మిరువురము ననపత్యరూపదుస్తరఘోరనరకంబును నిస్తరింపఁ బెన్నాసతో నుంటిమి. నిర్దయుఁడవై మమ్ము న య్యమునకు నర్పింపవలదు. వత్సా ! లేలెమ్ము. కన్నెత్తిచూడుము. వీరుగో నీతోడిబాలకులు క్రీడల్కై నిన్నుఁ బిలుచుచున్నారు. ఇంతసేపు పరుండవచ్చునా ? ఆఁకొంటివి; లేచి చన్నుకుడువుము. నాయనా ! నీముద్దుమొగంబు విన్ననయ్యెను. కారణమేమి ? ముద్దుపలు కొక్కటేనియుఁ బలుకవేల ? కటికిదైవము నిన్ను లోకాంతరంబునకుఁ గొనిపోవుటంజేసి నీపల్కు లింతదూరము వినరావా ?' యని పలువిధంబుల వాపోవఁజొచ్చెను.

## నారదాంగిరోమునుల సమాగమము

రాజా ? చిత్రకేతు వట్లు దుఃఖవివశుఁడై పుత్రశవముమ్రోల శవాకారంబుగాఁ బడెను. వానిని జుట్టి తదీయులెల్లరుఁ బరమార్తరోదనంబులు గావింపసాగిరి. అత్తఱి నంగిరసుఁడు నారదద్వితీయుఁడై యటకు వచ్చి యిట్లనియెను.

'రాజేంద్రా ! ఎవ్వనికై శోకింతువు ? నీశోకించువాఁడు నీకేమి కావలయును ? నీవు వాని కేమికావలయుదు ? అతఁడు నీకుఁ బుత్రుఁడును నీవు వానికిఁ దండ్రివియు నందువా ? ఈపితృపుత్రభావంబు మీయిరువురకు నిజ్జన్మంబునఁ గలిగెనా? తత్పూర్వముగూడఁ గలదా? ఉత్తర

జన్మంబున నుండునా ? జన్మాంతరంబులందు మీ రెట్లెట్లు వర్తించితిరో. ముం దెట్లు వర్తింతురో చెప్పఁగలవా ?'

'రాజా ! పాఱుచున్ననదిలోఁ బడినకట్టెలకువలెఁ గాలప్రవాహ గతదేహులకు సంయోగవియోగంబులు గలుగుచుండును. ఈసంబంధ వియోగంబులకుఁ గారణ మేమందువా ? బీజములలో బీజాంతరంబులు పుట్టుటయుఁ గిట్టుటయుఁ బుట్టకయే యుండుటయు నెట్లో యట్లే భూతం బులకుఁ బుట్టుచావులును బుట్టుకయే లేకుండుటయు సర్వముఁ బరమేశ్వర మాయావిలాసంబున జరుగుచుండును. మేముగాని నీవుగాని యీ చరా చరసమస్తభూతంబులుగాని యుత్పత్తికిఁ బూర్వము గలుగముగదా! వినాశానంతరంబున నుండముగదా ? ఈ రెంటి మధ్యకాలమందుఁగూడ మనస్థితి యట్టిదే యని గ్రహింపుము.'

'రాజా ! ఉత్పత్తిలయంబులు దేనికి ? ఇవి దేహంబులకేగాని తద్దేహాంతర్గతునకుఁ గలుగవు. కారణ మేమందువా ? అతఁడు నిత్యుఁడు కావున వానికిఁ జావుపుట్టువలు గలుగవు. అతఁడు పూర్ణసన్మాత్రవస్తువు గావున వానికి జాతివిభాగంబుగాని వ్యక్తివిభాగంబుగాని గలుగదు.'

'దేహవిభాగం బెట్లు కలుగుచున్న దందువా ? కొయ్య కాలు నప్పుడు తదగ్నియందు దీర్ఘహ్రస్వస్థూలకృశత్వాదులను గాంతుము గదా! అవి దారుధర్మములా ? అగ్నిధర్మంబులా ? సర్వావస్థలందు నగ్ని తత్త్వం బేకరూపంబుగానే యుండును. మండుచున్నయగ్నియందుఁ గాన వచ్చునట్టి చిన్న పెద్ద మున్నగునవస్థ లెల్ల దారుగతంబులగును. అట్లే దేహభేదంబులుగూడ తద్భేదమూలకారణంబైన ప్రారబ్ధకర్మభేదంబునఁ గలుగుచున్నవి. మంటలలోఁ జిన్న పెద్ద కానవచ్చినను మంటలోని వహ్నియొక్కతత్త్వంబునకు నెట్లు భేదము గలుగదో, యట్లే దేహంబు లకుఁ బ్రారబ్ధవశంబున జన్మనాశవృద్ధిక్షయాదులు గలుగుచున్నను దద్దే హంబులందు నంతర్గతుఁడై సాక్షిమాత్రంబుగా నుండునట్టి యాత్మునకుఁ గలుగవు.

'రాజా! దేహసంబంధంబులను ఆత్మసంబంధంబులుగా భావించుటకుఁ గారణ మేమందువా? దేహాభిమానమే కారణము. ఈయభిమానంబును అహంకారమందురు. అహంకారమనఁగా 'నేను' అనుభావము. అహంకారఫల మేమందువా? 'నాది' అనుభావము గలుగుటయే దాని ఫలము. ఈభావంబును మమకారమందురు. మమకారఫలంబుగా సంసారము గలుగుచున్నది. సంసారమనఁగా జననమరణరూపప్రవాహంబని గ్రహింపుము. అది గలుగుట యెట్లందువా? ఎప్పుడు 'నాది' అనుభావంబుదయించునో యప్పు డావస్తువును స్వాధీనంబునం దుంచుకొనుటయు దానిని భోగించుటయుఁ దప్పక గలుగును. ఆభోగంబునకై పెక్కుజన్మంబులు గావలసివచ్చును. ఫలభోగాంతమందుఁ దద్దేహముపతన మగును. దానినే మరణమందురు. ఫలభోగకాలమందుఁ దత్ఫలవాసనాప్రేరితులై తద్విధకర్మంబు లాచరింతురు. ఆకర్మంబులకు ఫలంబు తప్పదు. తత్ఫలభోగార్థము తదనురూపదేహధారణము విధి యగుచున్నది. ఇది యొక నాఁటికిని దీఱదు. ఈవిధానంబునే సంసార మందురు.'

"ఈసంసృతి తప్పుట యెట్లందువా? 'నాది' అనుభావంబు నశించినచో, అనఁగా మమకారము నశించినచో సంసృతి నశించును. మమకారము నశించుట యెట్లందువా? 'నేను' అనుభావంబు అనఁగా 'అహంకారము నశించినచో మమకారంబు తనంతట తానే నశించుచున్నది. ఇందులకు నిదర్శనం బేమందువా? గాఢనిద్రావస్థయే నిదర్శనంబు. ఎట్లందువా? గాఢనిద్రలో జీవుఁ డున్నను నీ కెట్టిప్రపంచజ్ఞానమే గలుగుటలేదుగదా? కారణమేమి? 'నేను' అనెడిబుద్ధివృత్తి యప్పుడు వ్యవహరించుటలేదు గావున నీకుఁ బ్రపంచజ్ఞానంబు గలుగుటలేదు. ఇది తార్కాణంబుగాఁ దత్త్వసారంబును గ్రహించి స్వస్థచిత్తుఁడ వగుము. రాజా! రెండవది గలదని తోఁచినప్పుడే భయాదులు జనించును. లాఁతి లేనప్పుడు భయాదులు గలుగవు. కావున ద్వితీయతత్త్వభావంబును మఱచి సర్వము ఏకమే యనియు, అద్వైతైకపదార్థమే భగవానుఁడనియు విశ్వసించి వానియందుఁ జిత్తంబును గూర్పుము."

రాజా! చిత్రకేతువు తద్వచనంబులు విని సుంత యుపశాంతిఁ బడసి 'మహాత్ములారా! మీ రెవరు? మీ యవధూతవేషంబులనుబట్టి మిమ్ము నూహింపరాకున్నది. సనత్కుమారుఁడు, నారదుఁడు, ఋభుఁడు, అంగిరసుఁడు, అసితుఁడు, దేవలుఁడు, ప్రకృతవేదవ్యాసుఁడు, మార్కండేయుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, పరశురాముఁడు, కపిలుఁడు, శుకుఁడు, దుర్వాసుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, జాతూకర్ణి, ఆరుణి, రోమశుఁడు, చ్యవనుఁడు, దత్తాత్రేయుఁడు, ఆసురి, పతంజలి, పరాశరుఁడు, మైత్రేయుఁడు, భరద్వాజుఁడు, వారుణి, దేవశిరసుఁడు, బోధ్యుఁడు, పంచశిఖుఁడు, హిరణ్యనాభుఁడు, కౌసల్యుఁడు, శ్రుతదేవుఁడు, ఋతధ్వజుఁడు మున్నగాఁగల సిద్ధేశ్వరులు నావంటి గ్రామ్యమతులకు బుద్ధిఁగఱపుటకై భూసంచారం బొనర్తురని విందు. వారిలో మీ రెవ్వరో తెలియదు. ఏవరైన నేమి? గాఢతమంబునఁ బడియున్న యీమూఢబుద్ధికి జ్ఞానదీపంబు ననుగ్రహింపు' మని వేఁడెను.

రాజా! అంగిరసుఁ డామాట విని 'రాజా! పుత్రకాముఁడవైన నీకుఁ బుత్రు నెవ్వఁ డిచ్చెనో యాయంగిరసునిగా నన్నెఱుంగుము. ఈతఁడు బ్రహ్మనందనుఁడు నారదమునీంద్రుఁడు, ఏల వచ్చితి రందువా? భాగవతు లెన్నడును వగపాలుగా రాదు. భాగవతుఁడవు గావున నిన్నుద్ధరించుటకై వచ్చితిమి. నృపాలా! పుత్రవంతులకు నెంత సంతాపంబు గల్గునో యనుభవ మయ్యెఁగదా! అట్లే భార్యాగృహాధనంబులును, వివిధైశ్వర్యసంపదలును, శబ్దాదివిషయంబులును, భోగంబులును, ధాత్రీబలకోశభృత్యామాత్యసుహృదాదులును వేయేల? ప్రాపంచికపదార్థంబులెల్ల శోకమోహాభయప్రదంబులగును. అవియు నిత్యంబులాయన్నచో గంధర్వనగరస్వప్నమాయామనోరథతుల్యంబు లగును. వాని కార్య మేమందువా? అవి మనోవిజృంభణంబును గలిగించును. తత్ఫలంబుగా వానినిఁ బడయుకోర్కెలును, కోర్కెలు దీఱుటకై ప్రయత్నంబులును గలుగును. ఆప్రయత్నంబులనే కర్మంబు లందురు.

కర్మంబులకు ఫలంబు తప్పదు. ఫలభోగాదివిషయంబులనుగూర్చి తెలిపితిని. కాఁబట్టి అధిభూతాధిదైవాధ్యాత్మికరూపంబును అభిమానికి బహువిధతాపకారణంబునైన యీదేహంబునయి మమకారంబును వదలి వ్యాకులంబును మాని యాత్మతత్త్వంబును విమర్శించి ద్వైతం బనిత్యం బగుట గ్రహించి యుపశాంతి నొందుము. ఇంతటనేనియు నీయభినివేశంబును దొలఁగించుకొననేరక పుత్రునే గోరుదువేని వానిని నీకు మఱల నిచ్చెదఁ గొనుము.' అని బోధించెను.

నారదుఁడు చిత్రకేతువునకు నుపదేశించుట

రాజా! అంతలోన నారదమహర్షి వానిమాట నందుకొని 'భూపాలా! నీ కొకదివ్యమంత్రంబు నుపదేశింప నున్నాను. శుచివై దానిని గ్రహింపుము. ఆవిద్యాప్రభావంబున నీకు సప్తరాత్రులలో సంకర్షణసందర్శనంబగు. ఏదేవదేవుని పాదమూలంబు నాశ్రయించి శర్వాదులైన తొల్లిఁటి పెద్దలు సంసృతిభ్రమణరూపద్వైతంబులనెల్లఁ బాసి యాపరమపూరుషునిఁ బ్రాపించిరో యామహాత్ముని నచిరంబ నీవు పొందుదువు.' అని చెప్పి, యందు శోకించుచున్నవారికిఁ జచ్చిపడి యున్న ఆపట్టిశవంబును జూపి, యాశవమువంక మఱలి 'జీవాత్మా! శుభమగుఁగాక! నీతల్లిని దండ్రిని గన్నెత్తి చూడుము. నీకై గోడు గోడు మనుచున్న సుహృద్బంధుజనంబు నోదార్పుము. నీకుఁ గాల మృత్యువు గలుగలేదు; అపమృత్యువు దాపరించెను. కాఁబట్టి యాయుష్కాలంబు నీకు శేషించియున్నది. నీవు నీకళేబరంబును జొచ్చి జీవితుఁడవై రాజ్యపీఠ మెక్కి తండ్రిగూర్చినభోగంబుల ననుభవింపు' మనెను.

రాజపుత్రకుని ప్రత్యుత్తరము

పరీక్షిన్నరేంద్రా! ఆమాటతోడ మృతుఁడు కన్ను విచ్చి 'బ్రహ్మర్షివర్యా! కర్మవశంబునంజేసి జీవులు దేవతిర్యఙ్నరదేహంబులను ధరించి

పరిభ్రమించుచుందురు. అట్లు సంసారచక్రంబునఁ బడి వివిధదేహంబులతోఁ ద్రిమ్మరువారికిఁ గాలభేదంబునుబట్టి తత్తజ్జన్మంబులందు బంధుజ్ఞాతులు, శత్రుమిత్రులు, మధ్యస్థద్వేష్యులు నుదాసీనులుఁ గలుగుచుందురు. సువర్ణాదిపదార్థంబులు బేహారులయొద్ద నొకచేతినుండి మఱియొకచేతికి మాఱుచుండునట్లుగా, జీవుఁడు కర్మవశుఁడై యొకయోనినుండి మఱి యొకయోనిఁ బడయుచుఁ దిరుగాడుచుండును. సువర్ణంబునకుఁ బురుష పురుషాంతర సంబంధం బెట్లు తాత్కాలికమో యట్లే నిత్యపదార్థమైన జీవునకును దేహదేహాంతరసంబంధము తాత్కాలికమగును. ఆసంబంధ మెవ్వనికి నెప్పుడేనియు సార్వకాలికము గానేరదు. ఆసంబంధం బెంత కాల ముండునో యంతకాలంబువఱకే యాపదార్థంబులయెడ మమతాభి మానంబు లుండును. దేహత్యాగముతోడ సర్వసంబంధంబులును, తత్సంబంధకారణమైన మమకారంబును దత్కారణమైన యహంకారం బును నశించుచున్నది. దేహంబును ధరించినజీవునకే తద్దేహంబుపయి మమ కారము లేనినాఁడు శవరూపమైన యాదేహంబునకై మీరు శోకించుట యేల ?'

'జీవుఁడు పరమాత్మకన్న వేఱుఁ గాఁడు. ఆజీవుఁడు స్వశక్తి యొక్క గుణంబులచేత విశ్వసృష్టిఁ గావించుచున్నాఁడు. వానికిఁ బ్రియాప్రియులుగాని తనవారు లాఁతివారుగాని గలుగరు. అతఁ డద్వితీయుఁడు; సంగరహితుఁడు. జనుల గుణదోషంబులు వారివారిబుద్ధి గతములు; బుద్ధులంబట్టి క్రియాఫలంబులు గలుగుచుండును. అవి జీవునకుఁ దగులవు. అతఁడు దేహాంతరమందు సాక్షిమాత్రుఁడై కార్య కారణంబుల రెంటినిఁ జూచుచు భోక్తయుఁ బరతంత్రుఁడును గాక యుదాసీనుఁడ ట్లుండును' అని పలికి యాజీవుఁడు చనియెను.

అందున్న వారెల్లరుఁ దద్వచనంబులు విని విస్మయమంది తత్త్వరహ స్యంబు గ్రహించి భ్రాంతిఁబాసి స్నేహపాశంబులఁ ద్రెంచి శోకంబు నడఁచివైచి యారాజపుత్రునికళేబరంబునకు నుచితసంస్కారక్రియలు

జరిపిరి. ఆబాలుని జంపినసవతులు తద్వధాపాతకంబునం జేసి తేజంబుఁ బాసిరి; సిగ్గు వారిని బైకొనెను; వారిముఖంబులు మనోవ్యథావ్యాకులంబులై యుయ్యెల లూగసాగెను. వారు తమపాపపరిహారార్థము బ్రాహ్మణనిరూపితవిధంబున యమునాజలంబులందు బాలహత్యావ్రతంబు సలిపిరి.

రాజా! చిత్రకేతుఁ డట్లు మహాత్ములవలనఁ దత్త్వప్రబోధితుఁడై బురదపడియనుండి మత్తేభంబట్లు గృహాంధకూపంబునుండి వెలువడి యమునాజలంబులఁ గృతస్నాతుఁడై పితృతర్పణాదులు గావించి యా మునీంద్రులకుఁ బ్రణమిల్లెను. అట్లు ప్రపన్నుఁడైన చిత్రకేతునకు నారదుఁడు సంకర్షణవిద్య నుపదేశించి యంగిరస్సహితుఁడై బ్రహ్మలోకంబునకుఁ జనియెను.

చిత్రకేతువునకు సంకర్షణ దర్శనంబగుట

రాజా! చిత్రకేతువు నారదోపదేశప్రకారము సమాహితచిత్తుఁడై జలాహారమాత్రుఁడుగానుండి యామంత్రంబును సప్తరాత్రంబులు జపించెను. వానికి దద్విద్యాప్రభావంబున నేడవనాఁటి రేయి వేఁకువ కాలంబున విద్యాధరపతిపదవి గలిగెను. తర్వాతఁ గొన్నాళ్లకు వానికి నొకదివ్యమూర్తి సందర్శనం బయ్యెను. శ్వేతశరీరుండును నీలాంబరధారియుఁ గిరీటకేయూరాది భూషణప్రకాశుండు నై సిద్ధేశ్వరులు గొలుచుచుండఁగా రక్తనయనకాంతుల దెసలు గప్పుచుఁ దోఁచిన యామూర్తిని గాంచినంతనే చిత్రకేతునిపాపంబు లెల్ల నశించెను. వాని యంతఃకరణంబు నిర్మలమయ్యెను. అతఁడు సంతోషపులకితశరీరుఁడై యామహాత్ముని నానందబాష్పంబుల నభిషేకించుచున్నాఁడో యనఁ దోఁచుచు నోట మాటరాక కొంతవడి యుండి యెట్టకేలకుఁ గుదుటఁజెంది యిట్లు స్తుతించెను.

చిత్రకేతుకృతసంకీర్తనస్తుతి

'దేవా! చిరాత్ములును సమబుద్ధులు నైన సాధువులకుఁదక్క నన్యులకు నీవు సాధ్యుండవుగావు. మరియు నిష్కాములన్ననో వారు ని

న్నేమియుఁ గోరమింజేసి జితోస్మి యనుచు నీవు నీకై వారికి సమర్పించికొందువు.

స్వామీ! విశ్వసృష్టిలయాదులెల్ల నీలీలామాత్రంబులుగాని వేఱుగావు. సృష్టికర్తలు బ్రహ్మాదులు గలరందువా? వారెల్లరు నీ యంశాంశమాత్రు లగుదురు. మే మధికులము మే మధికులమని వారు పరస్పరస్పర్ధ చేయుట యేలయందువా? అభిమానవివశత్వంబు వారి నట్లాడించుచున్నది.

దేవా! ఆదిమధ్యాంతంబులు నీకుఁ గలవు. నీయునికియన్నో యిట్టిదనరాదు. మహాస్థూలపదార్థంబు మొదలు పరమాణువువఱకు నీవు లేనిపదార్థమే గలుగదు. నీయాకారం బెట్టిదన్నో యది యిట్టిదనిఁ జెప్పఁ దరముగాదు. ఏలయందువా? భూమ్యాదులు దశగుణోత్తరంబులైనవి యొన్నో కలసి యొకయండం బగును. అట్టియండంబులు కోట్లకుఁ గోట్లు కలసి యొకబ్రహ్మాండం బగును. అట్టి బ్రహ్మాండంబు నీ యుదరాంతంబునఁ బరమాణుప్రాయమై యుండును. ఇట్టి నీయొక్క విస్తృతి యిట్టిదని చెప్పశక్యమా? కావుననేగదా యనంతుఁడని నిన్నుఁ బేర్కొందురు.

స్వామీ! ఇంతటిమహానుభావుండవైనను నిన్నెల్లరు నుపాసించుటలేదు. కారణ మేమందువా? విషయతృష్ణాపరత్వం బొక్కటే కారణము. అది యెట్లందువా? నీవు నీశక్తిని నంశాంశంబు లొనర్చి యొక్కొక్కయంశంబునకు నొక్కొక్కయధికారం బిచ్చితివి. ఆయధికారులను దేవతలందురు. వారు పాలించునట్టి విషయంబులు క్షణికమాత్రంబులైనను సులభప్రదంబులగును. విషయతృష్ణాపరులు సద్యోఫలంబులనుగోరి తత్తత్ఫలాధికారులైనదేవతలను గొల్తురు. దానంజేసి వారిదృష్టి నీవంకఁ దిరుగదు.

ఇంద్రాదిదేవత లిచ్చుఫలంబు క్షణికమాత్రంబనుట యెట్లందువా? రాజు నాశ్రయించి పడసినఫలంబు తద్రాజకులంబున్నంతవఱకే నిల్చి

యుండును. ఆరాజకులంబు నశించినంతనే వారిచ్చినసంపదలుగూడ తొలఁగుచున్నది. ఇది లోకానుభవసిద్ధము. ఇంద్రాదిదేవతలుగూడఁ దాత్కాలికాధికారిమాత్రులు. వారికినిఁ గాలనియతి గలదు. దానం జేసి వారిచ్చునట్టిఫలంబులుగూడఁ దాత్కాలికమాత్రంబులై నశించుచున్నవి.

దేవా! ఆమందమతులే సకామమతితోనే నిన్నే సేవింతురేనిఁ, గృతార్థులగుదురు. అది యెట్లందువా? వస్తుశక్తి యెన్నడును బుద్ధినాశ్రయింపదు. ఆశక్తి దాని స్వభావానుగుణంబుగా ఫలంబు నిచ్చును. నీవు నిర్గుణుండవు. నిన్నాశ్రయించినప్పు డాశ్రితుల కామబీజంబులు గుణరహితంబులై వేఁచినగింజలువలె మొలకలెత్తక నశించును. వారు కాలక్రమంబునఁ గృతార్థు లగుదురు. ఇఁక నాత్మారాములై నిన్ను సేవించునట్టి సనత్కుమారాదులసంగతి చెప్పనేల?

దేవా! బుద్ధివృత్తి యేకరూపమైనను పదాశ్రితవస్తుధర్మంబును బట్టిఫలభేదము గల్గుటెట్లందువా? నీ ధర్మంబైన భాగవతధర్మంబునకును దదితరకామధర్మంబులకు నెంతో భేదము గలదు. భాగవతధర్మంబు రాగద్వేషరహితంబు; కామధర్మంబు రాగద్వేషయుక్తంబు. నీధర్మంబునకు అహింస మొట్టమొదటిసూత్రంబగు; కామధర్మంబునకు హింసాదులూతకఱ్ఱలగును. నీధర్మార్జితంబు శాశ్వతంబు; కామధర్మార్జితంబు నశ్వరము. నీధర్మమందు బుద్ధి యేకాగ్రమై యుండును. కామధర్మమందు నేను నాది, నీవు నీది అనెడిభావంబులు బుద్ధి నలమి దానినిఁ బలువంకలకు లాగుచుండుటంజేసి యది యవ్యవసాయత్మికమై నిలుకడ లేకుండును. ఏకాగ్రబుద్ధికి నీవుదక్క వేఱొండు దోఁపదు. ఆకారణంబున నహంకారమమకారాదులకుఁ దావు గలుగదు. అవ్యవసాయాత్మికబుద్ధి యహంకారమమకారవశమై పరపదార్థంబులకుఁ బ్రాఁకులాడుచు లాఁతులకుఁ జేటుగలిగించుటయేగాక తుట్టతుదకుఁ దానుగూడఁ జేటొందుచున్నది. ఏకాగ్రబుద్ధి నీధర్మపూతంబగుటంజేసి తాను

మేలందుచుఁ బరులకుఁగూడ మేలు గూర్చును. నీధర్మపరులు నీయను గ్రహంబునకుఁ బాత్రు లగుదురు. కామధర్మపరు లాత్మద్రోహులై నీయాగ్రహంబునకు గుఱి యగుదురు. దేవా! నీధర్మపరులవెంట నీ వెప్పుడు నుందువు. కామధర్మపరులకుఁ గోటిజన్మంబులకేనియు నీదర్శనంబు లభింపదు. నీధర్మపరులకుఁ దద్ధర్మపరిత్యాగం బెన్నండును గలుగదు. కామధర్మపరులకు నెప్పుడే నొకప్పుడు తద్ధర్మచ్యుతి గలుగును. కామ ధర్మంబు బహుధనక్లేశ సాధ్యంబగును. నీధర్మంబునకుఁగా సంతద్రవ్య వ్యయముగాని గోరంతక్లేశముగాని గలుగవు. నీపే రొక్కసారి విన్నను బల్కినను జాలు. కామధర్మంబులకు నీతినియమంబులును జాతిలింగ భేదంబులును గలవు. ధర్మాచరణమం దేమాత్రము లోపము గలిగినను వాంఛితఫలంబు దూరమగుటయేగాక విపరీతఫలంబుగూడఁ గలుగును. నీధర్మంబునకు మనోనియతిదక్క వేఱొండక్కఱలేదు. చండాలుఁడేనియు నీధర్మంబు నాచరింపవచ్చును. ఎవ రెంతసేయుదురో యంతఫలము గలుగును. విపరీతఫలము కలలోఁగూడ సంభవింపదు.'

'దేవా! నీసందర్శనభాగ్యంబునంజేసి మాకుఁ బరమచిత్తశుద్ధి దొడరెను. మేము కృతార్థులమైతిమి. ఈమహాభాగ్యము నీవాఁడైన నారదమహర్షి యొక్క కృపావిశేషము. నీవారిమాటకు నెన్నఁడేనియు వమ్ముగల్గునా? దేవా! నీవు జగదాత్ముఁడవు గావునఁ జరాచరసమస్త భూతహృదయాంతరభావంబులు నీకుస్పష్టము. మాభావంబులను వేఱుగా విన్నవింప నక్కఱలేదు. ఎవ్వనిసంకల్పశక్తిం జేసి విశ్వసర్గకారకులుగూడఁ జేష్టావంతులై వ్యవహరింతురో, ఎవ్వని వీక్షణభాగ్యంబునొంది జ్ఞానేంద్రియంబులు జ్ఞానవంతంబులై స్వధర్మంబులను నిర్వర్తించునో, ఎవ్వనిఫణాగ్రమందు నావగింజవలె భూమండలంబు దోఁచునో యాసహస్రశీర్షునకు సంకర్షణమూర్తికిఁ బునఃపునః ప్రణామంబులు.'

### చిత్రకేతువునకు సంకర్షణోపదేశము

పరీక్షిన్నరేంద్రా! ఆశేషమూర్తి చిత్రకేతువునకుఁ బ్రీతుఁడై 'విద్యాధరేంద్రా! నారదాంగిరసులు నీకు నుపదేశించిన యనుశాసన

విద్యాఫలంబుగా నీవు నాదర్శనభాగ్యంబుఁ గంటివి. సిద్ధుండ వైతివి. నేను భూతాత్ముండను భూతభావనుండనై యుందు. సర్వభూతంబులు నేనే యగుదు. నాకు రెండుమూర్తులు గలవు. శబ్దబ్రహ్మము, పరబ్రహ్మము అని వానినిఁ జెప్పుదురు. అవి రెండును శాశ్వతంబులు. నేను భోగ్యప్రపంచమందు ననుగతుండనై భోక్తృరూపంబున నుందు నని కొందఱును, ప్రపంచంబెల్ల భోగ్యరూపంబున నాయందు వ్యాపించి యుందునని కొందఱును, అన్నింటికిఁ గారణాత్మకుండనై భోగ్య భోక్తృ రూపంబులను రెండింటియందు వ్యాపించియుందునని కొందఱును బల్కుదురు.'

ఈభేదంబులెల్ల నాయెడఁ గల్పితంబులేగాని వాస్తవములు గావు. ఈభేదదృష్టికిఁ గారణం బేమందువా? బుద్ధియొక్క అవస్థాభేదమే కారణము. అది యెట్లందువా? స్వప్నమందు వివిధాంశంబులను జూతురు. మేల్కాంచినప్పు డవి యెవ్వియుఁ గానవచ్చుటలేదుగదా! కావునఁ బదార్థం బొక్కటయ్యు నవస్థాభేదంబునఁజేసి దర్శనభేదము గలుగు చున్నది. బుద్ధియొక్క అవస్థాభేదంబు లెవ్వి యని యడుగుదువా? జాగరణము, స్వప్నము, సుషుప్తి - ఈమూఁడు బుద్ధియొక్క అవస్థా భేదంబులగును. అవి యాత్మమాయామాత్రంబులు. ఈరహస్యంబును గ్రహించి యీయవస్థలలో బుద్ధికి గోచరించువానిని వదలి యీమూఁ డవస్థలకుఁ బరమందున్నట్టి సర్వసాక్షిని బరాత్మునిఁ జింతించుట మేలగు.

పరమాత్మ నెఱుంగుట యెట్లందువా? నిద్రాకాలంబున నాత్మ భూతుండై స్వాపరూపంబున నింద్రియసుఖంబు నెవఁ డనుభవించు చున్నాఁడో వానినే పరమాత్మునిగా నెఱుంగుము. నిద్రాకాలంబున జ్ఞాన మెక్కడిది దని యందువా? గాఢనిద్రనుండి లేచినప్పుడు నేను హాయిగా నిద్రించినాను; ఇప్పుడు మేల్కొన్నాను అనుట లోకసహజమే గదా. ఇది జ్ఞానముగాదా? ఈనిద్రాజాగరణావస్థల రెంటి నంటి యేదే వొకటి యుండి యారెంటి నెఱుంగుచునుండనిచో యట్లు చెప్పుటకే

యవకాశము లేదు. మఱియు నిద్రాజాగరణావస్థలకు భేదముగూడ నేర్పడదు. అట్లు తెలిసికొనుచున్న శక్తియే పరబ్రహ్మంబని గ్రహింపుము.

ఆతత్త్వంబును గ్రహించుట యెట్లందువా ? పరబ్రహ్మము జ్ఞాన స్వరూపము. జ్ఞానమనఁగాఁ బ్రకాశము. ఎప్పు డాప్రకాశము సోఁకునో యప్పుడే బుద్ధియు మాలిన్యరహితమై స్వచ్ఛతనొందును. అట్టి స్వచ్ఛ బుద్ధియందుఁ దత్ప్రకాశము శుద్ధదర్పణంబున సూర్యప్రకాశంబువలెఁ బ్రతిబింబించును. ఆబింబదర్శనానుభవమే యాత్మానుభవం బనఁబడును. బుద్ధీంద్రియంబు జడంబనియు, జడంబునకు జ్ఞానశక్తి యెక్కడిదనియు శంకింతువా ? సూదంటురాయి సంబంధముగన్న లోహశకలము దాను గూడఁ దచ్ఛక్తినిఁ బడయుటఁ జూడవా? అట్లే జ్ఞానశక్తిచేతఁ బ్రకాశిత మైనబుద్ధిగూడ జ్ఞానవంత మగుచున్నది.

విద్యాధరేశ్వరా! జ్ఞానమనఁగా 'ఇది యిట్టిదని తెలిసికొనుట' యని భావము. అట్టి జ్ఞానంబుచేత వ్యక్తమైనవస్తువు ననుభవించుటవలనఁ గలుగునట్టి ఫలము విజ్ఞానం బనఁబడును. ఈరెండును మనుష్యజన్మంబు నకుమాత్రమే లభించును. అట్టి మానవజన్మం బెత్తియు నాత్ముని దెలి యనివాఁడు మఱియెందుగాని, యెప్పుడుగాని శుభంబును బడయఁడు. ఆదురదృష్టుఁడు జననమరణప్రవాహరూపసంసారమందుఁ బడి దరిగానక పరిభ్రమించుచుండును.

జన్మము ప్రారబ్ధఫలభోగార్థంబు గలుగుననియు, జన్మముగలిగిన ప్పుడు ఫలభోగం బనుభవించుటయు, తత్ఫలవాసనాప్రేరితుఁడై తద్విధ కర్మంబుఁ జేయుటయు నేర్పడుచున్నదనియు, అది తప్పుట యెట్లనియుఁ బ్రశ్నింతువా ? ఇంద్రియవ్యాపారంబులు కర్మంబు లనఁబడును. ఇంద్రి యంబు లన్ననో మనఃప్రేరితములై వర్తించుచున్నవి. మనస్సున్నంత కాలము కోరికలు తప్పవు. కోరికలను గోరుట యేల ? ప్రీతికొఱకేగదా! ప్రీతి నిచ్చునట్టివస్తువులలో నుత్తమోత్తమమైనదాని నొక్కసారి మనస్సు ననుభవింపఁజేసినచో, నయ్యది దాని నెప్పుడు వదలదు. ఎప్పుడు మన

స్సట్లగునో దానిప్రేరేపణము స్తంభించును. ఇంద్రియంబులు పరప్రేరణ రహితంబులై స్వభావానుసారంబుగా వర్తించును. అప్పుడింద్రియవ్యాపారము కామరహితం బగుటంజేసి తత్కర్మంబు నిష్కామకర్మంబగును. నిష్కామకర్మఫలంబు కర్తకుం జెందదు. అది భగవదాయత్తమగును. కర్మఫలంబు కర్తకుం గలుగనప్పుడు వాఁడు ఫలానుభవార్థము జన్మంబె త్తుట తప్పును. అంతట వానికి శుభంబగు. విద్వాంసు లట్లొనర్చి కృతకృత్యులగుదురు.

మఱియొకరహస్యము. సుఖప్రాప్తియు దుఃఖనివృత్తియుఁ జలిచీమ మొదలు బ్రహ్మపర్యంతముఁ గోరుట నైజము. తదర్థము కర్మంబులాచరింతురు. కర్మాచరణరహస్యంబు తెలియమింజేసి వారికిఁ దలంచినదొక్కటియు సంప్రాప్తమైనది వేఱొక్కటియుగా నగుచున్నది. కర్మాచరణత త్త్వరహస్యంబును గ్రహించి యైహికాముష్మికవిషయసుఖలాలసను మాని నిష్కామబుద్ధితో స్వధర్మానుష్ఠానశీలురై వర్తించువారు క్రమక్రమంబుగా జ్ఞానవిజ్ఞానసంతుష్టులై తురీయంబైన సూక్ష్మగతి నాశ్రయించి స్థానత్రయవిలక్షణంబైన యాత్మ నెఱుంగుదురు. ఇట్లుచేయుటయే భక్తియగును. ఇట్లుచేసినవాఁడే భక్తుఁ డనఁబడును. ఈవిధానంబును భక్తియోగమందురు. యోగంబనఁగా రెండింటి సంధానమని యర్థము.

విద్యాధరనాథా! రెండువస్తువులు కూడి యేకమగుటకు ఆరెంటి గుణంబు నేకముగా నుండవలయును. భిన్నగుణపదార్థంబు లెన్నడును స్వరూపభేదరహితంబుగాఁ గలియవు. ఆత్మకుఁ బరమాత్మతో నేకత్వము గలుగవలయునన్నచో రెండు ఏకస్వభావముగలవి కావలయును. పరమాత్మయన్నచో ప్రేమైకస్వరూపము. ఆత్మయన్నచో వాస్తవముగాఁ బ్రేమస్వరూపమే యైనను గోరికలంజేసి భిన్నభిన్నరూపంబులు ధరించుచున్నది. దానితోడ స్వపరభేదభావంబులుగలుగుచున్నవి. అట్టిభేదభావంబులను దుల్చివైచినప్పుడు ఆత్ముఁడు నైజస్వభావయుక్తుఁ డగును. అనఁగాఁ బ్రేమస్వరూపుఁడగును. ఆత్మయుఁ బరమాత్మయు రెండును

ప్రేమస్వరూపంబులైనప్పుడు వానికి సులభంబుగాఁ గలయిక సిద్ధించును. మఱియు నయ్యది యభేదరూపంబును దాల్చును. అట్లు కలియుటయే యోగం బనఁబడును.

రాజన్యా! నావచించినది చక్కఁగా విమర్శించి మనస్సునకుఁ తృప్తి గావించి వర్తింపుము. మనస్సును దృప్తిపఱచనిచో మనోజన్యంబులైన చాంచల్యంబులు తొలఁగవు. కావున మనస్సమాధానంబు మొట్టమొదట కర్తవ్యంబగును. మనస్సమాధానంబున నేకాగ్రబుద్ధియు, తత్ఫలంబుగా జ్ఞానంబును దత్ఫలంబుగా విజ్ఞానంబును బడసి శీఘ్రసిద్ధిఁ గాంతువు.

పరీక్షిన్నరేంద్రా! సంకర్షణమూర్తి యట్లు పలికి యంతర్హితుఁ డయ్యెను. చిత్రకేతు వంతట భగవానుఁడు తిరోగతుఁడైనదెసకు మ్రొక్కి హరికీర్తిఁ బాడుచుఁ బ్రియురాండ్రఁగూడి కాలము పుచ్చు చుండెను.

### చిత్రకేతువును పార్వతీదేవి శపించుట

పరీక్షిన్నరేంద్రా! చిత్రకేతు వట్లు గృహస్థాశ్రమంబు గ్రహించి కొండొకనాఁడు భార్యలతోడ విమానంబెక్కి కులగిరిసానుప్రదేశంబుల విహరించుచుఁ గైలాసంబునకు వచ్చెను. ఆగిరిశిఖరంబున మహేశ్వరుఁడు పార్వతీదేవినిఁ దొడపయి నిడి కవుంగిటఁగూర్చి పేరోలగం బుండెను. వారిని జుట్టి మునిముఖ్యులు సభ నలంకరించియుండిరి. సిద్ధచారణులు నలువలంకులఁ దీఱి సేవలు గావించుచుండిరి.

చిత్రకేతుఁడు విమానంబునుండి యాసభవంక దృష్టి సారించి 'అహో! ఇదేమి వింత! మహేశ్వరుఁడు సాక్షాల్లోకగురుం డగును. వానివలన సర్వధర్మంబులను శరీరధారులు గ్రహింపనైయున్నది. అట్టి మహాత్ముఁడు నిండుసభలో భార్యను జంకఁగూర్చి యధిష్ఠించియున్నాఁడు. ప్రాకృతులుగూడ నిట్లు చేయరు. ఈమహానుభావునకు నిది యెట్లు చెల్లును?' అని సాశ్చర్యంబుగాఁ బలికెను.

ఆమాటలు చెవింబడినను మహేశ్వరుం డేమియుం బలుకక చిఱునవ్వు దాల్చి మిన్నకుండెను. పార్వతీదేవి యాపల్కులు విని 'కటా! వీనిగర్వం బేమనవగు? జితేంద్రియుండ ననెడి యుఽభిమానంబు వీని గన్నుం గప్పెంగాంబోలు! అట్లుగానిచో నితఁడు మహాదేవునిమహిమ యెఱుంగఁడా? ఎఱిఁగి యెఱిఁగి యిట్టి ప్రల్లదంబులాడునా? ఈశ్వరుఁడు పార్వతిని తనయంకము నిడుకొనిన రహస్యము ప్రశ్న ప్రతివచనములఁ జెప్పించుట. కాదుకాదు; నాబోటిసిగ్గఱులను శాసించుటకై యితఁ డీలోకంబునకు దండధారి యయ్యెంగాంబోలు! ఇతఁ డెఱింగినంత ధర్మంబును బ్రహ్మదేవుఁ డెఱుంగఁడా? భృగు నారద సనత్కుమారులు గ్రహింపరా? కపిలాదియోగులు తెలియరా? వా రెఱుకగలవారేని హరునికార్యంబు ధర్మబాహ్యంబని వారింపకుందురా? బ్రహ్మాదులు నిరంతరము మహేశ్వరపాదారవిందంబులఁ బూజింతురు. ఎన్నఁడు వారి కిట్టి తలంపు గలుగదు. ఇతనిమాటలు సర్వభువనమంగళాత్మకునియెడఁ దిరస్కారవచనంబులుగాని యన్యంబులు గావు. ఇంత దురభిమానము గల వాఁడు హరిపాదసేవకుఁ డగునా? యని తలపోసి 'దుర్మతీ! నీనోట వచ్చినమాటలు దురహంకారప్రేరితంబులుగాని వేఱుగావు. ఇట్లు వాగి పెద్దలకు నెంతయు నపచారం బొనర్చితివి. మహాకఠినశిక్షకుఁ బాత్రుఁడవు. అయినను నావాక్కునకు వాత్సల్యం బడ్డుపడుచున్నది. అసురుఁడవై జన్మింపుము' అని శపించెను.

## చిత్రకేతువు పార్వతిని మన్ననగోరుట

రాజా! ఆశాపముతోడఁ జిత్రకేతుఁడు తటాలున విమానంబు నుండి దిగి పార్వతీపాదంబుల వ్రాలి 'తల్లీ! నీశాపంబును దోసిటఁబట్టి తలఁదాల్తు. అమర్త్యులనోట మర్త్యులంగూర్చి వెలువడువాక్కు మర్త్యుల పురాకృతకర్మాయత్తముఁగాని యొండుగాదు. ప్రాణి యజ్ఞానవశుఁడై సుఖార్థము గొంతెమకోరికలు గోరుచు వానిసిద్ధికై కర్మంబు లొనర్చి తత్ఫలభోగరూపంబైన సంసారచక్రంబునఁబడి యెండమావులంబోలు

సుఖదుఃఖంబులఁ గుడుచుచుండు. వాస్తవము విచారించినచోఁ బ్రాణి యనుభవించు సుఖదుఃఖంబులకుఁ దాను కర్తగాఁడు మఱియొకఁడును గాఁడు. కర్మంబును జేయునది మనుష్యుఁడేగదా యని యందువా? మనుష్యుని కర్తృత్వము నిమిత్తమాత్రం బగును. అంతియ గాని యతఁడు వాస్తవకర్తగాఁడు. తల్లీ! ఈసంసారము గుణప్రవాహము గావునఁ బ్రవాహజలంబులువోలె నిలుకడలేక క్షణక్షణంబు మాఱు చుండు. శాపానుగ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుఃఖంబులు నెవ్వియో వాని వాస్తవస్థితియేమో కారణమేమో యూహింపరాదు. కర్తలేనినాఁడు కార్యంబు గలుగదుగావున సర్వసృష్టికర్తయే వానికిఁ గర్తగాఁడా యని తలంతురు. భగవానుఁడు నిష్కళుఁడు అద్వితీయుఁడు నగు వానికి రాగద్వేషంబులు శత్రుమిత్రులును గలుగరు. కారణ మేమందువా? రాగద్వేషాదులు గలుగుటకు రెండవవస్తు వుండవల యును. భగవంతుఁ డద్వితీయుఁ డన్నప్పుడు రెండవవస్తువు లేదనుట స్పష్టముగదా! రెండవది లేనప్పుడు రాగద్వేషంబులకు నవకాశ మేమి గలదు? అట్టివాఁడు భూతకోటిని సృజించి యాభూతంబులకు సుఖ దుఃఖాదులను గలిగించుచున్నాఁ డనుమాటకుఁ బొందు గలదా? సంసార మందు సుఖదుఃఖంబులను హితాహితంబులను బంధమోక్షంబులనుఁ గన్నారఁ జూచుచున్నామనియు, వానికిఁ గర్త యెవ్వరనియుఁ, గర్త లేక కార్యం బెట్లు గలుగుననియు శంకింతురు.

తల్లీ! కర్తలేక కార్యంబు గలుగదనుట సత్యము. ఆపక్షంబున సంసారంబునకుఁ గర్తయెవ దనుప్రశ్న వచ్చును. కర్మమే కర్త యగును. కర్మం బనఁగా నేమియన్నచో, ఈశ్వర శక్తివ్యవహారము కర్మమగును. అది యెప్పుడు పుట్టెనన్నచో ఈశ్వరసంకల్పముతోడ జనించెను. కాఁబట్టి సర్వముఁ గర్మాయత్తమగు.

భగవానుఁడు కేవల దయాస్వరూపుఁడైనప్పుడు వానిశక్తి కార్యంబుగూడ దయాస్వరూపంబుగా నుండుననియు, లోకములోఁ

జూడన్నైన నిర్దయాత్మకకర్మంబు లెట్లు వానివలనఁ గలుగుననియు శంకింప వచ్చును. వానిమాయ సత్త్వరజస్తమోగుణాత్మకమై వర్తించును. ఏగుణం బెప్పుడు వర్తించునో యాగుణంబునకుఁ దగినకర్మము జరుగును. గుణవ్యవహారతారతమ్యంబునుబట్టి కర్మతత్త్వతారతమ్యంబును, దానిం బట్టి ఫలభేదంబును గలుగుచుండు. ఏకశక్తియందుఁ ద్రివిధగుణంబులు గలుగనేల ? యని శంకింతురు. శక్తియొక్కస్వభావమే యట్టిదగును. అట్లుగానినాఁ డెట్టివ్యవహారమును గలుగదు. వ్యవహారమే లేనినాఁడు సృష్టియే గలుగదు. ఎట్లందువా ? శక్తి విస్తారమే సృష్టి యనఁబడు. ఆశక్తి విస్తరించుట యనఁగాఁ దద్గుణంబులు విస్తరించుట యని భావము. ఆగుణంబు లొండొంటితో వివిధగతులం గలసి విస్తరించును. అట్టి పలుతెఱంగుల కలయికవలన వివిధగుణరూపపదార్థంబు లేర్పడుచున్నవి. ఆపదార్థంబుల వ్యవహారంబునుబట్టి సృష్టివైచిత్రియుఁ గర్మవైచిత్రియుఁ గలుగుచున్నది. ఆయాగుణంబుల స్వభావప్రకారము వర్తించుట స్వధర్మం బగు. వానికి మార్పాటు గలిగించుట విధర్మంబగు. సృష్టించుట యేల యందువా ? ఆరహస్యము శక్తిరూపిణివైన నీకే తెలియవలయును.

తల్లీ ! మూఁడుగుణంబులలో సత్త్వంబు జ్ఞానసాధనంబగుననియు, తక్కినరెంటిని సంస్కరింపనిచో సత్త్వస్థితి యథాగతి వర్తించి జ్ఞానయోగ్యతఁ గలిగింపదనియు, గుణసంస్కారంబునకుఁ బూనుట విధర్మముగాదా యనియు శంకింతురు. గుణసంస్కారంబత్యవసరము. అయినను దానికై విచ్చలవిడిగా వర్తింపరాదు. పద్ధతిప్రకారము చేయవలయును. అట్లు చేసినప్పుడది క్రమక్రమంబుగా శుద్ధినొంది యుత్తమస్థితిఁ గాంచును. అట్లు చేయుట సత్కార్యంబనియు, దానికి విరుద్ధంబుగాఁ జేయుట దుష్కార్యం బనియుఁ బేర్కొనఁబడును. అట్టి దుష్కార్యఫలంబుగా దుఃఖాదులును సంసారబంధనంబును గలుగుచున్నది.

తల్లీ! నీ యీశాపము నాకర్మఫలంబు గావునను, దానిని నే ననుభవించినఁగాని యది నశింపదు గావునను శాపమోక్షంబును నిన్ను వేడుట

లేదు. తల్లీ ! ఏవో తెలిసి తెలియనిమాట లాడితిని. నా యీయవినయం బును సైరించి మన్నింప వేఁడుదు' నని పల్కి మ్రొక్కి విమానా రూఢుఁడై చనియెను.

పరమేశ్వరుఁడు పార్వతికి సమాధానము చెప్పుట

పరీక్షిన్న రేంద్రా! చిత్రకేతువుచనంబులు పార్వతికి మహాశ్చర్యం బును గలిగించెను. మహేశ్వరుఁ డాసంగతి గ్రహించి 'ప్రేయసీ! హరి భక్తు లెంతధీరులో చూచితివా ? నారాయణపరు లెద్దానికిని వెఱువరు. వారికి స్వర్గంబొండె నపవర్గంబొండె నరకంబొండె నొక్కటే యగు. కళ్యాణీ! దేహికి దేహసంబంధముతోడ ద్వంద్వంబులు వచ్చును. దేహి దేహంబులసంయోగంబునకుఁ గారణ మేమందువా ? భగవల్లీలయే కారణము. ద్వంద్వంబులు దేహిసంబంధంబులా ? లేక దేహసంబంధం బులా ? యని యడుగుదువా ? అవియెల్ల దేహసంబంధంబులేగాని దేహి సంబంధంబులుగావు. అట్లగునేని వానిని దేహిసంబంధంబులుగా భావించు టేల యని యందువా ? వాస్తవస్థితి తెలియక యట్లు భావింతురు. అదే యజ్ఞాన మనఁబడు. నిదర్శనము వలయునా ? రజ్జుసర్పన్యాయమే నిదర్శనము.

ప్రేయసీ ! ఈభ్రాంతి తొలఁగుట యెట్లందువా ? దీపపుకాంతి వలన రజ్జు సర్పభ్రాంతి యెట్లు తొలఁగుచున్నదో యట్లే జ్ఞానప్రకాశం బున నిట్టిభ్రాంతి నశించును. అట్టి జ్ఞానము గలుగుట యెట్లందువా ? దేవభక్తిఫలంబుగా నట్టిజ్ఞానం బుదయించును.

పార్వతీ ! భక్తి యనునది ప్రేమస్వరూపంబనియుఁ బ్రేమించుటకుఁ బ్రేమింపఁబడు వస్తువుయొక్కయుఁ దత్స్వరూపగుణంబులయొక్కయు జ్ఞానంబు వలయుననియు, భగవానుని స్వరూపగుణంబు లెట్టివనియు నడుగుదువా ? భగవత్స్వరూపం బెట్టిదోఁ గన్నారఁ జూచినవారు లేరు. నీకుఁ దెలియుదా ? యని యందువా ? నేనుగాని బ్రహ్మగాని సనత్కు

మారాదులుగాని యెఱుంగము. కారణ మేమందువా ? భగవత్స్వరూపము కేవల చిన్మాత్రము. అది సూక్ష్మాతిసూక్ష్మము. దేహధారు లెల్లరు వస్తువును వారి యింద్రియశక్తివలన గ్రహింతురు. సూక్ష్మాతిసూక్ష్మతత్త్వగ్రహణంబునకు నింద్రియశక్తి చాలదు. మేమును దేహధారుల మేగావున నింద్రియగోచరంబులైనవాని విభూతులనుమాత్రము చూడనోచితిమి. ఈమాటకుఁ దార్కాణ మేమందువా ? కలకండ యందు మాధుర్యముగలదు. ఆమాధుర్యస్వరూపంబును జెప్పఁగలవా? అది యిట్టిదని చెప్పఁజాలము. మఱేమన్ననో యామాధుర్యవిభూతియైన కలగండను జూచి దానిని భక్షించి మాధుర్యతత్త్వంబును గ్రహింపుమని మాత్రము చెప్పఁజాలుదుగు. అట్లే భగవద్విషయము నగునని గ్రహింపుము. దేవీ ! భగవద్గుణంబు లెట్టి వందువా ? భగవంతుఁడు సర్వకళ్యాణగుణమూర్తి యగును. అతఁడు సర్వభూతప్రియుఁడై సర్వాత్ముఁడుగా నుండును.

ఈచిత్రకేతువుసంగతి యేమందువా ? ఇతఁడు భగవద్భక్తులకు భక్తుఁడై వర్తించెను. తత్ఫలంబుగా వానికి శాంతియు సమదృష్టియు సిద్ధించెను. ఆకారణంబున నతఁడు నీశాపంబునకుఁ గలవరపడఁడు. భగవద్భక్తులందు నిది వింతగాదు. వేయేల ? నేనుగూడ నయ్యాచ్యుత ప్రియుఁడనై వర్తింతునుసుమా !' యని పలికి యామె యాశ్చర్యంబు నుడిపెను.

రాజేంద్రా ! చిత్రకేతువునకుఁ బ్రతిశాపం బిచ్చుశక్తి గలదు. అంతటివాఁడయ్యు మిన్నకుండుటకుఁ గారణ మేమందువా ? అదేగదా సాధుజన పరమలక్షణము.

### చిత్రకేతువు వృత్రాసురుఁడై జనించుట

నరేంద్రా ! చిత్రకేతువు పార్వతీశాపఫలంబుగా వృత్రాసురుఁడై జనించెను. వృత్రాసురునిచరిత్ర వింటివిగదా!

రాజా! ఈ యితిహాసము విష్ణుభక్తిప్రభావంబును జాటును. దీనిని బ్రతిదినము ప్రాతఃకాలంబున శ్రద్ధావాఙ్నియమవంతుఁడై పఠించువాఁడు హరిస్మరణపరుఁడై బంధం బెడసి పరమగతి నొందును.

పరీక్షిన్నరేంద్రా! దక్షకన్యలవంశక్రమంబునందు అదితిపుత్త్రుల వంశంబును బురస్కరించి త్వష్టృవంశంబును జెప్పితిని. ఇఁక సవితృఁడు మున్నగువారివంశంబులను వినుము.

### సవిత్రాదులవంశము

సవితృనకుఁ బృశ్నియందు సావిత్రియు, వ్యాహృతులు ముగ్గురును, అగ్నిహోత్రపశుసోమంబులును, చాతుర్మాస్యపంచమహామఖంబులును బ్రభవించెను. భగునకు సిద్ధి యనుదానియందు మహిముఁడు, విభుఁడు, ప్రభుఁడు అనుపుత్త్రులును, ఆశీస్సు అనుపుత్త్రికయుఁ బుట్టిరి. ధాతకుఁ గుహూవు సినీవాలి రాక అనుమతి అనుభార్యలు నల్వు రుండిరి. వారిలోఁ గుహూవునకు సాయంకాలుఁడును, సినీవాలికి దర్శనుఁ డనువాఁడును, రాకకుఁ బ్రాతఃకాలుఁడును, అనుమతికిఁ బూర్ణమాసులును జనించిరి. విధాతకుఁ గ్రియ యనుపత్నియందుఁ జిత్యగ్నులు పురీషు లనువారైదుగు రుద్భవించిరి. వరుణునకుఁ జర్షణియందు పునర్జన్ముఁడై భృగువును వల్మీకంబున వాల్మీకమహర్షియుఁ గలిగిరి. మిత్త్రునకు దేవతివలన ఉత్సర్గుఁడు, అరిష్టుఁడు, పిప్పలుఁడు బుట్టిరి. కొండొకతఱి మిత్త్రుఁడు వరుణుఁడు నిద్దఱు నేకకాలంబున నూర్వశిని గామించిరి. అయ్యిరువురకు నేకకాలంబున రేతస్సు స్రవించెను. ఆరేతోరాశిని గలశమం దుంచిరి. అందుండి వసిష్ఠుఁడును అగస్త్యుఁడు నుద్భవించిరి. వారిరువురుఁ గలశంబు నుండి పుట్టుటంజేసి కలశసంభవులనియు మైత్రావరుణులనియుఁ బేర్కొనఁబడుదురు. ఇంద్రునకుఁ బౌలోమియందు జయంతుఁడు, ఋషభుఁడు, విద్వాంసుఁడు ప్రభవించిరి. మాయావామనుఁడైన యురుక్రమునకుఁ గీర్తియందు బృహచ్ఛ్లోకులు సౌభగాదులు గలిగిరి. కాశ్యపునకు నదితియందు వామనమూర్తి యవతరించెను. వామనచరిత్ర తర్వాతఁ జెప్పెదను.

### దితిసంతానము

దితి కాశ్యపునివలన హిరణ్యకశిపహిరణ్యాక్షులను గాంచెను. హిరణ్యకశిపుఁడు జంభుఁ డనుదానవపుత్రికను కయాధువునం బెండ్లాడి దానివలనఁ బ్రహ్లాదుఁడు, అనుహ్లాదుఁడు, సంహ్లాదుఁడు, హ్లాదుఁడను పుత్రుల నల్వురను సింహిక యనుపుత్రికను బడసెను. సింహికను విప్రచిత్తి యనువాఁడు పెండ్లాడెను. వారికి రాహువు పుట్టెను. ఆరాహువు దొంగతనముగా సురలతోడ నమృతంబుఁ ద్రావ యత్నించెను. అప్పుడు వాని తలను హరి తనచక్రంబునఁ నఱికెను.

అనుహ్లాదుఁడు సూర్మ్యవలన బాష్కలమహిషులఁ బడసెను. సంహ్లాదుఁడు గతివలనఁ బంచజనుఁ డనుపుత్రునిఁ గాంచెను. హ్లాదునకు దమనివలన వాతాపి, ఇల్వలుఁడు గలిగిరి.

ప్రహ్లాదునకు విరోచనుఁడును, వానికి బలియుఁ గలిగిరి. బలి యశన యనుదానిని గ్రహించి దానివలన బాణుఁడు మున్నగుకొడుకుల నూర్గురఁ బడసెను. బలిప్రభావం బేమని చెప్పుదు? వానివాకిట హరి యిప్పటికినిఁగావలి కాచుచుండు. వానిప్రభావం బెంతో యూహింపుము. బలిచరిత్ర ప్రత్యేకించి తెలిపెదను. బాణుఁడు శంకరు నారాధించి యీశ్వరగణముఖ్యుఁ డయ్యెను.

రాజా! దితికి హిరణ్యకశ్యపాదులేగాక మరుత్తు లనువారు నలువదితొమ్మండ్రుగురు జనించి యింద్రసారూప్యంబు నొందిరి. వారికి సంతానము గలుగదు.

### సప్తమరుద్గణ జననము

మునులారా! పరీక్షిత్తు శుకయోగిని విని 'మునివర్యా! మరుత్తులు పుట్టువుంబట్టి యసురు లగుదురు. అసురులకును సురలకు నెన్నఁడేనియుఁ బొత్తు కుదురదు. మరుత్తు లెవ్విధంబున నింద్రసారూప్యంబును బడసిరి? వా రేమిపుణ్యం బొనర్చి యాపదవిని సాధించిరి? ఈసందేహము నాకుమాత్రమే గాదు. ఈసభ నలంకరించియున్న మునులకుఁగూడఁ

గలదు’ అని యడిగెను. ఆ నరేంద్రు నివచనంబు మితాక్షరంబయ్యు నమితార్థవంత మగుటం జేసి శుకుఁడు వాని కిట్లనియెను.

‘నరేంద్రా! ఇంద్రుఁడు దితికొడుకులను జంపుట వింటివిగదా! పుత్రశోకంబు దితిహృదయంబు నెఱయింపసాగెను. ఆయింతి పుత్రులను దలఁచి తలంచి వాపోవుచు ‘కటా! నాసుతు లింద్రునకు నన్నదమ్ములగు దురు. ఆసంగతిగూడఁ దలంపక యతఁడు వారిని జంపెను. ఇంతకన్నఁ గ్రూరుఁడును శిలాకఠినహృదయుండును గలఁడా? ఈపాపాత్ముఁడు మని నంతకాలము నాకంటికిఁ గూర్కు రాదు. శరీరం బెప్పుడో యొకనాఁడు మట్టిపాలో యగ్నిపాలో కాకమానదు. ఈవిధికిఁ బదవు లెవ్వాడు నడ్డుపడ నేరవు. అట్టి తుచ్ఛశరీరప్రీతికై యెంత భూతద్రోహంబునకైనను వెను దీయకుండుటకంటె వింత గానరాదు. ఈసంగతి మూఢబుద్ధికి స్ఫురింపకుం డిన నుండుఁగాక. సురరాజైనవానికిఁ దెలియదా? తెలిసియు నిట్లు చేయుట యేల? సరి సరి; గ్రహించితిని. ఇంద్రియపరత్వం బెంతటివారి నైనను వదలదు. అట్టిదుర్మతి యెంతటికిని దెగించును.’ ఇంద్రుఁ డిట్టిమద వశుఁడై వర్తించెను. వానిమదం బడఁచుట యెట్లు? ఈమదంబు సురరాజ పదవింబట్టి గలిగెను. ఆపదవి తొలంగిశఁగాని యితఁ డొడలెఱిఁగి బ్రదుకఁడు. వీనిం బడఁద్రోయఁగలసుతుని బడయుదుఁగాక. ఈకోర్కి నెఱవేఱుటకు నాపతియే శరణం’ బని నిశ్చయించి కశ్యపుని నిండారు భక్త్యనురాగంబులతోఁ బరిచరించుచు స్మేరకటాక్షవీక్షణమృదుభాషణం బుల నెఱపుచు వానిమది కెక్కునట్లుగా వర్తింపసాగెను.

## స్త్రీనిర్మాణము

రాజేంద్రా! భూతంబులు తొలుదొల్త నిస్సంగబుద్ధితో వర్తింప సాగెను. అందువలనఁ బ్రజావృద్ధి కలుగకుండెను. పరమేష్ఠి యదిగ్రహించి పురుషులచిత్తంబును హరించుటకై తనదేహార్ధంబునే స్త్రీగా నిర్మించెను. అది సుత పురుషుల నిస్సంగబుద్ధి వలసపోయెను. వారు స్త్రీవశులైరి. వానితోఁడఁ బ్రజావృద్ధి ప్రారంభించెను.

## కశ్యపుఁడు దితికి వరం బిచ్చుట

దితి యట్లు వివిధగతులఁ గశ్యపునిమనంబు నాకర్షించుచు వర్తించుచుండి సమయమువేచి యొకనాఁడు వానిని డాయఁబోయి 'నాథా! కోర్కె యొక్కటి నాకుఁ గలిగె' నని పలికెను. కశ్యపుఁ డామాటకు నవ్వుచు 'కాంతామణీ! పతిప్రేమను విలిచినసతికిఁ బడయరానియర్థము గలదా? సతికిఁ బతియే పరదైవంబు. సతులభక్తికిఁ బురుషులభక్తి కెంతో యంతరము గలదు. పురుషులు భగవానునకు నానారూపంబులు వికల్పించి యారూపముల నారాధింతురు. సతులన్ననో పతిరూపంబుననే యాభగవంతుని ననన్యభావంబుతో భజింతురు. దానంజేసి వారిభక్తి పూర్ణభక్తి యగును. నీవు నన్నట్టి భక్తియోగంబునఁ బూజించితివి. నీవర్తనంబు నా మదికెక్కెను. నీ కెంతయుఁ బ్రీతుఁడనైతిని. నీతలంపు తెలుపుము. తప్పక యిత్తు' ననెను. దితి యందులకు నెంతయు సంతసించి 'మహాత్మా! నీవు తలంచినచో దుర్లభము గలుగదు. నాకొడుకుల నింద్రుఁడు చంపుట మీకుఁ గ్రొత్తగాదు. ఆవగ నన్నెంతయు బాధించుచున్నది. ఇంద్రునకు నట్టిగతి గలుగునందాఁక నావగ తీఱదు. అందులకుఁ జాలినసుతు నొక్కని నాకు ననుగ్రహింపు' మని కోరెను.

## కశ్యపుఁ డాత్మనిందఁ గావించుకొనుట

రాజా! ఆమాట చెవిసోకినంతనే కశ్యపుఁడు చింతాక్రాంతుఁడై 'కటా! స్త్రీరూపమాయకుఁ జిక్కితిని; నిరయంబు తప్పదు. ఇందులకై యింతుల దూఱఁ దగదు. వారు వారిస్వభావంబు ననుసరింతురు. ఇంద్రియారాముఁడనై చెడితిని. ఇదినాకు స్వకృతాపరాధఫలంబుగాని వేఱుగాదు. స్త్రీలస్వభావంబు స్వార్థంబుఁదక్క వేఱొండు తలంపదు. ఆత్మార్థము వా రెంతటికైనను సాహసింతురు. స్త్రీసాహసంబని చెప్పియే యున్నారుగదా! రజోగుణంబు స్త్రీరూపుఁ దాల్చెను. అట్టి స్వభావంబు వారికిఁ బుట్టుకతో వచ్చెను. వారుమాత్ర మేమిచేయఁగలరు. మాట

యిచ్చితిని; తప్పు టెట్లు? ఇంద్రుని జంపించుట యెట్లు?' అని కొంతవడి లోలోనఁ దలపోసికొనెను.

### కశ్యపుఁడు దితికి బుంసవనవ్రతం బుపదేశించుట

కశ్యపుఁ డట్లు తలపోసి 'కళ్యాణీ! నీకోర్కెదీర్చుటకు నొక వ్రతంబు గలదు. దాని నుపదేశింతును. ఆ వ్రతంబు నొక్కయేఁడాది కాలము యథావిధి జరుపుము. నీకోరినసుతుఁడు నీకుఁ గలుగును. వ్రతాచరణమం దెట్టిపొల్లు పోరాదు. పొల్లు పోయినచో నీసుతుఁడు సురవైరి యగుటకు మాఱుగా వారికి మిత్త్రుఁడగు' ననెను. దితి యాపల్కులు విని కేల్దోయిగూర్చి 'బ్రహ్మర్షివర్యా! నీయానతి సేయుదు. వ్రతానుష్ఠానంబునఁ గర్తవ్యంబు లెవ్వియో నిషిద్ధంబు లెవ్వియో వ్రత హానికరంబు లెవ్వియో సెలవీయ వేఁడుదు' నని పలికెను.

### పుంసవనవ్రతనియమంబులు

కశ్యపుఁ డామాట విని 'కళ్యాణీ! వ్రతకాలమందు నెట్టి ప్రాణి కేనియు నేలాటిహింసయుఁ గావింపరాదు; అసత్యము పలుకరాదు; నఖంబులను రోమంబులను ఛేదింపరాదు; అమంగళద్రవ్యంబులను ముట్ట రాదు; నీటిలో మునిఁగి స్నానముచేయరాదు; విడిచిన చీరఁ గట్టరాదు; వాడినపూలు ముడువరాదు; ఎంగిలి తినరాదు; భద్రకాళికి బలియిచ్చిన యన్నంబును గుడవరాదు; మాంసంబునుగాని శూద్రులుతెచ్చిన యన్నం బునుగాని, రజస్వలదృష్టిపాఱిన యన్నంబునుగాని భుజింపరాదు. దోసిటం బట్టి నీరు త్రాగరాదు; ఉచ్ఛిష్టస్పర్శ గలిగెనేని వెంటనే జలప్రక్షాళనంబు చేయవలయును; ముడివీడినవెంట్రుకలతోఁ దిరుగరాదు; అలంకారరహిత ముగా నుండరాదు; మొండిమొలతో నుండరాదు; ఇరుసంధ్యలందు బయట సంచరింపరాదు; అలుక వహింపరాదు; దుర్జనులతో మాటాడ రాదు; మౌనము ధరింపవలయును. మఱియుఁ బాదప్రక్షాళనంబు సేయ కుండుట, శుచిత్వంబు తప్పుట, తడిబట్టఁగట్టుట, పశ్చిమోత్తరదిశలఁ దల పెట్టి పరుండుట, ఇతరులతోఁగూడి పరుండుట, సంధ్యాకాలంబులందుఁ బరుండుట - ఇవి తగవు.

కళ్యాణీ! నిషిద్ధంబులను దెలిపితిని. ఆచరణీయంబులను వినుము. అరుణోదయంబుతోడ లేచి దినకృత్యంబులు దీర్చి జలకమాడి శుచియై సర్వమంగళంబులను ధరించి గోబ్రాహ్మణులను లక్ష్మీనారాయణులను బూజించి సువాసినులను గంధపుష్పాలంకారంబులచేత నర్చించి పతిని బహిరంతర్భ్యాతునిగా నారాధించి పతి భుజించినతర్వాత తాను భుజింప వలయును.

ప్రేయసీ! ఈవ్రతంబును బుంసవన మందురు. దీనిని సంవత్సరపర్యంతము జరిపితివేని నీకోరినసుతుఁ డుదయించు' నని చెప్పెను. దితి తదుపదేశంబును శిరసావహించి నిండుమనంబుతోఁ దత్వ్రితం బారంభించెను.

ఇంద్రునిపన్నాగము

రాజా! ఆసంగతియెల్ల నింద్రునకుఁ దెలిపిరి. అతఁడు తహతహపడి 'అయ్యో! ఈవ్రతంబు కొనసాగెనేని నాకు ముప్పు దప్పదు ఎట్లేని దీనికి భంగంబు గావింపవలయును. ఏమి సేయునగు?' అని కొంతవడి తల పోసి కృతనిశ్చయుఁడై దితిని జేరి యనుదినంబు సకాలంబున ఫలపుష్పమూలంబులును, సమిత్కుశపత్రాంకురంబులును, వనాంతరంబునుండి సంతరించి తెచ్చియిచ్చుచు మృజ్జలంబులఁ గూర్చుచుఁ దత్పరిచర్యాపరుఁడై యామెవ్రతలోపంబును నెమకుచు లేడికై బోయవలెఁ బొంచియుండెను. అట్లు దినంబులు గడచెను; మాసంబులు చనెను. ఇంద్రునకు నెందును సందు దొరకదయ్యెను. వానికిఁ జింతాపరితాపంబులు నానాఁటికిఁ బెరుఁగ సాగెను.

ఇంద్రుఁడు దితిగర్భంబును భేదించుట

దితి యట్లు పట్టుదలతో వ్రతనియమంబులను దప్పక నెలలపర్యంతము నాచరించుటం జేసి కడుంగడు డీలుపాటుచెందెను. కొండొకనాఁడు పరాకున నామె వెంగిలిముట్టి పాదప్రక్షాళనంబుసేయుట మఱచి పరుండి మైమఱచి నిద్రించెను. వ్రతారంభముతోడ నామెగర్భంబునఁ బిండో

త్పత్తియై కాలక్రమంబునఁ బెరుఁగుచుండెను. ఇంద్రుఁ డానియమ భంగంబు సందుచేసి యాత్మ యోగమాయాబలంబునఁ దద్గర్భంబుఁజొచ్చి యందుఁ బిండాకృతినున్న శిశువును నిజవజ్రాయుధముచేత సప్తఖండం బులు గావించెను. ఆఖండంబులు గర్భంబున నేడువసాగెను. ఇంద్రుఁ డాతునియలను 'మారుదమారుద' యని సమదాయించుచు నొక్కొక్క దానిని మఱల నేడేసి తుండంబులు చేసెను.

రాజా! 'మారుద' యనఁగా ఏడువకుము అని యర్థము. ఇంద్రుఁ డట్లు పలికినకారణంబున నప్పిండంబులు మరుత్తు లనఁబడెను. ఆమరుత్తులు వజ్రాయుధము ప్రేటులకు నొచ్చి కేలుమోడ్చి 'ఇంద్రా! మేము నీకుఁ దమ్ములము. మమ్ముఁ జంపనేల?' యని మొఱలిడిరి. అంతట సురపతి తత్ఖండనంబు మాని 'తమ్ములారా! వెఱవవలదు. అనన్యభావులై నాపార్షదు లగుదురుగాక! మి మ్మిఁక మరుద్గణంబని పిలుతురు' అని పలికి వారిని సమదాయించెను.

రాజేంద్రా! ఖడ్గఖండితులు బ్రదుకుట యెట్లందువా? వాసుదేవుని కరుణగల్గునేని దుర్లభం బేమియుండు? అశ్వత్థామయొక్క బ్రహ్మాస్త్రంబు నుండి నీవు బ్రదుకలేదా? అట్లే మరుత్తులుకూడ భగవత్కారుణంజేసి జీవించిరి. దితి యంతకఠినవ్రతంబుఁబూని తదేకచిత్తంబుతో సంవత్సర పర్యంతము గావించిన పూజాఫలంబు రిత్తవోవునా?

### ఇంద్రుఁడు దితి మన్ననఁ గోరుట

రాజా! దితి కొంతవడికి మేల్కాంచి యింద్రునితోఁగూడి యగ్నులువలెఁ దేజరిల్లుచుఁ దనమ్రోలనున్న యాబుడుతలను గాంచి సంతసించి 'ఇంద్రా! అదితి సంతతికిఁ గీడునేయఁజాలిన తనయు నొక్కనిఁ గోరి దుశ్చరంబైన యీకఠోరవ్రతంబు సలిపితిని. వీ రెవరో నలు వదితొమ్మండ్రుగురు నీవెంట నున్నారు. నిజము దాఁపక చెప్పు' మనెను. ఇంద్రుఁడు సవతితల్లికి మ్రొక్కి 'అమ్మా! నీనిశ్చయంబు నాకుఁ దెలిసెను. రానున్న ముప్పును దప్పించుకొనుటకై యుపాయంబు పన్ని నీకడఁ జేరి

నిన్ను పచరించుచు సందు వెదకుచుంటిని. నీవు వెంగిలిముట్టి పరాకునఁ బాదప్రక్షాళనం బొనర్పకయే నిద్రించితివి. అది నిమిత్తంబుగా నేను నీగర్భంబుఁజొచ్చి యందున్న పిండంబును మొదట నేడుతునియలు చేసి మఱల నొక్కొక్కదానిని నేడేసి గావించితిని. ఆ నలువదితొమ్మిదిశకలంబులు చావక నీగర్భంబు వెడలివచ్చెను. ఆతునియలే యీనలువదితొమ్మండ్రు గురుచు. వారు చావకుండుటకుఁ గారణ మేమందువా? నీవు గావించినపరమపూరుషపూజావిశేషంబే యని తలంతును. తల్లీ! మోక్షఫలంబునుగూడఁ గోరక పరమాత్ముని భజించువారే యుత్తములు. విషయభోగంబులెల్ల నరకప్రాపకంబులగు. అట్టితుచ్ఛంబులఁ గోరి యప్పరమాత్ముని భజించువా రుందురా? తల్లీ! నాయీచేత మూఢబుద్ధికృతముగాని వేఱుగాదు. నాకుత్సితంబును మన్నింపుము. నీగర్భము చచ్చియు నీభాగ్యంబున మఱల బ్రదికె' ననెను. దితీదేవి యింద్రునిశుద్ధభావంబునకు మెచ్చి 'వత్సా! పోయిర' మ్మనెను. అతఁ డంతట నామెకు మ్రొక్కి యామరుత్తులతోడ స్వర్గంబునకుఁ బోయెను. మరుత్తులు స్వర్గముఁజేరి యింద్రునకుఁ బార్షదులై సోమపానంబున నధికృతులైరి.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁ డావృత్తాంతంబును విని 'మునీంద్రా! పుంసవనవ్రతవిధానంబును వినఁ గుతూహలమయ్యెడు' నని యడిగెను. శుకుఁడు వాని కిట్లనియెను.

### పుంసవనవిధానము

'రాజా! ఈవ్రతంబును మార్గశీర్షశుక్లపాడ్యమినాఁడు ప్రారంభింపవలయును. దీనికిఁ బూనుటకు ముందుగా నిల్లాలు పతియనుమతిని బడయవలయును. అట్లు పతియాజ్ఞఁబడసి మార్గశీర్షశుక్లపాడ్యమినాడు వలువాఁతనే లేచి యీమరుజ్జన్మచరిత్రను విని బ్రాహ్మణులను నిమంత్రించి దంతధావనస్నానాదులు సలిపి శుచియై తెల్లనివస్త్రంబుగట్టి సాలంకృతయై ప్రాతరాహారంబునకుఁ బూర్వమే శ్రీమహాలక్ష్మీసహిత శ్రీమహావిష్ణువును బూజింపవలయును.

### పూజోపక్రమము

రాజా! పూజాప్రారంభమందు సద్దేవీదేవులకు మ్రొక్కి నిలిచి 'పూర్ణకామా! నిరపేక్షకా! సిద్ధసంకల్పా! లక్ష్మీనాథా! ఇదే నీకు నమస్కారము. దేవా! కృపయు, భూతియు, తేజస్సు, సహస్సు, ఓజస్సు సత్యసంకల్పాదు లీశ్వరగుణంబులగు. అవియెల్ల నీయందుఁ బూర్ణంబు లును శాశ్వతంబులుఁ గావున నిన్ను భగవంతుఁ డందురు.'

'దేవీ! లక్ష్మీ! విష్ణుపత్నీ! మహామాయాస్వరూపిణీ! మహా పురుషలక్షణోల్లాసినీ! ప్రియథామమహాభాగాతిశాయినీ! లోకజననీ! ఇదే నీకు నమస్కారము.'

ఇట్లు స్తుతించి యాస్తుతివచనంబుల భావంబును జింతింపవలయును. తర్వాత 'ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ మహావిభూతిపతయే సహ మహావిభూతిభిర్బలిముపహారాణి' అను మంత్రంబును జపింపవలయును. ఈమంత్రంబును బూఁటపూఁట జపింప వలయును.

ఇట్లు జపించి శ్రీమహావిష్ణువునకు ఆవాహనము, ఆసనము, అర్ఘ్యము, పాద్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, ఉపవీతము, భూషణము, గంధము, పుష్పము, ధూప దీప నైవేద్యాతులతో యథా విధి సమాహితబుద్ధిపూర్వకంబుగా నుపచారంబులు సలుపవలయును. తర్వాత నివేదితశేషంబును వహ్నిముఖంబునఁ బదునెండాహుతులు వేల్వవలయును. అట్లు వేల్చునప్పుడు 'ఓం నమో భగవతే మహాపురు షాయ మహావిభూతయే స్వాహా' అను మంత్రంబును బఠింపవలయును.

అట్లు పూజించి భక్తినమ్రహృదయపూర్వకంబుగా సాష్టాంగ ప్రణామంబు గావించి పైమంత్రంబును బదిసారులు జపించి లేచి యిట్లు స్తోత్రము గావింపవలయును.

'జగన్మాతాపితృలారా! ఈ విశ్వంబునకు మీ రిరువురే పరమ కారణంబు నీశ్వరులు నగుదురు. తల్లీ! లక్ష్మీ! నీవు సూక్ష్మప్రకృతివియు

అనుల్లంఘ్యమాయాశక్తివియు నగుదువు. తండ్రీ! నారాయణా! ఈదేవికి నీవు సాక్షాదీశ్వరుండవు. ఈ తల్లియజ్ఞయు లౌకికక్రియయు నగు; నీవు ఫలభోక్త వగుదువు. సర్వయజ్ఞాత్మకా! ఈ తల్లి గుణవ్యక్తి యగును; నీవు వ్యంజకుండవై ఫలంబును భోగింతువు. ఈ తల్లి శరీరుల యొక్క యింద్రియంబుల నాశ్రయించియుండు. నీవు తచ్ఛరీరంబులందు నంతర్వర్తివై యాత్మరూపంబున నుందువు. ఈమహాశక్తి నామరూపంబులఁ బరిణామ మొందును. నీవు ఉపాశ్రయుఁడవై వానినిఁ బ్రకాశింపఁ జేయుదువు. మీరిరువురును ముల్లోకంబులకు వరంబు లనుగ్రహింతురు. పుణ్యశ్లోకా! ఈసత్యంబున మాయాపేక్షితంబులు సత్యంబు లగుఁగాక!'

ఇట్లు ప్రస్తుతించి నివేదనంబును దొలఁగించి యాచమనీయంబొసఁగి నిండుభక్తితో వారిని వివిధస్తోత్రంబుల నారాధించి నివేదితశేషంబు నాఘ్రాణించి మఱలఁ బూజింపవలయును. అటుపిమ్మట వ్రతపరయైన సతి నిజపతినిఁ బరమేశ్వరభావంబునఁ బూజించి కర్తవ్యోపచారంబులు వానికిఁ గావింపవలయును. పతియు వానిసతిని నిజప్రేమమూర్తినిగాఁ బాటింపవలయును.

అట్లొకయేఁడు వ్రతము సలిపి, మఱుసటి కార్తికమాసంబునఁ గడపటిదినంబున వేఁకువను లేచి స్నానశౌచాదులు దీర్చి పాయసాన్నంబును నేతితోఁ గలిపి పార్వణస్థాలీపాకవిధంబునఁ బదురెండాహుతులు వేల్చి పన్నిద్దఱు బ్రాహ్మణులకు మృష్టాన్నభక్ష్యభోజ్యాదిపూర్వకంబుగా సంతర్పణంబు గావించి తిలోదఘటగోవుల నర్పించి ప్రీతిఁగొలిపి వారు ప్రేమపూర్వకంబుగా నిచ్చునట్టి యాశీర్వచనంబులను దలఁదాల్చి వారికి మ్రొక్కి తదనుజ్ఞను బడయవలయును. తర్వాత భర్తను వానియాచార్య బంధువులతోడ భుజింపఁజేయవలయును. అట్లుచేసి చరుశేషంబును బత్ని సేవింపవలయును.

ఈవ్రతంబును సతీపతు లిద్దఱు నాచరింపవచ్చును. అట్లుగానిచో వారిలో నెవ్వరైన నాచరింపవచ్చును. పురుషుఁ డనుష్ఠించునేని వానికి

నభీష్టార్థంబులు సిద్ధించును. భార్య యనుష్ఠించునేని యామెకు సిరియు సంతానసౌభాగ్యంబులును సౌమంగల్యంబును సద్గుణసత్కీర్తులును గలుగును. కన్నియ యనుష్ఠించునేని సర్వలక్షణసంపన్నుఁడైన పతిని బడయును. విధవ యనుష్ఠించునేని బుణ్యగతి నొందును. మృతసంతానయైనస్త్రీ యనుష్ఠించునేని జీవత్పుత్రులను బడయును. ధనవతియయ్యుఁ గర్మవశంబున దౌర్భాగ్యంబును గుడుచుస్త్రీ యనుష్ఠించునేని మహాసౌభాగ్యవతి యగును. జాడ్యగ్రస్థయై విరూపియైనస్త్రీ యనుష్ఠించునేని యారోగ్యవతియై సుఖంబందును. మగఁడు రోగంబుచేత బలహీనుఁడయ్యేనేని నింద్రియపాటవంబును దేహదార్ఢ్యంబును గాంచి భోగించును.

రాజా! దీని నభ్యుదయకాలంబులందుఁ బఠింతురేని దేవపితృదేవతలకుఁ బరమతృప్తి గలుగును. ~~ఈమహామంత్ర~~ హోమాంతంబున నగ్నియు హరియుఁ బరమప్రీతులై యిష్టార్థంబును సంతోషంబుతోఁ బ్రసాదింతురు. రాజా! నీయడిగినయర్థంబును దెలిపితిని. సావధానంబుగా వింటివిగదా' యనెను.

షష్ఠస్కంధము సంపూర్ణము.



శ్రీ ర స్తు

# శ్రీ దొడ్డభాగవతము

## సప్తమస్కంధము

### భగవంతునకు రాగద్వేషములు కలవా? లేవా?

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగివచనంబులు పర్యాలోచించి 'మునిచంద్రమా! భగవానుఁడు పరమాత్మ పరమానందస్వరూపుఁడును నిఖిలభూతప్రియుఁడును సుహృత్తునై యుండుననియు, వానికి నెల్లరు సములే యనియుఁ జెప్పితిరి. ఋషివర్యా! ఒకరిని దగ్గఱకుఁ దీయుట రాగకార్యంబగు. ఒకరిని జంపుటగాని జంపించుటగాని యెగ్గు చేయుటగాని ద్వేషకార్యంబగును. భగవానుఁ డింద్రునిఁ జేరఁదీయుటయు వానికై యసురులను జంపుటయు రాగద్వేషములు గావా? అట్లు చేసినవాఁడు రాగద్వేషరహితుఁడును నిఖిలభూతప్రియుఁడును సర్వసముఁడు నెట్లగును?'

'మఱియు నొకనివలన నేదేని ఫలంబు నపేక్షించినప్పుడు వానియెడ రాగము జనించును. అట్లే యొకనివలన నేదేనియు నపకారంబు శంకించినప్పుడు వానియెడల ద్వేషము పుట్టును. భగవానుఁడు సర్వసంపూర్ణుఁడు. వానికిఁ గోరనైనదియుఁ బడయనైనదియు గోరంతయుఁ గలుగదు. ఆఘనుఁడు లోకైకనాథుఁడు గావున వానికి నెవ్వనివలనను భయంబు గలుగనేరదు. ఆపరమాత్ముఁడు సురలవలననే యర్థంబపేక్షించి వారలను జేరఁదీసెను? అసురులవలన నెట్టిభయంబు శంకించి వారియెడఁ బగఁ బూనెను?'

సుఖదుఃఖంబులకుఁ గర్మము కారణమా ? గుణము కారణమా?

'సమస్తజీవరాశియొక్క సుఖదుఃఖాదులకు వారి సుకృతదుష్కృత కర్మంబులే కారణం బగుననియు, కర్మఫలంబునుమాత్రమే భగవానుఁడు నియమించుననియుఁ బెక్కుసారులు చెప్పితిరి. కర్మము గుణవ్యవహార ఫలంబగును. గుణము ప్రత్యేకించి కారణమగునా ? లేక కర్మము ప్రత్యేకించి కారణమగునా ? అట్లుగాక రెండును గలసి నిమిత్తంబు లగునా ? మఱియు కర్మములుమాత్రమే కారణంబులనియు గుణంబులు హేతువు లగుననియు నందురా ? గుణములుమాత్రమే నిమిత్తంబు లనియుఁ గర్మంబులు గుణవ్యక్తరూపంబులు మాత్రంబులగుననియు వచింతురా ?' యని యడిగెను.

శుకమహర్షి వానిని విని 'రాజా! సంకల్పముతోడఁ గర్మము ప్రారంభించుచున్నది. గుణములు కర్మంబునకు నానాత్వంబును గలిగించు చున్నవి. గుణంబులనుబట్టి ఫలనానాత్వంబు గలుగుచున్నది. సంకల్ప మన్ననో యారంభకఫలవాసనారూపంబున నుదయించును. కావున భోగ్యవాసనలే కర్మప్రారంభకంబు లగు.' సంకల్పము ముందా ? వాసన ముందా ? యని శంకింపవచ్చును. చెట్టు ముందో విత్తు ముందో చెప్పుటకు నెట్లు సాధ్యముగాదో యట్లే సంకల్పము ముందో వాసన ముందో చెప్పఁదరముగాదు'అనెను. పరీక్షిత్తు తద్వచనంబుల నాలకించి 'మునీంద్రా! రాగద్వేషంబులు రజోగుణ సముద్భవంబులనియు, రాగద్వేషవంతులకు శాంతి గలుగదనియు, శాంతి లేనినాడు ఆనందము సిద్ధింపదనియు నందురు. భగవానుఁ డన్ననో నిరంతరానందమూర్తి యనిరి. ఇది యెట్లు సరిపోవునో యూహింపరాకున్న' దని యడిగెను.

శుకుఁ డిట్లనియెను.—'రాజా ! ఇవియన్నియు గుణవశులయెడ వర్తించును. భగవానుఁడు గుణాతీతుఁడు గావున వానియెడ గుణకార్యంబు వర్తింపదు. మఱియు రాగద్వేషాదులు వర్తించుటకుఁ దత్సాధనభూతంబులైన దేహేంద్రియాదు లుండవలయును. భగవంతుఁడు

నిరాకారుఁడు నవ్యక్తుఁడు గావున వానికి దేహంబుగాని యవయవంబులు గాని గలుగవు. అట్లగునేని శరీరాంతరమైన రాగద్వేషాదులు జడరూపంబు నెట్లు వర్తించునందువా? భగవానుఁడు సర్వశక్తిమంతుఁడు. వానిశక్తినిఁ బ్రకృతి యనియు మాయ యనియు వచింతురు. ఆశక్తి శక్తిమంతుఁడైన భగవానుని బాయకయుండును. నిప్పును దానివేడిమియు నిందులకు నిదర్శనంబులు. ఆశక్తి దానివ్యవహారావస్థయందు సత్త్వాదిగుణత్రయరూపంబున వ్యవహరించును. దానికి స్వాతంత్ర్యములేదు. స్వాతంత్ర్యము లేనిచో నెట్లు వర్తించునందువా ? కాలప్రేరితమై వర్తించును. కాలప్రేరణము కర్మఫలపరిపక్వంబునుబట్టి యుండును. శక్తికి శక్తిమంతులకు నవినాభావం బగుటంబట్టియు, కాలంబుకూడ శక్త్యంశమే యగుటంజేసియు శక్తి యేరూపంబున వ్యవహరించినను శక్తిమంతునివ్యవహారమే యగుఁగదా యనియు శంకింతువా ? రాజా ! శక్తి యనునది గుణంబులను బ్రేరేపింపదు. శక్తిసాన్నిధ్యంబున గుణంబులు శక్తిమంతంబులై వానివానిస్వభావ ప్రకారము వర్తించును. సూదంటురాయి సాన్నిధ్యంబున నినుపముక్కలు వ్యవహరించుటయే యిందులకు నిదర్శనము. ఇనుపముక్కల వ్యవహార ఫలంబులు సూదంటురాతికి నెట్లంటవో యట్లే గుణకార్యంబులు శక్తికిఁ గాని శక్తిమంతునకుఁగాని చెందవు.

రాజా ! స్వభావం బనునది ప్రారబ్ధకర్మఫలసముచ్చయం బని చెప్పితిని. స్వభావంబన్నను బ్రకృతియన్న నొక్కటే యగు. ఆస్వభావంబు త్రిగుణాత్మికంబు గావున గుణవ్యవహారంబు ప్రారబ్ధకర్మఫలవాసనాధనం బగు. ఆవ్యవహారము గుణానురూపంబున వ్యక్తమగును గావున వ్యవహారమైనకర్మము గుణాధీన మనిరి.

### కాలప్రేరణవిధానము

రాజా ! కాలప్రేరణం బెట్లందువా ? ప్రకృతిశూన్యమైన యుపాధియే గలుగదు. ఉపాధులు కర్మఫలానుభవార్థము గలుగుచున్నవి. కర్మఫలంబులు గుణవ్యవహారంబునుఁబట్టి సాత్త్వికంబులో రాజసంబులో

తామసికంబులో యగు. ఏఫలంబునకు భోగ్యావసరంబగునో యాఫల కారణంబైన గుణంబు దాని యదనునందు వ్యవహరించును. ఈవిధానం బునే కాలప్రేరణ మందురు.

సత్త్వప్రకృతిని దైవంబనియు, రాజసప్రకృతిని ఆసురంబనియుఁ తామసికప్రకృతిని రాక్షసంబనియు వచింతురు. సత్త్వప్రకృతిప్రధానం బుగా గలవారిని దేవతలనియు, ఋషులనియు, రజఃప్రకృతిప్రధానం బుగాఁగలవారిని అసురులనియుఁ దమోప్రకృతిప్రధానంబుగాఁగలవారికి యక్షరాక్షసులనియు వర్గీకరించిరి. చంద్రోదయంబున సముద్రంబట్లు తత్కాలోదయంబున నయ్యాగుణము ప్రవృద్ధిచెందును. గుణవృద్ధి క్షయంబులెల్ల తత్తజ్జీవకర్మవిపాకకాలంబునుబట్టి యుండును.

రాజా! భగవానుఁడు సర్వగతుఁడని చెప్పితిని. ఆపక్షంబున భగవానుఁడు సర్వశరీరంబులందు నుండుట యేర్పడును. రాగద్వేషాదు లును సుఖదుఃఖాదులును భగవన్నిర్మితంబులే యగునేని భగవానుఁడు సర్వోపాధులందు నుండుఁగావున రాగద్వేషాదిఫలంబుల ననుభవింపక తప్పదందువా? ఎవఁడైనను దుఃఖముగోరి తెచ్చికొని యనుభవించువాఁ డుండునా? కావున రాగద్వేషసుఖదుఃఖాదులు భగవన్నిర్మితంబులు గావు.

అవి యెవ్వనినిర్మితంబులైన నగుఁగాక యనియు, ఉపాధిస్థుఁడు వాని ననుభవింపకుండుట యెట్లనియు శంకింతువా? మంటలోఁ బెక్కు విధములైన కట్టెలను వేయుదురు. ఆకట్టెలగుణదోషంబు లాయగ్నికి నంటునా? అవి దేనికి వ్యాపించుచున్నవందువా? అగ్నికి నుపాధియైన మంటకు వ్యాపించుచున్నవి. ఆకారణముననే మంట వివిధంబుల నుండు చున్నది. అట్లే భగవానుఁ డంతర్యామియైయున్నను గుణకార్యంబులు శరీరంబునకు వ్యాపించునేగాని యంతర్యామికిఁ దగులవు.

రాజా! ఆగుణత్రయంబులో నొక్కటి వృద్ధిగాంచినప్పుడు తక్కి నవి క్షీణత ప్రాప్తియుండును. ఈవృద్ధిక్షయంబుల పోరాటమే యుద్ధ మనఁ బడును. ఈగుణంబులు మార్చిమార్చి వృద్ధిక్షయంబులు కాలానుసారం

బుగాఁ గాంచుచుండుటంజేసి యుద్ధంబు లప్పుడప్పుడు సంభవించు టగుచున్నది.

రాజా! ఆ మూఁడుగుణంబులలో సత్త్వము శాంతిరూపంబున నుండు. దానివలన నన్యంబులకు నపకారము గలుగదు. దానంజేసి సత్త్వంబు రక్షింపఁబడుటవలనఁ బ్రపంచరక్షణంబు సిద్ధించుచున్నది. సత్త్వమునకు హానిగలిగినప్పుడు ప్రపంచహాని కలుగుచున్నది. ప్రపంచం బనఁగా నేమందువా? భగవంతుని విస్తృతియే అనఁగా అవ్యక్తావస్థనుండి వ్యక్తావస్థఁ జెందుటయే ప్రపంచం బనఁబడును. ప్రపంచంబునకు ముప్పు రాకూడదని భగవత్సంకల్పము. వేయేల? ప్రపంచంబు భగవంతునిశరీరం బగును. శరీరహాని నెవ్వరేనిఁ గోరుదురా?

సత్త్వంబునకు దేవాదులశరీరంబులును, రజస్సునకు అసురశరీరంబులును, తమస్సునకు యక్షరాక్షసశరీరంబులును నైజాశ్రయంబు లగుటఁ దెలిపితిని. ఆకారణంబున లోకప్రశాంతికై సత్త్వాశ్రయంబులైన దేవాదిశరీరంబులరక్షణము కర్తవ్యమగును. ఒకదానిని రక్షింపవలయు నన్నచో దానికి భంగకరంబైనదానిని దొలఁగించుట విధి యగును. కాఁబట్టి సురలను రక్షించుటకుఁగా నసురసంహారంబు గలుగుచున్నది. అట్లు భగవంతుఁడు చేయుట రాగద్వేషకార్యంబులు గావా? యని శంకింతువా. అట్లు చేయుట రాగద్వేషకార్యంబులు గావు. వైరుతోడఁ గలుపు పెరుఁగుచున్నది. కలుపు నట్లే వదలినచోఁ బైరు లోకోపకార మైనది నశించును. పైరురక్షణార్థము కలుపును దీసివైతురుగదా. దుష్ట శిక్షణంబు శిష్టరక్షణార్థమేగాని రాగద్వేషంబులపైఁ బ్రీతిం గానేరదు. శిక్షకు సామదానభేదదండంబులని చతురుపాయంబులు గలవు. మొదటి మూఁడు నుపయోగింపనినాఁడు నాల్గవదానిప్రయోగము తప్పనిసరణి యగుచున్నది.ఎవఁడుగాని తన సత్త్వాభివృద్ధిని గోరువాఁడు రజస్తమస్సుల నుపాయాంతరంబున నడంచివైచుట చూతుముగదా! రజస్తమస్సులు బలవత్తరంబులైనప్పుడు కఠినోపాయముల ననుసరింతురుగదా! రాజా!

నీసంశయంబు తొలంగుటకై నారదమహర్షివచనంబులను దెలిపెద వినుము.

### శిశుపాలవధ

రాజా ! నీతాత ధర్మనందనుఁడు రాజసూయయాగంబును దల పెట్టెను. ఆమఖంబునకు ఋషీంద్రులును దుర్యోధనాదికౌరవులును రాజులును సామంతరాజులును వచ్చిరి. చేదిదేశవల్లభుఁడైన శిశుపాలుఁడు గూడ నరుదెంచెను. అప్పుడు శిశుపాలుఁడు శ్రీకృష్ణభగవానుని దూఱనా డెను. భగవానుఁడు చక్రంబును బ్రయోగించి శిశుపాలు తలఁ దఱిగెను. శిశుపాలుఁడు వాసుదేవునిలో సాయుజ్యమందెను.

అది చూచి సభాసదులెల్లరు మహాశ్చర్యవశులైరి. ధర్మనంద నుఁడుగూడ నవ్విపరీతంబునకు నచ్చెరువొంది 'ఏమి యిది ! శిశుపాలుఁడు భగవానునకుఁ బరమవిద్వేషియగు. అట్టివానికి మహాభాగవతదుర్లభమైన వాసుదేవసాయుజ్యంబు లభించుట యెట్లు ? ఇంతకన్న వింతగలదా ?' యని తలపోసి చెంతనున్న నారదునివంక మఱలి 'తొల్లి వేనుఁడు భగవ న్నిందఁ గావించెననియుఁ దత్ఫలంబుగాఁ దమోగ్రస్తుఁ డయ్యెననియుఁ జెప్పుదురు. భగవద్వేషవిషయంబున శిశుపాలదంతవక్త్రులు వేనునకుఁ దీసిపోవువారుగాదు. మాటలు నేర్చినదిమొదలు వీరు భగవానుని గూర్చి తిట్టనితిట్టులేదు. శ్రీకృష్ణుని మాటయన్న వీరు సహింపరు. ఈ దుష్టులు పరమాత్మునిగూర్చి పల్కినకాఱుపల్కులు విన్నవారెల్లరు 'కటా ! ఈచెనఁటులనాల్కలుపయిఁ బుండుపుట్టదా ? ఈఘోరాత్ములకు నరకమైనఁ గలుగదా ?' యని చింతించుచుందురు. అట్టి శిశుపాలుఁడు నేఁ డీనిండుసభలోఁ బరమేశ్వరసాయుజ్యంబునొందుట వింతగా నున్నది. ఈవింతఁ జూచినదిమొదలు నామనంబు గాలికి దీపశిఖవలె నల్లలలాడు చున్నది. దీనిరహస్యంబేమో యెఱింగింపఁ బ్రార్థింతు' ననెను. నారద మహర్షి వాని కిట్లనియెను.

'ధర్మనందనా! భగవన్నిందాపరులకు నరకమే శరణంబని భావింతువు గాఁబోలు! నింద యనఁగా నేమి? పరులదోషంబుల నెంచుట నింద యనఁబడును. స్తుతి యనఁగా నేమి? పరులసుగుణంబులను గీర్తించుట స్తుతి యనఁబడును. పూజాద్రవ్యంబులచేత నొకని గౌరవించుట సత్కారం బనఁబడును. మాటలచేతనో కార్యములచేతనో యొకని నవమానించుట తిరస్కారమగును. ఈనిందాస్తుతులును సత్కారతిరస్కారంబులు నెవ్వనికి నన్వయించును? అనఁగా, శరీరంబునకా? లేక, శరీరాంతర్గతుఁడైన భగవంతునకా? శరీరాంతర్గతుఁడైన భగవంతునకు రూపనామంబులు గలుగవు. కాఁబట్టి యవి వానికి నన్వయింపవు. అవి శరీరసంబంధంబులే యగును.

శరీరాదులు ప్రకృతికార్యంబులు. శరీరాంతర్గతుఁడైన పురుషుఁ డన్ననో పరాత్పరుఁడై యుండును. ప్రకృతిపురుషులతత్త్వం బెఱుంగక ప్రకృతియే పురుషుండని భావింతురు. అట్టిభావము కేవలం బజ్ఞానఫలం బగును. ఆభావంబుతోడ 'నేను, నాది' అనునట్టి యభిమానము పైకొనుచున్నది. తత్ఫలం బేమందువా? శరీరంబునకుఁ గలుగు నిందాస్తుతులు గాని రక్షణవధలుగాని శరీరాంతర్గతమైనయాత్మకుఁ గలుగునవిగా నెంచి రాగద్వేషాదులపాలగుదురు.

రాజా! అట్టి యభిమానంబు జనింపనినాఁడు రాగద్వేషంబులును స్నేహవైరంబులును గలుగనేరవు. భగవానుఁడు నిరభిమానుఁడు, సర్వసముఁడు. కాఁబట్టి వానికి రాగద్వేషాదులు గలుగవు. అట్టివాఁడు పరులకు దండనాదులను విధించుట యేల యందువా? అట్లుచేయుట ప్రాణులమేలునకే యని గ్రహింపుము. కావున వానికి హింసాదులను మాటగట్టవలదు. దేహాభిమానత్వం బెట్లు కలుగుచున్నదందువా? జీవుని యనాదిపుణ్యపాపకర్మంబులు దేహాభిమానంబునకు మూలంబగును. భగవంతునకుఁ గర్మములు లేవు గావునఁ బుణ్యపాపంబులుగాని తత్ఫలభోగసాధనంబులైన దేహంబులుగాని తదభిమానంబుగాని వానికిఁ గలు

గవు. దండనం బొకకర్మ యగుననియు దండనక్రియాఫలంబు కర్తకుఁ దగులకుండుట యెట్లనియు శంకింతువా? అభిమాన మున్నప్పుడు కర్తృత్వము గలుగును. అది లేనినాఁడు కర్తృత్వముగాని తత్ఫలభోగావసరంబుగాని యెట్లు గలుగును? వేయేల? అభిమానరహితులు చేయు కర్మంబులు కర్మంబులే గావని గ్రహింపుము.

### సాయుజ్యము

ధర్మనందనా! సాయుజ్య మనఁగా నేమి? ఐక్యభావము సాయుజ్య మనఁబడును. ఐక్యమన్నప్పుడు రెండువస్తువు లుండవలయును. మఱియు నా రెంటితత్త్వంబు పరస్పరసంయోగానుకూలముగా నుండవలయును. విరోధతత్త్వంబులకు నైక్య మెప్పుడును గుదురదు. చక్కెరకు లవణంబునకు నైక్యము గలుగునా? ఈసంగతి ముందు గ్రహింపుము.

### సాయుజ్యము దేనికి?

శిశుపాలుఁడు సాయుజ్య మొందుటఁ జూచితిరి గదా! వాని శరీరంబు సాయుజ్యమందెనా? శరీరం బిందే పడియున్నది. కాఁబట్టి శరీరసాయుజ్యము గలుగలేదు. మఱి దేనికి సాయుజ్యము గలిగెను? శిశుపాలుని శరీరంబునుండి యొకటి తేజోరూపంబున వెడలి శ్రీకృష్ణభగవానునిలోఁ బ్రవేశించుట చూచితిరిగదా! ఆతేజస్సే యాత్మ యనఁబడును. ఆత్మయనునది పరమాత్మయంశమే గావున నయ్యది యట్లు కలియుటకు సాధ్యమయ్యెను. అనఁగా మనయాత్మ పరమాత్మతోఁ దాదాత్మ్యంబుపొందుట సాయుజ్య మనఁబడును.

### తాదాత్మ్యకారణము

తాదాత్మ్యం బెట్లు గలుగునందువా? ఎప్పుడు బుద్ధి నిరంతరము తత్పరత్వముఁ దన్మయత్వంబు నొందునో యప్పుడు తాదాత్మ్యంబు గలుగును. బుద్ధి యట్లగుటకుఁ గారణ మేమందువా? వైరంబునఁ గొందఱకు, భక్తిచేతఁ గొందఱకు, భయంబునఁ గొందఱకు, స్నేహంబునఁ గొందఱకు,

గామంబునఁ గొండఱకు మూలవస్తువునందే బుద్ధి నిలిచి తన్మయతఁ జెందును. తత్ఫలంబుగా సాయుజ్యంబు సిద్ధించును. వైరంబున శిశుపాలాదులకును, భక్తియోగంబున మాబోంట్లకును, భయంబునఁ గంసునకును, స్నేహంబునఁ బాండవులైన మీకునుఁ బ్రేమంబునఁ గోపికలకును దన్మయత గలిగెను.

ధర్మనందనా! ఈయైదింటిలో వైరానుబంధంబునఁ దన్మయత శీఘ్రముగాఁ గలిగినట్లు తక్కినవాల్గింటఁ గలుగదని నాభావము. ఇందులకు భ్రమరకీటన్యాయమే నిదర్శనము. కారణ మేమందువా? భక్తి మొదలైనవానియందు బుద్ధి యెప్పుడో యొకప్పుడేనియుఁ బరముఖంబుగా వచ్చును. వైరం బట్టిదానికి నెడమీయదు. ఎప్పు డేమి గల్గునో యని సర్వకాల సర్వావస్థలందు బుద్ధి తదేకచింతామయమై యుండును. శిశుపాలుఁడు వైరనిమిత్తంబున నిద్రాహారసమయములందుఁగూడ శ్రీకృష్ణభగవానునే తలంచుచు వానితోడిదే లోకంబుగా నుండెను. ఆకారణంబున వానికి శీఘ్రసాయుజ్యము లభించెను. ప్రేమపూర్వకసాయుజ్యంబు సౌమ్యమగు. ఇది కొంతదారుణముగాఁ దోఁచు. వేనుఁడన్నవో యతఁడీ యైదుతెగలలో నేతెగకు సంబంధింపఁడు. అందువలన వానికి సద్గతి దూర మయ్యెను. వేనునకుమాత్రం బట్టిభావం బేల కలుగలేదందువా? ఏభావముగాని యావ్యక్తియొక్క ప్రారబ్ధకర్మఫలానుసారంబుగా నుండును. శిశుపాలుని ప్రారబ్ధకర్మఫలవిశేషం బేమందువా? ఆసంగతి చెప్పెద వినుము.

### శిశుపాలదంతవక్త్రుల చరిత్ర

ధర్మనందనా! ఈ శిశుపాల దంతవక్త్రులు తొల్లి శ్రీమహావిష్ణుపార్షదులుగా నుండిరి. బ్రహ్మమానసపుత్రులు సనకసనందనాదులు ముల్లోకంబులుసంచరించుచుఁ గొండొకనాఁడు విష్ణులోకంబునకు నాకస్మికముగా వచ్చిరి. వారి కప్పటికి నేండ్లు పూండ్లు గడచినను ఏడేండ్లబాలకులుగా వారు దోఁచుచుండిరి. మఱియు వారు దిగంబరులుగా నుండిరి.

అప్పుడు విష్ణుపార్షదులుగానుండిన యీ శిశుపాలదంతవక్త్రులు వారిని జూచి శిశుప్రాయుడగుటకుఁ దోడుగా దిగంబరులుగా నున్న వారు శ్రీవిష్ణుదర్శనంబునకు యోగ్యులుగారని తలంచి వారిని లోనికిఁ జొరనీయరైరి. ఆమహర్షులు పార్షదులచర్యఁ జూచి 'ఏమి! శ్రీమహావిష్ణు పాదమూలంబునందుఁగూడ రజస్తమస్సులకు నెడమున్నదా?' యని లోలోనఁ దలంచి 'బాలిశులారా! మీచర్య రజస్తమోమూలకంబగు. కేవల సత్త్వప్రధానమైన శ్రీవిష్ణుస్థానంబునకు మీరు రక్షకులుగా నుండఁ దగరు. పాపిష్ఠంబైన యాసురజన్మంబును మీగుణంబులకుఁ దగినదాని నెత్తుదురుగాక!' అని శపించిరి. ఆద్వారికులు భయమంది 'మహాత్ము లారా! దిగంబరులు రాజదర్శనయోగ్యులుగారని మిమ్ము వారించితిమి. మీమాహాత్మ్యం బెఱుఁగని మాయజ్ఞానంబును సైరించి మాకు శాప మోక్షణంబు ననుగ్రహింపు' మని వేడిరి. ఋషీంద్రులు వారికై జాలిపడి 'మాశాపము తప్పదు. సురజన్మంబు లేడో యసురజన్మంబులు మూఁడో యెత్తి తర్వాత మీస్థానంబులు చేరుదు' రనిరి. సురభోగంబు లనుభవిం చుచు నేడుజన్మంబులపర్యంతము భగవద్వియోగంబుఁ గాంచుటకన్న నసురవృత్తులయ్యు మూఁడుజన్మంబులు గడపి శీఘ్రకాలములోనే భగవ త్సాన్నిధ్యముచేరుట మేలని యాపార్షదులు నిశ్చయించిరి.

రాజా! నారదుఁ డట్లు చెప్పఁగా, ధర్మనందనుఁడు విని 'ఋషి వర్యా! విష్ణులోకంబు సత్త్వగుణభూయిష్ఠులకుఁదక్క నన్యులకు సాధ్య ముగా దందురు. ఆద్వారపాలకులు సత్త్వగుణులగుటంబట్టి వారికి నట్టి స్థానము లభించెను. వారంతసత్త్వస్వభావులయ్యును నాఁ డట్లు సనకా దులయెడ నవినయంబుఁ జూపఁ గారణమేమి? యని యడిగెను. నారదుఁ డిట్లనియెను.

'కుంతీనందనా! ఎల్లశరీరంబులు గుణత్రయంబుతోఁ గూడి యుండును. గుణంబు లెప్పుడుగాని యొక్కదాని నొకటి విడిచి ప్రత్యే కించి యుండవు. వానియునికి ముప్పిరిత్రాడునుబోలును. వానిలో సత్త్వ

గుణము ప్రధానమైనప్పుడు ఉత్తమలోక స్థితియు, రజస్సు ప్రధానమైనప్పుడు మధ్యమ లోకస్థితియు, తమోగుణము ప్రధానమైనప్పుడు అధోలోకస్థితియు యోగ్యంబగు. విష్ణులోకస్థితికి సత్త్వము ప్రధానమగుట నిజము. సత్త్వగుణము ప్రధానం బన్నంతనే తక్కినవి రెండు వలసపోయెనని యెంచవలదు. అవి రెండును బాముపడగక్రింద కప్పవలె నణగియుండి తెఱవచ్చినప్పుడు వానిస్వభావంబు నంతో యింతో ప్రకటించును.

మఱియొకవిషయముగూడ గ్రహింపవలయును. ఆద్వారపాలకుల సత్త్వగుణంబు విష్ణులోకనివాసమాత్రంబునకు యోగ్యంబగునేగాని యంతకుమించినశక్తి దానికిఁ గలదని తలంపవలదు. వారిద్వారపాలకోద్యోగంబునుబట్టియే యది స్పష్టము. వారిసత్త్వగుణంబు తావన్మాత్రంబైనను తత్కాలంబున నది యట్లుడిగి రజోగుణవ్యవహారంబునకుఁ దావిచ్చుట యేలందువా ? ప్రభుదర్శనంబునకుఁ గొన్నిమర్యాదలు గలవు. అవియేవి యందువా ? దర్శనార్థులు యుక్తవయస్కులుగా నుండవలయును. వారివేషము యథోచితంబుగా నుండవలయును. సనకాదులు వయస్సునుబట్టియు వేషంబునుబట్టియుఁ బ్రభుదర్శనమర్యాదారూహ్యులుగా నుండిరి. ఆకారణంబు వారి నట్లు వర్తింపఁజేసెను.

ధర్మనందనా! ఇదంతయు నిమిత్తమాత్రము. వారి ప్రాక్తనకర్మఫలం బప్పు డట్లు ఫలోన్ముఖంబయ్యెను. ఆకర్మఫలంబు ననుభవింపవలసియుండుటంజేసి యత్తఱి వారికి నట్టిబుద్ధి జనించెను. ఆఫలంబు ననుభవించి పరిశుద్ధు లగుటకుగా భగవానుఁడు వారికి నవ్విధంబున నవకాశము గలిగించెను. వారు తత్కర్మఫలం బనుభవించి యథాస్థానముఁ జేరిరి.

### శాపఫలజన్మంబులు

ఆపార్షదులు మొదట దితికి హిరణ్యకశిపహిరణ్యాక్షులుగా జనించిరి. రెండవజన్మంబున విశ్రవసువునకుఁ గైకసివలన రావణకుంభకర్ణులై నారు. మూఁడవజన్మంబున మీ మేనత్తకు శిశుపాలదంతవక్త్రులుగాను

బుట్టిరి. ఇది వారి కడపటిజన్మము; శాపము తీఱెను. వారు వారిస్థానంబులకుఁ జనిరి.

## హిరణ్యకశిపుని చరిత్ర

ధర్మనందనా! హిరణ్యాక్షుఁడు భూమండలంబును జాపఁగాఁజుట్టి నిర్మూలం బొనర్పకుండెను. అప్పుడు భగవానుఁడు వరాహావతార మెత్తి వానిని సంహరించి భూమి నుద్ధరించెను. హిరణ్యకశిపుఁడు వానితమ్మునిఁ జంపినపగను దీర్చికొనుటకై ఘోరతపం బొనర్చి బ్రహ్మవలన దుస్తరమైన వరంబులు పడసెను.

హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదుఁ డనుపుత్త్రుఁడు గలఁడు. అతఁడు పుట్టువుదొట్టి విష్ణుభక్తుఁడై తదేకస్మరణాయత్తచిత్తంబుతో నుండెను. హిరణ్యకశిపుఁడు వానికిఁగల విష్ణువుమీఁదిపగం జేసి ప్రహ్లాదుఁడు స్వపుత్త్రుఁడైనను విష్ణుభక్తుఁడైనకారణంబున వానినిఁ బెట్టరానిబాధలు పెట్టెను. ఎంతబాధించినను బ్రహ్లాదునకు బుద్ధి మాఱదయ్యెను. ఎట్టకేలకు వానినిఁ జంప యత్నించెను. భగవత్తేజోరక్షితుండగుటం జేసి ప్రహ్లాదునియెడ నట్టి యత్నంబులు కొనసాగవయ్యెను.

రాజా! ధర్మనందనుఁ డంతవఱకు విని 'మునివర్యా! పుత్త్రుఁ డెంత దుర్మార్గుఁడైనను దలిదండ్రులకుఁ బ్రియుం డగుఁగదా! మఱియుఁ బ్రహ్లాదుఁడు భగవద్భక్తుఁ డంటివి. అట్టివాఁడు పితరులకుఁ బ్రియతముఁడు గావలదా? లోకవిధానం బిట్లుండఁగా హిరణ్యకశిపుని వర్తనంబు లోకవిరోధంబుగా నుండుటకుఁ గారణమేమి?' అని యడిగెను. నారదమహర్షి వాని కిట్లనియెను.

'ధర్మనందనా! హిరణ్యకశిపుఁడు భ్రాతృవధాజనితశోకరోషపరితప్తుఁడై పగఁదీర్చికొన నిశ్చయించి దానవదైతేయాగ్రణులను సభగూర్చి 'యోధానుయోధులారా! విష్ణువు సర్వసముఁ డందురు. వానికి నెట్టి యపకారముఁ జేయమైతిమి. అతఁడు వానిబంట్లగు సురలమాటలు నమ్మి

నిష్కారణంబుగా నాతమ్మునిం జంపెను. ఈకపటాత్ముని మనసీయరాదు. నాశూలంబునకు వానిని బలియిడి తద్రక్తంబులచేత నాతమ్మునకుఁ దర్పణం బొనర్చి నామనోవ్యథఁ దీర్చికొన నిశ్చయించితిని. వానితోడ గీర్వాణు లెల్లరును మొదలునఱికిన వృక్షంబుకొమ్మలగతినొంది నశింతురు. నాకని తీర్చికొని నేను వచ్చునందాఁక మీ కొకమాటఁ జెప్పుచున్నాను. నామాటను జవదాఁటక చేయవలసినది. ఏమిసేయవలయు నందురా ? వైరిని జయింపవలయునన్నచో ముందుగా వాని వివిధబలంబుల నడిపి బాములుపెట్టి తర్వాత వైరిని ఢీకొనవలయును. విష్ణుబలం బెద్ది యం దురా ? యజ్ఞధర్మంబులును దేవర్షిపితృభూతధర్మంబులును వానికి నూత కట్టి లగును.ఆధర్మంబులను బ్రాహ్మణులు సల్పుదురు. ధాత్రీమండలం బెల్లఁ గలయందిరిగి యెందెందుఁ దపోయజ్ఞస్వాధ్యాయవ్రతదానపరులుందురో వారినెల్ల వెదకి వెదకి బొరిగొనుఁడు. మఱియు గోబ్రాహ్మణవర్ణాశ్రమ క్రియాభివృద్ధి యెందెందుఁ గాన్పించునో యాప్రదేశంబులనెల్ల బట్టణంబు లనక పల్లెలనక కాల్చి బూదిసేయుఁడు' అని పండ్లుగీఁటుచు ఘూర్ణిల్లుచు మేఘగర్జాధ్వని నాజ్ఞాపించెను.

## హిరణ్యకశిపుఁడు తల్లి నోదార్చుట

హిరణ్యకశిపుఁ డట్లు వానినాయకులకు నాజ్ఞాపించి తమ్మునకుఁ గాఁ దిలోదకదానాదులు గావించి తల్లిని మఱఁదలను జేరఁబోయి 'హిరణ్యా క్షుఁడు వీరమరణంబు నొందెను. శూరులకు నంతకన్న నీప్సితతమంబును శుభస్కరంబు నైనది గలుగదు. వానికై వగవఁ బనిలేదు. ఆసంగతి యటు లుండనిమ్ము. చలిపందిరిలో బాటసారులట్లు లోకంబున భూతంబులు కూడుచుఁ బాయుచునుండు. కావున జీవుల పరస్పరశరీరసంయోగవియో గంబులు తాత్కాలికంబులగునేగాని సతతంబులుగావు. ఆత్మఁ డన్నవో యతఁడు నిత్యుఁడు నవ్యయుఁడు శుద్ధుఁడు సర్వగతుఁడు సర్వజ్ఞుఁడు నన్నింటికిం బరుండు నగు. అతఁడు మాయోపాధిం గూడినప్పుడు వాని సాన్నిధ్యంబునఁ జేసి సుఖదుఃఖాదులు పుట్టుచున్నవి. వాని ననుభవించువాఁ

డెవఁడందురా ? ఆసుఖదుఃఖాదుల నతఁడే సంసారోపాధియైన లింగశరీరం బున గ్రహించుచున్నట్లు తోఁచును. వాస్తవస్థితి యదిగాదు. నిదర్శనం బేమందురా ? కొలనిగట్టు వృక్షములు తన్నీరంబులందుఁ బ్రతిబింబించు నప్పుడు జలంబుల యలలకదలికంజేసి యావృక్షులప్రతిబింబంబులు గూడఁ గదలియాడుచున్నట్లు దోఁచుట చూడమా ! జలబింబితవృక్షం బుల చలనంబులఁబట్టి యాబింబమూలంబులైన గట్టునందలి వృక్షములు గూడఁ జలించుచున్న ట్లూహింతుము. వాస్తవముగాఁ దీరవృక్షంబులు కదలుటలేదు. అట్లే యాత్ముఁడు నిర్వికల్పుఁడయ్యు మనోగుణభ్రాంతిం జేసి తద్గుణధర్మంబైన వైకల్యంబును దాను బడయుచున్నట్లు భావించును. ఇట్టి భ్రాంతికిఁ గారణం బేమందురా ? అభిమానమే కారణము. దానివ్యవ హారం బెట్టిదందురా ? అనాత్మయైనదేహంబు నాత్మగాఁ దలంచుట, దేహసంబంధములైన ప్రియాప్రియసంయోగవియోగంబులును, గర్మ సంసారంబును, శోకమోహంబులును విషయచింతలును వివేకవిస్మృతియు జననమరణంబులు దనవిగా భావించుట - ఇవియెల్ల యభిమానజనితంబు లగును.'

### నిష్కారణముగా శోకము జనించునా ?'

'తల్లీ ! శోకము నిష్కారణంబుగా జనించునా యని శంకింతువా ? ఈవిషయమై పూర్వము యమునకును బ్రేతబంధువులకును గొంత వాదము జరిగెను. ఆయితిహాసంబును వినుము.

### యమప్రేతబంధువుల సంవాదము

తల్లీ! తొల్లి యుశీనరదేశమందు సుయజ్ఞుఁ డనురాజొకఁ డుం డెను. కొండొకనాఁడు వానికి వారివైరులతో యుద్ధము సంభవించెను. ఆసమరమం దతఁడు భుజంబులు తెగి బాణనిర్భిన్నహృదయుఁడై యొడలు గఱచుచు నేలఁగూలెను. అట్లుపడియున్న వానియొద్దకు నతనిభార్యలు వచ్చి వానిపయింబడి ఱొమ్ములు గుద్దుకొనుచుఁ బేరెలుంగున నేడ్చుచు నాథా ! బ్రహ్మదేవుఁడు నీకును మాకును వియోగంబు గల్గించెనా ?

కిటా! అతఁ డెంతదయాశూన్యుఁడు! నాథా! ఉశీనరులకెల్ల వృత్తిని గలిగించి తత్సుఖవర్ధనుఁడవైతివి. అట్టి నీవే వారికి నేడిట్లు శోకవర్ధనుఁడ వగుట తగునా? అయ్యో! నీమన్ననలఁ బెఱిగితిమి. ఇఁక మాకు గతి యెవ్వఁడు? నిన్నుఁబాసి యింట నుండఁజాలము. నీతోడ వత్తుము గొనిపొమ్ము. అట్లైన మాకు నీసేవాభాగ్యంబు గలుగు'నని వివిధగతుల విలపించుచు తేని శవంబును సంస్కారార్థము గొనిపోనీయరైరి.

యముఁడు వారిదుఃఖారావంబును విని 'అహో! ఇంత యజ్ఞానం బుండునా? ఏండ్లపర్యంతము మనియు లోకస్థితిని బరిశీలించియు వీ రిట్టి వ్యామోహావశులగుట వింతగా నున్నది. పుట్టినవస్తువు లెట్టకేలకు నవి బుట్టినచోటునకే చనును. వీరికిగూడ నట్టిగతి తప్పదు. ఈరహస్యం బెఱుంగక వీరిట్లు శోకించుచున్నారు' అని తలపోయసాగెను. అంతలోన సూర్యుఁ డస్తమించెను. అంతట యముఁడు బాలునివేషము ధరించి యటకువచ్చి 'అబలలారా! మీ రేడ్చుటకుఁ గారణమేమి? మిమ్ము రక్షించుచున్నవాఁడు పోయె నని యేడ్చుచున్నారా? మీరు మీ తల్లుల గర్భంబులలో నున్నప్పుడు మి మ్మెవ్వరు రక్షించిరి? అంత మాత్రంబు యోచింపరేల? అప్పు డెవ్వఁడు రక్షించె నందురా? ఏపర మాత్ముఁడు నిజేచ్ఛాప్రకారము సృష్టిస్థితిలయంబులు గావించునో యా పరమాత్ముఁడే సర్వరక్షకుఁ డగు. వానికి విశ్వంబెల్లఁ గ్రీడాసాధనంబగు. దైవరక్షితమే రక్షితంబనియు, తదితరరక్షితంబు లెప్పుడును రక్షితంబులు గావనియు, ముల్లెమూఁట దారిలోఁ బడిపోయినను అది దైవరక్షితం బగునేని చెక్కుచెదరదనియు, అట్లుకానినాఁడు గృహాంతరంబున దాఁచిన వస్తువుగూడ మాయ మగుననియు గ్రహింపుము. మఱియు భగవద్రక్షి తుఁడు గహనాంతరమందు ఘోరమృగంబులమధ్యఁ జిక్కినను సుఖం బుండును. ఈశ్వరోపహతుఁడు గృహాంతరసీమఁ జొచ్చి వివిధరక్షక రక్షితుఁడైనను బ్రదుకఁడు. నిగ్రహానుగ్రహంబులకెల్ల నయ్యాశ్వరుఁడే విక్కగు.

### దేహోత్పత్తినాశంబులు

అబలలారా! దేహంబు లెట్లు పుట్టుచున్నవి? నాశనానంతరము వానిస్థితి యేమి? దేహంబులెల్లఁ ద్రిగుణాత్మకపరమాణువులసంయోగంబున నేర్పడి, ఆసంయోగకారణబలం బున్నంతకాలము నిల్చియుండి తర్వాతఁ బరస్పరవియోగంబుఁ గాంచి పూర్వగతి నొందుచున్నవి. నిదర్శన మేమందురా? మట్టి యనునది పరమాణువులరూపంబున నుండును. ఆయణువులను జేర్చి ముద్దచేసి గోడలు పెట్టుదురు. ఆపరమాణువులకు వానిసంయోగశక్తి యున్నంతకాలము గోడ నిలిచియుండును. ఆశక్తి సడలినంతనే గోడ తనంతట తానే కూలిపోవుచున్నది. ఇది స్వానుభవసిద్ధమే గదా!

మూఢాంగనలారా! ఎవ్వనికై యేడ్చెదరు? సుయజ్ఞునకై విలపింతు మందురా? ఏశరీరంబును మీరు సుయజ్ఞుఁ డని పిలచుచుండిరో యాశరీరము మీయెదుట మీచేతులలోనే యున్నది. వస్తువు నఱచేతిలోనే యుంచుకొని యది పోయినదని యేడ్చుట వెఱ్ఱితనము గాదా? ఏసుయజ్ఞుఁడు మీమాటలు వినుచు మీకు బదులుచెప్పుచు మిమ్మెల్లర నానందబఱచుచుండెనో యాసుయజ్ఞునకై యేడ్చుచున్నా మందురా? అతఁ డిందు లేఁడు. వాని దేహగతమై యుండిన ప్రాణంబునకై వగతు మందురా? ప్రాణంబు వినదు బదులాడదు. దానికి నట్టిశక్తి లేదు. దేహకార్యంబు లెట్లు జరుగుచున్న వందురా? ఆత్ముఁడు దేహాంతరమందున్నప్పుడు వాని యధిష్ఠానమాత్రంబున దేహేంద్రియాదులు వర్తించుచున్నవి. ఆవర్తనంబునే కర్మమందురు. ఆత్ముఁ డెంతకాలము దేహాంతర్వర్తియై యుండునందురా? అభిమానం బున్నంతకాలము దేహామం డుండును. ఆయభిమానంబునే జీవత్వ మందురు. అభిమానముండుటయే బంధమగును. అది నశించినంతనే బంధముగూడ నశించును'.అని పలికి [illegible]తుఁ డయ్యెను. తల్లీ! ఈ సంవాదసారం బేమందువా? దేహం బున్నంతకాలము గుణంబు లుండును. గుణంబు లున్నంతకాలము

వానివ్యవహారము తప్పదు. ఆవ్యవహారఫలంబుల యానుకూల్యత సుఖంబనియుఁ బ్రాతికూల్యత దుఃఖంబనియుఁ జెప్పుదురు. అవి వచ్చుచుఁ బోవుచు నుండును గావునఁ బరమార్థంబులు గావు. ఇంద్రియంబులకు బాహ్యపదార్థంబులతో సంయోగంబు గలిగినప్పుడు తత్సంయోగఫలంబుల యిష్టానిష్టంబులఁబట్టి సుఖదుఃఖంబు లేర్పడుచుండు గావునను, అవి యేవియు నిత్యంబులు గావు గావునను, నిత్యంబులు గామిం జేసి కలలోని సుఖదుఃఖాదులవంటివే యగుఁ గావునను, ఈరహస్యంబు నెఱింగినవారు దేహజననమరణసుఖదుఃఖాదులకై చింతనొందరు. ఈసంగతి ప్రతిదినము లోకమునందుఁ జూచుచునే తమకు సంభవించినప్పుడు చింతపడువారుండుట యేల యందువా ? వారిజ్ఞానము శ్రవణజన్యజ్ఞానమాత్రం బగునే గాని యనుభవరూపజ్ఞానము కానేరదు. ఏవిషయంబునైనను విన్నమాత్రాననే ఫలము గలుగదు. విన్నదానిని మననము చేసి నిశ్చయించి యాప్రకారము వర్తించి విన్నది సరిపోయినది లేనిది పరామర్శించి నిగ్గు తేల్చుకొనుట యనుభవంబగు. అదియే ఫలకారి. తల్లీ! చచ్చినవారికై చావనున్న వారు వగచుటంగూర్చి మఱియొక యితిహాసము గలదు వినుము.

### బోయ - పిచ్చుకలజంట

తల్లీ! కొండొకనాఁడు బోయ యొకఁడు పిట్టలను బట్టితెచ్చు తలంపుతో నడవికి పోయి వలపఱచి డాఁగియుండెను. పిచ్చుకలజంట యొకటి యాహారార్థం బటునిటుఁ దిరుగుచుండి వానిలో నాఁడుపిచ్చుక యావలలోఁ జిక్కెను. మొగపిచ్చుక యది చూచి 'కటా! నాతోడిదే లోకంబుగానున్న నాభార్యను బరమేశ్వరుఁడు నాయెదుటనే కొనిపోవుచున్నాఁడు. ఇంతకన్నఁ గటికిపనంబు గలదా ? ఏయర్థంబునుగోరి యతఁడింతపనికిఁ దెగించెనో ? నన్నుఁగూడఁ గొనిపోరాదా ? భార్య భర్తకు వర్థాంగి యందురు. ఒకయర్ధభాగంబు పోయిన తర్వాత రెండవ యర్ధభాగం బుండియు ఫలమేమి ? అయ్యో ! మాబిడ్డలకు ఱెక్కలు రావు

తల్లి లేని యట్టిబిడ్డల నెవ్విధంబునఁ బోషింతు ? కటా ! ఆకూనలు తల్లికై నిలువెల్లఁ గన్నులుగాఁ జూచుచుందురు. వారిగతి యేమి ?' యని వాపోవసాగెను. అంతలోన బోయ విల్లెక్కువెట్టి కోలనేసెను. ఆములికి తాఁకి యామగపిచ్చుకయుఁ జచ్చిపడెను. వాఁడారెంటిని గొనిపోయి యారగించెను.

తల్లీ! అజ్ఞానులు తమకు రానున్న ముప్పును మఱచి పరులముప్పునకై విలపింతురు. పోయినవారు నూఱేండ్లు చింతించినను వత్తురా ? తల్లీ ! సుయజ్ఞునిభార్యలు యమునివచనంబులు విని తత్త్వసారంబును గ్రహించి స్వస్థచిత్తలైరి. అంతట సుయజ్ఞునకుఁ బరలోకక్రియలు చేయఁ బడెను.

తల్లీ! స్వకీయంబులు పరకీయంబులు నెవ్వియో, ఇది మనది, ఇది యితరులది యనుభావం బేల జనించుచున్నదో చక్కఁగా గ్రహింపవలయును. అట్టిభావంబు జనించుటకు అభిమానమే కారణంబనియు, అభిమానంబు అజ్ఞానఫలంబనియు నెఱుంగుము. అజ్ఞానమనఁగా విపరీతజ్ఞానంబగు.'

ధర్మరాజా ! హిరణ్యకశిపుఁ డట్లు తత్త్వంబును వివరించి తల్లికిని మఱదలికిని నోదార్పుఁ గూర్చెను. వారు యథార్థంబును గ్రహించి దుఃఖంబును మాని తత్త్వచింతాపరలైరి.

### హిరణ్యకశిపుఁడు తపంబు సేయుట

ధర్మసుతా ! హిరణ్యకశిపుఁ డట్లు నిజానుచరులకు నాజ్ఞాపించి తల్లిని మఱదలి నోదార్చి తపోవ్రతుఁడై మందరగిరికేఁజని యుక్తప్రదేశంబు నేర్పఱచికొని పాదాంగుష్ఠంబున నిలిచి చేతులెత్తి 'నాకు ముదిమిగాని చావుగాని కలుగరాదు; నాకు వైరియుండరాదు; ఏకరాజత్వంబు సిద్ధింపవలయును' అని సంకల్పించి మింట దృష్టినిలిపి తీవ్రతపంబునకుఁ దొడంగెను. కాలక్రమంబున వానిజటాకాంతు లరుణంబులై ప్రళయార్కకిరణదీప్తులను మఱపించెను. వానిపాదతలమునుండి తపోవహ్ని

సధూమంబుగా వెడలి భూనభోంతరాళదిశలెల్లఁ గ్రమ్మెను. ఆవేడిమికి సముద్రంబు లుడ్డుడికి కలంగసాగెను; ధాత్రీతలంబు సంక్షోభించెను; గ్రహనక్షత్రంబు లురలఁజొచ్చెను;దిగ్దిశాంతరంబులందు మంటలు రేఁగెను.

దేవతలు బ్రహ్మకు శరణిల్లుట

ధర్మజా! హిరణ్యకశిపుఁడు రాజ్యం బేలుచుండఁగా వానికి వెఱచి దేవతలు భూతలాంతరంబున దాఁగియుండిరి. అతఁడు తపోనిష్ఠఁ దగుట విని వా రొకింత ధైర్యముపడసి తమతమనెలవులు చేరిరి. హిరణ్యకశిపుని తపోవహ్నిజ్వాలలు సురలోకంబువఱకుఁ జఱచెను. ఆవేడిమికి నందలి నిర్జరులు క్రాఁగి కరఁగి నిలువలేక హుటాహుటి బ్రహ్మలోకంబునకుఁ బరుగులెత్తి 'కావు కావుము. దేవా! హిరణ్యకశిపుని తపోవహ్నికీలలు దివంబెల్లఁ బ్రాఁకి తగులంబెట్టుచున్నవి. అచ్చోట నిలువఁజాలము. పితామహా! ఆజ్వాలలను వెంటనే చల్లార్పవేని లోకంబులెల్ల దగ్ధంబులగు లోకనాశనంబైనచో నీకు జరుగు పూజావిధానంబులు సమసిపోవును. హిరణ్యగర్భా! ఆదైత్యేశ్వరుఁ డింతఘోరతపంబుఁ జేయుతలంపు నీకుఁ దెలియనిదిగాదు. అయినను మావిన్నది విన్నవింతుము. 'బ్రహ్మదేవుఁడు మొట్టమొదట ఏ తపోనిష్ఠంజేసి చరాచరసమస్తసృష్టిని గావించి సర్వోన్నతంబైన సత్యలోకంబు నధిష్ఠించెనో యట్టి తపోయోగనిష్ఠం బూని నేనుఁగూడ నప్పితామహులస్థానంబును సాధింతునుగాక!ఆత్మయుఁ గాలంబును నిత్యంబులు. నాయీప్సితంబు నేఁడు గాకున్నను వేయేండ్లకైనను సిద్ధింపకమానదు. సిద్ధికిఁ దగినయత్నంబుమాత్రము వలయును. అసాధ్యమనుమాట కలదందురా? అసాధ్య మనునదే గలుగదు. యత్నోపకరణంబులు సమర్థంబు లగునేని సర్వము సిద్ధించును. సత్యలోకంబు నధిష్ఠించి బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి చేయుదును. ధ్రువాదిస్థానంబులసంగతి యేమందురా? అవి కాలవశంబులేగాని వేఱుగావు. కల్పాంతముతోడ వానికి నాశనంబు గలుగు. అట్టి తుచ్ఛంబులు నాకేల?' అను దృఢసంకల్పంబుతో నతఁడు తపోవ్రతుఁ డయ్యెనట! 'మా కెట్టివెఱవు తోఁపదు. ఏ నీపాదము

గో బ్రాహ్మణజనసుఖైశ్వర్యయోగక్షేమంబులకు మూలమౌ యా నీ పాదమే దిక్కని యిందు వచ్చితిమి. కర్తవ్యంబును దలపోయుము' అని సాగిలఁబడిరి.

## బ్రహ్మదేవుఁడు హిరణ్యకశిపుని వెదకి గాంచుట

•ధర్మనందనా! పరమేష్ఠి నిర్జరులదీనాలాపంబు లాలకించి జాగు సేయరాదని నిశ్చయించి భృగుదక్షాదులను వెంటఁగొని మందరాద్రికిఁ జని హిరణ్యకశిపుఁ డెందున్నాఁడో యని తత్పర్వతవనాంతరంబులెల్ల వెదకెను. అయ్యసురేశ్వరుని పొలఁకులే గానరాదయ్యెను. బ్రహ్మదేవుఁ డంతతో మిన్నకుండక మఱల వెదుక నారంభించి చనుచుండఁగా దిట్టమైన వెదురుపొద యొకటి గానవచ్చెను. పితామహుఁ డాపొదను డాసి పరిశీలింపఁగా దానిమధ్యంబునఁ బెద్దపుట్ట యొకటి యుండెను. ఆపుట్ట నుండి చీమలు బారులుపెట్టి వెలికివచ్చుచు లోనికిఁ బోవుచునుండెను. బ్రహ్మాదులు మెల్లగా సందుచేసికొని యావల్మీకంబును డాసి దానిలోపలఁ జూచిరి. అందొక శల్యపంజరం బుండెను. చతురాస్యుఁడు దానిని జూచి విస్మయపడి 'అహో! హిరణ్యకశిపుఁ డిట నున్నాఁడు!' అని పలుకుచుఁ దనచేతి కమండలువులోనిజలంబులు ప్రోక్షించి 'కశ్యపాత్మజా! లేలెమ్ము; శుభంబయ్యెడు; నీతపస్సు పండెను; నీకు వరంబు నిచ్చుటకై వచ్చితిని. ఇష్టమైనవరంబును గోరుము. నీధైర్యస్థైర్యసాహసంబులు పరమాద్భుతంబులు. ఇంత దారుణతపంబు నెన్నఁడు విని కని యెఱుంగము. భళీ! గరిటెడునీరుగూడ ముట్టక నూఱుదివ్యవర్షంబులు మేనఁ బ్రాణంబుల నిలిపితివి. ఈపని యెవ్వనికి సాధ్యమగు! దైత్యవల్లభా! నీవ్యవసాయంబును నీతపోనిష్ఠయు నన్ను నీవశునిఁ గావించెను.ఏది కోరినను వెంటనే యియ్యనున్నాఁడ. మహర్తునకు సమర్థసందర్శనంబు నిష్ఫలంబుగాదు' అని పలికెను.

హిరణ్యకశిపుఁడు బ్రహ్మను సందర్శించి స్తుతించుట

ధర్మజా! హిరణ్యకశిపుఁడు వల్మీకాంతరంబున నున్నప్పుడు వాని చర్మమాంసరక్తమేదస్సులను జీమలు తినుటంజేసి యతఁడు శల్యపంజరంబో యన నుండెను. బ్రహ్మకమండులు జలంబులు పైన పోసినంతనే యతఁడు ఓజస్సహోబలాన్వితయౌవనశరీరుఁడై యాపుట్టనుండి వెలువడి వచ్చి వానియెదుట నంతరిక్షంబున హంసవాహనారూఢుఁడై యున్న పరమేష్ఠికి సాష్టాంగం బొనర్చి చేదోయి జోడించి యానందబాష్పంబులను వర్షించుచున్న కందోయి నెత్తి చూపుసుడనలువవలను నిల్పి పులకాంకితశరీరుండగుచు డగ్గుత్తికతో నిట్లనియెను.

'ఏస్వప్రకాశుఁడు కల్పాంతకాలంబున జగంబును గప్పియుండునట్టి గాఢాంధకారంబును స్వతేజోవిశేషంబున జోపి యావిశ్వంబును బ్రకాశింపఁజేయునో, ఏమహానుభావుఁడు త్రిగుణాత్మకంబైన యాత్మమాయాబలంబున సృష్టిస్థితిలయంబులు గావించునో, యాత్రిగుణధామునకు సాష్టాంగము. ఏపరమాత్ముఁడు ఆదిపూరుషుండును సర్వబీజాత్ముండును విజ్ఞానమూర్తియు నై వెలయునో, ఏయగోచరుండు ప్రాణేంద్రియమనోబుద్ధివికారవ్యక్తరూపంబునకు నుపాదానుం డగునో వానికి నమస్కారము. దేవా! చరాచరంబులకు సూత్రాత్మరూపంబున నియామకుండ వగుదువు గావున నీయాజ్ఞకు లోఁబడి ప్రజాచిత్తంబులునుఁ దత్పరిణామభూతచేతనయు మనస్సు నింద్రియంబులును వ్యవహరించును. ఆకారణంబునే భూతవిషయవాసనలకు మూఁటికి నీశ్వరుండ వగుదువు. నీవే నీత్రయీశరీరంబునఁ జాతుర్హోత్రవిద్యాత్మకమైన యగ్నిష్టోమంబును, అత్యగ్నిష్టోమంబును, ఉక్థ్యము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము అనఁబడు సప్తతంతువులను నిర్మింతువు. నీకు నాద్యంతంబులు లేవు. అఖండమూర్తివి, సర్వజ్ఞుండవు, అట్టివాఁడవయ్యు దేహధారులకు నాత్మభూతుండవై వారియందుఁ బ్రకాశింతువు. నిర్వికారుండవయ్యుఁ గారణకార్యరూపవికారంబులు గాంచి చరాచరంబు లగుదువు. ప్రాణా

త్ముండవై యుండియుఁ బ్రాణులయాయువును లతాదిసూక్ష్మావయవంబుల చేత హరింతువు. నిరాకారుండవయ్యు బ్రహ్మాండకోశంబును నీగర్భంబున దాల్తువు. దేవా! నీవలన నీశక్తియైన ప్రకృతి వెడలి తదాత్మకగుణత్రయంబు నూతఁగొని దృశ్యంబునెల్లఁ గల్పించుచున్నను నీవు దానికిఁ బరుండవై యాలీలలెల్లఁ జూచుచు నుందువు. ఆకారణంబున నిన్నుఁ బరబ్రహ్మస్వరూపుఁ డందురు. నీశక్తి కార్యమైన జగంబెల్ల నీకు స్థూల శరీరంబై నీవిషయానుభవంబునకు సాధనమగును.'

'దేవా! నీయనుభవప్రకారం బెట్టిదందువా? పరమైశ్వర్య స్వరూపమైన నీయాత్మయందుండి యావిషయంబులను నీవు భోగింతువు. ఆకారణంబున నిరుపాధికబ్రహ్మాత్ముఁడవు నవ్యక్తపదవాచ్యుండవు నగుదువు. నీరూపంబన్ననో యది తలంపునకుగాని మాటకుఁగాని గోచరింపదు. ఆరూపం బెందుండు నందువా? జగమెల్ల నాక్రమించియుండును. నీశక్తి యెట్టిదందువా? చిత్తునచిత్తు ననునవి రెండును నశక్తులే యగును. అట్టి భగవంతునకు నమస్కరింతును.

### హిరణ్యకశిపుఁడు వరంబులు కోరుట

దేవా! వరంబులు కోరుమని చెప్పితివి. వరదోత్తమునకు నిది నైజమేగదా! ఇదే కోరుచున్నాను, చిత్తగింపుము. సురాసురమహోరగులవలననొండె నరులవలననొండె మృగంబులవలననొండె నాయుధంబులచేతనొండె జడచేతనపదార్థములవలననొండె వేయేల? నీవు సృజించిన భూతంబులవలననొండె మఱియెద్దానివలననొండె రేలఁగాని పవలునందుఁగాని బహిర్భాగంబునందుఁగాని గృహాంతరమందుఁగాని నేలమీఁదఁగాని మింటఁగాని నాకు మృతిగలుగరాదు. మఱియు యుద్ధంబున నాకుఁ బ్రతివైరి లేకుండుఁగాక! సకలలోకపాలకులయణిమాదిసమస్తైశ్వర్యంబులు నాకు శాశ్వతంబు లగుఁగాక! ఏకరాజత్వంబు నా కుండుఁగాక! దేవా! నాకోరికలను దెలిపితిని. వానిం గృపసేయు' మని వేఁడెను.

ధర్మజా! దైత్యేశ్వరుఁడు కోరినవరంబులను బరమేష్ఠి విని యాశ్చర్యంబునొంది తలయూచి 'అసురేశ్వరా! నీకోరినవరంబులు

పురుషులకు మహాదుర్లభంబులు. నీతపంబునకు మెచ్చితి; నీకోరినవరంబు లిచ్చితి' నని పలికి వానిపూజ లంది నిజలోకంబునకుఁ బోయెను.

### హిరణ్యకశిపుని దిగ్విజయము

ధర్మజా! హిరణ్యకశిపుఁ డట్లు వరంబులు పడసి స్వస్థానము చేరెను. ఆలోన వానియనుచరులు లేనియాజ్ఞ నక్షరాక్షసంబులఁ గొనసాగించిరి. పట్టణంబులు పాడయ్యెను; పురంబులు బుగ్గియయ్యెను; గ్రామంబులు కాలిపోయెను; మందలు వ్రంచెను; ఆరామంబు లంతరించెను; దేశ మెల్ల గోడుగోడు మనెను.

హిరణ్యకశిపుఁ డట్లు స్వపురము చేరి విష్ణువుపయిఁ బగ సాధించు టకుఁగా సంవిధానంబును నిశ్చయించి దిగ్విజయంబు సాటి ముల్లోకంబుల మీఁద దాడివెడలెను. మొట్టమొదట నరలోకంబు వానికి జోహారనెను. దానివెంట సురలోకంబు దేవాసురగరుడగంధర్వసిద్ధచారణవిద్యాధర సహితంబుగాఁ దలయొగ్గెను. ఋషులును మునులును పితృదేవతలును గత్యంతరము గానక వానికి వశవర్తులైరి. యక్షరాక్షసపిశాచభూతప్రేతపతు లెల్లరు శరణు శరణనిరి. అతఁ డట్లు విశ్వవిజయుఁడై లోకపాలకుల స్థానంబులను హరించి విశ్వకర్మనిర్మితంబును త్రైలోక్యలక్ష్మీనివాసంబునైన స్వర్గంబు నాక్రమించెను.

### హిరణ్యకశిపుఁడు మహేంద్రసింహాసనము నధిష్ఠించుట

ధర్మజా! అతఁ డట్లు స్వర్గంబు నాక్రమించి మహేంద్రుని భవ నముఁ జొచ్చి యందలి విద్రుమసోపానంబులను, మరకతకుట్టిమంబులను స్ఫటికకుడ్యంబులను వైడూర్యస్తంభంబులను, విచిత్రవితానంబులను, బద్మరాగపీఠంబులను దంతనిర్మితముక్తికాజాలాలంకృతమంచంబులనుఁ జూచుచు లోనికిఁ జనెను. అంతఃపురమందు సురసుందరీమణులు వారి స్వరూపవేషంబులను మణిస్తంభప్రతిబింబితంబులఁ జూచి సవరించి కొనుచు సంచరించుచుండిరి.

హిరణ్యకశిపుఁ డట్లు మహేంద్రభవనసౌభాగ్యంబును దిలకించుచుఁ జని యమరేశ్వరసింహాసనంబు నధిష్ఠించెను. సురలు వానికి మ్రొక్కిరి. కమలభవకమలాక్షకమలహస్తులు ముగ్గురుదక్కఁ దక్కిన లోకపాలకముఖ్యులెల్లరుఁ గానుక లర్పించిరి. ఆదనుజేశ్వరుని గీర్తిని విశ్వావసుఁడును దుంబురుఁడును మూబోంట్లుఁ బాడుచ నుల్లేర్పడెను. అచ్చర లాడిరి; గంధర్వాదులు పాడిరి. సర్వవర్ణాశ్రమంబులవారు వారి యజ్ఞంబులందలి హవిర్భాగంబును వానికి సమర్పించిరి.

ధర్మజా! వానియాజ్ఞకు నోడి సప్తద్వీపాత్మకభూమండలంబెల్ల దున్నకయే పండసాగెను. అతఁడు కోరినకోర్కెలను దివంబు గురియఁ జొచ్చెను. నభంబు వానికి సర్వవినోదంబులఁ గూర్చెను. సాగరంబులు వానిగర్భాంతరరత్నంబులను దరంగహస్తంబులఁ దెచ్చి నజరులిచ్చెను. వానిక్రీడాప్రదేశం బెప్పుడు బుష్పాదిశోభాయమానంబుగా నుండునట్లు చేయుటయే ఋతువుల వ్యాపారం బయ్యెను. అతఁ డట్లు లోకైక నాయకుఁడై జితేంద్రియుఁడు గామింజేసి మహదైశ్వర్యమత్తుఁడై తన మాటయే శాస్త్రప్రమాణంబుగా సాగించుచు యథేచ్ఛాభోగంబులఁ దేలియాడసాగెను.

### దేవతలు శ్రీవిష్ణువునితో మొఱపెట్టుట

ధర్మజా! వానిపాలనంబు నానాఁటికి నిరంకుశంబును మహోగ్రంబు నయ్యెను. లోకపాలకాదులు దానిని భరింపఁజాలక విష్ణువుదక్క వేఱొండు గతిలేదని నిశ్చయించిరి. కాని వారెల్లరుఁ గొలువుగాండ్ర గుటంజేసి కొలువు సాలించి యాదేవదేవుని సందర్శనార్థము పోవుటకు నవకాశంబు వారికిఁ గలుగదయ్యెను. ఒండుమార్గంబు గానక వారు తమతమస్థానంబులనుండి శ్రీమహావిష్ణు వున్నదెసకు మరలి 'దేవా! ఇదే నీకు నమస్కారం' బని హస్తంబులెత్తి మ్రొక్కి నిద్రాహారంబులు వర్జించి నియతాత్ములై యాసర్వేశ్వరుని లోలోన స్మరింపసాగిరి. లోలోన స్మరించుచు, యేలనందువా? వారిభావంబు బహిర్గతమైన నచో దైత్యేశునివలన

వారికి ముప్పు దప్పదు. ఆకారణంబున సంత్రస్తంబుననే వారు ప్రార్థింప సాగిరి.

అట్లుండఁగా నొక్కనాఁడు గగనతలంబునుండి 'దేవతలారా! వెఱవకుఁడు; మేలయ్యెడు. ఆదైత్యాధముని దుష్ప్రవృత్తికి శాంతిఁ గావింతును; ఒక్కింతకాలము సహింపుఁడు. గోబ్రాహ్మణవేదంబులను సురలను సాధుజన ధర్మంబులను నన్నును ద్వేషించువాఁడు శీఘ్రనాశం బొందకమానఁడు. నాచేతనే యతఁడు చచ్చు' ననుపల్కులు వినవచ్చెను. ఆమాటలు చెవిబడినంతనే సురలు కొంత శాంతినొంది యాపరమేశ్వరు నకు నమస్కరించి కాలంబును బ్రతీక్షించుచుండిరి.

### ప్రహ్లాదఘట్టము

ధర్మజా! హిరణ్యకశిపునకు నలుగురు పుత్త్రులుండిరి. వారిలోఁ బ్రహ్లాదుఁ డనువాఁడు పుట్టువునుండి సద్గుణమూర్తియై సర్వభూతప్రియ త్వము సాధుసేవయు బిత్రృవాత్సల్యంబు దీనజనానుకంపబుద్ధియుఁ గలిగి జితేంద్రియుఁడై విద్యాధనాభిజనరూపమదంబులకు నెడమీయక పరమే శ్వరభక్తియే దినకర్మంబుగా నుండెను. వేయేల! సాధు వెవఁ డన్నచోఁ బగవారుగూడ వానినే పేర్కొనుచుండిరి.

### ప్రహ్లాదునిబాల్యవర్తనము

ధర్మజా! ఆటపాటలన్న బాలకులకుఁ బోయినప్రాణంబులు వచ్చును. ప్రహ్లాదుఁడు తోడిబాలురఁగూడి క్రీడాప్రదేశంబులకుఁ బోయి నప్పుడు సహచరులు క్రీడావినోదంబుల నుండఁగా నతఁడు జడుఁడువలె నొకచోఁ గూర్చుండి యుండును. అతఁ డెందున్నదియుఁ దోడిబాలకు లేమిసేయుచున్నదియు వానికిఁ దెలియవు. అంతియగాదు. అందరివలె నతఁడును భుజించును, శయనించును, దిరుగాడును, కూర్చుండును, మాట్లాడును. అన్యులకర్మేంద్రియంబు లెట్లో వానికర్మేంద్రియంబులు గూడ వానివానివ్యాపారంబులు చేయుచుండును. అట్లున్నను దత్కా ర్యంబుల నతఁ డెఱుంగఁడు. ఆబాలుఁ డొకసారి రోదనంబుసేయును

ఒకసారి నవ్వును; ఒకసారి పాడును; ఒకసారి నృత్య మొనర్చును; ఒకసారి భగవంతు ననుకరించును; ఒకసారి బిగ్గఱగాఁ గూయును; ఒకసారి పులకరించును; ఒకసారి యానంద బాష్పంబులు గార్చును. ఇవన్నియుఁ బ్రహ్లాదుఁడు బుద్ధిపూర్వకంబుగాఁ జేయుచున్నట్లు జనులు తలంచుచుండిరిగాని యతఁడుమాత్రము తా నట్లుచేయుటయే యెఱుంగఁడు. కారణ మేమందువా? చిత్తము దేనియందేని లీనమైయున్నప్పుడు బాహ్యేంద్రియ వ్యాపారంబులు దానికిఁ దెలియరావు. ప్రహ్లాదునిచిత్తంబు భగవదాయత్తమై తదేకవృత్తితో నుండసాగెను. ఆవృత్తిలో నున్నచిత్తముయొక్క స్థితి యేమియందువా? అది యాత్మానందంబును బహువిధంబుల ననుభవించుచు నన్యంబులను మఱచును. ఆయానందంబు తనంతటతాను పొంగి పొరలినప్పుడు తత్తరంగంబుల తఱికి భక్తుని శరీరావయంబులట్లు వర్తించును. అట్టి మహానుభావుఁడు హిరణ్యకశిపునకు నెంతయు వెగటయ్యెను. ఆదైత్యేశ్వరుఁడు పుత్రమమకారంబునుగూడ మఱచి ప్రహ్లాదునకుఁ జేసినద్రోహం బింతనరాదు' అని చెప్పెను.

### హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని గర్హించినకారణము

పరీక్షిన్నరేంద్రా! ఆమాట విన్నంతనే ధర్మజుని నిలువెల్ల గగుర్పాటుచెందెను. ఆపాండవాగ్రజుఁడు సుంత సమదాయించుకొని 'దేవర్షివర్యా! పుత్రులు దుష్టులైనప్పుడు వారిని శిక్షించుటకుఁగాఁ దలిదండ్రులు కోపపడుట సహజము. అంతియగాని బిడ్డలకు ద్రోహంబుఁ దలంపరు. ప్రహ్లాదుఁ డన్ననో పరమసాధువని చెప్పితిరి. అట్టి పుత్రరత్నంబు నొడిలోఁ గూర్చి తలిదండ్రు లెంతయు నానందింతురు. హిరణ్యకశిపునివర్తనంబు విపరీతంబును గర్హ్యంబునగు? ఆతఁ డట్లు వర్తింపఁ గారణమేమో యూహింపరా' దనెను. వానికి నారదుఁ డిట్లనియెను.

### ప్రహ్లాదుని విద్యాభ్యాసము

ధర్మనందనా! ప్రహ్లాదుని చరిత్రయంతయు విన్నఁగాని నీసంశయంబు వీడదు. అది చెప్పెద సావధానంబుగా వినుము.

అసురులకు శుక్రాచార్యులు పురోహితుఁ డగుట వినియుందువు. శుక్రాచార్యునకుఁ జండామార్కులను పేరి తనయు లిద్దఱుండిరి. హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునకు విద్యగఱపుటకు నయ్యిద్దఱను నియమించెను. వారు దైత్యాధీశునిమందిరంబుననే నివసించుచుఁ బ్రహ్లాదునకును వానితోడిబాలురకును దండనీతి మున్నగువిద్యలను గఱపసాగిరి. ప్రహ్లాదునకుఁ బుట్టువుతోడనే సర్వనీతులు హృదయంగమంబులు. అయిన నతఁడు గురువుల నుల్లంఘింపక వారు చెప్పినదానినెల్ల వినుచుఁ జదువుచు నుండెను. కాని యాచదువులు వానికి రుచింపకుండెను. ఏలయందువా? చదువులెల్ల 'నీవు, నేను' అనునట్టి యభిమానంబు నాశ్రయించియుండును. ప్రహ్లాదుఁ డామెట్టు దాఁటి సర్వసమబుద్ధితో నుండువాఁడు గావున వానికి మిథ్యాభినివేశపూర్వకంబులైన నీత్యాదివిద్యలు రుచింపవయ్యెను.

### హిరణ్యకశిపుఁడు పుత్రునివిద్యను బరీక్షించుట

ఒకనాఁడు హిరణ్యకశిపుఁడు పుత్రుఁ డేమాత్రము చదివెనో యెఱుంగఁ గుతూహలియై కొడుకును రప్పించి తొడపై నిడికొని 'నాయనా! నీవు చదివిన చదువులలో నేది యుత్తమంబని నీకుఁ దోఁచెనో చెప్పు' మని లాలించెను. ప్రహ్లాదుఁ డామాట విని 'తండ్రీ! సంసారము 'నేను, నాది' అను భావంబునం జేసి కలుగుచున్నది. అదియు శాశ్వతము గాదు. నేఁ డుండునది రేపు గానరాకుండుట చూతుముగదా! ఎండమావులవంటి యిట్టిసంసారంబున నెన్నియేండ్లున్నను నాత్మదాహంబు దీఱదు. జీవరాశియెల్ల నానందార్థమై ప్రాఁకులాడుచుండును. అది దానికి నైజము. ఆనందంబును గోరుట యుక్తమే యైనను శాశ్వతానందంబును గోరవలయును. శాశ్వతానందంబును బడయుటకు శాశ్వతపదార్థంబు నాశ్రయింపవలయును. అట్టిపదార్థం బేదో యెఱుంగక సంసారమే యానందాశ్రయం బను భ్రాంతితో జీవకోటి యట్లు ప్రాఁకులాడుచున్నది. అట్టి శాశ్వతానందదాయియైన పదార్థం బేదియందువా?

హరిపాదంబుపక్క వేఱొండు గలుగదు. అదియే యెల్లరకు నాశ్రయ ణీయంబగుఁ గావున నంధకూపతుల్యంబైన సంసారంబును వదలి వనాంత రంబుఁ జేరి హరి నాశ్రయించుట యుత్తమంబనియు నదియే యుత్తమ విద్య యగుననియు నాకుఁ దోఁచుచున్నది' అని చెప్పెను.

ధర్మజా! ఆమాటలు చెవిఁబడినంతనే హిరణ్యకశిపుని నిలువెల్ల మంటలెగసెను. అతఁడు తహతహపడుచు 'ఔరా! ఈపసికూనబుద్ధి నెవరో చెఱచిరి. ఈపని విష్ణుపక్షపాతులు చేసియుందురు' అని యూహించి తన యాగ్రహంబును లోలోన నడంచివైచి గురువులను రప్పించి 'ఒజ్జలారా ఈకూనకుఁ జక్కనివిద్య బోధింపుఁడు' అని హెచ్చరించి ప్రహ్లాదుని వారివెంటఁ బంపెను.

### ప్రహ్లాదునకు వానిగురువులకు సంవాదము

చండామార్కులు ప్రహ్లాదుని విద్యామందిరంబునకుఁ దోడ్కొని పోయి సంగతి విచారించిరి. ప్రహ్లాదుఁడు జరిగినయుదంతంబు వారికిఁ జెప్పెను. వారామాటలు విని వానిని బుజ్జగించి 'నీతోడ నిందఱు బాలురు చదువుచున్నారు. మీయెల్లరకు నొక్కరూపమైనచదువులనే గఱపితిమి. వారికిఁ గలుగని యీబుద్ధిభేదము నీ కెట్లు జనించెను? ఇది తనంతట నీకుఁ గలిగెనా? పరు లెవ్వరైనను దీనిని నీకు బోధించిరా? సత్యముదాఁపక చెప్పు' మని యడిగిరి.

ప్రహ్లాదుఁడు వారిని విని 'గురువర్యులారా! స్వపరభేదంబు మిథ్యాభూతముగాని సత్యముగాదు. అట్టి భేదభావంబు గలుగుటకుఁ గారణ మేమందురా? అది మోహఫలంబుగా జనించుచున్నది. మోహ మన్ననో భగవన్మాయాయోగంబున జనించుచున్నది. మోహము పశు బుద్ధియగు. ఆబుద్ధి యున్నంతకాలము శాంతికలుగదు. శాంతి లేనినాఁడు సుఖం బెట్లుండును? మోహకార్యం బేమందురా? అది పట్టికోర్కెలను బెంచి క్లేశ్లపాటించును. కోర్కె లెన్నఁడుఁ దనివిఁజెందవు. సుఖంబును

గోరువాఁడు మొట్టమొదట మనశ్శాంతిని బడయవలయును. శాంతిని బడయవలయునన్నచోఁ బ్రప్రథమంబున సంఘాతభూతమైన పశుబుద్ధిని నున్మూలింపవలయును. అది యెట్లంటివా? అందులకుఁ బరమేశ్వరానుగ్రహమే పరమసాధనంబు. భగవానుఁ డెవ్వని ననుగ్రహించునో వాఁడు స్వపరభేదబుద్ధిరహితుఁడై కృతార్థత నొందును.

పరమాత్ము నాశ్రయించినవారికి సద్బుద్ధి కలుగుటకు హేతువేమని యందురా? బుద్ధి యొకవస్తువు నాశ్రయించినప్పు డావస్తుశక్తి బుద్ధియందు వ్యాపించును. ఇది యెల్లరకు స్పష్టము. పరమాత్ముఁడు భేదరహితుఁడును సర్వాంతర్యామియునై యుండును. ఆకారణంబున వానినిఁ ద్రిశుద్ధిని నాశ్రయించినచో నాతత్త్వమే బుద్ధియందు వ్యాపించును. అది భేదరాహిత్యస్థితిఁ బడయును. భగవచ్ఛక్తితత్త్వంబుయొక్క రహస్యంబు నెఱుంగక లోకం బెప్పుడు గుణబద్ధమై 'నీవు, నేను' అనుభావంబుతో వ్యవహరించుచుఁ బడరానిపాట్లు పడుచున్నది. ఈవిషయంబున వేదవాదులుగూడ భ్రమచెందుదురు. ఇఁక సామాన్యులసంగతి చెప్పనేల?

గురువర్యులారా! బుద్ధిభేదంబునఁజేసి మతభేదంబు గలుగును. నాదృష్టి వేఱుగా మీదృష్టి వేఱుగా నున్నది. దానంజేసి నాకు మతిభేదంబు గలిగెననియు దాని నెవ్వరో బోధించిరనియు మీరు శంకింతురు. ఇట్టిబుద్ధిని బరమాత్ముఁడే నాకుఁ గలిగించెను. అన్యు లెవ్వరును గారు. సూదంటురాయి చెంతనుంచినయినుపముక్కవలెఁ దల్లోకధాముని చెంత నుంచిన నాచిత్తంబు సంగతి యయ్యెను. ఇట్లు యదృచ్ఛాపరిణామంబును గన్న నాచిత్తంబు మీయుపదిష్టంబులకు వేఱైయుండును. గురువర్యులారా! మీయడిగినదానికిఁ గలరూపు విన్నవించితిని' అని చెప్పెను.

ధర్మజా! గురువు లామాటలు విని కోపపడి 'ఓరీ! బెత్తముకొని రండు; ఇతఁడు స్వకులాంగారకుఁడై పుట్టెను. వీనివలన మనకు నపకీర్తి యయ్యెను. ఈదుర్బుద్ధిని దండించి సవరింపవలయును. కటా! దానవచందన వనంబునకు విష్ణువు వెనుగొడ్డలియగు. ఆగొడ్డటికి నితఁడు నాళంబుగా

నున్నాఁడు' అని యదరింపులు బెదరింపులు పలికి మఱల వానికిఁ ద్రివర్గ విద్యను నయభయంబుల బోధించిరి.

హిరణ్యకశిపప్రహ్లాదుల ద్వితీయసమాగమము

అంతఁ గొన్నాళ్లకు గురువులు హిరణ్యకశిపునొద్దకుఁ బోయి 'దానవేశ్వరా! నీపుత్రకుఁడు దండనీతిని సమగ్రంబుగాఁ గఱచె' నని చెప్పిరి. దైత్యనాథుఁ డందులకు నెంతయు సంతసించి పుత్రుని ప్రతిభఁ దెలియ నువ్విళ్లూరుచు వానిని దోడ్కొనిరమ్మని యాజ్ఞాపించెను.

దైత్యగురుకుమారులు ప్రహ్లాదునకు నలుగు పెట్టించి జలకమార్చి కై సేసి మృష్టాన్నభోజనం బిడి వానిని దైత్యేశునొద్దకుఁ దోడ్కొని పోయిరి. ప్రహ్లాదుఁడు తండ్రిపాదంబులకు మ్రొక్కెను. హిరణ్యకశిపుఁడు పుత్రునిఁ గవుంగిటఁ గ్రుచ్చి యెత్తికొని దీవించి తొడపై నిడి శిరంబు మూర్కొని యానందాశ్రువులు నించుచు 'నాయనా! ప్రహ్లాదా! గురువులతోడ నింతకాలము చదివితివిగదా! నీ నేర్చినదానిసారం బేమో చెప్పు' మనెను.

ప్రహ్లాదుఁడు తండ్రివంక మరలి 'నాయనా! జీవునకు నానందానుభవేచ్ఛ నైజమగు. అయ్యనుభవంబునకుఁ గలమార్గంబులను జదువు బోధించును. ఆమార్గంబులలో నెద్దాని జన్నచో నిత్యానందంబు లభించునో దానిని గ్రహించి నడుచుట పురుషునకు యుక్తంబగు. ఆమార్గంబును నిశ్చయించుట యెట్లందువా? మనలో నంతఃకరణం బను నట్టి యింద్రియం బొకటి గలదు. అది నాలుగువృత్తులతో వర్తించుచుండును. అవి బుద్ధివృత్తియనియు, అహంవృత్తియనియు మనోవృత్తి యనియుఁ, జిత్తవృత్తియనియుఁ బేర్కొనంబడును. యుక్తాయుక్తంబులను నిశ్చయించుట బుద్ధివృత్తి యగును. ఆనిశ్చయంబును జ్ఞానమందురు. ఆజ్ఞానంబును అహంవృత్తి స్వీకరించి వర్తించును. అది విజ్ఞాన మనబడు.

తండ్రీ! ఆనందంబు ననుభవించుటకుఁ దదాత్మకపదార్థం బొకటి యుండవలయును. ఆసలు పదార్థంబు కంటికి గోచరింపదు. దానివిలాసం

బులు రూపనామంబులఁ దాల్చి విశ్వరూపంబునఁ బరిణమించియుండును. ఆనందార్థులు విశ్వములోని పదార్థంబులను వారివారి రుచులప్రకారం బాశ్రయించి యానందింతురు. ఆవస్తువులందలి యానందాంశంబులు వివిధగతుల నుండును. అంశంబు లెన్నడును బూర్తిఫలంబు నీయవు. దానంజేసి తుమ్మెదలగతి జీవు లొకదానిని జేరి దానిని విడిచి మఱియొక దానికిఁ బరుగులిడుచుందురు. వారితృప్తి పట లొకనాఁటికిని దీఱవు.

దీనింబట్టి దీర్ఘముగా నాలోచించినచో క్షణభంగురమైన విశ్వమందలి వస్తువులవలనఁ గలుగుతృప్తి యానందంబుఁగూడఁ బరిమితంబును క్షణికంబు నగునని స్పష్టపడును. కాఁబట్టి యానందంబును బడయఁగోరువారు శాశ్వతానందంబునకై యత్నించుట మేలగు. దానిని బొందుటకు భక్తియే పరమసాధనము.

ఈభక్తిఫలం బేమందువా? బుద్ధిని గ్రమ్మియుండు మలినంబులు తొలఁగి యది స్వచ్ఛమగును. అప్పుడు దాని నిశ్చయశక్తి సమగ్రంబును బ్రమాదరహితంబు నగు. అట్టిబుద్ధి నిశ్చయించిన విషయంబును అహంవృత్తి గ్రహించి యనుభవించునప్పుడు తదనుభవంబు నిర్వికల్పకము శాశ్వతంబునై పరిఢవిల్లును.

భక్తికి భజనీయపదార్థం బుండవలయును. శాశ్వతానందంబును గోరునప్పుడు భజనీయమైనవస్తువుగూడఁ బూర్ణమును శాశ్వతంబు నైనదిగా నుండవలయును. ఆవస్తు వేదియందువా? ఏవస్తువుయొక్క యానందవిలాసంబు విశ్వరూపంబునఁ బరిణమించి జీవుని నానందాంశంబులఁ బ్రలోభించి తృప్తిపుచ్చున్నదో యావస్తు వొక్కటే భజనీయంబగు. ఆపరమార్థవస్తు వేదందువా? శ్రీమహావిష్ణువే యాపరమార్థవస్తువగును. వేఱొండు గలుగదు.' 'తండ్రీ! ఇదే నాచదువుల సారము' అని విన్నవించెను.

### హిరణ్యకశిపుఁడు గురుపుత్త్రులను దూషించుట

ధర్మజా! ఆమాటలకు హిరణ్యకశిపుఁడు మహోగ్రహోదగ్రుఁడై గురుపుత్త్రులవంక మఱలి పండ్లు పటపట గీఁటి 'బ్రాహ్మణాధములారా!

నాయిచ్చునట్టికూడు కుడిచి గుడ్డకట్టి నన్ను మోసగించుటయేగాక నా బాలునకు నాశత్రువునందు భక్తిని గఱపితిరా? ఇంతకన్న నాకుఁ జేయ నైనకీడు గలదా? అసాధువులు కపటవేషధారులై లోకంబునకు ద్రోహం బొనర్తురు. ఆమోసముయొక్క ఫలము తుట్టతుదకుఁ జేసిన వారికే గలుగును. అది మఱచి వర్తింతురు. బ్రహ్మహత్యాదులకుఁ గుష్టు రోగాదు లెట్లో లోకవంచకులకుఁ దత్తత్కర్మోచితం బైనఫలంబు తప్పదు' అని రోషకషాయస్వరంబునఁ బలికెను.

### గురుపుత్రులు సమాధానము చెప్పుట

ధర్మజా! గురుపుత్రు లాకఠినవచనంబులు విని 'ఇంద్రారీ! నీపుత్త్రుఁడు చెప్పినయర్థము మేము బోధించినదిగాని పరులు వానికి బోధించినదిగాని గాదు. అతఁ డెట్లు నేర్చెనందువా? వానిస్వభావమే వానికి దానిని బోధించెను. ఇందు మాతప్పుగాని పరులతప్పుగాని లేదు. కాఁబట్టి కోపంబు మానుము. నీకూడుతిని నీగుడ్డగట్టి నీకు ద్రోహంబు చేయునట్టి మందభాగ్యులము గాము. లేనితప్పులను మాకు మూటగట్టవల' దనిరి.

### హిరణ్యకశిపప్రహ్లాదుల ద్వితీయసంభాషణము

అంతట దనుజేశ్వరుఁడు పుత్రునివంకఁ జూచి 'దురాత్మా! ఈబుద్ధి నీ కెట్లు జనించె' నని గద్దరించి పలికెను. ప్రహ్లాదుఁడు జంకుగొంకులు వదలి 'తండ్రీ! ఇంద్రియవశులై సంసారజంబాలంబునఁబడి కుడిచిన ముఱికినే మఱలమఱలఁ గుడుచుచునుండు గృహాసక్తులకు హరిమీఁదిప్రీతి స్వయముగా నొండెఁ బరోపదేశంబున నొండె నన్యోన్యయత్నంబున నొండెఁ గోటిజన్మంబులకుఁగూడఁ గలుగదు.'

అట్టిబుద్ధి స్వయముగా నెట్లు గలుగు నందువా? ఆసంగతి మున్నే విన్నవించితిని. అయినను మఱల విన్నవింతును. చలిచీమ మొదలు బ్రహ్మ పర్యంతము సకలశరీరంబులలో దీపమువలె భగవంతుఁడు వెలుఁగుచుండు. ఆజ్యోతివి అంతఃకరణంబు గప్పియుండును. అంతఃకరణ మనఁగా నేమియం దువా? భోగ్యఫలవాసనలసముచ్చయంబు నంతఃకరణమందురు. అది

భోగ్యఫలంబులంబట్టి శుద్ధముగానో మలినవంతముగానో యుండును. అది శుద్ధమేని దానిలో నున్న దీపపుకాంతి ముఱికిలేని గాజుకుప్పెలోని దివ్వె వెలుగువలె వెలికిఁ బఱచును. ఆవెలుఁగులో బుద్ధ్యాదులకు స్వరూప జ్ఞానంబు గలుగును. అదియే బోధ యనంబడును. అంతఃకరణంబు మలిన వాసనాసమాక్రాంతమగునేని లోపలిజ్యోతి స్వయంప్రకాశమానం బయ్యు ముఱికిగాజుకుప్పెలోని దివ్వెవలె బహిఃప్రకాశమానంబు గానేరదు. బుద్ధిప్రకాశాప్రకాశంబులు దాని శుభ్రతాశుభ్రతలనుబట్టి యుండుననియు, ఆశుభ్రతాశుభ్రతలు భోగ్యఫలవాసనలంబట్టి యుండు ననియు నెఱింగినప్పుడు బుద్ధివికాసంబు స్వీయమో పరకీయమో యూహింపనగును.

నాయనా! బుద్ధి యట్లు స్వచ్ఛముగా నప్పుడు దానికి మోహము గలుగుచున్నది. అనఁగా మంచిచెడుగులను నిర్ణయింపనేరక మంచిని చెడుగుగాఁ జెడుగును మంచిగా గ్రహించుటగును. చెడుగును మంచిగా గ్రహించి తదానందంబు ననుభవించుటయే విషయాసక్తి యనఁబడును. అట్టివారు వేదసూత్రంబునఁ గట్టువడి విషయప్రపంచమందే భ్రమ్మరు దురు. వారి ననుసరించువారిగతికూడ గ్రుడ్డి ననుసరించుగ్రుడ్డిగతి యగును. అట్టివారికి మంచిగలుగుట యెట్లందువా? మహాత్ములపాదపద్మంబు పయిగాలి వారిపై సోఁకునేని వారియంతఃకరణమాలిన్యంబు తొలఁగును. తత్ఫలంబుగా లోపలిభగవత్ప్రకాశంబు వారిబుద్ధిదర్పణమందు యథా గతిఁ బ్రకాశించును. ఆప్రకాశములో యుక్తాయుక్తంబులను గ్రహించి యయుక్తంబులను వదలి యుక్తంబులను స్వీకరింతురు. దీనినే విషయ విరక్తి భగవద్భక్తియు నని వచింతురు' అనిచెప్పి మిన్నకుండెను.

హిరణ్యకశ్యపుఁడు పుత్రవధ నాజ్ఞాపించుట

ధర్మజా! దైతేశుఁ డామాటలకు భగ్గున మండిపడి తొడపైనున్న ప్రహ్లాదుని పడఁద్రోసి కన్నుల నిప్పులు రాల్చుచు భటులవంక మఱలి

'రక్కసులారా! ఈపాపాత్ముఁడు వానిపినతండ్రి వధకుని పాదాలకు మ్రొక్కుచున్నాఁడు. నావైరిని బూజించు నితఁడు నాభ్రాతృఘాతకుఁడగు. తలిదండ్రుల మే లెంతయు నరయుఁడు. కనిపెంచినవారికే కీడు సేయునట్టి యీద్రోహిని విష్ణు వెట్లు నమ్మునో నమ్మి యేమాత్రము బాగు పడునోగదా! అహితుఁడు సుతుఁడైనను దూ్యజ్యుఁడే యగు; హితుఁడు పరుఁడైనను మాన్యుఁడగు. చెడినయంగంబును ఛేదించి శరీరంబును రక్షించికొనునట్లు దుష్టుఁడైనపుత్త్రుని విసర్జించి కులంబును గాపాడుట నీతియగు. ఆతేండ్లబాలకుఁ డందురా? విషసర్పము చిన్నదని విడువ వచ్చునా? మఱియుఁ నితఁ డహితుఁ డగుటయేగాక పుత్త్రకుఁ డైన కారణంబున హితశత్రువగును. ఈకూళను దెగటార్చిరండు' అని యాజ్ఞాపించెను.

## రాక్షసభటులు ప్రహ్లాదుని బాధించుట

ధర్మజా! ఆమాటతోడ రాక్షసభటులు పెల్లార్చుచు నిర్దయామత్తులై వాడియీఁటెలతో సూదిమొనబల్లెంబులతోఁ దీక్ష్ణఖడ్గంబులతోఁ బ్రహ్లాదుని బొడిచిరి గ్రుచ్చిరి నఱికిరి. ఆశిశువు 'శ్రీహరీ!' అనుచుఁ దల యొగ్గియుండెను. భటు లట్టు లెన్నిపర్యాయములు పొడిచినను నఱికినను వానిశరీరము కసుగందదాయెను. అది దైత్యేశ్వరుఁడు చూచి యాశ్చర్యపడి 'ఇఁక నేమి రానున్నదో తెలియదు. ఏమైన నగుఁగాక, ఇతనిని మననీయరాదు' అని తలంచి యాబాలకుని మత్తేభంబులచేతఁ ద్రొక్కించెను; విషసర్పంబులచేతఁ గఱపించెను; పెనుగొండశిఖరాగ్రంబులనుండి క్రిందికిఁ ద్రోయించెను; నేలబొరియలోఁ బూడ్పించెను; గరళము పెట్టించెను; మంచుగడ్డలలోఁ బాతించెను; నీటిలో ముంచెను; అగ్నిలోఁ బడవేయించెను. అవియెల్లఁ బ్రహ్లాదు నేమియుఁ జేయఁజాలవయ్యెను. అంత దానవేశ్వరుఁడు 'మారణహోమప్రయోగంబులును నిరర్థకములు గావించెను. వేయేల? ఆతఁడు పెట్టినబాధలే గలుగవు.

### హిరణ్యకశిపుఁడు స్వప్రయత్నభంగంబునకుఁ దలపోయుట

ధర్మజ్ఞా! పై తెఱంగున స్వప్రయత్నంబు లట్లు వ్యర్థమగుటఁ జూచి 'కటా! వీనియెడ మహాఘోరయత్నంబులుగూడ వ్యర్థమయ్యెను. బాలుఁడయ్యు నిట్టిపాట్లకుఁ జిక్కఁడు విన్న బాటుఁ జెందఁడు. ఏమి! వీనిప్రభావం బప్రమేయంబుగానున్నది. వీనితోడి వైరంబు నామృతికిగా నగునేమో?' అని చింతాపరుఁడై తలపోసెను.

### చండామార్కులు హిరణ్యకశిపునకు నుపశాంతిఁబలుకుట

ధర్మజా! చండామార్కు లావింతలెల్లఁ జూచి యచ్చెరువొంది హిరణ్యకశిపుని సమీపించి 'దనుజేశ్వరా! ముల్లోకంబులకు నేకైకప్రభువైన నీకుఁ జింతాకారణము గలుగదు. పుత్రకునిగూర్చి చింతింతు వేల? పసిబిడ్డలగుణదోషంబులు పరామర్శకుఁ దగవు. ఒక్కటి మాకుఁ దోఁచుచున్నది. భార్గవుఁ డిటకు విచ్చేయును. అందాక నితఁడు పాఱిపోవకుండునట్లుగా వరుణపాశబద్ధుఁ డగునట్లు చేయుము. ఆగురువర్యుఁడు వీనికి బుద్ధిగఱపును. గురుసేవవలనఁ గాలక్రమంబుననైనను మంచిబుద్ధి వీనికి రానగు. మామాట నంగీకరింపు' మనిరి. హిరణ్యకశిపుఁ డావాక్యంబులకు సమ్మతించి 'గురుకుమారకులారా! ఇతనికి రాజధర్మంబులను గృహస్థధర్మంబులను జక్కగా బోధింపుఁడు' అనిచెప్పి ప్రహ్లాదుని వారి వెంటఁ బంపెను.

### ధర్మార్థకామశాస్త్రబోధనల తత్త్వము

ధర్మజా! గురుకుమారులు వానిని వెంటఁగొనిపోయి ధర్మార్థకామశాస్త్రంబులను బూసగ్రుచ్చినట్లు బోధించిరి. ప్రహ్లాదుఁడు గురువుల బోధనలెల్ల విని 'అయ్యో! వీరిబోధనలసారంబును వీరే గ్రహింపరైరి. ఈధర్మంబులెల్ల ద్వంద్వమతులై దుఃఖంబులు గుడుచువారికిఁ దాత్కాలికోపశాంతికిఁగాఁ గల్పింపఁబడుటు వీరికిఁ దెలియదా? ఈధర్మంబుల మూలంబున లోకవ్యవహారప్రవృత్తి జరుగును. అవి బోధించు బోధన

లన్ననో యసపర్వస్తువిషయికంబులగు. ఈరహస్యంబును గ్రహింపక యాబోధనలే పరమార్థబోధనలుగా జనులు భావించి భ్రాంతినొందు డురు' అని లోలోనఁ దలంచుచుండెను.

ప్రహ్లాదుఁడు సహపాఠకులకుఁ దత్త్వము బోధించుట

ధర్మజా! గురువులు ప్రతిదినము బడివేళ ముగిసిన తర్వాత వారి గృహకృత్యంబులఁ దీర్చుకొనుటకుగాఁ బోవుదురు. అప్పుడు బాలకు లాటపాటలఁ బ్రొద్దుపుత్తురు. అట్టి విరామకాలంబులందుఁ బ్రహ్లాదుఁడు క్రీడలకుఁ జనక తోడిబాలకులను జేరఁదీర్చి వారికిఁ దత్త్వంబు నుపదే శించుచుండెను. ఒకనాఁ డట్టియవసరము గలుగఁగా బాలకులెల్లరు నొక చోటఁ గూడిరి. వారి కిట్లు సంభాషణము జరిగెను.

ప్రహ్లాదుఁడు:—మిత్రులారా! మనతోడ మఱికొందఱు బాలకులుగూడఁ జదువుకొనుచుండిరి. వా రిప్పు డేరి? చనిపోయిరిగదా! దీనింబట్టి యేమి యేర్పడుచున్నది? శరీరంబులు శాశ్వతంబులు గావనియు, ఎవరి కెప్పు డెట్లు చావు గలుగునో తెలియరాదనియు, దీపమున్నప్పుడే వెదకవలయుననుసామెత ప్రకారము ప్రాణమున్నప్పుడే మనకు శ్రేయం బైనదానిని సంపాదింపవలయుననియు, ఎన్నఁడు నేమఱియుండరా దనియు నేర్పడుచున్నదిగదా!

బాలకులు:—ప్రహ్లాదా! మనుష్యులయాయుష్కాలము నూఱేండ్లం దురు. మనతోడిబాలకు లింతచిఱుతప్రాయములోనే చచ్చుట యేల?

ప్రహ్లా:—మిత్రులారా! ఆయుష్కాల మనఁగా నేమి? జీవుఁడు వాని భోగ్యకర్మఫలంబు నేతనువుతో నెంతకాలం బనుభవింపనైయున్నదో యంతకాలం బాతనువునం దుండును. ఆకాలంబు నాయుష్కాలమ్మం దురు. ప్రారబ్ధకర్మఫలానుభవంబునకుగాఁ దత్తదుచితశరీరంబులు గలు గును. ఫలభోగపర్యంతమే యాశరీరం బుండును. అనంతరం బవిని మేషమాత్రమేనియు నిలువవు. కర్మములగతి యొక్కవిధముగాదు. కొన్నికర్మంబులఫలంబు బహుకాలం బనుభవించినఁగాని తీఱకుండు.

కొన్నిటిఫలంబు స్వల్పకాలములోనే భుక్తమై నశించుచుండును; కొన్నిటిఫలంబు కొన్నియేండ్ల యనుభవమాత్రముననే పూర్ణమగుచుండు. ఫలానుభవకాలతారతమ్యంబులనుబట్టి జీవుని శరీరస్థితికాలంబుండును. అందువలన జీవితకాలంబు స్వల్పమధ్యమదీర్ఘావస్థలు గలదగుచున్నది. జననమరణతత్త్వం బట్టిదగుట గ్రహింపవలయును. ఎవని కర్మఫలం బెంతకాలము భోగ్యమగునో ముందుగా స్థూలదృష్టికి బోధపడదు. తత్త్వవేత్తలు దివ్యదృష్టితోఁ బరిశీలించి సామాన్యముగాఁ గర్మఫలము మర్త్యశరీరంబుతో భోగ్యము కావలసి వచ్చినప్పు డది నూఱేండ్లభోగ్యముతోడ సమాప్తమగుచున్నదని పలికిరి. అది సామాన్యవాక్యమగు. ఒక్కొక్కరు నూఱేండ్లకు మించి జీవించుటయుఁగూడఁ గలదుగదా! మనతోడిబాలకు లాశరీరంబులతో ననుభవింపనైన కర్మఫలభోగము ముగిసెను గావున వా రాశరీరంబులను బాల్యప్రాయంబుననే వదలుటయ్యెను.

బాల:—ప్రహ్లాదా! కొందఱు మహాధీమంతులుగా నుందురు; కొందఱు గాఢమందమతులుగా నుందురు. కొందఱు కోటీశ్వరులుగా నుందురు. కొందఱు నిత్యదరిద్రులుగా నుందురు. కొందఱు మహారోగ్యవంతులుగా నుందురు. కొందఱు నిరంతరవ్యాధిగ్రస్తులై కృశించుచుందురు. ఇట్టి తారతమ్యంబులకుఁ గారణమేమి?

ప్రహ్లా:—మిత్రులారా! ఎల్లకర్మంబులకు సంకల్పము ప్రధానము. సంకల్పానురూపంబుగాఁ గర్మంబును ఫలోదయంబు నుండును. మీ చెప్పినభేదంబులెల్ల వారివారిపూర్వజన్మకృతసంకల్పంబులయుఁ గర్మంబులయు భేదంబులేగాని నేఁడు క్రొత్తగాఁ దెచ్చికొనునవిగావు. విత్తొకటి నాటినఁ జెట్టొకటి మొలవదనుసామెతను వినరా?

బాల:—పురుషప్రయత్నముచేత ఫలంబులందు మార్పును గలిగింపఁ గాదా?

ప్రహ్లా:—పురుషప్రయత్న మనఁగా నెట్టిది? అహంకారపూర్వకంబుగాఁ జేయుప్రయత్నము పురుషప్రయత్నము కానేరదు. ఎట్లందురా?

లోకంబెల్ల సుఖంబుండఁగోరునేగాని దుఃఖంబును గోరంతయుఁ గోరదు గదా! సుఖార్థమై చేయరానియత్నంబులు చేయుచుఁ బడరానిపాట్లు పడుచుందురు. ఆయత్నంబులు ఫలకారులగుచున్నవా ? 'ధనమూల మిదం జగ' త్తనుమాటను నమ్మి ధనార్జనంబునకై ప్రాణంబులనుగూడఁ గుదువపెట్టుదురు. అంతమాత్రాననే ధనికు లగుచున్నారా ? ఒక్కొక్కనికిఁ దలఁచనితలంపుగా ధనము నిర్నిమిత్తముచే కూడుచున్నది. వీనింబట్టి చూచినచో ఫలాఫలంబులు యత్నాధీనంబులుగావని స్పష్టము.

బాల:—అట్లని మిన్నకుండవలయునా ? రోగము వచ్చినప్పుడు మందు తీసికొనుటలేదా ? రోగనివారణం బగుటలేదా ? అది పురుష ప్రయత్నఫలము గాదా ?

ప్రజ్ఞా:—మిత్రులారా ! మందు తీసికొన్నవారికెల్ల రోగనివృత్తి యగుచున్నదా ? ప్రఖ్యాతవైద్యులుగూడ రోగగ్రస్తులై చచ్చుటలేదా ? వారియెడఁ బురుషప్రయత్నము ఫలించుచున్నదా ? కాఁబట్టి కర్మఫలంబు భుక్తిమై నశింపవలయునేగాని దానికి మార్పు గలిగింపఁ దరముగాదు. మీరన్న పురుషప్రయత్నంబులెల్లఁ దాత్కాలిక దుఃఖోపశాంతికిఁ గొంతతోడ్పడునేగాని ఫలభోగవిధానంబును మార్పఁజాలవు. ఇట్టిదుఃఖోపశాంతిసాధనంబులతోఁ బరమసాధనం బొక్కటి గలదు. దానిని సాధింతురేని సర్వదుఃఖంబులు నుపశాంతి నొందును. అదియేది యందురా ? భగవదనుగ్రహామే సర్వదుఃఖోపశాంతికిఁ బరమౌషధము. దుఃఖంబులెల్ల దేనికిఁ గలుగుచున్నవి ? శరీరంబునకుఁ గలుగుచున్నవి. మఱియు దుఃఖంబు లెప్పు డవగతంబు లగుచున్నవి ? మనస్సు శరీరపరమైనప్పుడే యవి తెలియుచున్నవి. నిద్రాసమయంబునఁ నెట్టిబాధలు తెలియకుండుటయే యిందులకు నిదర్శనము. అట్లుండుటకుఁ గారణ మేమందురా ? ఆసమయమందు మనస్సు శరీరవిముఖమై యుండుటయే కారణము. దీనివలన నేమి

యేర్పడుచున్నది ? సుఖదుఃఖంబు లెల్ల మానసికావస్థావిశేషంబులే యని యేర్పడుచున్నది. మనస్సు భగవన్ముఖమైనప్పు డది శరీరంబునే మఱచిపోవును. అప్పుడు శరీరము పడుపాట్లు దానికిఁ దెలియవు. భగవదనుగ్రహఫలంబుగా మనస్సునకు శాంతియు సుఖంబుఁ గలుగును. మనస్సునట్లు భగవత్పరముచేయుటయే పురుషప్రయత్నమగు. అట్లుచేయుటకు నహంకారము రహితము గావలయును. అహంకార రాహిత్యము శ్రవణమననసాధుసేవ గురూపదేశాదులవలన సిద్ధించును. అందులకుఁగూడఁ బూర్వకృతశుభకర్మఫలం బంతో యింతో యుండవలయును. అశుభకర్మఫలోదయమైనప్పు దుష్టబుద్ధి గలుగుటయుఁ దద్విధయత్నంబు చేయుటయు నగు.

బాల:—పూర్వశుభకర్మఫలంబు బొత్తిగా లేనివారిగతియేమి ?

ప్రజ్ఞా:—అంతో యింతో శుభకర్మఫలంబు భోగ్యమైనది కలుగనిదే మర్త్యజన్మము గలుగదు. జీవితకాలములో నెప్పు డట్టిశుభకర్మఫల భోగావసరంబు గలుగునో యప్పు డతఁడు తత్ఫలానుసారముగా శుభమతి యగును. అట్టి శుభచిత్తమందు వానిలోనేయున్న భగవంతునియొక్క ప్రకాశము ప్రసరించును. ఆ ప్రకాశప్రభావంబున నతఁడు మేల్కాంచి దారిత్రొక్కి క్రమక్రమంబుగాఁ గంతవ్యముఁ జేరును. కాఁబట్టి మర్త్యుఁడు నిరుత్సాహపడ నవసరములేదు.

బాల:—అయ్యా ! గురూపదేశము మేలుకూర్చునేని, మనగురువులు చెప్పినట్లు మనమేలఁ జేయరాదు ?

ప్రజ్ఞా:—మిత్రులారా ! గురువాక్యానుసరణము తప్పక మేలుగూర్చును. సందేహపడవలదు. ఒక్కటిమాత్రము మఱువవలదు. ఎల్లరు గురువులుగారు. ఎవఁ డాత్మజ్ఞాని యగునో యతఁడే గురుపదవికిఁ దగును. వానిమాటను శిరసావహింపవలయును. అట్లుగాక కేవల శాస్త్రజ్ఞానమాత్రులై యజ్ఞాననిద్రలో నున్నవారి చిలుక

పల్కులనమ్మి ప్రవర్తించువారు గ్రుడ్డివాని నాశ్రయించినను గ్రుడ్డి వానిగతికిఁ బాత్రులగుదురు.

బాల:—అట్టిగురువును బడయుట యెట్లు?

ప్రహ్లా:—మిత్రులారా! అట్టిగురువును వెదుక నవసరము లేదు. లోకైక గురువైన భగవానుఁడు మనలోనే యంతర్యామియైయుండి సర్వదా మనకు నుపదేశించుచునే యున్నాఁడు. అహంకారవిమూఢులమై మనము వానియుపదేశంబును జెవిఁబెట్టక ప్రవర్తించి భ్రష్టుల మగు చున్నాము. ఆగురువును శరణిల్లుము.

బాల:—ప్రహ్లాదా! నీయుపదేశసారాంశమేమి?

ప్రహ్లా:—మిత్రులారా! జను లనుభవించు సుఖదుఃఖాదులు వారి పూర్వ కర్మఫలంబులు. వానిని దైవికంబు లందురు. వాని ననుభవించి తీఱ వలయును. ఆయనుభవంబు శరీరంబునకేగాని శరీరాంతరమందున్న యాత్మునకుఁ గాదు. ఆత్ముఁడు నిర్వికారుఁడు నిస్సంగుఁడు పూర్ణుఁడునై నిత్యానందస్వరూపంబున నుండును. ఆస్వరూపజ్ఞానంబును బడయుట ప్రతివ్యక్తికిఁ బ్రథమవిధి యగును. ఆకార్యము శరీరంబున్నప్పుడే చేయవలయును. శరీరము క్షణభంగురము. కావున రేపు మాపులు గాని కౌమారాద్యవస్థలుగాని నిరీక్షించుచుఁ గాలము రిత్తపుచ్చ రాదు. ఏమిచేయవలయు నందురా? ఏధర్మము పరమార్థప్రదమగునో దాని నాచరింపవలయును. ఆధర్మం బేది యందురా? భాగవతధర్మమే యాధర్మంబగు. ఆధర్మం బెట్టిదందురా? అహంకారమమకారంబులు వదలి సర్వాత్మకంబుగా భగవంతునకు సమర్పించుకొనుటయే యాధర్మవిధానము. దేహపోషణాదు లెట్లందురా? సర్వాత్మసమర్ప కులయోగక్షేమంబులు భగవంతుఁడే సమకూర్చును. ఆచింత రవం తయు నవసరములేదు. మిత్రులారా! మనుష్యజన్మంబు వచ్చుటయే మహాదుర్లభము. అనేకసహస్రజన్మసుకృతపరిపాకంబుగా మర్త్య జన్మము గలుగుచున్నది. అట్టి జన్మంబును సంపాదించియు భాగవత

ధర్మంబుల నాచరింపక యాయుష్కాలంబెల్ల క్షణికార్థంబులకై వృథపుచ్చుటకన్న దుష్కర్మము గలుగదు. కాఁబట్టి యీశరీరంబున్నప్పుడే యాత్మక్షేమంబును సంపాదింపవలయును. ఇదియే నాబోధ.

బాల:—ఎల్లరు క్షేమార్థమే శ్రమించుచుందురు. నీచెప్పినట్టి క్షేమమందు విశేషమేమి?

ప్రహ్లా:—నావచించు క్షేమము ఆత్యంతికము. అంతకు మించినది లేదు. మీరు పల్కినది యింద్రియపరంబును క్షణికంబునగు. ఇంద్రియంబులను జయించినఁగాని నాచెప్పిన క్షేమంబు సాధ్యము గాదు. ఈ రెంటికి నెంతభేదము గలదో చూచితిరా? జితేంద్రియుల జీవిత కాలము పరమానందాబ్ధి నోలలాడుచుఁ గడచును. ఇంద్రియారాముల జీవితకాలమన్ననో సగము నిశానిద్రచేతను సగము బాల్యాద్యవస్థలచేతను వ్యర్థమగుచున్నది. బాల్యాద్యవస్థలకాలములోనేని శాంతికలుగదా యని చూచినచో, ఆకాలంబెల్లఁ దీఱని కోరికలతో గడచుచున్నది. ఎట్టకేలకు జీవితమెల్ల వృథయగుచున్నది.

బాల:—ప్రహ్లాదా! భాగవతధర్మంబు లెవ్వి?

ప్రహ్లా:—మిత్రులారా! భాగవతధర్మంబులను తెలియుటకు భగవంతుఁ డెవఁడో యెట్టివాఁడో ముందుగాఁ దెలియవలయును. ఏతత్త్వము బ్రహ్మాది స్థావరపర్యంతము వ్యాపించియున్నదో, ప్రధానం బనునది యేతత్త్వశక్తి వికారంబగునో, ఏతత్త్వము దానిశక్తివికారంబులైన చరాచరంబులం దుండుటంజేసి యవియెల్లఁ దానే యగునో, ఏతత్త్వంబునకు జననాదిషడ్వికారంబులు గలుగవో, ఏతత్త్వము తనవ్యాప్యత్వంబును దృశ్యప్రపంచరూపంబునను, తనవ్యాపకత్త్వంబును బ్రత్యగాత్మస్వరూపంబునను బ్రకటించుచుఁ దనయునికిని గోచరము చేయుచున్నదో, ఏతత్త్వంబునకు జాతిగుణలింగాదిభేదంబులు గలుగవో, ఏతత్త్వము తనశక్తియోగంబున గుణసర్గకారణంబగుచుఁ గార్యంబులైన గుణసర్గంబులందు నలినాభూతమై యుండుచుఁ దదీ

శ్వరత్వంబును వహించియుండునో యాతత్త్వంబును భగవానుఁ
డందురు. భగవానునకుఁ బరమాత్మనారాయణాదినామాంతరంబులు
గలవు.

ఆభగవానునకు సంతోషకరంబులైనపనులను జేయుటయు, ప్రీతి
కరంబులుగానివానిని వదలుటయు భాగవతధర్మం బగును. భగవానునకుఁ
బ్రీతికరంబులైనపను లేవియందురా? ఆసంగతి యెఱుంగుటకు మొట్ట
మొదట మనబుద్ధి తత్పరము గావలయును. అట్లగుటకు మనలోనున్న
యాసురభావం బడ్డుపడుచుండును. ఆభావంబును ప్రప్రథమంబునఁ
ద్యజింప లయును. అప్పుడు యుక్తాయుక్తజ్ఞానము గలుగును.

బాల:—ధర్మకామార్థంబులు పురుషార్థంబులనియు, వానినిఁ జక్కఁగా
నిర్వర్తించుటకై దండనీతి మొదలగువానిని దెలిసికొనవలయుననియు
మనయాచార్యు లుపదేశించిరి. వానిసంగతి యేమి?

ప్రజ్ఞా:—మిత్రులారా! దండనీతి యనునది నయదమంబులను దెలుపును;
వేదపూర్వభాగమైన త్రయీధర్మము కర్మవిధానంబును బోధించును;
అన్వీక్షకి (అనఁగాఁ దర్కవిద్య) హితాహితవిచారదక్షతను గలుపును;
వార్త యనునది జీవికాజ్ఞానజనకశాస్త్రము. అది కృష్యాదుల నొనర్చు
విధానంబును అనఁగా ఎవరెట్టిజీవికావృత్తికి నర్హులో దానిని బోధిం
చును. ఇవియెల్ల నాత్మార్థముగాక భగవత్ప్రీత్యర్థముచేయుదుమేని
సార్థకంబులగు. ఒండుచో నిరర్థకంబులు. ఏలయందురా? స్వార్థమన్న
ప్పుడు భిన్నబుద్ధియు దానితోడఁ గామమోహాలోభంబులు పైకొను
చున్నవి. అన్నిక్లేశంబులకు స్వార్థబుద్ధి మూలంబగుచున్నది గావున
దానిని మొట్టమొదట సంస్కరింపవలయును. అందులకు శాస్త్రము
తోడ్పడును. అట్టిసంస్కృతబుద్ధితో వారువారు స్వధర్మంబులను
నిర్వహింపవలయును. ఆధర్మంబులెల్ల ఫలకాంక్షారహితంబులు
గావున వానిఫలము భగవదర్పితం బగుచుండును. కాబట్టి యట్టి

బుద్ధితో వారివారిధర్మంబును నిర్వహింపుచు సర్వకాల సర్వావస్థలందు భగవంతుని మఱువకుండుటయే మనుష్యులకు బరమధర్మం బగు.

బాల:—ప్రహ్లాదా! ఈజ్ఞానంబు నీ కెట్లు గలిగెను?

ప్రహ్లా:—మిత్రులారా! ఈజ్ఞానంబును వెల్లి శ్రీమన్నారాయణుఁడు నారదమహర్షికి నుపదేశించెను. నారదమహర్షివలన నేను దానిని గ్రహించితిని.

బాల:—ప్రహ్లాదా! బాల్యంబునుండి మనమెల్లరము నెడబాయక యుందుము. మమ్ము వదలి నీవు నారదు నెప్పుడు సేవించి యీజ్ఞానంబును బడసితివి?

ప్రహ్లా:—సంగతి వినుము. నాతండ్రి సురరాజ్యంబు నాక్రమించెను. సురలు నాతండ్రికి వెఱచి భూలోకంబునకుఁ బఱచి యట నేల బొరియలలో దాఁగిరి. తర్వాత నాతండ్రి తపంబుసేయుటకై మందరాద్రికిఁ జని కొన్నియేండ్లు తిరిగి రాఁడయ్యెను. నాజనకుఁ డట్లెంత కాలంబునకు రానందున నతఁడు చచ్చె ననువార్త వెడలెను. ఆమాటకు సుర లెంతయు సంతసించి బొరియలనుండి వెడలివచ్చి సురలోకంబుఁజొచ్చి యందున్నయసురులను బాఱఁదోలి తమతమస్థానంబు లాక్రమించిరి. అసురులు స్వప్రాణరక్షణార్థులై యాలుబిడ్డలనుగూడ వదలి నలుదెసలఁ బారిరి.

అంతట దేవేంద్రుఁడు జయోల్లాసియై రాజమహిషియైన నాతల్లిని జెఱపట్టి కొంపోవుచుండెను. మార్గమధ్యంబున నారదమహర్షి వానికి నెదురై 'ఇంద్రా! వీరపత్నియుఁ బతివ్రతయునైన యీమెను వదలు' మని చెప్పెను. ఇంద్రుఁ డామాట విని 'ఋషివర్యా! ఈమె గర్భంబున నసురేంద్రుని తేజం బున్నది. ప్రసవంబువఱకుఁ గాచి పనితీర్చి యీమెను బంపివైతు' ననెను. నారదుఁడు వానిభావంబును గ్రహించి 'ఇంద్రా! ఈమెగర్భంబునఁ బరమభాగవతుఁ డున్నాఁడు. ఆపుణ్యమూర్తి నీచేతఁ జావఁడు.' అనెను. దేవేంద్రుఁ డంతట నాతల్లిని వదలిపోయెను.

ఆమహర్షి నాతల్లిని వానియాశ్రమంబునకుఁ గొనిపోయి 'అమ్మా! నీపతి వచ్చువఱకు నిందే యుండు' మని చెప్పెను. నాతల్లి యియ్యకొని పతి రాక నిరీక్షించుచు గర్భరక్షణార్థమును స్వాభీప్సితపుత్రోదయార్థము నమ్మునివర్యుని బరమభక్తితో సేవించుచుండెను.

అమ్మహర్షివర్యుఁడు నాతల్లికి ధర్మతత్త్వంబును జ్ఞానతత్త్వంబు నుపదేశించెను. ఆయుపదేశంబును నేను గర్భస్థుఁడనై యుండి గ్రహించితిని. మాతల్లి కాలక్రమంబున నయ్యుపదేశసారంబును మఱచెను. అది స్త్రీలకు స్వాభావికమేగదా! నాఁటినుండి నేఁటివఱకు తత్స్మృతి నన్నుఁ బాయదు. ఇదే నాజ్ఞానోపదేశవిధానము.

మిత్రులారా! బీజం బున్నప్పుడు పత్రపుష్పఫలాదులు పుట్టుచు రాలుచునుండు. బీజము లేనప్పు డవి యేవియుఁ గలుగవు. అట్లే కర్మంబుండుటంజేసి యీశరీరజననస్థితి వృద్ధిపరిణామక్షయవినాశాదులు గలుగుచున్నవి. ఋతువు వచ్చినప్పుడు పత్రపుష్పఫలాదులు పుట్టుటయు రాలుటయుఁ జూచుచున్నాము. అట్లే ఫలభోగ్యకాలంబు వచ్చినప్పుడు శరీరజననాదులు కలుగుచుఁ బోవుచునున్నవి. పుష్పాదు లెట్లు బీజధర్మంబులగునో యట్లే శరీరోత్పత్తి మున్నగునవి కర్మధర్మంబు లగును. కాలశక్తి యనునది బీజంబు నట్లు కర్మంబునుగూడ నంకురింపఁజేయుచున్నది. కాలశక్తి యనఁగా నీశ్వరశక్తియే యగును.

మిత్రులారా! ఆత్మధర్మంబు లెవ్వియందురా? ఆత్మధర్మంబులు విశిష్టములు. నిత్యత్వము, అవ్యయత్వము, నిరవయత్వము, అద్వితీయత్వము, క్షేత్రజ్ఞత్వము, ఆశ్రయత్వము, అవికారత్వము, స్వప్రకాశత్వము, కారణత్వము, వ్యాపకత్వము, అసంగత్వము, అనావృతత్వము అనునట్టి యీ పదురెండు నాత్మధర్మంబులగు. ఈధర్మంబులను లక్షణంబులనియు వచింతురు. ఈలక్షణంబులలో నొక్కటేనియు దేహంబునకుఁ గలుగదు. కావున దేహం బెన్నడు నాత్మ కానేరదు. ఈరహస్యంబు బుద్ధిస్థమైనప్పుడు దేహాత్మరూపభ్రాంతి నశించును. భ్రాంతితోడ ధ్వానికిఁ

గారణమైన యహంకారంబు మాయమగును. అహంకారము లేనినాఁడు 'నేను, నాది' అనుభావ ముండదు. అట్టిభావము లేనినాఁడు సర్వము తానే యగును. అప్పుడు దృశ్యమున నది తనకంటె భిన్నముగాఁ గాన్పింపదు. దీనినే యద్వితీయత్వ మందురు.

మిత్రులారా! ప్రహ్లాదా యని నన్నుఁ బిలుచుచున్నారే మీ భావ మేమి? అనఁగా శరీరంబు నుద్దేశించి పిలుతురా! వేఱొకదాని నుద్దేశించి పిలుతురా? శరీరంబు నుద్దేశించు నెడల నాదేహము, నాశరీరము, నాకన్ను, నాకాలు అనుచున్నాము. అనఁగా శరీరాదులు వేఱనియు, నేను అను నది వేఱనియు నేర్పడుచున్నదిగదా! నేను అను పదార్థ మేదియందురా? శరీరాంతరస్థమై జీవుఁడని యేది చెప్పఁబడుచున్నదో యదే 'నేను' అను పదార్థ మగును. శరీరంబులు భిన్నభిన్నంబులుగాఁ బెక్కులుగా నుండుటంజేసి శరీరాంతరస్థులైన జీవులుగూడఁ బెక్కు రుండవలదా యని శంకింతురుగాఁబోలు! అనఁగా జీవనానాత్వం బేర్పడుచున్న దందురుగాఁబోలు! ఆభావము సరిగాదు. ఎట్లందురా? పదిఘటంబులను నీటితో నింపి మట్టమధ్యాహ్నకాలమున బయట నుంచుఁడు. ప్రతిఘటములోను సూర్యబింబము గానవచ్చును. ఘటజలమందుఁ బ్రతిబింబించిన సూర్యప్రతిబింబంబుల సంఖ్యనుబట్టి సూర్యులుగూడఁ బెక్కు రగుదురా? అన్నిఘటంబులలోఁ బ్రతిబింబించినది యొక్కసూర్యుఁడేగదా! అట్లే నానాశరీరంబులలో నాత్మ యొక్కఁడే ప్రతిబింబించుచున్నాఁడు. శరీరనానాత్వంబును బట్టి యాత్మనానాత్వంబును దలంపరాదు.

శరీరనాశనముతోడ నాత్మనాశ మగుచున్నదనియు, అన్నిశరీరంబులలో నొక్కయాత్మయే యుండునెడల ఒక్కశరీరనాశనముతోఁ దక్కినశరీరంబులు నశించుటలేదనియు, అట్లు నశింపనిశరీరంబులలో జీవంబు లుండుచున్నవనియు, దీనింబట్టి జీవనానాత్వం బేర్పడుచున్న దనియు వాదింతురా? పదిఘటంబులలో నొక్కఘటము పగిలినప్పు డాఘటములోనే సూర్యప్రతిబింబము గానరాకుండును. తక్కిన

తొమ్మిదిఘటములలో సూర్యప్రతిబింబము గానవచ్చుచుండుఁగదా! అట్లే యొక్కశరీరము నశించినప్పు డాశరీరాంతరజీవుఁడు మాత్రమే గాన్పింపకుండుఁగాని తక్కిన శరీరాంతరజీవులు గాన్పించుచునే యున్నారు. దీనింబట్టిగూడ జీవనానాత్వము సాధింపఁదరముగాదు.

ఎల్లశరీరంబులలో నుండునది ఒక్కయాత్మయే యైనప్పుడు ఒక్కని సుఖదుఃఖంబు లెల్లరకుఁ గలుగవలయుననియు, అట్లు గలుగుట లేదు కాఁబట్టి జీవనానాత్వంబు సిద్ధించుచున్నదనియుఁ జెప్పెదురా? పది ఘటంబులలో నొక్కఘటజలమందు నేదే నొకరంగును గలుపుము. అప్పు డాఘటజలమందుఁ బ్రతిబింబించిన సూర్యబింబము మాత్రమే జలవర్ణమునుబట్టి వివర్ణముగాఁ గాన్పించును. తక్కిన ఘటంబులందు యథాస్థితిఁ గానవచ్చును. దీనింబట్టి యేమి యేర్పడుచున్నది? ఉపాధి వర్ణంబునుబట్టి సూర్యప్రతిబింబంబునకు వివర్ణత గలిగినట్లు తోఁచునేగాని వాస్తవముగా సూర్యబింబంబునకు వివర్ణత గలుగలేదని యేర్పడుచున్నది. అనఁగా సుఖదుఃఖంబులు ఉపాధిసంబంధంబులనియు, ఉపాధి భేదంబులనుబట్టి వానికి భేదంబులు గలుగుననియు, సుఖదుఃఖంబు లొక్కయుపాధికిఁ గలిగినమాత్రాననే యవి సర్వోపాధులకుఁ వ్యాపింపవనియు నేర్పడుచున్నది. శరీరంబుల నానాత్వంబునకుఁ గారణ మేమందురా? భోగ్యఫలనానాత్వమే కారణము.

మిత్రులారా! ఆత్మ వేఱు దేహంబు వేఱు అనెడిజ్ఞానం బెట్లు గలుగు నందురా? బంగారుగనిలోనుండి ఱాళ్లను దెచ్చి పిండిచేసి కరఁగించి యూదినప్పుడు స్వర్ణేతరపదార్థంబులుపోయి స్వర్ణము తేలుచున్నది. అట్లే బుద్ధివహ్నికుండంబున దేహాత్మభావంబును వైచి కరగించినప్పు డాత్మ వేఱగుచున్నది. అదే యాత్మజ్ఞానం బనఁబడును.

మిత్రులారా! దేహ మనఁగా నెట్టి దందురా? భగవచ్ఛక్తి యవ్యక్తావస్థనుండి వ్యక్తావస్థకు వచ్చునప్పుడు కొంత మార్పు చెందును. ఆమార్పు ప్రకృతియనియు వికృతియనియు రెండువిధంబులగు. మూల

ప్రకృతి, మహత్తు, అహంకారము, ఆకాశవాయుతేజోజలపృథ్వీతన్మాత్రలైదుఁ గలిసి యీయెనిమిది ప్రకృతియొక్క యష్టవిశేషంబులగును. పంచమహాభూతంబులు పాదాదిపంచకర్మేంద్రియంబులును, జ్ఞానేంద్రియపంచకంబును బుద్ధియు మనమునాలుగు గుణత్రయవికృత్యవస్థ లగును. వీనియొక్క సంఘాతమే శరీరం బనఁబడును. వాని సంయోగభేదంబులను బట్టి శరీరభేదంబు లేర్పడుచున్నవి. ఆదేహంబులు స్థావరజంగమంబులని ద్వివిధమగు. వీనిలో నెద్దానికిని స్వతంత్రచైతన్యశక్తి గలుగదు. భగవానుఁడు వానిలోఁ బ్రవేశించినప్పుడే వానికి నట్టిది గలుగుచున్నది. ఏశక్తివలన నయ్యుపాధులకుఁ జైతన్యత్వము గలుగుచున్నదో యదే యాత్మయని గ్రహింపుఁడు. అయ్యాత్మఁ డాయుపాధులలో సాక్షిరూపంబుననుండు.

మిత్రులారా! కర్మవైషమ్యమునకుఁ గారణ మేమంటిరా? గుణవైషమ్యమే కారణము. గుణములు సత్త్వరజస్తమస్సులని త్రివిధము. ఏగుణము ప్రకాశించినప్పుడు కర్మము జరుగునో యాకర్మము తద్గుణాత్మకమై తద్రూపఫలంబు నిచ్చును. దానంజేసి కర్మవైషమ్యంబును ఫలవైషమ్యంబును గలుగుచున్నది.

భగవానుఁడు శరీరగతుఁడై యున్నప్పుడు శారీరకవాసనలు వానికి నంటకుండు టెట్లందురా? వాయువు సర్వగతమై వీచుచున్నది. ఒకచోటిగాలి సుగంధమయముగా నింకొకచోటిగాలి దుర్గంధపూరితముగా నుండును. ఈసుగంధదుర్గంధంబు లాయాప్రదేశవిశేషములేగాని గాలికి సంబంధింపవుగదా! సంబంధించునేని గాలి సర్వత్ర సుగంధాత్మకముగానో దుర్గంధాత్మకముగానో యుండవలదా. అట్లుండుట లేదుగదా. అట్లే భగవానుఁడు సర్వగతుఁడై సమస్తశరీరంబులలో నున్నను వానికి శారీరకవిశేషంబులతో సంబంధము గలుగదు. ఆసంగతి తెలియక శారీరకవిషయంబులను వానియం దారోపింతురు. అది యజ్ఞానఫలము గాని వేఱుగాదు.

సంసారంబునకు మూలం బేది యందురా ? గుణంబు మూలంబగు. గుణంబునుబట్టి బుద్ధి వ్యవహరించును. ఆవ్యవహారఫలంబుగాఁ గర్మంబు లేర్పడుచున్నవి. ఆకర్మఫలంబుల ననుభవించుటకై జననమరణంబులు గలుగుచున్నవి. ఈవిధానమే సంసారం బనఁబడును.

జీవుఁడు నిస్సంగుఁడయ్యు సంసారబద్ధుఁ డగుటకుఁ గారణం బేమందురా ? సంగములేనినాఁడు బంధకత్వము గలుగదు. ఆత్ముఁడు నిస్సంగుఁడని చెప్పితిని. కావున వానికి సంగము గలుగనేరదు. ఈసంగంబు దేనికందురా ? ఆత్మసాన్నిధ్యంబున వ్యవహరించునట్టి అహంవృత్తికి గలుగుచున్నది. తత్ఫలంబుగా బంధముక్తు లున్నవి. ఆరహస్యం బెఱుంగక అహంకారబంధముక్తులను ఆత్మునం దారోపించుచున్నారు. ఇది యజ్ఞానకార్యము. అజ్ఞానము పోవుటకు భక్తియే పరమసాధనం బగు.

భక్తిసేయుట యెట్లందురా ? 1. ఆత్మవేత్తయైనగురువును త్రిశుద్ధికి శుశ్రూషించుట, 2. ఏది ప్రాపించినను భగవదర్పణముచేయుట, 3. సాధువులైన భక్తులతోఁ గూడియుండుట, 4. భగవంతు నారాధించుట, 5. భగవల్లీలలను వినుట, 6. భగవద్గుణకర్మంబులను గీర్తించుట, 7. భగవత్పాదంబులను నిరంతరము ధ్యానించుట, 8. పుణ్యక్షేత్రములకుఁబోయి యట నున్న భగవన్మూర్తులకుఁ బూజావందనాదులు సలుపుట, 9. సర్వభూతంబులందు నొక్కభగవంతుఁడే యున్నాఁ డనునమ్మికగలిగి భూతసేవయే భగవత్సేవగా భావించి సమస్తభూతంబుల నాదరించుట - ఈతొమ్మిది భక్తికి ముఖ్యాంగంబు లగును. వీనిని శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మసమర్పణము అని పేర్కొందురు. అట్లు చేయుచుండఁగా భక్తి గాఢమగును. తత్ఫలంబుగా నజ్ఞానవాసనలు నశించి జ్ఞానవంతుఁ డగును. జ్ఞానికిఁ భగవత్ప్రాప్తి స్వతస్సిద్ధము.

మిత్రులారా ! గాఢభక్తుఁ డెట్లు వర్తించు నందురా ? లోకవిషయంబున వానివర్తనము విపరీతముగాఁ దోఁచును. కామక్రోధాదు...

నీటిబిందు వెట్లో యట్లు గాఢభక్తుని జీవితం బుండును. వానిచిత్తము నిరంతరము భగవత్పరమై యదే లోకంబుగా నుండును. ఏనాఁడు భగవద్గుణకర్మంబులను వానిలీలావతారచేష్టితంబులను గాఢభక్తుఁడు వీననోచడో యానాఁడు వానికి మహోపద్రవంబగు. అవి వినునప్పుడు వానిమేనెల్లఁ బులకరించును; కన్నులు హర్షాశ్రుప్రలను వర్షించును; నోట మాట రాదు; మైమఱపు పైకొనును. అప్రయత్నంబుగా భగవంతునిఁ బాడును; బిగ్గ యఱచును; ఆడును; పయ్యెముపట్టినో యన నాక్రోశించును; కన్నవారికెల్ల మ్రొక్కును; నిట్టూర్పును; లజ్జాభయంబులు మాని హరిహరీ యనుచుఁ గేకలువేయును. అట్లుచేయుట యతఁ డెఱుంగకుండును.

భగవద్భజనంబునకుఁ నెల్లరుఁ దగుదురా యని యందురా? ఎల్లరుఁ దగుదురు; జాతికులమతభేదంబులుగాని స్త్రీపురుషభేదంబులుగాని గలుగవు. మృగపక్షులుకూడ భగవంతుని భజించి కడతేరుట గలదు. పరమపాపికూడ భగవద్భజనముచేసి పునీతుఁడై యుత్తమగతి నొందును.

మిత్రులారా! భగవంతుఁడు వానిభక్తులయోగక్షేమంబులను అనాయాచితంబుగాఁ దానే కూర్చును. అంతియగాదు. పరమభక్తునిఁ దనమూఁపున మోయును. దాని దయానురాగంబు లెట్టివో మీరే యూహింపుఁడు. మిత్రులారా! మనముగూడ జంకుగొంకులు మాని యేకాంతభక్తితో భగవంతునకు సమర్పించుకొని యామహాత్ముఁడు నడపునట్లు నడచుదము. ఇదే పరమపురుషార్థము. ఇంతకన్న మీకుఁ జెప్పనైనది లేదు.'

ధర్మజా! ప్రహ్లాదుఁ డట్లుచెప్పఁగా దైత్యకుమారు లెల్లరు విని విన్నవిషయంబును యథామతి విమర్శించి తద్వచనంబులు పరమగత్యంబులని భావించి యట్లు వర్తింపసాగిరి.

### హిరణ్యకశిప ప్రహ్లాదుల తృతీయసంభాషణము

ధర్మజా! ప్రహ్లాదుఁడు తోడివిద్యార్థులకు బోధించుటయు వారు తదనువర్తనులగుటయుఁ జండామార్కులకుఁ దెలిసెను. వారు మహా

భయమంది హుటాహుటిఁ బోయి వృత్తాంతంబెల్ల హిరణ్యకశిపునకు నివేదించిరి. రాక్షసేశ్వరుఁడు కోపావేశుఁడై 'కటా! తాఁ జెడ్డకోఁతి కుల మెల్లఁ జెఱచిన ట్లాయెను. ఇఁక నితనిఁ బుత్రునిఁగా భావింపరాదు' అని నిశ్చయించి ప్రహ్లాదుని రప్పించి వాని నెంతయు నొవ్వనాఁడెను. ఆ కుమారుఁ డామాటకు సుంతయుఁ జలింపక కేలుమోడ్చి వినయ వినమ్రుఁడై యుండెను. అంతట దైత్యనాథుఁడు కాలుద్రొక్కిన నల్ల త్రాచువలె బుసకొట్టుచుఁ గ్రూరకుటిలదృష్టి నెఱపుచు 'ఓరీ! దుర్వినీతా! మందాత్మా! కులనాశకా! నాశాసనంబును దృణీకరించితివి. ఇదిగో నిన్ను యమపురంబునకుఁ దరలించుచున్నాను. నాబొమ యొక్కింత చిట్లించితువేని ముల్లోకంబులు లోకపాలురతోడ గడగడ వడంకు. మూఢా! ఎందును నాకు నెదురు గలుగదు. అట్టి నన్ను నీవు లెక్కసేయవు. ఎవనియండఁగొని యింతగా సాహసింతువు?' అని మేఘగర్జాభీషణంబుగాఁ బలికెను.

ప్రహ్లాదుఁ డాపలుకులకు బెగడొందక నెమ్మది వహించి 'దానవేశ్వరా! ఎవఁడు సర్వలోకశరణ్యుఁడో, ఎవనివశంబున స్థావరజంగమాత్మకనిఖిలప్రాణికోటి యాబ్రహ్మపర్యంతంబు వర్తించునో, ఎవఁడు కాలాత్ముఁడై సమస్తవిశ్వంబును దనయాజ్ఞ నడిపించునో, ఎవని పరాక్రమంబు నిర్వక్రమై లోకాలోకంబులు వ్యాపించియుండునో, ఓజస్సత్త్వజితేంద్రియంబులెల్ల నెవనియాత్మ ప్రకాశకంబు లగునో, ఎవఁడు నిజశక్తులచేత జగత్సృష్టిస్థితిలయంబులు గావించునో యాపరమాత్ముఁడే నాకు శరణంబు. తండ్రీ! ఇంతటనైనను నీవు నీయాసురభావంబును వదలి మనస్సామ్యంబును వహింపుము. ప్రాణులకు బహిశ్శత్రువులు శత్రువులు గానేరరు. నిక్కమైనట్టియు మహాపకారియైనట్టియు శత్రువు లోపలనే యుండు; ఎవఁ డందువా? ఉత్పథప్రవృత్తచిత్తమే యా శత్రువు. వానిని జయించినవానికి ముల్లోకంబులు పరమమిత్రంబులగు. మనస్సును సమీకరించుటయే భగవత్పరమారాధనంబు. నాయనా!

ముజ్జగంబులను గెలిచితి నందువా? త్రైలోక్యదిగ్విజయంబు విజయమే గాదు. మఱి యేది దిగ్విజయం బగునందువా? మనలో నార్గురు శత్రువులు డాఁగి మనకన్నులయెదుటనే సర్వస్వము హరించుచుందురు. వారిని జయించుట శతకోటిదిగ్విజయం బగు' నని మృదుస్వరంబున విన్నవించెను.

ధర్మజా! హిరణ్యకశిపుఁ డాపల్కులు విని 'మూఢా! చావు గోరి యీబట్టుపోగడ్తలు ప్రేలుదువు. నిర్భాగ్యుఁడా! లోకైకేశ్వరుఁడనై నే నుండఁగా వేఱొండు జగదీశుఁడు గలఁ డందువు. ఈమాటకు సుద్దము బద్ధముఁ గలదా? అతఁ డెక్కడ నున్నాడో చూపింతువా?' యని గద్దించి పలికెను. ప్రహ్లాదుఁ డాయెత్తిపొడుపు విని 'తండ్రీ!—

క. "ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే యుండు దానవాగ్రణి వింటే."

అని చెప్పెను. దనుజేంద్రుఁ డామాట విని 'ఓరీ! నీహరి యెల్లెడల నుండువాఁడేని ఈసభాంతర స్తంభమం దుండునా?' యని యుల్లసంబాడెను. ప్రహ్లాదుఁడు వానిభావంబును గ్రహించి—

"శా. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండుప్రోడ విపుల స్తంభంబునం దుండఁడే?
స్తంభాంతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహముం లేదు; ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్."

అని చెప్పెను.

హిరణ్యకశిపుఁడు పండ్లు గీఁటి 'ఓరీ! నీప్రేలుడులు చాలింపుము. ఇదె నీతలఁ దెగవేయుచున్నాను. నీహరి యెందున్నాఁడో యెట్లడ్డపడునో చూడు' మనుచుఁ దటాలున సింహాసనంబునుండి లేచి బలంబెల్ల మూర్తీభవింపఁ జేసి బిగుపిడికిట నా స్తంభంబు నడచెను.

### శ్రీనృసింహావతారము

ధర్మజా! ఆవ్రేటుతోడ స్తంభాంతరంబునుండి మహాఘోషం బుప్పతిల్లెను. ఆశబ్దంబును విని బ్రహ్మాండకటాహంబు వ్రక్కలగుచున్నదో యని యందున్న వారు తలంచి తాలుమాలయిరి. బ్రహ్మాదులు తమలోకంబులకుఁ బ్రళయంబు గలిగెనో యని యదిరిపడిరి. హిరణ్యకశిపుఁడు పుత్రవధైకచింతాపరుఁ డగుటం జేసి యాఘోరనాదంబును విని వినక యుండెను.

అంతలో స్తంభాంతరంబునుండి మహావికృతాకారం బొండు వెడలెను. తప్తసువర్ణకాంతుల గ్రక్కుచున్నవీక్షణంబులతో, కరాళదంష్ట్రాప్రభలతో, ఖడ్గధారావీక్షణజిహ్వతో, కుటిలభ్రూకుటితో, నిక్కిన చెవిదోయితో గిరిగుహంబోని వక్త్రంబుతో నొప్పుచు హ్రస్వపీతరకంఠంబును విశాలవక్షంబును సూక్ష్మమధ్యంబును శశికిరణధవళరోమకూపంబును నర్ధచంద్రాకారంబుగా వంగియున్న వాడిగోళ్లును భుజాసహస్రంబును గలిగి మిన్నొరయుచున్న యా నరకేసరిరూపంబును మహాభయంకరమైన దానిని దానవేశ్వరుఁడు చూచి 'ఏమీ! ఇది నరుఁడుగాఁడు, మృగంబును గాదు. ఉభయాత్మకమై యున్నది. ఈరూపంబు నెన్నఁడుఁ గని విని యెఱుంగరు. మహామాయావి హరి నాకు మృత్యువై యిట్లు వెలసెఁగాఁబోలు! కానిమ్ము. నన్నేమిచేయఁగలఁడో చూతము' అనుచు సింహనాదంబు గావించి గదాపాణియై యురవడించెను. హిరణ్యకశిపుని తేజంబు నృసింహామూర్తితేజంబులోఁ బడి యగ్గిలోఁబడ్డ మిడుతయట్లయ్యెను. ఆనరకేసరి యాదైత్యవల్లభుని బురువుంబలె బట్టుకొనెను. పన్నగంబు గరుడుని పట్టునట్లు దైతేయుఁ డాపట్టును దప్పించికొని వాలును బలకయు గ్రహించి వేగోద్ధతుఁడై యా నరకేసరిపయిఁ గవిసెను.

### హిరణ్యకశిపసంహారము

అంత నరసింహామూర్తి దారుణాట్టహాసంబు గావించి వాని నొడిచి పట్టి సంధ్యాసమయంబున ద్వారమధ్యంబునఁ దనతొడపై నిడి వాడిగోళ్ల

వానిపొట్ట చీల్చి ప్రేవులు త్రెంచి మెడ వైచికొనెను. ధర్మజా! ఆమహా మూర్తి సటాజాలంబు తాఁకుటకు మేఘంబులు చెల్లాచెదరయ్యెను; విమానంబులు సుకులపాటునొందెను; వానిచూడ్కి వేడిమికి నోర్వలేక గ్రహంబులు తొలంగెను; నిట్టూర్పుగాడ్పులకు జలధులు కలంగెను; ఘోరనాదంబునకు దిగ్గజంబు లులికి మదంబులు విడిచెను; పాదఘట్టనంబునకు భూతలంబు గ్రక్కదలెను; కొండలు కూలెను; ఘనాంభోంతరాళంబెల్లఁ దేజోమయంబయ్యెను; రాక్షసులు చెల్లాచెదరైరి.

నరహరి యంతట దైత్యేశ్వరునిగద్దె నధిష్ఠించెను. కోపాగ్నులు గురియుచున్నయామూర్తికి నెదుట నుండనోపక యందున్నవారెల్లరు దాగిరి. లోకవిషమజ్వరంబైన దైత్యుఁడు తెగటారె ననుసంగతి దేవలోకంబునకుఁ బ్రాకెను. సురకాంతలు స్వస్థచిత్తలై యానరసింహమూర్తి పయిఁ బుష్పవర్షముఁ గురిసిరి. ఖేచరవిమానంబులు మింటఁ గ్రందుకొనెను; దేవదుందుభులు మ్రోసెను; గంధర్వగానంబు నచ్చరలనృత్యంబులు చెలరేఁగెను.

### బ్రహ్మాదుల స్తుతులు

ధర్మజా! ఆభీకరమూర్తి సమీపింపనోడి ఋష్యాదులుగూడ దవ్వుదవ్వులైరి. అంతలోన బ్రహ్మయు రుద్రుఁడును వచ్చిరి. వారిని బురస్కరించికొని యింద్రాదిదేవతలును సిద్ధవిద్యాధరగంధర్వనాగయక్షకిన్నరకింపురుషభూతభేతాళాదులును బితృదేవతలును మనువులును ప్రజాపతులు నచ్చరలును విష్ణుపార్షదులు నొకరివెంట నొకరు వచ్చి గూడి కొండొకదవ్వున నిల్చి తద్రూపంబును జూచుచు నిశ్చేష్టులై కేలుమోడ్చి మ్రోడులో యన నుండిరి.

### బ్రహ్మస్తుతి

అంత బ్రహ్మదేవుఁడు మునుకడ నిలిచి 'దేవా! నీ యీయవతారమాహాత్మ్యం బిట్టిదని యూహించుటకు సృష్టికర్త యనఁబడు నాకే శక్తి చాలదు. ఇతరులసంగతి చెప్పనేల? దేవాధిదేవా! నీవు సర్వాంతర్యామి

వని నీభక్తుఁడు ప్రహ్లాదుఁడు నొక్కినొక్కి పలికెను. వానిమాటను రూఢిచేయుటకై స్తంభమధ్యంబున నవతరించితివి. అహో! నీభక్తజనానుగ్రహం బేమనిచెప్పనగు! దేవా! ఈవిచిత్రరూపంబు కలలోనేనియు నాకు స్ఫురింపదు. ఆదైత్యేయుఁడు విచిత్రవరంబు గోరి పడసి తనకు నెందుఁ జావులేదని విఱ్ఱవీఁగెను. ఆవరంబులెల్లఁ బొల్లుచేసి నాతెలివి యెంతో నాకుఁ దెలిపితివి. ఇంద్రాదులకు నొసంగిన యభయవచనంబును బాటించితివి. దేవా! అనంతశక్తిసంపన్నుండవు. నీప్రభావంబు మహాత్ములకుఁగూడ గోచరింపదు. అవ్యయమూర్తివయ్యు గుణంబుల నధిష్ఠించి రూపంబులు దాల్చి వ్యయమూర్తివలెఁ దోఁచుచు నెల్లరు భ్రాంతిపడఁజేయుదువు. నిర్మత్సరుండవయ్యు లోకసంగ్రహార్థము భీకరకార్యంబు లొనర్తువు. దేవా! నీమాహాత్మ్యంబును బుద్ధి యూహింపఁజాలదు; వాక్కు నుడువ నేరదు. ఇదే నమస్కారము' అని నమస్కరించెను.

## రుద్రస్తుతి

అంతట రుద్రుఁడు ముందునకు వచ్చి 'భక్తవత్సలా! నీకోపంబునకు సహస్రయుగాంతసమయంబు తగు. ఇప్పుడు దానికి నవసరంబుగాదు. ఈయసురకారణంబున నాగ్రహమూర్తి నైతి నందువా? ఆయల్పుఁడు తెగటారెను. వానిపుత్రుని నీభక్తుని ననుగ్రహింపుము. శాంతింపు' మని పలికెను.

## ఇంద్రస్తుతి

రుద్రునివెంబడి యింద్రుఁడు నిలిచి 'పరమపురుషా! ఏదైవాధముఁడు మా హస్తతలంబులనుండి హవిర్భాగంబుల నొడిచి లాగికొని మాకు మహాక్షుధార్తిని గలిగించెనో యాహవిర్భాగంబులను మాకు మఱలఁ బ్రసాదించితివి. అయిన నది యంత గొప్పగాదు. వానివలని భయంబు భవత్పరంబులైన మాహృదయంబులను లాగియాడ్చి వానికాళ్లఁ బ్రాలఁబడవైచెను. గత్యంతరము గానక వానికి నూడిగంబులు సేయు చుంటిమి. ఆదౌర్భాగ్యంబును దొలఁగించి నీపాదసేవాభాగ్యంబును

మాకు మఱలఁ గలిగించితివి. ఇదియే మాకుఁ బదివేలు. నీసేవాభాగ్యం బెట్లు గొప్పయగు నందువా ? సురలోకభోగంబులెల్లఁ గాలగ్రస్తములై నశించును. నీప్రసాదభాగ్యంబన్ననో దినదినాభివృద్ధిఁ గాంచి చిరస్థాయి యగు. దానంజేసి నీసేవాశ్రీని వరింతుము. అన్నింటికంటె ముక్తి హెచ్చుగదా యని యందువా ? ముక్తికన్న నీపరిచర్యాభాగ్యమే మహోత్తమంబని మహాత్ములుగూడ దానినే వరింతురు. మాబోంట్లు గోరుట వింతయగునా ?' యని సాష్టాంగం బొనర్చెను.

ఋ షి జ న స్తు తి

ఇంద్రునివెంట ఋషివర్యులు నిలిచి కేలుమోడ్చి 'లోకశరణ్యా ! ఏ నీప్రభావంబు నీలో లీనమైయున్న విశ్వంబును బహిర్గతం బొనర్చునో యానీప్రభావంబును ధ్యానించుటయే పరమతపంబని యుపదేశించితివి. అదే మహాతపంబుగా నుంటిమి. మాతపంబునకు నితఁడు భంగకారి యయ్యెను. వెఱపుదోఁపక పరితపింపసాగితిమి. నేఁటితో మాపరితాపముఁ జల్లార్చి మాపూర్వతపోరూపభాగ్యంబును గూర్చితివి. మాకృతజ్ఞతను దండప్రణామంబుల వెల్లడించుచున్నా' మని సాగిలిబడి లేచిరి.

పి తృ దే వ త ల స్తు తి

'జగద్రక్షకా ! మాసంతతివా రిచ్చునట్టి శ్రద్ధాపిండంబులును తీర్థకృతతిలోదకంబులును మాకు నన్నపానంబులుగాఁ గూర్చితివి. వానితో మేము జీవించుచుంటిమి. ఈయసురుఁడు మాయన్నపానంబులను హరించి మమ్మెల్లఁ గూటికి నీటికి దవ్వుచేసి మాడ్చెను. నోరువిచ్చి మాగతి చెప్పుకొనుటకుఁగూడ భయమయ్యెను. లోలోన మ్రగ్గి మ్రందుచుంటిమి. నేఁటికి నీవలన మాగోడు తీఱెను. ధర్మరక్షకా ! ఇదే సాష్టాంగం'బని పితృదేవతలు నేలవ్రాలి మ్రొక్కిరి.

సి ద్ధు ల స్తు తి

'యోగీశ్వరా ! మాయోగసాధనంబులెల్ల నీయనుగ్రహంబున ఫలకారు లయ్యెను. అష్టసిద్ధులను బడసితిమి. ఈదానవేశ్వరుఁడు వర

దానోద్ధతుఁడై తద్బలయోగంబున మాసిద్ధులనెల్ల లాగికొని మమ్ము రిక్తహస్తులఁ జేసెను. వానికై మేము గోడుగోడుమనుచుంటిమి. మా గోడు తీర్చితివి. ఇదే మా కృతజ్ఞతాంజలులు' అని సిద్ధులు నమస్కరించిరి.

### విద్యాధరుల స్తుతి

'మహాత్మా! మేము ధారణాశక్తి నాశ్రయించి యంతర్ధానాది విద్యలను గడించి సుఖంబుంటిమి. ఈకూళ స్వవీర్యదర్పంబులచేత మా విద్యల నరికట్టి మమ్మెల్ల ననదలఁ గావించెను. నేఁడు మాసొమ్మును మాకు ననుగ్రహించితివి. ఇదే మాయభివాదనంబు'లని విద్యాధరులు మ్రొక్కిరి.

### నాగుల స్తుతి

'దేవా! ఈపాపాత్ముఁడు మాశిరోరత్నంబులనేగాక మా స్త్రీరత్నంబులనుగూడ హరించి మాకుఁ దీఱనివ్యథఁ గూర్చెను. వానిబాధ తప్పించితివి. ఈసుకృతంబునుగూర్చిన నీకుఁ బదివేలుదండంబు' లని నాగులు సాగిలఁబడిరి.

### మనువుల స్తుతి

'దేవా! నీయాజ్ఞాకరులు మనువులు నమస్కరించుచున్నారు. ఈదురాత్ముఁడు కేవలాహంబుద్ధి నాశ్రయించి ప్రకృతిధర్మంబునుగూడఁ దిరస్కరించి వర్ణాశ్రమమర్యాదలను దుడిచివైచెను. వానిని దెగటార్చి ధర్మంబు నుద్ధరించితివి. మాకర్తవ్యంబును శాసింపు'మని మనువులు వేడిరి.

### ప్రజాపతుల స్తుతి

'స్వామీ! మమ్ముఁ బ్రజేశ్వరులనుగా నియమించితివి. ఈదురాత్ముని యుపద్రవంబునకు నోడి సృష్టికార్యంబును విరమించుగతి మాకుఁ గలిగెను. ఈదుండగీఁడు నేఁడు నీ నఖాగ్రంబులకు బలియయ్యెను. లోకమంగళకరావతారా! ప్రణామంబు' లని ప్రజాపతులు నమస్కరించిరి.

### గంధర్వాదులస్తుతి

'ఈశ్వరా! నీపాటగాయకులము మమ్మెల్ల నితఁడు స్వబలవీర్యోద్ధతుఁడై దాసానుదాసులనుగాఁ జేసికొనెను. ఎవ్వ డెవనికి నెట్టిదశగలుగునో సుంతేనియు నితఁడు తలంపఁడు. దుష్టులకు దీర్ఘశుభంబులగునా' యని గంధర్వులు మ్రొక్కిరి. 'హరీ! నీపాదసేవకులమగు మాచేత నితఁడు వానిపాదంబులకు మ్రొక్కులు పడసెను. భవాపవర్గం బగు నీచరణసేవను మాకు మఱలఁ గృపచేసితివి. కృతార్థుల' మనుచుఁ జారణులు నుతించిరి. 'దేవా! మనోజ్ఞకర్మంబు లొనర్చి తత్ఫలంబుగా నీపరిచారకులలో ముఖ్యులమైతిమి. మాచేత నితఁడు వానిపల్లకిని మోయించెను. నీవు చతుర్వింశతితత్త్వనియామకుండవుగావున నీతత్త్వవ్యతిరేకవర్తనుని బరిమార్చి లోకపరితాపంబును దీర్చితి' వని యక్షులు శ్లాఘించిరి. 'మహాపురుషా! కింపురుషులు ప్రణామపూర్వకంబుగా విన్నవించుకొనుచున్నారు. ఈదానవుని హరించుట యనఁగా బ్రాణులయెడ నీకుఁ గల కారుణ్యాతిశయంబును బ్రకటించుటయేగాని వేఱుగాదు. ఇదే నమస్కార' మని కింపురుషులు నతులైరి. 'దేవా! వైతాళికులము మేము నీనిర్మలకీర్తిని సభాసత్రాతులందుఁ బాడి సత్కృతులమై మనుచుంటిమి. నిన్నుఁ బాడిననోటనే యీదురాత్మునిఁ బాడునట్టిదుర్గతి మాకు సంభవించెను. అది నేఁటితో సమాప్తమాయె' నని వైతాళికులు వందనంబు లిడిరి. 'నరసింహా! నీకీర్తిపాఠకులను గిన్నరులను మమ్మితఁడు వెట్టిగొనెను. మాపడినపాట్లిన్ని యని చెప్పఁగాదు. నేఁటితో మాదురదృష్టము తీఱె' నని కిన్నరులు ప్రశంసించిరి. 'లోకశరణ్యా! నీపార్షదులమైయుండియు నీయీయద్భుతరూపంబు నెన్నఁడేనియుఁ గాంచి యెఱుంగము. ఈతఁడు తొల్లి నీపార్షదుఁడుగానుండి విప్రశాపహతుఁడై యసురుఁడుగా జనించెను. వానిశాపమోక్షార్థంబును సర్వలోకమంగళార్థంబును నీ విప్పు డిట్లవతరించితివి. ఇతనినిఁ జంపుట వాని ననుగ్రహించుటయేగాని వేఱుగా' దని పార్షదులు పలికిరి.

## నృసింహోగ్రంబు శాంతిల్లుట

ధర్మనందనా! బ్రహ్మాదులెల్ల దవ్వుదవ్వులనుండి యట్లు ప్రశంసించిరేగాని యాయుగ్రమూర్తిని డాయఁజాలరైరి. ఎట్టకేలకు వారు శ్రీదేవి నాశ్రయించిరి. లక్ష్మియు నట్టిఘోరరూపంబును మున్నెన్నడు జూచిగాని వినిగాని యెఱుంగదు. ఆకారణంబున నమ్మూర్తిని డాయనోడి యామెయుఁ దొలఁగియుండెను. బ్రహ్మాదులకు నుపాయాంతరము దోఁపదయ్యెను. ఎట్టకేలకు వారు ప్రహ్లాదుని బిలిచి 'వత్సా! లోకేశ్వరునకు నిట్టికోపంబు నీతండ్రి కారణంబునఁ గలిగెను. నీవే యీజగత్పతికి శాంతిగూర్ప నోపుదు' వనిరి.

అంతటఁ బ్రహ్లాదుఁడు మెలమెల్లగాఁ జని యాభయంకరమూర్తి పాదంబుల వ్రాలెను. భగవానుఁ డయ్యర్భకుని లేవనెత్తి వానిశిరంబుపయిఁ దనహస్తపద్మంబు నుంచెను. హరికరస్పర్శఁ గాంచినంతనే యాబాలుఁడు చిత్తనిర్వృతియు బ్రహ్మసాక్షాత్కారంబుఁ బడసెను. వాని హృదయము పరమానందరసాత్మకమయ్యెను. ఆయానందరసంబు లోన నిమ్ముఁగానక వెలికి నురవడించెనో యన వానికందోయినుండి బాష్పరూపంబున వెలికిఁ బ్రాఁకెను. ప్రహ్లాదుఁడు తన్మయుఁడై యిట్లు స్తుతించెను.

## ప్రహ్లాదకృత నృసింహస్తోత్రము

'దేవా! సర్వేంద్రియంబుల నంతర్ముఖంబు గావించి క్రోడీకరించి యేకాగ్రంబొనర్చి నిన్నుఁగూర్చి మననంబు సేయుమునులుగాని, సాంఖ్యయోగంబునందు నాఱితేఱి తత్త్వసారంబు నొడిచి త్రావి సంతృప్తులైన జ్ఞానులుగాని, నిరంతరము నీసందర్శనసల్లాపాదులభాగ్యంబు గన్నసురలుగాని, సర్వసృష్టికిఁ గర్తయై నీతత్త్వవిశేషంబును నాల్గుమోముల నాల్గువేదంబులుగాఁ బ్రకటించిన బ్రహ్మగాని నిన్ను స్తుతింప సమర్థులు గాని నాఁడు, ఈవరాఁటుఁడు రజస్తమఃప్రధానరాక్షసకులజుఁడు నిన్ను వర్ణింప

నేర్చునా? సత్కులజననంబును, సౌందర్యంబును, తపశ్శక్తియుఁ, బాండిత్యంబును, సర్వేంద్రియనైపుణ్యంబును, తేజఃప్రతాపంబులును, బలపౌరుషంబులునుఁ, బ్రజ్ఞయు ననెడి పదురెండుగుణంబులు గలవారు మాత్రమే నిన్నారాధింప నర్హు లందురు. ఇందొక్కటియు నాకుఁ గలుగదు. ఎట్లు నీకుఁ బరితోషంబుఁ గూర్పనేర్తు?

స్వామీ! పైనిఁజెప్పిన ద్వాదశగుణంబులు గల్గినను భక్తి లేనిచో నవి ఫలకారులు గానేరవు. భక్తిహీనుఁడైన విప్రునికన్న భక్తిగలిగిన చండాలుఁడే వేయివిధంబుల నుత్తముఁ డగు. భక్తి గోరంత గలిగెనేని శ్వపచుఁడయ్యుఁ దాను పునీతుఁడగుటయేగాక వానికులంబునెల్లఁ బవిత్రీకరించుచున్నాఁడు. గర్వము గలవాఁడు విప్రుఁడైనను తాను భ్రష్టుఁడగుటయేగాక స్వకులంబునుగూడఁ జెఱచును. మఱియు భక్తి లేనినాఁడు పైనిఁజెప్పిన ద్వాదశగుణంబులు మనశ్శుద్ధికరంబు లగుటకు మాఱుగా గర్వదాయకంబులగు. వేయేల? భక్తిహీనునకంటెఁ బరమ నీచుఁడు గలుగఁడు.

దేవా! ధనాదులచేతఁ బ్రాకృతులు సన్మానితులై పరితోషించుచుండఁగా భగవంతుఁడవైన నీవుమాత్రము పరితోషింపనికారణ మేమం దువా? ప్రాకృతులు నాత్మాభిమానులు. అయ్యభిమానంబు వారికి స్వల్పంబులచేత సంతసంబును గూర్చు. నీ వన్ననో నిరభిమానపూర్ణుఁడవు. ఎల్లరకుఁ గోరినదానిని గోరిన ట్లొసంగుదువు. నీవు కోరనైనదియుఁ బడయనైనదియు గోరంతగూడఁ గలుగదు. దానంజేసి ప్రాకృతబుద్ధి నీవంక నేనిఁ దలయెత్తనేరదు.

దేవా! ఏదియు నీకు నంగీకృతము గానినాఁడు నిన్నుఁ దృప్తి నేయుట యెట్లని శంకింతురు. భక్తి యొక్కటే నీకుఁ బరితోషకరంబగు. భక్తి లేనివారి పూజలగతి యేమందురా? నీవు కరుణాత్ముఁడవు గావున వారి ననుగ్రహించుటకుఁగాఁ దత్పూజలనుగూడ నంగీకరింతువు. నీపూజ లెల్లఁ జూపరులకొఱకేగాని నీకుఁ గావు. అది యెట్లందువా? ముఖ

మండలంబును దిలకాదులచేత నలంకరించుకొని యద్దమునందుఁ జూచి నప్పు డాయలంకారంబు లెల్లఁ బ్రతిబింబార్థం బగుట స్పష్టమేగదా! అట్లే నిన్నుఁ బూజించుట పూజకుల మేలునకే యగు. దేవా! నీవు భక్తి పరితోషమూర్తివి. నాభక్తి నన్ను మిన్నకుండనీయదు. నాయల్పమతికిఁ దోఁచినట్లు నిన్ను నుతింప సాహసింతును. నాసాహసంబునకు భక్తియే కారణంబు గావున నన్ను మన్నింపనగు.

దేవా! ఈబ్రహ్మాదులెల్లరు నీశాసనపాలకులైన భవద్భక్తులగు దురు. మేమన్ననో యసురజాతులమైన నీ వైరుల మగుదుము. అట్టి బ్రహ్మాదిభక్తులుగూడ నీ యీఘోరావతారంబును గాంచి బెగ్గడిల్లు చున్నారు. నీయవతారంబు లెట్టివైనను లోకక్షేమసుఖప్రదాయకంబు నకేగాని భయంబును గూర్చుటకుఁ గావు. ఎవ్వనివధార్థం బీరూపంబును దాల్చితివో యతఁడు గడతేరెను. దుష్టశిక్షణంబున శిష్టరక్షణంబయ్యెను. ముజ్జగంబులు సంతసించెను. దేవా! నీనరసింహరూపధ్యానము సర్వ భయశాంతికరంబగు. అయినను దానిని సందర్శింపలేక క్రోధప్రశాంతిని బ్రార్థించుచున్నారు.

మ. ఖరదంష్ట్రాభ్రుకుటీ సటానఖయునుగ్ర ధ్వానయుక్ రక్తకే
సరయుక్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయు నైన నీ
నరసింహాకృతిఁజూచి నే వెఱవఁ బూర్ణక్రూరదుర్వారదు
ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు నీపాదాశ్రయుం జేయవే.

దేవా! నాసంగతి యేమందువా? నాభయంబు దీఱుట యెట్లం దువా? నీచరణశరణ మెక్కలే నాభయంబు నుడుపనోపును. ఆ నీపాదంబును జేర నెప్పుడు పిలుతువో యని నిరీక్షింతు.

స్వామీ! ఇష్టానిష్టవియోగసంయోగకర్మఫలంబైన యీబహు జన్మరూపశోకానలంబు దేహధారులను నిట్టనిలువున దహించుచున్నది. ఆయగ్నిని జల్లార్చుటకై వివిధయత్నంబులు గావింతురు. అవియెల్ల నయ్యగ్నిని జెలరేపి బునర్దుఃఖకారణంబు లగుచున్నవేగాని వేఱుగాదు.

ఆదుఃఖంబునకు మూలం బెయ్యది యందువా? అనాత్మవస్తువులందు నాత్మ భావంబు చేయుటయే దుఃఖమూలము. అది యెట్లందువా? తత్ప్రాప భావంబుతోడ మోహము పైకొనును. మోహఫలంబుగా సర్వదుఃఖం బులు సంప్రాప్తములగుచున్నవి. దుఃఖప్రతీకారం బేమందువా? నీ దాస్యం బొక్కటే గలదు. అది యెట్లందువా? నీదాసులయి నీవు కృపారసంబును వర్షింతువు. దానితోడ దుఃఖాగ్ని చల్లారుచున్నది. దేవా! సుఖదుఃఖంబులు గుణకార్యంబులనియు గుణవ్యవహారం బున్నంత కాలం బవి తప్పవనియు శంకింతువు. ఎవ్వఁడు నీపాదపద్మంబును హంస రీతి నాశ్రయించునో వాఁడు గుణాతీతుఁ డగు. బిడ్డలకుఁ దలిదండ్రులును, రోగికి నౌషధంబును, సముద్రమగ్నునకుఁ దెప్పయు దుఃఖప్రతీకారంబు లగునట్లుగాఁ దత్తద్వివిధదుఃఖంబునకు దత్తదనుకూలప్రతీకారంబు గల దనియు, దుఃఖంబులు బహువిధంబులగుటంజేసి యేకమూలికాప్రయోగం బెట్లు ఫలకారియగుననియు శంకింతువు. నీయనుగ్రహవీక్షణంబు పాటిని నాఁ డెవ్వియు నుపయోగింపవు. మహావైద్యుల చికిత్సఁ బడసియుఁ జచ్చుచున్నారుగదా! గొప్పగొప్పపడవ లెక్కియు సముద్రాంతరంబున నావతోడ మునిఁగి నశించుచున్నారుగదా! కావున నవియెల్ల స్వతంత్రించి మేలు గూర్పనేరవు. నీయనుగ్రహము గలిగిననాఁడు గడ్డిపఱకయు సంజీ విని యగు.

దేవా! సంతానకారకులైన తలిదండ్రులును సృష్టికారకులైన బ్రహ్మాదులును వారిబిడ్డలదుఃఖంబులను దీర్పరా యని యందువా? ఏకాలమందైనను, ఏకారణంబుననైనను, ఏయుపాదానముచేతనైనను, ఏసంప్రదాయప్రకారంబుగానైనను, ఎద్దానికేనియు నెవండేనియుఁ గర్తగా భావింపఁబడునేని వాఁడు నీస్వరూపంబేగాని తదన్యుఁడుగాఁడు. ఎట్లు చూచినను నీకంటె వేఱురక్షకుఁడు గలుగఁడు. కాఁబట్టి నీవే నాకు గతి.

దేవా! అట్లు సిద్ధాంతరీకరించుట యెట్లందువా? నీశక్తియందు మూఁడుగుణంబులు గలవు. ఎప్పుడు నీయనుగ్రహంబు వీక్షణరూపంబున

నీశక్తివంకఁ బఱచునో యప్పుడు శక్త్యాత్మకంబులైన గుణత్రయంబు వ్యవహరించుచున్నది. ఆవ్యవహారఫలంబుగా మనఃప్రధానమైన లింగ శరీరము గలుగుచున్నది. ఆశరీరభోగార్థమై శక్తిరూపమైన నీ మాయయే షోడశవికారంబులను గలిగించుచున్నది. ఈమనఃపరిభ్రమ ణమే సంసారం బనఁబడును. ఈసంసారంబును దరింపవలయునన్నచో దానికి మూలమైన నీశక్తిని జయింపవలయును. నీశక్తినిజయించుటకు శక్తిమంతుని నిన్నుఁగాక మఱెవ్వని నాశ్రయింపనగు? అన్యుల నాశ్ర యించినను ఫలంబు గలదా? నాకువలెనే నీకును మాయాసంబంధము గలదు గావున నాకన్న నీవు హెచ్చగుట యెట్లందువా? నీమాయా శక్తి నీకు వశీకృతయై నిన్నాశ్రయించి వర్తించును. నే నన్నో యాశక్తిగుణంబులకు దాసానుదాసుఁడనై సంచరింతును. ఇదే మన యిరువురకుఁ గల తారతమ్యము.

దేవా! లోకపాలకులుగూడ భోగార్థు లగుదురనియు, పిత్ర్యాం బైన రాజ్యంబు నధిష్ఠించి రాజభోగంబుల ననుభవింపుమనియు, సంసారం బును వదలుట తగదనియుఁ జెప్పెదువా? స్వామీ! లోకపాలకుల పుట్టు పూర్వంబులను వారి యైశ్వర్యాదులను ఆయురాదులను జూచితిని. అవి యెల్ల నాతండ్రి భ్రూభంగమాత్రంబున రూపుమాయుచుండెను. నాతండ్రి యంతశక్తిమంతుఁడయ్యు నీకొనగోటికిఁ జాలలేదుగదా! కావున రాజ్యంబు భోగంబు నాకుఁ జెప్పవలదు. అవియేగావు బ్రహ్మ భోగంబులుగూడ నాకు వలదు. ఏల యందువా? అవియుఁ గాలగ్రస్త ములే యగు. దేవా! ఈభోగంబులనెల్ల ననుభవించునది యేది? శరీరము గదా! శరీరము క్షణభంగురము. అట్టిదానికి భోగము లేల? మఱియు భోగము లనఁగా నెట్టివి? వీనులకు విందైె యెండమావులవలె మిథ్యా భూతంబులైన మనోరథంబులను భోగంబు లందురు. సుఖంబులన్నవో మఱపించుదుర్భుఁ జోలుఁ వానివలనఁ గాకూగ్ని చల్లారునా?

దేవా! నాకోర్కి యేమని యడుగుదువా? నీభృత్యాను భృత్యులకడ నుండఁగోరుదు. సత్త్వమూర్తులైన నాభృత్యు లెక్కడ? తమఃప్రధానమైన రాక్షసకులంబునందు రజోగుణంబునఁ బుట్టిన నీ వెక్కడ? అని యందువా? రమాబ్రహ్మభవులకుఁగూడ దుర్లభమైన నీ హస్తపద్మస్పర్శ యెప్పుడు నాశిరంబునకుఁ గలిగెనో యప్పుడే నామాలిన్యంబులెల్ల నుడుగుటంజేసి నేను నీకరుణకుఁ బాత్రుఁడ నగుటయు నయ్యెను.

ఉ. శ్రీమహిళామహేశసరసీరుహగర్భుల కైన నీమహో
ద్దామకరంబుచే నభయదానము సేయవు నేను బాలుఁడం
దామసవంశసంభవుఁడ దైత్యుఁడ నుగ్రరజోగుణుండ ని
స్సీమదయం గరాంబుజము శీర్షమునఁ జేర్చుట చోద్య మీశ్వరా.

కావున నేను నీభృత్యదాస్యరూపంబున నీకు దాస్యంబొనర్పఁదగుదు.

దేవా! నీవు సర్వాత్ముఁడవును లోకసుహృదుఁడవు నగుదువు. ఉత్తమమధ్యమాధమ పరిభేదంబు నీయందే గానరాదు. ఎల్లరు నీకు సములే గావున నన్నుఁగూడ నీదాసునిగా గ్రహింపుము. లోకమందెల్ల నీ వొక్కరుండవే వ్యాపించియుందువేని, నీకు వైషమ్యభావంబు గలుగ దేని లోకమందలి వైషమ్యాదులకుఁ గారణం బేమని కొందఱు శంకింతురు. నీప్రసాదం బెల్లరకు నొక్కరూపంబున లభింపకుండుట సత్యము. అట్టి తారతమ్యంబునకు లోకులే కారకులు గాని నీవు కానేరవు. ఎట్లందువా? నిన్ను సేవించినవారికి నీప్రసాదంబు నను గ్రహింతువు. సేవింపని వారికి నెద్దియుఁ గలుగదు. కోరిక లిచ్చుట కల్పవృక్షధర్మంబగు. ఫలప్రాప్తి యన్ననో యర్థులస్వాధీనము. కోరికయే ప్రయత్నింపరయే ఫలం బీయలే దని కల్పద్రుమంబును నిందింపనగునా?

దేవా! అర్థులకు నీప్రసాదం బేకరూపంబునఁ గలుగుటలేదని మఱికొందఱు సంశయింతురు. సేవానురూపంబుగాఁ బ్రసాదం బుండుట యెఱుంగక యట్లు తలంతురు. ఎల్లరు నేకఫలంబునే గోరుటలేదు; వారి సేవాదార్ఢ్యం బొక్కరూపంబుననే యుండుటలేదు. ఎవరు దేని నెంత

భక్తితోఁ గోరుదురో వారికి దాని నంతమాత్రం బిత్తువు. కోరుట వారి కార్యము; ఇచ్చుట నీకార్యము. ఇది కోరుమనిగాని యింత కోరుమనిగాని నీ వెన్నడును జెప్పవు; కోరుటకుఁగాఁ బిలువవు. ఇది గుర్తింపక వైష మ్యాదులు నీకు మూఁటఁగట్టుదురు. ఇంతకన్న నజ్ఞానంబు గలదా ?

సీ. నీగృహాంగణభూమి నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీమంగళ స్తవనికరవర్ణంబులు
పలుమాఱు నాలుకఁ బలుకఁడేని
నీయధీనములుగా నిఖిలకృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁడేని
నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై
చింతించి మక్కువఁ జిక్కఁడేని
తే. నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవ
సేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె
యోగి యైనఁ దపోవ్రతయోగి యైన
వేది యైన మహాతత్త్వవేది యైన.

స్వామీ! నీసేవను గోరక నీభృత్యులసేవను గోరుట యేల యందువా? జననమరణరూపమహావిషసర్పమయమైన సంసారకూపంబునఁ గామాభిహతుఁడనై కూలితిని. అప్పుడు నీభక్తుఁడు నారదమునీంద్రుఁడు నన్ననుగ్రహించి నీయాశ్రయంబును నాకుఁ జూపెను. వానిమూలంబున నీయనుగ్రహంబునకుఁ బాత్రుఁడ నైతి. నా యీభాగ్యంబు నీభక్తుని కరుణావిశేషంబు గావున వాని నిప్పుడు వదలుట కృతఘ్నత కాదా? మఱియు నీభృత్యు లనుభవశాలురు. వారిని సేవించుటవలన నీప్రాప్తికి సౌలభ్యముఁ గలిగింతురు. కాఁబట్టి నీభృత్యసేవను గోరుదురు.

స్వామీ! నాతండ్రి ఖడ్గధారియై 'ఓరీ! నాకంటె వేఱొక్కం డీశ్వరుఁడు గలఁడంటివి. ఇదే నిన్ను వధించుచున్నాను. నిన్ను రక్షిం

చుండా డెవఁడో యొందున్నాఁడో కానిమ్ము' అని నాఁయి నురికెను. అప్పుడు నీ వీరూపంబున నవతరించితివి. ఆకారణంబున నీ యీయవ తారము ప్రహ్లాదరక్షణార్థంబని భావింపవచ్చు. అది యెంతయుఁ బొర పాటు. ఈవరాటుని రక్షించుట యన నీ కెంతమాత్రం బగు ? అందుల కై యి ట్లవతరింపవలయునా ? నీభృత్యులఁగైన ఋషివచనంబును నిల్పుటకై యవతరించితివి. అది కాకతాళీయన్యాయంబున నారక్షణార్థముగూడ నయ్యెను.

స్వామీ ! భక్తరక్షణ దుష్టశిక్షణంబులు నీవ్రసమునకుఁ బక్షపాత ములు గావా యని తలంతురు. రక్షణశిక్షణంబులు వారివారి పుణ్య పాపఫలంబులు. ఆఫలంబులు వారివారికి స్వతస్సిద్ధంబులు. నీమాయా శక్తి కాలానుగుణంబుగా ఫలోదయంబు గావించును. ఫలంబు లప్పుడు భోగ్యంబులగు. నీశక్తికార్యంబుగూడ నిమిత్తమాత్రమేగాని వేఱు గాదు. శక్తికిని శక్తిమంతునకు నవినాభావంబు గావున నీశక్తి కార్యం బును నీయం దారోపించి నిన్ను స్తుతినిందలకుఁ బాలుసేయుదురు.

స్వామీ ! మాయాకార్యంబులకు నాద్యంతంబులు గలవు. నీ వన్ననో తత్కార్యపూర్వపరంబులందు రెంట యథాస్థితి నుందువు. నిదర్శనం బేమందువా ? మఱ్ఱిచెట్టునకు బీజము కారణంబగు. ఆబీజము పృథ్వీతన్మాత్ర జలతన్మాత్రల సమ్మేళనఫలంబు. ఆబీజంబువలన వృక్ష మయ్యెను. ఆచెట్టు కొన్నాళ్లుండి నశించుచున్నది. నశించి యేమగుచున్న దందువా ? ఏతన్మాత్రలనుండి తా నేర్పడెనో యాతన్మాత్రలలో నది లయించుచున్నది. ఆతన్మాత్ర లెందుండివచ్చె నందువా ? అవి నీశక్తి విశేషములు. నీశక్తికి నీ వాశ్రయుండవు. బీజోత్పత్తికిఁ బూర్వంబునను వృక్షనాశంబునకుఁ బరంబున నీశక్తి యట్లే యుండు. నీశక్తి యుండుట యనఁగా నీ వుండుటయే యగు.

వటవృక్షంబునకుఁ గారణంబును గార్యంబు నీవే యెట్లగుదువో యట్లే సమస్తసృష్టికిఁ గారణకార్యాత్ముండ వగుదువు. అట్లుండియు

కార్యంబునకుఁ బరుండవై వెలయుదువు. స్వామీ! సర్వము నీవే యైయుండఁగా నేను నాది నీవు నీది అనుభావంబు లెట్లు గలిగెననియు, నీయందు లేనివైషమ్యంబు నీవిస్తరమైనజగంబునకు నెందుండివచ్చెననియు బీజమందు లేనివైషమ్యము వృక్షంబునందుఁ గలుగునా యనియు శంకింతురు. జగంబునందు వైషమ్యమే గలుగదు. వైషమ్యబుద్ధి కేవల మోహజనకము. పసిరికలకంటికిఁ దెల్లనివస్తువు పచ్చగాఁ గాన్పించుట యెట్లో మోహబుద్ధికి నట్లే విపరీతముగాఁ గాన్పించును. మోహమునకుఁ గారణ మేమందురా? ప్రారబ్ధకర్మమే కారణము. కర్మమన్ననో యనాది యగు. అనాదియైన దానింగూర్చి తదనంతరము వచ్చిన నే నేమి చెప్ప నేర్తు?

స్వామీ! విశ్వోత్పత్తి యెట్లందువా? నీవు నిష్క్రియుఁడవు గావున నాత్మానందంబున నుందువు. అప్పుడు నీశక్తి నీయందు నిద్రించుచుండు. దీనిని నీయోగావస్థ యందురు. ఇచ్ఛవచ్చినప్పుడు కన్నువిచ్చి చూతువు. దీనిని నీజాగ్రదవస్థ యందురు. ఈ రెండవస్థలు నీకు స్వాభావికములు. అనఁగా నీయుండుటే తద్విధమగు. యోగావస్థనుండి జాగ్రదవస్థను నీవు గాంచినప్పుడు నీలో లీనమైయుండిన నీశక్తి వ్యవహారముఖ యగు. ఆవ్యవహారము పెక్కురూపంబుల జరుగును. ఆరూపంబులలోఁ గాలం బొక్కటగు. కాలశక్తి ప్రేరేపణంబునఁ బ్రకృతియు దద్ధర్మంబులైన సత్త్వాదిగుణంబులును వ్యవహరించును. అప్పుడు జగద్బీజము నీ నాభిపద్మంబున నంకురించుచున్నది. ఆపద్మమునుండి బ్రహ్మదేవుఁడు తొలుదొల్త జనించెను. అతఁ డట్లు జనించి నాల్గుదెసలు చూచి యెందేమియుఁ గానక తానున్నపద్మంబునకు జననస్థానం బేదో తెలియఁగోరి వెదకి వెదకి వేసారెను. మొలక మొలచినతర్వాత బీజంబు గాన వచ్చునా? అతఁ డట్లు విఫలమనోరథుఁడై యేమియుందోఁపక తదేకధ్యానగతుఁడయ్యెను. అప్పుడు పృథ్విలో గంధం బట్లు వానియాత్మలో స్వస్వరూపంబునఁ బొడగట్టితివి. ప్రపంచకల్పనావయవంబులెల్ల నతఁడు

నీయందుఁ జూచి యాసాధనంబులను గ్రహించి జగత్సృష్టి గావించెను. విశ్వం బట్లుత్పత్తియయ్యెనని పెద్దలు చెప్పుదురు.

దేవా! బ్రహ్మదేవుని చర్యవలన నేమి గ్రహించితి వందువా? నీయనుగ్రహప్రాప్తికి నీయుపాసనమే పరమసాధనంబని గ్రహించితిని. నీయనుగ్రహంబు నీభక్తులయెడ నెల్లకాలం బుండునా యనుశంక లేదు. మధుకైటభులను మర్దించి బ్రహ్మకు వేదంబులను నీవు తెచ్చియిచ్చుటయే నిదర్శనము. నిన్ను నమ్మినవారికి నెన్నఁడు సేగి గలుగదు.

స్వామీ! నీయవతారంబులకుఁ గాలనియతిగాని దేశనియతిగాని రూపనియతిగాని గలుగదా యందురు. ధర్మరక్షణము నీకార్యము గావున నెప్పుడెప్పు డెచ్చటెచ్చట ధర్మగ్లానియు నధర్మవృద్ధియుఁ గలుగునో యప్పు డచ్చోట నవతరింతువు. ఏరూపంబున ధర్మద్రోహుని హరింపనగునో యారూపంబును దాల్తువు. అందులకు నీ యీరూపమే నిదర్శనము. ఇంతకుమున్ను సురనరతిర్యగృషిమీనావతారంబుల నెత్తి ధర్మంబు నుద్ధరించితివిగదా! కృతత్రేతాద్వాపరంబులందు రూపధారివై యావిర్భవింతువనియు, ఆకారణంబున నిన్నుఁ ద్రియుగుఁ డందురనియుఁ గలియుగంబునఁ బ్రచ్ఛన్నుఁడవై వర్తింతువనియుఁ బెద్దలు వచింతురు.

తండ్రీ! ధర్మరక్షణార్థమై యిన్నియవతారంబు లెత్తుచు నీయనుగ్రహామృతంబు నిట్లు వెదజల్లుచున్నను లోకంబు దానిని గ్రహింపక వివిధదుఃఖంబులపాలగుటఁ జూడఁగా నాశ్చర్యవిషాదంబు లగుచున్నవి. దీనికెల్ల నజ్ఞానమే కారణము. అది యెట్లందువా? సుఖలాలసత ప్రాణుల కెల్ల నైజము. ఆసుఖం బెందున్నదో యెఱుంగక దారాపుత్రాదులంబట్టి ప్రాకులాడుదురు. ఎంతకాలంబు జనులమనస్సు బహిర్ముఖంబై గృహాదులం దవిలి తదానందవశమైయుండునో యంతకాలము వారికి నిత్యానందంబు లవమాత్రముగూడ లభింపదు. నిక్కమైన యానందంబుఁ గోరువారు నిన్నే యాశ్రయింపవలయును. నిన్నాశ్రయించుటకు బుద్ధి మొట్టమొదట నీవంకకు మఱలవలయును. బుద్ధి యట్లగుటకు నీకథాకర్ణనం

చెంతయుం దోడ్పడు. నీచరిత్రలు వినుటవలన నీయెడ రాగం బుదయించును. అప్పుడు బుద్ధి తద్రుచిం దగిలి నిన్నుం బాయదు. అట్టిబుద్ధి గలవారే నీతత్త్వవిచారంబునకు నోపుదురు. అన్యు లేనాఁడుం దగరు.

తండ్రీ ! లోకు లిట్లగుటకుం గారణ మేమందువా ? గృహపతిని బెక్కండ్రు భార్యలువలె నింద్రియారాములను జిహ్వాత్వక్ఛ్రోత్రఘ్రాణశిశ్నేంద్రియంబులును గర్మేంద్రియంబులును బలువంకలకు నీడ్చుచుండు. వారు వానికిం జిక్కి యవి లాగినట్లు వర్తించుచుం, దత్తదింద్రియంబులకుం బ్రీతిం గూర్చుటకుంగా వివిధవస్తువుల నార్జింపయత్నించుచు వారియత్నంబులకు ననుకూలించువానిని మిత్రభావంబుతోను బ్రతికూలించువారిని శత్రుభావంబుతోను జూచుచు విడుమరలేనియాప్రయాసఫలంబుగా వ్యాధులకుం జిక్కుచు నెట్టకేలకుం దీఱనికోర్కెలతోన మరణింతురు. వారికర్మంబులెల్ల సకామంబులు గావున వానికి ఫలంబు తప్పదు. ఫలానుభవంబునకుం దత్తదుచితశరీరధారణము తప్పదు. శరీరధారి భోగ్యఫలంబు ననుభవించుచుం దద్వాసనాప్రేరితుఁడై తద్విధకర్మంబులను మఱలం జేయును. ఆకర్మంబులు మఱల ఫలంబుల నిచ్చును. ఆఫలభోగార్థము మఱల శరీరధారణము తప్పదు. ఇట్టి జననమరణరూపసంసారవైతరణీప్రవాహంబులోఁ బడి యీదులాడుజనులపై యెంతయుం బరితాపమయ్యెడు. తండ్రీ ! నీవు దయాస్వరూపుఁడవు నార్తబాంధవుండవు గావున నిట్టి దీనులుగదా నీయనుగ్రహంబునకుం బాత్రులు.

తండ్రీ ! ఇట్టి దీనుల నుద్ధరించుటకు మార్గ మేమందువా ? సదుపదేశమే మార్గము. అందులకు మునిముఖ్యులు గల రందువా ? వారు గూడం దమకామంబులను బూర్ణముగా జయింపనేరక నిర్జనారణ్యంబులం బట్టి ప్రాఁకులాడుచుందురు. ఇంట గెలువలేనివారు బచ్చుం గెలుతురా ?

తండ్రీ ! 'ఈదీనులసంగతి నీకేల ? నీకుమాత్రము ముక్తి నిత్తు' నందువా ? వారినిగాదని నాకేమియిచ్చినను గ్రహింపనొల్ల. ముందు వారి ననుగ్రహింపుము. ఎల్లరకు నీవేగదా శరణము. వారు కడతేరుమార్గం

జెప్పె యందువా? వారిచిత్తంబులందలి గృహస్థత్వరూపమైన జిడ్డును మొట్టమొదట గడుగవలయును. అట్టిజిడ్డు పోవుటకు శ్రుతము, అధ్యయనము, స్వధర్మాచరణము, ఏకాంతదేశనివాసము, మౌనము, జపతపవ్రతంబులు సమాధియోగంబునాఁ బరగునట్టి యనవద్యహేతువులు గల వందువా? అవియెల్ల జితేంద్రియులకుఁ దగునేగాని యజితేంద్రియులకుఁ గావు. కాదని యజితేంద్రియులు వాని నవలంబించినను జీవనోపాయార్థము వేషధారులై యట్లు సేయుదురు.

తండ్రీ! కొయ్యల నొండొంటి రాచినఁగాని యగ్గి జనింపదు. అట్లే కార్యకారణంబులను మథించినఁగాని నీవు ప్రత్యక్షుఁడవు గావు. అట్లు మథించుటకు నధ్యయనాదివాగ్వ్యవహారంబు లెల్ల నవ్వలఁ గట్టిపెట్టి సమాధియోగంబు నాశ్రయింపవలయును. అందులకు భక్తి వంగని యూఁతగఱ్ఱ యగు. ఆభక్తియోగంబునకు ప్రణామ, ప్రణుతి, పూజా, పరిచర్యా, కథా, శ్రవణంబు లనునట్టియంగంబు లాఱు గలవు. వానిమూలకంబుగా నిన్ను సేవించినవాఁడు భక్తి గలుగు. భక్తితోడఁ దక్కినవి స్వతస్సిద్ధంబులే గదా.' అని సాష్టాంగ మొనర్చెను.

### భగవానుఁడు ప్రహ్లాదుని బరీక్షించుట

ధర్మజా! భగవానుఁడు ప్రహ్లాదుని మాటలు విని 'వత్సా! నీభావంబు నెఱింగితి; ఎంతయుఁ బ్రీతుఁడ నైతి. నాదర్శనమే యందులకు నిదర్శనము. నన్ను మెప్పింపనివానికి నెన్నఁడుగాని నాదర్శనము గలుగదు. నన్ను సందర్శించినవాఁడు మఱలఁ దాపంబు నొందఁడు. శుభంబుఁ గోరువాఁడు సర్వభావంబుల నన్నుఁ మెప్పించును. నీభక్తికి మెచ్చితిఁ గావున నీయిచ్చవచ్చినవరంబులఁ గోరుము. నీకోరినవాని నిత్తు. నన్ను సందర్శించియు నావలన నిష్టంబులను బడయక రిక్తహస్తంబులఁ బోవుట మర్యాదగాదు.' అని వివిధంబులఁ బ్రహ్లాదునిఁ బ్రలోభించెను.

ప్రహ్లాదుఁడు భగవద్వచనంబులను విని 'తండ్రీ! మర్త్యుఁడు స్వభావముచేతనే కామాసక్తుఁడై యుండు. వానికోరికలెల్ల మనోవిభ్రాంతికరములై యేకాంతభక్తికి నంతరాయములుగా నుండు. ముల్లోకంబుల నిత్తునన్నను నాకు వలదు. మోక్షంబునుగోరి నిన్నాశ్రయించితిని. స్వామీ! హృదయబంధనంబులును సంసారబీజంబులు నైనకోరికలకు నీదాసుని నీవిట్లు పురికొల్పుట వానిమనోబలపరీక్షార్థమే గాని యొండు గాదు. అట్లు కాదందువా? అట్లు కానినాఁడు కరుణారూపుండవు నీవు నిన్నాశ్రయించినవాని ననర్థంబులకై ప్రేరేపింతువా? మఱియు నీకు భక్తుఁడ నని పల్కుచు నవ్వాక్కునసే గోరిక లిమ్మని నిన్నుఁ గోరువాఁడు బేరగాఁ డగుఁగాని నిక్కమైనభక్తుఁడు గానేరఁడు. అంతియగాదు. స్వప్రయోజనార్థము ప్రభువును గొలుచువాఁ డెన్నఁడును విశ్వాసపాత్రుఁడుగాఁడు. అట్లే తనస్వామిత్వరక్షణార్థము భృత్యులకోర్కెలఁ దీర్చువాఁడును స్వామిగాఁడు. స్వామిభృత్యు లిరువురు గుణగ్రాహులుగా నుండవలయు. నేను నిష్కామభక్తుఁడను; నీవుఁ ఫలాభిసంధిరహితుండవైన సర్వేశ్వరుఁడవు. మనయిరువురకుఁ గామఫలాభిసంధులు వలదు.

తండ్రీ! లోకేశ్వరుఁడవైన నీవు స్వయముగా వచ్చి వరంబును గోరుమన్నప్పుడు కోరకుండుట తిరస్కార మగు నందువా? అట్లేని నిన్నొక్కటి యర్థింతు. ఏది యందువా? ఎట్టికోరికయు నామదిలో నంకురింపకుండునట్లుగా వరంబు ననుగ్రహింపుము. అట్లు కోరుట యేల యందువా? కామంబు తలయెత్తెనేని వెనువెంటనే మనఃప్రాణేంద్రియదేహధర్మంబులు పైకొని ధృతిమతిశ్రీహ్రీలను దేజస్సత్త్వస్మృతులను బాఱద్రోలును. తత్ఫలంబుగా మర్త్యుఁడు భ్రష్టుఁ డగుచున్నాఁడు. కోరికలను వదలినచో నైశ్వర్యం బెట్లు గలుగునందువా? జితకాముఁడు భవత్సమానైశ్వర్యసంపన్నుఁ డగు. వానికిఁ గొదువ యేమి యుండు? నాప్రార్థనంబును మన్నింపు' మని నమస్కరించెను.

### భగవానుఁడు ప్రహ్లాదు నాజ్ఞాపించుట

ధర్మజా! భగవానుఁడు ప్రహ్లాదుని మనోనిశ్చయంబునకు మెచ్చి 'వత్సా! ఏకాంతభక్తులకు నైహికభోగంబులే గాక యాముష్మికసుఖంబులుగూడ రుచింపవు. అయినను నీకర్తవ్యం బొండు గలదు వినుము. ప్రకృతమన్వంతరాంతముదనుక నీవు దైత్యేశ్వరభోగంబు లనుభవించుచు నుండుము. ఈభోగానుభవంబు నీకు బంధకారణం బగునని వెఱవవలదు. కాలంబు నెట్లు గడపవలయునందువా? నాకథలను వినుచు, ఏకరూపంబున సర్వాంతర్యామినైయున్న నాయందు నీచిత్తంబును నిలుపుచు, వివిధయజ్ఞంబుల నన్ను నారాధించుచుఁ గాలము గడపుము.

వత్సా! నీగావించు యజ్ఞాదికర్మంబుల ఫలముసంగతి యేమందువా? సర్వకర్మంబుల ఫలంబులను నాకు సమర్పింతువు గావున నవి నీకు బంధకములు గానేరవు. పుణ్యంబులు చేయుటవలనఁ బాపంబు నశించును. చేసిన పుణ్యము సుఖానుభవరూపంబున భుక్తమై నశించును. అంతట శరీరము తనంతట తానే నశించును. వత్సా! లోకసంగ్రహార్థంబు నిన్ని ట్లాజ్ఞాపించుచున్నాను. మన్వంతరాంతంబున నన్నుఁ జేరుదువు. నీకీర్తి ముల్లోకంబుల వ్యాపించును. నీవు చేసిన యీస్తోత్రమును వినువారును గీర్తించువారును నన్ను స్మరింపకమానరు. ఆస్మరణశక్తి ఫలంబుగా వారు యథాకాలము బంధముక్తిఁ గాంతురు' అని చెప్పెను.

### ప్రహ్లాదుఁడు తండ్రికిగా భగవంతునిఁ బ్రార్థించుట

ధర్మనందనా! ప్రహ్లాదుఁడు భగవదాజ్ఞను దలఁదాల్చి 'స్వామీ! నాతండ్రి తనతమ్మునిచావునకు నీవు కారణంబని భ్రమించి నీమీఁదను నీభక్తులమీఁదను విరోధముఁ బూని లోకగురుని నిన్ను నిందించి తీఱని పాపంబు నొడిగట్టెను. నీప్రశాంతదృష్టిని వానిపయి సారించి వాని నుద్ధరింపుము' అని వేఁడెను. భగవానుఁడు వానిప్రణయంబు విని 'సాధువర్యా! నీజననంబుతోడ నీతండ్రియు వానిపూర్వులైన కశ్యపమరీచిబ్రహ్మలును బునీతులైరి. అంతియగాదు. పూర్వకల్పమందుండిన విూ

పూర్వు లిఱువదియొక్కతరమువారుగూడఁ బావనులైరి. కులపావనుని జన్మం బేతన్మాత్రమైనది గాదు.

ప్రహ్లాదా! నాభక్తులభక్తులుగూడ నాభక్తులే యగుదురు. ఎట్లందువా? భక్తి యనునది ప్రేమస్వరూపము. ప్రేమకుఁ బ్రేమింపఁబడు పదార్థం బుండవలయును. ఆపదార్థం బవ్యయము సర్వాత్మకంబుగా నుండునప్పుడే యది సర్వవిధప్రేమంబులకుఁ దఱుగని నాకర్షణస్థానంబగు. ఆపదార్థంబు నేనుదక్క వేఱొండు గలుగదు. నాభక్తుఁడుగాని నాభక్త భక్తుఁడుగాని యేవిధంబునఁ బ్రేమించినను బ్రేమింపఁబడుపదార్థం బొక్కటే యగుఁ గావున నెల్లరుఁ దుట్టతుదకు నాకే భక్తిచేయుటగు. కాఁబట్టి నాభక్తభక్తులుగూడ నాభక్తులే యగుదురు. ప్రహ్లాదా! నీభక్తితత్త్వం బవ్యగ్రంబును బరిపూర్ణంబు నగుఁగావున నీవు భక్తకోటికి దర్శకుండ వగుదువు. కావున భక్తితత్త్వంబును దెలియఁగోరువారు నిన్నే యాదర్శమూర్తినిగా గ్రహింతురు.

నీతండ్రిసంగతి యేమందువా? ఎప్పుడు నాగాత్రస్పర్శ వానికిఁ దగిలెనో యప్పుడే యతఁడు స్పర్శవేదిసోకినకుఁ దామ్రం బట్లు శుద్ధుఁ డయ్యెను. వానికిఁ బ్రేతకార్యంబులు దీర్చి, యీసింహాసనం బధిష్ఠించి వేదజ్ఞులైన విప్రులయుపదేశప్రకారము స్వధర్మంబులనెల్ల మత్పరమతుఁడవై సాగింపు' మని చెప్పెను. ప్రహ్లాదుఁ డంతటఁ దండ్రికి నుత్తరక్రియలు జరిపెను.

## బ్రహ్మవిజ్ఞాపనము

ధర్మజా! శ్రీనరసింహమూర్తి యట్లు ప్రశాంతుఁడైనంతట బ్రహ్మదేవుఁడు తదితరదేవతలతోడ నమ్మహాత్ముని డాయంజని 'దేవాదిదేవా! నిఖిలాధ్యక్షా! భూతభావనా! సర్వపూజ్యకా! లోకసంతాపకరుండైన యీరాక్షసుని వధించి మాతాపంబులు దీర్చితివి. ఇతఁడు ఘోరతపంబుఁ జేసి ముల్లోకంబు లుడికించెను. ఆవేడిమికిఁ దాళలేక యతఁడు కోరిన వరంబు లిచ్చితిని. [illegible] వరోద్ధతుఁడై సమస్తధర్మంబులను బాఱు

మాలు చేసెను. ధర్మహానికూడ నధర్మకారణంబునఁ, దాఁగన్న కొడుకును గూడ వధింప నుద్యుక్తుఁడయ్యెను. ప్రహ్లాదుఁడు పరమభాగవతుఁడు గావున నీకడనుఁ బాత్రుఁడై ప్రకాశెను. దేవా! హిరణ్యకశిపుఁ డంతటిపాపాత్ముఁడయ్యు నీయుత్సంగంబునందు లయం బొందుటం జేసి యగ్నిపుటంబున బంగారుకైవడి నిర్మలత్వంబొంది ధన్యుఁడయ్యెను' అని విన్నవించి యథోచితపూజలు గావించెను.

### భగవానుఁడు బ్రహ్మను మందలించుట

ధర్మనందనా! భగవానుఁడు బ్రహ్మను విని 'పద్మసంభవా! కన్నులు మూసికొని వరంబు లీయరాదు. వరదానంబునకుఁ బాత్రాపాత్రవిచారము ముఖ్యము. అసురస్వభావులకు వరంబు లిచ్చుట నల్లత్రాఁచును బాలతోఁ బెంచు టగుఁగదా' యని మెలనవ్వుతో మందలించి యంతర్ధానుఁడయ్యెను.

### ప్రహ్లాదపట్టాభిషేకము

ప్రహ్లాదుఁ డంతట బ్రహ్మాదులను బూజించెను. బ్రహ్మదేవుఁడు భార్గవాదిమునులనుగూడి ప్రహ్లాదునకుఁ బట్టాభిషేకముఁ జేయించి యాశీర్వదించి తోడివారింగూడి యథాస్థానంబునకుఁ బోయెను. ప్రహ్లాదుఁడు సింహాసనం బధిష్ఠించి వసుమతి రాజన్వతిగాఁ బ్రజల నేలెను.

### భ్రమరకీటన్యాయము

పాండునందనా! అట్లు విష్ణుపార్షదులు తొలిజన్మంబున దితికిఁ బుత్త్రులై జనించి భగవంతునియొక్క వరాహనృసింహావతారంబులచేతఁ జచ్చిరి. రెండవజన్మంబున రావణకుంభకర్ణులుగాఁ బుట్టి రామబాణంబులకు గురియై మడసిరి; మూఁడవజన్మంబున శిశుపాలదంతవక్త్రులుగా జనించి భగవంతునిచేత నిట్లు పొలిసిరి.

ఈ మూఁడుజన్మంబులందు వీరిచిత్తంబులు నిరంతరము భగవత్పరములుగానే యుండెను. ఆతత్పరత్వము ప్రేమపూర్వకముగాక వైరాత్మకంబుగా నుండెను. అయినను భాగవతులు భక్తియోగంబున నెట్లో

యట్లి చైద్యాదులు వైరంబునఁగూడఁ దాదాత్మ్యంబు నొందిరి. తాదాత్మ్యంబునకు వస్తునిరంతరచింతనము ప్రధానము. ఆచింతనము ప్రేమపూర్వకం బగునేని సౌమ్యముగాఁ దాదాత్మ్యంబు లభించును. వైరపూర్వకమేని భ్రమరకీటన్యాయంబున భయక్లేశాదిపూర్వకంబుగా నెట్టకేలకుఁ దాదాత్మ్యంబు గలుగును.

### భగవత్ప్రీతిప్రభావము

ధర్మనందనా! నీప్రశ్నంబునకు జవాబు చెప్పితిని. ఒక్కసంగతి వినుము. లోకపావనులైన మహాత్ములకుఁ నెట్టికోరికలుఁ గలుగవు. అట్టివారు మీయింటికి నిత్యము వచ్చుచుఁ బోవుచునున్నారు. కారణమేమి? పరమాత్ముఁడు మానుషరూపంబునఁ బ్రచ్ఛన్నుఁడై మీయింటనుండుటంజేసి వానిసందర్శనార్థము వచ్చుచుఁబోవుచు నుందురు. భగవత్సాన్నిధ్యశ్రీవలనను మహాత్ములసందర్శనాదికంబునను మీరు నరలోకంబున మహాభాగులైతిరి. వాసుదేవుఁడు మీకు మేనమామకొడు కగుటయగాక ప్రియుఁడును జెలియు గురువును నాజ్ఞాకరుండు నగుటకు మీనోచిన పుణ్యం బింత యని చెప్పఁగాదు. ఇదంతయు వాని భక్తవాత్సల్యవిశేషమేగాని వేఱుగాదు. భగవానుని వాత్సల్యత్వంబుఁ బడసినవారికిఁ గొదువయుండదు. తొల్లి భవుఁడంతటివాఁడు క్లేశవశుఁడై భగవత్ప్రీతింజేసి ముప్పుఁబాసి కీర్తిఁ గాంచెను. ఎంతటివారికైనను భగవత్ప్రీతి ముఖ్యమగు' ననెను.

మునులారా! ధర్మసుతుడు నారదుని విని 'మునీంద్రా! భవుని కీర్తికి నెట్టియాపద గలిగెను? భగవానుఁడు వానికీర్తి నెట్లు కాపాడెను? ఆసంగతి వినఁ గుతూహలమగుచున్న' దని పలికెను. నారదుఁడు వానికి నిట్లనియెను.

### త్రిపురాసురచరిత్ర

ధర్మజా! పూర్వము దేవాసురులకు యుద్ధమయ్యెను. దేవతలు [illegible]లంబునఁ జేర్చిరి. అసురులు వారికి నోడి మాయలకు గురువైన

మయుని శరణిల్లిరి. మయుఁడును బంగారుతో వెండితో నినుముతో వేలువేలుగా మూఁడుపురంబులను మహావిచిత్రంబులు గగనచరంబులు నైనవానిని నిర్మించి యసురుల కిచ్చెను. వారప్పు డప్పురంబుల నధిష్ఠించి ముల్లోకంబులు విహరించుచు దేవతల నుక్కడఁగించిరి. అసురులను ఢీకొనుటకుగా దేవతలు వివిధోపాయంబులు పన్నిరి. ఆపురంబులు కంటికిఁ గానరాక సంచరించుచుండుటం జేసి నిర్జరుల పన్నుగంబులు సాగవయ్యెను.

దేవతలు గత్యంతరము గానక శంకరుని చరణంబులఁ బడిరి. గిరిశుఁ డల్పసంతోషి గావున నమరులకు నభయంబు పలికి యుద్ధోన్ముఖుఁడై వచ్చి యాపురంబులపయి నగ్నితప్తబాణంబులఁ గురిపించెను. ఆశరంబులు సూర్యకిరణంబులట్లు తత్పురత్రయంబును గప్పెను. ఆశరంబుల వేడిమికిఁ దత్పురస్థులు మ్రగ్గి చచ్చిపడిరి.

మయుఁడు మహాయోగి గావున సిద్ధామృతరసకూపంబును నిర్మించి యామృతకళేబరంబుల నందు ముంచెను. ఆరసప్రభావంబున వారెల్లరుఁ బునర్జీవితులై వజ్రసారులై వైద్యుతాగ్నులట్లు తేజరిల్లిరి. ముక్కంటి యదిచూచి 'కటా! నాసంకల్పము భగ్నమయ్యెఁగదా' యని యెంతయు విన్నఁబోవసాగెను. ఆసంగతి విష్ణుదేవుఁ డెఱింగి యుపాయం బూహించి తాను గోరూపంబును ధరించి బ్రహ్మను దూడగాఁజేసి దానిని వెంటఁగొని మట్టమధ్యాహ్నసమయంబున మయనిర్మితంబైన బావిని జేరఁజని యందలిరసంబుల ద్రావెను. గోవత్సంబు లట్లు కూపజలంబులఁ గ్రోలుట యసురులు గన్నారఁ జూచుచుఁ బశువులనెడి భ్రాంతితో మిన్నకుండిరి. కాలమోహంబును గడపరాదుగదా ధర్మజా! ఆసంగతి కూపపాలకులు మయునకుఁ దెలిపిరి. అతఁడు వారిని విని 'దైవగతిం దప్పింప నెవ్వరి తరముగాదు. అనివార్యంబునకు శోకించియు ఫలంబులే' దని వారిని నూఱడించెను.

భగవానుఁ డంతటఁ దపోవిద్యాక్రియాదిస్వశక్తులను స్మరించెను. తలంపుతోడ రథధ్వజసారథి ధనుర్బాణకవచాదిసాధన సంపూర్ణమైన

దివ్యరథం బొందునచ్చెను. దానిని శ్రీకంఠునకు నిచ్చెను. త్రిశూలి యారథం బధిష్ఠించి యభిజిన్ముహూర్తంబునఁ ద్రిపురంబుల దాసి బాణం బొందువైచెను. ఆశరహతికిఁ బురత్రయం బొక్కమాఱుదగ్ధమై రూపుమాసెను. ఆసంతోషంబునకు దేవదుందుభులు మ్రోసెను; పుష్ప వర్షము గురిసెను; జయజయధ్వనులు చెలరేఁగెను. ధర్మజా! మహాదేవుఁ డట్లు స్వకీర్తిని రక్షించికొని స్వధామంబునకుఁ జనియెను.

ధర్మనందనా! హరిలీలావిడంబంబులకు లెక్కగలుగదు. అవి యూహాతీతములు. ఆమహనీయుఁ డెప్పు డెవ్వనికి నెవ్విధంబున నేమి నేయునో బ్రహ్మాదులుగూడ నెఱుంగరు. ఈలీలలెల్ల లోకమంగళార్థమే గాని వేఱుగావు. ఆలీలాత్మకచరిత్రలను సావధానమతులై విననోచినను బావనత్వంబు చేకూఱును. భగవత్ప్రభావం బెట్టిదో యూహింపు' మనెను.

### భక్తిజ్ఞానంబుల వృద్ధికిఁదగిన ధర్మంబు లెవ్వి?

మునులారా! ధరపుత్రుఁ డాకథ విని 'మునీంద్రా! భగవంతుని ప్రసాదంబుఁ బడయుట పరమప్రాప్య మంటివి. అందులకు భక్తియు జ్ఞానంబును వలయు నందురు. భక్తిజ్ఞానంబులు ప్రయత్నలభ్యముగాని తమంతట యవి మింటనుండి యొడిలో రాలవు. ఆప్రయత్నంబులను ధర్మంబు లందురు. ఏయేధర్మంబుల ననుష్ఠించి భక్తిజ్ఞానంబులఁ బడయ నగునో వివరింప వేడుదు. ఋషివర్యా! సాక్షాద్బ్రహ్మమానసపుత్రుండ వును మహాతపోయోగసమాధినిష్ణాతవును నిరంతరనారాయణపరుండ వును గావున సమస్తధర్మంబులు నీకుఁ గరతలామలకంబులు. కావున నిన్నిట్లు కోరుచున్నా' నని విన్నవించెను. నారదుఁడు వాని కిట్లనియెను.

### ధర్మములపుట్టు - ఉద్దేశ్యము

'ధర్మనందనా! భగవంతుఁడు వానియవ్యక్తావస్థనుండి వ్యక్తావస్థఁ గాంచెను. దానినే సృష్టియందురు. ఆసృష్టి యథాక్రమము నడచుటకై కొన్నినియమంబులఁ గావించెను. ఆనియమంబులను ధర్మంబు లందురు.

అవి ప్రవృత్తిధర్మంబులనియు నివృత్తిధర్మంబులనియు రెండువిధములు. వానిని భగవానుఁడు వేదముఖంబునఁ బ్రతిపాదించెను. ఆవేదంబులనుండి మన్వాదులు తాము గ్రహించినంత స్మృతులరూపంబున వెల్లడించిరి. ఆస్మృతులు ధర్మనిర్ణయప్రమాణంబులగు. ధర్మమనఁగా నేమి? ఏది యుద్ధరించునో యది ధర్మం బనఁబడు.

ఆధర్మంబులను లోకప్రచారంబుగావించుటకై భగవానుఁడు నారాయణావతారంబెత్తి బదరికాశ్రమంబునందుఁ దపంబుచేయుచుండఁగా వానిని సందర్శించి తన్ముఖంబున నెల్లధర్మంబులను వింటిని. నావిన్నది వివరింతు వినుము.

## ధర్మవిభాగము

ధర్మనందనా! ధర్మములు సాధారణంబులు, స్వధర్మంబులు, విశేషధర్మంబులని త్రివిధము. సామాన్యధర్మంబుల నెల్లరు ననుష్ఠింపవలయును. జాతికులమతాదిభేదంబులుగాని, ఆశ్రమభేదంబులుగాని సాధారణధర్మాచరణంబున లేవు. స్వధర్మంబుల ప్రవృత్తిధర్మంబులను విశేషధర్మంబులను మోక్షధర్మంబు లందురు.

సామాన్యధర్మములలో సత్యము ప్రధానము. దానితోడ దయయు నహింసయు నుండును. దయాసత్యంబులు సుస్థిరము గావలయు నన్నచో నంతఃకరణము శుద్ధినొందవలయును. తదర్థము తక్కినధర్మంబు లగు, అవి 1. శౌచము 2. బ్రహ్మచర్యము 3. యమము 4. తపము 5. శమము 6. వివేకము 7. తితిక్ష 8. స్వాధ్యాయము 9. దానము 10. ఋజువర్తనము 11. సంతుష్టి 12. సాధుసేవనము 13. అసంగత్వము 14. నిరహంకారము 15. మౌనము 16. ఆత్మవిమర్శనము 17. దానము 18. సమత్వబుద్ధి 19. భక్తి అనునట్టివి సామాన్యధర్మంబులగు. భక్తి యనుదానికి శ్రవణకీర్తనస్మరణసేవనార్చన వినీతసఖ్యతదాస్యాత్మసమర్పణంబు లంగంబు లగును. ఈధర్మంబు లనుష్ఠించుటవలనఁ జిత్తశుద్ధి గలు

గును. శుద్ధచిత్తమందు రాగద్వేషంబులు జనింపవు. తత్ఫలంబుగా లోకము పరస్పరవైరాదివైషమ్యములులేక చల్లగానుండు.

### స్వధర్మములు

సమాజవ్యవహారయోగ్యధర్మంబులు స్వధర్మంబులగు. అనఁగా సమాజము వివిధగుణవ్యక్తులతోఁ గూడియుండుటంజేసి యేయేగుణ వ్యవహారంబునకు నెయ్యది తగునో యది వానికి స్వధర్మమగు. స్వధర్మంబులు మొత్తముమీఁద వృత్తిధర్మంబులగు.

### వర్ణవిభాగము

ప్రకృతి అనఁగా ఈశ్వరశక్తి అది సత్త్వరజస్తమోగుణంబుల రూపంబున వ్యవహరించును. ఆమూఁడుగుణంబులు ప్రతిదేహమందుండు. అవిలేనిదేహమే గలుగదు. అయినను వానిస్థితి యేకరూపముగాక హెచ్చుతగ్గులుగా నుండును. ఆహెచ్చుతగ్గులనుబట్టి వర్ణవిభాగంబు కల్పింపఁబడెను. ఆవర్ణంబులు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రనామంబులఁ బరఁగు. సత్త్వము ప్రధానమైనది బ్రాహ్మణవర్ణమగు; రజస్సు ప్రధానమైనది క్షత్రియవర్ణంబగు. రజస్తమోగుణులు వైశ్యులు. తమఃప్రధానులు శూద్రులు. ప్రాధాన్యగుణస్థితియే స్వభావ మనఁబడు.

ఏవర్ణంబునకు ఏవృత్తి యనుకూలమో దానినిఁజేయుట సౌకర్యంబగు. అట్లుచేయనినాడు దుఃఖము తప్పదు. బ్రాహ్మణస్వభావమందు శమదమాదులు ప్రాధాన్యములు గావున దానికి యజనాధ్యనాదికర్మంబులు సహజవృత్తులగు; క్షత్రియస్వభావమందు శౌర్యాదులు ప్రాధాన్యంబులు గావున దానికిఁ బరిపాలనాదికకర్మంబులు సహజంబులగు; వైశ్యస్వభావమందు రాగము ప్రాధాన్యంబు గావునఁ గృషి వ్యాపారాదు లందుకుఁ దగును. శూద్రస్వభావమందు యుక్తాయుక్త వివేకజ్ఞానము తక్కువ గావునఁ దత్స్వభావము పరతంత్రమై వర్తింపఁ దగును. ఆ పారతంత్ర్యమునే శుశ్రూషయనియు సేవకావృత్తియనియుఁ జెప్పెదరు.

ధర్మజా! వృత్తిభేదంబునుబట్టి యాత్మభేదముగలుగదు. ఎల్ల యుపాధులలో నుండునది యొక్కయాత్మయే యని గ్రహింపవలయును. అట్లు గ్రహించి వర్తించుట పురుషార్థమగు. అట్లుగాక వృత్తిభేదంబును బట్టి హెచ్చుతగ్గులు పాటింతురేని వైషమ్యంబులుగలిగి సమాజకళ్యాణంబునకు భంగము నాత్మకళ్యాణంబునకుఁ జేటును సంభవించును.

### విశేషధర్మములు

విశేషధర్మంబులు మోక్షసాధనంబులగు. ఆసాధనంబులను యోగంబులందురు. అవి జ్ఞానము కర్మము అని రెండువిధములు భక్తి యనునది ప్రత్యేకయోగంబుగాఁ గొందఱు గ్రహింతురుగాని, భక్తిలేక యేదియు ఫలకారిగాదు గావున నెల్లయోగంబులకు భక్తి యనునది ప్రాణంబగు. కావున దానికిఁ బ్రత్యేకావస్థాతికల్పము గలుగదు. ఈ రెండుయోగంబులను నాల్గువర్ణములవారు వారివారియోగ్యతల ప్రకారము పూర్వావస్థయందు స్వధర్మంబులుగా నాచరింపవలయును. పరావస్థయందు వారివారిరుచులప్రకారము వర్తింపవచ్చును. ఏయవస్థయందుగాని స్వధర్మం బాచరించునప్పుడు బుద్ధి భగవత్పరమై యుండవలయును.

### ధర్మానుష్ఠానఫలము

ధర్మజా! వృత్తినియమంబులెల్ల స్వభావసంస్కారార్థము గల్పింపఁబడెను. లోహంబులు పుటపాకసంస్కారంబున శుద్ధిని బడసి యుత్తమస్థితికివచ్చునట్లే స్వభావముగూడ నియమపూర్వకసంస్కృతిని బడసి యుత్తమస్థితికివచ్చును. సంస్కారములేనినాఁడు స్వభావము మాఱదు.

### ఆపత్కాలవృత్తులు

జీవాధారమైన స్వవృత్తికి నాటంకముగలుగుసమయం బాపత్కాల మనఁబడును. అట్టిసమయంబులందు బ్రాహ్మణుఁడు ధనధాన్యంబుల యాచించియొండె శిలోంఛవృత్తినొండె జీవికను గడపవచ్చును. పంటభూములందు భూస్వామివదలి పోయినవెన్నుల నేఱికొనుట శిలా

వృత్తియగు. అంగళ్లముందు పడియుండుగింజల నేఱికొనుట ఉంఛ వృత్తియగు. ధనయాచనంబునకంటె ధాన్యయాచనము, దానికంటె శిలావృత్తి, దానికంటె ఉంఛవృత్తి యుత్తమంబులు.

ఆపత్కాలంబులందుఁ దక్క నితరకాలంబులం దెప్పుడుగాని తమవర్ణవృత్తినివదలి పరవర్ణవృత్తిని స్వీకరింపరాదు. అట్లుసేయుట స్వభావధర్మవిరుద్ధము గావున సంస్కారము గానేరదు. తత్ఫలంబుగా సాంకర్యములు సంభవించును.

శిలోంఛవృత్తి ప్రాప్తంబు ఋతంబనియు, అయాచిత ప్రాప్తం బమృతంబనియు నిత్యయాచనాప్రాప్తంబు మృతంబనియు, కృష్యాదిక ప్రాప్తంబు ప్రమృతంబనియు, వాణిజ్యప్రాప్తంబు సత్యానృతంబనియు నీచసేవశ్వవృత్తి యనియుఁ జెప్పఁబడును. వృత్తులలోనెల్ల శ్వవృత్తి యధమాధమంబు. ఆవృత్తి యెల్లరకు నింద్యము. బ్రాహ్మణునకు బొత్తిగాఁ గూడదు.

### వర్ణనిర్ణయము

ఏవ్యక్తి యేవర్ణమునకు సంబంధించునో నిర్ణయించుటకు స్వభావము ప్రధానంబగు; ఉత్పత్తి ముఖ్యముగాదు. గంగోదకంబును మట్టిపాత్రయం దుంచినంతమాత్రముననే యది చెడిపోదు. మురికినీటిని బంగారుగిన్నెలో నుంచినంతమాత్రముననే యది శుద్ధజలము కానేరదు. ఉపాధులు కర్మవశంబునఁ గలుగు. మహాత్ములు కొందఱు నీచయోనులందు జన్మించుటయే యిందులకు నిదర్శనము. స్వభావముతోడ నుపాధియు శుద్ధమగునేని మఱిమఱి యోగ్యమగు.

### వర్ణలక్షణములు

ధర్మనందనా! ప్రతివర్ణంబునకు స్వభావంబునుబట్టి ప్రత్యేకలక్షణంబు లుండును. శమదమతపశ్శౌచములు క్షాంతిసంతోషార్జవజ్ఞానంబులు దయాసత్యములు భగవదాత్మత్వము ఏవ్యక్తియందుఁ బ్రధానలక్షణంబులై గాన్పించునో యావ్యక్తి బ్రాహ్మణవర్ణంబునకును; శౌర్యవీర్యధృతి

తేజస్త్యాగంబులును ఆత్మజయక్షమాసహనప్రసాదంబులును బ్రహ్మణ్యతయుఁ బ్రధానంబులైనవ్యక్తి క్షత్రవర్ణంబునకును; గోగురుదేవభక్తియు నాస్యభక్తియు త్రివర్ణపరిపోషణము ఆస్తిక్యము నిత్యోద్యమము నైపుణ్యము ప్రధానంబులైనవ్యక్తి వైశ్యవర్ణంబునకును, వినయము శౌచము నిష్కాపట్యము, చౌర్యాది లోభబుద్ధిరాహిత్యము దైవభక్తి గలవ్యక్తి శూద్రవర్ణంబునకును సంబంధించినవాఁడని గ్రహింపవచ్చును.

### స్త్రీలధర్మములు

ధర్మజా! స్త్రీలకు వారిస్వభావంబునుబట్టి ధర్మంబులు ప్రత్యేకములు. శుచిగానుండుట, ప్రియపూర్వకంబుగా సత్యంబు పలుకుట, పతిభక్తి—ఇవి ప్రధానధర్మంబులగు. వారికార్యంబులెల్ల నింటియందే యగుటంజేసి గృహశుద్ధి, గృహోపకరణశుద్ధి, యథాప్రాప్తసంతుష్టి, ప్రమాదాలస్యంబులు లేక వర్తించుట—దీనినెల్ల వారు పాటింపవలయును.

### సంకరజాతులు - వారి ధర్మవృత్తులు

రజకులు, చర్మకారకులు, నటులు, బురుడులు, కైవర్తులు, భిల్లులు—వీరు ప్రధానసంకరజాతులవారగుదురు. చండాలురు, పులస్కులు, మాతంగులు మొదలైనవారు అంత్యజు లనఁబడుదురు. వీరు తక్కువ సంకరజాతివారు. వీరికిఁ హింసాదిపాపవృత్తులును జౌర్యముఁ దక్కఁ దక్కిన కులానుగతవృత్తులు ధర్మవృత్తులగు.

### యుగభేదములు - వృత్తిభేదములు

ధర్మజా! సత్య, త్రేతా, ద్వాపర కలి యనుపేర యుగంబులను నాల్గుగా విభజించిరి. యుగభేదంబులఁబట్టి స్వభావభేదములు గలుగుచుండు. వేదదర్శనులు తత్తద్యుగస్వభావంబునకుఁ దగినట్లుగా వృత్తులను విధించిరి. ఆవృత్తులే యాయాయుగజనులకు ధర్మవృత్తులగు. ఆధర్మవృత్తులను నిర్వర్తించుచు వత్తురేనిఁ గాలక్రమంబున స్వభావం

చెట్టిదైనను శుద్ధిగాంచి యెట్టకేలకు శుభంబందుదురు. స్వధర్మంబు గుణహీనంబుగాఁ దోఁచినను దానిని వదలరాదు. స్వధర్మనిష్ఠులై సద్గతిఁ గాంచినవా రెందఱో గలరు. యయాతిసౌరభప్రముఖులను నిదర్శనంబుగా గ్రహింపవచ్చును.

## మహోత్కటదుర్వాసనలు

దుర్వాసనలు మహోత్కటంబులై యున్న వారిగతి యేమందువా? అట్టివాసనల నాపుట శక్యముగాదు. అవి తద్వ్యాపకర్మంబులను దప్పక చేయించును. క్షేత్రమందు నిరంతరము బీజంబులను జల్లుచున్నచోఁ గాలక్రమంబున నయ్యది నిర్వీర్యంబగు. అందు జల్లినగింజ మొలవక నశించును. అట్లే దుర్వాసనామములు యథామతి వర్తించి వర్తించి తుదకు విసువుచెందుదురు. ఆవిసువుతోడ వారికామాసక్తి నశించును. అంతియగాదు. కామలతలు మఱల జనింపవు. అంతతో వారు సన్మార్గవర్తులై మేలుపడయుదురు. ఇందులకు నిదర్శ మేమందువా? అగ్నియందు ఘృతంబును మితముగాఁ బోసినప్పు డాయగ్ని ప్రజ్వరిల్లును. ఆఘృతమునే క్రుమ్మరింతురేని నయ్యగ్ని చల్లాఱుచున్నదిగదా. అట్లే మహోత్కటవాసనలుగూడ నిరంకుశముగా విజృంభించి విహరించి నిస్సత్త్వములై తమంతటతామే నశించును. ఇట్లగుటకు నెంతయుఁ గాలవ్యవధి గలుగుఁ గావున నట్టివారు బహుజన్మంబు లెత్తుదురు.

## ఆశ్రమధర్మములు

ధర్మజా! బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సంన్యాసము అని యాశ్రమములు నాల్గు గలవు. ఒక్కొక్క యాశ్రమమునకు ధర్మంబులు ప్రత్యేకించియుండు.

## బ్రహ్మచర్యాశ్రమధర్మములు

బ్రహ్మచారి గృహమందు తపించి దాంతుఁడై గురువునకు దృఢసౌహార్ద్రపూర్వకంబుగా దాసునివలె నమ్రతతో హితంబు లొనర్చుచుఁ బ్రతిదిన ప్రాతస్సాయంకాలంబులందు గురుపూర్వకంబుగా నగ్న్యాదిత్య

సురోత్తముల నుపాసించుచు, సంధ్యాత్రయగాయత్రీజపహోమ ప్రాతస్సంధ్యలందు మౌనవ్రతంబు నవలంబించుచుండవలయు. గురువు పిలిచి నప్పుడు వినయముతో డాసి తచ్చరణంబులు తలసోకునట్లు సాష్టాంగం బొనర్పవలయు. వేదాధ్యయనానంతరము మఱలివచ్చునప్పు డట్లే సాగిలం బడి మ్రొక్కి తదనుజ్ఞఁబడసి యందుండి వెడలి రావలయును.

బ్రహ్మచారి మేఖలాజినకౌపీనదండకమండలూపవీతంబులును బవిత్రంబును ధరింపవలయు. మేఖలాదిధారణమందు వర్ణంబులఁబట్టి వస్తుభేదము గలదు. బ్రాహ్మణబ్రహ్మచారి పాలాశదండంబును ధరింపవలయు. అట్లే యితరవస్తుధారణంబునందుఁగూడ వర్ణోచితవిధివిధానంబులు గలవు. బ్రహ్మచారికిఁ గేశసంస్కారము కూడదు. అతఁడు ప్రాతస్సాయంవేళ లందు పవిత్రగృహంబులందు భిక్షించి భిక్షాన్నంబును గురువునకు నివేదించి వానియనుమతింబడసి తాను భుజింపవలయు. గురు వనుమతింప నినాఁ డుపవసింపవలయు. సౌశీల్యము మితాహారము దక్షత శ్రద్ధ జితేంద్రియత్వము వీనియెడ నెన్నఁడుఁ బరాకుచెందరాదు. మఱియు స్త్రీలతోఁ గాని స్త్రీవశులతోఁగాని నెప్పుడేనిఁ బనిగల్గునేని తత్కార్యపర్యంత కాలము మాత్రమే యట నుండనగు. అంతకుమించి వ్యవహరింపరాదు. మఱియు నతఁడు కేశసంస్కారోద్వర్తనజలకాభ్యంజనాదిక్రియలఁ బ్రాయంపుటింతులచేత నెన్నండుఁ జేయించి కొనరాదు. ఏలయందువా?

"ఆ. పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
కరఁగకుండరాదు కడిగెనేని
బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టక మానఁడు
వడుగు కింతి పొత్తు వలదు వలదు."

ధర్మజా! ద్వైతభావం బెంతకాలం బుండునో యంతకాలం బిట్టి ప్రమాదంబులకు నెడము గలదు. ఆత్మస్వరూపసాక్షాత్కారముఁ బడసి నప్పుడు ద్వైతభావంబు నశించు. అప్పుడు స్త్రీపురుషాదిలింగభేదము పోవును. భేదజ్ఞానముతోడ గుణాధ్యాపమును, దానితోడ భోగ్యతా

బుద్ధియు నంటియుండు. ధర్మజా! కాంతలతో నేకాంతవాసవర్జ్యము సర్వాశ్రమములవారికి నన్వయించు. అంజనాభ్యంజనస్త్రీసంగమచిత్రకర్మ మధుపానమాంసభక్షణంబులును ప్రక్చందనాద్యలంకారములును వ్రత ధరులకు నెన్నఁడుఁ గూడవు. ఋతుకాముఁడు గురువృత్తి నుండిన నుండ వచ్చు.

బ్రహ్మచారి యట్లు గురుకులంబున నివసించి వేదవేదాంతంబులు పఠించి యధ్యయనాంతంబున గురువునకుఁ గోరినదక్షిణ యథాశక్తి సమ ర్పించి తదనుజ్ఞాతుఁడై మఱలివచ్చి తక్కినమూఁడాశ్రమంబులలో వానియిచ్చవచ్చినదానిని స్వీకరింపవచ్చు. లేదా, నిత్యబ్రహ్మచారియై యుండవచ్చు.

### సర్వాశ్రమ పరమధర్మము

ధర్మజా! ఏయాశ్రమమువానికైనను విచారింపనైన ముఖ్యవిష యం బొందుగలదు. ఏదియందువా? ఏయాత్ముఁడు గురువులో నగ్నిలో సర్వభూతంబులలోఁ దనలో జీవరూపంబుననుండియు నుండనివాఁడగునో యాయాత్మనితత్త్వంబును విచారింపవలయు. అట్లు విచారపూర్వకం బుగాఁ జరించునత డేయాశ్రమమందున్నను దుదకుఁ బరబ్రహ్మంబును జేరును, ఎల్లయాశ్రమంబులకు నిదియే పరమధర్మము.

### గృహస్థాశ్రమధర్మములు

గృహస్థునకు స్వధర్మంబులు వానికర్మంబులగు.ఆకర్మంబుల నతఁడు ఫలాభిసంధిరహితంబుగాఁ జేయుచు యథాప్రాప్తసంతుష్టుఁడై యుండ వలయు. అతఁడు పరమేశ్వరప్రీత్యర్థము కర్మంబులు చేయునప్పుడు నాకర్మంబులెల్ల యజ్ఞంబులేయగు.

### వానప్రస్థధర్మములు

వనస్థునిధర్మంబులు మునిధర్మంబులగు. వాని నాచరించునతఁడు ఋషిలోకంబునొందు. వనస్థునకు నగ్నులుగలవు గావునఁ దద్రక్షణార్థం బతఁడు గుహనో కుటీరంబునో యాశ్రయించును.

వానికి నాహారనియతిగలదు. దున్ని చల్లఁగాఁ బండినపంట పదార్థం బులను దినరాదు; ఋతుకాలంబునకు మున్నుగాఁ బండినదానిని దినరాదు. అగ్నిపక్వమైన పదార్థంబునుగాని యపక్వపదార్థంబునుగాని భుజింపరాదు. సూర్యతప్తమై పక్వమైనదానినిమాత్రమే భుజింపవలయును. భోజన పదార్థము క్రొత్తది లభించినప్పుడు తత్పూర్వము తనయొద్ద నున్నదానిని విసర్జింపవలయు.

వనస్థుఁడు శాస్త్రోక్తనిత్యకర్మంబులనుమాత్రమే చేయనగు. తత్కర్మంబులకై వలసినచరుపురోడాదినిర్వాణంబుల నారణ్యకంబులైన వానినే గ్రహింపవలయును. ఎండవానలను గాలినిప్పులను మంచును సహింపవలయును. కేశముండనముచేయరాదు. జడలు ధరింపవలయును. గోళ్లు మీసాలు పెంచవలయు. నలుగుపెట్టి నీరాడరాదు. వల్కలాజినం బులు దండకమండలువులు మున్నగువానిని ధరింపవలయు.

వనస్థుఁడు పదురెండుసంవత్సరంబులో యెనిమిదిసంవత్సరంబులో నాలుగేండ్లో రెండేండ్లో తుదకు నొక్కయేఁడేనియుఁ దపోవ్రతుఁడు కావలయును. ఆతపస్సు క్లేశపూర్వకంబుగా నుండరాదు. అట్లు తపస్సు నేయఁడేనివానిబుద్ధి యేకాగ్రముగాదు. అతఁడు జరాజాడ్యాదులచేత బలహీనుఁడై తననియమంబులను నెఱవేర్పలేనినాఁడు బ్రహ్మవిద్య నభ్య సింపవలయును. అకదులకుఁ జాలఁడేని నిరశనాదుల నాచరింపనగు.

## నిరశనవ్రతము

ధర్మజా! నిరశనవ్రతము స్థూలదేహ లయార్థమగు. తత్ప్రి కారంబు వినుము. అనశనవ్రతధారి మొట్టమొదట నహంకారమమకారం బులఁ ద్యజించి యగ్నుల నాత్మ సమారోపణం బొనర్చి పంచభూతంబుల వలన నేర్పడినదేహంబునం దదుద్భూతకారణంబులైన యాకాశాదులందు లయింపవలయు. ఆక్రమము వినుము. ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి యనునవి పంచభూతంబులు. ఆకాశతత్త్వంబు దేహ రంధ్రంబులరూపంబునను, వాయుతత్త్వంబు నిశ్వాసరూపంబునను,

తేజస్తత్త్వం బూష్మరూపంబునను, జలతత్త్వంబు రక్తశ్లేష్మప్రాయ రూపంబులను, పృథ్వితత్త్వం బస్థిమాంసాదికఠినపదార్థరూపంబున నుండు. ఏది దేనికిఁ గారణమో దాని నద్దానియందు లయింపవలయు. ఈవిధానము కార్యంబును గారణమందు లయించుట యగు.

లింగదేహాలయము

స్థూలశరీరమందు లింగశరీరము గలదు. అది యధ్యాత్మత్రయ రూపంబున నుండు. ఆమూఁటిని వానికిఁ గారణంబులైన రాజసాహంకారాదులందు లయింపవలయు. అద్వితీయాత్మజ్ఞానసిద్ధియే లయ భావం బగు.

లింగశరీరలయప్రకారంబు వినుము. వాక్కును దానికార్యమైన వక్తవ్యముతోఁడఁ దదధిష్ఠానదేవతయైన యగ్నియందును, హస్తంబులను వానిలక్షణమైన శిల్పంబుతోడ నింద్రునందును, పాదంబులను గతితోడ నుపేంద్రునందును, ఉపస్థంబును రతితోడఁ బ్రజాపతియందును, పాయువు నుత్సర్గంబుతోడ మృత్యువునందును, శ్రోత్రమును నాదము తోడ దిక్కులందును, త్వక్కును స్పర్శముతోడ వాయువునందును, రూపంబును జక్షుస్సుతోడ నాదిత్యునందును లయింపవలయును.

తర్వాత రసనను బ్రచేతసునితోడ జలంబులందును, ఘ్రాణంబు నశ్వినులతోడఁ బృథ్వియందును, మనస్సును మనోరథంబుతోడఁ జంద్రునందును, బుద్ధిని బోధ్యంబులతోడ బ్రహ్మయందును, అహంకారమును గర్మంబులతోడ దత్క్రియానిమిత్తరుద్రునందును, చిత్తంబును చేతన తోడ క్షేత్రజ్ఞునందును, క్షేత్రజ్ఞుని గుణములతోడ నిర్వికారబ్రహ్మమందును లయింపవలయు.

అనంతరము పృథ్విని జలంబులందు, జలంబును దేజస్సునందు, దానిని వాయువునందు, దాని నాకాశమందు, దానిని అహంతత్త్వమందు, దానిని మహత్తత్త్వమందు దానిని బ్రధానమందు, దానిని బ్రహ్మము నందు లయింపవలయు. ధర్మజా! పరమాత్మునుండి ప్రధానాదులెల్ల నను

లోమ క్రమంబుగాఁ బృథ్వీపర్యంతం బుత్పన్నమయ్యెను గావున వానిని విలోమక్రమంబున నప్పరమాత్మునియందుఁ జేర్చుటయే లయకార్యతాత్పర్యము. ఉపాధులెల్ల నిట్లు లయింపఁగా ఆత్మరూపుఁడు చిన్మాత్రుఁడు నై తానుమాత్రము శేషించును. ఆభావము స్థిరమైనంతనే ద్వైతంబు నశించును. అంతట నతఁడుగూడఁ గొయ్యకాలిపోయినతర్వాత నగ్నివలె విరమించును. నట్టి దేహముమాత్రము మిగులును. తన్నాశనార్థము నిరశనాదివ్రతంబులఁ బూననగు.

ధర్మజా! కొందఱు కార్యార్థులై యన్నపానాదులు వర్జించి హఠయోగంబును బూనుదురు. హిరణ్యకశిపురావణాదు లిందులకు నిదర్శకులు. హఠయోగము కేవల తామసికము. అట్టియోగులకుఁ గార్యసిద్ధియైన నగుఁగాక. పరమార్థయోగసిద్ధి యెన్నఁడుఁ గానేరదు. మఱియు నట్టియోగంబున వానిలోనున్న పరమాత్మునిఁ గృశింపచేయుదురు. అది హత్యయగు. తత్ఫలంబు ననుభవింపక తప్పదు. ఆత్మకళ్యాణంబును లోకకళ్యాణంబును గోరువాఁ డెన్నఁడు నాసురమైన యీవ్రతంబు ననుష్ఠింపరాదు. కాదని యనుష్ఠింతురేనిఁ దాము చెడుటయేగాక విపరీతమార్గప్రదర్శకులై మూఢలోకంబును జెఱుచుదురు. తాఁ జెడ్డకోతి వనమెల్లఁ జెఱిచె ననుసామెత వినవా?

### యతి ధర్మములు

ధర్మజా! వనస్థుఁడు జ్ఞానాభ్యాససమర్థుఁడేని యతి యనఁబడు. అతఁడు దేహాతిరిక్తంబులనెల్ల త్యజించి గ్రామైకరాత్రిమాత్రవాసియై నిరపేక్షబుద్ధితో నేకాకిగా భూసంచారంబుఁ గావించుచు నిరంతరము నాత్మారాముఁడై యుండవలయు. ఆత్ముఁడు కారణకార్యాతీతుఁడనియు సదసద్రూపవిశ్వమెల్లఁ దన్మయంబనియు స్థిరవిశ్వాసంబు గలిగి శాంతుఁడు సర్వభూతహితుఁడు నై యుండవలయు. సుషుప్తి ప్రబోధసంధులందుఁ దమోవిక్షేపము గలుగు. అట్టిదానికి నెడ మీయరాదు. మృత్యువు నిత్యంబగుటయు జీవితం బనిత్యంబగుటయు బంధమోక్షంబులు మాయా

మాత్రంబులగుటయు సర్వభూతోత్పత్తిలయంబులకుఁ గాలమే కారణం బగుటయు గ్రహించి యతఁడు శరీరవియోగంబునకు సంసిద్ధుఁడై యుండ వలయును.

యతియొక్క లోకవ్యవహారం బెట్లుండువా? యతి యగువాఁ డెన్నఁడు ననాత్మవిషయికశాస్త్రంబులఁ దిలకింపరాదు; జీవితార్థకళల నాశ్రయింపఁగూడదు; వితండవాదంబులకుఁ బోఁజనదు; పక్షాభి మానంబునకు నెడ మీయరాదు; శిష్యుల నావర్జింపఁగూడదు; బహు గ్రంథపఠనంబుగాని వ్యాఖ్యానవ్యవహారముగాని చేయరాదు; యత్యా శ్రమంబునకు శాంతియు సమబుద్ధియు మూలస్తంభంబు లగు; ఆయాశ్ర మంబును స్వీకరించుట మోక్షార్థమే యగుఁగాని ధర్మార్థము గాదు. వాని నియమంబులెల్ల మోక్షానుకూలంబులై యుండవలయు.

### యతి భేదములు

ధర్మజా! యతులలో ఉత్పన్నజ్ఞానులు, అనుత్పన్నజ్ఞాను లని రెండు తెగలు గలవు. సిద్ధులు మొదటి తెగకును సాధకులు రెండవ తెగకుఁ జేరుదురు. మొదటి తెగవారికి దండాదిధారణము విధిగాదు. వారు కేవ లాత్మనిష్ఠులైయుందురు గావున బాలోన్మత్తమూకలో యనఁ దోఁచుదురు. ఇందులకు నిదర్శనంబుగా నొకయితిహాసముగలదు వినుము.

### ప్రహ్లాదపరమహంసల సంవాదము

ధర్మజా! పరమభాగవతుఁడైన ప్రహ్లాదుఁడు లోకతత్త్వంబు నెఱుంగఁగోరి కొందఱు మంత్రులతోడ భూసంచారము సేయుచు సహ్యాద్రిసానుప్రదేశంబునఁ బాఱుచున్నట్టి కావేరినదిని డాసెను. ఆనదీ తీరంబున నొకానొకవ్యక్తి ధూళిగప్పి పరుండియుండెను. వానియెడ వర్ణాశ్రమలక్షణాదు లెవ్వియుఁ గానరామింజేసి యతఁ డెవఁడో యూహింపరాదయ్యెను.

ప్రహ్లాదుఁడు వానిపాదంబుల వ్రాలి యథావిధిఁ బూజించి "అయ్యా! 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన' మనిరి. శరీరంబు లన్నపాన

పోషితంబులై యథాసుఖంబుండుడు. నీయునికిఁజూడ సర్వము వర్జించి నట్లు గాన్పించు. నీదేహపాటవంబవ్వనో శక్తిమంతమై మహోద్భుతంబును గలిగించుచున్నది. దీనిరహస్యమేమి? దేహమునందు శక్తియున్నప్పు డది యూరకనుండనీయదు. అది యేదే నొక కార్యంబునకుఁ బ్రేరేచును. దేహికి దేహధారణము ప్రధానము. దేహధారణంబునకుఁ బదార్థం బులు వలయు. అవి ధనమూలకంబు లగు. ధనార్జనంబునకు విద్యాదక్షత లును జాతుర్యంబును లోకరంజకకథాకథన ప్రావీణ్యంబును సహకారు లగు. ఈశక్తులు కించిన్మాత్ర మున్నను లోకులు కార్యతత్పరులై చరింతురు. నీయందిట్టిశక్తులు సమగ్రంబులని నీతేజస్సు చెప్పకయే తెలుపుచున్నది. ఇట్టి వాఁడవయ్యు లోకవర్తనంబుఁ జూచుచు నుదాసీనుఁడువలె శయనించియుండు వేల?” యని యడిగెను.

ధర్మజా! ప్రహ్లాదుని వినయమృదుమధురభాషణంబులకు నమ్మ హాత్ముఁడు లేనగుమోము దాల్చి ‘అసురోత్తమా! నారాయణుఁడు భక్తుల భక్తియోగంబునకు సంతుష్టుఁడై వారిహృదయాంతరంబులందుఁ బ్రకాశించి సూర్యుఁ డంధకారంబునుబలె వారియజ్ఞానంబును దొలఁ గించు. నీ వెంతయు నారాయణభక్తుఁడవు కావున జనులప్రవృత్తి నివృత్తులకుఁ బదం బెయ్యదియో నీయధ్యాత్మదృష్టికి స్పష్టము. సంగతి యోజించియు నన్నడిగితివి. అడిగినప్పుడు మిన్నకుండరాదు. ఈవిషయమై పెద్దలవలన నా విన్నది తెలుపుదు వినుము.

‘అయ్యా! నేను తొలుదొల్త సంసారప్రవాహంబునఁ బడి యీప్సి తార్థంబులకై సర్వగతులఁ బ్రాఁకులాడితిని. ఒకనాఁటికిని దనివి గలుగ దయ్యెను. అంతియగాదు. తృష్ణ నానాఁటికిఁ బెరిఁగి పెంపొంది కన్నవిన్న దానివెంట నన్నుఁ బరుగెత్తింపసాగెను. తృష్ణాపరితోషార్థము వివిధ కర్మంబులు చేసితిని. కర్మంబులకు ఫలంబులు గలుగుటయు ఫలభోగము తప్పనిదగుటయుంజేసి ఫలభోగార్థము ఫలానురూపజన్మంబులు ప్రాప్త

మయ్యెను. తిర్యగాదిజన్మంబు లెన్నో యెత్తితిని. కడకు స్వర్గాపవర్గంబులకుఁ గారణమైన మనుష్యజన్మము కలిగెను.

అట్లు మర్త్యజన్మంబు వచ్చినతర్వాత గృహస్థులస్థితిగతులు పరిశీలించితిని. భార్యాభర్తలు సుఖప్రాప్తికి దుఃఖనివృత్తికి వివిధకర్మంబులు సాగించుటయు, వారికి విపరీతఫలంబులు గలుగుటయుఁ జూచినంతట నాకు సంసారవిరక్తి జనించెను. అప్పుడు జీవస్వరూపంబును విచారించు తలంపుగలిగెను. నాలోన నేనే విచారింపఁగడంగితి. జీవుఁడు సుఖస్వరూపి యనియు, సర్వకామనివృత్తియైనప్పుడే తత్స్వరూపప్రకాశం బగుననియు, ప్రారబ్ధకర్మఫలభోగార్థము శరీరంబు గలుగుచున్నదనియు, తత్ఫలంబును తద్దేహంబుతో భోగించియే తీఱవలయుననియు బోధపడెను. ఆభావంబు స్థిరమైనంతట ఫలభోగార్థము శరీరంబు నప్పగించితిని. ఫలభోగవాసనలు తలయెత్తునప్పుడెల్ల వాని నడంపసాగితిని. వాసనాప్రేరేపణంబులు క్రమక్రమంగా సన్నగిల్లి నశించెను. దానితోడఁ గర్మేంద్రియవ్యాపారము స్తంభించెను. దానితోడ నూతనకర్మకలాపంబెల్ల నుడిగెను.

అయ్యా! అంతమాత్రాననే సంసృతి తప్పునా యని యడుగుదువా? సంసృతి యనఁగా నేమి? జననమరణరూపభ్రమణము సంసృతి యగు. ఆభ్రమణంబునకుఁ గారణమేమి? భ్రాంతియే కారణము. భ్రాంతియనఁగా నెట్టిది? ఒకవిషయంబును వేఱొకటిగాఁ దలంచుటఁ భ్రాంతి యగు. దాని ఫలమేమి? ద్వైతభావంబు గలుగుట దానిఫలము. ద్వైతభావంబు నశించి బుద్ధి యేకాగ్రమగునేని సత్యము స్ఫురించును. సత్యస్ఫురణముతోడ జీవుఁడు సుఖస్వరూపుఁడగుట బోధపడును. అట్టిబోధ యెప్పుడు గలిగెనో యప్పటినుండి సుఖార్థప్రయత్నంబెల్ల నుడుగును. సుఖస్వరూపునకు సుఖమును గూర్చుతలంపు పిచ్చితలంపుగదా. ఆప్రయత్నము లేగఁబా కర్మములు, కర్మంబు లుడుగుటయే నిస్సంసారత్వము. ఒకనిదర్శనము వినుము. జలము నైజశుద్ధము. పరవస్తుసంయోగంబున జలమందుఁ బాచి పుట్టి యాజలంబును గప్పివైచుచున్నది. తెలివిగలవా రాపాచిని దొలఁగించి తజ్జలముఁ

గ్రోలి సుఖపడుదురు. అజ్ఞాను లివియెఱుంగక యానీరంబును విడిచి యెండమావులఁ జూచి భ్రాంతులై వానివెంటఁ బఱచిపఱచి విఫలమనోరథులై దుఃఖమందుచున్నారు. అట్లే జీవుఁడు సుఖస్వరూపుఁడై యుండఁగా వానిం గప్పియున్న వాసనావిశేషంబులంజేసి జీవస్వరూపస్థితి నెఱుంగక సుఖార్థము పఱచిపఱచి విఫలమనోరథులై దుఃఖభాగు లగుచున్నారు.

ప్రహ్లాదా! దేహేంద్రియాదులు కర్మాయత్తంబులనియు, కర్మవశ్యుఁడు సుఖలాభదుఃఖనివృత్తులు గోరి పాటుపడుట సహజంబనియు నెఱుఁగుదువా? అట్లే యగుఁగాక. వాని ప్రయత్నఫలం బెంతమాత్రము? అతికష్టంబున నర్థంబు నార్జించి దానితోడఁ గామంబులనుగూర్చి మనస్సంతుష్టిఁ గావింప యత్నించును. అంతమాత్రాననే మానసికమైన యధ్యాత్మికాదిదుఃఖము రహితము గాదు. అది గానినాఁడు ఫలంబేమి? మఱియొక సంగతిగూడ గ్రహింపవలయును. ఎందాఁక మనస్సు తత్సంబంధంబులైన యధ్యాత్మికాది దుఃఖంబులకు దూరము కాదో యందాఁక లోభంబు నింద్రియవశత్వముఁ దప్పవు. ఇంద్రియవశుల నెల్లప్పుడు శంకాభయంబులు వెన్నంటియుండు. తత్ఫలముగా వారు నిద్రాసుఖంబేనియు లేక తల్లడిల్లుచుందురు. ధనవంతులయ్యు నిట్లగుటఁ గన్నారఁ జూతుముగదా!

మఱియు ధనవంతునకు హితశత్రువులు పెక్కండ్రు గలుగుదురు. ఒకప్రక్క రాజులు నొకవంక చోరులు నొకచాయ వైరులు నొకవలను జ్ఞాతులు నొకక్రేవ యాచకులు వానిని నిరంతరము బాధింతురు. అంతియ గాదు. పశుపక్షులుగూడ వానిని వదలవు. వీనిబాధ యిట్లుండఁగాఁ గాలము వెన్నంటి వానినిఁ దఱుముచుండు. ధనవంతు లెట్లో ప్రాణవంతులు నట్లే వివిధశోకమోహాభయక్రోధరాగవైక్లబ్యశ్రమాదిశత్రువృతులై పరితపింతురు. ధనార్థునకు ధనకాంక్ష యెట్లో ప్రాణార్థునకుఁ బ్రాణకాంక్ష యిన్నికడగండ్లకుఁ గారణమగుచున్నది. ఆ కాంక్ష నశించినచో దుఃఖము నశించును, సుఖము స్వతస్సిద్ధ మగు.

### జుంటీఁగ - పురుషప్రయత్నఫలము

ప్రహ్లాదా ! ఈరహస్యంబును నా కెవ రుపదేశించి రందువా ? జుంటీఁగయు నజగరంబు నా పరమగురువులు. తేనెటీఁగ దుర్గమవనాంతరంబులు దూఱిదూఱి పడరానిపాట్లుపడి వివిధపుష్పరసంబులను సేకరించి తేనియను గూర్చును. ఎవఁడో యొకఁడు హఠాత్తుగా వచ్చి యాయీఁగను జంపి తేనియను హరించుచున్నాఁడు. దీనింజూచి పురుషప్రయత్న ఫలంబుగూడఁ గడకు నింతేగదా యని గ్రహించితి.

### అజగరము - యదృచ్ఛాలాభతుష్టి

అజగరము తా నున్నతావునుండి కదలక యప్రయత్నముగా నోటియొద్దకు వచ్చినదానిం దిని తృప్తిచెంది జీవించుచున్నది. దానిం జూచి పుట్టించినవాఁడు పెట్టక మానఁడనియు, యదృచ్ఛాలాభసంతృప్తి సర్వదుఃఖహారంబనియు గ్రహించితిని.

### పరమహంసధర్మములు

ప్రహ్లాదా ! జుంటీఁగగతిఁ జూచి విషయాసక్తి యనర్థదాయకంబని గ్రహించి విరక్తిఁజెందితిని. అజగరస్థితిం జూచి యూహాలువదలి దొరకినదానితోఁ దృప్తినొందుచు దొరకనినాఁడు ధీరుఁడనై యుపవసించుచునుందు. ప్రాప్తంబు లేశమైనను దిగులుపడను; బహుళంబైననాఁడు బూరటింపను. అది సంపన్నంబగుఁగాక; రసహీనమగుఁగాక; రేపో మాపో యెప్పుడేని నిడుదురుగాక. ఆసంగతులే స్ఫురింపవు. వస్త్రధారణం బెట్లందువా ? దుకూలమో ధౌతాంబరమో చర్మమో నారయో యేది దొరకినను ధరింతు. శయనవిషయ మేమందువా ? కటిక నేల యొండె శ్మశానవాటినొండె నెందేనియుఁ బరుండుదు. శ్మశానవాటి శయనంబునకును బ్రాసాదాంతరపర్యంకమృదుశయనంబులకు భేదము నామదికిఁ దోఁపదు. జలకంబు లాడించి పట్టుపుట్టంబులుగట్టి యలంకరించి గంధంబులుపూసి గజాశ్వరథంబుల నెక్కించి త్రిప్పుదు రేనిఁ దిరుగుదు. అట్లుగానినాఁడు దిగంబరినై చరింతు. నిందాస్తుతులకు వ్యసనసంతో

షంబు లందుట లేదు; ప్రతినిందాస్తుతులు చేయుట లేదు. కోరిక లెవ్వియు లేవా ? యని యందువా ? సర్వభూతహితంబును భగవదేకాత్మకత్వంబుఁ గోరుదు. మఱియొండు గలుగదు.

ప్రహ్లాదా! ఈస్థితి గలుగుట యెట్లందువా ? మనోవ్యాపారంబు నశించెనేని యీస్థితి సిద్ధించును. మనోవ్యాపారం బెట్టిదందువా ? జాతి రూపాదివికల్పము మనోవ్యాపారలక్షణము. అట్టివికల్పము నశించి నప్పుడు మనస్సు వృత్తిరహితంబగు. మనోవృత్తిరహితంబగు టెట్లం దువా ? మనస్సును సాత్త్వికాహంకారమందు లయింపవలయు. అప్పుడు మనోవిభ్రమము నశించు. ఆవైకారికంబును మూలప్రకృతియందును దానిని ఆత్మానుభూతియందును లయింపవలయు. అప్పుడు తత్త్వదర్శ నంబగు. దానితోడ వాంఛలు నశించు. అనంతరము తత్త్వమనన శీలుఁ డగు. తత్ఫలంబుగా స్వాత్మభూతినిష్ఠ సిద్ధించు. అప్పుడు విరతుఁ డగు. లయంబనఁగా అనుసంధానము చేయుట యని భావము.'

ధర్మనందనా! ఆయతి యట్లుచెప్పి విరమించెను. ప్రహ్లాదుఁడు పరమహంసధర్మంబులను విని మహాప్రీతినొంది యయ్యతిని బూజించి స్వస్థానంబునకుఁ బోయెను. ధర్మజా! యతివృత్తి యజగరవృత్తియగుఁ గావున నయ్యతిని అజగరుఁ డనిరి. అజగరము వాయుభక్షణముతో నుండును.

### గృహస్థుఁడు - జ్ఞానసంపాదనము

మునులారా! ధర్మనందనుఁడు ప్రహ్లాదపరమహంసలసంవాదంబు విని 'దేవర్షిసత్తమా! నీ వచించినపదవి నాయట్టిమూఢమతిగృహస్థునకు లభ్యమగునా ?' యని యడిగెను. నారదుఁడు వాని కిట్లనియెను.

'ధర్మసుతా! నీప్రశ్న లోకోపకారమగు; వినుము. గృహస్థు నకుఁ గర్మాచరణము తప్పదనియు, కర్మములతోడ ఫలోదయంబును ఫల భోగార్థము శరీరధారణంబును, ఆశరీరంబుతోఁ బునఃకర్మంబులును దత్ఫలభోగార్థమై పునశ్శరీరధారణముఁ బ్రవాహాసరణి జరుగుచుండుఁ

గావునఁ గర్మవిరతియు జ్ఞానోదయంబును దూరంబు లగుననియు భావింతువు గాఁబోలు! అట్టిశంక వలదు.

గృహస్థునకుఁ గర్మాచరణము విధివిధానమైననుఁ దత్ఫలానుభవం బెప్పుడు గలుగు? కర్మంబులను ఫలాభిసంధితోఁ జేసినప్పుడు తత్ఫలభోగావసరంబు గలుగు. గృహస్థుఁ డిది యెఱింగి స్వాశ్రమోచిత కర్మంబులను ఫలాభిసంధిరహితంబుగాఁ జేయవలయు. వానికర్మఫలం బేమగునందువా? ఫలము భగవదర్పితమగు. కర్మంబుల నట్లుచేయుశక్తి యెట్లు గలుగునందువా? అభ్యాసఫలంబుగా నట్టిది సిద్ధించును. అభ్యాస సాధనక్రమం బెట్లందువా? కర్మతత్త్వజ్ఞుల నుపాసించుచు, ఉపశాంతుల సేవించుచు భగవదవతారకథలఁ గాలోచితంబుగా వినుచు సత్పురుష సాంగత్యము నెఱపుచుఁ బుత్రకళత్ర దేహాదు లశాశ్వతంబులగుట వాని యెడ మమకారమువదలి దేహధారణమాత్రపరుఁడై వర్తించుచు రాగద్వేషరహితుఁడై వర్తించుటయే సాధనక్రమంబగు.

త్రివిధవిత్తములు

ధర్మజా! విత్తములు దైవంబులనియు భౌమంబులనియు నాంతరిక్షంబులనియుఁ ద్రివిధము. వర్షాదులవలన జనించు సస్యాదులఫలంబు దైవవిత్తంబగు. ఖనిజాదులు భౌమవిత్తంబగు. అనాయాచితలబ్ధంబు లాంతరిక్షవిత్తంబులగు. త్రివిధవిత్తంబులను విహితకర్మములందే వినియోగింపవలయు. గృహస్థుఁ డూఱకున్నచో నుదరపోషణం బెట్లందువా? గృహస్థుఁ డూఱకుండరాదు. అతఁ డుదరపోషణార్థంబై యుచితవృత్తిని గల్పించి తత్ఫలంబును దేహధారణార్థము వలసినంత మాత్రమే యుపయోగింపవలయు. ఎన్నఁడు భోగపరుఁడు కాఁగూడదు. మిక్కిలించి భోగించుట చౌర్యమగు. దానికి దండనము తప్పదు.

ధర్మజా! గృహస్థుఁడు మృగపక్షికీటపర్యంతము సకలప్రాణులనాత్మ సామ్యంబునఁ బుత్రతుల్యంబుగాఁ జూడవలయు. వాస్తవము విచారించినచో మర్త్యమృగ మక్షికంబులకు నుపాధిభేదంబుతక్క వేఱొండు

గలదా? గృహస్థుఁడు స్వార్జితమందు స్వప్రయోజనార్థము పోఁగా శేషించినదానిని సర్వభూతంబులకు చాండాల శునకాంతము పంచిపెట్ట వలయును. మూఁటగట్టరాదు. అతిథిసత్కారంబునకుగాఁ గామోపహత గానిసతిని నియోగింపవలయును. కామోపహతయైనసతి యాపనికిఁ దగదు.

ధర్మజా! కొందఱు భార్యకై ధనప్రాణంబులనుగూడ నుంకువ పెట్టుటయు, గురువునైనను దండ్రినైనను జంపుటయు, ఆవిలాసవతికి దాసానుదాసులై వర్తించుటయుఁ జూతుము. ఇవంతయు దేనినిమిత్తమై చేయుదురో విచారింతువా? కేవల రతిసుఖార్థమేగదా! ఆసుఖంబు దేనికి? దేహమునకా? ఆత్మకా? దేహము జడప్రాయము. దానికి సుఖజ్ఞాన మెక్కడిది? ఆత్మకే యని యందువా? నిరంతరానందమూర్తి యైనయాత్మకు సుఖాంతరం బెద్దిగలదు? ఆసుఖంబు దేని కనియందువా? అభిమానంబు తత్సుఖంబు ననుభవించుచున్నది. అభిమానమే సర్వానర్థమూలము. దానిని ద్యజింపవలయును. అభిమానస్వరూపం బెద్దియని యడుగుదువా? 'నేను, నాది' అనుభావమే యభిమానస్వరూపంబగు. ఈయభిమానం బెట్లు పోవునందువా? వైరాగ్యత్యాగంబులఁ బోవును. తదర్థము గృహస్థుఁడు నాది యనుభావంబును వదలి యనుదినము దేవఋషినరభూతపితృగణంబును దానధర్మపూర్వకంబుగా యజింప వలయు. ఇవి వాని నిత్యయజ్ఞంబులగు.

### యజ్ఞవిధానము

ధర్మజా! యజ్ఞాదులకుఁ గొన్నివిధులు గలవు. తత్సంబంధ గ్రంథము వితాన మనఁబడు. ఆప్రకారముచేయఁబడుకర్మములు వైతానికంబు లనఁబడు. గృహస్థుఁడు వాని వర్ణకర్మంబులను వైతానికంబుగా నిర్వర్తింపనగు.

### దానాదికయోగ్యదినములు

ధర్మజా! గృహస్థుఁడు భాద్రపదశుక్లపక్షంబున మాతాపితృల కును, వారిబాంధవులకును యథాశక్తి మహాలయశ్రాద్ధంబు గావింపనగు.

ఉత్తరాయణ దక్షిణాయన ప్రారంభదివసంబులును, విషువు లనఁబడు మేషతులాసంక్రాంతులును, వ్యతీపాతదినక్షయంబులును, సూర్యచంద్ర గ్రహణదినంబులును, ద్వాదశీశ్రవణంబులును, అక్షయతృతీయయు, కార్తికనవమియు, హేమంతశిశిరంబులందలి యష్టకాచతుష్టయంబును, మాఖమాసాంతరరథసప్తమియు, మఘాపూర్ణిమయు, మాసనక్షత్ర సహితపూర్ణచంద్రరాకయు, న్యూనచంద్రయు క్తయైనయనుమతియు, అనూరాధాశ్రవణోత్తరాత్రయయుక్తద్వాదశియు నేకాదశియు జన్మ నక్షత్రశ్రవణాయుక్తదివసంబులును సర్వవిషయశ్రేయోదాయకపుణ్య వాసరంబులు గావున నట్టిదినంబులందు గృహస్థుఁడు స్నానజపహోమ తపోదేవద్విజార్చనంబులు పితృభూతంబులపేర దానంబులుఁ గావించిన యెడల నాయుర్వృద్ధియు నంతశ్శ్రేయోవిశేషంబులును గలుగు. మఱియు భార్యాపుంసవనదినంబునను బుత్రజాతకర్మసమయంబునను దన యజ్ఞదీక్షాకాలంబునను బ్రేతసంస్కారకాలంబునను పితృసాంవత్సరికమృతా హస్సులందును గావించు శుభకర్మంబు లెంతయు శుభస్కరంబులగు.

### దానాదిశుభకర్మయోగ్యప్రదేశములు

ధర్మజా! దానాదులకుఁ గాలనిర్ణయమేగాక దేశనిర్ణయంబును గలదు. దేశనిర్ణయం బెట్లందువా? సత్పురుషుఁడు భగవద్బింబమగు. అట్టివాఁ డెందుండునో యాప్రదేశము పుణ్యతీర్థము నాఁబడు. భగవ త్పూజలు జరుగుచుండు ప్రదేశంబులును బురాణప్రసిద్ధగంగాదినదులు ప్రవహించుప్రదేశంబులును బుష్కరసరోముఖ్యప్రదేశంబులును గురు క్షేత్రంబును హయశిరఃప్రయాగపులహాశ్రమంబులును నైమిశంబును ఫల్గునంబును సేతువును బ్రభాసక్షేత్రంబును గుశస్థలియు వారాణాసియు మధుపురంబును బంపాసరోవరంబును బిందుసరస్సును బదరీనారాయణా శ్రమంబును సీతారాములుండిన యాశ్రమాదులును మలయమహేం ద్రాదులును శ్రీహరివిగ్రహంబులుండు స్థానంబులును దపోవిద్యాదయా యుతు బ్రాహ్మణనివాసంబులును బుణ్యతమస్థానంబు లగు. అవిశ్రేయస్కా-

ములకు నెంతయు శ్రేష్యంబగు. అందుఁ గాపించుధర్మంబులుశతగుణఫలం బిచ్చును.

దానంబులకుఁ బాత్రనిర్ణయము

ధర్మజా! పాత్రమెఱింగి దానంబు చేయవలయు. అపాత్రదానం బునఁ జేటు గలుగు. ఉత్తమపాత్ర మెవఁ డందువా? చరాచరమయుం డెవ్వఁడో యాభగవంతుఁడు మహోత్తపాత్రం బగునని విబుధులు పల్కిరి. ఒకరిమాటయేల? నీ రాజసూయయాగంబునకు సురలు సిద్ధులు బ్రాహ్మణులు సనకాదిమహామునులుగూడ వచ్చిరి. ఎల్లరునుగూడి ప్రథమ పూజకు నెవ్వని నిశ్చయించిరి? శ్రీకృష్ణభగవానునేగదా. వానికేగదా యగ్రపూజ యొనర్చితివి. భగవత్పూజ సర్వభూతపూజ యగు. అది యెట్లందువా? భగవానుఁడు నిఖిలజీవరాశిసంకీర్ణవిశ్వమహావృక్షంబునకు మూలమై వివిధజీవకోటిని సృజించి యాయుపాధులందుఁ బురుషుఁ డను పేర నుండు. కావున భగవత్పూజ యనఁగా సర్వప్రాణికోటిపూజయగు. ఆయుపాధులలో నెద్దానియందు జ్ఞానాధిక్యము గాన్పించునో యది సత్పాత్రమగు.

పూజావిధానము

ధర్మజా! అంతర్యామిపూజ మొట్టమొదట చెల్లుచుండెను. తర్వాత నుపాధి తారతమ్యంబునుఁబట్టి యంతర్యామియందుఁగూడఁ దారతమ్యంబులు కల్పింపఁబడెను. తత్ఫలంబుగా న్యూనతాధిక్యతలు రాగద్వేషంబులు పరస్పరస్పర్ధలు సంభవించెను. త్రేతాయుగమందుఁ బెద్దలిది గ్రహించి పూజార్థము భగవత్ప్రతిమల నేర్పఱచి తత్ప్రతిమా పూజలను విధించిరి. నాఁటనుండి కొందఱు ప్రతిమాదులందు భగవంతుని నుపాసింతురు. ప్రతిమలు బహువిధంబులైనను వానిలో నెల్ల నంత ర్యామియై భగవంతుఁ డొక్కండే కలఁడు. విగ్రహాభేదంబులఁబట్టి భగవ

ద్భేదంబుల నూహించి పూజింపరాదు. భేదభావంబులతోఁ జేసిన పూజలు నిరర్థకంబులు.

## బ్రాహ్మణమాహాత్మ్యము

ధర్మజా! వేదము భగవన్ముఖంబుననుండి జనించుటంజేసి యది భగవన్మూర్తి యగు. ఆమూర్తిని దపోవిద్యాపరితోషపూర్వకంబుగా నెవరు ధరింతురో వారు బ్రాహ్మణు లగుదురు. ఆకారణంబున వారు పురుషులలోనెల్ల నుత్తము లగుదురు. ఇందులకు నిదర్శన మేమందువా? ఎవనిపాదపరాగంబు ముల్లోకంబులకుఁ బవిత్రతను గూర్చునో యాకృష్ణ భగవానునకు బ్రాహ్మణుఁడు పరదైవంబఁట. ఇఁకఁ జెప్పనేల?

ధర్మజా! మోక్షము పరమప్రాప్యము. ఎల్లధర్మంబులు మోక్షార్థ మగుఁ గావున మోక్షంబు సర్వధర్మసారం బనఁబడు. మోక్షప్రాప్తికై లోకులు వారివారివర్ణాశ్రమరుచులంబట్టియు మనఃపరిణతింబట్టియు సాధనంబులను గ్రహింతురు. ఆకారణంబునఁ గొందఱు కర్మంబును గొందఱు తపస్సును గొందఱు స్వాధ్యాయంబును గొంద ఱధ్యాపనంబును గొందఱు జ్ఞానంబు నాశ్రయింతురు.

కర్మపరులైనద్విజులకు శ్రాద్ధాదులందు హవ్యకవ్యంబులు విధివిధాన మగు. దేవతోద్దేశంబుగా నియ్యఁబడునది హవ్యంబనియుఁ బితృల నుద్దేశించి యియ్యఁబడునది కవ్యంబనియుఁ జెప్పఁబడు. ఆ రెంటిని జ్ఞాననిష్ఠుల కిచ్చినప్పుడే ఫలంబు గలుగు. జ్ఞాననిష్ఠులు లభింపనినాఁడు యోగ్యతను విచారించి యన్యుల కియ్యనగు.

శ్రాద్ధమునకు నిమంత్రణ నియమముగలదు. దైవస్థానంబున నిద్దఱను పితృస్థానంబున ముగ్గురనుగాని లేక యొక్కనిగాని నిమంత్రింప నగు. శ్రాద్ధవిస్తారం బెన్నఁడుఁ దగదు. కలిమిగలదని శ్రద్ధాద్రవ్యంబును విస్తరించి వెచ్చించుట విధి ధిక్కారంబగు. శ్రాద్ధాన్నంబు హరిదైవతంబుగా నీయఁబడుచున్నది. ఒకొక్కప్పుడు నీవారాన్నంబు నీయవలసివచ్చు. అది దోషముగాదు. ఎద్దానినిగాని సత్పాత్రమున భక్తితో సమర్పింపవలయును.

అట్లు చేసినప్పుడే యది యక్షయమై యాప్యాయితంబుం గూర్చు. అన్నంబును దేవఋషిపితృభూతంబులకు మొదట సమర్పించి తర్వాత బంధుజనులఁ దృప్తిచేసి శేషంబును గృహస్థు వినియోగింపనగు. అట్లుచేయునప్పుడు సర్వము భగవద్రూపమే యనుభావంబుతోఁ జేయవలయు. ధర్మతత్త్వవిదుఁడు శ్రాద్ధమందు మాంసంబును బెట్టఁడు; దానిఁ దినఁడు. హింసాత్మకాన్నంబుకంటె నీవారాద్యన్నంబునే శ్రాద్ధదేవతలు వరింతురు.

### హింసాతత్త్వము

హింస యనునది మానసికము వాచికము కాయికము అని త్రివిధంబు. ధర్మపరులు త్రివిధహింసను వర్జింపవలయు. ‘అహింసాపరమో ధర్మః’ అని శాస్త్రము ఘోషించుచున్నది. అహింసకన్న నుత్తమధర్మంబు గలుగదు. ఆ కారణంబున యజ్ఞవేత్తలైన జ్ఞానులు కర్మయజ్ఞంబులను వదలి నిష్క్రియులై జ్ఞానదీపితంబైన యాత్మసంయమ రూపయజ్ఞంబుఁ గావింతురు. భూతంబులు ద్రవ్యయజ్ఞపరులను జూచి ‘కటా! వీరు సుంతేనియు నాత్మతత్త్వంబును విచారింపరు. కరుణ యనునది వీరియందు వెదకినను గానరాదు. నిట్టనిలువునఁ బ్రాణంబులఁ బాపుదురు. మా ప్రాణంబులకు నెప్పుడు ముప్పు రానున్నదో గదా’ యని తీఱనిచింత మ్రందుచుండు. ధర్మము ప్రధానముగాని వస్తువు ప్రధానముగాదు. ప్రాప్తం బేదో యదే ధర్మయోగ్యం బగు. ఎవఁడు ప్రాప్తంబును సంతుష్టితో నిత్యనైమిత్తిక క్రియలందు వినియోగించునో యతఁడే ధర్మవిదుఁడు.

### అధర్మవిచారము

ధర్మజా! అధర్మం బెన్నఁడుఁ గూడదు. దానికి విధర్మ, పరధర్మ, ఆభాసధర్మ, ఉపమాధర్మ, ఛలధర్మంబు లని శాఖ లైదు గలవు. ఏది స్వధర్మహాని గావించునో యది విధర్మమగు; తనకుఁగూడ నిదియుఁ బరులకు యోగ్యమైనదియుఁ బరధర్మమగు. వేదవిరుద్ధమై పాషండాదులచేత నాచరింపఁబడునది ఉపమాధర్మం బగు. బాహ్యదృష్టికి ధర్మము వలెఁ దోఁచుచున్నదియు ధనార్థమై లోకంబును గనుమూసి దంభపూర్వ

కంబుగాఁ జేయఁబడునదియు శాస్త్రానుమతము గానిదియు స్వేచ్ఛాప్రమా ణంబైనదియు నగుకార్యము ఆభాసధర్మంబగు. ఛలధర్మంబునందు మోసగించుటయే పరమాభిప్రాయము. అది యర్థచ్ఛలంబని శబ్దచ్ఛలం బని ద్వివిధంబు. గోదానంబును బ్రకటించి చావనున్నగోవు నిచ్చి గోదాన ధర్మం బొనర్చితినిగదా యని భావించుట అర్థచ్ఛలంబగు. పదుగురుదాఁక భోజనం బిడుదునని చెప్పి యొక్కనికిఁ బెట్టి చెప్పినట్లుచేసితి ననుట శబ్ద చ్ఛలం బగు. ఈయేనింటినిఁ గలలోఁగూడఁ దలంపరాదు.

స్వ ధ ర్మ ప్ర భా వ ము

ధర్మజా! స్వభావవిహితధర్మము స్వధర్మమగు. అది తనశాంతికే గాక పరోపశాంతికిఁగూడ సమర్థంబగు. స్వధర్మంబు గావించి యది చాలదేమో యను భ్రాంతిచేతనేనిఁ బరధర్మం బాచరింపరాదు. అట్లు చేసినప్పుడు హితఫలంబు సిద్ధింపకపోవుటయేగాక విపరీతఫలంబుగూడ సంప్రాప్తమగు.

ధర్మార్థముగాని యాత్రాదులకుఁగాని స్వధనంబునే వినియోగింప వలయు. ధనము లేనినాఁడు మిన్నకుండనగు. అంతియగాని పరుల నెంత మాత్రం బర్థింపరాదు. దారిద్ర్యంబునఁజేసి ధర్మము చేయలేనివారిగతి యేమందువా? అతఁ డాత్మారాముని సేవింపనగు. అది కోటిధర్మంబుల పెట్టగు. వానికిఁ బూటగడచుట యెట్లందువా? అజగరచరిత్ర వినవా? నిత్యసంతుష్టునకు లోకమెల్ల శివమయంబే యగు. అట్టివాఁడు భోజ నము దొరకనినాఁడు దోసెఁడు నీరు ద్రావి తృప్తిచెందు. కృపణుఁ డెవఁ డందువా? జిహ్వోపస్థలసుఖంబుఁ గోరువాఁడే కృపణుఁడు. వానిగతి కుక్కగతి యగు.

ధర్మజా! లోభం బెవ్వానికి నెన్నఁడుఁ దగదు. కామక్రోధంబు లకు నంతము గలదుగాని లోభంబునకు మేరయే లేదు. ఎట్లందువా? కామం బనునది యన్నోదకాకృతినుండు. అన్నోదకంబులచేతఁ గాము ఖుత్పిపాసలు తీరుట వలన నశించు. క్రోధము హింసాత్మకమగు. వైరివధతోడ నది

చల్లారును. లోభంబునకు నంతంబు గానరాదు. దిగ్జయంబు గలుగుఁ గాక; సర్వలోకాధిపత్యము చేకూఱుఁగాక; లోభంబు తీఱదు. రాజా! బహుజ్ఞులును సంశయనివర్తకులును సభాసద్విభులు నని పేరుపడ్డపండితులు గూడ సంతుష్టిలేమిం జేసి యధఃపతితులై రనఁగా లోభశక్తిఁ జెప్పవల యునా? లోభఫలం బేమందువా? అసంతుష్టియు తేజోవిద్యాతపోయశస్సులకు హానిగలుగుటయు సద్యఃఫలంబు.

### కామాదిజయోపాయము

ధర్మజా! కామాదివైరులను జయించుట యెట్లందువా? సంకల్పత్యాగంబునఁ గామంబును, కామత్యాగంబునఁ గ్రోధంబును, దృశ్యమిథ్యాత్వజ్ఞానంబున లోభంబును, అద్వైతానుసంధానంబున భయంబును, ఆత్మానాత్మవివేకంబున మోహశోకంబులను, సత్సాంగత్యంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయలోకవార్తాదులను, దేహాద్యభిమానత్యాగంబున హింసను, కృపాపూర్వకహితాచరణంబున భౌతికదుఃఖంబును, సమాధివలన దైవికదుఃఖంబును, ప్రాణాయామాదిశక్తివలన దైహికదుఃఖంబును, సాత్త్వికాహారాదిసేవవలన నిద్రను, సత్త్వంబున రజస్తమస్సులను, ఉపశమంబున సత్త్వంబును గురుభక్తివలన సర్వంబును జయింపనగు.

### గురుభక్తిప్రభావము

ధర్మజా! గురుభక్తియం దంతప్రభావముగలదా? యని శంకింతువా? గురువు జ్ఞానదీపిక ననుగ్రహించును. జ్ఞానదీపిక నిచ్చువాఁడు సాక్షాద్భగవత్స్వరూపుఁ డగుఁగాని యేతన్మాత్రుఁడుగాఁడు. అంతటి వానిని లోకసామాన్యునిగాఁ దలంచుటకుఁ గారణ మేమందువా? అజ్ఞానమే కారణము. అట్లు తలంచినందులకు నిదర్శనంబుం గోరుదువా? నిదర్శనార్థంబు వెదుకఁ బనిలేదు. ఇదే నీమ్రోలనున్న శ్రీకృష్ణభగవానుఁడే నిదర్శనము. సాక్షాద్భగవంతునిఁ బ్రధానపురుషేశ్వరుని లోకైకగురువును వీనిని మనుష్యమాత్రునిగా భావించి వర్తించుట

నీకును స్పష్టమేగదా. ఈమహాత్ముఁడు సామాన్యులకు సామాన్యుఁడే రైనను యోగీశ్వరులకు ధ్యానమూర్తి యగు క్రియ గురువు వాని పుత్త్రాదులకు నరమాత్రుఁడేయైనను శిష్యులకు సాక్షాత్పరమాత్ముఁడేయగు.

## మో క్ష సా ధ న ము లు

ధర్మనందనా! మోక్షంబునకుఁ గామాదిజయంబును నియతేంద్రియత్వంబు నాత్మధ్యానపరత్వము సాధనంబులగు. శాస్త్రంబులు వల్లించినంతనే ఫలము లేదు. శాస్త్రము మార్గదర్శియగు.ఆమార్గంబునుబట్టి నడిచినఁగదా గంతవ్యంబుఁ జేరుదురు. కృష్యాదులు నిష్టాపూర్తాదులుఁ దగవా యని శంకింతువా ? కర్మంబు లెట్టివైనను గర్తకు బహిర్ముఖత్వంబును గలిగించి వానిని సంసారంబునఁ ద్రోయును. ఏనియమంబులు ధ్యానధారణ సమాధులఁ గూర్పనోపునో యవిమాత్రమే మోక్షసాధనంబు లగు.

## మ నో జ య ము

రాజా! మనస్సు చంచలా చంచలంబనియు దానిని నిలుపుట యెట్లనియు నడుగుదువా? బహిర్వస్తుసంయోగంబు గలిగినప్పుడు మనశ్చాంచల్యంబు గలుగు. ఆ సంయోగంబు గలుగకుండుటకై నిర్జనమైన ప్రదేశంబున నేకాకిగా నుండవలయు. ఆ ప్రదేశమందు సమస్థలంబును శుభ్రపఱచి స్థిరసుఖాసనంబును గల్పించుకొని వంకరలేకుండునట్లు కూర్చుండి ప్రణవపూర్వకంబుగా యోగనిష్ఠఁ బూని యథాప్రాప్త భిక్షాన్నంబుతో దేహధారణముచేయుచు వచ్చినచోఁ గాలక్రమంబున మనోమర్కటవ్యాపారంబులు శమించును.

## ప్రా ణా యా మ ప్ర కా ర ము

ధర్మజా! యోగారంభమునకుఁ బూర్వము ఘటశుద్ధి చేయవలయును. దానినే ప్రాణాయామ మందురు. అది రేచక కుంభక పూరకంబులని త్రివిధంబు. అట్లు ప్రాణాపానంబుల నిరోధించి నాసాగ్రంబును జూచుచున్నాడో యనునట్లు దృష్టిని నిలిపి యోగం బారంభింపవలయును. ప్రారంభంబున మనస్సు నిలుకడ చెందక పఱవసాగును. దాని

యిచ్చప్రకారము పోనీయవలయును. అది యట్లు పలుమారు యలసట జెంది మఱలి యథాస్థానముఁ జేరును. అప్పుడు దానిని బంధింపనగు. అవ్విధంబున నభ్యాసము చేయుచురాఁగాఁ గొంతకాలంబునకు నేకాగ్రత సిద్ధించును.

### మిథ్యాసన్న్యాసము

రాజా! గృహము ధర్మార్థకామంబులకు క్షేత్రంబగు. గృహమం దుండి యాయూఁటిని యథాశాస్త్రము సేవించుచుఁ గ్రమక్రమంబుగా వానిని సన్న్యసించుట క్రమసన్న్యాసమగు. అట్టిసన్న్యాసము స్థాయినై ముక్తిదాయకంబగు. అట్లు చేయక కేవల శాస్త్రజ్ఞానప్రేరితులో యాప ద్బాధితులో నై శ్మశానవైరాగ్యంబుఁ గాంచి గృహంబువిడిచి సర్వము సన్న్యసించినట్లు కొంతకాలముపుచ్చి మఱల గృహస్థు లగుదురు. అట్టివారివర్తనము కక్కినకూడు దినుటంబోలు. కార్యసాధనంబునకు యోగ్యతలేనినాఁడు దానికై పూనరాదు. పచ్చికాయఁ దెచ్చి పండ వేయ ఫలమగునా?

### నిషిద్ధత్యాగాదులు

రాజా! గృహస్థునకుఁ గర్మత్యాగంబును, వటువునకు వ్రతత్యాగం బును, వనస్థునకు గ్రామసేవాభిరతియు, యతికి నింద్రియపరత్వము నిషిద్ధ ములు. నిషిద్ధంబులను సేవించునట్టి యాశ్రమకులు రెంటఁజెడిన రేవడు లగుదురు.

### జ్ఞాని - దేహపోషణము

ధర్మజా! జ్ఞానియైనను దేహపోషణము వలదా యందురు. దేహ ధారణంబునకు దేహపోషణంబునకు భేదము గలదు. పోషణ శబ్దమందు భోగభావము గర్భితముగా నున్నది. భోగమన్నంతనే తలంచినవెల్ల సంతరించి యనుభవించుట యగు. దానికి నాద్యంతంబులు గలుగవు. మఱియు దేహాత్మభావంబు దాని నంటియుండు. ఆభావము గలవాఁడు జ్ఞాని కానేరఁడు. జ్ఞానిశబ్దంబునకు నర్థమేమి? దేహము వేఱు, ఆత్మ వేఱనియు; ఆత్మకు జననమరణంబులుగాని యిచ్ఛాక్రియలుగాని లేవ

నియు, దేహంబనునది ప్రారబ్ధకర్మఫలము దానిభోగార్థము నిర్మించిన ఘటం బగుననియు, భోగానంతరము దేహము నిలువదనియు నిశ్చయ భావము గలిగి, యాదేహధారణంబునకుఁ దగినమాత్రము కూర్చుచు భావంబు నాత్మయందే యుంచువాఁడు జ్ఞానియగు. అట్టివాడు ప్రాప్త ముతో సంతుష్టుఁడగు. అంతియగాని యతఁడు పదార్థసేకరణక్రియా పరుఁడై తత్ఫలంబుగాఁ విషయవాసనావశుఁడు గాఁడు.

జీవుని విజయయాత్ర

ధర్మజా! శరీరంబును రథంబునకు ధర్మాధర్మాభిమానంబు లను చక్రంబుల రెంటిఁ దగిలించి, దశవిధప్రాణరూపమైన యక్షంబును గూర్చి, యింద్రియంబులను గుఱ్ఱంబులఁ బూన్చి బుద్ధిని సారథిగా నియమించి కళ్లెంబునుబట్టి చిత్తంబును బెనుబంధముగాఁ జేసి, ప్రణవధనుర్ధరుఁడై శుద్ధజీవుని శరంబుగా సంధించి జీవుఁడు తద్రథంబు నధిష్ఠించి పరబ్రహ్మం బును లక్ష్యముగాఁ జేసి, శబ్దాదివిషయజయరూపమైన గంతవ్యస్థానంబు నకుఁ దరలుననియు, ఆజీవుని రజస్తమస్సత్త్వప్రకృతులు రాగద్వేష లోభశోకమోహభయమదమానావమానాసూయలు మాయాహింసా మత్సరరజఃప్రమాదక్షున్నిద్రలు మున్నగు పరివారంబుతో మార్గమధ్య మందు నడ్డగించుననియు, అతఁ డప్పుడు భగవద్బలంబు నాశ్రయించి, జ్ఞానఖడ్గంబుచేత వైరుల నడంచి గంతవ్యంబును జేరి యాత్మానందపీఠి నధి ష్ఠించి యుపశాంతుఁడై రథాదిసకలపరికరంబులను వదలివైచుననియు బుధులు వచింతురు. రథికుఁడు జాగరూకుఁడు గాఁడేని, వానిసారథి యస ద్బుద్ధివశుఁడగు; రథ్యంబులు నసదింద్రియపరంబులగు. సారథియు నశ్వం బులు నాజ్ఞకు లోఁబడక తప్పుదారిఁ ద్రొక్కి విషయశత్రువులకు నప్ప గింతురు. ఆశత్రువులు జీవుని వానిపరికరంబులతోడ వశపఱచికొని పట్టి సంసారకూపంబునఁ ద్రోయుదురు.

కర్మ విభాగములు

ధర్మజా! కర్మము వైదికంబనియు లౌకికంబనియు రెండువిధములు. లౌకికంబు జీవికావృత్తిరూపం బగు. వైదికంబు మఱలఁ బ్రవృత్తము నివృ

త్తము నని రెండువిధములు. ప్రవృత్తము పునరావృత్తికిని నివృత్తం బమృతంబునకుఁ గారణంబు లగు. ప్రవృత్తము మఱల నిష్టము పూర్తము నని రెండువిధంబులు. శ్యేనాదిహింసకర్మంబును, ద్రవ్యమయకర్మంబును, కామ్యకర్మంబును, ఆసక్తిపూర్వకాగ్నిహోత్రాదికంబును, దర్శపూర్ణ మాసంబులును, చాతుర్మాస్యంబును, పశుయజ్ఞంబును, సోమయాగంబును, వైశ్వదేవంబును, బలిహరణంబును ఇష్టరూపకర్మంబు లగు. దేవాలయ వనకూపతటాకాదినిర్మాణంబులు పూర్తరూపకర్మం బగు.

### జీవుని ప్రయాణమందలి మజిలీలు

రాజా! ప్రతికర్మంబునకు ఫలంబు గలుగుననియు, ఫలకాంక్షతోఁ గర్మంబును జేసినప్పుడు తత్ఫలంబును గర్త యనుభవింపక తప్పదనియుఁ దెలిపితిని. ఫలంబులు చిత్రవిచిత్రంబులుగా నుండు. ఫలంబునుబట్టి యనుభవవిధానంబును బహుగతుల నుండు. అనుభవంబునకుఁ దగినస్థాన ములుగూడఁ గలవు. ఆస్థానంబులను జేరుటకు నడుమ మజిలీ లుండు. ఒక్కొక్కమజిలీకి నొక్కొక్కయధిదేవత నియమింపఁబడెను.

పురోడాశాది ద్రవ్యయజ్ఞఫలంబును గోరినజీవుఁడు స్థూలశరీరం బును వదలినవెంటనే లింగశరీరము దాల్చి ధూమాంతర మను మజిలీ చేరును. అందున్నయధిదేవత యాజీవుని వెంటఁగొనిపోయి రాత్ర్యధి దేవతకు నప్పగించును. అయ్యధిదేవత వానినందుండి తరలించి కృష్ణ పక్షాధిదేవతకు నప్పగించును. ఆదేవత మఱల వానినందుండి తరలించి దక్షిణాయనాధిదేవతకు నప్పగించును. ఆదేవత వానిని సోమలోకంబుఁ జేర్చు.

### జీవుని పునర్జన్మము

జీవుఁ డచ్చటఁ దా ననుభవింపవలసిన భోగఫలంబుల ననుభవిం చును. భోగానుభవము తీఱినంతనే వాని లింగశరీరము నశించును. అతఁడు కేవలసూక్ష్మశరీరముతో నుండు. ఆశరీరము వర్షముతోడ భూమికి వచ్చి యోషధులను వీరుధాదులను జేరును. జీవుఁడు వాని కర్మఫలాను

సారంబుగా నెట్టియుపాధిని గ్రహింపవలసియున్నదో యట్టియుపాధి గల తలిదండ్రులు నరులొండెఁ బశుపక్ష్యాదులొండె నయ్యోషధులను భుజించుటగు. ఓషధు లట్లు భుక్తములై తదుపాధులందు రక్తరూపంబుఁ దాల్చి రేతస్సుగా మాఱి పిండాకృతివహించి యథాకాలంబున బహిర్గత మగు. రాజా! పురోడాశాదిద్రవ్యఫలంబు లట్లు పరిణామమొంది దేహాంతరారంభకము లగుచున్నవి.

### నివృత్తిపరజీవుల ప్రయాణము

రాజా! నివృత్తిపరులయింద్రియంబులు జ్ఞానదీపితంబులై యుండు. ఆజ్ఞానశక్తిబలంబున వారు తమయింద్రియంబులను సంకల్పాత్మకమనంబు నందు లయింతురు. మనస్సు వికారాత్మకము. దానిని విద్యాలక్షణమైన వాక్కునందును దానిని వర్ణసమామ్నాయమందును దానిని సర్వాత్మకంబైన ఓంకారమందును దానిని బ్రాణమందును లయింపఁజేయుదురు. ప్రాణము సూత్రాత్మ యనఁబడు. సూత్రాత్మను బ్రహ్మమందు సమన్వయింతురు.

అనంతరము జీవుఁడు శరీరంబును వదలి యగ్నిదేవతను జేరు. ఆ దేవత యాజీవుని సూర్యాభిమానిదేవతకు, అది యహరభిమానిదేవతకు, అది పూర్వాహ్ణాభిమానిదేవతకును జేర్చును. అట్లాజీవుఁడు శుక్లపక్ష పూర్ణిమోత్తరాయణాభిమానిదేవతలను గ్రమముగా గడచి బ్రహ్మలోకము చేరును. తర్వాత బ్రహ్మతోడ ముక్తిఁ గాంచు.

### శరీరత్రయము

రాజా! శరీరము స్థూలము సూక్ష్మము కారణము అని మూఁడు విధములు. ఆమూఁడు నొండొంటిలో నిమిడియుండు. స్థూలశరీరంబును విశ్వుఁడనియు సూక్ష్మశరీరంబును తైజసుండనియు, కారణశరీరంబును ప్రాజ్ఞుఁడనియు వచింతురు. స్థూలము సూక్ష్మమందు లయించు; సూక్ష్మము కారణమందు లయించు. అనఁగా నేమందువా? ప్రాణంబు వెడలినంతనే స్థూలమువదలిశక్తులు సూక్ష్మంబును జేరును. స్థూలము శవాకారంబున

నందే పడియుండును. దానికి సమానక్రియాదు లావర్తును. సూక్ష్మము ప్రయాణమై పోవును. అది కొంతసవ్వ చని తర్వాతఁ బోవుటకు నోపమిం జేసి తనశక్తులను గారణంబులో లయింపఁజేసి తాను నశించును. ఆకారణము కర్మభోగంబులనుభవించి పునర్జన్మంబునకు సంకేతమగుచున్నది. (ఈవిషయమున మతభేదములు గలవు). నివృత్తిమార్గపరులకారణశరీరము సాక్షిస్వరూపంబున నున్న తురీయమందు లయించును. తురీయమే యాత్మఁ డనఁబడు. అట్టియాత్మఁడు స్వస్వరూపంబున నుండుటయే ముక్తి యనఁబడు.

## యానద్వయము

రాజా! ప్రవృత్తిపరులమార్గము ధూమాదియానంబనియు, నివృత్తిపరులమార్గంబు అగ్న్యాద్యధికంబనియుఁ దెలిపితి. ధూమాదియానంబును పితృయానంబనియు, రెండవదానిని దేవయానంబనియుఁ జెప్పుదురు. ఈరెంటిని వేదము బోధించుచున్నది. ఆరెంటిని శాస్త్రదృష్టిచేతఁ బరిశీలించినవాఁడు దేహస్థుఁడయ్యు మోహావశుఁడు గాఁడు. కారణ మేమందువా? జ్ఞానమే కారణము. జ్ఞానకార్య మేమందువా? సర్వవ్యాపియై యాత్మఁ డుండు. వాని బింబంబు శరీరాంతరంబునందుఁ బ్రతిఫలించినప్పుడు తత్ప్రతిబింబంబును జీవుఁ డందురు. ప్రతిబింబంబునకు స్వతస్స్థితి గలుగదు. ఈరహస్యంబును జ్ఞానము బోధించును. మఱియు నింద్రియార్థంబులెల్ల నాభాసమాత్రంబులే గాని పరమార్థంబులు గావని జ్ఞానబోధచేతనే స్పష్టమగు.

రాజా! వృక్షంబును నిదర్శనంబుగా గ్రహించుదము. వృక్షంబు పంచభూతంబులవలన నేర్పడుచున్నది. వృక్షమున్నపుడు దానినీడ యుండు. ఆనీడయొక్క తత్త్వమేమి? అది పంచభూతసంఘాతంబుగాని, తద్వికారంబుగాని, తత్పరిణామంబుగాని, తద్భిన్నంబుగాని, తదన్వితంబుగాని యేదియుఁ గాదు. అట్లే దేహాదికముగూడనగు. అనఁగా నయ్యది మృషాభూతంబగుచు పంచభూతంబులన్న నో యవి సావయవంబులు; అనఁగా

మహాసూక్ష్మంబులైన యవయవంబులచేత నేర్పడును. అవయవంబులు లేనిచో అవయవి గలుగఁడు. అవయవి యున్నప్పు డవయవంబు లుండక తప్పదు.

## భ్రాంతికారణము

రాజా! సాదృశ్యంబునుబట్టి భ్రాంతి కలుగుచున్నది. పూర్వము చూచిన వస్తురూపంబును వేఱొకవస్తువునందు నారోపించుట సాదృశ్యమగు. ఈభ్రాంతి యవిద్యాఫలము. అవిద్య నశించినప్పు డది తోడ్తోడ నశించుచున్నది. జగత్తు అనునది భ్రాంతిఫలము గావున దానిని మిథ్య యందురు.

సర్వము మిథ్య యగునేని విధినిషేధశాస్త్రంబులగతి యేమందువా? స్వప్నావస్థను నిదర్శనంబుగా గ్రహించుదము. స్వప్నమే మిథ్యయగు. ఆస్వప్నములోనే మఱియొకస్వప్నంబును జాగరణంబుఁ గలుగుచున్నవి. మిథ్యయైనస్వప్నములో మఱల స్వప్నజాగరణావస్థ లెట్లు గలుగుచున్నవో యట్లే మిథ్య యగుజగత్తులో నిదివిధి యనియు నిది నిషేధంబనియు శాస్త్రము బోధించుచున్నది.

## అద్వైతభావశాఖాత్రయము

రాజా! 'ఏకమేవ అద్వితీయ' మన్నప్పుడు భగవానుఁడు దక్క వేఱొండు గలుగదని భావము. దీనినే అద్వైత భావమందురు. అది భావాద్వైతంబనియు, క్రియాద్వైతంబనియు, ద్రవ్యాద్వైతంబనియుఁ ద్రివిధము. వస్తువునందు భేదబుద్ధి లేకుండుట భావాద్వైతము. నూలు దారములతో గుడ్డ నేయఁబడు. దారములు కారణము గుడ్డ కార్యంబునగు. గుడ్డ యేర్పడినతర్వాతఁ గారణకార్యంబు లేకమై యొక్కరూపంబగు. అట్లే ప్రపంచము వేఱు తత్కర్త వేఱని ముందుఁ దలంతుము. లోతుగా విచారించినప్పుడు వాని వేఱుభావము పోయి రెండు నొక్కరూపంబగు. అనఁగాఁ బ్రత్యేకభావంబులు నశించి యేకభావం బేర్పడుట భావాద్వైతమగు. అధికారిభేదమునఁ గర్మభేదంబు గలుగునని భావింప

కుండుట క్రియాద్వైతము. కర్మంబులెల్ల మనోవాక్కాయంబుల చేత జరుగుచుండు ననియు ఆత్మ ప్రేరేపించుచుండుననియుఁ దలంపక సర్వము సాక్షాత్పరబ్రహ్మమందు సమర్పించుట క్రియాద్వైతము. సత్కర్మంబు లొనర్చి సాధించు ఫలంబులెల్ల నాత్మైకభోగ్యంబను బుద్ధి లేకుండుట ద్రవ్యాద్వైతము. తనదేహం బెట్లో యట్లే సర్వప్రాణుల దేహంబులుఁ బంచభూతాత్మకంబులనియు భోక్త యాపరమాత్మయే యనియు నాలోచించి యెల్లరయర్థ కామంబుల నేకరూపంబునఁ జూచుట ద్రవ్యాద్వైతము. ఆత్మతత్త్వానుసంధానంబున నిట్టి యీ భేదబుద్ధులు నశించును.

### క్రియాసమయవివక్ష

ధర్మజా! ఆపత్సమయంబులందు స్వకర్మంబును మాని పరకర్మంబును జేయవలసినట్లు తటస్థించును. అప్పుడుగూడ నరుఁ డిచ్చవచ్చినట్లు వర్తింపరాదు. ఏకర్మం బెందు నెవ్వనికి నిషిద్ధముగాదో దానినిమాత్రమే చేయనగు. అట్లు చేయునప్పుడుగూడ భగవత్పరబుద్ధితోనే చేయవలయు. అది దోషము గానేరదు.

ధర్మజా! ధర్మాచరణనిష్ఠయు భగవద్భక్తియుఁ గలిగినప్పుడు దుస్తరంబులుగూడ సుసాధ్యంబు లగుటయేగాక శుభఫలంబు తప్పక సంప్రాప్తమగు. మీరు పదరానియాపదలఁ బాలయ్యు దిగ్విజయం బొనర్చి రాజసూయయాగంబుఁ జేయనోచుటకు మూలకారణం బేమి? మీస్వధర్మనిష్ఠయు భగవద్భక్తియు నివి రెండేగదా మూలకారణంబులు.

ధర్మనందనా! గృహస్థుఁడు సన్న్యాసిపడయుసద్గతిని బొందుటకు నెట్లు వర్తింపవలయునో చెప్పితిని. ఆధర్మంబుల ననుష్ఠించుగృహస్థునకుఁ గళ్యాణము సిద్ధము. కాఁబట్టి వేఱుచింతలు మాని మీరు మీస్వధర్మ నిష్ఠులై వర్తింపుఁడు.

ఎవ్వఁడు లోకైకధ్యేయుం డగునో, ఎవ్వఁడు మానుషవేషంబున మీయింటఁ బ్రచ్ఛన్నగతి నుండుటంజేసి మీకడకు మహామునులు

గూడ నిరంతరము వచ్చుచుం బోవుచుండు టయ్యెనో, ఎవ్వనికారణం బున మీ కట్టిపరమసేవాభాగ్యంబు గలిగెనో, ఎవ్వనిరూపనామక్రియలు ముక్కంటికిఁగాని వలువకుఁగాని గోచరంబులు కావో, యాపరమాత్ముఁడు మీకుఁ బ్రియుండును సుహృత్తును మాతులసుతుండు గురువు నాజ్ఞాకరుండు నై నప్పుడు మీకంటె భాగ్యవంతు లుందురా? సాత్వతపతి నాయెడం బ్రసన్నుఁ డగుఁగాక !

పరీక్షిన్నరేంద్రా ! ధర్మజుఁడు నారదవచనంబులకు మహాశ్చర్యా నందంబులంది వాసుదేవునిఁ బూజించెను. అంతట నారదుఁడు కృష్ణుని ధర్మజుని వీడ్కొని చనియెను.

మునులారా ! శుకమహర్షి యట్లు దేవాసురమనుష్యాది సకల చరాచరప్రపంచప్రవర్తకంబులైన దక్షకన్యావంశంబులను బరీక్షిన్నరేంద్రునకు వివరించి వానికిఁ బ్రీతిఁ గూర్చెను.

సప్తమస్కంధము సంపూర్ణము.



శ్రీరస్తు

# శ్రీ దొడ్డభాగవతము

## అష్టమస్కంధము

మునులారా! పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుని 'మహాత్మా! స్వాయంభువ మనువంశంబును, చాతుర్వర్ణ్యధర్మంబులను విశ్వసృష్టివిశేషంబును వినిపించితిరి. ఈకల్పంబున నెన్నిమన్వంతరంబు లుండు? ఇప్పటికి నెన్నిమన్వంతరంబులు గడచెను? ఇప్పు డేమన్వంతరము జరుగుచున్నది? ఏయేమన్వంతరమందు భగవానుం డేయేయవతారంబు లెత్తి యేయే కార్యంబు లొనర్చె? వానినెల్ల వినం గుతుకం బగుచున్న'దని యడిగెను. వానికి శుకమహర్షి యిట్లనియె.

'రాజేంద్రా! కల్ప మనంగా బ్రహ్మకు నొక్కపగ లగు. ఆకాలము లోపలం బదునాల్గుమన్వంతరంబులును మన్వంతరసంధియుగంబులు పదునైదును గడచును. ఇవియన్నియుం గలసి వేయిమహాయుగంబు లగు. 1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస. 5. రైవత, 6. చాక్షుష, 7. వైవస్వత, 8. సావర్ణి, 9. దక్షసావర్ణి, 10. బ్రహ్మసావర్ణి, 11. ధర్మసావర్ణి, 12. భద్రసావర్ణి, 13. దేవసావర్ణి, 14. ఇంద్రసావర్ణి, యను వారు మనువు లగుదురు. ఈకల్పంబున నిప్పటికి నాఱుమన్వంతరంబులు చని యేడవమన్వంతరము వైవస్వతమనునది ప్రవర్తిల్లుచున్నది. వైవస్వతములో నిప్పటికి 27 మహాయుగంబులు చని 28-వ మహాయుగములో సత్యత్రేతాద్వాపరంబులు గడచి కలియుగంబు ప్రారంభమై జరుగుచున్నది.

భగవానుండు స్వాయంభువమన్వంతరమందుం గపిలావతారమును యజ్ఞావతారము రెండు ధరించెను; స్వారోచిషమన్వంతరమందు విభువను

నవతార మెత్తెను; ఉత్తమమన్వంతరమందు సత్యసేనావతారంబును, తామసమన్వంతరంబున హర్యవతారంబును, రైవతమన్వంతరంబున వైకుంఠావతారంబును, చాక్షుషమన్వంతరంబునఁ గూర్మావతారంబును, వైవస్వతమన్వంతరంబున వామనావతారంబును ధరించెను. ఇఁక జరుగ నున్న సావర్ణిమన్వంతరంబున సార్వభౌమావతారంబును, దక్షసావర్ణి మన్వంతరంబున ఋషభావతారంబును, బ్రహ్మసావర్ణిమన్వంతరంబున విశ్వ స్పృడవతారంబును, ధర్మసావర్ణిమన్వంతరంబున ధర్మసేవ్యవతారంబును, భద్రసావర్ణిమన్వంతరంబున సత్యతాపసావతారంబును, దేవసావర్ణిమన్వం తరంబున దైవహోత్రావతారంబును, ఇంద్రసావర్ణిమన్వంతరంబున బృహ ద్భానువతారంబును గలుగును.

### 1. స్వాయంభువమనువు - అవతారకార్యములు

రాజేంద్రా! స్వాయంభువమన్వంతరమందు భగవానుఁడు దేవ హూతీగర్భంబునఁ గపిలుఁ డను పేర జనించి ధర్మజ్ఞానంబులను లోకంబు నకు నుపదేశించెనని తెలిపితిని.

### యజ్ఞావతారము

నరేంద్రా! స్వాయంభువమనువు పెద్దయుం గాలము రాజ్యమేలి కామభోగవిరక్తుఁడై రాజ్యత్యాగంబు గావించి భార్యయైన శతరూప తోడ వెడలి తపోవనముఁ జేరి సునంద చెంత నొంటికాలనిలిచి తీవ్రతపంబుఁ బూని సమాధినిష్ఠుఁడై, 'ఎవ్వఁడు సర్వశరీరంబులలో ననన్యగోచరుండై యుండునో, ఎవ్వనివలన విశ్వంబునకుఁ జైతన్యంబు గలుగుచున్నదో, ఎవనికి నన్యంబువలనఁ జైతన్యము గలుగదో, జగంబెల్ల నిద్రావివశం బై నప్పుడుగూడ నెవఁడు తానుమాత్రము మేల్కొనియుండునో, ఎవ్వఁడు నిరంతరము రక్షించుచుండునో, అట్లున్నను జగం బెవ్వని నెఱుంగదో, ఎవ్వని సత్తాచైతన్యంబులు జగద్రూపంబున వ్యాప్తిఁ గాంచెనో, ఎవనికి నాద్యంతంబులుగాని స్వపరభేదంబులుగాని బహిరంతరంబులుగాని గలు గవో, ఎవ్వఁడు తానే విశ్వకర్తయు విశ్వశరీరుండునయ్యు నిరీహుండుగా

నుండునో, ఎవనిమార్గంబును బ్రోక్కి ఋషులు స్వధర్మంబుల నైష్కర్మ్య బుద్ధి నాచరించి కర్మముక్తులై తద్ర్రహస్యంబును లోకంబునకుఁ జూపిరో, ఎవ్వఁడు పరిపూర్ణుఁడును నిష్కాముఁడు నై లోకమార్గదీపికార్థం బవత రించి స్వధర్మంబును స్వయముగా నడపి నడుటకు పర్వధర్మశిక్షకుఁ డయ్యెనో, ఎవఁ డనుగ్రహించినవాడెయో యంతలోఁ వ్యక్తిపడవల యునో యాసర్వరక్షకుని ఋషభుని నరంతనామకుని గొలుతు' నని మంత్రోపనిషద్వచనంబులఁ బల్కుచు పూతేం ద్గుండెను.

అ త్తఱి నసురులును యాతుధానులును క్షుధార్తులై సమాధి నిష్ఠనున్న స్వాయంభువును భక్షింపవచ్చిరి. భగవానుఁడు వారి దుష్ట భావంబుఁ జూచి యాకూతి గర్భంబున యజ్ఞమూర్తియై జనించి నిజసుతు లైన యామాదులతోడ నటకు వచ్చి యాదుష్టులను సంహరించి త్రిది వంబుఁ బరిపాలించెను.

### సప్తఋష్యాదులు

రాజేంద్రా! ప్రతిమన్వంతరమందు ఋష్యాదులు వేలువేలు వారుగా నుందురు. స్వాయంభువ మనువుగా నున్నప్పుడు ప్రియవ్రతో త్తానపాదులు మనుసుతులుగాను యామాదులు దేవతలుగాను మరీచి ప్రముఖులు సప్తర్షులుగాను బరగిరి. భగవదవతారమైన యజ్ఞుఁడు దేవేంద్రుఁడుగా నుండెను.

### 2. స్వారోచిషమనువు - విభువుయొక్క యవతారము

నరేంద్రా! అగ్నికుమారుఁడు స్వారోచిషుఁడు రెండవమను వయ్యెను. వానికి ద్యుమంత, సుషేణ, రోచిష్మంతులు మువ్వురు పుత్త్ర లుగా నుండిరి. ఊర్జస్తంభాదులు సప్తర్షులుగా, తుషితాదులు సురలుగా రోచనుం డింద్రుఁడుగా నైరి.

ఆమనుకాలమందు భగవానుఁడు వేదశిరస్సునకుఁ దుషిత యను భార్యవలన విభుఁ డనుపేర నవతరించి కౌమారబ్రహ్మచారియై యెనుబది యేవేలమునులవలనఁ దద్వ్రతంబు నాచరింపఁజేసి దానిని నెలకొల్పెను.

### 3. ఉత్తముఁడు - సత్యసేనావతారము

రాజా! ప్రియవ్రతునకు నుత్తముఁ డనుసుతుఁ డుదయించి మూఁడవమను వయ్యెను. వానికిఁ బావనుఁడు సృంజయుఁడు యజ్ఞహోత్రుఁడు ననువారు పుట్టిరి. ఆమనుకాలంబున వసిష్ఠుని సుతులు ప్రమదాదులు సప్తర్షులైరి. సత్యదేవశ్రుతభద్రులు దేవతలుగా సత్యజితుఁ డింద్రుఁడుగా నుండెను.

ఉత్తముని కాలంబున యక్షరాక్షసులు దారితప్పి యసత్యవ్రతులును దుశ్శీలురును దుర్వర్తనులునైరి. భూతగణంబు భూతద్రోహంబు సేయసాగెను. అప్పుడు భగవానుఁడు ధర్మునకు సూనృతయందు సత్యసేనుఁ డనుపేర నవతరించి సత్యవ్రతం బనుష్ఠించి సత్యజిత్తును సఖునిగాఁ జేసి యాదుష్టులనెల్లర హరించెను.

### 4. తామసుఁడు - హరియవతారము

రాజా! ఉత్తమునకుఁ దామసుం డనుభ్రాత యుండెను. అతఁడు నాల్గవమను వయ్యెను. వానికి వృషాఖ్యాతి, నరుఁడు, కేతువు మొదలైనవారు పదుగురుపుత్రులు జనించిరి. త్రిశిఖుఁ డింద్రుఁ డయ్యెను; జ్యోతిర్వ్యోమాదులు సప్తర్షులైరి. తొల్లి వేదము నశించినప్పుడు విధృతితనయులు వైధృతులు తమతేజంబున దానిని ధరించిరి. వా రిప్పుడు సురలైరి. ఈతామసునిమన్వంతరమందు భగవానుఁడు హరిమేధసునకు హరిణియందు హరి యనుపేర నవతరించి మకరగ్రస్తుఁడై చావనున్న గజేంద్రుని రక్షించెను.

### 5. రైవతుఁడు - వైకుంఠావతారము

రాజేంద్రా! తామసునకు రైవతుఁ డనుభ్రాత యుండెను. అతఁడైదవమను వయ్యెను. వానికి నర్జునప్రతివింద్యాదులు సుతులైరి. విభుఁ డింద్రుఁ డయ్యెను. భూతదయాదు లమరులైరి. హిరణ్య, రోమ, వేదశిర, ఊర్ధ్వబాహుప్రముఖులు సప్తర్షులైరి.

ఆమన్వంతరంబున భగవానుఁడు శుభ్రుఁ డనువానికి వికుంఠయందు వైకుంఠ లనుసురోత్తములతోఁడ నిజాంశంబున వైకుంఠుఁ డను

పేర నవతరించెను. వైకుంఠంబును నిర్మింపుమని వానిని రమాదేవి ప్రార్థించెను. భగవానుఁ డట్లే గావించి యామెకుఁ బ్రియం బొనర్చెను.

### 6. చాక్షుసుఁడు - కూర్మావతారము

చక్షుస్సునిపుత్త్రుఁడు చాక్షుసుఁ డాఱవమను వయ్యెను. వానికిఁ బురువు, పురుషుఁడు, సుద్యుమ్నుఁడు మున్నగువారు తనయులైరి. మంత్రద్యుమ్నుఁ డింద్రుఁ డయ్యెను. ఆప్యాదులు సురలైరి. హవిష్మద్వీరకాదులు సప్తర్షు లైరి.

ఆమన్వంతరంబున భగవానుఁడు వైరాజునకు సంభూతియందు నజితుం డనుపేర నవతరించెను. ఈ మనుకాలంబున క్షీరసాగరమథనంబు సంభవించెను. ఆపాలకడలిని దచ్చుటకై మందరగిరినిఁ గవ్వముగా సంతరించిరి. ఆపర్వతము దానిబరువునకుఁ గ్రుంగసాగెను. అప్పుడు భగవానుఁడు కూర్మమై యామంథానపర్వతంబును మూఁపున నిల్పెను. దేవతలు దుగ్ధాబ్ధిని దచ్చిరి. అందుండి యమృతం బుద్భవించెను. ఆసుధను భగవానుఁడు సురల కిచ్చెను.

### 7. వైవస్వతుఁడు - వామనావతారము

రాజా! వివస్వంతునిపుత్త్రుఁడు వైవస్వతుఁ డేడవమను వయ్యెను. వానికి శ్రాద్ధదేవుఁ డనునామాంతరము గలదు. వానిమన్వంతరం బిప్పుడు జరుగుచున్నది.

వానికి ఇక్ష్వాకుఁడు, నృగుఁడు, ధృష్టుఁడు, శర్యాతి, నరిష్యంతుఁడు, నాభాగుఁడు, దిష్టుఁడు, కరూశుఁడు, పృషధ్రుఁడు, వసుమంతుఁడు అనువారు పదిమందిపుత్త్రులు. పురందరుఁ డింద్రుఁ డయ్యెను. వసువు, రుద్రుఁడు, ఆదిత్యుఁడు, విశ్వేదేవుఁడు, నాసత్యుఁడు, మరుత్తు అనువారు సురలైరి. కశ్యపుఁడు, అత్రి, వసిష్ఠుఁడు, విశ్వామిత్త్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, భరద్వాజుఁడు సప్తర్షు లైరి. భగవానుఁడు కశ్యపునకు నదితియందు వామనరూపంబు ధరించి యవతరించెను.

8. సావర్ణి - సార్వభౌమావతారము

రాజా! విశ్వకర్మకు సంజ్ఞఛాయ యనుసుతలు జనించి వివస్వంతునకు భార్యలైరి. వానికి బడబయను మూడవభార్య గలదని చెప్పుదురు. సంజ్ఞకు యముఁడు యమియు శ్రాద్ధదేవుఁడును జనించిరి. ఛాయకు సావర్ణియుఁ దపతియు శనైశ్చరుఁడును గలిగిరి. బడబకు నశ్వినులుదయించిరి. సావర్ణి యెనిమిదవమనువగు.

సావర్ణికి నిర్మోహవిరజస్కాదులు పుత్త్రులగుదురు. సుతపసులు విరజులు అమృతప్రభులు సురలుగా, విరోచనసుతుఁడు బలి యింద్రుఁడుగా నుందురు. గాలవుఁడు, దీప్తిమంతుఁడు, పరశురాముఁడు, అశ్వత్థామ, ఋశ్యశృంగుఁడు, నాతండ్రియైనబాదరాయణుఁడు సప్తర్షులగుదురు. వీరెల్లరు నిప్పుడాత్మయోగనిష్ఠులై వారివారియాశ్రమంబులందున్నారు.

ఆమన్వంతరమందు హరి వేదగుహ్యుఁడైన సరస్వతియందు సార్వభౌముఁడనుపేర నవతరించి యింద్రపదంబును బురందరునుండి తీసి బలికి నిచ్చును. తొల్లి భగవానుఁడు వామనమూర్తియై బలిచక్రవర్తిని మూఁడడుగులనేలను గోరెను. బలి వానికి భూలోకంబునెల్ల నొసంగెను. ఆమహాఫలదానంబుగా బలికి నింద్రలోకపదవి రానున్నది. బలి యిప్పుడు సుతలంబున నున్నాఁడు.

9. దక్షసావర్ణి - ఋషభావతారము

వరుణుని పుత్త్రుఁడు దక్షసావర్ణి తొమ్మిదవమనువగు. ధృతకేతువు, దీప్తికేతువు మున్నగువారు వానికిఁ బుత్త్రులగుదురు. పరమరీచి గర్గాదులు సురలుగా, అద్భుతుఁడింద్రుఁడుగా, ద్యుతిమంతాదులు సప్తర్షులుగా నుందురు. ఆయుష్మంతునకు నంబుధారవలన ఋషభుఁడనుపేర భగవానుఁ డవతరించి యద్భుతునకుఁ ద్రైలోక్యలక్ష్మిని గూర్చు.

10. బ్రహ్మసావర్ణి - విశ్వసృడవతారము

ఉపశ్లోకునిసుతుఁడు బ్రహ్మసావర్ణి పదియవమనువగు. వానికి భూరిషేణుఁడు మున్నగువారు పుత్త్రులగుదురు. విబుధాదులు సురలుగా,

శంభుఁ డింద్రుఁడుగా, హవిష్మంతుఁడు మున్నగువారు సప్తర్షులుగా నుందురు. భగవానుఁడు వాని యంశాంశంబున విశ్వసృజునకు విషూచి యందు జనించి యింద్రుఁడుగా నుండు. శంభునకు శక్తినిఁ గూర్చు.

### 11. ధర్మసావర్ణి - ధర్మసేతునామావతారము

ధర్మసావర్ణి పదునొకండవమను వగు. వానికి సత్యధర్మాదులు పది మంది సుతు లుదయింతురు. విహంగమాదులు సురలుగా, వైధృతుఁ డింద్రుఁడుగా, అరుణాదులు సప్తర్షులుగా నుందురు. భగవానుఁడు నిజాంశంబున సూర్యునకు ధర్మసేతు వనుపేర జనించి వైధృతునకుఁ త్రైలోక్యసామ్రాజ్యంబు నిచ్చును.

### 12. భద్రసావర్ణి - సత్యతాపసావతారము

భద్రసావర్ణి పండ్రెండవమనువగు. వానికి దేవమతాదులు కుమారు లగుదురు. ఋతధాముఁ డింద్రుఁడుగా, వరితాదులు సురలుగా, తపోమూర్త్యాదులు సప్తర్షులుగా నుందురు. భగవానుఁడు సత్యతపస్సునకు సూనృతయందు నిజాంశంబున నవతరించి సత్యతాపసుఁ డనుపేరఁ బరఁగి యామన్వంతరంబును సాధించును.

### 13. దేవసావర్ణి - దైవహోత్ర్యవతారము

దేవసావర్ణి పదుమూఁడవమను వగు. వానికి విచిత్రసేనాదులు సుతు లగుదురు. సుకర్మాదులు సురలుగా, దివస్పృతి యింద్రుఁడుగా, నిర్మోహతత్త్వదర్శనాదులు సప్తర్షులుగా నుందురు. భగవానుఁడు దేవహోత్రునకు బృహతియందు దైవహోత్ర యనుపేర జనించి దివస్పృతికి సంపదఁ గూర్చు.

### 14. ఇంద్రసావర్ణి - బృహద్భాన్వవతారము

ఇంద్రసావర్ణి యీకల్పంబునకుఁ గడపటిమను వగు. వానికి గంభీరాదులు సుతు లగుదురు. పవిత్రాదులు సురలు, శుచి యింద్రుఁడు, అగ్నిబాహ్వాదులు సప్తర్షులు నగుదురు. భగవానుఁడు సత్రాయణుఁ డను వానికి బృహద్భానుఁ డను పేర నవతరించి కర్మవిధానంబుల విస్తరించును.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షిని విని 'మహాత్మా! తామసమన్వంతరంబున కరిమకరులకుఁ బోరు కలిగెననియు భగవానుఁడు వారిపోరు తీర్చి గజేంద్రుని రక్షించెననియుఁ దెలిపితిరి. కరిమకరులకుఁ బోరేలఁగలిగె? ఆపోరును భగవానుఁ డెట్లు తీర్చి గజేంద్రుని రక్షించెను? మునీంద్రా! ప్రాయోపవిష్టుండనైతి. హరిచరిత్రలు వినుటకన్న వేఱొండు కార్యము నాకుఁ గలుగదు.' అని విన్నవించెను. శుకమహర్షి యిట్లనియెను.

## గజేంద్ర మోక్షఘట్టము

### త్రికూటపర్వతము

రాజేంద్రా! క్షీరసముద్రాంతరంబునఁ ద్రికూటంబను పర్వతము గలదు. అది పదివేలయోజనంబులనిడుపు నంతియ వెడల్పు నుండు. ఆనగంబునకు రత్నధాతుమయవిచిత్ర శిఖరంబులు పెక్కులుగలవు. వానిలో సువర్ణశిఖరము రజతశిఖరము అయశ్శిఖరము ప్రస్తుతిఁగాంచు. ఆమూఁడుశిఖలంబట్టి యాపర్వతంబునకుఁ ద్రికూటంబను పేరువచ్చెను.

ఆనగరాజము పాలకడలి మధ్యభాగంబుననుండుటంజేసి సాగర వీచిక లెప్పుడు నక్కొండయడుగుభాగంబుఁ దాఁకుచు, క్షీరసాగరుఁడు వనకల్లోలమాలికలతో నప్పర్వతరాజుపాదంబులఁ గడుగుచున్నాఁడో యనఁ దోఁచుచుండు. ఆగిరియందలి మరకతమణులదీప్తికిఁ బరిసరభూభాగం బెల్ల శ్యామలంబై సందర్శకులకు గాఁ బచ్చపట్టుకంబళులు పఱచిరో యన నుండు. సిద్ధచారణగంధర్వులకును విద్యాధరమహోరగులకును గిన్నరాప్సరోరత్నంబులకును దన్నగకందరప్రదేశంబులు క్రీడాస్థానం బులై సంగీతనాదంబుల ప్రతిధ్వను లీచుచు శోభిల్లుచుండు. ఆప్రతి ధ్వనులు గుహాంతరసింహంబులు విని ప్రతిసింహగర్జనంబులుగా భావించి మఱుగర్జనంబులు చేయుచుండు.

ఆనగేంద్రము నానావనమృగవ్రాతసంకుల ద్రోణీసమలంకృతంబును విచిత్రద్రుమకుసుమోద్యాన మనోహరంబునై యుండు. అందలి సరస్సులు

స్వచ్ఛజలపూర్ణంబులును రత్నమణివాలుకాపులినాభోగంబులునై స్నానార్థమువచ్చునట్టి సురసుందరీమణుల మైపూఁతగంధవాసనలఁ బిచ్చలించు ననుగాడ్పులకు లేయలల నీనుచు నెత్తావులను వెదచల్లుచుండు.

### ఋతుమంతవనము

ఆపర్వతద్రోణితలంబున ఋతుమంతంబను వరుణోద్యానవనంబు గలదు. అది నిరంతరపుష్పఫలభరితంబైన మందార పారిజాత పాటలాశోక చంపక చూత ప్రియాళ పన సామ్ర క్రముక కామ్రాత నారికేళ ఖర్జూర బీజ పూరక మధూక సాల తాల తమాల రస నార్జు నోదుంబరారిష్ట ప్లక్ష వట కింశుక చందన పిచుమంద కోవిదార సరళ సురదారు ద్రాక్షేక్షు రంభా జంబూ బదర్యక్షా భయామల బిల్వ కపిత్థ జంబీర భల్లాతకవృక్షాక్రాంతమై పాదయెండలకుఁగాడ వలనులేక యమరీమణీ విహారమనోహరంబై గ్రాలు.

ఆయుద్యానవనాంతరంబున విశాలసరోవరం బొండుగలదు. అది కనకకమలంబులతోఁ గుముదోత్పలకల్హారంబులతో నిండి పూఁదేనెలఁ గురియుచుండు. తుమ్మెద లత్తేనియలఁ గ్రోలి మైమఱచి పాడెడిపాట రవంబులును శకుంతమధురరుతంబులును, హంసకారండవ చక్రవాక సారస జలకుక్కుట కోయష్టికాదుల కలకలకూజితంబులును వీనులకు విందులొనర్చుచుండు. ఆకొలనినీరంబులు వదంతర మత్స్యకచ్ఛపాది సంచారచలితంబులైన పద్మంబులనుండి జాఱిన పుప్పొడులంజేసి యపూర్వరుచిరంబులై యెంత గ్రోలినను దనివితీఱకుండు. ఆసరోవరతీరంబులు కుంద కురువ కాశోక శిరీష కుటజేంగుద కుబ్జక స్వర్ణయూథి నాగ పున్నాగ మాలతీ మల్లికా మాధవీ జాలకాది లతా పాదప సమాకీర్ణమై లక్ష్మీనివాసమో యన దర్శనీయంబగు.

### గజేంద్రుఁడు

రాజా! ఆవనాంతరంబున గజరాజొకఁ డుండెను. అతఁడు వేసవికి వేగి కొండొకనాఁడు తోడిగజయూథంబును వెంటఁగొని కంటకకీచక

వేణువేత్రనిబిడంబును విశాలగుల్మసంకీర్ణంబునైన యాకాననంబున విహరింపసాఁగెను. ఆకరిరాజు గాలిసోఁకి వ్యాఘ్రఖడ్గచమరీశరభంబులేగాక సింహంబులుగూడ వెఱచి విచ్చిపఱచె ననఁగా క్షుద్రమృగంబులసంగతి చెప్పనేల ?

నరేంద్రా ! ఆగజయూథంబట్లు విహారపరమై యడ్డువచ్చిన ప్రాఁకుల విఱుచుచుఁ గొంతవడి సంచరించి దప్పిగొనెను. అంతలోనఁ గమలసౌరభసుభగశీతవాతము వీచెను. ఆయేనుంగురాయఁ డాసడిబట్టి తోడిగున్నలతోడ నవ్వలను జని యట కొలను నొండు గాంచి దాహాతురంబున గజగజఁ లోనికి దిగి బంగరుదామరపుప్పొడులఁ గమ్మగానున్న తన్నీరంబులను దొండంబున నెత్తి డప్పితీఱఁ ద్రావి యొడలిపయిఁ జల్లులాడి నేదవాసి, వెంటవచ్చినకరభకరేణులకు గృహస్థుఁడువలె స్నానపానంబులుగూర్చి తాపము దీర్చి వానిని మూర్కొనుచుఁ గూరిమి నెఱపసాగెను.

### క రి మ క రు ల పో రు

రాజా ! ఆకొలనులో మొసలి యొకటియుండి యాయేనుంగురాయని కాలుపట్టి లోనికి లాఁగసాగెను. మొసలిపట్టును వదలించుకొనుటకై, గజేంద్రుఁడు వానిలావునెల్లఁ జూపెను. ఫలము లేదయ్యెను. తోడియేనుంగులుగూడ గుమిగూడి తమనాయకుని వెలికిలాగుటకై సర్వప్రయత్నంబులు గావించెను. ఆయత్నంబును నిష్ఫలంబయ్యెను. అవి యంతట నాక్రోశింపసాగెను.

రాజా! మొసలి లోనికి నీడ్చు; గజరాజు వెలికిరా నుంకించు. ఈ లాగులాటలు కరిమకరులకు మహాఘోరంబుగా వేయేండ్లు జరిగెను. ఆపోరుచూచి సురలుగూడ నాశ్చర్యమందిరి. కాలక్రమంబున గజరాజునకు శరీరబలంబు నింద్రియపాటవంబు నుడిగెను. ఉత్సాహము సన్నగిల్లెను. మకరము బలోత్సాహియై విజృంభించెను. గజేంద్రునకు క్షేమియుం దోఁపక—

శా. ఏరూపంబున దీని గెల్తు? నిట మీఁదేవెంటఁ జింతింతు? నె
వ్వారిం జీరుదు? నెవ్వ రడ్డ మిఁక? నివ్వారిప్రచారోత్తముల్
వారింపంగలవా రెవ్వ రఖిలవ్యాపారపారాయణుల్
లేరే? మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

అని చింతింపసాగెను. రాజా! గజేంద్రునకు మదంబుడిగి యహంకారస్వాతంత్ర్య భావంబు వదలినంతనే వానిపూర్వజన్మాభ్యాసము స్ఫురించెను. అతఁ డంతట నేకాగ్రమతియై

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 1

క. ఒకపరి జగముల వెలినిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. 2

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుదినలోకం బగుపెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 3

క. నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁ డాడు మునులును దివిజుల్
గీర్తింప నేర రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ రట్టివాని నుతింతున్. 4

ఆ. ముక్తసంగులైన మునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుమతులు

నసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు. 5

సీ. భవము దోషమును రూపంబుఁ గర్మంబు నా
హ్వాయములు గుణము నెవ్వనికి లేవు
జగములఁ గలిగించు సమయించుకొఱకునై
నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు
ఆ పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు
ఆ. మాటలను నెఱుకల మనములఁ జేరంగఁ
గాని శుచికి సత్యగమ్యుఁ డనుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు. 6

సీ. శాంతున కపవర్గ సౌఖ్యసంవేదికి
నిర్వాణభర్తకు నిర్విశేషు
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి
సౌమ్యున కధికవిజ్ఞాననిధికి
అఖిలేంద్రియ ద్రష్టకధ్యక్షునకు బహు
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రి
యజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి
ఆ. నెఱి నసత్య మనెడినీడతో వెలుఁగుచు
నుండు నెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 7

క. యోగాగ్నిదగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము నొండెఱుఁగక స
ద్యోగవిభావితమనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్. 8

సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గ
మయునికి నుత్తమమందిరునకు
సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ
దనయంతరాజిల్లు ధన్యమతికి
గుణలయోద్దీపితగురుమానసునకు సం
వర్తితకర్మనిర్వర్తితునకు
దిశలేనినాబోఁటి పశువులపాపంబు
లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ
ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ
వంతునకుఁ దనూజపశునివేశ
దారసక్తులయినవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు. 9

సీ. వరధర్మకామార్థవర్జితకాములై
విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించు వారి క
వ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు
రానందవార్ధిమగ్నాత్ము లగుచు
నేకాంత లెవ్వాని నేమియుఁ గోరక
భద్రచరిత్రంబుఁ బాడుచుందు
ఆ. రామహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము

బ్రహ్మ మైనవానిఁ బరుని నతీంద్రియు
నీశు దూరు సూక్ష్మునే భజింతు. 10

సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల
నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు
రా క్రియ నాత్మకరావళిచేత బ్ర
హ్మాదులవేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూపభే
దములతో మెఱయించి తగనడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియములుఁ దాన
యై గుణసంప్రవాహంబు నెఱపు
తే. స్త్రీనపుంసకపురుషమూర్తియునుగాక
తిర్యగమరనరాదిమూర్తియునుగాక
కర్మగుణభేదసదసత్ప్రకాశిగాక
వెనుక నన్నియుఁ దానగు విభుఁ దలంతు. 11

క. కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగిగణములపాలం
గలఁ డందు రన్నిదిశలను
కలఁడు కలం డనెడివాఁడు కలఁడో లేఁడో. 12

సీ. కలుఁగఁడే నాపాలికలిమిసందేహింపఁ
గలిమిలేములులేక కలుఁగువాఁడు
నాకడ్డపడ రాఁడె నలినసాధువులచేఁ
బడినసాధుల కడ్డపడెడువాఁడు
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ జూచువాఁడు
లీలతో నామొఱాలింపఁడే మొఱఁగుల
మొఱ దెలుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు

తే. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు
నాదిమధ్యాంతముల్ లేక యడరువాఁడు
భక్తజనముల దీనులపాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె వేగ రాఁడె ? 13

క. విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజయింతున్. 14

రాజా ! గజేంద్రునకు నంతలోన సర్వశక్తు లుడిగెను. అతఁడు నింగివంకఁ జూపు నిలిపి—

'శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే ? యీశ్వర ! కావవే? వరద ! సంరక్షించు భద్రాత్మకా !'

అని ప్రార్థించెను. రాజా ! వాని ప్రార్థనంబు నిర్విశేష బ్రహ్మంబును గూర్చిన దగుటం జేసి మూర్తిభేదంబు గలుగదు. ఆ ప్రార్థనంబును బ్రహ్మాది మూర్తులు వినియు "ఇతఁడు నన్నుఁ బ్రార్థింపలేదు. ఇతఁడు నన్నుఁ బ్రార్థింపలే" దనుచుఁ ద్రిమూర్తులలో నెవ్వరును వాని మొఱ మన్నింప రైరి. అప్పు డఖిలాత్ముఁడైన భగవానుఁ డాదీనాలాపంబుల నాలకించి క్షణకాలంబు జాగైనను వానికిఁ బ్రమాదంబగుట గ్రహించి

'మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోద్ధితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై."

గరుడుఁ డధిష్ఠించి హుటాహుటి వచ్చి గజేంద్రు నెట్టయెదుట గగనతలంబున నిలిచెను. కరినాయకుఁడు చక్రపాణియైయున్న యాదేవ్వ

మూర్తిని జూచి బలహీనతంజేసి మెల్లగాఁ దొండంబునఁ గమలంబు నొండుపట్టి పైకినెత్తి 'నారాయణాఖిలగురో భగవన్నమస్తే' యని యాపద్మంబును విసరివైచెను.

అట్లు కష్టస్థితిలోనున్న యతనిని భగవానుఁడు కనికరించి గరుడుని మూఁపునుండి దిగివచ్చి కొలనులోనున్న మొసలిని వెలికి లాఁగి దానిశిరంబును జక్రంబునఁ ద్రుంచి గజరాజును రక్షించెను. ఆయద్భుతకార్యంబును ఋషులు ప్రశంసించిరి. దేవదుందుభులు మ్రోసెను. సిద్ధచారణులు గీర్తించిరి.

రాజా! మకరం బట్లు చక్రహతమై యామొసలిశరీరంబును బాసి గంధర్వరూపంబుఁ దాల్చి శిరము నేలసోక మ్రొక్కి 'దేవాధీశా! నేను తొల్లి హూహూనామకగంధర్వుఁడనై యుండి కొండొకనాఁడు గంధర్వాంగనలఁగూడి జలక్రీడ లొనర్చుచుంటి. అత్తఱి దేవలమహర్షి తీర్థార్థంబువచ్చి యాకొలనులో మునిఁగెను. హేళనార్థము వానిని గాలుపట్టి యీడ్చితిని. నా యకార్యంబునకు నమ్మునీంద్రుఁడు కోపించి 'మూఢా! మొసలిపనిచేసితివి గావున మొసలివగు' మని శపించెను. శాపాంతము ప్రార్థించితిని. ఆదయానిధి నామొఱవిని జాలినొంది 'గంధర్వా! నీవు మొసలివై కొలనులో నుండఁగా గజపతి యొకఁడటకువచ్చును. నన్నువలె వానినిగూడ నీవు కాలుపట్టియీడ్చి బాధింతువు. అతఁడు దిక్కేది భగవానుని బ్రార్థించును. పరమేశ్వరుఁడువచ్చి వాని నుద్ధరించును. అది నిమిత్తంబుగా నీకు శాపమోక్షంబగు' నని పలికెను. స్వామీ! ఆప్రకారమే నేఁడయ్యె' ననిచెప్పి ప్రదక్షిణంబాచరించి తదనుజ్ఞాతుఁడై చనెను.

### గజేంద్రునిపూర్వవృత్తాంతము

రాజా! ఆగజేంద్రుఁడు పూర్వజన్మంబున ఇంద్రద్యుమ్నుఁడను పాండ్యుఁడు ద్రవిడసత్తముఁడు విష్ణుపరాయణవ్రతుఁడుగా నుండెను. అతఁడు తపంబుఁగావింప మలయాద్రికిఁబోయి యాశ్రమంబు నిర్మించికొని

తపోవ్రతుఁడై కొండొకనాఁడు నీరాడివచ్చి జపపరుఁడై మౌనంబుఁదాల్చి భగవానునిఁ బూజించుచుండఁగా నగస్త్యమునీంద్రుఁడు శిష్యులతోఁడ యాదృచ్ఛికంబుగా నటకువచ్చెను. ఇంద్రద్యుమ్నుఁడు పూజాపరతంజేసి యావచ్చినఋషికిఁ బూజలుగావింపక మిన్నకుండెను. అగస్త్యుడు వానికిఁ గోపించి 'దురాత్మా! నీబుద్ధి కలుషితముఁగాదా? సాధుత్వంబును బాటింపవా? ఏనుఁగువలె మొద్దవై యుండుటేల? బ్రాహ్మణావమానంబు సేయఁదగునా? నీ యీయకార్యఫలంబుగా గజజన్మంబెత్తి తమోమూర్తి వగుదువుగాక' అని శపించి శిష్యులతోఁడ యథేచ్ఛం జనియెను.

ఇంద్రద్యుమ్నుఁడు తనశాపంబు విధివిధానంబని తలంచి కుంజరజన్మంబెత్తెను. అయినను వానికిఁ బూర్వజన్మమందలి భగవత్స్మృతి యట్లేయుండి తఱివచ్చినంతనే ప్రతిఫలించెను. తత్ఫలంబుగా నతఁడప్పు డట్లు భగవంతునకు సర్వాత్మసమర్పణంబు గావించుటయుఁ దదనుగ్రహపాత్రుఁడై మనుటయు నయ్యెను.

గజేంద్రుఁడు హరిపార్షదుఁడగుటు

రాజా! భగవానుఁ డట్లు మకరంబునకు శాపమోక్షంబు ననుగ్రహించి గజేంద్రునిశిరంబుపయి నిజహస్తంబు నుంచెను. ఆహస్తస్పర్శ గలిగినంతనే గజేంద్రుఁడు వానియజ్ఞానబంధనంబునుబాసి భగవత్సారూప్యముఁ దాల్చి పీతాంబరుఁడును జతుర్భుజుఁడునై హరిపార్షదుఁడుగా వెలసి, గరుడారూఢుఁడై నిజలోకంబునకుఁ దరలిన భగవంతు ననుగమించెను. ఆయద్భుతంబును గొనియాడుచు సురసిద్ధగంధర్వాదులు వారి వెంటఁ జనిరి.

పరీక్షిన్నరేంద్రా! భగవదనుగ్రహంబు సంపాదించుటకు వేదనము రోదనము అనుమార్గంబులు రెండు గలవు. వేదనము జ్ఞానపూర్వకము, రోదనము ప్రేమపూర్వకము. బిడ్డలు తల్లికై యేడ్చునట్లు భక్తులు భగవంతునకై రోదనము సేయుదురు. వేదనపరులకు నెమ్మదిగాఁ గ్రీతిఁ

గూర్పవచ్చు. రోదనపరులయెడ జాగుసేయఁ దరముగాదు. ఏల యందువా ? ఆరోదనము మితిమీఱి ప్రాణాపాయంబునుగూడఁ గలి గింపవచ్చు. ఆకారణంబున భగవానుఁడు గజేంద్రునిరోదనంబు విని యంత హుటాహుటి వచ్చుటయ్యెను.

## గజేంద్రచరిత్రమాహాత్మ్యము

రాజేంద్రా ! గజేంద్రమోక్షం బనఁగా శ్రీకృష్ణప్రభావప్రదర్శ నంబుగాని వేఱుగాదు. ఈచరిత్రను విన్నవారికి దుస్స్వప్ననాశనంబును బాపహారంబును యశోవృద్ధియు స్వర్గప్రాప్తియు సిద్ధించును. శ్రేయ స్కాములు ప్రతిదినముఁ బ్రాతఃకాలంబున శుచులై దీనిని బఠింతురు.

రాజేంద్రా ! భగవానుఁ డట్లు గజేంద్రునకుఁ బార్షదపదంబు నిచ్చి "గజరాజా ! ఎవరు తెల్లవాఱి నిదురలేచి శుచులై సమాహిత బుద్ధితో నన్ను ధ్యానించి నిన్ను నీసరోవరంబును గిరికందరారణ్యవిలసితం బును వివిధసురతరుసమాకీర్ణంబును మీఁదుమిక్కిలి బ్రహ్మనివాసంబునైన యాగిరిశిఖరంబులనుఁ దన్నగాగ్రంబుననున్న నానికేతంబును శివస్థానంబును క్షీరసాగరంబును నాకుఁ బ్రియప్రదేశమైన శ్వేతద్వీపంబును స్మరించి, నాధరించునట్టి శ్రీవత్సకౌస్తుభవనమాలా కౌమోదకీసుదర్శనపాంచజన్యం బులను దలంచి గరుత్మంతుని భావించి, నాయంశభూతుఁడైన శేషుని, నన్నాశ్రయించియుండు శ్రీదేవిని, నారదప్రహ్లాదభవబ్రహ్మలను, మత్స్య కూర్మవరాహాద్యవతారంబులను దలపోసి నాచేసినపుణ్యకర్మంబులను దలపోసి, రవిచంద్రాగ్నులకు మ్రొక్కి, ప్రణవంబును సత్యంబును సంభావించి, మాయను స్మరించి, గోవిప్రుల నాత్మగతం బొనర్చి, యవ్యయమైనధర్మంబును ధర్మునిసతులైన దాక్షాయణులను సోమకశ్య పులభార్యలను, గంగా సరస్వతీ నందా కాళిందీనదులను, ఐరావతం బును, ధ్రువుని, సప్తర్షులను, బుణ్యశ్లోకులైన మానవులను దలంచి యవి యెల్ల నావిభూతులుగా విశ్వసించి నన్ను స్మరింతురో వారు సర్వపాప విముక్తు లగుదురు. మఱియుఁ బ్రభాతంబుననే మేల్కాంచి గజేంద్ర

మోక్షణపూర్వకంబుగా నన్ను స్మరింతురేని ప్రాణావసానకాలంబున విస్మృతి నొందరని చెప్పి యామాట తప్పకుండుటకు నిదర్శనంబుగాఁ బాంచజన్యంబును బూరించెను. రాజా! ఈచరిత్రమహిమ యెంతో నీవే యూహింపనగు."

## కూర్మావతారచరిత్ర ఘట్టము

మునులారా! గజేంద్రచరితము విని పరీక్షిన్నరేంద్రుఁడు పరమానంద వివశుఁడై భగవంతుని ధ్యానించి 'మహాత్మా! భగవల్లీలలను వినుకొలఁదిఁ తదాకర్ణనకుతూహలంబు పెరుఁగుచున్నది. దేవాసురులు క్షీరసాగరం బును మథించిరంటివి. మథనకారణమేమి? ఎట్లు మథించిరి. భగవానుఁడు కూర్మావతారంబెత్తి మందరాద్రి నెట్లు మోచె? సురలకు నమృతం బెట్లు దక్కె? తదవసరంబున మఱేమి యద్భుతంబులు సంభవించె? ఇవి యెల్ల వినఁ గోరికయయ్యెడు. నావిన్నపంబు గైకొననగు' ననెను. వానికి శుకమహర్షి యిట్లనియెను.

## ఇంద్రునకు దుర్వాసశాపము

రాజేంద్రా! తొల్లి దేవేంద్రుఁ డొకనాఁ డైరావతగజంబు నెక్కి వచ్చుచుండఁగా దుర్వాసమహర్షి యెదురై వానికంఠంబుననున్న పూదండను దీసి సురేంద్రునకు నిచ్చెను. అమరేశ్వరుఁడు సంపద్గర్వోన్నతిం జేసి యాపుష్పమాలికను దాను ధరింపక తద్గజకుంభస్థప్రదేశంబునఁ బడవైచెను. ఆగజంబు దానిని నేలవైచి కాలఁద్రొక్కి నుగ్గుగావించి యవ్వలఁ ద్రోసెను. దుర్వాసుఁ డదియెల్లఁ జూచి యాగ్రహాంధుఁడై 'ఇంద్రా! ఇంత యనాదరభావంబు తగదు. నీసేవ నీమదఫలంబుగు నిశ్శ్రీకుఁడ వగుదువుగాక!' యని శపించి చనెను. ఆశాపఫలంబుగా యజ్ఞాదిక్రియలు నశించెను. తత్క్రియాలుప్తముతోడ దేవతలకు బలం బుడిగెను. అదిసందుగా దానవులు చెలరేఁగి సురలను దాఁకిరి.

## దేవాసురయుద్ధము

రాజా! దేవదానవులకు ఘోరయుద్ధం బయ్యెను. అమరులు లేచి చచ్చిపడిరి. సురలదుర్గతిని నింద్రవరుణాదులు చూచి చింతా

క్రాంతులై ప్రతీకారమార్గంబు దోఁపక మేరునగంబునకుఁ జని నిండు సభలోఁ బేరోలగంబు తీఱియున్న బ్రహ్మకు నమస్కరించి వారియాపదలు విన్నవించిరి. చతురాస్యుఁడు వారిని విని 'కటా! ఇంద్రాదులు సత్త్వము దూలి ద్యుతిఁ గోల్పోయిరి; లోకమెల్ల నమంగళప్రాయ మయ్యెను; అసురులు చెలరేగిరి. ఏమిసేయనగు' నని తలంచి సమాహితచిత్తుఁడై పురుషోత్తముని స్మరించెను. ఆస్మరణఫలంబుగా బ్రహ్మకు నంతఃకరణవికాసత్వము గలిగి విషయము బుద్ధిగ్రస్తమయ్యెను.

### సురలు బ్రహ్మను శరణిల్లుట

అంత బ్రహ్మదేవుఁడు బహిర్ముఖుఁడై 'దేవతలారా! చరాచరసకల భూతరాశియు మీరును భవుండును నేనును భగవానునియంశంబులు నంశాంబులుఁ గళలుఁ గళాంశంబులు నై వర్తింతుము. మీయాపదయన్నో యంశసంభవులకు మాబోంట్లకుఁ దీర్పరాదు. సర్వపూర్ణుఁడై నవానినే యాశ్రయింపనగు. వానికి వధ్యావధ్యులు స్వపరు లనుభేదము గలుగదు. వానికి నెల్లరు సములగుదురు. అయినను భగవానుఁడు సర్గస్థితి సంయమార్థము సమయము వచ్చినప్పుడు వానిశక్తినిఁ బ్రేరేచును. అది సత్త్వరజస్తమోగుణంబులరూపంబుఁ గైకొని యథోచితగతిఁ బ్రవర్తించు. ఇప్పుడు వానికిఁ బరిపాలనావసరము గలిగెను గావున వానివలన మనకు సుఖంబగు' నని చెప్పెను. పరమేశ్వరదర్శనార్థం బెల్లరుఁ బయనమైరి. చతురాస్యుఁడు వారిని వెంట తరలి దేవదేవుని పదంబుచేరి,

### బ్రహ్మకృత పరబ్రహ్మస్తుతి

"'దేవా! ఆద్యంతరహితా! అవికారా! నిత్యస్వరూపా! మనోవాగగోచరా! అవిచింత్యా! నిరుపాధికా! సర్వాంతరా! సర్వోత్తమా! ఇదే నీకు మ్రొక్కెదము. స్వామీ! ప్రాణమనోబుద్ధ్యహంకారవిజ్ఞాతవును విషయేంద్రియరూపాభాసమానుండవునయ్యు నజ్ఞానముగాని శరీరముగాని లేక యక్షరుండవై యుందువు. జీవపక్షపాత నిష్పక్షపాతంబులకు నవిద్యావిద్యలు జనకంబులగు. వానికి రెంటికి నీ వాధారవు.

దేవా ! దశేంద్రియపంచప్రాణంబులనెడి పదునైదాకులతోఁ, అష్టప్రకృతులనెడి ఏనిమిదిమారాకులతోఁగూడి గుణత్రయంబను మధ్యంబు గలిగి మనఃప్రధానంబుగా నొప్పుచు మాయాప్రేర్యమాణమై మెఱపునకంటె వేగంబుగాఁ బఱచు జీవశరీరాత్మకచక్రంబునకు నెవ్వం డధిష్ఠాత యగునో, ఎవ్వఁడు జ్ఞానైకస్వరూపంబుతోఁ బ్రకృతికిఁ బరంబున నదృశ్యగతి వెలుంగుచుండునో, ఎవ్వఁడు దేశకాలాపరిచ్ఛిన్న నిర్వికల్పబ్రహ్మస్వరూపుండయ్యు జీవులను నియమించుచుండునో, ఎవ్వని ధీరులు యోగసాధనపూర్వకంబుగా నుపాసింతురో, ఎవ్వఁ డాత్మస్వరూపంబు నావరించి సకలజనులకు మోహం బొదవించునో, ఎవ్వని మాయ నెంతటివారును దాఁటనేరరో, ఎవ్వఁడు నిజమాయాతచ్ఛక్తులను వశీకరించికొని సర్వభూతసమవర్తియగునో, యట్టి యగమ్యచరితునకు నీకు నమస్కారము.

మహాత్మా! తత్త్వశరీరంబు నీకుఁ బ్రియంబగు. ఆశరీరంబున మేము సృజింపఁబడితిమి. అంత యుత్తమజన్మంబును గాంచియు మేము నీ బహిరంతఃప్రకాశమాననిరుపాధికస్వరూపంబును గాంచనోచము. ఇఁక రజస్తమఃప్రధానులైన యసురాదులు నిన్నుఁ గనలేకుండుట వింత యగునా ? స్వామీ ! చతుర్విధభూతసర్గంబునకు నాధారంబైన భూమి యెవనికిఁ బాదంబులగునో, ముజ్జగంబులకును దత్పాలకులకును సిద్ధజీవన వృద్ధికారణంబైన జలం బెవ్వని తేజోరూపంబగునో, దేవతలకు బలాయు రన్నంబును వృక్షకోటికిఁ బ్రభువును జనులకు నాప్యాయకారియు నైన సోముఁ డెవ్వనికి మనస్సగునో, క్రియాప్రతిపాద్యకర్మనిమిత్తుఁడై సముద్రాంతంబున స్వధాదులకుఁ బరిపాకంబుఁ గూర్చునట్టియగ్ని యెవనికి వదనంబగునో, అర్చిరాదిమార్గదేవతయుఁ ద్రయీమయుండును బ్రహ్మోపాసనాస్థానంబును ముక్తిద్వారంబును నమృతమృత్యుమూలంబునైన సూర్యుఁ డెవనికి లోచనంబగునో, భృత్యులకు సమ్రాట్టువలె మాకును బుద్ధ్యాద్యధిష్ఠాతలకు నెవ్వఁ డుపాసనీయుఁడో, ఎవ్వని ప్రాణంబునఁ

జరాచరాదులకెల్ల నోజస్సహోబలధర్మాత్మకప్రాణంబు గలుగునో, ఎవని శ్రోత్రంబున దిశలును హృదయంబున దేహగతవివరంబులును నాభివలనఁ బ్రాణేంద్రియమనోఽసుశరీరనికేతం బగునభంబు జనించెనో, ద్రవ్యకాల కర్మగుణభౌతికప్రపంచంబు లెవ్వని మాయాకల్పితంబులని బుధులు పల్కుదురో, ఎవ్వనిమాయ యిట్టిదని యూహింపనేని సాధ్యముగాదో, ఎవఁడు పరమోపశాంతుఁడును నిత్యపూర్ణుండునయ్యు మాయాదర్శిత గుణంబులయెడ దర్శనాదివృత్తుల వ్యవహరించుచుండియు వాయులీల వాని కెవ్వానికిఁ దగులకయుండునో యట్టి మహావిభూతిఖ్యాతునకుఁ బునఃపునర్నమస్కారంబులు.

దేవా! దరహాసకందళసుందరంబైన నీముఖపద్మంబును జూపి మాకుఁ గనుపండువు గావింపుము. మాకు సాధింపరానికార్యంబులను నీవు నీయంతన యొనర్పుటకై తత్తద్రూపంబులఁ దాల్పుటకుఁగా నే ప్రేమ రసంబు నిన్నుఁ బ్రోత్సహించునో యాప్రేమరసంబు నొక్కింత మాకు ననుగ్రహింపుము. ప్రభూ! విషయాసక్తు లెంతటిమహాకర్మంబుల నొనర్చి నను వానినెల్ల నీకుఁ బ్రీతితో సమర్పింపకున్ననాఁ డవియెల్ల విఫలంబు లగు. వారికి నెట్టిఫలంబు గలుగు నందురా? క్లేశముమాత్రము మిగులును. వృక్షాని మొదట నీరుపోసినప్పు డాజలము కొమ్మలకు రెమ్మలకు నంతటకుఁ బోసిన ట్లగుచందంబున నీయారాధనంబు సర్వారాధనంబగు. నీశరణు చొచ్చితిమి. నీవే మాకు గతి యని సాష్టాంగం బొనర్చెను.

శ్రీమహావిష్ణువు బ్రహ్మాదులకు దర్శనమిచ్చుట

రాజేంద్రా! చతురాస్యాదు లిట్లు ప్రణమిల్లి లేచినంతట వాని యెదుట నొకవిధమైన యపూర్వతేజస్సు గానవచ్చెను. వేయిసూర్యు లొక్కపటి వెలుఁగుచున్నారో యననున్న యాకాంతికి బ్రహ్మాదులదృష్టి చెదరెను. భూమ్యాకాశంబులుగాని దిక్కులుగాని వారికిఁ గానరా వయ్యెను. ఆజ్యోతిర్మధ్యంబున నొకదివ్యమూర్తి మరకతశ్యామలనిర్మల గాత్రంబుతోఁ బద్మారుణలోచనంబులతో సువర్ణసవర్ణపీతాంబరముతో

మణికిరీటకేయూరకాంచీకలాపవలయహారనూపురశోభాయమానప్రసన్న చారుసర్వాంగసుందరుఁడై రత్నకుండలప్రభలు కపోలతలంబుల మిలు మిట్లు గొలుపుచుండఁగా, లక్ష్మికౌస్తుభంబులు వేరురంబున వెలుఁగు చుండఁగాఁ గంఠసీమవనమాల గ్రాలుచుండఁగాఁ జక్రాయుధంబును హస్తతలంబున నలంకరించి ధిగద్ధగాయమానుఁడై తేజరిల్లుచుండెను. బ్రహ్మాదులు కొంతవడికి సమాధాయించుకొని యమ్మహాపూర్వమూర్తిని గాంచి యాశ్చర్యపరవశులై మ్రొక్కిరి. అంత బ్రహ్మ మునుకొని యిట్లు స్తుతించెను.

## బ్రహ్మ శ్రీమహావిష్ణువును స్తుతించుట

'దేవా! ఏ నీదివ్యరూపంబు శ్రేయస్కాములకు వైదికతాంత్రిక యోగంబులచేతఁ బూజనీయంబగునో యామంగళరూపంబును మాకు నొక్కింత దర్శనయోగ్యంబు గావించి మామొఱ యాలకించినట్లు సూచించితివి. మేము ధన్యులమైతిమి. విశ్వమూర్తివైన నీలోనున్న యుజ్జ గంబులయెడను మాయెడను నీకటాక్షవీక్షణంబు నిరంతరముఁ బఱచు చుండుఁ గావున నీయెఱుంగనిది గొంతయు నుండదు. దేవా! ఈజగంబు నీయందే జననస్థితిలయంబులుగాంచు. ఘటంబునకు మృత్తికవోలె జగం బునకు నీవే యాదిమధ్యాంతంబగుదువు. స్వామీ!జగదుత్పత్తికిఁ బ్రధా నంబు కారణంబని కొందఱు వచింతురు. నీవు ప్రధానంబునకన్నఁ బరుండవై యుండి ప్రధానమూలంబున సృష్టిఁ గావించుట వా రెఱుంగరు. అది యెట్లందువా? ప్రధానము నీమాయాశక్తిగాని వేఱుగాదు. శక్తిమం తుఁడు లేనినాఁడు శక్తి యెట్లుండు? శక్తివ్యవహారము శక్తిమంతుని వ్యవ హారమే యగుఁగదా. నీశక్తివ్యవహార మెట్టి దందువా? అది స్వగుణ పరిణామంబు నొందును. ఆపరిణామమే జగం బనఁబడు. ఈరహస్యంబు శాస్త్రజ్ఞులైన యోగులకుమాత్రమే స్పష్టము. పుడకను దఱుచుటవలన నిప్పు, గోవును బిదుకుటవలన ఘృతము, భూమిని దున్ని విత్తుటవలన నన్నంబు, యంత్రాదులవలన నూతిజలంబు, నిట్లు వివిధోపాయంబులవలన

జీవికవృత్తిని నరులు పడయుదురు. అట్లే పండితులు బుద్ధిచేత గుణంబులను మథించి నిన్నుఁ గాంతురు.'

### దేవతలు ప్రార్థించుట

దేవా! వివిధక్లేశములపాలై నీవే దిక్కని చిరకాలంబుగాఁ బ్రార్థించుదుము. దావాగ్నికిఁ గ్రాఁగినట్టి యేనుంగులకు గంగాజలంబు వోలె దుఃఖార్తులకు మాకు నీదర్శనమయ్యెను. లోకపాలకులకు మాకుఁ గోఱఁతయేమని యడుగుదువా ? బహిరంతరాత్మునకు సర్వసాక్షికి నీకుఁ దెలియనిది యేమియుండు ? దేవా! అగ్నినుండి విస్ఫులింగంబులువలె నిన్నుండి మేమెల్లరము వెడలితిమి. గావున నీకు నన్యులము గాము. అట్లుండియు వేఱువేఱుగా విభావింతుము. ఆకారణంబున మాకెల్లరకు నేఁడి మేలో దాని నెఱుంగలేకయున్నాము. మాకు శుభం బెట్లో యుపాయంబుఁ దెలుపుము.' అని దేవతలు దోయిలొగ్గి నిలిచిరి.

### విష్ణువు సురలకు నుపాయంబు తెలుపుట

రాజేంద్రా! ఆమహానుభావుఁడు వారితలంపు గ్రహించి 'వీరి కోరిక దీర్చుట యొకపనిగాదు. సముద్రమథనాదుల విహరింపఁ గోరిక గలిగెను. అందులకు వీరిని నిమిత్తమాత్రులుగాఁ జేయుదుఁగాక' యని లోలోన నిశ్చయించి 'కమలసంభవా! శర్వా! సురలారా! మీకు హితంబుఁ జెప్పెదు వినుఁడు. కాలానుసారంబుగాఁ గార్యం బొనర్ప వలయును. కాలము మంచిది గానినాఁడు వేగిరించిన విషంబగు.

వైరిబాధ లోర్వరాకున్నవందురా ? విషమసమయంబున వైరితో సంధిచేయుట యుక్తము. ముప్పు దప్పినతర్వాత సర్పమూషికభావంబు గలుగదుగదా. ఇది మీకు మంచికాలము గాదు. దైత్యదానవులతో సంధిచేసి క్లేశంబులఁ బాయుఁడు.

సురలారా! ప్రాణులకు మృత్యువు సిద్ధము. మృత్యువు దప్పుటకు నమృతపానం బొక్కటే యుపాయంబు. అమృతంబును గ్రోలిన వాఁడు మృత్యుగ్రస్తుఁడయ్యుఁ జావఁడు. కాఁబట్టి యమృతోద్పాద

నంబునకు యత్నింపుఁడు. అమృతం బెందుఁ గలదందురా? అది క్షీర సాగరంబున నున్నది. సర్వలతౌషధులను తృణౌషధులను దెచ్చి యాపాలకడలిలో వైచి దానిని మథింపవలయును. సముద్రమథనంబు నకుఁ దగినకవ్వం బెద్ది యుందురా? మందరాద్రిని గవ్వముగా వాసుకిఁ ద్రాడుగా నమర్చి త్రచ్చవలెను. నేనుఁగూడ మీకుఁ దోడగుదు.

ఈమథనకార్యంబున నసురులఁగూడఁ బాల్గొనఁగోరుదురేని నందు లకు మీరు సమ్మతింపుఁడు. సామంబునకు సాధ్యమగు కార్యంబు సంరం భంబునకుఁ గాదు. సముద్రమథనసమయంబున నందుండి కాలకూటవిషం బుద్భవించు. అందులకు వెఱవవలదు. వస్తువులయెడఁ గామలోభ రోషంబులు దాల్పరాదు' అని బోధించి యంతర్హితుఁడయ్యెను. బ్రహ్మయు భవుండు నమ్మహాత్మునకు మ్రొక్కి తమతమస్థానంబులకుఁ జనిరి.

### దేవాసురులకు సంధి యగుట

రాజేంద్రా! అత్తఱి బలిచక్రవర్తి దైత్యదానవులకు రాజయి సర్వజయశ్రీసమున్నతుఁడుగా నుండెను. మహేంద్రుఁడు సురలవెంటఁ గొని బలిచక్రవర్తియొద్దకుఁ బోయి మృదుమధురవచనంబుల సంధి కార్యముఁ దెలిపెను. ఆమాటలు బలియనుచరులైన శంబరాదిదైత్యు లకు మెప్పుగావించెను. బలియు సంధివిగ్రహసమయవేదిగావున సంధికి సమ్మతించెను. తోడ్తోడ దైత్యభటుల విజృంభణంబులు చల్లారెను. ఉభయపక్షంబులవారు సంధిప్రతిజ్ఞలు నెఱపిరి.

### సురాసురులు మందరాద్రిని దెచ్చుట

సంధిప్రతిజ్ఞలలో క్షీరసాగరమథనంబు ముఖ్యమైనదిగా నుండెను. ఇరుతెగలు మందరాద్రికిఁ జని భుజబలంబులు దీపించ నగ్గిరీంద్రంబును బెకలించి యార్చుచుఁ బేర్చుచు దానిని క్షీరాబ్ధిగట్టునకుఁ గొనిరాసాగిరి. కొంతదూరము వచ్చునంతకు వారికి డబ్బాటు గలిగెను. తత్ఫలంబుగాఁ గొండబరువు మోయరానిదయ్యెను. శక్రవైరోచనాదు లాపర్వతం బును నడుదారిలోఁ బడవైచిరి. ఆపాటువడికి సురాసురులు గొందఱు

కాళ్లు విఱిగియుఁ దొడలు తెగియు మెడలు ప్రీలియు నుగ్గునూచమైరి. ఏమిచేయవలయునో దోఁవక యెల్లరుఁ జింతింపసాగిరి.

అత్తఱి నారాయణుఁడు సన్నిధిగావించి దివ్యకటాక్షవీక్షణసుధా వర్షముఁ గుఱియించెను. చచ్చిపడియున్న వారెల్లరుఁ బునర్జీవితులైరి. అంతట భగవానుఁ డప్పర్వతంబు నొక్కకేల నెత్తి గరుడునివీపున నుంచి క్షీరాబ్ధిమార్గముఁ బట్టెను. సురాసురులు వానివెంట నడచిరి. ఎల్లరుఁ బాలకడలిఁ జేరినంతట గరుడుఁ డాకొండను దించివైచి హరియనుజ్ఞఁ బడసి చనెను.

## క్షీ ర సా గ ర మ థ న ము

రాజా! సురాసురు లంతట వాసుకియొద్దకుఁ బోయి 'పన్నగేశ్వరా! క్షీరసాగరమథనంబును సంకల్పించి మందరాద్రిని కవ్వముగాఁ దెచ్చితిని. కవ్వమునకుఁ ద్రాడు వలయు. అందులకు నీ వంగీకరింపవలయు. ఫలభాగంబు నిత్తు' మనిరి. వాసుకి సమ్మతించి క్షీరాబ్ధికి వచ్చెను. వానినిఁ ద్రాఁడుగా నమర్చి సురాసురులు మథనోన్ముఖులైరి.

భగవానుఁడు వాసుకిముఖభాగంబును బట్టెను. వానివెంబడి సురలు పట్టిరి. దైత్యు లదిచూచి 'కటా! పాముతోక యెంతయునమంగళకరంబగు. స్వాధ్యాయశ్రుతసంపన్నులమును విఖ్యాతజన్మకర్ములమునైన మాకు సర్పపుచ్ఛముఁ బట్టఁదగ' దనుచు దూరమై నిలిచి మిన్నకుండిరి. భగవానుఁడు వారిభావంబు గ్రహించి యెలనవ్వు దాల్చి తలవంక వదలి తోఁకఁ బట్టెను. వానివెంట సురలు నట్లు యొనర్చిరి. అంతట నసురులు వాసుకిముఖభాగంబును బట్టిరి.

నరేంద్రా! సురాసురు లంతట మహాప్రయత్నపరులై పయోధిని మథింపసాగిరి. కవ్వముగానైన మంధరగిరి యాధారములేమిఁ గ్రిందికిఁ గ్రుంగెను. అందులకు నుభయపక్షంబులు విన్నవోయి 'దైవబలంబు లేని నాఁడు పట్టిపౌరుషంబు కొనసాగునా ?' యనుచు నొండొరుమోములు చూడఁజొచ్చిరి. భగవానుఁడు వారికై లోలోన నవ్వుచుఁ గూర్మ

రూపంబుఁ దాల్చి తనవీఁపుపయి నగ్గిరీంద్రంబు నుంచి దానిని లేవనెత్తి నిలిపెను. లక్షయోజనవిస్తీర్ణంబైన యాకూర్మంబువీఁపున నమ్మందర పర్వతం బొకద్వీపమాత్రంబుగాఁ గానిపించెను.

సురాసురులు మఱలఁ జిలుకసాగిరి. కొంతవడికిఁ గొండరాయిడిం జేసి యాకూర్మమువీఁపునకు గండూతి యయ్యెను. కార్యపరులబలవీర్యోత్సాహంబులఁబట్టి ఫలప్రాప్తికాలం బుండుఁగావున భగవానుఁ డిరుపక్షంబులవారి నావేశించి యొకహస్తంబును గొండపయి నిడి రెండవకొండయో యనఁ దోఁచెను. భగవానుఁ డట్లావేశించుటం జేసి సురాసురులు బలోన్నతులై పోటాపోటిసేయుచు సముద్రంబును ద్రచ్చిరి. ఆవడికి సాగరాంతర మకరమత్స్యాదిజంతువులు కలంగెను. వాసుకి సహస్రముఖంబులనుండి శ్వాసానలధూమము వెలిఁ బ్రాఁకెను. ఆవేడిమికి నవ్వాలనిదైత్యులు తేజంబు లుడిగి కార్చిచ్చుగ్రమ్మిన సరలవృక్షంబుల ట్లయిరి. ఆ శ్వాసానల తాపము సురలకుఁగూడఁ గొంత సోఁకి వారు ధరించినవస్త్రమాలికాదులను గమరించెను. వారిదురవస్థను భగవానుఁడు చూచి మేఘంబులఁ దలంచెను. వెనువెంటనే వానకురిసి చల్లనిగాలి వీచి సాగరవీచీశీకరంబులనుబయిఁ జల్లెను. వారు తాపంబులు దీఱి రెట్టించినపూనికతోఁ ద్రచ్చసాగిరి. ఎంత చిలికినను సముద్రంబునుండి యేమియు వెలువడకుండెను.

### కా ల కూ ట వి షో త్ప త్తి

రాజా! వారు మఱిమఱిఁ బట్టుదలతో మథింపసాగిరి. కొంత కాలంబునకు సముద్రజలంబు లుడ్డుడికి సాగరాంతరమత్స్యకచ్ఛపమకరాది యాదోగణంబు కలంగి తబ్బిబ్బుపాటు నొందెను. జలధినుండి హాలాహల విషంబు పుట్టి దిక్కులెల్లఁ బఱచి దుస్సహమయ్యెను. ఉభయపక్షంబుల వారు దిక్కుదోఁపక నిర్విణ్ణులైరి. పరమశివుఁడే దిక్కను తలంపు స్ఫురించెను. ప్రజాపతులు కైలాసగిరికిఁ బఱచి యట సర్వమంగళాదేవీసహితుఁడై లోకమంగళార్థము తపోయోగంబుననున్న పరమేశ్వరునకు సాగిలఁబడి లేచి,

### ప్రజాపతులు శివునిఁ బ్రార్థించుట

'భూతాత్మా! భూతభావనా! హాలాహలవిషంబు ముజ్జగంబుల దహించుచున్నది. నీవే దిక్కు; రక్షింపుము. సర్వలోకబంధమోక్షణంబులకు నీవే యీశ్వరుండవనియుఁ బ్రపన్నార్తిహారుండవనియు గురుండవనియుఁ బెద్దలు నిన్నుఁ బూజింతురు. అద్వితీయుండవయ్యు గుణమయమైన నీశక్తి నధిష్ఠించి మూఁడురూపంబులు దాల్చి సర్గస్థితిలయంబులు గావింతువు. మూర్తిభేదంబునుబట్టియుఁ గార్యభేదంబునుబట్టియు బ్రహ్మ విష్ణుమహేశ్వరు లనునామంబులు నీయెడఁ గల్పితంబులయ్యె. విశ్వంబెల్ల నీశక్తిపరిణామఫలంబగు. సర్వజ్ఞానంబులకు మూలమైనవేదంబునకు నీవు మూలంబగుదువు గావున స్వతస్సిద్ధజ్ఞానుండవు. మహత్తత్త్వంబును బ్రాణేంద్రియద్రవ్యకారణమైన త్రివిధాహంకారంబును గాలంబును సంకల్పంబును భవదన్యంబులు గావు. త్రివర్ణాత్మకమైన ప్రణవంబు నీ ప్రకాశకంబగు.

దేవా! అగ్ని ముఖంబనియు, భూమి పాదంబనియు, కాలము గతియనియు, దిక్కులు కర్ణంబులనియు, వరుణుండు రసనయనియు, నభంబు నాభియనియు, వాయువు శ్వాసమనియు, సూర్యుఁడు నేత్రంబనియు, జలంబు రేతస్సనియు, పరాపరజీవాశ్రయం బహంకారమనియు, సోముఁడు మనస్సనియు, దివంబు శిరస్సనియు, సముద్రంబులు కుక్షియనియు, గిరు లస్థులనియు, నిఖిలౌషధవీరుత్తులు రోమంబులనియు, ఛందస్సులు సప్తధాతువులనియు, ధర్మంబు హృదయంబనియు, తత్పురుష అఘోరసద్యోజాతవామదేవ ఈశానరూపమంత్రంబులైన యుపనిషత్పంచకంబు ముప్పదియెనిమిదిమంత్రవర్గకారకంబులైన యాస్యంబులనియు,స్వయంజ్యోతి యుపరతావస్థయనియు, దంభలోభాత్మకవిసర్గంబు ఛాయయనియు, మూఁడుగుణంబులు నంతర్నేత్రంబులనియు, ఛందోరూపసనాతనవేదంబు వీక్షణం బనియు నీవిశ్వరూపంబును వర్ణింతురు.

దేవా! ఇది నీవ్యక్తస్వరూపంబగు. నీయవ్యక్తస్వరూపం బన్ననో యది గుణత్రయరహితమై భేదం బేమియు లేక బ్రహ్మాత్మకమై

పరమజ్యోతిరూపంబున వెలుంగు నందురు. ఆరూపంబు లోకపాలకులకు గాని బ్రహ్మవిష్ణ్వాదులకుఁగాని, వేయేల? రూపధారులకు నెవ్వరికి గోచరింపదు. నీమహిమను వర్ణించుటకుఁగా దక్షాధ్వరధ్వంసము, త్రిపుర సంహారము, మృత్యునిగ్రహము మున్నగువానిని జేర్కొందురు. నీవు సృష్టించినవిశ్వంబును గన్నారఁ జూచుచు నీస్వల్పలీలలఁ బురస్కరించి నీమహిమను వర్ణించుటకన్న వెఱ్ఱితనము గలదా?

దేవా! లోకకళ్యాణంబుఁ గూర్చుట నీవ్రతం బగు. ఆవ్రతాంశంబుగాఁ గాలకూటవిషంబును మ్రింగనున్నావు. ఇదియు నీస్తుతి విషయంబుగాదు. నీస్తుతివిషయం బేదియందువా? ప్రళయకాలంబున నీకంటిమంటలచేత జగంబునెల్ల నీఱుగావించి యేమియు నేరనట్లుందువు. ఈనీతత్త్వంబు స్తుతివిషయంబగు. ఈ నీరహస్యంబు నాత్మారాములు గూడ గ్రహింపనేరక నిరీహులై వారిహృదయాంతరంబులందు నీపాదారవిందంబులను ధరించి నిన్ను ధ్యానింతురు.

దేవా ! నీతత్త్వం బిట్టిదై యుండఁగా, భవానీదేవి నొడిలోఁ జేర్చి నిరంతరము క్రీడించుచుండు మహాకాముకుండవనియు, వల్లనాటఁ దిరుగాడు పిశాచంబవనియు, నిన్నుఁగూర్చి కొందఱు ప్రేలుదురు. అంతకన్న నజ్ఞానులు గలరా ? వారియజ్ఞానంబు వింతగాదు గాని స్వాజ్ఞానంబునకు వారు లజ్జింపకుండుట యెంతయు వింతయగు.

దేవా! బ్రహ్మాదులు నిన్నుఁగూర్చి పల్కినపల్కులసారంబును మేము గ్రహించి యనుభవించి చవిగాంచితిమి. ఆరుచిప్రేరణంబున మాకృతజ్ఞత నివ్విధంబునఁ దెలుపుకొందుము. అంతియగాని నీతత్త్వంబును నిర్ణయించి పల్కుటగాదు. మాయవినయంబును మన్నింప వేఁడుదు' మని స్తుతించిరి.

### మహాదేవుఁడు కాలకూటవిషంబు మ్రింగుట

రాజేంద్రా ! మహాదేవుఁడు వారిమొఱ విని సర్వభూతసుహృదుఁడు గావున జాలిపడి తన సతివంక మఱలి 'భవానీ ! క్షీరసాగరంబున

మథించుటయు, నందుండి కాలకూటవిషంబు పుట్టుటయు, దానివలనఁ బ్రజలకుఁ గీడుగలుగుటయుఁ జూచితివా ? ప్రాజింపఁబోఁగా గుడి నెత్తిన వ్రాలిన ట్లయ్యెను. మేరలేనికోరికలు గోరరాదు; మించిన పనిఁ బూనరాదు. ఆసంగతి యిప్పుడు తలంచుట గతజలసేతుబంధనంబగు. ప్రాణార్తులై వచ్చిరి. దీనరక్షణంబు ప్రభుధర్మంబగు. పరప్రాణంబులను రక్షించుటకై సాధువులు స్వప్రాణంబులనుగూడ ధారపోయుదురు. కృపాపరుని భగవంతుఁడు కృపసేయు. భగవంతునకుఁ బ్రీతియగుట సర్వలోకప్రీతియగు. జాగువలదు; విషంబును మ్రింగనున్నాఁడ. ఈ కార్యము సర్వశుభస్కరమగు' ననెను. భవాని యందులకు నెంతయు సంతోషించెను. రాజా! ఈశ్వరుఁడు భవానీలోలుఁడో స్వతంత్రుఁడో చూచితివా ?

కాలకూటం బట్లుద్భవించి క్షణక్షణంబు విశ్వమెల్ల వ్యాపింప సాగెను. లోకేశ్వరుఁడు దానిని దనయఱచేతిలోనికి గ్రహించి మ్రింగి కంఠదేశంబున నుంచెను. ఆవిషము మహాదేవుని కంఠప్రదేశంబును నల్లఁగాఁ జేసెను. అదిమొదలు వానికిఁ గాలకంఠుఁ డనుపేరు వచ్చెను. వస్తువు నైజగుణంబును జూపుఁగదా. వానిసాహసంబు భవానీబ్రహ్మ నారాయణులకుఁ బ్రశంసాపాత్రంబయ్యెను. మహాదేవుఁ డవ్విషంబును మ్రింగునప్పు డందుఁ గొంత చెదరి చిందిపడెను. ఆబిందువులను సర్పంబులును విషౌషధులును గ్రహించి లోకాపకారకంబు లయ్యెను.

రాజేంద్రా! ప్రతికర్మంబునకు దానికిఁ దగినఫలంబు పుట్టకమానదు. పుట్టినఫలంబును గర్త భోగింపకతీఱదు. కర్తల స్వభావంబులఁబట్టి కర్మంబులును దత్ఫలంబులును శుభాశుభంబులుగా నుండును. అశుభ ఫలంబులు భోగ్యము లైనప్పుడు భోక్తలు తద్బాధ నోర్వఁజాలక పూర్వసుకృతలవంబున భగవంతుని బ్రార్థింతురు. భగవానుఁడు వారి మొఱలు విని వారితాపంబు దీర్పఁదలంచును. భోగ్యకర్మఫలంబు భుక్తముగాక నశింపదు గావున భోక్త లనుభవింపవలసిన కర్మఫలంబును భగవంతుఁడు స్వీకరించును. తత్ఫలంబుగా భోక్తలకు నుపశాంతి

గలుగును. మలినకర్మఫలంబులు మలినంబులుగా నుండుఁ గావున అవి భగవంతుని జేరినను వానిపవిత్రత తగ్గుపడకు భగవంతునియందుఁగూడ నుండుననియు, భగవంతుఁడు సర్వశక్తిమంతుఁడు గావునఁ దత్కర్మ ఫలంబులు వానికుక్షిలో నున్న యితరచరాచరలోకంబునకుఁ బ్రాణ నీయక తానే హరించుననియు నిర్విషగ్రహణకథ బోధించుచున్నది. భగవంతునిదయ యెంతో గ్రహింపనగు.

### కామధేనువు మున్నగువాని యుత్పత్తి

రాజా! పరమేశ్వరానుగ్రహఫలంబుగా దేవదానవులార్తిం బాసి మఱలఁ ద్రచ్చిరి. కామధేనువు జనించెను. దానిని బ్రహ్మవాదులైన ఋషులు చూచి 'బ్రహ్మలోకప్రాప్తికి యజ్ఞంబులు సాధకంబులగు. యజ్ఞంబులకు హవిస్సు వలయు. అది గోవులవలన సిద్ధించు' నని తలంచి దానిని గైకొనిరి. తర్వాతఁ దెల్లనియశ్వము పుట్టెను. చెవులు పెద్దవగుటంజేసి దానిని ఉచ్చైశ్శ్రవం బనిరి. అది బలిచిత్తంబును హరించెను. ఇంద్రుఁడు గూడ దాని నపేక్షించెను. హరి యింద్రుని నివారించి యాయశ్వంబును బలి గైకొనఁజేసెను. అనంతరము కైలాసగిరియంత పెద్దతెల్లని యేనుంగును, వానివెంబడి పారిజాతంబు, నప్సరసలును, రమాదేవియు గ్రమంబుగ నుద్భవిల్లిరి. రమాదేవీ రూపసౌందర్యాతిశయంబులు సురాసురనరులచిత్తంబు నాకర్షించెను.

### రమామహాభిషేకము

ఆజననికి మహేంద్రుఁ డుత్తమాసనంబును సమర్పించెను. ఉత్తమ వాహినులు మూర్తిగొని తమజలంబులను హేమకుంభంబులఁ దెచ్చి యిచ్చెను. అభిషేకయోగ్యంబులైనయోషధులను భూమి యొసఁగూర్చెను. గోవులు పవిత్రమైన పంచగవ్యంబులను, వసంతుఁడు చైత్ర వైశాఖమాసజంబులైన ఫలపుష్పాదులను సమర్పించెను. ఋషులామెకు యథావిధి నభిషేకంబుఁ గల్పించిరి. దిగ్గజంబులు పూర్ణకుంభంబుల నభిషేకించెను. గంధర్వమంగళగానంబులు నచ్చరల నృత్యంబులు [illegible]

బడెను. మేఘుఁడు గంభీరధ్వనుల నమ్మంగళకార్యంబును బ్రకటించెను. బ్రాహ్మణులు సూక్తవాకంబులు పఠించిరి.

సముద్రుఁడు పీతకౌశేయవస్త్రద్వయంబును, వరుణుఁడు దివ్యపరిమళమాల్యంబును, విశ్వకర్మ వివిధవిచిత్రభూషణంబులను, సరస్వతి యనర్ఘమైనహారంబును, బ్రహ్మదేవుఁడు పద్మంబును, నాగులు మణికుండలంబులను సమర్పించిరి. ఆదేవి వానిని గ్రహించి కైసేసికొని పూమాలను గేలఁబూని చెవి కైదండయిడ నటునిటు సంచరించెను. ఆదేవి యట్లు మణికుండలదీప్తిదీపితకపోలముకురంబులతో, లజ్జాలలితమందహాససుందరముఖారవిందంబుతో, కుంకుమచందనపంకకలితంబులైన రారాపుఁజన్దోయితో, స్తనభారంబునకు నసియాడుచున్న నెన్నడుముతో, నందియల నునుమ్రోఁతలతో బంగరుతీవయో యనఁ దిరుగాడుచుఁ దనకు నాశ్రయుని వరింప నెంచి తఱుగని సద్గుణవంతుఁ డెవఁడో యని యా సభాంతరంబున వెదుకసాగెను.

**రమాస్వయంవరము – వరలక్షణములు**

చెలికత్తె యొకతె యామెవెంటనుండి సభాంతరంబున నున్న గంధర్వయక్షామరసిద్ధచారణాదుల నొక్కొక్కనిఁ జూపుచు 'సుందరీ! ఇతఁడు మహాతపోధనుఁ'డనెను. ఇతఁడు పరమకోపనుఁ డని యాదేవి వానిని గడచి యడుగుపెట్టెను. 'ఇతఁడు పరమజ్ఞాని' యని మఱియొకనిఁ జూపెను. వానిజ్ఞానము నిస్సంగము గాదని యతనిని దృజించెను. ఇంకొకనిఁ జూపి 'ఇతఁడు మహాత్ముఁ'డనెను. అతఁడు 'జితకాముఁడు గాఁ' డని వానిని నిరసించెను. ఇంకొకనిఁ జూపి 'ఇతఁడు ప్రభు' వనెను. వానిప్రాభవంబు పరాశ్రయసాపేక్షమేగాని స్వతంత్రము గాదనెను. 'ఇతఁడు ధర్మబుద్ధి' యని వేఱొకనిఁ జూపెను. వానిబుద్ధి భూతదయార్ద్రముగా దనెను. 'ఇతఁడు త్యాగి' యని మఱొక్కనిఁ జూపెను. వాని త్యాగము ముక్తికారణంబుగా దనెను. 'ఇతఁడు వీర్యవంతుఁ'డని వేఱొక్కనిఁ జూపెను. వానివీర్యము కాలవేగనశ్వర మనెను. 'ఇతఁడు గుణసంగవర్జితుఁ'డని యింకొక్కనిఁ జూపెను. వానికి ద్వితీయత్వమందు నాద

రము లేదనెను. 'ఇతఁడు చిరాయు'వని వేఱొక్కనిఁ జూపెను. వానికి శీల మమంగళంబు గలుగ దనెను. 'ఇతఁడు పరమశీలి'యని మఱొక్కనిఁ జూపెను. వానికి నాయువు స్థిరముగా దనెను. 'ఇతఁ డాయుశ్శీలవంతుఁ' డని యొకనిఁ జూపెను. వాఁ డమంగళుఁ డనెను. 'ఇతఁడు సర్వసుగుణ మంగళమూర్తి' యని యింకొకనిఁ జూపెను. అతఁ డాత్మారాముఁడు గావున నన్నుఁ గోరఁ డనెను.

అట్లు శ్రీదేవి యెల్లర నుపేక్షించి యేకాగ్రమతియై 'ఏమహానీయుఁడు గుణాతీతుఁడయ్యు నిత్యానపాయిసద్గుణంబుల కెల్ల నేకాశ్రయుఁ డగునో యాపురుషోత్తముఁడు నిరపేక్షుఁడైనను వానినే వరింతు' నని తలపోసి తనచేతిపూమాలికను బద్ధనాభునికంఠదేశంబున వైచి లజ్జాలలితమందహాసచంద్రికలు చల్లుచు వానివక్షోభాగంబు తనకు నివాసంబుగా నపాంగవీక్షణంబుల సూచించుచుఁ జెంత నిలిచెను. లోకజనకుఁ డాజగజ్జననిమనంబు గ్రహించి తనయురోభాగంబు నామెకు నివేశస్థానంబుగా ననుగ్రహించెను. ఆదేవియందు వసించి కరుణాకటాక్షవీక్షణంబులను సారించినంతనే ముజ్జగంబులుఁ బెంపుసొంపుల నింపుమీఱెను. సురసుందరీమణులు తమయానందంబును నృత్యగీతవాద్యంబుల వెల్లడించిరి. బ్రహ్మారుద్రాదివిశ్వస్రష్టలు వైష్ణవమంత్రంబుల దంపతులఁ బ్రస్తుతించి పుష్పవర్షముఁ గురియించిరి. ప్రజాపతులును శ్రీకటాక్షభాగ్యపాత్రులై యానందవివశులైరి. రాజా! దీనింబట్టి లక్ష్మి యెచ్చోటు వరించి స్థిరస్థాయిని యగునో గ్రహింతువా?

రాజేంద్రా! రమాదేవి యట్లుపేక్షించుటంజేసి దైత్యదానవులు సత్త్వహీనులును నిస్తేజస్కులు నగుటయేగాక నిత్యలుబ్ధులునైరి. తర్వాత వారుణి కన్నియరూపంబుతో జనించెను. దానిని దితిసుతులు హరి యను మతితో గ్రహించిరి.

### అమృతోద్భవము

రాజేంద్రా! దేవాసురులు మఱల సాగరంబును మథించిరి. అందుండి యొకపురుషుండు పీనాయతబాహుదండంబులునుఁ గంబుకంఠం

బునుఁ బద్మారుణలోచనంబులను విశాలవక్షఃప్రదేశంబును నిద్ధంపుఁగేశ జాలంబును నీలగాత్రంబును గలిగి పీతాంబరంబుఁ గట్టి మణికుండలం బులు ధరించి పుష్పమాలికాసమలంకృతుఁడై హస్తతలంబున నమృతకల శంబులు దాల్చి యుద్భవించెను. అతఁడు విష్ణుదేవుని యంశాంశంబునఁ బుట్టుటయు, యజ్ఞభాగభోజనుండు నాయుర్వేదజ్ఞుండు నగుటయు బ్రహ్మాదులు గ్రహించి వానికి ధన్వంతరి యనుపేరు పెట్టిరి.

అసురు లాయమృతకలశంబును జూచి హితాహితంబులు వదలి తత్కలశంబును వానిచేతినుండి హఠాత్కరించి యొడిసి లాగితీసికొని దవ్వుపఱచిరి. అదిచూచి దేవతలు దుల్లంబోయినయుల్లంబులతో భగవా నుని శరణిల్లిరి. దేవదేవుఁడు సురలదుస్థితిని గాంచి దేవతలారా ! వగవ వలదు. అయ్యమృతంబు మీకుఁ దక్కు' నని యూఱటఁబల్కి యంతర్హితుఁడయ్యెను.

### అసురుల పరస్పరకలహము

రాజేంద్రా ! దొంగలు దొంగిలించువఱకు నేకభావంబున వర్తింతురు. దొంగసొమ్ము పంపకమునకు వచ్చినప్పుడు వారిలోఁ దగవు లేర్పడి తత్ఫలంబుగా వారి దొంగతనము వెల్లడియగు. అట్లే యసురుల స్థితియు నయ్యెను. అమృతంబెల్లఁ దనకే కావలయునని యొకఁడు పలికెను. నాకు వలదా యని యింకొకఁ డనెను. ఇది ధర్మము కాదనియు మనవలె సురలుగూడ నమృతార్థము పడరానిపాట్లు పడిరనియు నింకొకఁ డాక్షేపించెను. సత్త్రయాగంబునం దెట్లో యట్లే యెల్లరు సమభాగార్హు లని మఱియొకఁడు వాదించెను. దుర్బలులకేకలు మెండయ్యెను. బలవంతులు వారిని ధిక్కరించిరి. ఒండొరులు చేతులుకలపి పోరాడుచుఁ గ్రింద మీఁదఁ బడసాగిరి.

### మోహినియవతారము

రాజేంద్రా ! అత్తఱి నొకకన్యారత్నము క్రొమ్మెఱుంగుదీవి యో యన నటకు వచ్చెను. ఇందీవరశ్యామగాత్రంబుతోఁ, బూర్ణేందుబింబాన నంబుతో, ముకురంబులఁబోసి కపోలతలంబులతో, గంధఫలినిమెచ్చని

నాసికాపుటంబుతో, నిండుజవ్వనంపుసీటునిగ్గులచందోయితో, సొంపారుచు నిర్మలాంబరంబుఁగట్టి క్రీఁగంటిచూడ్కి వెన్నెలలు పఱపుచుఁ గేశపాశంబున ముడిచినపూఁగమినెత్తావికి మూఁగుచున్న తేంట్లను గెంగేల జోపుచు సునుగాలికిఁ దొలఁగుపయ్యెదఁ జక్కనొత్తుచు నసియాడు నెన్నడుముతో నందెలచిఱుమ్రోతలతో రాయంచనడకవచ్చిన యాకామినీమణి కంటఁబడినంతనే దేవదానవులచిత్తంబులు సుధాభాండంబునుండి మఱలి యాజగన్మోహినియందు లీనమయ్యెను. అమృతహరణార్థము జనించిన దొంగబుద్ధి యమ్మదవతీహరణార్థము మఱలెను. 'అహో! ఎక్కడిరూపము! ఏమిలావణ్యము!' అని యొక్కొక్కరు లోలోన నబ్బురపడుచు నొకరినొకరు మున్నాడుచు నయ్యింతినిఁ జేరఁ జనిరి.

అట్లు వారు డాయఁజని 'కమలాక్షీ! ఎవతెవు?' అని యొకండును, 'తలోదరీ! ఎవ్వరిదానవు?' అని యొకఁడును, 'కామినీ! ఎందుండి వత్తువు?' అని మఱియొక్కఁడును, 'చంద్రముఖీ! ఇందువచ్చినపనియేమి?' యని వేఱొకఁడును బ్రశ్నించిరి. 'జగన్మోహినీ! మామనంబులను మథించుచున్నావు. ఎవతెవో చెప్పు' మని కొందఱనిరి. 'అహో! ఇది గోరుతాఁకని పుష్పం' బని యొకఁడు ముక్కుపయి వ్రేలుంచెను. 'దేహధారులకు సకలేంద్రియప్రీతిఁ గూర్చుటకై సృష్టికర్త నిన్ను సృజించి దిద్ది తీర్చియిటు పంపెనా?' యని యొకఁడు లోలోన నాశ్చర్యపడసాగెను. కొందఱు తెంపుసేసి డాసి 'మానినీ! మేము కశ్యపమహర్షిసుతులము. పౌరుషవంతులము. ఒక్కవస్తువునకై యన్నదమ్ములకు మాకు మనస్పర్థలు జనించెను. తదర్థము తగవులాడుచున్నాము. మాకుఁ బరస్పరభేదంబులు గలుగకుండునట్లుగా నవ్వస్తువును యథాన్యాయము పంచి పుణ్యము గట్టుకొను' మని చెప్పిరి.

రాజేంద్రా! ఆసుందరీమణి దరహాసకటాక్షవీక్షణంబుల వారిమాట నాదరించి 'ఆర్యులారా! కశ్యపాత్మజు లెక్కడ? స్వైరిణియందుఁ దవులుట యెక్కడ? పండితు లెన్నఁడును గామినులను నమ్మరుగదా! వృకంబు

లకు వనితలకు నూతనప్రియత్నము నైజమగుట తెలియరా ? అట్టివారి తోడిచెలిమి నీటిమూటయందు' రనెను. ఆతేనెతేఁపు తేటపల్కులు వారికి నెంతయు రుచికరంబులయ్యెను. ఆమాటలకు వారు నవ్వుచు 'సుధాభాండంబు నయ్యింతిచేతికి నిచ్చిరి. ఆహాయలుక త్తియ యాకలశంబును దీసికొని 'నేర్పుకొలఁది గావింతు. అది లెస్సయైనను గాకున్నను మీరు సమ్మతింతురేని మీపంచినపని సేయుదు' నని ముసిముసినవ్వులతోఁ బలికెను. ఆమాటలభావంబు వారు గ్రహింపక 'నీయిచ్చ సేయుము.' అనిరి. 'అట్లయిన మీరెల్లరు శుచులై రానగు' నని యామాయలాడి చెప్పెను.

## అమృతవిభాగము

ఆరమణీమణివచనంబు నామోదించి సురాసురదైత్యదానవు లుపవసించి నీరాడి ధౌతవస్త్రంబులు ధరించి హోమంబు లొనర్చి గోవులకు భూతంబులకు గ్రాసాదు లొసంగి విప్రులకు యథోచితదానంబు లిచ్చి వారియాశీర్వాదంబులు పడసి సురభిధూపధూపితంబు నాజ్యదీపదీపితంబు నైనశాలం జొచ్చి తూర్పుముఖంబుగాఁ దీర్చియున్న కుశాసనంబులందు బంతులుతీటి కూర్చుండిరి.

అంతలో నక్కాంతామణి నూత్నదుకూలంబు ధరించి సుధాభాండంబును జేతఁగొని మదవిహ్వలవీక్షణంబులను సారించుచు నూపురరవమనోహరమైన మందమందగమనంబున శాలాంతరము చొచ్చెను. ఆలోకమోహనాంగి కంటఁబడినంతనే యసురులు మోహావశులై యదే లోకంబుగా నుండిరి. ఆపూఁబోఁడి లోనికి వచ్చి బంతులు దీటియున్న వారిని జూచి 'అసురులు జన్మక్రూరులు; వారికి నమృతం బిచ్చుట పాములకుఁ బాలుపోయుటగు' నని లోలోన నిశ్చయించి సురాసురులను వేఱుబంతులుగాఁ దీర్చి తియ్యనిమాటలతోఁ గ్రీఁగంటిచూపులతో ముసిముసినగవులతో దైత్యులను బులిమిపుచ్చుచు నమరులకు నమృతంబును బంచెను. ఆసుదతి యట్లుచేయుట చూచుచు మాటదాఁటరాదని కొందఱును, స్త్రీలతోడికలహంబు కూడదని కొందఱును, నోరెత్తినచోఁ బ్రణయభంగ

మగునేమో యని కొందఱునసురులు లోలోనఁ దలంచుచు మిన్న కుండిరి.

### రాహుశిరచ్ఛేదము

రాజా! అత్తఱి రాహు వనుదానవుఁడు సురవేషము దాల్చి సురలబంతిలోఁ గూర్చుండి వానిపాలికి వచ్చినసుధను గైకొని గ్రోలెను. వానికి నిరుప్రక్కలసూర్యచంద్రులు కూర్చుండియుండి యెట్లో యాకపట నాటకంబును గ్రహించి సన్నచేసిరి. వెనువెంటనే చక్రాయుధంబు తటాలునవచ్చి రాహుకంఠంబును ఖండించెను. తలయొకప్రక్కను మొండెం బొకప్రక్కను బడెను. అతఁడు ద్రావినయమృతంబు నోటిలోనే యుండెను గావున వానితలమాత్రం బమృతత్త్వంబును బడసెను. ఆశిరస్సు గ్రహమై పగఁబూని పర్వకాలంబులందు సూర్యచంద్రులను మ్రింగుచుండు.

### ఏకరూపకర్మము - ఫలభేదము

రాజేంద్రా! సురాసురు లిరువురు నొకచోట నొక్కకాలంబునఁ జేరి యొక్కవస్తువునకై సముద్రమథనరూపమైన యేకరూపకర్మంబు నొనర్చిరి. కర్మం బేకరూపంబయ్యు వారికి ఫలభేదము ప్రాపించెను. కారణం బేమో గ్రహింతువా? సురలు భగవంతు నాశ్రయించిరి. అసురు లట్లుచేయక స్వశక్తిని విశ్వసించి వర్తించిరి. అసురులభావమేమి? కర్మమే ఫలం బిచ్చునని వారివిశ్వాసము. కర్మము జడము. దానికి స్వతంత్ర శక్తి లేదు. ఫలంబు నిచ్చుశక్తి సర్వేశ్వరునకుమాత్రమే గలదు. భగవానుఁడు వాని నాశ్రయించినవారికిఁ గోరికలు గూర్చు.

రాజా! దేహధారులకుఁ గర్మముచేయుట తప్పదు. కర్మంబులెల్ల మనోవాక్కాయంబులచేత జరుపఁబడు. సంకల్పంబునుబట్టి ఫలప్రాప్తి యుండు. సంకల్పము స్వార్థమో స్వజనార్థమో యగునేని అది యహంకారమమకారపూర్వకంబగు. మఱియు దానిని భేదభావం బంటుకొనియుండు. అట్టి సంకల్పముతోడికర్మంబులఫలంబు శుభస్వర్గమును

శాశ్వతంబును గానేరదు. ఆకర్మంబులనే యభేదదృష్టితో భగవదర్పణంబుగా నొనర్తురేని సర్వజ్ఞుండైనభగవానుం డెవనికి నెప్పు డేదిమేలో దాని ననుగ్రహించును. ఆఫలం బెంతయు శుభస్కరమగు. మర్త్యులకు స్వధర్మరూపకర్మంబులను జేయుటయందుమాత్రమే యధికారము గలదు. ఫలప్రాప్తి యీశ్వరాధీనము. ఈరహస్యంబు నెఱింగి వర్తించువారు మేలునే పడయుదురు.

రాజేంద్రా! భగవానుం డట్లు కన్యారూపంబుం దాల్చి తన్నాశ్రయించినసురలకు నమృతంబును జెందచేసి యెల్లరుం జూచుచుండంగా గరుడారూఢుండై స్వస్థానంబునకుం బోయెను.

### దేవాసురయుద్ధము

అసురు లట్లు భగ్నమనోరథులై యదియెల్ల సురలకపటనాటక ఫలంబని నిశ్చయించి యాయుధపాణులై వారినిం దార్కొనిరి. సురలును సుధాప్రభావంబున ధైర్యోత్సాహులై వెనుదీయక శస్త్రాస్త్రంబులతో నసురులను ఢీకొనిరి. భేరీశంఖవాద్యనాదంబులును గజబృంహితంబులును హయహేషలును రథనేమిధ్వానంబులును భటులయార్భటంబులును జెలరేఁగి తుములమై మాఱుమ్రోఁగెను. రథికులు రథికులతో గజంబులు గజంబులతోఁ హయంబులు హయంబులతోఁ గాల్బలంబు కాల్బలంబుతో మార్కొనెను. ఇరుపక్షంబులందుఁ గొందఱు మాయాబలంబు నాశ్రయించి వివిధమృగరూపంబులు ధరించి యేజాతితో నాజాతి దార్కొనెను.

చిత్రధ్వజంబులు చినిగి చింపులై రాలెను; శ్వేతాతపత్రంబులు చెల్లాచెదరయ్యెను; బాహ్యచామరవ్యంజనంబులు వజ్రమయదండంబులతోడఁ బుడిపొడియై నేలఁబడెను; ఉత్తరీయంబులు వాతోద్ధూతంబులై గాలిపడగలువోలె నింగి నెగరెను; రత్నకిరీటంబులు రాలి పాదఘట్టనంబులవలనతుత్తుమురై రూపుమాసెను.

అసురేశ్వరుండైన బలి యుద్ధసన్నద్ధుండై మయనిర్మితంబును గామగమనంబునైన వైహాయసవిమానంబు నధిరోహించి సర్వసేనాసమే

తంబుగా రణరంగంబునకుఁ దరలెను. వానినిజట్టి సేనానాయకులు నముచిశంబరబాణవిప్రచిత్తులును, అయోముఖద్విమూర్ధకాలనాభ హేతి ప్రహేతులును, ఇల్వల శకుని భూత సంత్రాసన వజ్రదంష్ట్ర విరోచన హయగ్రీవ శంకుశిర కపిలోగ్రదృష్టులును, మేఘ దుందుభి తారక శుంభని శుంభజంభులును, ఉత్కలారిష్టారిష్టనేమిమయులును పౌలోమ కాలకేయ నివాతకవచాదులును నడచిరి. ఆర్పులుఁ బేర్పులు మెండయి నంతరాళంబును బ్రద్దలుచేసెను.

అసురవిజృంభణంబును జూచి దేవేంద్రుఁ డైరావతంబు నెక్కి సంగరంబునకుఁ దరలెను. వాయువహ్నివరుణాదులు తమతమయానంబు లధిష్ఠించి సర్వాయుధసమగ్రంబుగా సురేశ్వరుని వెంబడించిరి. ఉభయ సేనలు తలపడెను. వీరులు తమతమపేర్లు చెప్పి వైరివీరులను బోరికిఁ బిలిచిరి. మగలు జతలై యొండొరుఁ దాఁకిరి.

దేవేంద్రుఁడు బలిని ఢీకొనెను; స్కంధుఁడు తారకుని నెదుర్కొనెను; వరుణుఁడు హేతిని, మిత్రుఁడు ప్రహేతిని, యముఁడు కాల నాభుని, విశ్వకర్మ మయుని, త్వష్ట శంబరుని, సవితృఁడు విరోచనుని, పరాజితుఁడు నముచిని, అశ్వినులు వృషపర్వుని, సూర్యుఁడు బాణ ప్రముఖబలిసుతశతంబును, సోముఁడు రాహువును, అనిలుఁడు పులో మునిని, భద్రకాళి శుంభనిశుంభులను, కృపాకపి జంభుని, విభావసుఁడు మహిషుని, బ్రహ్మతనయులు ఇల్వలవాతాపులను, కామదేవుఁడు దుర్మర్షుని, మాతృగణం బుత్కలుని, బృహస్పతి భార్గవుని, శని నరకుని, మరుత్తులు నివాతకవచులను, వసువులు కాలకేయులను, విశ్వదేవులు పౌలోములను, రుద్రులు క్రోధవశులను మార్కొనిరి. అట్లు వారు జంటజంటలై మార్కొని జిగీషాసముత్సుకులై బాణకృపాణతోమర పరశుపరిఘప్రాసంబులను మార్చిమార్చి ప్రయోగించిరి.

రథికులమస్తకంబులు తెగి రాలెను; గజాంగంబులు తునిగిపడెను; తురంగగాత్రంబులు దుస్సి కూలెను; మావటీంద్రతలలు వ్రీలిపడుచెను;

కాల్బలంబు నుగ్గునూచమై నేలెను; రథంబులు తుత్తునియలై యొఱం గెను; ఆయుధంబులు శకలంబులై నేలఁ బఱచెను; భూషణంబులు విశీర్ణంబులయ్యెను; రణక్షోణి రుధిరసిక్తమై దుర్నిరీక్షంబయ్యెను; సైన్య పాదఘట్టనంబులధూళి రేగి రవిమండలంబు గప్పెను; చీఁకట్లు వ్యాపించెను. కొందఱు చచ్చిపడియు హస్తంబులందలిఖడ్గంబులను వదలరైరి; కొందఱు తలలు తెగిపడినను మొండెంబులతోన వైరిమీఁదికిఁ బ్రాఁకుచుండిరి.

### బలిదేవేంద్రులయుద్ధము

రాజా! బలి యింద్రుని దాఁకి వానిపయిఁబడి బాణంబులను, వానిగజంబుపయి మూఁడుశరంబులను, తద్గజపాదరక్షకులు నల్వురపయి నాల్గుతూపులను, మావటీనిపయి నొక్కములుకు నేసెను. ఇంద్రుఁడు బలికి నవ్వుచు ప్రతిశరంబులు వైచి వానిశరంబులనెల్ల మార్గమధ్యంబున ద్రుంచివైచెను. అంతట బలి శక్తిని జేతఁబట్టెను. కొఱవివలె మండుచు భయంకరముగానున్న యాసాధనంబును బలిచేతనుండఁగానే యింద్రుఁడు నఱికెను. వైరోచనుఁడు క్రోధావేశుఁడై ప్రాసంబును బూనెను. ఇంద్రుఁడు దానినిగూడఁ ద్రుంచెను. బలి మహోగ్రుఁడై శూలతోమరాదు లొక్కొక్కటి గ్రహింపసాగెను. ఇంద్రుఁడు వానినెల్ల ఖండించెను.

నరేంద్రా! బలి తనయాయుధంబులెల్ల నట్లగుట చూచి ముఖాముఖయుద్ధంబు ప్రయోజనము లేదని తలంచి యంతర్ధానుఁడై యసురమాయను బుట్టించెను. తత్ఫలముగాఁ బెనుకొండ యొకటి మంటలు మండుచు సురసేనమీఁదఁ బడెను. దానిపాటునకు సురసైన్యము పొడియయ్యెను. మఱియు నక్కొండనుండి సింహవ్యాఘ్రవరాహాదందశూకవృశ్చికాదిక్రూరజంతువులు తండోపతండంబులుగా నుప్పతిల్లి హతశేషంబైన నిర్జరసేనను జంపసాగెను; యాతుధానులు శూలంబులఁబట్టి దిసమొలలతో రణరంగమునఁ జొచ్చి పట్టుడు కొట్టుడు నఱుకుడనుచు విహరింపఁదొడఁగిరి; కాఱుమేఘంబులు సంగిఁబర్వి ఫెళఫెళ నురుముచుఁ దళతళ మెఱయుచు నంగారకంబులను గురిసెను; వాయువు ప్రచండగతి

నొందెను; నిప్పుగాడ్పులు భోరున వీచెను; సాగరంబు మహాకల్లోలాభీలమై పొంగిపొరలెను. వేయేల? దైత్యమాయావిశేషంబులు దురూహంబులై విజృంభించెను.

ఇంద్రాదులు తత్ప్రతిక్రియ నేరక దిగారుపడి భగవంతుని భావించుచు నెచ్చటివా రచ్చట ఱిచ్చనుండిరి. భగవానుఁడు గరుడారూఢుఁడై సన్నిధిచేసెను. వానిరాకతోడ దైత్యమాయ లెల్ల మాయమయ్యెను.

### కాలనేమ్యాదుల సంహారము

కాలనేమి హరిని జూచి సింహారూఢుఁడై శూలంబునెత్తి సత్త్వకొలఁది భగవానుపయి విసరెను. సర్వేశ్వరుఁ డాశూలంబు నందికొని దానితోన కాలనేమిని వానివాహనంబును దునుమాడెను. కాలనేమి పాటుచూచి మాలియు సుమాలియుఁ గ్రోధమూర్ఛితులై గదలుపట్టి విజృంభించిరి. భగవానుఁడు చక్రంబున మాలితలఁ ద్రుంచెను. సుమాలి పఱచి చావు తప్పించుకొనెను. లోకనాథుని కారుణ్యవిశేషంబున సురలు పునర్జీవితులోయన లేచి బలసంపన్నులైరి. సురాసురులకు మఱల జంటపోరాటమయ్యెను.

### బలిదేవేంద్రుల సంవాదము

రాజా! ఇంద్రుఁడు వజ్రంబునెత్తి బలిమీఁద నేయఁబోయెను. హాహాకారంబు లెగసెను. సురనాథుఁ డాధ్వనులు విని బలిని జీరి 'మూఢా! వంచకులు బాలకులకన్నుమూసి వారిసొమ్మును హరించు విధంబున నీవు మమ్ము నీమాయలచేతఁ గెలువఁదలంచితివి. మాయేశ్వరులమైన మాకడ నీటక్కులు సాగునా? దొంగలు కొందఱు మాయలు పన్ని దివంబు నారోహింప యత్నింతురు. వారిని గ్రిందఁబడఁద్రోయుదుము. నీదుర్మాయాఫలంబును నీ వనుభవింపకతీఱదు. ఇదే నావజ్రాయుధము వ్రేటుపడి నీవారిం జేరు' మని యధిక్షేపంబులు పలికెను. బలి వానిని విని 'ఎల్లరును గాలచోదితులై తత్తత్కర్మంబు లొనర్తురు. మనము నట్లే కాలచోదితులమై సంగ్రామకర్మంబునకుఁ దొడఁగితిమి.

సంగ్రామపరులరు జయకీర్తులొండెఁ బరాజయమృత్యువులొండె రెంట నొకటి తప్పదు. ప్రాణులిట్లు కాలపాశబద్ధులై వర్తించుట పండితులు గ్రహించి మేలుగీళ్లకు హర్షశోకంబులు చెందరు. జయాపజయంబులు స్వశక్తింబట్టియుండునని కొందఱు భావింతురు. అది తెలివిగలవారితలంపు గానేరదు. అజ్ఞానుల యెత్తిపొడుపులను మేము లెక్కింప' మని బదులు పలికి విల్లుపూని తీవ్రబాణంబులను సంధించి యాకర్ణాంతము దివిచి సురేంద్రుని పయి వదలెను. తీవ్రాంకుశహతులు గజేంద్రునకువలె బలినిరసనోక్తులు సురేంద్రునకు నయ్యెను. ఇంద్రుఁడంతట వజ్రాయుధంబును బలిపయిఁ బ్రయోగించెను. దానితాఁకునకు ఱెక్కలు తెగినకొండవలె బలి వాహనంబుతోడ నేలఁబడెను.

### జంభాసురదేవేంద్రులయుద్ధము

జంభాసురుఁడు బలిపాటు విని 'కటా ! నామిత్రునకు నిట్టిదయ్యెనా?' యని వ్యసనాగ్రహంబులంది గదఁబూని సింహవాహనంబు నధిష్ఠించి యింద్రుని దలపడి వాని జత్రుప్రదేశంబున గ్రుమ్మి యైరావతంబు నేసెను. ఆవ్రేటునకు నగ్గజరాజము సుసెడి మోఁకాళ్లు నేలమోపి యొఱగి మూర్ఛిల్లెను. అంతలోన మాతలి హయసహస్రాయతరథంబుతో నింద్రు నెదుట నిలిచెను. సురపతి తద్రథంబు నారోహించెను. జంభుఁ డది చూచి 'మాతలీ ! నీపని కెంతయు మెచ్చితి' నని నవ్వుచు నగ్నిజ్వాలా భీలశూలంబునెత్తి వానిపయి వైచెను. దానితాఁకు దుస్సహంబై నను మాతలి యోర్చెను. ఇంద్రుఁడు మాతలికి నెంతయు జాలిపడి వజ్రంబున జంభుశిరంబు ఖండించెను.

### నముచ్యాదులయుద్ధము

జంభునిచావు వానిజ్ఞాతులు నముచిబలపాకులు నారదునివలన విని మహోగ్రమూర్తులై యింద్రునిఁ దలపడి నొనాడి మేఘంబులు వర్షధారలను నగంబుపై నట్లు బాణవర్షంబు నతనిపయిఁ గురిసిరి. బలుఁడు స్వహస్తలాఘవంబు మెఱయ వేయుశరంబుల లొక్కపతి

సారించి యింద్రునిపయి వైచి మఱివేయిబాణంబుల వానిరథ్యంబుల నొప్పించెను. పాకుఁడు బాణసంధానమోక్షక్రియ లేర్పడనిచందాన రెండువందలయమ్ములు మాతలిపయిఁ గుప్పించి వేనవేలుశరంబులు పఱచి రథంబును నూగింతలుగాఁ జేసెను. నముచి సువర్ణపుంఖసాయకపంచకంబు నింద్రునిపయివైచి మేఘగర్జ గావించెను.

అట్లు దానవులు ముప్వురుంగూడి సురనాయకుని వానిరథరథ్య సారథులతోడ శరవర్షంబున ముంచుటంజేసి దేవేంద్రుఁడు ప్రావృణ్మే ఘావృతసూర్యుఁ డట్లు గానరాకుండెను. అమరులు తమనాథునిగానక భయవిహ్వలంబులొంది దిక్కేది జడుపులైరి. శత్రువ్యూహంబు ముట్ట డించెను. సురలు సముద్రమధ్య విచ్ఛిన్ననావికాంతరవణిజులగతినొంది బమ్మరింపసాగిరి. అంతలోన నింద్రుఁడు వాని నావరించియున్న శరపంజ రంబునుండి రథరథ్యసారథులతోడన్యుదయార్కునివలె వెలువడి నింగినెల్ల వెలిగించుచువచ్చి శత్రుహస్తగతులై గోడుగోడుమనుచున్న తన సైన్యంబును జూచి కోపవివశుఁడై వజ్రంబెత్తి బలపాకుల యిద్దఱి తలలు ఖండించెను.

నముచి యదిచూచి శోకకోపవివశుఁడై యింద్రుని ఢీకొని 'ఓరీ! చచ్చితి' వనుచుఁ గనత్కనకశూలంబును వానిపయి నేసి సింహానాదం బొనర్చెను. ఆశూలము ఘంటానినదంబులతోఁ దనవంకకు వచ్చుట నింద్రుఁడు చూచి పెక్కుబాణంబులు వైచి నడుదారిలోన దానిని తుండించి నముచిపయి వజ్రాయుధంబును బ్రయోగించెను. మహాశక్తి మంతంబైన యావజ్రాయుధంబు నముచిని దాఁకియు వానిచర్మంబును గూడ గీటదయ్యెను. అందులకు నెల్లరు నాశ్చర్యపడసాగిరి. ఇంద్రుఁడు తనయాయుధం బట్లగుటఁ జూచి భీతిల్లి 'కటా! ఏది పర్వతరాజపక్షం బులఁ ద్రుంచి ప్రజలకు మేలుగూర్చెనో, ఏది వృత్రాసురుఁ డంతవానిని దెగటార్చెనో, ఎద్దానిప్రేటులకుఁ బెక్కండ్రు బలియు లుక్కడంగిరో యావజ్రాయుధంబు నేఁ డీయల్పునియెడ శక్తిహీనంబగుట యెంతయు

వింతగా నున్నది. దధీచిమునివర్యునిబ్రహ్మతేజంబు నిస్తేజమయ్యెనో దైవయోగం బెట్టిదో యూహింపరాదు' అని విషణ్ణచిత్తుండై లోలోనఁ జింతింపసాగెను.

అంతలోన 'ఇంద్రా! ఈదానవుఁ డార్ద్రశుష్కంబులఁ జావఁడు. అది నావరము. ఉపాయాంతరంబును జింతింపు' మని గగనవాణి వినఁబడెను. దేవేంద్రుఁ డాపల్కు లాలకించి సుంత తలపోసి శుష్కము గాని యార్ద్రముగాని వస్తువేదియో యని యాలోచించి జలఫేనం బట్టిదగుట నిశ్చయించి నురుఁగుతో వజ్రంబు నభిమంత్రించి ప్రయోగించెను. నముచి తలవ్రాలి నేలఁబడెను. ఋషుల ప్రస్తుతులును విశ్వావసు పరావసునామగంధర్వులకీర్తనంబులు నింద్రునిపయిఁ గురిసెను. అంతట వాయువహ్నివరుణాదులు చెలరేఁగి సింగంబులు మృగంబులనట్లు కంటఁబడిన యసురుల నురుమాడిరి.

### నారదుఁడు యుద్ధంబును మాన్పుట

అయ్యవసరంబున నారదుఁడు బ్రహ్మపంపున నచ్చటకు వచ్చి 'సురలారా! శ్రీమన్నారాయణభుజాశ్రయంబుఁబడసి యమృతంబును సాధించితిరి. ఇఁక మీకుఁ బోరేల ?' యనిచెప్పి యుద్ధంబును మాన్పి దానవక్షయంబు వారించెను. అమరులు క్రోధంబు మాని నాకంబునకుఁ జనిరి.

హతశేషులైనదానవులు నారదానుమతంబున బలినెత్తికొని యస్తాద్రికిఁ జనిరి. శుక్రుఁడు బలిని స్పృశించెను. అతఁడు లేచి సంగతియెల్లఁ దలపోసి లోకతత్త్వజ్ఞుఁడు గావున నోటమికై దిగులొందక ధీరతనుండెను. శుక్రుఁడు సంజీవనీవిద్యామహిమంబునఁ దలలూడనిదైత్యదానవులను బ్రదికించెను.

### శివుఁడు మోహినీరూపంబును జూడఁగోరుట

రాజేంద్రా! శ్రీమహావిష్ణుమోహినీరూపంబును దత్కార్యంబులు శివునకుఁ జెప్పిరి. ముక్కంటి తద్రూపదర్శనోత్కంఠితుఁడై యుమాసహితం

బుగా హరియొద్దకు వచ్చెను. హరియుఁ బార్వతీపరమేశ్వరులకు సాదర సత్కారంబులు నెఱపి సుఖాసనాసీనులఁ గావించెను. మహేశుఁ డంతట హరివంకఁ జూచి 'దేవదేవా! జగద్వ్యాపివియు జగన్మయుండవును జగదీశ్వరుండవు నై వెలయుదువు. నీవలన సర్వభావంబు జనించి పెంపు గాంచును. నీవే జగదాదిమధ్యాంతకుఁ డగుదువు. నీకుమాత్రం బాది మధ్యాంతంబులు గలుగవు. నీచిద్రూపంబు బ్రహ్మయగు. ద్రష్టయు దృశ్యంబును భోక్తయు భోగ్యంబును నీరూపాంతరంబులేగాని యన్యం బులుగావు. శ్రేయస్కాములకు నీచరణారవిందభజనంబుదక్క వేఱొండు గతి గలుగదు. ఐహికాముష్మికసంగంబులఁ ద్రెంచివైచి కేవల నిష్కాము లైనవారికిమాత్రమే భవత్పాదారవిందభజనభాగ్యంబు లభించు. ఎట్టి కోరికయు నీకుఁ గలుగదు. కోరినవారికిఁ గోర్కె లిత్తువు. సర్వము నీవే యయ్యు సర్వాతిశాయివై యుందువు. అన్నింటికిఁ గారణం బగుదువు. నీకుఁ గారణంబు గలుగదు. సువర్ణంబు భూషణంబులందట్లు కారణము కార్యమందుండు. కారణకార్యైక్యదృష్టి యద్వైతంబును కారణకార్య ప్రత్యేకదృష్టి ద్వైతంబును దోఁపించు. అంతియగాని దృష్టిభేదంబునఁ జేసి వస్తుభేదము గలుగదు. అట్లే నీవును నీకార్యమైనజగంబునం దుందువు. జగంబు భగదన్యంబు గాదనుభావంబుతో దృష్టిని నీయందే నిలుపుట యద్వైతంబగు. నిన్నును నీకార్యంబును బ్రత్యేకించిచూచుట ద్వైతం బగు. అట్లు వేఱుచేసి యవి రెండును స్వతంత్రపదార్థంబులని భావించుట యజ్ఞానమగు.

దేవా! బ్రహ్మమని కొందఱు, ధర్మంబని కొందఱు, పరుఁడని కొందఱు, నవశక్తిమంతుఁడని కొందఱు, మహాపురుషుఁడని కొందఱు నిన్నొక్కనినే వివిధంబులఁ బేర్కొందురు. కారణ మేమందువా? వారి వారి జ్ఞానరుచులభేదమే కారణము. నీతత్త్వంబును సమగ్రంబుగా గ్రహింపలేకుండుటకు హేతు వేమందువా? సత్త్వప్రధానులని నన్ను బ్రహ్మను మరీచ్యాదిఋషులను శ్లాఘింతురు. అట్టి మాకుఁగూడ నీవిశ్వరచనయు నీమాయావిలాసంబులును గొంతయు గోచరింపవనఁగా రజస్తమః

ప్రధానులసంగతి చెప్పనేల ? ఆకాశవాయువులట్లు నీవు చరాచరజాతం బును వ్యాపించియుందువు. దేవా! నీగుణక్రీడలైన యవతారంబులఁ జూచితి. నీమోహినీరూపంబును జూడఁగోరికయై యిందు వచ్చితి' ననెను.

భగవానుఁడు శివుని విని 'చంద్రశేఖరా! దైత్యులు సుధాభాండంబును హరించిరి. అయ్యమృతంబును సురలకుఁ జెందఁజేయుటకై నారీ రూపము ధరించితిని. అసురులు కామవశులు గావునఁ దద్రూపము వారిని గామాంధకారకూపంబునఁ ద్రోసెను. అది సమయంబుగా సురలకు నమృతంబుఁ గూర్చితిని. ఆరూపంబునుజూడ నింతదవ్వు వచ్చితివా ?' యనుచు నంతర్ధానుఁడయ్యెను. భవుఁడు భవానీద్వితీయుఁడై యటునిటుఁ జూచుచుండెను.

### శివునకు మోహినీసందర్శనం బగుట

పరీక్షిన్నరేంద్రా! ఆచేరువున నుపవనం బొకటి యుండెను. ఆవనాంతరమందు నొకానొకసుందరీమణి చెండాడుచు వంగుచు లేచుచు నుండుటంజేసి దానికుచంబులు కంపించుచుఁ జూడ్కికి నింపుగా నయ్యెను. మఱియు దానినెన్నడుము స్తనభారంబున నకనకలాడుటయు, కందుకము పాదతలంబుఁ దాఁకినప్పుడు తచ్చరణరాగరంజితమై వర్ణాంతరంబు నొందుటయు, అది లేచినప్పుడు తన్నయననీలచ్ఛాయంబడసి నల్లదనంబువహించుటయు మహాచిత్రముగా నుండెను. ఆచెండుతోడఁ బఱచుచున్నయాననను బోడి చూడ్కులవిలసనంబులు వర్ణింపరావు. ఆయాటవడికి దానిదుకూలము జాఱెను; కేశపాశము వీడెను; కుంతలంబులు నెమ్మోముఁ గప్పెను. ఆసొగసులాడి కేళీపరయై డాకేల దుకూలకేశంబుల సవరించుకొనుచు వలకేలఁ జెండాడుచు నుండెను. అంతలోనఁ జెండు చేయివీడి దవ్వు పోయెను. ఆయొయ్యారాలాడి దానివెంటఁ బఱచెను. ఆవేగంబునకు దాని మొలనూలు సడలెను. సన్ననిచీరె వీడి గాలికి దూలెను.

శివుఁ డాయింతిని దానిచెయిదంబులును జూచినంతనే వానిని దలపు పైకొనెను; తెలివి జాఱెను. ముక్కంటి యంతటఁ దత్కాంతా

పరచిత్తుఁడై లజ్జవిడిచి యుమాదేవి చెంతనుండుటఁగూడ మఱచి యా నీటుకత్తె చన్నవలనుఁబట్టి హుటాహుటిఁ బఱచెను. పురుషుఁడు వచ్చుట యాలేమ చూచి వస్త్రహీనగావున సిగ్గునంబోలె నవ్వుచుఁ బొదలచాటు దాఁగెను. శివుఁడు కామోన్మథితుఁడై యావగలాడిని డాసి యది వలదు వల దనుచున్నను వినక దానినిబట్టి గవుంగిటఁ గూర్చెను. ఆహోయలు బొమ్మ సుంతఁ బెనఁగులాడి వానికవుంగిలిఁ దప్పించుకొని పఱచెను. కరీంద్రము కరేణువు నట్లు ముక్కంటి యాకన్యామణిని వెన్నాడెను. వానిరేతస్సు స్ఖలించి చింది దారిలోఁ బడెను. అది పడినచోట్లు కనకరౌప్య క్షేత్రంబు లయ్యెను. రేతస్స్ఖలనానంతరము శివుఁడు కొంతస్వస్థతఁ గాంచి యదియంతయు విష్ణుమాయావిలాసంబని గ్రహించి తలయూచి సిగ్గుబెగడులు చెందకుండెను.

అంతలోన శ్రీమహావిష్ణువు సన్నిహితుఁడై 'మహేశ్వరా! నా మాయకు మోహపడియు నాత్మశక్తిని మెఱయించి స్వనిష్ఠను వహించితివి. భవదన్యు లెవ్వరును నామాయను దాఁటఁజాలరు. నేను కామరూపుఁడను; నాశక్తి గుణాత్మకయై నన్నాశ్రయించియుండి ఆమాయ నిన్నెపుడును వంచింప' దని పలికి వానికి యథోచితసత్కారంబు లొనర్చెను. మహాదేవుఁడును విష్ణుని వీడ్కొని యుమాద్వితీయుఁడై స్వస్థానంబునకుఁ బోయెను.

### శివుఁడు తనప్రమాదంబును భార్యకుఁ దెలుపుట

రాజేంద్రా! ఒకనాఁడు శివుఁడు భవానీసహితుఁడై యుండఁగా ఋషు లటకు వచ్చిరి. శివుఁడు భార్యను బల్కరించికొని ఋషులు వినఁగా 'దేవీ! పరమపురుషుని మాయావిలాసంబును జూచితివా! సకలకళలకు నీశ్వరుండననియు నాత్మవశుండననియు నన్నుఁ బల్కుదురు. అట్టి నేనుగూడఁ దన్మాయకు మోహపడితిని. అస్వతంత్రులసంగతి చెప్ప నేల? సఖీ! వేయేండ్లు నేను యోగనిష్ఠఁబూని చాలించినప్పుడు 'దేవా! ఎవ్వనిఁగూర్చి యింత నిష్ఠఁబూనితివని నీవు నాఁడు నన్నడిగిన మాట జ్ఞప్తియున్నదా? నానిష్ఠయెల్ల నిష్పాకారాణపూరుషునిఁగూర్చియే

యని గ్రహింపుము. వానిమహిమంబులు కాలంబునకుఁగూడ నగమ్యం బులు' అని చెప్పెను.

పరీక్షిన్నరేంద్రా!

శా. పారావారము ద్రచ్చుచో గిరిసముద్యద్భారమై కచ్ఛపా
కారుం డైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలో మునుంగుకుజనుల్ సంశ్రేయముం బొంది వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయుం భూవరా!

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మలరేఖన్ విలసిల్లు శ్రీవిభుని దన్మాయావధూరూపమున్
దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్కరూపంబుగన్.

## మన్వాదుల వ్యాపారములు

రాజేంద్రా! ప్రతిమన్వంతరమందు మను, మనుపుత్ర, సుర సురేంద్రసప్తర్షులు భగవంతుని శాసనంబు నడుపుదురు. భగవచ్ఛాసనంబు ధర్మరక్షణపరంబగు. ధర్మంబునకు సత్యము, దయ, శాంతి, అహింస యనుపాదంబులు నాల్గు గలవు. యుగంబులు నాల్గని తెలిపితిని. సత్య యుగమందు ధర్మంబు నాల్గుపాదంబులను, త్రేతయందు దయాదులైన మూఁడుపాదంబులను, ద్వాపరమందు శాంతి అహింస యను రెండు పాదంబులను, గలియందు అహింస యను నొక్కపాదంబు ననువర్తించును. నాల్గుయుగంబులు చన్నంతనే సంధికాలము వచ్చును. అప్పుడు ధర్మంబు కాలగ్రస్తమై లుప్తమగు. ధర్మప్రవర్తకంబులైన శ్రుతులు మూలఁబడు. అప్పుడు సప్తర్షులు శ్రుతులకుఁ బునఃప్రచారంబు గావింతురు. ఆశ్రుతిధర్మంబులను మనువు ప్రవర్తింపఁజేయును. మనుపుత్త్రులు రాజులై యాధర్మప్రకారము ప్రజలను బాలింతురు. యజ్ఞాదులు జరుగును. దేవతలు యజ్ఞభాగంబులను గ్రహించి సుఖముందురు. ఇంద్రుఁడు భగవద్దత్తమైన త్రైలోక్యరాజ్యలక్ష్మి ననుభవించుచుఁ గాలవర్షంబులు వర్షించుచు లోకాప్యాయనముఁ గూర్చుచు ముజ్జగంబు నేలుచుండును.

ధర్మంబునకు సత్యాదులు నాల్గుపాదంబు లగునని చెప్పితిని. వానిలో సత్యంబునకు అబద్ధము చెప్పకుండుట, అన్నట్టిమాట చేయుట, ప్రియవచనంబుఁ జెప్పుట, గురుసేవ, దృఢవ్రతుఁడై యుండుట, ఆస్తిక్యబుద్ధి, సాధుసంగమము, మాతాపితృలకుఁ బ్రియమైనపని చేయుట, బాహ్యాభ్యంతరశౌచము, హ్రీ, ధనసంచయబుద్ధి లేకుండుట-అనునవి యంగంబులగును. పరోపకారము, దానము, స్మితవచనము, వినయము, న్యూనతాభావస్వీకారము, సమతామతి - ఈయాఱు దయకు శాఖలగును. అసూయ లేకుండుట, అల్పసంతోషము, ఇంద్రియసంయమనము, అసంగత్వము, మౌనము, దైవభక్తి, నిర్భయత్వము, గాంభీర్యము, స్థైర్యము, అరూక్షత, నిస్పృహత్వము, దృఢమతి, వివర్జనము, సమత్వబుద్ధి, అస్తేయము, బ్రహ్మచర్యము, క్షమ, ఆతిథ్యము, జప హోమ తీర్థసేవనము, అగ్రపూజ, అమాత్సర్యము, బంధమోక్షజ్ఞానము, సన్న్యాసభావన, సహిష్ణుత్వము, అకార్పణ్యము, అమౌఢ్యము - ఇవి శాంతికి శాఖలగును. ఆసనజయము, పరపీడవివర్జనము, శ్రద్ధ, అతిథిసేవ, శాంతి, సర్వాత్మైకబుద్ధి - ఇవి అహింసకు శాఖలగును.

భగవానుఁడు ప్రతియుగమందు ఋషిరూపంబునఁ గర్మంబును యోగేశరూపంబున జ్ఞానంబును బ్రతిపాదించుచుఁ బ్రజాపతిరూపంబున సర్గంబును రాజరూపంబునఁ జోరసంహారంబును గాలరూపంబున లయంబుఁ గావించుచుండు. భగవానుఁ డట్లు సిద్ధేశ్వరరూపంబులు ధరించి భిన్నభిన్నగుణంబుల వ్యవహరించు. భగవానునకు రూపనామంబులు గలుగవు. వానిశక్తి యట్లు రూపనామంబులు దాల్చి వ్యవహరించును. శక్తివ్యవహారంబును మాయ యందురు. మాయావిమోహితు లగుటంజేసి జనులదృష్టి తన్మాయారూపంబులను దగిలియుండుఁగాని మాయేశ్వరునివంకఁ జూడదు. జనులను మాయనుండి యుద్ధరించి భగవన్ముఖు లగునట్లుగాఁ జేయుటకై నానాశాస్త్రంబులు ప్రవర్తిల్లు.

### వా మ నా వ తా ర ఘ ట్ట ము

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షి ని విని 'మహాత్మా! భగవానునిచరిత్రలు వినవిన వింతలగు. పరమేశ్వరుఁడు వైవస్వత మన్వంతరంబున వామనావతారంబు ధరించెనని చెప్పితివి. ఆయవతార కార్యంబు వివరింప వేఁడుదు' ననెను. శుకయోగి వాని కిట్లనియెను.

### బలి విశ్వజిన్మహాయాగము చేయుంట

రాజేంద్రా! దేవాసురయుద్ధంబున బలి యింద్రజితుఁడై యసువులు వాసి భార్గవునిచేత బ్రదుకుట తెలిపితిని. బలి యట్లు పునర్జీవితుఁడై తదుపకృతికిఁ బ్రతిఫలంబుగా వాని సర్వార్థంబులను భృగువంశజులకు సమర్పించి వారికి శిష్యుఁడయ్యెను. వారు బలిసేవకు మెచ్చి 'దానవేశ్వరా! స్వర్గజయంబును గోరుదువు. నీకోర్కెఁ దీర్ప నిశ్చయించితి' మని చెప్పి వానివలన విశ్వజిన్మహాయాగంబును జేయించి యజ్ఞాంతంబున మహాభిషేకం బొనర్చిరి.

భార్గవుల మంత్రాహుతి ప్రభావంబున వైనతాగ్నికుండంబు నుండి సువర్ణాలంకృతరథంబును ఉచ్చైశ్శ్రవసంబులకు సాటియైన రథ్యంబులును సింహధ్వజంబును వెడలివచ్చెను. ప్రహ్లాదుఁడు కాంచనకార్తస్వరాక్షయతూణీరదివ్యకవచంబులను వాడనిపూమాలికను బలికి నొసంగెను. శుక్రుఁడు శంఖంబు నిచ్చెను. బ్రాహ్మణులు స్వస్తివాచకంబుల వానిని దీవించిరి. బలి యంతట విప్రులకుఁ బ్రదక్షిణనమస్కారంబులు గావించి ప్రహ్లాదునను మ్రొక్కెను. వారు బలిని వీడ్కొనిరి.

### బలి యింద్రపురంబుపయి దాడివెడలుట

బలి యంతట నద్దివ్యమాల్యను ధరించి ధనుర్బాణతూణీరాదులఁ గైకొని యాదివ్యరథం బెక్కి యాహవనీయాగ్నివలెఁ దేజరిల్లుచు నింద్రపురజయార్థము తరలెను. దైత్యవీరులు వేలకొలఁది యథార్హరథంబు లెక్కి యార్చుచుఁ దేర్చుచు వానిని వెంబడించిరి. వారికేకలకు రోదసీకుహరంబు వ్రీలనాగెను.

స్వ ర్గ వ ర్ణ న ము

వా రట్లు తరలి స్వర్గంబును డాసిరి. ఆపురము నందనాద్యుపవనంబుల నిండియుండెను. ఆయుపవనంబులందు మందారపారిజాతాదివృక్షంబులు కొమ్మలుసాచి చల్లనినీడలఁ బఱచుచుఁ దలిరుంజొంపంబులఁ గోయిలలకు విందులొనర్చుచుఁ బూఁదేనియలఁ దేఁటిగములకు నామెతలు గావించుచుఁ జిల్కలు ముప్పగువానికిఁ దియ్యనిపండ్లరసంబులు వలసినంతఁ గూర్చుచు నిరపేక్షకభూతహితమే పరమధర్మంబని చాటుచున్నవో యన విరాజిలుచుండెను. కోయిలలు పంచమస్వరనాదంబులఁ దుమ్మెదలు మధురగీతంబులఁ జిలుకలు ముద్దుపల్కుల వానివానికృతజ్ఞతను దెల్పుచుండెను.

వనాంతరసరోవరంబులు వికచకమలకల్హారాభిరామంబులును సురనారీజలక్రీడాయోగ్యంబులునై యొప్పెను. హంససారసాదులు కొలనులందలి కొండామరలపయినెక్కి డోలికలూఁగుచుఁ జూడఁజూడ నింపొదవించుచుండెను. మందాకినీనది యాపురంబునుజుట్టి తత్పరిఘయో యన నొప్పుచుఁ బ్రవహించుచుండెను. ఆపురాంతరంబు తీర్చిన దిద్దినవిశాలవీథులతో, వీథుల నిరుప్రక్కల వహ్నివర్ణప్రాకారపరివృతంబులును సువర్ణకవాటద్వారశోభితంబులు స్ఫటికమయోన్నతగోపురంబులునైనసౌధంబులతో లక్ష్మీనివాసమో యన నొప్పెను.అందలి చతుష్పదంబులు వజ్రవిద్రుమాదిరత్నరచితవేదికలతో నిండియుండెను. విపణంబులు నానారత్నరాశిమయంబులై మార్గంబులందుఁ గిమ్మీరకాంతులఁ బఱచుచు బధికులకు విభ్రమంబులు గొలుపుచుండెను.

జవరాండ్రు దుకూలంబులు గట్టి శిఖావిరాజితాగ్నులో యన నొప్పుచు దిదృక్షుజనంబునకు నేత్రోత్సవము గావించుచు విహరించుచుండిరి. సీమంతినీమణులు కొప్పుల ముడిచి తీసివైచినపూదండల నెత్తావులను మందమారుతుఁడు దొంగిలి నక్కినక్కి పురమెల్లఁ దారాడుచున్నాఁడో యన మందమందగతుల వీచుచుండెను.సౌధంబులు సోరణగండ్లనున్న పారావతంబులరుతంబులరూపంబున బాటసారులను బిలిచి, యంతఃపురంబులనుండి

వెడలివచ్చునట్టి యగరుధూపంబులరూపంబున నప్పథికులను బూజించు చున్నవో యనఁ దోఁచెను. ఆపురసౌభాగ్యలక్ష్మి తనవిలాసంబులను బ్రకటింప నెత్తినజండాలో యన మేడలపయిఁ బతాకలు వెలసెను. మందిరద్వారంబులు వివిధముక్తామణిదామశోభితంబులై తత్పతులకలిమిని జాటుచుండెను. పురశాలలు వీణావేణుగానంబులకు నవనవనాట్యకళా ప్రదర్శనంబులకు నెలవులై యొప్పెను. వేయేల? ఆపురరత్నము స్వతేజో నిరస్తపరతేజఃపుంజమై ద్రోహులకు శత్రులకు నధర్మకాములకు నందుఁ జొరరాని వేముఖంబులఁ జాటుచుండెను.

### ఇంద్రాదుల పలాయనము

రాజేంద్రా! బలి యాపట్టణంబును ముట్టడించి యాచార్యదత్తంబైనశంఖంబును బూరించెను. వానివెంట సేనాధీశులు తమతమశంఖంబు లూఁదిరి. భేరీభాంకారంబులు మ్రోఁగెను. ఇంద్రుఁ డాధ్వనులు విని బలియుద్యమంబు గ్రహించి యమరులను వెంటఁగొని సురగురుపునొద్దకుఁ బోయి నమస్కరించి 'గురువర్యా! బలిదైత్యుఁడు పూర్వవైరంబును బురస్కరించికొని మహోద్యమశాలియై దండెత్తి వచ్చెను. వానితేజంబు దుస్సహముగా నున్నది. వానికి నెదిరి గానరాఁడు. ప్రళయాగ్నికరణిఁ దోఁచు నతనిఁజూడఁగా నతఁడు స్వర్గంబునేగాక ప్రపంచంబునెల్లఁ గాల్చ నెంచెనేమో యని భయంబయ్యెడు. వానికి నింతతేజోబలంబు లెట్లు గలిగెనో, అతఁ డింత తెంపు నేయ నేలనో తెలుప వేఁడుదు' మనిరి.

బృహస్పతి వారిని విని 'అమరులారా! బలియున్నతి వాని గురువైన భార్గవుల ప్రసాదంబని యెఱుంగుము. సురేశ్వరా! నీవుగాని నీకు మించినవాఁడుగాని వాని నిప్పు డెదిరింపఁజాలరు. ఏవిప్రనిబలంబున నతఁ డింతవిక్రముం డయ్యెనో, యావిప్రనిమూలముననే యతఁడు సబాంధవంబుగా నశించును. అందాఁక మీరు వేచియుండవలయు. కాలము విపరీతమైనప్పుడు వేగిరించిన విషంబగు. కాలంబు నెదిరింపఁ జాలరు. ప్రకృతము మీరు మీపురంబును విడిచి యెటకేనియుం జనుఁ' డని హితంబు చెప్పెను.

### బలి ఇంద్రసింహాసనం బధిష్ఠించుట

రాజా ! బృహస్పతి కాలజ్ఞుఁడు గావున వానిమాటను సురలు తలఁదాల్చి కామరూపంబులు ధరించి స్వర్గంబును వదలి పఱచి డాఁగిరి. ఆసంగతి బలి యెఱింగి యమరపురంబును నిరాతంకముగాఁ బ్రవేశించి యింద్రపీఠినధిష్ఠించి తనయాజ్ఞను ముల్లోకంబులకుఁ జాటఁ బంపెను. భార్గవులు తమశిష్యుని విశ్వవిజయంబునకు సంతసించి వానిచేత నూఱు హయమేధంబులు చేయించిరి. బలికీర్తి ముజ్జగంబులు వ్యాపించెను. అతఁడు విప్రప్రసాదితలక్ష్మీవిభవుఁడై కృతకృత్యుఁ డట్లు భావించి తారా మధ్యపూర్ణచంద్రుఁడువలె దైత్యదానవలోకమధ్యంబున విరాజిల్లెను.

### అదితివిలాసము

నరేంద్రా ! అదితిసంతానంబు సురలగుట యెఱుంగుదువుగదా. అమరులపాటు చెవిఁబడ్డయంతనే బిడ్డలకై యదితి యనాథవోలెఁ బరితపింపసాగెను. కొండొకనాఁడు కశ్యపుఁడు సమాధియోగంబును దీర్చి దేశాంతరంబునుండి యయ్యదితియున్న యాశ్రమంబునకు నరుదెంచెను. ఆశ్రమంబెల్ల నుత్సవానందరహితంబుగా వానికిఁ గాన వచ్చెను. సంగతియేమో యనుచుఁ గశ్యపుఁడు లోనికిఁ బోయెను. అదితి భర్తకు సముచితసత్కారంబులు గావించెను. అతఁడు సమాసీనుఁడై 'కళ్యాణీ! గోవిప్రధర్మంబులకును లోకంబునకును నశుభం బెద్దియుఁ గలుగదుగదా. గృహమేధినీ! గృహంబులు యోగహీనులకుఁగూడ యోగఫలంబుఁ గూర్చుఁ గావున గృహంబులందుఁ ద్రివర్గంబులు నిరాతంకముగా సాగునుగదా. కుటుంబినులకుఁ గుటుంబ వ్యాపారంబులు తఱుగవు. అట్టివ్యాపారపరతం జేసి యతిథిపూజ లుపేక్షింపఁబడవుగదా. అతిథు లెవ్వరుగాని యలిగి చనరుగదా. కళ్యాణీ! ఎవనిగృహమందు నతిథిపూజారూపసత్క్రియ తుదకు జలదానమాత్రంబేనియుఁ జేయఁబడదో యాగృహంబు నక్కబొరియ యగు. నేను దేశాంతరము చన్నందులకు ఖిన్నమతివై యాకారణంబున

సకాలాగ్ని హోత్ర కార్యంబు నుజ్జగింపవుగదా. గృహస్థునకు నగ్ని పూజ వలననే సర్వకామసిద్ధియు నుత్తమలోకస్థితియుఁ గలుగు. విప్రుఁడు నగ్నియు శ్రీమహావిష్ణుదేవునకు ముఖంబగు. విప్రాగ్నుల నారాధించుట భగవదారాధనం బగు. ప్రేయసీ! నీతనయులకుఁ గుశలంబగదా. నీముఖంబున దైన్యంబు తోఁచుచున్నది. కారణమేమి? ఏదేనియు నస్వస్థత నిన్నుఁ బైకొనెనా? సంగతియేమో చెప్పు' మని యడిగెను.

అదితి భర్తృవచనంబులు విని 'బ్రహ్మర్షివర్యా! విప్రగో ధర్మంబులకును లోకంబునకును గుశలంబ. గృహస్థాశ్రమంబు ధర్మార్థ కామంబులకు క్షేత్రంబగుట మఱువను; తత్క్రియలందు నేమఱుపాటు చెందను. అగ్నిపూజయు నతిథిపూజయు భృత్యభరణంబును భిక్షు పోషణంబు మీధ్యానపూర్వకంబుగా నిర్వర్తింతుఁ గావున నెట్టి కొఱంతలులేక యవి జరుగుచుండు. ఋషిచంద్రమా! ధర్మమూర్తివి నీ వుండఁగా నీతలంచినధర్మంబులకు లోపంబు గలుగునా? దేవా! సత్త్వరజస్తమోగుణాశ్రయులైన సురాసురులు నీమనశ్శరీరంబుల జనించిరి. పరమేశ్వరుఁడు తనభక్తులనే కరుణించు. నీ విరువుర నొక్కరూప చూతువు. నాకొడుకులై నసురలు సిరినేగాక యిల్లు వాకిలి గోల్పోయి నిలువ నీడలేనివారైరి. ఇట్టిదుర్గతి వారి కెట్లు గలిగె నందువా? వైరులు నిమిత్తమాత్రులు. విప్రబలమే కారణము. గోడుగుడుచుచున్న నీబిడ్డలను గరుణింపుము' అని విన్నవించెను.

### కశ్యపుఁడు సతికి నోదార్పులు పలుకుట

కశ్యపుఁడు సతికి నవ్వుచు 'అబలా! భగవన్మాయాబలంబు నూహింపనుగూడఁ దరముగాదు. అది విశ్వంబునెల్ల స్నేహపాశంబున గట్టి యాడించు. దేహంబులు పంచభూతనిర్మితంబు లందురు. పంచభూతంబు లెందుండి వచ్చెను? దేహరచనాశక్తి వానికి నెట్లు గలిగెను? అన్నిఁటికి నాద్యుఁడు గలఁడు. అతఁడే యెల్లరకు శరణంబు.

సతీ! సతీపతిపుత్త్రాదులు భగవదన్యులు గారు. వారిని భగవదన్యులంగా భావించుట భ్రాంతియగు. భ్రాంతికి మోహంబు కారణంబగు. మోహంబును వదలి భగవాను నాశ్రయింపుము; నీకోర్కులు దీఱును. భగవత్సేవ యొక్కటే యమోఘఫలకారి; అన్యంబు లెండమావులు' అని చెప్పెను. అదితి యావచనంబులు విని 'దేవా! జగద్గురు నెట్టు లుపాసింపవలయునో, ఎట్లుపాసించిన నద్దీనవత్సలుఁడు నా బిడ్డలకడగండ్లు మాన్పి నాకు మనశ్శాంతిఁ గూర్చునో సెలవీయు' మని వేఁడెను.

### పయోవ్రతవిధానము

నరేంద్రా! కశ్యపుఁ డా ప్రణయంబును మనస్కరించి 'కళ్యాణీ! భగవంతునిఁ బయోవ్రతవిధానంబున భజింతువేనిఁ ద్వరగా నీకోర్కి సిద్ధించును. ఆవ్రతవిధానంబు వినుము.

మాఘమాసాంతరంబున నమావాస్యచన్న తెల్లవాఱి ఫాల్గుణశుక్లపక్షంబు ప్రారంభించును. శుక్లపక్షప్రథమదివసంబున వేకువను లేచి యడవిపందులు కుళ్లగించినమట్టిని మేనఁ బూసికొని యేటిలో నీరాడి గట్టున నిలిచి భూదేవిని సంకల్పించి 'ఏదేవి యాదివరాహమూర్తిచేత నుద్ధృతయై స్వస్థానముఁ జేరెనో యాదేవికి నమస్కారము. నాపాపంబులఁ బరిహరింపు' మని చెప్పి మఱల నీరాడి నిత్యనైమిత్తికకర్మంబులు తీర్చి సమాధానచిత్తంబుతో 'ఓం భగవతే నమః, ఓం పురుషాయ నమః, ఓం మహీయసే నమః, ఓం సర్వభూతనివాసాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం సాక్షిణే నమః, ఓం అవ్యక్తాయ నమః, ఓం సూక్ష్మాయ నమః, ఓం ప్రధానపురుషాయ నమః, ఓం చతుర్వింశగుణజ్ఞాయ నమః, ఓం సాంఖ్యప్రవర్తకాయ నమః, ఓం ద్విశీర్ష్ణాయ నమః, ఓం త్రిపాదాయ నమః, ఓం చతుశ్శృంగాయ నమః, ఓం ఫలవిస్తారాయ నమః, ఓం సప్తహస్తాయ నమః, ఓం యజ్ఞాయ నమః, ఓం త్రయీవిద్యాత్మాయ నమః, ఓం శివాయ నమః, ఓం రుద్రాయ నమః, ఓం శక్తిధరాయ నమః, ఓం సర్వవిద్యాధిపతయే నమః, ఓం భూతపతయే నమః,

ఓం హిరణ్యగర్భాయ నమః, ఓం ప్రాణాయ నమః, ఓం జగదాత్మాయ నమః, ఓం యోగైశ్వర్యశరీరాయ నమః, ఓం యోగహేతవే నమః, ఓం ఆదిదేవాయ నమః, ఓం దేవదేవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం ఋషయే నమః, ఓం నరాయ నమః, ఓం హరయే నమః, ఓం మరకతశ్యామాంగాయ నమః, ఓం అధిగతశ్రీకాయ నమః, ఓం కేశవాయ నమః, ఓం పీతాంబరాయ నమః' అని ప్రార్థించి సాష్టాంగం బొనర్చి యేకాగ్రబుద్ధితో 'వరేణ్యా! వరదర్షభా! సర్వవరప్రదుండవు గావున శ్రేయస్కాములు నీచరణంబుల నుపాసింతురు. నీపాదపద్మం బుల నాశ్రయించితి. ప్రసన్నుఁడవగు' మని మొఱపెట్టవలయును.

భగవానుఁడు పిలిచినంతనే వచ్చును. పైప్రకారము ప్రార్థించి వానికిఁ బాద్యంబు లిచ్చి పాలతో నభిషేకం బొనర్చి యాచమనవస్త్ర చందనమాల్యాభరణాదులు సమర్పించి నివేదింపవలయును. కలిమిగల దేని శాల్యంబును బాలతో వండి బెల్లము నేయి కలిపి పాయసంబుగా నివేదించుట మేలు. నివేదనానంతరము 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అనునట్టి ద్వాదశాక్షరమంత్రంబును జపించి దానిని జగదీశున కు నాచమనీయం బిచ్చి తాంబూలంబు నొసఁగి మూలమంత్రంబును నూఁటయెనిమిదిపర్యాయములు జపించి స్తుతించి ప్రదక్షిణపూర్వక సాష్టాంగప్రణామం బొనర్చి యాదేవదేవు నర్చించిన పుష్పంబులను దల నిడి భగవానునకు నుద్వాసముఁ జెప్పి పాయసాన్నంబును నిద్దఱకుఁ దక్కువగానియట్లు బ్రాహ్మణులకు యథోచితము భుజియింపఁబెట్టి వారి యాజ్ఞఁబడసి శేషంబును తనయిష్టజనులతోడఁ గుడువవలయును.

మఱియు వ్రతాంతముపఱకు బ్రహ్మచర్యము భూశయనము త్రికాలస్నానముఁ దప్పరాదు. ముక్కుడిమాటలకుఁ బోరాదు. భోగం బులనెల్ల నుజ్జగింపవలయు; భూతహింసమనోవాక్కాయంబుల నెద్దానిఁ జేయరాదు. నిరంతరవాసుదేవపరాయణబుద్ధిగలిగి హరికథలతోఁ గాలముఁ బుచ్చునగు.

వ్రతంబు నట్లు పదు రెండుదినంబులు గడపి త్రయోదశినాఁడు పంచగవ్యంబులతో భగవాను నభిషేకించి యుదారబుద్ధితో శాస్త్ర ప్రకారము మహాపూజచేసి శిపివిష్టవిష్ణుదేవవాకంబుగాఁ జరునిర్వపణంబొనర్చి పురుషసూక్తంబున వేల్చి నివేదించి జ్ఞానియైన యాచార్యునకును ఋత్విజులకును వస్త్రాభరణధేనుదానంబులు గావించి వారికి మృష్టాన్నతృప్తిఁగూర్చి అభ్యాగతులకు నాబ్రాహ్మణచండాలాంతము విందొనర్పవలయును. అన్నదానంబునందు దీనాంధబధిరాదికృపణులను ముఖ్యముగా భుజింపఁజెట్టవలయు. తర్వాత తాను సబాంధవంబుగాఁ గుడువవలయు. అది శ్రీవిష్ణు ప్రీణనంబగు.

కళ్యాణీ! ఈవ్రతంబును నాకు నాపితామహుఁడు చెప్పెను. ఈవ్రతపూర్వకంబుగా శుద్ధచిత్తంబుతో భగవంతు నారాధింపుము. ఇది సామాన్యవ్రతముగాదు. ఇందు సర్వయజ్ఞంబులును సర్వవ్రతంబులును సర్వదానంబులు నంతర్భూతంబులై యున్నవి. వేయేల? ఇది తపస్సారంబగు. దీని నాచరింతురేని భగవానుఁడు సంతసించి యచిరంబ నీ మనోరథంబును సమకూర్చు' నని చెప్పెను.

### అదితికి భగవానుఁడు వరమిచ్చుట

రాజేంద్రా! అదితి యాప్రకారము వ్రతనిష్ఠయై బుద్ధియనెడి సారథిని వశపఱచికొని యాసారథిచేతికి మనస్సనెడికళ్లెంబు నిచ్చి యింద్రియంబులనెడి పొగరుగుఱ్ఱంబులను బిగియఁబట్టించి యేకాగ్రమతియై యావ్రతంబును బదురెండుదినంబులు పొల్లుపోనీక నడపి పదుమూఁడవ నాఁడు యథావిధి కర్తవ్యంబుల నెఱవేర్చెను. భగవానుఁ డాదేవ మాతకు దర్శనం బిచ్చెను.

చతుర్భుజంబులందు శంఖచక్రగదాదులను ధరించి పీతాంబరముఁ గట్టియున్న యాదివ్యమంగళమూర్తి నేత్రగోచరంబైనంతనే యదితి సంతోషవివశయై సాగిలఁబడి లేచి కేల్దోయిఁగూర్చి యేమో పలుకఁబోయి యానందాతిశయంబున నోరాడక కొంతవడికిఁ దాల్మిగాంచి,

'సీ. యజ్ఞేన! విశ్వంభరాచ్యుత! శ్రవణమం
గళనామధేయ! లోకస్వరూప!
యాపన్నభక్తజనార్తివిఖండన!
దీనలోకాధార! తీర్థపాద!
విశ్వోద్భవస్థితి విలయ కారణభూత!
సంతతానంద! శశ్వద్విలాస!
యాయువు దేహంబు ననుపమలక్ష్మియు
వసుధయు దివముఁ ద్రివర్గములును
ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి
నాకమేలుచున్న నాఁటనుండి
కన్నకడుపుగాన కంటఁగూరుకురాదు
కడుపుమంట మాన్పి కావవయ్య.'

అని నుతించెను. భగవానుఁ డామె మొఱవిని 'దేవజననీ! వైరులు నీకొడుకులసిరిని హరించి వారిని స్థానభ్రష్టులఁజేసి తఱుముటయు, నీవు నీబిడ్డలకై పరితపించుటయు నెఱుంగుదు. నీకోరినట్లు నీసుతులకు యథాపూర్వవిభవంబు నిచ్చి వారిని సుఖింపఁజేయుదు. మఱియు నీ కొడుకులకుఁ గీడురోసినవారిభార్యలు విధవలై గోడుకుడుచుటఁ గన్నారఁజూతువు. అసురులు కాలబలంబునను విప్రసహాయంబునను బెంపుగాంచిరి; వారిబలంబు నుడుప నిదిసమయముగాదు. నీవెంతయుఁ గఠినవ్రతవై నన్నుఁ గొల్చితివి. నీవ్రతంబునకు మెచ్చి నీకుఁ బ్రత్యక్ష మైతిని. ప్రత్యక్షుండనయ్యు నీకోర్కి తీర్పకుండుట భావ్యముగాదు. నేను నాయంశంబున నీకు సుతుండనై జనించి మారీచతపోవ్రతం బను ష్ఠించి నీసుతులకు మేలుగావింతు. నీవు నన్ను ధ్యానించుచు నీపతిసేవ నుండుము. ఇది దేవరహస్యము; ఒరులకుఁ జెప్పవలదు. దేవరహస్యం బులు సురక్షితంబులగునేని సాధువులకు మేలగు' నని చెప్పి యంతర్హితుఁ డయ్యెను.

రాజా! ఆవచనంబుల నమృతంబువలె నదితి గ్రోలి 'అహో! భగవానుఁడు నాగర్భంబున జనించునట! నాజన్మము కృతార్థతనొందె' నని మహానందంబునొంది పతిసేవాతత్పరయై యుండెను. కశ్యపుఁడు నిజ యోగమహిమంబున నదియెల్ల గ్రహించి యథాకాలంబునఁ దనవీర్యంబు నదితిగర్భంబునం దుంచెను. భగవానుఁ డట్లదితిగర్భంబుఁ బ్రవేశించుట బ్రహ్మ యెఱిఁగి తద్గర్భస్థమూర్తిని స్తుతించి 'స్వామీ! స్వర్గభ్రష్టులైన దేవతలకు మేలుగూర్పు' మని వేడెను.

## వామనావతారము

రాజేంద్రా! అదితిగర్భము కాలక్రమంబునఁ బెంపొందెను. భాద్రపదశుక్లద్వాదశీశ్రవణనక్షత్రమందు గ్రహనక్షత్ర తారకంబులు శుభస్థానంబులనుండఁగా సూర్యుఁడు మధ్యందినగతుఁడుగా నభిజి న్మహూర్తంబున భగవానుఁడు శంఖచక్రగదాకమలకలిత చతుర్భుజం బులతోఁ నీలనిర్మలదేహంబుతోఁ బద్మాయతనేత్రంబులతోఁ బీతాంబర ముతో మకరకుండలకాంతి విలసితవదనారవిందంబుతో శ్రీవత్సలాంఛ నంబుతో గిరీటాంగద విభూషణంబులతో వనమాలాకౌస్తుభంబులతో నవతరించెను.

వానియవతారముతోడ భూమ్యాకాశంబులు తేజరిల్లెను; దెసలు ప్రసన్నంబులయ్యెను; సరస్సులు నిర్మలంబులయ్యెను; ప్రజలకు నకారణ సంతోషం బొదవెను; దేవదుందుభిమృదంగాదులు మొఱసెను; అదితి యాశ్రమంబునఁ బుష్పవృష్టికురిసెను; కశ్యపుఁడు భగవన్మాయాయోగం బునకు విస్మితుఁడై జయవచనంబులు పలికెను. అది సుతయాద్వాదశి విజయద్వాదశి యనుపేరు పడసెను.

భగవానుఁ డట్లవతరించి వెనువెంటనే యాదివ్యమంగళస్వరూ పంబు నుపసంహరించి వామనరూపము దాల్చెను. మహర్షులు కశ్యప పురస్కారంబుగా వానికి జాతకర్మాదు లొనర్చిరి. వామనుఁడు క్రమక్రమం బుగా బెరుగసాగెను. యుక్తవయస్కుఁ డైనంత వానికి నుపనయనాది

సంస్కారంబులు గావించిరి. అత్తఱి సవిత్రుఁడు వానికి సావిత్రిని బోధించెను; బృహస్పతి బ్రహ్మసూత్రంబును, కశ్యపుఁడు మేఖలను, ధాత్రి కృష్ణాజినంబును, సోముఁడు దండంబును, దివంబు ఛత్రంబును, బ్రహ్మదేవుఁడు కమండలువును, సప్తర్షులు కుశ (శిఖ)లను, సరస్వతి జపమాలను, కుబేరుఁడు భిక్షాపాత్ర నిచ్చిరి. తల్లి యదితి వానికిఁ గౌపీనంబుఁ గట్టఁ బెట్టెను. ఆవటువు తత్సభలో బ్రహ్మతేజోవిరాజమానుఁ డగుచు నగ్ని ముఖం బొనర్చి పరిస్తరణసమూహంబు గావించి సమిద్ధణంబు వేల్చి యగ్నికార్యంబు జరిపెను.

### బలియజ్ఞము - వామనప్రవేశము

రాజా ! నర్మదానదియుత్తరతీరంబున భృగుకచ్ఛ మను క్షేత్రంబు గలదు. అట బలిచక్రవర్తి శాలను నిర్మించి భార్గవుల యాజమాన్యంబున హయమేధయాగంబునకుఁ గడఁగెను. శాలాంతరంబెల్ల విప్రాదులతో నిండెను. యజ్ఞకార్యంబు జరుగుచుండఁగా మహాతేజోవంతుఁడైన నొకవ్యక్తి యటకు వచ్చుచుండెను. వానిని యజమాన ఋత్విక్సదస్యులు దవ్వునఁ జూచి సూర్యుఁడో యనలుఁడో సనత్కుమారుఁడో యజ్ఞసందర్శనార్థము వచ్చుచున్నాఁడని లోలోనఁ దలంపసాగిరి.

జడలుదాల్చి మౌంజియు నుపవీతంబును ధరించి కృష్ణాజినంబుఁ గప్పి ఛత్రదండకమండువులు పట్టివచ్చిన యావ్యక్తికి భార్గవు లగ్నితో నెదురేగి మర్యాదలు సలిపి వానిని లోనికిఁ గొనివచ్చిరి. యజమానుఁడు వానిరాకకుఁ బరమసంతోషంబంది యుచితాసనంబిచ్చి వానిని గూర్చుండఁబెట్టి స్వాగతపూర్వకనమస్కారం బాచరించి కాళ్లుగడిగి పూజించి యాజలంబులఁ దలఁదాల్చి,

మ. "వడుగా! యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది?
 య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశముఁన్ జన్మముఁన్,
 గడుధన్యాత్ముఁడ నైతి, నిమ్మఖము యోగ్యంబయ్యె, నాకోరికల్
 గడతేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం గళ్యాణ మిక్కాలమున్,

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో,
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో,
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురోత్తంసమా!"
యని వినయమధురంబుగాఁ బలికెను.

రాజా! ఆవ్యక్తి వైరోచినునిధర్మోక్తులకు నెంతయు మెప్పు గాంచి 'రాజోత్తమా! నీవచనంబులు సత్యాత్మకంబులును ధర్మసహితంబులుఁగావునఁ గీర్తికరంబులగు. ఎవనికులంబునకు భార్గవు లాముష్మికధర్మ ప్రమాణభూతులగుదురో, ఎవనికిఁ బ్రహ్లాదుఁడు తాతయై గ్రాలునో ఎవనివంశంబున సత్త్వహీనుఁడుగాని, కృపణుఁడుగాని, యర్థులకు లేదనువాఁడుగాని, యిత్తుననిచెప్పి తప్పువాఁడుగాని, దానయుద్ధసమయంబులందు వెనుచూపువాఁడుగాని యింతవఱకు జనింపరో, చంద్రుఁడు మింటవలెఁ బ్రహ్లాదుఁ డెవనికులంబునఁ బ్రకాశించునో, ఏకైకవీరుఁడై భూచక్రంబున నప్రతిభటుఁడై హిరణ్యాక్షుఁ డెవ్వనికులంబు నలంకరించెనో యానీకులంబునకుఁ దగినట్లుగాఁ బలికితివి.'

దానవేశ్వరా! విష్ణువు భూమి నుద్ధరింప నెంచి హిరణ్యాక్షుని మహాకష్టంబునఁ గెల్చియుఁ దద్వీర్యశౌర్యంబులఁ దలంచి తాను జయశాలిఁగా భావింపఁడు. తమ్మునిచావునకు హిరణ్యకశిపుఁడు విష్ణువుపైఁ గ్రోధంబువహించి వానిని రూపుమాపుదునని శపథంబుగావించి దండెత్తి చనఁగా విష్ణువు విని తనకై మృత్యువు వచ్చుచున్నదని భయపడి కాలజ్ఞుఁడు గావున ముప్పు దప్పించికొనఁదలంచి యెందును సందుగానక సూక్ష్మతనువు ధరించి యయ్యసురేశ్వరుని ఘ్రాణరంధ్రంబున వానిహృదయాంతరముచొచ్చి యందు డాఁగెను. హిరణ్యకశిపుఁ డావిష్ణువునకై భూనభోంతరంబులును సముద్రపాతాళాంతరంబులును గలయ వెదకి వెదకి వాని నెందుఁగానక వేసారి 'కటా! నాభ్రాతృవధకుఁ డెందును గానరాఁడు. బ్రదికియున్నచో వానిపొలఁకువ తెలియకుండునా? వైరిమర

కాంతం' బని నిశ్చయించి సమాహితచిత్తుఁడయ్యెను. దేవతలు విప్రవేష ధరులై నీతండ్రిని విరోచనుని డాసి వంచకబుద్ధితో వానియాయువును గోరిరి. మీతండ్రి వారివంచనంబు నెఱింగియుఁ దనయాయువు నొసంగి తనప్రఖ్యాతపుత్త్రత్వంబునకు వన్నెగూర్చెను. నీవన్ననో శూరులును గీర్తిమంతులు నైనట్టి గృహస్థులధర్మంబుల నెడఁబాయవు. ఇఁక జెప్పనేల? దైత్యేశ్వరా! నీవెవ్వరివాఁడవనియు నెందుండువనియు నడిగితివి.

'సీ. ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
నొకచోటనక యెందు నుండ నేర్తు,
ఎవ్వనివాఁ డనం చేమని పల్కుదు
నాయంతవాఁడనై నడువ నేర్తు,
ఈనడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవ నేర్తు,
అది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ
నేరుపులన్నియు నేన నేర్తు,
ఆ. ఒరులుగారు నాకు నొరులకు నే నాదు,
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు,
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నాలింకి,
సుజనులందుఁ దఱచు సొచ్చి యుందు."

దానవవినోదా! ఏమివలయునో కోరుమంటివి.

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ,
గోర్కిదీఱ బ్రహ్మ కూకటి ముట్టెద
దాన కుతుకసాంద్ర! దానవేంద్ర!

అని చెప్పెను. బలి వానికి మహాశ్చర్యంబునొంది 'అయ్యా! అడుగునప్పుడు దాతపెంపు సొంపుఁ దలంపవలదా' యనెను. వటుఁడుం వానిభావంబు గ్రహించి 'దానవాధిపా! నీవు జగదీశ్వరుండవునుం మహా

దాతవు నగుట యెఱుంగుదు. యాచనావృత్తికి నియమంబులు గలవు. ఎంతవలయునో యంతమాత్రమే కోరనగు. అధికము కోరుట చౌర్యం బగు. అధికార్థి దండనీయుఁడు. కావున నాకు వలసినంత కోరితి' ననెను. బలిచక్రవర్తి యాపల్కులు విని 'విప్రనందనా! లోకైక నాయకుండను; ద్వీపంబులఁ గోరిన నిత్తు. నాకుఁ జేయిసాచినవాఁ డన్యుల యాచింపనుండునా? బాలుఁడవు గావున స్వార్థం బెఱుంగవు. జీవికకు వలసినంతభూమియేనిఁగోరు'మనెను.ఆవిప్రకుమారుఁ డాపల్కు లాలకించి,

మ. "గొడుగో జన్నిదమో కమండులువొ నాకుఁ ముంజియో దండమో
వడుగే నెక్కడ? భూము లెక్కడ? కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షామితం బైనమూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చు టది బ్రహ్మాండంబు నాపాలికిన్."

క. "వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు, సప్తద్వీపములనైనఁ జక్కంబడునే?"

శా."ఆశాపాశము దాఁ గడుం నిడుపు లేదంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు నేకూడియుం
గాసిం బొందరిగాక వైన్యగయభూకాంతాదు లింతేనిఁ గా
మాశం బాయఁగ నేర్చిరే? మును నిజాశాంతంబులం జూచిరే?"

రాజేంద్రా! జీవులకు సుఖంబు పరమప్రాప్యంబు. ఆసుఖంబు యదృచ్ఛాప్రాప్తసంతుష్టునకు నగు. తృప్తికలుగుటకు నింద్రియంబులను జయింపవలయు. జితాత్ముఁడు కానివానికి ముల్లోకంబులు లభించినను దృప్తి జనింపదు. తనివిలేనివాఁడు సుఖంబు కల్లఁ.

దానవేశ్వరా! పురుషుని జననమరణరూపసంసారంబునకుఁ గారణం బేదో తలంచితివా? అర్థకామంబులందుఁ దనివియుఁ దృప్తివలననైన సంతోషంబు లేకపోవుటయే సంసారకారణంబు. ముక్తికారణం బేమందువా? యదృచ్ఛాలాభంబునఁ దృప్తిసంతోషంబు లందుటయే ముక్తికారణము. తృప్తిసంతోషంబులు గలవానికి దేజోవృద్ధి గ్గలుగు.

సంతోషహీనుని తేజంబు వారిధార నగ్ని యట్లగు. ఇట్లు పెద్దలు వచింతురు గావున నాకు మూఁడడుగుల నేలయే చాలు’ ననెను.

బలిశుక్రాచార్యుల సంవాదము

పరీక్షిన్నరేంద్రా! బలిచక్రవర్తి యవ్విప్రకుమారవచనంబులు విని యతఁడు కోరినట్లు భూదానం బొనర్పుటకై జలపాత్రను జేతఁబట్టి యుండెను. శుక్రాచార్యుఁ డడ్డుపడి ‘వైరోచనా! ఈతఁడు వటుమాత్రుఁడు గాఁడు; దేవకార్యార్థంబు శ్రీమహావిష్ణు రూపంబుదాల్చి యిట్లు నిన్ను యాచించుచున్నాఁడు. రానున్న ముప్పు దలంపక బాస నేసితివి. నీచేఁత దైత్యసంపద కెల్లఁ జేటు గలిగించు. మాయావటువు విశ్వశరీరుఁడై మూఁడడుగుల ముల్లోకంబుల నాక్రమించి నీసిరిసంపదలను నీయశస్తేజస్సులను హరించి యింద్రునకు నియ్య నున్నాఁడు. మూఢా! సర్వస్వము ధారపోసి నీవెట్లు బ్రదుకుదువు? బ్రదుకుమాట యట్లుండ నిమ్ము. ఒకయడుగులోపల సమస్తభూమండలంబు నడంగు. రెండవ యడుగునకుఁ ద్రిదివంబు చాలియుఁ జాలకుండు. వీనిశరీరంబునకు నంతరాళము చాలదు. మూఁడవయడుగు నెందుఁ బెట్టవలయు? నీతలపయిఁ బెట్టవలయును. నీనొసట నరకనివాసము వ్రాసియుండుటం జేసి యిట్టిబుద్ధి నీకు జనించెను.

రాజేంద్రా! తనవృత్తికి ముప్పు తెచ్చుదానంబును బెద్దలు హర్షింపరు. వృత్తికలుగునాఁడే తపోయజ్ఞదానకర్మంబులు జరుగు. అందువలన వానినెల్ల వృత్తిమంతునకే విధించిరి. గృహస్థుఁడు వానిసంపద నైదు భాగంబులుచేసి యొకభాగంబును ధర్మార్థము, నొకటి కీర్తిపోషణార్థము, నొకటి కామతృప్త్యర్థము, నొకటి యర్థసంపాదనంబునకు, నొకటి స్వజనులకు వినియోగింపవలయు. అట్లు చేయునతం డిహాపరసుఖంబు లందునని పెద్దలు పల్కిరి.

రాజేంద్రా! అన్నమాట తప్పుట తగునా? యని యడుగుదువా? సత్యాసత్యధర్మంబులనుగూర్చి బహ్వృచగీతను విను‌ము. ‘నోటఁబల్కినంత

చేయుట సత్యంబనియు, మాటతప్పుట యసత్యంబనియుఁ జెప్పుదురు. ఇది సామాన్యవాచకము. తా ననెడివృక్షంబునకు ననృతంబు మూలము. దానికి సత్యము పుష్పఫలంబులగు. మూలము నశించిననాఁడు పుష్పఫలంబులు గలుగనేరవు. వృక్షంబునకు మూలంబట్లు తనస్థితికి ననృతంబు మూలంబగు. వృక్షంబునకు పుష్పఫలంబు లెట్లో యట్లే తనజీవికకు సూనృతంబగు. మఱియు ననృతంబుతో నంతో యింతో కలియనట్టి సత్యం బెందు నుండనేరదు. ఇంకొకటిగూడ గ్రహింపనగు. మూలం బున్నచో నది మఱలఁ జిగిర్చనోచు. కావునఁ బురుషుఁడు తన్నుమాలినధర్మంబు నెన్నఁడుఁ జేయరాదు. సత్యంబును ధర్మంబును దేశకాలంబులఁబట్టి యుక్తవిధంబున నడపవలయును.

ఆ. "వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము వొంద దధిప!"

అని చెప్పిరి. అట్లుచేయుట యాపద్ధర్మంబులగు.

మ. కులముం రాజ్యముఁ దేజముం నిలుపు మీకుబ్జుండు విశ్వంభరుం,
డలఁతింబోఁడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండముం,
గలఁడే మాన్ప నొకండు? నాపలుకు లాకర్ణింపు కర్ణంబులం,
వల దీదానము గీనముం బనుపుమా వర్ణిం వదాన్యోత్తమా!"

అని చెప్పెను.

## బ లి ప్ర తి వ చ న ము

పరీక్షిన్నరేంద్రా! బలిచక్రవర్తి శుక్రుని విని 'గురువర్యా! అర్థకామయశోవృత్తులకు నెప్పుడు ముప్పుగావింపని గృహస్థధర్మంబును నిరూపించితివి. ఆవిషయంబున మీవచనము సత్యము. ప్రహ్లాదునివంశంబునఁ బుట్టితి; మాట యిచ్చితి; ఆనోటనే లేదనుట యెట్లుచెల్లు? సత్యం బొక్కటే యుత్తమోత్తమధర్మంబనియు, ఎంతభారంబునైన వహింతుఁ

గాని యసత్యవాది నొక్కనినేనియు మోయఁజాలననియు భూదేవి పలికె నన వినమా? గురువర్యా! భూధనాదులు పురుషునకు నిత్యంబులు గావు. అవి యెప్పుడో యొకప్పుడు చెప్పకయే విడిచిపోవును. మాట నిలుచుఁ బూట గడచుఁగదా.

శా. 'కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వా రేరీ? సిరి మూటఁగట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్? భార్గవా!'

గురువర్యా! దేహీ యన్నంతనే దేహంబునుగూడ నిచ్చునట్టి నెఱదాతలు గలరు. పాత్రభూతుఁడైన యర్థి లభించుట దుర్లభము. అంత మహాపాత్రము నాకు నేఁడు లభించుట నాభాగ్యంబుగాని వేఱుగాదు. గురువర్యా!

శా. 'ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట మీఁదై నాకరం బుంట మే
ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?'

మ. 'నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము పోనిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ
దిరుగన్నేరదు నాదుజిహ్వ వినుమా, ధీవర్య! వేయేటికిన్.'

గురువర్యా! శ్రీమహావిష్ణువు నన్ను బంధించుటకై యీరూపం బున వచ్చె నంటివి. బంధించిన బంధించుఁగాక. ఈవిప్రరూపంబు నాహస్తం బులఁ గట్టివైచెను. వీనికి నెగ్గుసేయనోప' ననెను.

శుక్రాచార్యుఁడు వానినిశ్చయంబును విని 'మూఢా! చెడు కాలము దాపరించి నిన్నిట్లు పలికించుచున్నది. గురుశాసనంబు నుల్లం ఘించితివి. సిరి నీకు దూరంబగుఁగాక!' యని శపించెను.

### బలి వామనునకు భూదానంబు సేయుట

పరీక్షిన్నరేంద్రా! ఆచార్యుఁ డట్లు శపించినను బలిచక్రవర్తి సుంతయు జంకక సత్యనిష్ఠుఁడై భూదానంబు సేయఁబూనెను. ఆదాన వేళ్వరునిపత్ని వింధ్యావళి జలపూర్ణసువర్ణపాత్రంబునుఁ బతికి నందిచ్చెను. బలి యాకలశంబు నందికొని తజ్జలంబుల వామనునిపాదం బులు కడిగి యాసలిలంబులను దనతలఁదాల్చి పదత్రయభూమిని వానికి దానం బొసఁగెను. సురసిద్ధగంధర్వాదులు బలిసత్యసంధతను బ్రశంసించిరి.

### వామనుఁడు విశ్వరూపము ధరించుట

వామనుఁడు దానముఁబట్టి నిజగుణత్రయాత్మకంబైన విశ్వ రూపంబును సంకల్పించి,

శా. "ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభోవీధిపై
నంతై తోయదమండలాగ్రమునకల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రున కంతయై ధ్రువునిపై నంతై మహార్వాటిపై
నంతై సత్యపదంబు దాఁకె నటు బ్రహ్మాండాంతసంవర్ధియై."

మ. "రవిబింబం బుపమింపఁ బాత్రమగుఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలినుదంచత్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమయ్యె వటుఁ డాబ్రహ్మాండముం నిండఁగాన్."

రాజేంద్రా! అట్లు పెరిఁగిన యమ్మహామూర్తికిఁ జరణతలంబునఁ బాతాళంబును, పాదంబుల ధాత్రీతలంబును, జంఘుల మహీధ్రంబులును, జానువులఁ బక్షిజాతంబును, నూరువుల వాయుగణంబును, వాసస్థలం బున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభియందు నభంబును, కుక్షిదేశంబున సాగరంబులును, ఉరంబునఁ దారామాలయు, హృదయంబున ధర్మంబును, స్తనద్వయంబున ఋతు సత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబున లక్ష్మియు, కంఠంబున సామాదిసమస్తవేదంబులును, భుజంబుల నింద్రాదిదేవతలును, గర్ణంబుల

దిక్కులును, శిరంబున దివంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నేత్రంబుల రవియు, ముఖంబున వహ్నియు, వాణియందు ఛందస్సులును, రసనయందు వరుణుండును, భ్రూయుగంబున విధినిషేధంబులును, ఱెప్పల దివారాత్రంబులును, లలాటంబునఁ గ్రోధంబును, అధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, పృష్ఠంబున నధర్మంబును, శ్రవణంబుల యజ్ఞంబులును, ఛాయయందు మృత్యువును, హాసంబున మాయయు, రోమంబుల నౌషధివర్గంబును, నాడులందు నదులును, నఖంబులందు శిలలును, బుద్ధియందు బ్రహ్మయు, నింద్రియంబులందు దేవర్షిగణంబులును, గాత్రంబునఁ జరాచరవర్గంబును జూడనయ్యెను.

ఆసర్వాత్మకునిలో భువనంబెల్ల నసురులు గాంచి కలుచమతులైరి. తోడ్తోడ శంఖశార్ఙ్గచక్రగదాదండఖడ్గతూణీరబాణంబులు పొడతెంచెను. సునందనందాదిపార్షదులును లోకపాలురును గొలువై నిలిచిరి.

### హరిపాదద్వంద్వంబున భూమ్యాకాశంబు లాక్రమించుట

భగవానుఁ డట్లు పెరిఁగి యొక్కయడుగున భూమండలంబెల్ల నాక్రమించి రెండవపాదంబున దివిఁ గప్పెను. ఆపాదంబు మహర్జనతపోలోకంబులు దాఁటి సత్యలోకంబువఱకుఁ బఱచెను. తత్పదనఖకిరణతేజంబు మోఁల బ్రహ్మాదులతేజం బ స్తమించెను. మరీచ్యాదిమహర్షులును సనకాదియోగులును బ్రహ్మలోకంబును సాధించినవారయ్యుఁ దత్పాదపద్మంబునకు మ్రొక్కిరి. వేదోపవేదాదులు మూర్తిమంతంబులై యయ్యడుగుదామర నర్చించెను. బ్రహ్మదేవుఁడు కమండులు జలంబుల నప్పాదంబును గడిగెను. ఆనీరు క్రిందికిఁ బాఱి గంగ యనుపేరు వహించి త్రైలోక్యపావని యయ్యెను. లోకనాథులు చందనమాల్యధూపదీపలాజాక్షతఫలంబుల తచ్చరణాబ్జంబును బూజించిరి. స్తోత్రవచనంబులును జయశబ్దంబులును మాఱుమ్రోఁగెను. అవ్విజయోత్సవం

బును జాంబవంతుఁడు మనోజవంబున దెసలెల్లఁ జాటెను. భగవానుఁ డంతట యథాపూర్వము వామనాకారంబును దాల్చెను.

### అసురవిష్ణుపార్షదులయుద్ధము

రాజేంద్రా ! భగవానుఁడు మూఁడడుగులనేలఁ గోరుటయు నొక్కపాదంబున ధాత్రీమండలంబెల్ల నాక్రమించుటయు నసురులు చూచి క్రోధవివశులై బలివంక మరలి 'ఇతఁడు వాస్తవంబైన విప్రుఁడు గాఁడు. విష్ణుఁ డీరూపంబు దాల్చి దేవకార్యంబును సాధించుటకై వచ్చెను. ఈమాయ లెఱుంగక నీవు సొమ్మెల్లఁ గొల్లనేసితివి. సత్య వ్రతులయెడ నాడితప్పుట దోషంబైన నగుఁగాక; టకుటొంకరియెడ మాటతప్పుట దోషం బెన్నఁడుఁగాదు; మీఁదు మిక్కిలి గుణంబగు. వంచకులు దండ్యులగుదురు. నీవు యజ్ఞదీక్షానియతింజేసి దండంబు వద లితివి. రాజసేవకులము మేము మాధర్మంబుఁ జేయక తప్పదు. ఈ మాయలమారిని మట్టుపెట్టుట మాకు మాన్యంబగు' ననుచు బలి యాజ్ఞను బడయకయే వాడిఖడ్గంబులఁ బూని వామనునిపయి నురవ డించిరి.

దైత్యవీరులయుద్ధతికి నంద సునంద జయ విజయ కుముద కుము దాక్ష గరుడ సాత్వతాది విష్ణుపార్షదులు నవ్వుచు నాయుధపాణులై వారిని ఢీకొని యడిచిరి. పార్షదులప్రేటులకు దైత్యదానవవీరులు బమ్మ రింపసాగిరి.

బలిచక్రవర్తి తనభటులను బిలిచి 'అసురవీరులారా ! నామాట వినుఁడు. ఆచార్యశాపహతులమైన మనకు సంరంభము తగదు. ఏ లోకేశ్వరుఁడు సర్వభూతంబులకు సుఖదుఃఖంబుల నిచ్చునో, యాజగన్నా థుని నతిక్రమింప నెవనికిఁ దరము ? నాఁడు మనకు మేలును సురలకుఁ గీడును దలంచెను; నేఁడు సురలకు మేలును మనకుఁ గీడును భావించెను. ఇదియుఁ గాలవిశేషంబగు. కాలము మ్రోల బాహుబుద్ధిబలంబులుగాని మంత్రౌషధంబులుగాని సామాద్యుపాయంబులుగాని సాగవు. ఎవరు

మున్ను మీకు నోటువడిరో వారే మిమ్ము నిప్పుడు గెలుచుటయ్యె. ఇది దైవయోగముగాక మఱేమియగు? దైవంబు ప్రసన్నమైననాఁడు మీరే మఱల వీరిం గెల్వనోపుదురు. మంచికాలంబును నిరీక్షించుచుఁ దల యొగ్గియుండుఁ'డని బోధించెను. దైత్యదానవు లంతట నట నుండనోపక రసాతలంబుఁ జొచ్చిరి.

అంత గరుత్మంతుఁడు భగవానునిభావం బూహించి బలిని వరుణ పాశంబుల బంధించెను. ఆసేతకు భూనభోంతరాళంబులు హాహాకారం బుల నిండెను. వైరోచనుఁ డట్లు నష్టశ్రీకుఁడును పాశబద్ధుఁడునయ్యు నించుకేనియుఁ జలింపకయుండుట వామనుఁడు చూచి 'అనఘాత్మా! మూఁడడుగులనేల యిచ్చితివి. భూమ్యంతరిక్షంబులు రెండడుగులకే చాలవయ్యెను. మూఁడవదానికిఁ దావు చూపుము. మాట తప్పుదు నందువా? అట్లేని నీగురునియనుమతిం బడసి చనుము. మూఁడడుగుల నేలఁ గోరినందులకు నీగొప్పతనంబును బురస్కరించుకొని నవ్వితివి. ఇప్పు డేమిచెప్పెదవు?' అని పలికెను.

### మూఁడవయడుగునకు బలి తనతల నిచ్చుట

రాజేంద్రా! భగవంతునివచనంబులు పుంటిపయి ముల్లు డుంచిన ట్లయ్యెను. ఆయెత్తిపొడుపులకు బలి కోపంబుగాని దైన్యంబుగాని చెందక 'దేవా! మాట తప్పఁజాల. పదచ్యుతికిఁగాని, పాశబంధంబునకుఁ గాని, దుస్సహావ్యసనంబునకుఁగాని, అర్థనాశనంబునకుఁగాని, తుదకు నీ నిగ్రహంబునకుఁగాని వెఱవను; పలికి బొంకె నన్నయపకీర్తికి నెంతయు భయపడుదు. ఇదిగో నాతలపయి నీమూఁడవపాదంబు నుంచి నామాట చెల్లింపుము. తలిదండ్రులుగాని యన్నదమ్ములుగాని సుహృత్తులుగాని యుత్తములుగాని విధించునట్టి దండంబు మేలునకే యని నామతంబు, దండ్యులమద్ధాంధకారంబునఁ జేసి వారికి దండనకాలంబున దండవిధాయ కులు వైరులుగాఁ దోఁచుదురు. ఎట్టకేలకు వారే దండితులకు గురువులు.

మహోపకారులు నగుదురు. నీవు లోకదండనుఁడవు; మదాంధుల మదం బుడిపి జ్ఞాననేత్రంబుఁ గృపసేయుదువు.

దేవా! అసురు లెందఱో మొదట నీయెడ గాఢరూఢవైరానుబంధులయ్యు నెట్టకేలకు నీవలననే యేకాంతభక్తప్రాప్యపదంబు నొందిరి గదా. నన్ను నిగ్రహించినను వరుణపాశంబున బంధించినను సిగ్గుగాని యెడరుగాని సుంతయు నాకుఁ గలుగదు. ఈబంధనంబు నన్నుద్ధరించుటకే గాని వేఱుగాదు. నాకుఁ బ్రత్యక్షుఁడవైతివి. ఇంతకన్న నాకుఁ బరమ శోభనం బేమిగలదు?

సీ. చుట్టాలు దొంగలు సుతులు బుణస్థులు
కాంతలు సంసారకారణములు
ధనము లస్థిరములు తను వతిచంచల
కార్యార్థ లన్యులుఁ గాల మెడచు
ఆయువు సత్వర మైశ్వర్య మతిశీఘ్ర
మని కాదె తమతండ్రి నతకరించి
మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుఁడు
నీపాదకమలంబు నియతిఁ జేరె
తే. భద్రుఁ డతనికి మృతిలేని బ్రదుకు గలిగె
వైరులైకాని తొల్లి మా వారుగాన
రక్షివై వచ్చి నీవు నన్నడుగు టెల్లఁ
బద్మలోచన నాపుణ్యఫలముగాదె?

దేవా! ఈజీవితం బెప్పుడును మృత్యుహస్తగతమై యుండు. ఆ సంగతి యెఱుంగక యది నిత్యంబని తలంచి భ్రాంతులై వర్తింతురు. అట్టిభ్రాంతికి వైరివైన నిన్నుఁ జేరితి' నని విన్నవించెను.

ప్రహ్లాదుఁడు వామనుని సందర్శించుట

రాజేంద్రా! అంతలోన నటకుఁ బ్రహ్లాదుఁడు వచ్చెను. బలి పౌత్రుని జూచి వరుణపాశబంధంబునఁ జేసి కైతోయిగూర్చి నమస్కరింపఁ

జ్వాలక తలతో మ్రొక్కెను. అంతటఁ బ్రహ్లాదుఁడు వామనుని డాయం బోయి తలనేలసోఁక మ్రొక్కి యానందజలంబుల నించుచు 'దేవా! నీయిచ్చిన యింద్రపదంబును నీవు మఱలఁ గైకొనుట వీని కెంతయు మేలగు. ఎట్లందువా? సిరి యెంతవారినైనను మోహవశులఁ గావించు. అట్టిదానినుండి యితనిఁ దప్పించుట యనుగ్రహించుటయే గదా. సిరిని వదలనిదాఁ డాత్మగతి నెన్నఁడుఁ గాననేరఁడు' అని విన్నవించెను.

వింధ్యావళి భగవంతు నుగ్గడించుట

ప్రహ్లాదునిమాట నందికొని విరించి యేమో చెప్పనుండెను. అంత లోన బలిపత్ని వింధ్యావళి మున్ను వచ్చెను. బ్రహ్మ యదిచూచి మిన్న కుండెను. వింధ్యావళి కన్నీరు నించుచు 'దేవా! నీవు నీలీలార్థము జగత్త్రయంబు సృజింతువు. ఆలోకంబులకు నీవే ప్రభుండవుగాని యొరులు గారు. మూఢు లది యెఱుంగక లోకంబులు తమవనియు వానికిఁ దాము రాజులమనియు వృథాభిమానంబుఁ జేయుదురు. సృష్టి స్థితిలయకరునకు నీ కెవ్వ రేమి యీయంగలరు? నీ కిచ్చుచున్నామని తలంచుటకన్న సిగ్గుమాలినతనము గలదా?' యని విన్నవించి తొలఁగెను.

అంత బ్రహ్మ మునుపడి 'దేవదేవా! నీపాదంబుల జలంబుంచి గడ్డి పఱకనేని నీకు సమర్పించునతఁడు మహోత్తమగతి నొందు. కాదనక లేదనక మాట మరలింపక ముల్లోకంబులను నీకు సమర్పించిన యీ వైరోచనుఁడు వ్యసనపడనగునా?' యనెను.

వామనుఁడు బలిచక్రవర్తి ననుగ్రహించుట

భగవానుఁడు బ్రహ్మావచనంబులు విని 'పద్మజా! పురుషుఁడు ధన గర్వితుఁడై లోకంబును నన్నుఁ దిరస్కరించు. ధనం బుడిగిన మదంబు వెనువెంటనే యుడుగు. జీవునకు స్వాతంత్ర్యము లేదు. అస్వతంత్రుఁడై యతఁడు కర్మంబు లొనర్చుచు ఫలానుభవయోగ్యంబులైన శరీరంబు ధరించుటకై వివిధయోనులందు సంచరించుచుండు. పరమేష్ఠీ! నర జన్మంబు మహాదుర్లభము. అట్టిజన్మంబు సంప్రాప్తమైనను విద్యావయో

రూపజననకర్మధనైశ్వర్యాదిమదంబు వెనువెంటనే వదలదు. మఱికొందఱు బెట్టుగా చెలఁచునందువా ? అది 'నేను, నాది' అనుభావంబును బుట్టించి కన్నుఁ గప్పి యతనిని నావంక మఱల నీయదు. ఎల్లరు నాకు సములగుటంజేసి నాయనుగ్రహం బెల్లరయందు సమముగానే యుండు. అయినను మేఘం బులు రవిప్రకాశంబునకువలె మదంబు నాయనుగ్రహప్రాప్తికి నడ్డు పడుచుండు. మేఘవిచ్ఛిన్నంబున రవికాంతియట్లు మదవిచ్ఛిన్నంబున నాయనుగ్రహప్రాప్తిగలుగు. ఆకారణంబున నే నెవని ననుగ్రహింపఁ దలంతునో వానిని మొట్టమొదట ధనహీనునిగా నొనర్తు. శ్రేయః ప్రతి కూలజన్మాదులు గాంచిన భక్తులసంగతి యేమందువా ? నాభక్తుఁ డేస్థితిలోను మోహంబునొందఁడు. చతురాననా! ఈవైరోచనునకు సంపద వెడలించితి; స్థానచ్యుతిఁ గావించితి; తరుణపాశంబునఁ గట్టించితి; స్వకీయులు విడనాడఁజేసితి; గురుఁ డదలించెను, శపించెను. నేను నొవ్వఁబలికితి. ఇన్నియాపద లొక్కసారి పైకొన్నను ధీరుఁడై యితఁడు సత్యధర్మసన్మార్గంబులను వదలఁడు. నా యీకఠినపరీక్షకు నితఁడు నిలిచెఁ గావున నితనిని నాస్థానంబుఁ జేర్చెదను.

'మఱియు నితఁ డెనిమిదవమనువైన సావర్ణియొక్క మన్వంతర మందు నింద్రుఁడగు. అందాఁక నితఁడు విశ్వకర్మనిర్మిత సుతలంబున వసించుఁగాక. అటకు నావీక్షణంబు పఱచుఁగావున నితనికి నచ్చట నెట్టి యాధివ్యాధులుగాని తదన్యబాధలుగాని కలుగవు.' అని చెప్పి బలివంక మఱలి, 'ఇంద్రసేనమహారాజా ! నీకు శుభంబయ్యెడు. సుతలంబు స్వర్గవాసులకుఁగూడఁ బ్రార్థనీయంబగు. అటకు నీవు నీజ్ఞాతులతోడఁ జని సుఖముండుము. లోకేశ్వరులుగూడ నిన్నుఁ జెనకనేరరు. నీమాటకు దైత్యు లెవ్వరేనియు నెదురాడుచో వారు నాచక్రహతులై నశింతురు. అచ్చట నిన్ను నేను సర్వవిధంబులరక్షింతు. ఇన్నిమాటలేల ? అచ్చట నీకు నేను నిత్యసన్నిహితుఁడనై యుండు. ఎల్లప్పుడు నన్ను జూచు చుండుము. దైత్యదానవసంసర్గ జన్యాసురభావదోషంబునకు వెఱతు నందువా ? నాసాన్నిధ్యంబున నీ కట్టిభయం బుండదు. అని చెప్పెను.

రాజేంద్రా ! బలిచక్రవర్తి యప్పలుకు లాలకించి 'దేవా! నీకు భక్తిపూర్వప్రణామంబునకన్న వేఱొండు సమర్పింపఁజాల. ఇదే నీకుఁ దలతో మ్రొక్కెదు. లోకపాలకులకుఁగూడ దుర్లభంబైన భవదనుగ్రహంబునకు నియ్యధమునిఁ బాత్రుఁజేసితివి. ఇంతకన్న నాకేమి వలయు?' నని త్రిమూర్తులకు నమస్కరించెను. వెనువెంటనే వాని కట్లు వీడెను.

మనుమనికిఁ గులోద్ధారకునకు బ్రహ్లాదుఁ డెంతయు సంతసించి భగవంతునకుఁ గేలుమోడ్చి 'దేవా ! అసురులమైన మాయెడ నీవు చూపిన యీయనుగ్రహంబును బ్రహ్మాభవులేగాక రమాదేవిసయితము పడయదు. జీవిభూతిదర్శనార్థము మహాత్ములు ప్రాఁకులాడుదురు. అట్టిది మాకుఁ బ్రాప్తించెను. ఇంత మహాభాగ్యంబునకు మేమేమి నోచితిమో యూహింపరాదు. నీచరిత్ర మహాచిత్రము. నీమాయావిలాసంబునకు విశ్వమే నిదర్శనము. సర్వసముఁడవు నర్థిజనకల్పకంబునై యుందువు. లోకమందలి వైషమ్యగతులు నీకు మూఁటఁగట్టుదురు. ఇంతకన్న నజ్ఞానంబు గలుగ దని విన్నవించెను.

**బలి సుతలంబునకుఁ బోవుట**

భగవానుఁడు ప్రహ్లాదునకు మెచ్చి 'వత్సా ! చిరసుఖంబుండుము. నీవు నీమనుమనితోడ సుతలంబునకుఁ జని సర్వజనసౌఖ్య ప్రతిపాదివై యానందింపు' మనెను. ప్రహ్లాదుఁ డావచనంబుఁ దలతో గ్రహించి వానికిఁ బ్రదక్షిణసాష్టాంగం బొనర్చి బలిని వెంటఁగొని సుతలంబునకుఁ బోయెను.

**బలి యజ్ఞ సమాప్తి**

భగవానుఁ డంతట నింద్రుని రప్పించి 'సురేశ్వరా ! స్వర్గము సాధించి యిచ్చితి. సుఖం బుండు' మని చెప్పి, యదితి విని జేరి, 'తల్లీ ! నీకోర్కె దీర్చితి' నని పలికి, భార్గవునిఁ బిలిచి, 'అయ్యా ! కర్మలోపము గారాదు. యజ్ఞసమాప్తిఁ గావింపుము. కర్మవైషమ్యంబుగలిగిన నది

యెట్లు పరిహృత మగునందువా? బ్రాహ్మణానుగ్రహంబున లోపంబు లెల్లఁ దీఱు' ననెను.

శుక్రాచార్యులు భగవదాజ్ఞ విని 'దేవా! కర్మంబులకు యజ్ఞంబులకు నీవే యీశ్వరుండవు. నిన్నుఁ బూజించినప్పుడు కర్మవైషమ్యం బెట్లుగలుగు? ఎంతజాగరూకతతో గర్మంబు లొనర్చినను మంత్రతంత్ర దేశకాలద్రవ్యాదులలో నెద్దానివలననో ఛిద్రంబు గలుగవచ్చు. నిన్నుఁ దలంచినంతనే యవి చక్కఁబడు. నీయాజ్ఞ సేయుదు. నీయానతిం దలదాల్చుటకన్నఁ బరమశ్రేయోమార్గంబు మనుష్యులకుఁ గలదా?' యని విన్నవించి యజ్ఞసమాప్తము గావించెను.

## వామనుని యుపేంద్రత్వము

పరీక్షిన్నరేంద్రా! వామనావతారకార్యము పూర్తియైనంతట బ్రహ్మయు సనత్కుమారాదులును దేవర్షులును మనుదక్షభృగుముఖ్యులును భవుఁడును వామనుని జూసి 'దేవా! ఇంద్రుఁడు ముల్లోకంబులకుఁ బ్రభువగుఁగాక వేదంబులకును ధర్మంబులకును రక్షణవలయు. అవి సురక్షితంబు లగునేని సర్వభూతంబులకు శుభంబగు. తద్రక్షణార్థము నీవామనావతారాంశంబును నెలకొల్పఁగోరుదుము. ఆమూర్తి యుపేంద్రుఁడనుపేర జగన్మంగళం బొనర్చుఁగాక' యని వేడిరి. భగవానుఁడు వారిప్రార్థనంబు నామోదించెను. ఇంద్రుఁ డంతట బ్రహ్మాదుల యనుమతిలో దనవిమానముమీఁద నవ్వామనుని స్వర్గలోకంబునకుఁ గొని పోయెను. బ్రహ్మాదులు తమతమస్థానంబులకుఁ జనిరి.

## త్రివిక్రమచరిత్రమాహాత్మ్యము

కురునందనా! ఈత్రివిక్రమచరిత్రను వింటివిగదా. ఇసుమునైన లెక్కింపవచ్చుఁగాని భగవద్గుణలీలల గణింప శక్యముగాదు. పూర్ణుఁడు స్వతంత్రుఁడునైన యాపురుషోత్తముని మహిమం బిట్టిదనిగాని యింత మాత్రం బనిగాని యిప్పటివఱకు గ్రహించినవారు గలుగరు. ఇక

ముందుఁగూడ నుండరు. ఈమాట మంత్రదర్శియైన వసిష్ఠభగవానుఁడు నొక్కిపలికెను. అట్టి మహాత్మునిచరిత్రలో నిది యొక గొప్పచరిత్రయగు. దీనిని విననోచినవా రుత్తమగతి నొందుదురు. దైవపిత్ర్యమానుష కర్మంబులు జరుగునప్పు డీచరిత్రను బఠించినచోఁ దత్కర్మంబులు చక్కగా నెఱవేఱును.

## మత్స్యావతారఘట్టము

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు వామనచరిత్ర విని మహాశ్చర్యానందంబులుపడసి 'మునివర్యా! భగవల్లీలల కెట్లంతట్యంబు గలుగదో యట్లే తత్కథలు వినువారికిఁ దృప్తితీఱదు. భగవానుఁడు దొలుదొల్త మత్స్యావతారం బెత్తె నంటిరి. మత్స్యరూపంబు తమస్స్వభావంబును మహాదుస్సహంబునై యేవగింపగు. మహాపాపకర్ములకు నట్టి నీచరూపంబులు గలుగు నందురు. సర్వేశ్వరుఁడును మీఁదుమిక్కిలి కర్మాతీతుఁడు నైన మహాత్ముఁ డంతనింద్యరూపంబును గ్రహించు టేల?' యని యడిగెను. శుకమహర్షి యిట్లు చెప్పెను.

'రాజేంద్రా! భగవానుఁడు విశ్వంబును సృష్టించి తద్రక్షణార్థము కొన్నినియమంబులఁ గావించెను. వానినే ధర్మంబు లందురు. కాలక్రమంబునఁ గామోద్రేకంబునంజేసి యనుష్ఠాతలు చక్కఁగా వర్తింపరు. తత్ఫలంబుగా ధర్మగ్లానియు లోకకళ్యాణభంగంబుఁ గలుగుచుండు. అట్టి యెగ్గును దొలఁగించుటకై భగవానుఁ డవతరించి కార్యమును జక్కబెట్టుచుండు.

కార్యసాధనోపాయంబులు దేశకాలాదులఁబట్టి యుండు. భగవానుఁడు రూపము ధరించి వివిధభూతజాతులతో మెలంగునప్పుడు వానికి భేదభావంబును గర్మాసక్తియుఁ దత్ఫలభోగావసరంబు నితరప్రాణులకు వలెఁ గలుగదా యని శంకింపవచ్చు. వాయు వెందుఁ జరించినను దత్తత్పదార్థగుణసంబంధము దానికిఁ దగులనియట్లు గుణాతీతుఁడైన భగవంతుఁ

డెన్నిరూపంబులు దాల్చిన నెన్నికర్మంబు లొనర్చినను వాని నెవ్వియు నంటవు. కారణ మేమందువా? సంబంధదోషం బెప్పుడు జనించు? వేఱొకవస్తువు గలదనుభావం బుదయించి యది నాకుఁ గావలయు నని కోరినప్పుడు తత్సంబంధంబు గలుగుచున్నది. ఈవిధానంబును ద్వైత భావంబు నహంకారమమకారంబు లందురు. భగవానునకు నట్టివి గలుగవు. ఆమహాత్ముఁడు నిరంతరము నిర్లిప్తుఁడు నభేదదర్శియు నగు. అట్టి వాఁ డెట్టి రూపంబుఁ దాల్చినను గార్యంబు లెట్టివిచేసినను బ్రమాదంబు గలుగదు.

## మత్స్యావతారకారణము

రాజేంద్రా! కాలము కల్పాదులుగా విభజింపఁబడుటయు, ప్రతి కల్పంబునకు నొక్కొక్క బ్రహ్మ యుండుటయు, కల్పాంతంబు బ్రహ్మకు నిద్రావసరంబగుటయు, బ్రహ్మ శయనించినంతనే భూరాదిలోకంబులు మున్నీట మునుఁగుటయు, బ్రహ్మ శయనింపఁబోవుతఱిఁ బునస్సృష్టికై వేదంబులు వానిముఖంబునుండి వెడలియుండుటయు, బ్రహ్మ మేల్కాంచి నంతనే యావేదంబులను గ్రహించి యందలి విధులప్రకారము మఱల సృష్టించుటయుఁ దెలిపితిని.

గడచినకల్పాంతమందు బ్రహ్మ శయనించుతఱి వానిముఖంబునుండి వేదంబులు వెలువడెను. ఆనిగమంబులను హయగ్రీవుఁ డనుదానవుఁడు హరించి సముద్రాంతరంబున డాఁగెను. ఆనిగమంబులను దెచ్చుటకై భగవానుఁడు మత్స్యావతారం బెత్తుటయ్యెను. మఱియు నక్కాలంబున సత్యవ్రతుఁ డనురాజర్షి భగవంతునిగూర్చి తీవ్రతపంబు చేసెను; వానికి మేలుకూర్చుటకుఁగా నయ్యవతారం బవసరం బయ్యెను.

సత్యవ్రతుండు ద్రవిడేశ్వరుఁడు. అతఁడు కొండొకనాఁడు కృతమాలానదీతీరంబున జలతర్పణంబుచేయఁదలంచి తర్పణార్థము తన్న దోసిలం బుళ్ళ నీరు గొని పట్టుకొనెను. ఆనీటిలోఁ జేపపిల్ల యొకటి యుండెను. అతఁ

డాచేపను మఱల నీటిలో జాఱవిడిచెను. అందులకు నమ్మీను మహా దైన్యమొంది 'రాజేంద్రా! మీనులు పెద్దవి చిన్నవానిని భక్షించు చుండు. ఆముప్పునకు భయపడి దీనవత్సలుండవని నీయంజలిఁ జొచ్చితి. నన్నిట్లు మఱల నమ్మీనులకు బలిపెట్టనగునా? యనెను. ఆతేఁడు జాలిపడి యాచేపను దనకలశజలంబులలో నుంచి యాశ్రమంబునకుఁ గొనివచ్చెను.

ఆరాత్రి యామీను పెరిఁగెను. దానికిఁ గలశమందు నీళ్ళు చాలదయ్యెను. అది రాజును బిలిచి 'అయ్యా! ఈకమండులువు నాకుఁ జాలకున్నది. నేను సుఖంబుగా నుండుటకుఁ దగినతావు నెందేనియుఁ జూడు' మనెను. సత్యవ్రతుఁడు దాని నొకబావిలో నుంచెను. ముహూర్తములోపల నమ్మీను ముమ్మూరపొడవు పెరిఁగి 'అయ్యా! ఈకూపముగూడ నాకుఁ జాలదు; తగినచోటు చూపు' మనెను. అతఁ డామీనును గొనిపోయి యొకకొలనులో వదలెను. ఆచేప మేను పెంచి సరస్సునెల్ల నాక్రమించి 'అయ్యా! ఇదియు నాకుఁ జాలదు. మఱియు కొలను నీరింకుట సహజము. తఱుగనినీరుండుచోటు చూపు' మనెను. ఆతేఁ డట్టె యాలోచించి సముద్రంబుదక్క వేఱొండుతగదని నిశ్చయించి దానిని గొనిపోయి సముద్రంబున వదలెను. ఆమీను వానినిజూచి 'అయ్యా! ఇందు మకరంబులు తిమింగిలంబులు నుండు. అవి మహాబల శాలులు గావున నన్ను మ్రింగును. మఱియెందేనియు సురక్షణప్రదేశం బున నన్ను వదలి పుణ్యముకట్టికొనుము. ఇందు నన్ను వదలుట యాజల జంతువులకు బలియిచ్చుట యగు. ఇది సత్పురుషులకుఁ దగునా ?' యని కుయ్యిడెను.

సత్యవ్రతుఁ డామాటలు విని 'అయ్యా! గోరంతవాఁడవు కొన్ని నాళ్ళలోనే నూఱుయోజనంబులు పెరిఁగితివి. ఇట్టి మత్స్యంబును వినియుఁ గనియు నుండరు. ఎవండవు? మీనురూపంబున మాకు మోహభ్రాంతులఁ గలిగింతువేల? భూతానుగ్రహార్థము భగవానుఁడు వివిధరూపంబులు ధరించు నందురు. భగవానుఁడవు నీవు మత్స్యరూపం

బును గ్రహించితివిగాని వేఱుగాదు. దేవా! ఇదే నీకు నమస్కారము. ఈరూపగ్రహణంబునకుఁ గారణంబేమి? నాపూజాఫలంబుగా మహాద్భుతమైన నీదర్శనభాగ్యం బీరూపంబున నాకుఁ బ్రాప్తమయ్యెను. నీసేవ యెట్టిదైనను వృథగాదుగదా' యని నమస్కరించెను.

పరీక్షిన్నరేంద్రా! మత్స్యంబు వానిని విని 'రాజోత్తమా! నేఁటికి నేడవనాఁడు ముల్లోకంబులు మున్నీట మునుఁగు. అప్పు డొక పెద్దయోడ నీయొద్దకు వచ్చును. నీవు సర్వౌషధులను సర్వబీజంబులను సంతరించి సప్తర్షులను సర్వసత్త్వంబులను వెంటఁగొని యానావ యెక్కి యేకార్ణవంబున నిర్భయముగా సంచరింపుము. అప్పుడు పెనుగాలి సుడిగొట్టి వీచును. నీనావకు ముప్పుగలుగకుండుటకై వాసుకిని త్రాడుగాఁజేసి యయోడను నాకొమ్మునకుఁ గట్టుము. బ్రహ్మకు రాత్రిగడచునందాఁక యానావను నేను మున్నీటిలోఁ ద్రిప్పుచుందు. అప్పుడు నీవు పరబ్రహ్మాత్మకంబైన నామహిమనుగూర్చి ప్రశ్నింపుము. నీకు నుత్తరం బిత్తు. అంతట నీకు నాప్రభావంబు గోచరించు' ననిచెప్పి యంతర్ధానమయ్యెను.

రాజేంద్రా! సత్యవ్రతుఁ డామాటలకు నాశ్చర్యసంతోషంబులు పడసి యందే వార్చి ప్రాచీముఖాగ్రంబుగా దర్భాసనంబును దీర్చి యందుఁ దూర్పుమొఱలి కూర్చుండి యమ్మత్స్యరూపంబును జింతించుచుఁ గాలమును నిరీక్షించుచుండెను.

ఏఁడవనాఁడు మేఘంబులు మహాభీకరంబుగా గర్జించి కుంభవర్షము కురిసెను. సాగరము మహోత్తుంగతరంగకల్లోలాభీలమై పొంగి పొరలి భూమండలంబునెల్ల ముంచివైచెను. అత్తఱి సత్యవ్రతునొద్దకు నావ యొక్కటి వచ్చెను. ఓషధిబీజాదులతోడను సప్తర్షులతోడ నతఁ డానావ యెక్కెను. అంతలోనఁ బ్రచండవాతంబు వీచెను. ఆగాలివడికి పడవ తలక్రిందగునట్లయ్యెను. నావలోనివారెల్లరుఁ బ్రాణంబులపై నాసవదలిరి. సప్తర్షులు వారిభయంబును గ్రహించి భగవంతుని ధ్యానింపుమని

పల్కిరి. సత్యవ్రతుఁడు ధ్యానింపసాగెను. వానికి నిడుపాటిచేపకొమ్మును బెనుపాపత్రాడును గాన్పించెను. ఆతఁడు భగవదాజ్ఞను దలంచి యాత్రాఁటి నందికొని నావకుఁ దగిలించి రెండవకొన నమ్మీనుకొమ్మునకు గట్టి,

మ. "తమలోఁ బుట్టినవిద్య గప్పికొనుడుం దస్థూలసంసారవి
భ్రములై కొందఱు దేలుచుం గలఁగుచుం బల్వెంటలం దైవయో
గమునం దేపరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదం బందుదు రట్టి నీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా!

ఉ. కన్నులు గల్గువాఁడు మఱికానని వానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢునకు సమ్మతి దా గురుఁడౌట; సూర్యుఁడే
కన్నులుగాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురువవై యలసద్గతిజాడఁ జూపవే?

క. ఇంగలముతోడి సంగతి, బంగారము వన్నెగలుగు భంగి న్నీ సే
వాంగీకృతుల యఘంబులు, భంగంబులఁ బొందుముక్తి ప్రాపించు హరీ!

క. హృదయేశ! నీప్రసన్నత, పదివేలవపాలి వీశభాగము కతనన్
ద్రిదశేంద్రత్వముగలదఁట, మది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా!

క. వెఱివాఁడు గురువటంచును, గొఱగానిపదంబు సూపఁ గుఱనుండగు నీ
నెఱత్రోవ నడవనేర్చిన, నఱమఱ లేనట్టిపదమునందు దయాబ్ధీ!

మ. చెలివై చుట్టమవై మనస్స్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనౌ కోర్కెలపంటవై విభుఁడవై వర్ధిల్లు నిన్నొల్లకే
పలువెంటంబడి లోకమక్కట! వృథాబద్ధాశమై పోయెడిన్
నిలువన్నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా!"

అని ప్రార్థించి 'దేవా! జ్ఞానావబోధకై ని న్నాశ్రయించితిని. నా హృదయగ్రంథిని ఛేదించి యాత్మప్రకాశం బొసఁగు' మని ప్రణమిల్లెను.

భగవానుఁడు వాని ననుగ్రహించి సాంఖ్యయోగక్రియాపురస్సరంబుగా వానికి నాత్మతత్త్వరహస్యంబును బోధించెను. దీనింగూర్చి చెప్పినట్టిపురాణంబు మత్స్యపురాణంబని ప్రసిద్ధిగాంచెను.

రాజేంద్రా! బ్రహ్మదేవుఁడు నిదించుతఱి వానిముఖంబున జనించిన వేదరాశిని హయగ్రీవుఁ డనుదైత్యుఁడు హరించెనని చెప్పితిని. భగవానుఁడు వానిని జంపి వేదంబులను మఱల బ్రహ్మకు నిచ్చెను.

ఈమత్స్యావతారచరిత్రను బ్రతిదినముఁ బఠించినను గీర్తించినను గోరికలెల్ల నీడేరి పరమగతి సిద్ధించును. ఏమహానుభావుఁడు నిఖిలకారణంబగునో యామాయామత్స్యమూర్తికి మ్రొక్కెద. రాజేంద్రా! ఆసత్యవ్రతరాజర్షి తర్వాత వైవస్వతమను వయ్యెను. వానికి నిక్ష్వాకువు మున్నగువారు జనించిరి.

అష్టమస్కంధము సమాప్తము.



శ్రీ ర స్తు

# శ్రీ దొడ్డభాగవతము

## నవమస్కంధము

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షిని గని 'మునీంద్రా! వైవస్వతమనువంశజులచరిత్ర వినఁగోరుదు' ననెను. శుకుఁ డిట్లనియెను.

### వైవస్వతమనువంశము

రాజేంద్రా! కల్పాంతమందు విశ్వంబెల్ల లయంబగుటయు, భగవానుఁ డొక్కఁడు శేషించుటయు, మఱుకల్పప్రారంభంబున భగవానుని నాభిప్రదేశమందు స్వర్ణమయకమలకోశం బుదయించుటయు, నందుండి బ్రహ్మ పుట్టుటయు, పద్మంబునుండి పుట్టుటంజేసి ప్రకృతకల్ప బ్రహ్మకుఁ బద్మభవుఁ డనుపేరు వచ్చుటయుఁ దెలిపితిని. బ్రహ్మకు మానస పుత్రుఁడై మరీచి జనించెను. వానికిఁ గశ్యపుఁడు పుట్టెను. వానికి దక్షపుత్రియైన యదితియందు వివస్వతుఁడు గలిగెను. వివస్వతునకు సంజ్ఞయందు శ్రాద్ధదేవుఁ డనుపుత్రుఁ డుదయించెను. అతఁ డిప్పుడు వైవస్వతమను వయ్యెను.

### వైవస్వతుఁడు పుత్రార్థము యజ్ఞము చేయుట

వైవస్వతుఁడు శ్రద్ధ యనుదానిని భార్యగా గ్రహించెను. వారికి సంతానము గలుగదయ్యెను. వైవస్వతుఁడు పుత్రార్థియై వసిష్ఠు నాచార్యునిగా వరించి మైత్రావరుణం బనునిష్టిని సంకల్పించెను. వాని పత్ని శ్రద్ధాదేవి పయోమాత్రభక్షణయై దీక్షవహించెను. యజ్ఞంబును బ్రారంభించిరి. ఆసమయంబున శ్రద్ధకుఁ బుత్రికావాంఛ జనించెను. ఆభావంబు నామె హోతకుఁ దెలిపెను. అధ్వర్యుఁడు హోమార్థము

హవిస్సు దెచ్చి హోతకుఁ బ్రేషయిచ్చెను. హోత దానినందికొని శ్రద్ధాభావంబును మదినిడికొని పుత్త్రికాజననంబును గోరి యాజ్యదేవత నుద్దేశించి మంత్రపురస్కారంబుగా వౌషట్కారంబు చెప్పెను. అధ్వర్యుఁడు వేల్చెను. హోత యర్థించినప్రకారము వైవస్వతునకు శ్రద్ధయందు 'ఇళ' యనుకూఁతురు జనించెను.

### ఇళ సుద్యుమ్నుఁ డగుట

వైవస్వతుఁడు పుత్త్రికోదయంబును మెచ్చక వసిష్ఠునితో 'మహాత్మా! ఒకటి తలంచిన వేఱొకటి యయ్యె. బ్రహ్మవాదులు చెప్పినను మంత్రంబు లిట్లు సంకల్పభిన్నఫలంబు లిచ్చునా?' యని దీనస్వనంబునఁ బలికెను. వసిష్ఠుఁడు దివ్యదృష్టిం జూచి 'వైవస్వతా! ఇట్లగుట మంత్రంబుల దోషంబుగాదు. మంత్రంబు లెన్నఁడు సంకల్పభిన్నఫలంబుల నీయవు. పుత్త్రికాజననంబునుగోరి హోత మంత్రధ్యానం బొనర్చెను. వగవవలదు. నాతేజోబలంబున నీసుతకుఁ బురుషత్వంబును సాధింతు' నని చెప్పి భగవానునిఁ బ్రార్థించెను. ఆదిపూరుషుఁడు వసిష్ఠప్రార్థనంబును హర్షించి యిళకుఁ బుంస్త్వమును గృపచేసెను. ఆపుత్త్రిక మగతనంబు వహించి సుద్యుమ్నుఁ డనుపేరఁ బరఁగెను.

### సుద్యుమ్నాదులు స్త్రీ లగుట

పరీక్షిన్నరేంద్రా! సుద్యుమ్నునిఁ బ్రతిష్ఠానదేశంబునకు రాజుగాఁ జేసిరి. అతఁ డాదేశంబును బాలించుచుఁ గొండొకనాఁడు మంత్రులతోడ వేటకుం దరలి యుత్తరదిక్కుఁ ద్రొక్కి మృగంబుల నేయుచు చనిచని మేరుగిరిప్రాంత కుమారవనముఁ జొచ్చెను. ఆవనమునం దడుగిడినంతనే వారెల్లరు స్త్రీలైరి. వారియశ్వంబులుగూడ నాడు గుఱ్ఱంబులయ్యెను. ఒండొరులఁ జూచుచు నెల్లరు విన్నఁబాటు నొందిరి.

### కుమారవనప్రభావము

రాజేంద్రా! ఈ వైపరీత్యంబునకుఁ గారణ మేమందువా? తొల్లి యొకనాఁడు ఋషులు చంద్రశేఖరుని సందర్శించుటకై యచ్చటకు వచ్చిరి,

అత్తఱిఁ జంద్రచూడుఁ డుమాదేవితో నుండెను. వివస్త్రయైయున్న యాదేవి ఋషులను జూచి లజ్జనొంది పతితోడనుండి లేచి వుట్టము గట్టెను. ఉమామహేశ్వరులు రతినుండుట ఋషులు గ్రహించి యందుండి మరలి నరనారాయణాశ్రమంబునకుఁ బోయిరి. మహేశ్వరుఁడు తనసతికిఁ బ్రియంబుఁ గూర్చువాఁడై 'ఇఁక నిట నెవ్వ రడుగిడినను స్త్రీరూపంబును దాల్తురుగాక!' యనెను. నాఁడు సుత నటకుఁ బురుషులెవ్వరుఁ జనరు. మహేశ్వరశాపకారణంబున సుద్యుమ్నాదులకు స్త్రీత్వము సంభవించెను.

### పురూరవజననము

సుద్యుమ్నుఁ డట్లు స్త్రీయై తోడివారలంగూడి వనవనాంతరంబులు తిరుగుచు బుధునియాశ్రమంబు చేరెను. బుధుఁడు దానిని గామించెను. వారికిఁ బురూరవుండు జనించెను.

### సుద్యుమ్నునకు స్త్రీత్వపురుషత్వంబులు రెండుఁ గలుగుట

సుద్యుమ్నుఁడు తనస్త్రీత్వంబునకు వగచుచుఁ గులగురువైన వసిష్ఠుని ధ్యానించెను. ఆమునీంద్రుఁడు ప్రసన్నుఁడై సుద్యుమ్ను నిదురవస్థకుఁ జింతపడి యీశ్వరునొద్దకుఁబోయి 'దేవా! సుద్యుమ్నునకు యథాపూర్వము పుంస్త్వంబు ననుగ్రహింపు' మని ప్రార్థించెను. పార్వతీనాథుఁడు వసిష్ఠునకు సంతసించి 'మునీంద్రా! నామాట తప్పరాదు. నీవుగా వచ్చి యింత కోరుచున్నావు. నీకోర్కి వితగారాదు. వైవస్వతాపత్యం బిదిసుత నొక్కమాసము స్త్రీగా, నొక్కమాసము పురుషుఁడుగా నుండునట్లు ప్రసాదించితిని. ఆరూపంబు నతఁడు రాజ్యముఁ బాలించు' ననెను. సుద్యుమ్నుఁడు గురుప్రసాదంబున స్త్రీత్వంబును బురుషత్వంబును బొందుచు రాజ్యము చేయసాగెను.

### సుద్యుమ్నుఁడు తపస్సు చేయఁబోవుట

నరేంద్రా! ఉభయలింగధారియైన సుద్యుమ్ను నిపరిపాలనంబును బ్రజలు మెచ్చరైరి. మఱియు వానికి వయస్సు చెల్లెను. అతఁడు

ప్రజాభిప్రాయంబును గ్రహించి వానికుమారులైన యుత్కలుఁడు, గయుఁడు, విమలుఁడు నను ముగ్గురను త్తరాపథంబునకు రాజులుగాఁజేసిఁ బురూరవునకుఁ బట్టాభిషేకంబు గావించి తపోవనంబునకుఁ బోయెను.

### నృగాదుల జననాదికము

రాజా! వైవస్వతుఁడు పుత్రార్థియై మఱల యమునాతీరంబునకుఁ జని భగవానునిగూర్చి నూతేండ్లు తపం బొనరించెను. భగవదనుగ్రహ ఫలంబుగా వానికి శ్రద్ధయందు నృగుఁడు, శర్యాతి, దిష్టుఁడు, ధృష్టుఁడు, కరూశకుఁడు, నరిష్యంతుఁడు, పృషధ్రుఁడు, నభగుఁడు, కవి యను పుత్రులు తొమ్మండ్రుగురు జనించిరి. నభగునకు నాభాగుఁ డనునామాంతరంబుగూడఁ గలదు.

### పృషధ్రుఁడు

పృషధ్రుఁడు వానిగురువైన వసిష్ఠుని యాశ్రమముఁజేరి వాని గోగణంబును బాలించుచుండెను. కొండొకయేఁడు వర్షకాలంబునఁ గాఱుమబ్బులు గ్రమ్మి కటికచీఁకట్లుపఱచి వాన క్రుమ్మరిల్లెను. ఆవులు కొట్టములోఁ జలికి వడఁకుచు నొండొంటి నారసి పరుండెను. నాటి నడిరేయి బెబ్బులి మందలోఁ జొచ్చి యొకయావును బట్టెను. గోవులెల్ల భీతిల్లి బిట్టార్చెను. పృషధ్రుఁ డాయార్పులు విని తటాలున గోష్ఠిలోనికిఁబోయెను. గాఢాంధకారంబులో వానికి నెద్దియుఁ దెలియరాకుండెను. అతఁడు ఖడ్గం బెత్తి పులియనుతలంపుతో వ్రేఁటెను. ఆవ్రేటునకు నొకయావు తల తెగిపడెను. ఖడ్గము కొన దాఁకి పులిచెవి తునిగి రాలెను. వ్యాఘ్రము పఱచెను. పులి చచ్చెనని భావించి యతఁడు మఱలివచ్చి పరుండెను.

తెల్లవాఱెను; నిజము బయలుపడెను. పృషధ్రుఁడు మహాఖిన్నుఁడై యేమియుఁ దోఁపకుండెను. వసిష్ఠునకు సంగతిఁ దెలిపిరి. ఆ మునీంద్రుఁ డది విని ప్రమాదఫలంబని మన్నింపక 'దుష్టా! క్షత్రియుం డిట్లుచేయఁడు. ఈపని శూద్రునకుఁదగును. శూద్రుండవగు' మని శపించెను.

పృషధ్రుం డాశాపంబును దలతో గ్రహించి బ్రహ్మచర్యవ్రతముం బూని భగవానునియందు నేకాంతభక్తిం జేసి యదృచ్ఛాలబ్ధంబు జీవికగా జడాంధబధిరులవలె భూసంచారంబు గావించుచుం జనిచని యొకానొక యరణ్యమునందు మండుచున్న దావాగ్నిలోంబడి కాలి బ్రహ్మపదంబు నొందెను.

### కవి

రాజా! కవి యనువాఁడు బాల్యంబునుండి విషయవైరాగ్యంబును బెంచి గృహాదులనెల్లం ద్యజించి భగవత్పరచిత్తుండై పరమగతిం బడసెను.

### కరూశ ధృష్టుల సంతానము

కరూశునకుం గారూశులనువారుపుట్టి బ్రాహ్మణభక్తులును ధర్మపరాయణులునై యుత్తరాపథంబును బాలించిరి. ధృష్టునకు ధార్ష్టులను సుతులు జనించి బ్రాహ్మణులైరి.

### నృగుసంతానము

నృగువునకు సుమతియు, వానికి జ్యోతిస్సు, వానికి వసువును వానికి నోఘవంతుఁడును గలిగిరి. ఓఘవంతునకు నొకపుత్త్రుఁడు నొక పుత్త్రికయు జనించిరి. పుత్త్రికకు ఓఘవతి యని తండ్రి పేరుపెట్టిరి. ఆ కన్యకను సుదర్శనుఁడు వివాహమయ్యెను.

### నరిష్యంతుని సంతానము

నరిష్యంతునకుం జిత్రసేనుఁడును, వానికి దక్షుఁడును, వానికి మాఢ్వాంసుఁడును, వానికి శర్వుఁడును, వానికి నింద్రసేనుఁడును, వానికి వీతిహోత్రుఁడును, వానికి సత్యశ్రవుఁడును, వానికి నురుశ్రవుఁడును, వానికి దేవదత్తుఁడును, వానికి నగ్నివేశుఁడును గలిగెను. అగ్నివేశునకుం గానీనుఁడనియు జాతుకర్ణియనియు నామాంతరములు. అగ్నివేశునివలన వానికులంబునకు బ్రాహ్మణత్వంబు గలిగెను.

### దిష్టుని సంతానము

రాజా! దిష్టునకు నాభాగుఁడు, వానికి హలంధనుఁడు, వానికి వత్సప్రీతి, వానికిఁ బ్రాంశువు, వానికిఁ బ్రమతి, వానికి ఖమిత్రుఁడు, వానికిఁ జాక్షుషుఁడు, వానికి వివింశతి, వానికి రంభుఁడు, వానికి ఖనినేత్రుఁడు, వానికిఁ గరంధనుఁడు, వానికి అవిక్షితుఁడు, వానికి మరుత్తుఁడుఁ బుట్టెను. నాభాగుఁడు వైశ్యత్వమొందెను.

### మరుత్తుఁడు

మరుత్తుఁడు చక్రవర్తియై యంగిరఃపుత్రుఁడైన సంవర్తుఁడనుమహాయోగీశ్వరుని యాజకునిగా వరించి గొప్పయజ్ఞముచేసెను. ఆయాగమందు హిరణ్యపాత్రంబులుదక్క వేఱొండుపాత్రంబుల దాఁకియు నెఱుంగరు. ఇంద్రుఁ డాయజ్ఞంబునందు సోమపానం బొనర్చి మత్తుగొనెను; మరుత్తులు పరివేషంబుగావించిరి; విశ్వేదేవులు సదస్యులైరి; ద్విజులు దక్షిణలమోయనోర్వరైరి. వేయేల! ఆయజ్ఞంబునకు సాటియైన యజ్ఞంబు నిప్పటివఱకుఁ జేసినవారు గలుగరు.

### మరుత్తుసంతానము

మరుత్తునకు దముఁడును, వానికి రాజవర్ధనుఁడును, వానికి సుధృతియు, వానికి నరుఁడును, వానికిఁ గేవలుఁడును, వానికి బంధుమంతుఁడును, వానికి వేగవంతుఁడును, వానికి బంధుఁడును, వానికిఁ దృణబిందువును గలిగెను.

### తృణబిందుసంతానము

తృణబిందువును నలంబస యనునచ్చర వరించెను. వారికిఁ బెక్కుమందిసుతులు ఇలబిల యనునొక్కపుత్రికయు జనించిరి. ఇలబిలను విశ్వవసువు గ్రహించెను. వారికిఁ గుబేరుఁడు పుట్టి తండ్రితోడఁ జదివి విద్వాంసుఁ డయ్యెను. కుబేరునకు విశాలుఁడు శూన్యబంధుఁడు, ధూమ్రకేతుఁ డనుపుత్రులు గలిగిరి. విశాలుఁడు తనపేర నొకపట్టణంబును నిర్మించెను. దానిని విశాలపుర మందురు.

విశాలునకు హేమచంద్రుఁడు, వానికి ధూమ్రాక్షుఁడు, వానికి సహదేవుఁడు, వానికిఁ గృశాశ్వుఁడు, వానికి సోమదత్తుఁడు జనించెను. సోమదత్తుఁ డశ్వమేధయాగంబులుచేసి యజ్ఞేశ్వరు నారాధించి యుత్తమ గతి నొందెను. సోమదత్తునకు సుమతి, వానికి జనమేజయుఁడు జనించెను. రాజా! విశాలవంశ్యులు తృణబిందుకీర్తిలతలోయనఁ గ్రాలిరి.

### సుకన్యచరిత

రాజా! వైవస్వతునికుమారుఁడు శర్యాతి వేదాంతతత్త్వవేత్తయై యంగిరునియజ్ఞమందు రెండవనాటివిహితకర్మంబును వచించెను. వానికి సుకన్యయను పుత్రిక జనించెను. అతఁడు కొండొకనాఁడు సుకన్యను వెంటఁగొని చ్యవనాశ్రమంబునకుఁ బోయెను. అట నక్కన్నియ యాశ్రమ వృక్షంబులను జూచుచు నటునిటుఁ దిరుగుచు నొకపుట్టను డాసి యందు మిడుంగురులంబోని వెలుంగులు రెంటిఁ గాంచి వింతపడి ముల్లొకటితీసి కొని యావెలుంగులను బొడిచెను. అందుండి నెత్తురు గాఱెను. ఎప్పుడు సుకన్య యట్లుచేసెనో యాక్షణంబ రాజసేనలకెల్ల మలమూత్రనిరోధము గలిగి కడుపులుబ్బెను. వారు గోడుగోడు మనసాగిరి. శర్యాతి యదిచూచి యాశ్చర్యమంది పరిచరులను జీరి 'మీలో నెవ్వరేనియు భార్గవమునీంద్రు నకు నపచారంబుగావించి యాశ్రమమర్యాదలను మీఱి వర్తించిరా' యని యడిగెను. సుకన్య యంతలో నటకువచ్చి తాను జేసినపనిని జెప్పెను. శర్యాతి యామాట విని యుద్విగ్నుఁడై పుట్టయొద్దకుఁబోయి, 'మునివర్యా! నాపుత్రిక సుకన్య బాల్యంబునఁజేసి తెలియక నీకు నప కారం బొనర్చెను. దానిని గరుణించి మన్నింపు' మని వేడెను. అంతటఁ బుట్టలో నున్నచ్యవనమహర్షికిని శర్యాతికిని గొంతసంభాషణము జరిగెను. శర్యాతి యమ్మునీంద్రునిభావంబు గ్రహించి సుకన్యను వానికి నిచ్చి యాజ్ఞఁబడసి స్వపురంబునకుఁ జనెను.

### భార్గవుఁడు నవయౌవనవంతుఁ డగుట

రాజా! భార్గవుఁడు పరమకోపనుఁడైనను సుకన్య వానిమది కెక్క-

వర్తించుచుఁ దత్పరిచర్యావ్రతయై యుండెను. కొండొకనాఁ డశ్వీను లయాశ్రమంబునకు వచ్చిరి. చ్యవనుఁడు యథావిధి వారి నర్చించి 'వేల్పువెజ్జులారా! యజ్ఞభాగములందు సోమపానము మీకుఁ గల్గదు గదా. దానిని మీకుఁ గల్పింతును. అందులకు మాఱుగా జవరాండ్రకు నింపైన జవ్వనంబును నాకుఁ గలిగింపు' డని యడిగెను. వా రందులకు సమ్మతించి 'మునీంద్రా! ఇదిగో యీచెంతనున్న సిద్ధసరస్సునందు నీరాడు' మనిరి.

చ్యవనుఁడు ముదిమిం జేసి కదలియాడుపాటిగూడ లేకుండెను. మఱియు వానిశరీరంబెల్ల ముడతలుపడి చూడ సహ్యముగాకుండెను. అశ్వీను లతని నెత్తికొనిపోయి యాకొలనిలోఁ దమతోడ ముంచిరి. అకొలనునుండి ముగ్గురుపురుషు లేకరూపులు రవితేజస్కులు వెడలిరి. వారు ముువ్వురు రూపంబుననేగాక దివ్యవస్త్రమాలికాదులనుగూడ నేక రూపముగలవానిని ధరించి ప్రత్యేకింప రాకయుండిరి. అట్లు వారు వెడలి సుకన్యను డాయఁజనిరి. మహాసౌందర్యగాత్రంబులతో వెలువడిన వారి ముువ్వురలోఁ దనపతి యెవ్వడో సుకన్య నిశ్చయింపనేరక యశ్వీనులను వేడెను. ఆమెపతివ్రతాధర్మంబునకు వారు మెచ్చి యాసాధ్వికిఁ దత్పతినిఁ జూపి యాఋషివరుని వీడ్కొనిరి.

### చ్యవనుఁడు సోమభాగంబు నశ్వీనుల కిచ్చుట

రాజా! శర్యాతియాగంబొండు సంకల్పించి యల్లునిఁ బుత్రికను దోడ్కొనిపోవుటకై చ్యవనాశ్రమంబునకు వచ్చెను. అట వాని పుత్రికయు నామెచెంత రవితేజుఁడైన యొకపురుషుఁడు గూర్చుండి యుండిరి. సుకన్య తండ్రికి నభివందనంబుచేసెను. శర్యాతి యందులకు సంతసింపక 'ఇది యేమిపని? లోకపూజితుఁడైన నీభర్త వగ్గుముదుసలి యని వానిని విడనాడి జారవైతివా? సత్కులంబునబుట్టియు నసద్గతికి నెట్లుచాచితివా? భర్తృవంశంబునకును బితృవంశంబునకును మాయ రానిమచ్చఁ గూర్చితి' వని రోషకషాయస్వరంబునఁ బలికెను. సుకన్య

యామాటలకు నవ్వుచు 'తండ్రీ! ఈయన నీయల్లుఁడుభార్గవుఁడుగాని వేఱుపురుషుఁడుగాఁడు అని వృత్తాంతంబెల్లఁ దెలిపెను. శర్యాతి యాసంగతి విని పరమానందవశుఁడై పుత్రికను గవుంగిటఁగ్రుచ్చి కూఁతు నల్లుని యాగార్థము వెంటఁగొని పోయెను. చ్యవనుఁ డయ్యా గంబును జేయించి యందు సోమభాగంబును నిజతేజోమహిమంబున నశ్విసులకు నిచ్చెను.

అందులకు నింద్రుఁ డలిగి చ్యవనునిజంపుటకై వజ్రమెత్తెను. భార్గవుఁడు దేవేంద్రునిభుజంబును వజ్రంబుతోడ స్తంభింపఁజేసెను. రాజా! అశ్వినులు వైద్యులని వారిని సోమపానంబునకు బహిష్కరించి యుండిరి. నాఁడు చ్యవనునికృత్యంబు నెల్లరు సమ్మతించిరి. అదిమొద వారికి సోమగ్రహణపాత్రతగలిగెను.

## రే వ తి

రాజా! శర్యాతికి ముగ్గురుకుమారులు ఉత్తానబర్హి, ఆనర్తుఁడు, భూరిశేషుఁ డనువారు జనించిరి. ఆనర్తునకు రైవతుఁడు పుట్టి సముద్ర మధ్యంబునఁ గుశస్థలి యనుపురంబును నిర్మించి యది రాజధానిగా నానర్తాదిదేశంబులను బరిపాలించెను. వానికిఁ గకుద్మి మున్నగువారు నూర్గురు పుత్రులును రేవతి యనుపుత్రికయుఁ గలిగెను. అతఁడు రేవతికి వివాహంబుసేయఁగోరి తగినరాకుమారులను విచారింపసాగెను. రేవతి యెవ్వని నిచ్ఛగింపకుండెను. అంత నతఁడు తనసుతకుఁ దగినవరుఁ డెవఁడో యని బ్రహ్మనే యడుగఁ నిశ్చయించి రేవతిని వెంటఁగొని బ్రహ్మలోకంబునకుఁ బోయెను.

ఆ త్తఱి బ్రహ్మసభయందు గాంధర్వగానంబు నడచుచుండెను. రైవతుఁ డది చూచి బ్రహ్మసందర్శనంబునకు నది యోగ్యసమయంబు గాదని సభ ముగియునందాఁక వేచియుండి యదనుగలిగినంతనే నలువను సందర్శించి నమస్కరించెను. బ్రహ్మదేవుఁడు నవ్వుచు 'అయ్యా! నీవు వచ్చినకార్యంబు నెఱుంగుదు. నీవు భూలోకంబునువదలి యెంత కాలం

బయ్యెనో తెలియునా? ఇప్పటికి నిరువదియేడు మహాయుగంబులు చనెను. ఎవ్వని కెవ్వనికి నీకూఁతు నియ్యఁదలంచితివో వారును వారి పుత్రపౌత్రప్రపౌత్రులును గాలగతులైరి. వారివంశంబులుగూడ నశించెను. ఇఁక నీసుతకు వరుఁ డెవఁడందువా? భూభారంబును దగ్గించుటకై భగవానుఁడు నిజాంశంబున బలభద్రుఁ డనుపేర ధాత్రిలో నవతరించియున్నాఁడు. ఆమహనీయునకు నీసుత నిచ్చి పెండ్లిసేయు మనెను.

రైవతుఁ డామాట విని పరమేష్ఠి యనుమతిం బడసి కుశస్థలికి వచ్చెను. ఆలోన వానియన్నలు యక్షభయంబున నప్పురంబును విడిచి స్వర్గంబునకుఁ జనిరి. ఆపురమందుఁ దనవా రెవ్వరు వానికిఁ గానరారైరి. అతఁ డప్పురంబుఁ జొచ్చి బలభద్రునకు రేవతి నిచ్చి తపోవ్రతుఁడై నారాయణాశ్రమంబుఁ జేరెను.

## నా భా గు ని చ రి త్ర

రాజా! వివస్వంతుని సుతుఁడైన భగునకు నాభాగుఁడు మున్నగు పుత్రులు జనించిరి. నాభాగుని నధ్యయనార్థము గురుకులంబున వదలిరి. అతఁడు విద్యగఱచి నైష్ఠికబ్రహ్మచారి యయ్యెను. అంతలోన వాని సోదరులు పిత్రార్జితంబును బంచికొనిరి. నాభాగుఁ డధ్యయనాంతంబున వచ్చి తనపాలిమ్మని యన్నల నడిగెను. వా రామాట విని 'నీతండ్రియే నీభాగం' బనిరి. అతఁ డంతటఁ దండ్రియొద్దకుఁబోయి 'నాయనా! నా యన్నలు నిన్ను నాభాగంబునకుఁ బంచి' రనెను. నభగుఁ డామాట విని 'వత్సా! నీకు నీభాగంబును బంచి యియ్యక నన్ను నీభాగంబునకుఁ జూపుట యెట్లు? అయిన నట్లే కానిమ్ము. వగవకు. నేను నీకు వృత్తిఁ జూపింతు. నీవు సుఖముండువు. ఇదిగో యీ యాంగిరసులు మహా మేధావంతులు సత్రయాగంబుఁ జేయుచున్నారు. ఆయాగంబున నాఱేసి దినంబులకుఁ బ్రహ్మోపాఙ్ఞ్సు జరుపవలయును. దాని కర్మకలాపము మహా విస్తరము. ఆకర్మంబున నెంతటివారైనను బ్రమాదపడుదురు. నీవటకుఁ

బోయి యవసరంబుఁ జూచి వైశ్వదేవసూక్తంబుల రెంటిని వారికిఁ జెప్పుము. వారు యజ్ఞాంతంబున స్వర్గంబునకుఁ బోవుచు సత్రశేషంబును నీకొసంగుదురు. అది నీజీవికకు మిక్కుటంబగు' నని చెప్పెను. నాభాగుఁ డట్లే వర్తించెను. ఆంగిరసులు సత్రశేషంబును వానికిచ్చి స్వర్గంబునకుఁ జనిరి.

### నాభాగశంకరులసమావేశము

నాభాగుఁ డాద్రవ్యంబునుగొని వచ్చుచుండఁగా నల్లనిపురుషుఁ డాతని నడ్డగించి 'సత్రశేషంబు' నాది యని తగవుపఱచెను. నాభాగుఁడు వానిని విని 'అయ్యా! ఋషులు దీనిని నాకిచ్చి' రనెను. ఆమాట నతఁడు చెవిఁబెట్టక 'మనతగవుంగూర్చి నీతండ్రికి నభగునకుఁజెప్పి యతఁడు తీర్మానించునట్లు పోవుద' మనెను. అంత నిద్దఱు నభగునియొద్దకుఁ జని సంగతియెల్లఁ జెప్పిరి. నభగుఁడు వారిని విని పుత్త్రునివంక మఱలి 'నాయనా! యజ్ఞశేషంబు రుద్రభాగంబగు నిన్నుఁ దగవుపఱచిన యీ మహాత్ముఁడు సర్వజ్ఞుఁడైన రుద్రుఁ డని తెలియుము. ఈలోకపూజ్యుఁడు సర్వాధికారి' యనెను. నాభాగుఁడు రుద్రునకు నమస్కరించి 'దేవా! ఇది నీసొమ్మని నాతండ్రి తీర్మానించెను. ఇఁక నీచిత్త'మనెను. శ్రీరుద్రుఁడు వానిని విని 'నీతండ్రి పుత్రవాత్సల్యంబున నేని ధర్మంబుఁ దప్పఁడు. దారిద్ర్యము వెన్నాడుచున్నను నీవు సత్యంబును దప్పవైతివి. ఎట్టిసంకటమందైనను బొంకరాదు. సత్యంబునకు నే నెంతయు సంతసింతు. సత్యవంతుఁడు నాకుఁ బరమప్రియుఁడు. ఇదిగో సత్రశేషంబునెల్ల నీకిచ్చితి; ఇంతియగాదు. నీవు మంత్రజ్ఞుఁడవు గావున సనాతనబ్రహ్మజ్ఞానంబునుగూడ నిచ్చితి'నని పలికి యాజ్ఞానంబు నుపదేశించి శంకరుఁ డంతర్హితుఁడయ్యెను.

రాజేంద్రా! ఈనాభాగునిచరిత్రను రేపుమాపుఁ దలంచువాఁడు విద్వాంసుఁడును మంత్రజ్ఞుఁడునై యుత్తమగతి నొందును.

### అంబరీషచరిత్ర

రాజా! నాభాగునకు నంబరీషుఁడు జనించి సప్తద్వీపాయుత ధాత్రీమండలంబునకు చక్రాధిపతి యయ్యెను. సిద్ధులెల్ల వానిని గొలువ

సాగెను. అట్లున్నను వానికి నవి రుచింపక "కటా! విభవంబులు తమో ద్వారంబులు. దృశ్యమెల్ల స్వప్నశ్రీనిభోలు. జగంబు లోష్టసమానము. అట్టిదానింబట్టి ప్రాకులాడుట వెఱ్ఱితనంబు.

'సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద,
పలుకులు హరిగుణపఠనమంద,
కరములువిష్ణుమందిరమార్జనములంద,
శ్రవములు హరికథా శ్రవణమంద,
చూపులు గోవిందరూపవీక్షణమంద,
శిరము కేశవనమస్కృతులయంద,
పదము లీశ్వరగేహపరిసర్పణములంద,
కామంబు చక్రికైంకర్యమంద,
తే. సంగమచ్యుతజనతనుసంగమంద,
ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద,
రసన దులసీదళములంద రతులు పుణ్య
సంగతులయంద నాకింక సాఁగుఁగాక'."

అని నిశ్చయించి సర్వేశ్వరార్పణంబుగా స్వధర్మంబుల నిర్వర్తింపుచు నీశ్వరభక్తులుచెప్పినట్లు రాజ్యపాలనం బొనర్చుచు సరస్వతీతీర పుణ్యదేశంబునందు వసిష్ఠగౌతమాసితాదులయాజమాన్యంబున హయ మేధంబులను మహావిభూతితోఁ గావించి యజ్ఞేశ్వరు నర్చించెను. రాజేంద్రా! ఆమహాభాగునియజ్ఞంబులఁ బాల్గొన్న ఋత్విగాదులెల్లరు నిర్జరసమానరూపులై యనిమిషత్వంబు నొందిరి. స్వారాజ్యసుఖాది విషయంబులు సిద్ధులకుఁగూడ దుర్లభంబైన నగుఁగాక. అవి భగవద్భక్తులకు ముంగొంగుబసిఁడిమూటలగు. అట్లున్నను వానిని లెక్కింపరు. భక్తిసుధారసమే వారికిఁ బరమప్రేయంబగు.

రాజా! అంబరీషుఁ డట్లు భక్తియోగంబును దపఃపూర్వకంబుగాఁ బెంపొందించుచు దారాగృహాదులను గ్రమక్రమంబుగాఁ ద్యజించి నిర్మ

లుఁడు నిశ్చలచిత్తుఁడు నయ్యెను. భగవానుఁ డతనిభక్తికి మెచ్చి భీత రక్షణశత్రుశిక్షణసమర్థంబయిన చక్రంబును వాని కిచ్చెను.

### అంబరీషుని ద్వాదశీవ్రతము

ఆరాజచంద్రుఁ డంతట సంవత్సరాత్మకద్వాదశీవ్రతమూలకంబున శ్రీవిష్ణుదేవు నారాధింప సంకల్పించి, తోడిసీడయో యన నున్నసతితోడ దీక్షవహించెను. వ్రతము పూర్ణమయ్యెను. కార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి మఱునాఁడు వఱువాతఁ గాళిందీజలంబులఁ గ్రుంకి మధువనమందు మధుసూదనుని సకలోపకరపూర్వకంబుగా నభిషేకించి గంధమాల్యాదు లర్పించి యాంతరభక్తితో ధ్యానించి పదికోట్లధేనువు లను రప్పించి వానికొమ్ములకు బంగారుకొమ్ములను వానిగిట్టలకు బంగారు గిట్టలను దొడివి వస్త్రమాల్యాదుల నలంకరించి వానిని సవత్సకంబులుగా బ్రాహ్మణోత్తములకు విధివిధానపూజాపురస్కారంబుగా దానంబులిచ్చి మృష్టాన్నసంతర్పణంబు గావించెను. విప్రవర్యులు పరమప్రీతులై భుజించి యంబరీషునకుఁ బారణకు ననుజ్ఞయిచ్చిరి.

### దు ర్వా స స మా గ మ ము

ఆనరపాలుఁడు పారణచేయుచుండెను. అత్తఱి దుర్వాసుఁ డతి థియై వచ్చెను. అంబరీషుఁ డామునీంద్రునకు సముచితపూజలుగావించి వానిని భుజింప వేఁడెను. ఆతపస్వి వల్లెయని మాధ్యాహ్నికక్రియలు జరిపివచ్చుటకై కాళిందీనదికిఁ జని యందుఁ గ్రుంకి బ్రహ్మధ్యానము సేయుచు నెంతసేపటికి రాఁడయ్యెను. ద్వాదశిగడియ లొక్కయర్థ ముహూర్తకాలముమాత్రము శేషించియుండెను. ఆలోపలఁ బారణ జరుగవలయును. బ్రాహ్మణులను గాదని భుజింపరాదు. అతిథి రాఁడు. ధర్మసంకటం బొదవెను. అంబరీషుఁ డెంతయుఁ జింతాక్రాంతుఁడై వ్రతంబునకును ధర్మంబునకును రెంటికి భంగము గానిమార్గం బేదో యని తలపోసి భగవంతుని ధ్యానించి జలపారణఁ గావించి మునిరాకకు నిరీక్షించుచుండెను.

### దుర్వాసుఁ డంబరీషు నాగ్రహించుట

దుర్వాసుఁడు వానికృత్యములు దీర్చి కొండొకతడవునకు వచ్చెను. అంబరీషుఁడు చేదోయిఁగూర్చి యెదుట నిలిచెను. ఆమునీంద్రుఁడు నిజ దివ్యజ్ఞానంబున సంగతి గ్రహించి కోపవశుఁడై మోము చిట్లించి 'నృశంసా ! అతిథినిఁ గుడువఁబిలిచి వానికిఁ బెట్టక మునుపడ భుజింతువా? శ్రీమదమత్తుఁడవై ధర్మోల్లంఘనంబునకుఁగూడ జంకవైతివా ? దీనికిఁ బ్రతిఫలంబు ననుభవింపు' మని పలికి వానితలజట నొండు బెఱికి నేల పయి మోఁదెను. ఆవ్రేటుతోడఁ గాలాగ్నియోయన నొక కృత్యపుట్టి కృపాణహస్తయై బిట్టార్చుచు నంబరీషునిపయికి నురువడించెను. ఆరాజ మౌళి యించుకయుఁ జలింపకయుండెను. అంతలోన విష్ణుచక్రంబువచ్చి యాకృత్యకను దహించి దుర్వాసునిమీఁదికి విజృంభించెను. ఆమునిసత్త ముఁడు వెఱచి ప్రాణరక్షణార్థము దెసలంబడి పఱువసాగెను. ఆచక్రము వానిని వెన్నాడెను.

### దుర్వాసుని పరుగులు

మ. భువిఁ దూఱఁగ భువిఁ దూఱు నబ్ధిఁ బొర నబ్ధిన్ సొచ్చు నుద్వేగియై
దివిఁ బ్రాఁకఁగ దివిఁ బ్రాఁకు దిక్కులకుఁ బో దిగ్వీథులంబోవుఁ జి
క్కివెసన్ గ్రుంగినఁ గ్రుంగు నిల్వ నిలుచుం గ్రేడింపఁ గ్రేడించు నొ
క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై.

రాజా ! దుర్వాసుఁ డట్లు లోకంబులు దిఱిగి లోకపాలుర నాశ్ర యించి యెందును దిక్కుగానక బ్రహ్మయొద్దకుఁ బోయి యభయంబు వేడెను. పరమేష్ఠి వానిని విని దీర్ఘాలోచనము గావించి 'ఏమహా త్ముఁడు కాలాత్ముఁడై యీవిశ్వంబునేగాక నాస్థానంబునుగూడఁ గను సన్నమాత్రానఁ బుట్టించి లయించునో, ఎవ్వనియాజ్ఞలం దలఁదాల్చి నేనును భవుండును దక్షాదిప్రజాపతులును సురపతులును భూపతు లును లోకహితం బొనర్చుచుందుమో, యామహాత్మునిచక్రంబును మఱ లింపఁజాలము' అని చెప్పెను. దుర్వాసుఁ డంతట బ్రహ్మను వీడ్కొని

హాహాటాహాయటికి గైలాసంబునకుంబఱచి శంకరుని శరణిల్లెను. గౌరీనాథుఁడు వానిని జూచి 'మునీంద్రా! ఎవ్వఁడు కాలాత్ముఁడో, ఎవఁడు నిమిత్తము కాఁగాఁ జరాచరభూతలోకంబెల్లఁ గాన్పించుచు మఱుగుచు నుండునో, ఎవనిచే నిర్మితంబులైన బ్రహ్మాండంబులందు మేము పరిభ్రమింతుమో, ఎవ్వనిమాయ యిట్టిదని సనత్కుమార బ్రహ్మనారదకపిలదేవలధర్మాదులు గాని మరీచిప్రముఖసిద్ధేశ్వరులుగాని తుదకు నేనుగాని యెఱుంగనేరక దానికిఁ జిక్కి వర్తింతుమో యామహాత్ముఁ డెక్కడ? మాప్రాభవంబు లెక్కడ? వానిమ్రోల మాయాటలు సాగవు. వానినే శరణిల్లుము. సర్వేశ్వరుఁడు పరమదయామూర్తి గావున నీకు మేలుగూర్చు' నని చెప్పెను.

### దుర్వాసుఁడు విష్ణుని శరణిల్లుట

రాజా! ఆమునీంద్రుఁ డంతట నడియాసలెల్ల వదలి వైకుంఠంబునకుఁ బరుగెత్తి నిట్టూర్పులతో వడఁకుగాత్రంబుతో వైకుంఠునిపాదంబుల వ్రాలి 'దేవా! విశ్వధామా! నీభక్తులప్రభావం బెఱుంగక తప్పు సేసితిని. నాతప్పు మన్నించి నన్ను రక్షింపు' మని కుయ్యిడెను. భగవానుఁడు దుర్వాసుని విని 'అయ్యా! భక్తులు నాచిత్తంబు నాకర్షించిరి. వారికిఁ బరాధీనుఁడనై యుందు. నాకు స్వాతంత్ర్యము లేదు. వారికిఁ బ్రియంబు సేయువాఁడనై యెల్లప్పుడు వారివెంటనుందు. నేను వారికి నెట్లో వారు నట్లే సర్వపరిత్యాగంబు గావించి నేనే పరమగతి యని నమ్మి నాకు సమర్పించుకొందురు. సాలోక్యాదిముక్తుల నిత్తు నన్నను వారు వలదందురు. భక్తులు నాహృదయంబును నేను భక్తుల హృదయంబులునై యుందుము. మాయిరువురకుఁ బ్రత్యేకస్థితులు గలుగవు. మునీంద్రా! ఎవఁడు స్వతేజంబును సాధుజనాపకారార్థం బుపయోగించునో వాఁడు వానితేజముచేతనే ప్రతిహతుఁడై చెడు. తపోవిద్యలు లోకప్రశస్తంబులు. అట్లుండియు నవి సాధువులకు మేలును దుర్వినీతులకుఁ గీడును గూర్చు. ఆత్మశక్తిని దేశకాలపాత్రలంబట్టి వినియోగింపనగు. బ్రాహ్మణా!

నీవు వెనువెంటనే చని యాభాగవతునిఁ బ్రసన్నునిఁ జేసికొనుము. నీకుఁ బ్రశాంతి యగు' ననెను.

### దుర్వాసుఁ డంబరీషుని శరణిల్లుట

రాజా! దుర్వాసుఁ డంతట మఱలి యంబరీషునియొద్దకు వచ్చి వానిపాదంబుల వ్రాలెను. ఆ పరమభాగవతుఁడు వానికిఁ గరుణించి శ్రీవిష్ణుచక్రంబునుగూర్చి ధ్యానగతుఁడై—

'ఏచక్రము రవిచంద్రాగ్నిపంచభూతతన్మాత్రేంద్రియాత్మకంబగునో, ఏచక్రము ధర్మధృతిసత్యయజ్ఞయజ్ఞేశ్వరయజ్ఞభోజనలోకపాలకతేజస్సా మర్థ్యంబులై గ్రాలునో, ఏచక్రము నిఖిలధర్మసేతువు నధార్మికవర్గ ధూమకేతువు నై పరిశుద్ధతేజఃప్రకాశమానమగుచు మనోజవంబున మహాశ్చర్యకార్యంబు లొనర్చుచు ముల్లోకంబులు పరిపాలించునో, ఏచక్రము స్వధర్మతేజంబునఁ దమంబును హరించునో, ఏచక్రతేజము మహాత్ముల ప్రకాశంబగునో, ఏచక్రము దురత్యయమహామహిమోన్న తమో, ఏచక్రరూపము కార్యకారణపరాత్పరమో, ఏచక్రము హరి ప్రయుక్తమై దైత్యదానవబలంబుల శిరఃకంఠపాదహస్తంబులను దుని యుచు డొక్కలు చీల్చుచు రణరంగంబున విహరించునో, ఏచక్రంబును భగవానుఁడు జగద్రక్షణదుష్టశిక్షణార్థము నిర్మించెనో యాసుదర్శన చక్రమా! ఇదే నీకు నమస్కారము. ఈవిప్రునకు మేలు గావింపుము. అట్లుచేయుట నీవు నన్ననుగ్రహించుటగు. ఏ నెవ్వియేనియు దానంబు లిచ్చి యజ్ఞంబు లొనర్చి తద్రూపంబున భగవంతు నారాధించియుందు నేని, ఏను ధర్మనిష్ఠుఁడ నగుట నిజమేని, మాకులంబునకు విప్రుఁడు దైవంబగునేని, సర్వగుణాశ్రయుఁడు భగవంతుఁడు సర్వభూతాత్మ భావంబున నాయెడఁ బ్రీతుఁడేని, ఈబ్రాహ్మణుఁ డీయుపద్రవంబుఁ బాయుఁగాక!' యని స్తుతించెను. విష్ణుచక్రం బంతట శాంతినొందెను.

### హరిదాసులమహిమ

రాజా! దుర్వాసుఁ డంతట స్వస్తినొంది 'అహో! హరిదాసుల మహిమ నేఁడు గంటి. ఎగ్గు గావించినవారికిఁగూడ లగ్గుగోరుట హరి

దాసులకే తగు. కావుననేగదా పార్వతీశ్వరుఁడు వారికి వశవర్తియై యుండు. ఎన్నితపంబు లొనర్చినను భక్తిలేనినాఁ డవియెల్ల నిరర్థకంబులు భక్తియుండునేని దురభిమానం బుండనేరదు. అభిమానరహితమైనఁగాని భక్తి యనునది నిష్కళంకము నిర్వ్యాజము గానేరదు.

మ. ఒకమా ఱెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులుఁ బల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టిస
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశు ని
ష్కళంకస్థితిఁ గొల్చు భక్తులకు లేదడ్డంబు రాజాగ్రణీ.

రాజేంద్రా! నాతప్పును దలంపక నాప్రాణంబులను గాపాడి నన్ననుగ్రహించితివి. ఇందులకుఁ దగు ప్రత్యుపకారం బేమిసేయనగునో దోఁపదు. ఇదే నాయిచ్చుదీవనలను గ్రహింపు మని యాశీర్వదించెను.

పరీక్షిన్నరేంద్రా! దుర్వాసుఁడు చక్రభీతికిఁ బఱచిననాఁడు మొదలు తిరిగి నంబరీషునొద్దకు వచ్చునాటికి నొక్కయేఁడు గడచెను. అందాఁక నంబరీషుఁడు భుజింపక నిరాహారుఁడై యమ్మునిరాక నిరీక్షించుచుండెను. ఆ ఋషి వచ్చినంతట నంబరీషుఁడు వానియడుగులు గడిగి యతనింగుడువంబెట్టి తదనుజ్ఞాతుఁడై భుజించెను. అంతట దుర్వాసుఁడు వానిని వీడ్కొనెను.

నరేంద్రా! అంబరీషుఁ డట్లు భగవంతునెడ సర్వాత్మకసమర్పణపూర్వకభక్తి నెఱపుచుఁ గేవలనిష్కామబుద్ధితోఁ గొంతకాలంబు రాజ్యంబేలి, బ్రహ్మాదిలోకంబులుగూడ నిరయప్రాయంబులని నిశ్చయించి రాజ్యంబును బుత్రులకు నప్పగించి ధీరుఁడై తపోవనంబునకుఁ బోయెను.

### అంబరీషవంశాదికము

రాజేంద్రా! అంబరీషునకు విరూపుఁడు, కేతుమంతుఁడు, శంభుఁడనుసుతులు ముగ్గురుగలిగిరి. వారిలో విరూపునకుఁ బృషదశ్వుఁడు, వానికి రథీతరుఁడు జనించెను. రథీతరునకుఁ బిడ్డలు గలుగరైరి. అతఁడు

తనయనపత్యదోషంబును బోఁగొట్టికొనఁగోరి పత్నితోడఁ బఱచి యంగిరసుని బ్రార్థించెను. ఆమునివలన నతఁ డపత్యుఁడయ్యెను. ఆపుత్రులు రథీతరులనియు బీజసంబంధమునుబట్టి యాంగిరసులనియుఁ బరఁగి బ్రాహ్మణులైరి.

### ఇక్ష్వాకుజననాదికము

నరేంద్రా! వైవస్వతమను వొకనాఁడు తుమ్మెను. వానిముక్కురంధ్రంబునుండి పురుషుఁ డొకఁడు వెడలెను. వాని నిక్ష్వాకు వనిరి. అతనికి వికుక్షి, నిమి, దండకుఁడు మున్నగువారు నూర్గురుకొడుకులు జనించిరి. ఇక్ష్వాకుఁడు వానిరాజ్యంబును నూఱుమండలంబులుగా విభజించి తూర్పువంక నిరువదియేవురను, బడమర నిఱువదియేవురను, మధ్యభాగంబున ముగ్గురను, దక్షిణోత్తరంబులఁ దక్కినవారిని మండలాధిపతులఁ జేసెను.

### ఇక్ష్వాకుఁడు శ్రాద్ధముచేయుట

ఇక్ష్వాకుఁ డష్టకమనెడి శ్రాద్ధంబును సంకల్పించెను. అందులకు మృగమాంసంబు వలయుననిరి. తదర్థ మతఁడు తన పెద్దకుమారుని వికుక్షిని నియమించెను. అతఁడు కాననంబునకుఁబోయి శ్రాద్ధక్రియాయోగ్యంబులైన మృగంబులఁ బెక్కింటి వధించి యలసిసొలసి యాఁకటఁ దెలివితప్పి దుష్స్థితిఁజెందెను. వానికి నతఁడు చంపినకుందేటి నొకదానిని దినఁబెట్టెరి. వికుక్షి యంతటఁ దేరుకొని తాను వధించినమృగంబులనెల్లఁ గొనివచ్చి తండ్రికి సమర్పించెను. శ్రాద్ధంబు నారంభించిరి. వసిష్ఠుఁడు శ్రాద్ధపదార్థ సంస్కారార్థము ప్రోక్షింపఁబోయి సంగతిగ్రహించి యిక్ష్వాకువును జీరి వికుక్షిచేసినపనిఁ దెలిపి 'అయ్యా! ఇవి యెంగిలిదోషంబు నొందెను గావునఁ గర్మయోగ్యంబులుగా' వనెను. ఇక్ష్వాకుఁడామాట విని యాగ్రహపడి వికుక్షిని దేశంబునుండి తఱిమెను. శ్రాద్ధశశమాంసంబును దిన్న కారణంబున వికుక్షి శశాదుఁ డనఁబడెను.

### వికుక్షి

ఇక్ష్వాకుని తర్వాత వికుక్షి రాజయి బహుయజ్ఞంబుల భగవంతు నారాధించి శుద్ధచిత్తుఁడయ్యెను. వానికి వసిష్ఠుఁడు జ్ఞానోపదేశము చేసెను. అంతట వికుక్షి యోగియై తనువు త్యజించి పరమపదంబు నొందెను. వికుక్షికిఁ బురంజయుఁడు పుట్టెను.

### పురంజయుఁడు

రాజా! దేవదానవుల యుద్ధంబును వింటివిగదా. ఆరణమందు సురలు దైత్యులకు నోడి పురంజయుని సాహాయ్యముఁగోరిరి. దేవేంద్రుఁడు తనకు వాహనం బగునేనిఁ దోడ్పడుదునని యతఁడు చెప్పెను. అందులకు నింద్రుఁ డేవగించెను. భగవానుఁ డింద్రునకు బోధించి యాపనికి వానిని సమ్మతింపఁజేసెను. ఇంద్రుఁడు వృషభరూపంబుఁ దాల్చి వాహనంబయ్యెను. పురంజయుఁ డా వాహనకకుదము మీఁదఁ గూర్చుండి విష్ణుతేజోరక్షితుఁడై పశ్చిమదిశనున్న దైత్యపురంబును ముట్టడించి యసురుల నోర్చి వారిధనంబెల్లఁ దెచ్చి యింద్రున కిచ్చెను. ఆకారణంబునఁ బురందరునకు నింద్రవాహుఁ డనియు గకుత్థ్సుఁ డనియుఁ బేర్లు గలిగెను.

పురంజయునకు అనేనసుఁడు, వానికిఁ బృథుఁడు, వానికి విశ్వగంధుఁడు, వానికి యువనాశ్వుఁడు, వానికి శవస్తుఁడు జనించిరి. శవస్తుఁడు శాస్తి యనుపురంబును వానిపేర నిర్మించెను. శవస్తునకు శాస్తి యనువాఁడు జనించెను. వానిని బృహదశ్వుం డనియుఁ బేర్కొందురు. వానికిఁ గువలయాశ్వుఁడు పుట్టెను.

### కువలయాశ్వుఁడు

రాజా! కువలయాశ్వునకు నేకవింశతి సహస్రసంఖ్యాకతనయులు పుట్టిరి. కొండొకనాఁ డుదంకుఁ డనువాఁడు కువలయాశ్వునిఁ బ్రియంబొండు సేయఁగోరెను. కువలయాశ్వుఁడు కొడుకులనెల్ల వెంటఁగొని దుంధుఁ డనునసురునిపయి దాడివెడలి వానిని జంపి యుదంకునకుఁ బ్రీతిఁ

గూర్చెను. దుంధుమ్రును జంపిన కారణంబున నతనిని దుందుమారుఁ డనిరి. అరణ్యములోఁ గువలయాశ్వునికొడుకులు దృఢాశ్వుఁడు, కపిలాశ్వుఁడు, భద్రాశ్వుఁ డనువారు దక్కఁ దక్కినవారెల్ల దుంధుముఖాగ్ని దగ్ధులైరి.

దృఢాశ్వునకు హర్యశ్వుఁడు, వానికి నికుంభుఁడు, వానికిఁ బర్హిణాశ్వుఁడు, వానికిఁ గృతాశ్వుఁడు, వానికి సేనజిత్తు, వానికి యువనాశ్వుఁడు జనించిరి.

### యువనాశ్వుఁడు

రాజా! యువనాశ్వుఁడు నూర్గురుకన్నెలను బెండ్లాడెను. వారిలో నొక్కతెయు సంతానవతి గాదయ్యెను. అతఁ డంతట వారినెల్లఁ దోడ్కొని యరణ్యంబునకుఁ బోయి వనవాసులైన ఋషులను సంతానార్థము ప్రార్థించెను. ఋషులు వానిదైన్యంబునకు జాలిపడి యింద్రదేవతాకమైన పుత్రకామేష్టిని వానిచేతఁ జేయించిరి.

### యువనాశ్వునకు గర్భము వచ్చుట

యువనాశ్వుఁడు భార్యలతోడ దీక్షితుఁడై యజ్ఞంబుఁ జేయుచు నుండఁగాఁ గొండొకనాఁడు నడిరేయి వానికిఁ బెనుదప్పి గలిగెను. ఎల్లరు నిద్రావశులై యుండిరి. చేరువ నెందు నీరు గానరాకుండెను. అతఁడు దాహాతీవ్రతను సహింపలేక యజ్ఞకలశంబులోని మంత్రజలంబును ద్రావి డప్పిఁ జల్లార్చుకొనెను.

తెల్లవాఱినంతట ఋషులు యజ్ఞకార్యముఖులై కలశంబును జూడఁగా నందు నీరు కానరాకుండెను. వారదిచూచి 'ఈకలశంబునందుఁ బుంసువనజలంబు నించితిమి. ఆజలంబు నెవ్వఁడు ద్రావె? ననుచు దివ్యదృష్టిఁ జూచి సంగతి గ్రహించి దైవప్రేరితంబుఁ దప్పింపరా' దని భగవానునకుఁ బ్రణమిల్లిరి.

ఆసలిలపానఫలంబుగా యువనాశ్వునకు గర్భమయ్యెను; ప్రసవకాలము వచ్చెను. వానికుక్షిని జీల్చి పుత్త్రుఁ డొకఁడుదయించె.

రేడువఁ జొచ్చెను. ఋషు లాయేడ్పు విని 'అయ్యో! ఈబిడ్డకుఁ దల్లి గలుగదు. ఏమికుడిచి బ్రదుకునో' యని విచారపడసాగిరి. అంతలోన నింద్రుఁడు వచ్చి 'వత్సా! ఏడువవల'దని యూరార్చి 'మాంధాతా' యని తనతర్జనిని వానినోటఁ గుడువఁబెట్టెను. 'మాంధాతా' అనఁగా 'నన్నుఁ గుడుచు' నని యర్థము. ఆకారణంబున నయ్యిసువునకు మాంధాత యనుపేరిడిరి. యువనాశ్వునియుదరము దేవబ్రాహ్మణప్రసాదంబున యథాస్థితిఁ బడసెను. అతఁ డట్లు బ్రదికి కొంతకాలంబునకుఁ దపః ప్రభావంబున సిద్ధినొందెను.

## మాంధాత

రాజా! మాంధాత తర్వాత చక్రవర్తియై సప్తద్వీపాయవధాత్రీ తలంబు నేలుచు బహుయజ్ఞంబుల భగవంతు నారాధించెను. వానివిక్రమంబు రావణాదిదస్యులకుఁ ద్రాసంబుఁ గలిగించినకారణంబున వానికిఁ 'త్రసదస్యుఁడు' అనుబిరుదు నింద్రుఁ డిచ్చెను.

మాంధాత శశిబిందుసుతను బిందుమతిని బెండ్లాడెను. వారికిఁ బురుకుత్సుఁడు, అంబరీషుఁడు, ముచుకుందుఁ డనుపుత్రులు ముగ్గురును, ఏఁబండ్రు కూఁతులును జనించిరి. ముచుకుందుఁడు యోగి యయ్యెను.

## సౌభరిమహర్షి

ఆకాలంబున సౌభరి యనువిప్రుఁడు తపోవ్రతుఁడై కొండొకనాఁడు స్నానార్థము చని యమునానదిలో మునుఁగుచుండఁగా, మీనొకటి యాఁడుచేఁపతోఁగూడి సుఖించుట వానికంటఁబడెను. అది చూచినంతనే సౌభరికి నట్టి సుఖంబుపయిఁ గోరిక జనించెను. అతఁడు మాంధాతయొద్దకుఁబోయి కన్య నిమ్మని యాచించెను. ఆచక్రవర్తి వానిని విని 'మునీంద్రా! నాకు నేఁబండ్రుపుత్రికలు గలరు. నీవలచినదానిని స్వయంవరరూపంబున గ్రహింపు' మనెను. సౌభరి యామాట విని 'కటా! ముదిమి నన్నుఁ బైకొనెను. నరిసినతలతో వడఁకుదేహముతో నున్ననన్ను కొంతేనవగింతు రనుతలంపు మదినిడికొంచి యీరా జిట్లు

పలికెను. ఈకపటోపాయంబున నన్నితఁడు నోటఁజెప్పకయే నిరాకరించు చున్నాఁడు. కానిమ్ము చూతు' మని తలపోసి 'రాజా! నీ వన్నట్లే కానిమ్మనెను.

అంతటఁ బ్రతిహారి సౌభరినిఁ గన్యాంతఃపురంబునకు వెంటఁగొని పోయెను. ఆఋషి లోనికిఁ బోవుచు నవమన్మథసుందరాకారంబును దాల్చెను. ఆకన్యకలు వానిని జూచినంతనే 'ఇతఁడు నాకుఁ దగు'ననుచు నొండొరు నీసగించుచు వానియందే మనంబుల నిలిపి యెల్లరు వానిని వరించిరి. ఆమునివర్యుఁడు వారినెల్ల గ్రహించి తద్రాజగృహామందే వసించి రాజోపచారంబు లందుచు నక్కాంతామణులతోడ విహారజల క్రీడాదివివిధభోగంబు లనుభవించుచు వారితోడిదే లోకంబుగా నుండెను.

ఇట్లుండఁగా సౌభరికిఁ గొండొకనాఁడు వానితపోభంగకారణము తలంపునకు వచ్చి యతఁడు పరితాపమొంది 'కటా! మీనసంగమదర్శ నిమిత్తంబునఁ జిరకాలసమార్జితతపోవ్రతంబు చేటొందెను. మోక్షకాములకు నింద్రియనిగ్రహంబు ప్రథమకార్యంబనియు మనోవిక్షేపంబు గలుగకుండుటకై యేకాంతవాసమును నిరంతరహరిధ్యానంబును గర్తవ్యంబులనియుఁ, గాంతలతోడిప్రసంగముగూడఁ దగదనియుఁ బెద్దలు చెవినిల్లుగట్టి పల్కిరి. ఆమాటల సత్యత్వంబు నేఁడు గంటిని. మీనుల మైథునవృత్తి నాబుద్ధిని గలంచెను; ఏఁబదిజవరాండ్రతోఁ గామక్రీడా పరుఁడనైతి. వారికి నొక్కొక్కరికి నూర్గురేసికొడుకులు పుట్టిరి. అయిదు వేలమందికిఁ దండ్రి నైతిని. ఇవియన్నియు మాయాగుణవిలాసంబులగుఁ గాని యొక్కటియుఁ బురుషార్థప్రదము గాదు' అని లోలోనఁ బశ్చాత్తాప పడి విరక్తినొంది తపోవనంబునకుఁ బోయెను. ఆకాంతలు పతిదేవతలు గావున వానివెంటఁజనిరి. సౌభరి వానిపూర్వవ్రతంబు ననుష్ఠించి యాత్మ విదుఁడై యాత్మపరమాత్మైక్యము గావించెను. పతి యట్లు బ్రహ్మతాదాత్మ్యంబు నొందుట వానిపత్నులు చూచి వాని ననుగమించిరి.

### మాంధాతృవంశము

మాంధాతృపుత్రులలో నొకఁడైనయంబరీషుని వానిపితామహుఁడు యువనాశ్వుఁడు స్వపుత్రునిఁగా గ్రహించెను. అంబరీషునకు యౌవనాశ్వుఁడు, వానికి హారీతుఁడు జనించి మాంధాతృగోత్రప్రవర్తకులైరి. మాంధాతృపుత్రులలోఁ బురుకుత్సుఁ డనువానిని సర్పకుమారులు నాగలోకంబునకుఁ గొనిపోయి వానికిఁ దమచెల్లెలిని నర్మద యనుదానిని బెండ్లి చేసిరి. అతఁ డురగలోకంబునఁ బెక్కండ్రు గంధర్వులను వధించెను. అందులకు నాగకుమారులు మెచ్చి 'అయ్యా! నీకత విన్నవారికి సర్పభయం బుండ' దని వరం బిచ్చిరి.

### త్రిశంకుఁడు

రాజా! పురుకుత్సునకుఁ ద్రసదస్యుఁడు, వానికి అనరణ్యుఁడు, వానికి హర్యశ్వుఁడు, వానికి నరుణుఁడు, వానికిఁ ద్రిబంధనుఁడు, వానికి సత్యవ్రతుఁడును జనించిరి. ఆసత్యవ్రతుఁడే త్రిశంకుఁ డనఁబరఁగెను; ఆవివరము వినుము.

సత్యవ్రతునకు వసిష్ఠశాపంబునఁ జండాలత్వము గలిగెను. అతఁ డంతట విశ్వామిత్రు నాశ్రయించెను. ఆమునీంద్రుఁడు నిజతేజోమహిమంబున సత్యవ్రతునకు సశరీరస్వర్గం బిచ్చెను. అతఁడు స్వర్గంబునకుఁ జన్నంతనే సురలు వానినిఁ గ్రిందికిఁ ద్రోసిరి. అతఁడు స్వర్గంబునుండి తల క్రిందుగాఁ బడుచుఁ గుయ్యిడెను. కౌశికుఁడు స్వతపోబలంబున మింట నిలిపెను. అదిమొదలు నతఁడు మింట నేఁడు నగపడుచున్నాఁడు.

### హరిశ్చంద్రుఁడు

రాజా! త్రిశంకునకు హరిశ్చంద్రుఁడు జనించి రాజయి రాజసూయయాగం బొనర్చెను. విశ్వామిత్రుఁ డాయాగంబునకు వచ్చి దక్షిణావ్యాజంబున హరిశ్చంద్రుని సర్వస్వము హరించి యతనినోట బొంకింపవలయునని వానిని బడరానియిడుమలఁ గుడిపెను. వసిష్ఠుఁ డందులకు నెంతయుఁ గినిసి విశ్వామిత్రుని గ్రద్దవగుమని శపించెను. విశ్వా

మిత్రుఁడు కొంగ వగుమని వసిష్ఠునకు మాఱుశాపం బిచ్చెను. వా రట్లు హరిశ్చంద్రునినిమిత్తంబున నన్యోన్యశాపహతులై గద్దయుఁ గొంగ యు నై యొండొరుఁ బోరుచుఁ బెక్కేండ్లుండిరి.

## హరిశ్చంద్రుఁడు పుత్రార్థము వరుణునిఁ బ్రార్థించుట

హరిశ్చంద్రునకుఁ బుత్రులు గలుగరైరి. పుత్రార్థం బతఁడు నారదమహర్షి నాశ్రయించి వానివలన వరుణమంత్రంబును బడసి విధివిధానంబు నమ్మంత్రాధిదేవత నారాధించెను. వరుణుఁడు ప్రత్యక్షమయ్యెను. హరిశ్చంద్రుఁడు వానికిఁ బ్రణమిల్లి 'దేవా ! నాకుఁ బుత్రు ననుగ్రహింపుము. ఆసుతుని పశువుగాఁ జేసి నరమేధయాగంబున నిన్నుఁ బూజింతు' నని ప్రార్థించెను. వరుణుఁ డట్లే యనుగ్రహించెను. వానికి రోహితుఁ డనుకొడుకు పుట్టెను.

## వరుణుఁడు హరిశ్చంద్రుని నిగ్రహించుట

రాజా ! హరిశ్చంద్రునకుఁ బుత్రజననం బయినంతట వరుణుఁడు వచ్చి యాతేనిబాసను వానికి జ్ఞప్తిచేసెను. హరిశ్చంద్రుఁ డది విని 'దేవా ! జాతశౌచదినంబులు పదియు యజ్ఞయోగ్యంబులు గా' వనెను. వరుణుఁడు మఱలిపోయి పదిరోజులు నిదానించివచ్చి మఱల జ్ఞప్తిచేసెను. ఆనరేంద్రుఁడు వానిని విని 'అయ్యా ! పండ్లురానివాఁడు మేధ్యంబునకుఁ దగఁ' డనెను. వరుణుఁడు మఱలిపోయి కొంతకాలముతర్వాత వచ్చి మఱల తేనికి వానిమాట జ్ఞప్తిచేసెను. 'అయ్యా ! పాలపండ్లురాలినఁగాని బుడుతఁ డర్హుఁడు గాఁ' డనెను. హరిశ్చంద్రుఁ డట్లు పుత్రవాత్సల్యంబున నేదే నొకనెపంబు కల్పించి వరుణునకు సమాధానము చెప్పుచుండెను. వరుణుఁ డాసమాధానంబుల నంగీకరించుచుఁ గాలము వేచియుండెను.

## రోహితదేవేంద్రుల సమాగమములు

అంతలోన రోహితుఁడు కొంత పెద్దయై తండ్రితలంపు గ్రహించి యింటనుండుట ప్రాణోపద్రవకరంబని నిశ్చయించి శరచాపంబులు పట్టి కాననాంతరంబునకుఁ జనెను. వరుణుఁ డదివిని హరిశ్చంద్రుని నిగ్ర

హించెను. ఆతేనిని మహోదరవ్యాధి బాధింపసాగెను. ఆసంగతి రోహితుఁడు విని పురంబుదారి పట్టెను. మార్గమధ్యంబున నింద్రుఁడు వానికిఁ బ్రత్యక్షమై 'వత్సా! ఒక్కయేఁడు భూసంచారంబుఁ గావించుచుఁ బుణ్యతీర్థక్షేత్రంబులను సేవించి తర్వాతఁ బురికిఁ జనుము. అందాఁకఁ బోవల' దని చెప్పెను. పురోహితుఁ డట్లే యయ్యేఁడు గడపి యూరిదారిఁ ద్రొక్కెను. ఇంద్రుఁడు వృద్ధవిప్రవేషముతో వచ్చి యింకొకయేఁడు భూపర్యటనముఁ గావింపుమని చెప్పెను. అతఁ డట్లేచేసి మఱల నింటిదారిఁ బట్టెను. ఇంద్రుఁడు మఱల వానియొద్దకు వచ్చి యింకొకసంవత్సరము గడువుపెట్టెను. అట్లు పంచవర్షంబులు చనెను. ఇంద్రుఁడు మఱల మాఱువేషముతో వచ్చి మఱియొకయేఁడు గడువు పెట్టెను. రోహితుఁ డాయేఁడుగూడఁ గడపి నజీగర్తుని నడిమికొడుకును శునశ్శేఫుఁ డనువానిని పిలిచి వానిని వెంటఁగొని పురంబునకు వచ్చి నరమేధంబునకుఁగా శునశ్శేఫునిఁ దండ్రి కిచ్చెను.

### హరిశ్చంద్రుఁడు నరమేధయాగము చేయుట

రాజా! ఆతేఁడు శునశ్శేఫునిఁ బశువుగాఁ జేసి, విశ్వామిత్రుఁడు హోతగా, జమదగ్ని యధ్వర్యుఁడుగా, వసిష్ఠుఁడు బ్రహ్మగా, ఆ యాస్యుఁ డుద్గాతగా నేర్పఱచికొని నరమేధంబు గావించి వరుణునకుఁ బ్రీతిఁగూర్చెను. వాని మహోదరవ్యాధి నివృత్తమయ్యెను. ఇంద్రుఁడు హరిశ్చంద్రునకుఁ గనకరథం బిచ్చెను. రాజా! శునశ్శేఫునిమాహాత్మ్యంబును ముందుఁ దెలిపెదను.

### హరిశ్చంద్రుని నిర్యాణము

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునినిష్ఠకు మెచ్చి వానికి నాత్మజ్ఞానంబు ననుగ్రహించెను. ఆతేఁ డంతట మనస్తత్త్వంబును బృథ్వీతత్త్వమందు, దానిని జలతత్త్వమందు, దానిని తేజస్తత్వమందు, దానిని వాయుతత్త్వమందు, దాని నాకాశ తత్త్వమందు, దాని నహంకార తత్త్వమందు, దానిని మహత్తత్త్వమందుఁ గ్రమంబుగా లయింపి

దానియందు విషయాకారవృత్తిని నిస్తరించెను. తత్ఫలంబుగా వానికి విషయవర్జనంబు గలిగెను; దానితోడ జ్ఞానాంశము స్ఫురించెను. జ్ఞానోదయంబుతోడ సంసారకారణమైన ప్రకృతి భస్మమయ్యెను. తత్ఫలంబుగా నిర్వాణసుఖపారవశ్యం బొదవెను. అతఁడు పరగతి నొందెను.

### హారిశ్చంద్రవంశకథనము

రోహితునకుఁ జంపుఁ డనువాఁడు పుట్టెను. వానిపేరఁ జంపాపురి నిర్మింపఁబడెను. చంపునకు సుదేవుఁడును, వానికి విజయుఁడును, వానికి రురుకుండును, వానికి వృకుండును, వానికి బాహుకుఁడును జనించిరి.

బాహుకుఁడు రాజయి పెక్కుభార్యలను గ్రహించియు సంతానముఁబడయక తదేకచింతాపరుఁ డయ్యెను. శత్రురాజులు దాడి వచ్చి వానిరాజ్యంబు నాక్రమించిరి. బాహుకుఁ డంతట భార్యలతోడ వనగతుఁడై కొంతకాలం బందే యుండి ముసలియై చనిపోయెను. వాని పట్టపుదేవి సతీధర్మంబును దలపోసి పతి ననుగమింప నుద్యుక్తయయ్యెను. ఆసంగతి యౌర్వుఁ డనుముని విని వచ్చి 'అమ్మా! నీవు గర్భవతివి గావున నీకు సహగమనంబు ధర్మముగాదని బోధించి యామె తలంపు నుడిపెను.

### స గ రుఁ డు

ఆమె యట్లు గర్భవతి యగుట సవతులు విని తమగోత్రాలితనంబును దలపోసి యీసువహించి విషంబును నీటఁగలిపి యామెచేతఁ ద్రావించిరి. ఆవిషం బామెగర్భంబునకు నెట్టిచేటుఁ గలిగింపలేదయ్యెను. కొంతకాలంబునకు నెలలు నిండారి యామెకు మగశిశు వుదయించెను. ఆబిడ్డ గరము (విషము) తోడ జనించినకతన వానిని సగరుఁ డనిరి.

సగరుఁడు పెరిగి పెద్దయై రాజ్యమువహించి సుమతి, కేశిని యను పడఁతులఁ బెండ్లాడెను. సగరుని యున్నతికి నోర్వలేక శకయవన హైహయబర్బలతాలజంఘాదులు వైరులైరి. సగరుఁడు వారినెల్ల

నోడించి పట్టి బంధించి చంపనుండెను. వానిగురువు వచ్చి 'నాయనా! శత్రువులఁ జంపవల' దనిచెప్పి వానిని మఱలించెను. సగరుఁడు గురువాక్యంబును బాటించి వైరులను దలలుగొఱిగియు జుట్లుకోసియు మీసంబులు దీయించియు దిగంబరులుగాఁ జేసి తఱిమెను.

రాజా! సగరుఁడు వానిగురువైన యౌర్వునిబోధప్రకారము పెక్కు హయమేధయాగంబులుచేసి భగవాను నారాధించెను. సగరునకు సుమతియందు యఱువదివేవురును గేశినియందు అసమంజసుఁడును జనించిరి.

### సగరపుత్రులు దగ్ధు లగుట

రాజా! సగరుఁ డట్లు హయమేధంబులను జేయుట మహేంద్రుఁడు చూచి తనపదవికి వెసరుపెట్టునేమో యని తలంచి కొండొకయాగంబునందు మేధ్యాశ్వంబులు హరించి కొనిపోయెను. ఆగుఱ్ఱంబును వెదకి తెచ్చుటకై సగరుఁడు సుమతీపుత్రుల నాజ్ఞాపించెను. వారు వెడలి భూమండలంబెల్లఁ గలయవెదకి యెందును హయంబును గానక పాతాళంబును బరిశోధించుటకై భూమిని ద్రవ్వి లోనికిఁ జని యట నొకమునిని వానిచెంత యజ్ఞాశ్వంబును గాంచి 'ఇదిగో యజ్ఞాశ్వము. ఈదొంగ దీని నపహరించి తెచ్చి యేమియుఁ దెలియనట్లు కన్నులు మూసియున్నాఁడు. వీనిని జంపక తప్ప' దని నిశ్చయించి ఖడ్గంబులు పూని యొక్కుమ్మడి నమ్మునిని దాఁక నుంకించిరి. రాజా! అట్టిఁ దపోవ్రతుఁడై యుండిన మునీంద్రుఁడు కపిలమహర్షి గాని మఱియొకఁడు గాఁడు. ఆమహర్షి యంతలోనఁ గన్నువిచ్చెను. వాని వీక్షణాగ్నికి సగరపుత్రులు దగ్ధులై భూదిశసులైరని చెప్పుదురు.

రాజా! సగరపుత్రులు కపిలమహర్షి కోపాగ్నికి దగ్ధులైరని చెప్పుదురుగాని యామాట సత్యముగాదు. కపిలుఁడు పరమసత్వమూర్తియు లోకహితాత్ముఁడు నగు. అట్టివాఁ డెక్కడ? కోపకారణంబైన తమోగుణం బెక్కడ? ఎవ్వఁడు లోకోపకారతత్పరమతియై మనుష్యులు

మృత్యుసాగరంబును దరించుటకుఁగా సాంఖ్యవిద్య యనునావను నిర్మించి యిచ్చెనో యట్టిమహాత్మునకు క్రోధబుద్ధి జనింపఁగలదా? సగరపుత్రుల ప్రారబ్ధఫలం బట్లుండెను. ఫలోదయంబునకు నిమిత్తంబు గలుగక మానదు. కపిలుఁడు వారిచావునకు నిమిత్తమాత్రుఁడగు. ఆరహస్యంబు నెఱుంగక నిష్కారణనిందలు మూటగట్టుదురు.

## అసమంజసుఁడు

అసమంజసుఁ డనువాఁడు పూర్వజన్మంబున మహాయోగియైయుండి సంగమదోషంబున యోగభ్రష్టుఁడై తద్దోషఫలానుభవార్థము అసమంజసుఁ డనుపేర సగరునకుఁ గేశినియందు జనించెను. అతఁడు పుట్టినది మొదలు జ్ఞాతిశిశువులకుఁ గీడుసేయుచుఁ దోడిబాలురఁబట్టి సరయూజలంబులఁ ద్రోయుచుఁ జంపుచు నుండెను. వానియెడఁ బ్రజలకెల్ల నేవగింపు జనించెను. ఆసంగతి సగరుఁడు గ్రహించి యసమంజసుఁడు తాఁ గన్నపుత్రుఁడనిగూడఁ దలంపక వానిని రాజ్యంబునుండి వెడలిపోవ నాజ్ఞాపించెను.

అసమంజసునకుఁ బూర్వస్మృతి యుండెను గావున నతఁడు తండ్రి యాజ్ఞను విని తాను తత్పూర్వము నదిలోఁ దోసిచంపిన బాలకులనెల్ల నిజయోగప్రభావంబున బ్రదికించి వారివారి తలిదండ్రులకు నప్పగించెను. ఆసంగతి క్షణములో దేశమెల్లఁ బ్రాఁకెను. వానిప్రభావంబునకు నయోధ్యావాసులెల్లరు నాశ్చర్యపడిరి. అసమంజసుఁ డట్లుచేసియుఁ దండ్రియాజ్ఞను బాలించుటకై దేశంబును వదలిపోయెను. సగరుఁ డందులకు నెంతయుఁ బశ్చాత్తాపతప్తుఁ డయ్యెను.

## అంశుమంతుఁడు యాగాశ్వంబును దెచ్చుట

రాజా! అసమంజసునకు నంశుమంతుఁ డనుపుత్రుఁ డుండెను. అతఁడు తనతాతకుఁ బ్రీతిఁగూర్చువాఁడై యజ్ఞాశ్వంబును వెదకఁ దరలి తన పినతండ్రులు త్రవ్విన మహాఖాతంబును జొచ్చి పాతాళంబునకుఁ జని యట భస్మరాసులను వానిచెంత నశ్వంబును గపిలమహర్షిని జూచి

యమ్మునీంద్రునకు సాష్టాంగ ప్రణామంబు గావించి 'మహాత్మా! బ్రహ్మదేవు డంతటివాఁడు సమాధిదృష్టితోనేనియు భవత్ప్రభావంబును గ్రహింప నేరఁడు. కేవల స్వమనోబుద్ధిగుణాశ్రయులై యజ్ఞానులై వర్తించు మాసంగతి చెప్పవలయునా? దేవా! నీవు సర్వదా యంతర్వర్తివై దేహులయం దుందువు. నీమాయకుఁ జిక్కి గుణప్రధానులై దేహులు వారిలోనే యున్ననిన్నుఁ గానరు. నిన్నుఁ గానకుండుటకు భేదమోహం బులే కారణము. వానికి నీమాయాగుణమే కారణము. ఎవరు నీ మాయను నిరసింతురో వారికి నీవు ప్రత్యక్షుండ వగుదువు. నీ మాయను నిరసించుటకు స్వభావబలంబుదక్క వేఱొండుమార్గంబు గలు గదు. అది గలుగుటకు నిన్నే యాశ్రయింపవలయును. సనకాదులెల్లరు నిందులకు నిదర్శకు లగుదురు.

దేవా! లోకోద్ధరణార్థము జ్ఞానంబు నుపదేశించుటకై దేహం బును ధరించితివి. నీమాయ యనఁగా నీశక్తియేగాని వేఱుగాదు. నీశక్తికార్యం బేమియందువా? అది చిత్రవిచిత్రరూపంబుల వ్యవ హరించును. ఆచిత్రంబులఁ జూచి తద్వశులై స్వరుచులప్రకారము వానియెడ రాగద్వేషంబులఁ జూపుదురు. తత్ఫలంబుగా నీర్ష్యామోహం బులు జనించి చిత్తవిభ్రాంతిని బుట్టించుచున్నవి. అభ్రాంతికార్యం బేమందువా? ఏవి వాస్తవముగా నిత్యంబులొండె సుఖదాయకంబు లొండెఁ గావో యట్టిగృహాదులయందు వస్తుబుద్ధిని జనింపఁజేసి వానిం బట్టి ప్రాఁకులాడున ట్లొనర్చును. కటికచీఁకటిలో దడవులాడువాఁడు తాను వెదకుపదార్థంబు నెట్లు గానలేక తిరుగాఁడునో యాగతి భ్రాంత చిత్తులకుఁ బ్రాప్తమై యెన్నఁడు వారు దరిగానక పరితపింతురు.

దేవా! నాపూర్వపుణ్యఫలంబున నేఁడు నీదర్శనభాగ్యంబు నోచితి. నన్ను బంధించియున్న మోహపాశంబు సడలి నశించెను. ధన్యుఁడ నైతి. ఇదే నీకుఁ బునఃపునస్సాష్టాంగంబు' లని సాగిలఁబడెను.

రాజా! కపిలుఁడు వాని ననుగ్రహించి 'వత్సా! నీపితామహుని యజ్ఞాశ్వం బిదిగో కొనిపొమ్ము. ఇదిగో నీతండ్రుల భస్మరాసులు. గంగోదకంబునఁ దక్క వేఱొంట దీనికిఁ బావనత్వము గలుగదు' అని చెప్పెను. అంశుమంతుఁ డంతటఁ గపిలునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లొనర్చి తదనుజ్ఞాతుఁడై యజ్ఞాశ్వంబును గొనివచ్చి తాతకు నిచ్చెను. సగరుఁడు యజ్ఞంబును బూర్తిచేసి రాజ్యభారంబు నంశుమంతునందుంచి సర్వబంధంబులను విడనాడి గురూపదిష్టమార్గంబున నిష్ఠుఁడై యుత్తమగతిఁ బడసెను. అంశుమంతుఁ డంతటఁ గపిలవాక్యంబును స్మరించి గంగాజలంబును భూమికిఁ దెచ్చుటకై మహానిష్ఠతోఁ బెద్దకాలంబు తపంబుచేసి యభీష్టఫలంబును బడయకయే కాలధర్మంబు నొందెను.

### భగీరథుఁడు - గంగావతరణము

అంశుమంతునకు భగీరథుఁడు జనించి తండ్రిసంకల్పంబును నెఱవేర్చువాఁడై గంగనుగూర్చి ధ్యానించుచుఁ బెక్కేండ్లు తీవ్రతపంబు చేసెను. గంగాదేవి వానికిఁ బ్రత్యక్షయై,—

'మ. వినువీథిం బఱతెంచి నేలఁబడ నావేగంబునుం్ నిల్పనో
పినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళముం
జనుదుం్ వచ్చితినేని నాజలములం్ సంస్నాతులై మానవుల్
ననుఁ బొందించునఘవ్రజం బెచట నేనాశంబు నొందించెదన్?'

అని చెప్పెను. భగీరథుఁ డావచనంబులు విని—

'మ. తనలో నిన్నిజగంబులుం గలుగుటం్ దా నిన్నిటం గల్గుటం్
జననీ! తంతువులందుఁ జీరగలయాచందంబునం్ విశ్వభా
తనుఁడై యొప్పు శివుండగాక మఱి నీవారి న్నివారింప నే
ర్చినవా రెవ్వరు? నిం్ధరించుకొఱకై శ్రీకంఠునిం్ గొల్చెదన్.

మ. పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తమఃపారీణు లాస్యుల్ ఘనుల్
పురుషశ్రేష్ఠులువచ్చి తల్లి! భవదంభోగాహముల్ సేయఁగా

నరసంఘాఘము నిన్నుఁ బొందునె? జగన్నాథుండు నానాఘసం
హరుఁ డావిష్ణుఁడు వారిచిత్తములఁ దానై యుంట మందాకినీ!'

యని విన్నవించెను. ఆదేవి వానికి నియ్యకొని యంతర్ధానయయ్యెను. అంతట భగీరథుఁడు శశిశేఖరుం గూర్చి తపంబు సేయసాగెను. గౌరీనాథుఁడు వానికి నల్పకాలంబుననే ప్రసన్నుఁడై వానికోర్కెకు సమ్మతించెను. గంగాదేవి నదీరూపంబుఁ దాల్చి పుడమికిఁ దిగెను. భగీరథుఁడు వాయువేగంబైన రథంబు నెక్కి గంగకు ముందుఁ జనుచుఁ దత్ప్రవాహంబును దనపితృవ్యులబూదిరాసులమీఁదుగాఁ గొనివచ్చెను. గంగాతోయస్పర్శమాత్రంబున నయ్యఱువదివేవురును స్వర్గంబునకుఁ బోయిరి. రాజా!

మ. హరు మెప్పించి మహాతపోనియతుఁడై యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి నితాంతకీర్తిలతికాస్తంభంబుగా నవ్యసు
స్థిరలీలం బితృకృత్యమంతయు నొనర్చెన్ వారితానేకదు
స్తరవంశవ్యథుఁ డాభగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే?

భ గీ ర థ సం త తి

భగీరథునకు శ్రుతుఁడు, వానికి సత్యనాభుఁడు, వానికి సింధుద్వీపుఁడు, వానికి అయుతాయువు, వానికి ఋతుపర్ణుఁడు జనించిరి. ఋతుపర్ణుఁడు నలమహారాజునకు నక్షవిద్య నొసఁగి వానివలన నశ్వవిద్యఁ గఱచెను. ఋతుపర్ణునకు సుదాసుఁడు వానికి మిత్రసహుఁడు జనించెను. మిత్రసహుఁడు మదయంతిని వివాహమయ్యెను. వానికి వసిష్ఠశాపఫలంబుగాఁ గల్మాషపాదత్వంబును, స్వకీయమైన యకృత్యఫలంబుగా ననపత్యదోషంబును గలిగెను.

సౌ దా స చ రి త్ర ము

రాజా! మిత్రసహుఁడు సుదాసుని పుత్త్రుఁడగుటం జేసి వానికి సౌదాసుఁ డనుపేరు ప్రసిద్ధియయ్యెను. సౌదాసుఁడు కొండొకనాఁడు వేటకుఁబోయి యొకరాక్షసుని జంపెను. ఆయసురుఁడు 'తమ్ముఁడా!'

యని యఱచుచుఁ జచ్చెను. ఆయఱపుతోడ నొకరాక్షసుఁడువచ్చి చచ్చి పడియున్న వానియన్నను జూచి వగచి 'ఈతేని వంచించి నాపగఁ దీర్చి కొందుఁగాక' యని వెడలిపోయి మాఱువేసము దాల్చి యారాజునకు వంటలవాఁ డయ్యెను.

సౌదాసుఁడు శాపహతుఁ డగుట

ఒకనాఁడు వసిష్ఠమహర్షి సౌదాసునకు నతిథి యయ్యెను. మనుష్య మాంసము వండి వానికిఁ గుడువఁబెట్టిరి. వసిష్ఠుఁడు పరివేషావసరంబునఁ దత్కపటకృత్యము గ్రహించి 'ఓరీ! నరమాంసంబును నాకుఁ బెట్టితివి గావున నరాశనుఁ డగురాక్షసుండ వగు' మని యాతేనిని శపించి వెనువెం టనే తనదివ్యజ్ఞానంబునఁ గలరూపు గ్రహించి 'రాజా! ఇది నీతప్పుగాదు. నీవంటవానిరూపంబున మాఱువేషంబుతో నున్న రాక్షసుఁ డిట్లుచేసెను. అయినను నాశాపంబు తప్పదు. పదురెండుసంవత్సరంబులుమాత్రము నీవు రాక్షసరూపంబున నుందు' వనెను. సౌదాసుఁడు ప్రతిశాపం బిచ్చుటకై జలంబు గ్రహించెను. అంతలోన వానిభార్య మదయంతి యడ్డుపడి వారించెను. అతఁడు మాఱాడక యాశాపోదకంబును జాఱవిడిచెను. ఆనీరు వానిపాదంబులపయిఁబడెను. ఆజలంబులవేడిమికి వానిపాదంబులు కల్మాషంబు లయ్యెను. ఆకారణంబున వానినిఁ గల్మాషపాదుఁ డనిరి.

కల్మాషపాదుఁడు మునిశాపవశంబున రాక్షసభావంబునొంది వనం బులు గ్రుమ్మరుచుఁ గొండొకనాఁడు క్షుధార్తుండై తినుటకు నేమియుఁ గానక నలువలంకులు చూచుచుండఁగా నొకచోట మిథునీభూతులై యున్న తాపసదంపతులు వానికంటఁబడిరి. ఆరాక్షసుఁడు క్షుద్బాధంజేసి గంతువైచి యాతపస్విని బట్టి మ్రింగఁబోయెను. మునిపత్ని యడ్డుపడి 'అయ్యా!నీవు సాక్షాదిక్ష్వాకువంశజుండవును మదయంతీభర్తవు నగుదువు. కారణాంతరంబున నీ కిట్టిరాక్షసత్వము సంప్రాప్తమయ్యెను. అధర్మంబు నీకుఁ దగదు. నేను పుత్త్రభాగ్యంబుఁ గోరితిని; పతి నిమ్ము. మానుష దేహంబు సర్వార్థసంపాదనంబునకు మూలంబు. ఈమునిని వధించుట

సర్వార్థంబులను జంపుకొనుటగు. మఱియు నీవు వధింపనున్నవాఁడు బ్రాహ్మణుఁ డగుటయేగాక విద్వాంసుఁడును దపశ్శీలగుణోన్నతుఁడును సర్వభూతాత్మభావనుఁడును మీఁదుమిక్కిలి నిఖలభూతాంతర్యామియైన పరమపూరుషునకు మహాభక్తుఁడు నగు. అట్టి బ్రహ్మర్షిని రాజర్షివైన నీవు చంపుట తండ్రిని బుత్త్రుఁడు చంపుటగు. ఎట్టిపాపంబు నెఱుంగని శ్రోత్రియుని బ్రహ్మవాదిని జంపుట గోవును జంపుటగాదే ? ఈసాహసంబు వలదు. నామాట వినుము. అట్లు సేయనొల్లవేని ముందుగా నన్ను భక్షింపుము. పతివియోగంబు నిమేషమాత్రంబేనియు నోర్వఁజాల. పతిచన్నచో నిట్టనిలువున నేను శవంబ నగుదు’ నని దీనాతిదీనంబుగాఁ బలుకుచు వాపోవసాఁగెను. శాపవశంబునం జేసి యాదీనాలాపంబులు వానిచెవిఁ జొరవయ్యెను. అతఁ డొండుతలంపక బెబ్బులిపసరంబునుబోలె నమ్మునిని గబళించెను. ఆసాధ్వి వానిఘోరకృత్యంబును జూచి ‘అయ్యా! కామార్తనైననాకు గర్భాధానము చేయనున్న పతి నెడచేసితివి గావున నీకు మిథునధర్మంబు మృత్యువగుఁగాక!’ యని శపించి పతితోడ సహగమన యయ్యెను.

రాజా! సౌదాసునకుఁ బదురెండ్లేండ్లశాపకాలము గడచెను. అతఁ డంతట శాపవిముక్తుఁడై యిల్లుచేరి యొకనాఁడు నిజపత్నితోఁ గూడఁదలంచెను. మదయంతి భర్తృశాపంబు నెఱుంగుఁ గావునఁ దద్విషయంబును వానికి జ్ఞప్తిపఱచి వానిమనంబు సేయదయ్యెను. అది సుత సౌదాసుఁడు స్త్రీసుఖంబును వదలెను.

మదయంతి యంతట భర్తకు ననపత్యదోషంబుఁ బాప నెంచి పతియనుమతిం బడసి వసిష్ఠునివలన గర్భము దాల్చెను. ఆగర్భము ద్వాదశవర్షపర్యంతము ప్రసవముఖంబు గాకుండెను. అందులకు మదయంతి విసివి కొండొకనాఁడు తనగర్భంబును ఱాతితోఁ బొడిచెను. అందుండి సుతుఁ డొకఁ డుదయించెను. ఱాతిప్రేటున జనించుటం జేసి వానికి అశ్మకుం డనుపేరిడిరి. అతఁడు సౌదాసవంశకరుఁ డయ్యెను.

### అశ్మకునకు నామాంతరంబులు గలుగుట

రాజా! ఆకాలంబునఁ బరశురాముఁడు క్షత్రియక్షయవ్రతంబును బూని రాచబిడ్డ లెందున్నను వెదకి వెదకి చంపుచుండెను. పరశురాముని బారినుండి యాశిశువును స్త్రీలు కాపాడిరి. ఆకారణంబున నశ్మకుని నారీకవచుం డనిరి. మఱియు క్షత్రవంశం బట్లు పరశురామనిర్మూలితంబైనను నారీకవచుఁ డావంశంబునకు మూలంబయ్యెను. ఆ కారణంబున వానికి మూలకుం డనుపేరుగూడ గలిగెను. వానికి విశ్వసహుఁడు, వానికి ఖట్వాంగుఁడు జనించెను.

### ఖట్వాంగచరిత్ర

పరీక్షిన్నరేంద్రా! ఖట్వాంగుఁడు చక్రవర్తియై రాజ్యంబు పాలించుచుండఁగా దేవాసురులకు మఱల యుద్ధంబు పొసఁగెను. అమరులు ఖట్వాంగునిని సాహాయ్యంబుఁ గోరిరి. అతఁడు నిర్జరులకుఁ దోడ్పడి దుర్జయులైన దైత్యులను వధించెను. దేవతలు వానిబలపరాక్రమంబునకు మెచ్చి వానిని వరంబుఁ గోరుమనిరి. నాయాయుష్కాలం బిఁక నెంతయో తెల్పుమని యడిగెను. ఇఁక నొక్కముహూర్తమాత్రము గలదని చెప్పిరి.

### ఖట్వాంగుఁడు బ్రహ్మతాదాత్మ్యంబు నొందుట

ఖట్వాంగుఁ డామాటతోడ మఱలి వానిపురము చేరి 'బాల్యంబునుండి నాబుద్ధి యెన్నఁడు నైచ్యంబుఁ దలంపదు. నాకు రాజ్యాది సంపదలకంటె భార్యాపుత్రాదులకంటె బ్రాహ్మణకులంబు ప్రీతికరంబగు. ఆపరమేశ్వరునకన్న నేను భిన్నవస్తువును గాననెడినిశ్చయంబుతో నిరంతరము నప్పరమాత్మునందు మది నిల్పియుందు. త్రిభువనేశ్వరు లెన్నో వరంబు లిత్తుమనిరి. వానినెల్ల వలదంటిని. స్వర్గపతులుగూడ విషయమోహాంధులై వారిలోనే యున్నయాత్ముని గాననైరి. సామాన్యులసంగతి చెప్పనేల? భగవంతునిశక్తి జ్ఞానేచ్ఛాక్రియా ముప్పిరిత్రాడువలె నుండు. వానిలో జ్ఞానశక్తి స్వతఃప్రకా

బును నిత్యము నిరంతరమునగు. జ్ఞానశక్తి ననుసరించి యిచ్ఛాశక్తియు, దాని ననుసరించి క్రియాశక్తియు వర్తించుచుండు. ఇచ్ఛాశక్తి వలసిన సన్నిధానంబులను సంతరించును. క్రియాశక్తి వానికి రూపంబులఁ గూర్చు. ఎప్పుడు జ్ఞానదృష్టి విముఖంబగునో యిచ్ఛాశక్తి స్తంభించును. దానితోడఁ గ్రియాశక్తి వ్యవహారం బుడిగి మిన్నకుండు; వెనువెంటనే కల్పనంబులెల్ల మాయమగు. ఈశక్తి యిట్టిదని నిర్వచింప సాధ్యము గానందున దీనికిఁ మాయ యను పేరిడిరి. ఈమాయాశక్తిరచితంబు లెల్ల గంధర్వనగరంబులు. అట్టివి నిత్యంబులని భావించి వానితోడిదే లోకంబుగా నుండుట జీవితకాలంబును రిత్తపుచ్చుటగాని వేఱుగాదు. పరమేశ్వరుఁడు నాభ్రాంతులనెల్ల నుడిపి నాకు వానిదివ్యపదంబు ననుగ్రహించుఁగాక' యని శ్రీమన్నారాయణైకనిష్ఠుఁ డయ్యెను. రాజా! ఆనిష్ఠాఫలంబుగా ఖట్వాంగుని యజ్ఞానలవంబులుగూడఁ గ్రమక్రమంబుగా వలసపోయెను.

మ. కలనేఁ సంగములెల్లఁ బాసి నియతిఁ ఖట్వాంగుఁ డశ్రాంతమై
కలదయ్యుఁ మఱి మీఁద లేదనెడి దై కళ్యాణమై యాత్మలోఁ
దలఁపం బల్కఁగరానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁ డని సంస్థాపించు నాబ్రహ్మమున్.

## ఖట్వాంగుని వంశక్రమము

రాజా! ఖట్వాంగునకు దీర్ఘబాహుఁడు, వానికి రఘువు, వానికిఁ బృథుశ్రవుఁడు, వానికి నజుఁడు, వానికి దశరథుఁడు జనించిరి.

## శ్రీ రామాదుల జననము

పరీక్షిన్నరేంద్రా! ఆకాలంబున దేవతలు రావణాసురునివలనఁ బొక్కు బాధలకు లోనై దిక్కుగానక భగవానుని బ్రార్థించిరి. సర్వేశ్వరుఁడు వారి మొఱ విని స్వమహిమాంశాంశంబును నాల్గుగా విభజించి శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులను పేర దశరథునకు జన్మించెను. శ్రీరాము

చరితము మునిజనగీతమై ముల్లోకంబులం బ్రాకియున్నది. తచ్చరిత్ర శ్రవణంబున నీచీనులుగూడం బవిత్రంబులై యుండు. రామమహిమ నేమని చెప్పుదు.

## శ్రీ రా మ చ రి త్ర ము

రామా ! నీచర్యలు వింతవింతలగు. విశ్వామిత్రుండు మఖరక్షణార్థము నిన్నుం గోరంగాం దండ్రిపంపును దలందాల్చి కూకటిముడికిం గురులుకూడని పసితనంబునుగూడం దలంపక తమ్ముని లక్ష్మణుని వెంటంగొని చని మారీచాదులను మట్టుపెట్టి యాఋషీంద్రునకు మెప్పుంగూర్చి వానివలన వివిధాస్త్రంబులను బడసితివి. అట సీతాస్వయంవరవార్త చెవి సోంకినంతనే తన్మహోత్సవవిలోకనోత్సుకుండవై విశ్వామిత్రఋషివర్యుండును దమ్ముండును వెంటరా మిథిలానగరమార్గంబు మెట్టి దారిలో నహల్యను శాపవశంబున శిలాప్రాయమైయున్నదానిని బాదస్పర్శమాత్రంబున నుద్ధరించి యప్పుణ్యవతి గావించిన కృతజ్ఞతాపూర్వకస్తుతి నంది జనకరాజునగరంబుం జొచ్చితివి. అట స్వయంవరశాలకు మున్నూఱుగురు మహాబలశాలురు మోయలేక మోచితెచ్చిన శివశరాసనంబును సభాస్తారులైన వీరాదివీరులు చూచి మోపెట్టంజాలక యొండొరుమోములు చూచికొనుచు నల్లనల్లన వచ్చుటంజూచి, నీవు చని కలంభంబు చెఱకుగడంబోలె నవ్వింటినెత్తి మోపెట్టి లాగి పెల్లున విఱిచి, యందలి రాకుమారులకుం దలవంపు గావించి, నీపేరురంబు కాపురంబునకు గర్వించిన శ్రీదేవిని గెలిసేయుటకుంగాం బుట్టెనో యన రూపవయోవిలాసంబుల నొప్పుచున్న సీతాదేవిని బాణిగ్రహణంబు గావించితివి.

రామా ! నీచరిత్రం బేమని చెప్పుదు. భూపుత్రి నట్లు పెండ్లాడి భార్యను వెంటంగొని తమ్మునితోడ నయోధ్యాపథంబు మెట్టి, మార్గమధ్యంబున నెదురైన భార్గవరాముని క్షత్రబీజంబు నిలువదియొక్కమాఱు వెదకివెదకి నిర్మూలించినవానిని క్షణములో దర్పహీనుని జేసి మహావైభవంబుతోం బురప్రవేశంబు గావించితివి. రామా ! సీతండ్రి

దశరథుఁడు స్త్రీవశుఁడై చేసిన బాసను నిల్పుటకై చేతిలోని రాజ్య లక్ష్మిని నువ్వెత్తుగాఁ ద్యజించి తల్లియు బంధుజనాదులును దల్లడిల్లు నుల్లంబులతో నెంతబతిమాలినను వినక సీతాలక్ష్మణులతోడఁ బురి వెడలి ఘోరారణ్యంబుఁ జొచ్చితివి. రామా! నీ పితృభక్తిని నీ సత్య వ్రతప్రతిజ్ఞను నీ నిస్సంగత్వంబు నేమని చెప్పుదు!

రామా! ఆ కాంతారంబున శూర్పణఖ యనురక్కసి నీకు మరులు గొల్పరాఁగా దాని ముక్కు చెవులు గోసి బుద్ధిచెప్పి నీ యేకైకపత్నీ వ్రతంబును జాటితివి. ఆరక్కసికై దానిబాంధవులు ఖరదూషణత్రిశిరః ప్రముఖులు నీపయి నక్కసపడి యుక్కుమీఱి పదునాల్గువేలరాక్షస బలంబుతో వచ్చి యొక్కుమ్మడి నిన్నుఁ దార్కొనఁగా నీ వాక్కండవ వారిలో నొక్కొక్కనికి నొక్కొక్కరాముఁడవై యెల్లర రూపుమాపి తివి. రామా! ఈ నీమాహాత్మ్యంబు నేమని యుగ్గడింతు!

రామా! సౌధాంతరంబులందుండి యెండకన్నెఱుంగక వివిధ భోగంబులఁ జూఱగొనుచున్న నీశరీరంబునేగాక శిరీషకోమలయైన సీతాతనూలతికనుగూడ ముండ్లపొదరిండ్లపాలుచేసి విచ్చుకత్తులఁబోని కఱకురాలమీఁద నడిపించి నిష్పచ్ఛరంబులఁ గృశింపఁజేసి దేహానిరభిమాన త్వంబును బ్రకటించి వనవాసులైనమునులకు సయితము పాఠము నేర్పి తివి. రామా! నీవ్రతనిష్ఠ నేమని శ్లాఘింతు!

రామా! లంకేశ్వరుఁడు రావణుఁడు చెల్లెలియైన శూర్పణఖకుఁ బ్రియంబుఁ గూర్చుటకును దన్నిమిత్తంబునఁ దనవలపుఁ దీర్చికొనుటకును సంకల్పించి పాపమతియై పతివ్రతారత్నంబును నీయర్ధాంగి నపహరింపఁ దెంపుసేసి యుపాయంబుఁ బన్ని మారీచుని మాయామృగంబుఁ గావించి పంపి య్యాలేడినిమిత్తంబున నీకును నీసతికి నెడబాటు గలిగించి, నీబాణ హతుఁడు మాయామృగమారీచుఁడు కుయ్యిడ నీకై సీతమ్మఁడు పఱ చిన నీసతి లోకమాత యొంటరిగానున్నదానిని హరింపఁగా నీవు తిరిగి వచ్చి ప్రాణేశ్వరి యట లేమికై నీయొనర్చిన శోకవిలాపంబులు నేఁడు

నట మాఱుమ్రోయుచున్నవి సుమా. రామా! ఇదియెల్ల స్త్రీసంగుల గతిని బ్రకటించుటగాక నిస్సంగునకు నీకు సంగదోషము గలదా?

రామా! మాయామారీచమృగంబును వేటాడుటకై నీవు, నీకై నీతమ్ముఁడు లక్ష్మణుఁడును జనఁగా నీసతి సీతాదేవి యేకైకగా నాశ్రమంబులలో నుండుటయ్యెను. అది సందుగా రావణుఁ డామె నెత్తికొని పోసాగెను. జటాయు వయ్యకార్యంబు నోర్వలేక రాక్షసేశ్వరు నెదిరించి పోరాడి ఱెక్కలు తెగిపడెను. నీవు మాయామృగంబును జంపి యాశ్రమంబునకు వచ్చి భార్యను గానక పరితపింపసాగితివి. అత్తఱి జటాయువు సీతాహరణవృత్తాంతమును నీకుఁ దెలిపి ప్రాణంబులు విడిచెను. ఆపక్షీంద్రుఁడు నీకు సంగతి తెలుపుట మహోపకారకృత్యంబని భావించి వానికి బంధుకృత్యంబు గావించితివి. రామా! నీధర్మపరత్వంబును నీకృతజ్ఞతాబుద్ధియు శ్లాఘింపఁ దరమా!

రామా! సీతాన్వేషణపరుఁడవై తరలితివి. దారిలోఁ గబంధుఁడు నీకు నడ్డుపడెను. వానిని వధించి యుత్తమగతికిఁ బంపితివి. వైరికిఁగూడ నుత్తమగతి నిచ్చుటకన్న వింతగలదా? నీవు రాగద్వేషాతీతుఁడ వనుటకు వేఱుతార్కాణంబు లేల? రామా! కోఁతులతోఁ జెలిమిచేసి వానివలన సీతావృత్తాంతంబు నెఱింగితివి. ఉపాధిభేదంబును బట్టి యాత్మభేదంబు నూహింపరాదని స్వవర్తనపూర్వకంబుగా లోకప్రచారంబు సేయుటకై యట్లుచేసితివిగాని సర్వాధ్యక్షునకు నీకుఁ బరసాహాయ్యంబు వలయునా? రామా! సురలు ప్రార్థింపఁగా వారికై నీ వవతరించుచు దేవతలను వారివారియంశంబుల వానరులుగా జనింప నాజ్ఞాపించితివి. దేవేంద్రాంశమున వాలి వానరుఁడై జనించెను. అట్లు జనించియు నతఁడు సురవైరియైన రావణాసురునితో మైత్రియొనర్చెను. అతఁడు ధర్మంబు నుల్లంఘించి తమ్మునిభార్యను జేపట్టెను. వానిని సంహరించి దుష్టశిక్షణశిష్టరక్షణార్థమై నీ వవతరించుట చాటితివి. రామా! కపిసైన్యంబును గూర్చితివి; కోఁతియైనహనుమంతునిచేత సముద్ర

లంఘనంబుఁ జేయించితివి; లంకపయి దాడి వెడలితివి; సముద్రుఁడు మహోత్తుంగకల్లోలాభీలుఁడై దారి యియ్యమికిఁ గనలి కోపవీక్షణ మాత్రంబున వాని డంబు నడంచితివి; సేతువును బంధించితివి. ఈ కార్యంబు లొక్కొక్కటియందుఁ గలభావంబు నూహింప బ్రహ్మకునైనఁ దరమా ? రామా ! విభీషణుఁడు వానియన్నయైన రావణునిచేతకు ఖిన్నుఁడై యతనికి హితంబు పలికెను. రాక్షసేశ్వరుఁడు తమ్మునిని వైరికోటిలోనివానినిగా భావించి వానిని వెడలించెను. అతఁడు దిక్కు గానక నీపాదంబుల వ్రాలవచ్చెను. వానరులు వలదని యడ్డుపడిరి. ఎవరిమాటను వినక నీవు విభీషణునకు శరణిచ్చుటయేగాక 'రావణుఁడు వచ్చి శరణిల్లినను గాపాడుదు' నంటివి. అహో ! నీదయార్ద్రధర్మబుద్ధి నేమని వర్ణింపనేర్తు ? రామా ! వానరభటులు చెలరేఁగి లంకాపురంబును నేలపాలు చేయుట చూచుచుంటివి. రాక్షసవీరులు కుంభనికుంభ ధూమ్రాక్షదుర్ముఖదేవాంతకనరాంతకాదులు యుద్ధార్థులై విజృంభించి నీపయికిరాఁగా వారినెల్లఁ గోఁతిబంట్లచేతనే చంపించి యహంకారోద్ధతి గఱికిపోసకుఁగూడఁ జాలదని వెల్లడించితివి. రాక్షసులపాటుఁ గాంచి కుంభకర్ణాదు లెత్తివచ్చిరి. వారినెల్ల లక్ష్మణసుగ్రీవాంజనేయగంధమాదన నీలాంగదజాంబవత్పనసాదులకు నప్పగించి మట్టుపెట్టి కుంభకర్ణునిమాత్రము నీవు కూల్చితివి. అట్లుసేయుట వాని శాపవిమోక్షణార్థమే గదా.

రామా ! ఎట్టకేలకు రావణుఁడు పుష్పకవిమానారూఢుఁడై యుద్ధంబునకు వచ్చెను. నీవు మాతలి తెచ్చిన యింద్రరథం బెక్కి లంకాధిపతి నెదిరించి 'దురాత్మా ! నేను లేనితఱి వచ్చి తోడునీడలేని స్త్రీని హరించితివి. ఇది కుక్కసేత గదా ? ఇందులకు సిగ్గు గలుగదా ?' యన్ని వానియకార్యంబును దెలిపి ప్రబోధగర్భంబుగాఁ బలికితివి. దీని భావమేమి? మహాపాపాత్ముఁడైనను దనదప్పు నంగీకరించి శరణన్నచో రక్షింతుననెడి నీలోకరక్షైకవ్రతంబును జాటుటగాదా? ఆకాశ

నీహితోపదేశంబును గ్రహింపఁడయ్యెను. అంతట వానినిజూచి 'దుష్టా! కర్మఫలంబు ననుభవింపక తీఱ'దని చెప్పి వానిపయి నొక్కకోల వైచితివి. దశకంఠుఁడు పదిమోములనెత్తురుగ్రక్కి పుణ్యభోగాంతంబున దివినుండి పడుజీవుఁడుపోలె నతఁడు విమానంబునుండి నేల రాలెను. రామా! నీకాలజ్ఞతను నీశౌర్యంబును నీశరణాగతవాత్సల్యత్వంబును నీప్రతాపంబును వేయితలలపన్నగేంద్రుఁడుగూడ వివరింపఁజాలఁడుగదా!

రామా! రావణాదులు చన్నంతట మందోదరిప్రముఖరాక్షసస్త్రీలు రణరంగంబునకు వచ్చి యందుఁ జచ్చిపడియున్న వారివారిప్రియుల కళేబరంబులను గవుంగిళ్లఁగ్రుచ్చి 'అయ్యో! రావణా! మామాట వినవైతివి; ఒక్కని కామవివశత్వంబు మాకు నెల్లరకు వైధవ్యంబును మూటగట్టెఁగదా. అంతియగాదు. నీవు నిహపరదూరుఁడవైతివి. ఇఁక మాకు దిక్కెవ్వరు? ఈలంక నెవ్వరిపాలు చేసితివి?' యని విలపింపఁగా వారికి నోదార్పులు చెప్పించి హతులైనవారికి విభీషణాదుల వలనఁ బరలోకక్రియలు చేయించితివి. రామా! వైరితోడిదే పగయను మాటను బాటించిన నీధర్మబుద్ధికి నమస్కారము.

రామా! ఏపతివ్రతామణి యశోకవనంబున శింశుపావృక్షమూలంబున భర్తృవియోగవ్యాధిగ్రస్తయై చిక్కి చవికి ప్రాణంబులఁ గన్నులనుంచి నీరాక నిరీక్షించుచుండెనో, యాప్రియతమను గ్రహించి నీవు పల్కినయోదార్పులభావంబులు లోకమంగళకరంబులగు. రామా! నీయౌదార్యంబును శ్లాఘింపఁదరమా!

రామా! విభీషణునకు లంకాపట్టముఁ గట్టి వానికిఁ గల్పాంతాయువు ననుగ్రహించి సీతాలక్ష్మణాదిసమేతంబుగా విమానారూఢుఁడవై చని, నీమాటఁ దలదాల్చి నీపాదరక్షలు పూజించుచు నీరాక నిరీక్షించుచు నందిగ్రామంబుననున్న నీతమ్ముని జటాధారిని గోమూత్రపక్వాన్నభక్షణవ్రతుని భరతుని జేరి వానియెడ నీవు నెఱపిన సహోదరభావంబును వానికై నీవుపడిన పశ్చాత్తాపంబును వర్ణింప

వాల్మీకిమహర్షియు నేర్పరిగాఁడయ్యె. నే నేమని చెప్పనేర్తు? భ్రాతృప్రేమ నీకే చెల్లు.

రామా! నీపాదుకలను దలఁదాల్చి భరతుఁడును, చామరద్వయంబుఁబట్టి సుగ్రీవవిభీషణులును, శ్వేతాతపత్రంబునెత్తి హనుమంతుఁడును, శరాసనతూణీరంబులనుగొని శత్రుఘ్నుఁడును, దోడరా జాంబవదాదులు ముందునడవగాఁ దీర్ఘకమండులు హస్తయైనసీతతోడ నీవు పుష్పకవిమానంబు నారోహించినవై ఖరిని జూచి యానందింప నగునేగాని పలుకఁ బలుకు చాలదు.

రామా! నీయయోధ్యాప్రవేశంబు తన్నివాసులకెల్ల నష్టమైన ముల్లె లభించినట్లయ్యెను. నీవు పురమందు కాలుపెట్టినవెంటనే మొట్టమొదట సవతితల్లులకు మ్రొక్కి తర్వాత కన్నతల్లికిని గురువునకును మ్రొక్కితివి. ఇందుఁగల నీతిధర్మరహస్యంబులను వివరింపఁదరమా? రామా! నీతల్లు లొక్కరొక్కరు నిన్నుఁ గవుంగిటఁగూర్చి శిరంబు మూర్కొని యానందబాష్పంబుల నభిషేకించి వారు పడసినహాయి యిట్టిదని నీవుమాత్రము చెప్పఁగలవా?

రామా! రాజ్యభారంబును వహింపుమని ఋష్యాదులుగూడ బోధించిరి. ఎవ రెంతచెప్పినను వినవైతివి. తుదకు భరతుఁడు వచ్చి ప్రార్థించెను. వానిమాటకుఁ గట్టువడితివి. నీపాలనంబున వర్ణాశ్రమధర్మంబులెల్ల నుల్లసిల్లెను. ప్రజలకుఁ దండ్రివై యేలితివి. నీపరిపాలనకాలంబున సరిత్సాగరంబులును వనగిరులును వర్షద్వీపంబులును బ్రజలకు సర్వకామంబులఁ గూర్చెను; ఆధివ్యాధులుగాని క్షుత్తృష్ణాదిభయంబులుగాని గలుగవు; అనిచ్ఛామరణం బెవ్వనిఁ జెనకదయ్యెను. అవతారంబులు ధర్మస్థాపనార్థంబులని చెప్పకయే ప్రకటితంబయ్యెను.

రామా! నీవు యజ్ఞేశ్వరుండయ్యు బహుయజ్ఞంబులు గావించి హోతకుఁ బ్రాగ్దిశను, బ్రహ్మకు దక్షిణదిశను, అధ్వర్యునకుఁ బశ్చిమదిశను, ఉద్గాతకు నుత్తరదిశను, ఆచార్యునకు మధ్యప్రదేశంబును యజ్ఞదక్షిణ

లుగా రాజ్యంబెల్ల ధారాగతము చేసితివి. నీకుఁ గట్టుబట్టలును, నీసతికి సౌమంగళంబును శేషించెను. నీ నిస్పృహాత యేమనవచ్చు!

రామా! ఋత్విజులు నీ బ్రాహ్మణభక్తికిని నీనిస్సంగబుద్ధికి నెంతయు మెచ్చి 'జగత్ప్రభూ! నీవలన మేము సర్వపదార్థసమృద్ధులము. భూమండలభారంబును మాపై వైచుట ధర్మముగాదు. దానిని మేము మోయఁజాలము. అందులకు నీవే తగుదువు. మా మనస్తిమిరంబులను హరించి మాకు నెంతో మేలుగూర్చితివి. ఒండు మాకేల?' అనును. నీయిచ్చిన రాజ్యంబును మఱల నీకే యప్పగించిరి. రామా! నీతత్త్వం బెవరికి బోధయగు?

రాజా! ప్రజలభావంబు నెఱిఁగి వారికిఁ బ్రేయమును శ్రేయమును గూర్చుటయే పరిపాలనవిధానంబని తలంచి తదర్థము రాత్రులందు మాఱువేషంబులతో సంచరించితివి. రాజశబ్దంబునకుఁ బ్రజారంజనం బర్థంబగుట నీవలన రూఢియయ్యెను. రామా! నీ నిశాసంచారంబులందు నొకనాఁటిరేయి సీతాదేవింగూర్చి దుర్జనదుర్వచనంబొండు నీచెవిఁబడెను. ఆమహాదేవి పరమపతివ్రతయగుట నీకు స్పష్టమైయున్నను, తదీయపాతివ్రత్యంబును నీ వగ్నిసాక్షికంబుగా లోకప్రకటనంబు గావించియున్నను లోకులనోరు మూయ నేరితరము? లోకాపవాదంబును సాగనిచ్చినచో ధర్మంబు చెడునని తలంచి గర్భవతియైనయిల్లాలిని లోకార్థము త్యజించి కాననంబునకు సమర్పించితివి. ఆసతీమణి యొండు మాఱాడక చని వాల్మీకిమహర్షి యాశ్రమముచేరి వానిప్రోపు గాంచి యందే కుశలవులను గని నీపాదధ్యానయై భూవివరంబుఁ బ్రవేశించెను.

రామా! ఆమెకై నీవు పడినదుఃఖం బింతనరాదు. స్వాపరాధంబునకుఁ బ్రాయశ్చిత్తమో యన సద్దేవీప్రతిమను ద్వితీయగా గ్రహించి బ్రహ్మచర్యవ్రతివై పదుమూఁడుసంవత్సరంబులు గడపితివి. నీ సతీప్రేమయు నీజితేంద్రియత్వంబు నేమనవచ్చు?

ఎవఁడు దేవప్రార్థితుఁడై లీలామానుషావతారము ధరించెనో, ఎవనిచర్యలు నాఁటికి నేఁటికి నేనాఁటికి లోకంబును వివిధరసాంబుధులందు నోలలాడించునో, ఎవనికీర్తి ఋషిప్రోక్తమై రాజసభలందును అచ్చులందును వివిధగతులఁ బ్రస్తుతింపఁబడుచుండునో, ఎవనినామంబు తారకమంత్రమై వెలయునో, ఎవ్వఁడు నిండారభక్తితోఁ బిల్చినమాత్రాననే సన్నిధిఁ గావించి యార్తి మాన్పునో, ఎవనియందలి నిష్కామభక్తి సద్గతికి సోపానంబగునో యారామునకు లోకాభిరామునకు సాష్టాంగంబు.'

## శ్రీరామపరిపాలనావిధానము

మునులారా! శుకయోగీంద్రుఁ డట్లు శ్రీరామచరిత్రను స్తవరూపంబునఁ బ్రకటింపఁగాఁ బరీక్షిన్నరేంద్రుఁడు విని 'మునిచంద్రమా! శ్రీరామచరిత్ర మున్నెన్నోసారులు విన్నదైనను మఱల మఱల వినఁ గుతూహలంబగుచుండు. దానిని వినుకొలఁది క్రొత్తక్రొత్తచవులు గలుగుచుండు. శ్రీరాముఁడు ప్రజల నెట్లు పాలించెనో విన నెంతయుఁ దమకింతు' ననెను. శుకమహర్షి వానికి నిట్లనియెను.

నరేంద్రా! రాజు చాలదృష్టుఁ డందురు. అంతమాత్రమే చాలదు. అతఁడు విచారదృష్టుఁడుగాఁగూడ నుండవలయును. కారణ మేమందువా? గూఢచారులు రహస్యంబుగాఁ బ్రజలభావంబుల నెఱింగి వచ్చి తెలుపుచుందురు. వారు తెలిపినదానిని విమర్శించి ప్రజాహితంబును నిశ్చయించి చేయవలయును. చారులవలనఁ దెలిసికొనుట చారదృష్టియు, విన్నదానిని విమర్శించుట విచారదృష్టియు నగు. విచారింపక యేపని చేయరాదు. కాదని చేసినచో నది గ్రుడ్డివానిచేతి రాయియగు. ఇంతియగాక తేఁడు ప్రజాభావంబులను స్వయముగాఁగూడ నెఱుంగుచుండవలయును. తదర్థము రాజు తనదర్శనంబు నెల్లరకు నందఁ జేయుచు వారిభావంబుల నెఱుంగుచుండవలయును. అట్లుచేయుట స్వదృష్టి యనఁబడు. శ్రీరాముఁడు చారదృష్టియు విచారదృష్టియు స్వదృష్టియు ననెడి నేత్రత్రయంబు గల్గి పరిపాలించెను.

రాజా ! రాముఁ డంతమాత్రముతోఁ దృప్తిపడలేదు. వేల యందువా ? చారులు కల్పించి చెప్పవచ్చు. ప్రజలు మోమోటమిం జేసి సముఖంబునఁ దమభావంబులను దాచి పలుకవచ్చు. అట్టిప్రమాదం బులు జరుగకుండుటకై రాముఁడు రేలయందు మాఱువేషంబులు ధరించి సంచరించుచుఁ బ్రజలయాంతర్యంబుల నెఱుంగుచుండెను.

రాజా ! రామునిరాజ్యకాలములో సోమరితనంబునకుఁగాని యుదరపోషణార్థమై కపటవేషంబులకుఁగాని వంచకత్వంబునకుఁగాని జారచోరద్యూతంబులకుఁగాని యనృతభాషణంబునకుఁగాని గోరంత చోటుకూడఁ గలుగదు. స్త్రీపురుషు లెల్లరు దేశకాలస్వభావాశ్ర మాదుల ప్రకారము స్వధర్మంబు ననుష్ఠించుచుండిరి. ఎవ్వరును దప్పరాదు. ఏవ్యక్తియైనను దేహపోషణార్థం బెంత యవసరమో యంతమాత్రమే యనుభవింపవలయును. భోగపరత్వం బిసుమంతయుఁ దగదు. ఎల్లరి వర్తనము సర్వభూతాత్మభూతభావపూర్వకంబుగా నుండవలయును. స్వలాభపరత్వం బేమాత్రముఁ గలుగదు.

నరేంద్రా ! వేయిమాటలేల ? రాజు ప్రజాసేవకుఁడై ప్రజారం జనం బెట్లొనర్పనైనది రాముఁడు తాను నడచిచూపెను. రాముని కాలంబున ధర్మనిర్ణయవిషయంబునఁ గామలోభమదమాత్సర్యచిత్తులకు లవమాత్రమేనియు నవకాశము గలుగదు. నిస్సంగులైన ఋషీశ్వరులు ధర్మంబును నిర్ణయించుచుండిరి. రాజ్యనిర్వహణార్థము ధనము కావల యును గదా! ఆధనంబును రాజు తనయిచ్ఛవచ్చినట్లు సేకరింపరాదు. ఆయావృత్తులవారినిగూర్చి రాముఁడు ధనావసరంబును వారికిఁ దెలు పును. వారు యుక్తాయుక్తంబులు పరిశీలించి వలయుధనంబును వారే యయావృత్తులమీఁద విభజించి చేకూర్చి ప్రభుపరంబు చేయుదురు. ఆధనంబెల్లఁ బ్రజార్థము సద్వినియోగంబు కావలయునేగాని యేమాత్రం [illegible] దుర్వ్యయంబు గారాదు.

రాజా ! రాముఁ డట్లు పరిపాలించుటం జేసి 'రామరాజ్య' [illegible]

లోకమెల్ల మాఱుమ్రోఁగుచున్నది. రామునకు స్వపరభేదంబు లేదనుట సీతావృత్తాంతమే వేయిముఖంబులఁ జాటుచున్నది. ఇంతకన్న నేమి చెప్పనోపుదు?

### శ్రీ రా మ వం శ ము

రామునకు సీతవలనఁ గుశలవు లనుపుత్త్రులు వాల్మీకాశ్రమంబున జనించిరని చెప్పితిని. లక్ష్మణునకు నంగదచంద్రకేతువులును, భరతునకు దక్షపుష్కలులును, శత్రుఘ్నునకు సుబాహుశ్రుతసేనులును గలిగిరి, కుశునకు అతిథియు, వానికి నిషధుఁడును, వానికి నభుఁడును, వానికిఁ బుండరీకుఁడును, వానికి క్షేమధన్వుఁడును, వానికి దేవానీకుఁడును. వానికి అహీనుఁడును, వానికిఁ బారియాత్రుఁడును, వానికిఁ బలుఁడును, వానికిఁ జలుఁడును, వానికి వజ్రనాభుఁడును, వానికి శంఖణుఁడును, వానికి విధృతియు, వానికి హిరణ్యనాభుఁడును జనించిరి.

హిరణ్యనాభుఁడు జైమినిమహర్షికి శిష్యుఁడై వానివలన యోగవిద్య గ్రహించి యోగాచార్యుఁ డయ్యెను. వానివలన యాజ్ఞవల్క్యుఁ డధ్యాత్మవిద్యను బడసెను. హిరణ్యనాభునకు ధ్రువసంధియు, వానికి సుదర్శనుఁడును, వానికి నగ్నివర్ణుఁడును, వానికి శీఘ్రుఁడును, వానికి మరువును గలిగిరి.

### మరువు కలియుగాంతక్షత్త్రియకులోద్ధారకుఁ డగుట

రాజా! ఆమరువు యోగసిద్ధుఁడై యిప్పుడు కలాపగ్రామంబున గూఢవర్తిగా నున్నాఁడు. కలియుగాంతంబున క్షత్త్రియకులంబును నష్టమైనదాని నతఁ డుద్ధరించును. వానికి బ్రశుశ్రుకుఁడును, వానికి సంధియు వానికి అమర్షణుఁడును, వానికి మహాస్వంతుఁడును, వానికి విశ్వసాహ్వుఁడును, వానికి బృహద్బలుఁడును జనించిరి. ఆబృహద్బలుని మీఁతండ్రి యభిమన్యుఁడు భారతరణంబునఁ జంపెను. రాజా! ఇక్ష్వాకు రాజులెల్లరు నిప్పటికి గతించిరి.

### భావికాలపురాజులు

నరేంద్రా ! ఇఁక రాఁబోవురాజులను వినుము. బృహద్బలునకు బృహద్రణుఁడును, వానికి ఉరుక్షతుఁడును, వానికి వత్సప్రీతుఁడును, వానికిఁ బ్రతివ్యోముఁడును, వానికి భానుఁడును, వానికి దివాకసుఁడును, వానికి వాహినీపతియు, వానికి సహదేవుఁడును, వానికి వీరుఁడును, వానికి బృహదశ్వుఁడును, వానికి భానుమంతుఁడును, వానికిఁ బ్రతీకాశ్వుఁడును, వానికి సుప్రతీకుఁడును, వానికి మేరుదేవుఁడును, వానికి సుతక్షత్రుఁడును, వానికి ఋక్షకుఁడును, వానికి అంతరిక్షుఁడును, వానికి సుతపుఁడును, వానికి అమిత్రజిత్తును, వానికి బృహద్వాజియు, వానికి బర్హిస్సును, వానికి ధనంజయుఁడును, వానికి రణంజయుఁడును, వానికి సృంజయుఁడును, వానికి శాక్యుఁడును, వానికి శుద్ధాదుఁడును, వానికి లాంగలుఁడును, వానికిఁ బ్రసేనజిత్తును, వానికి క్షుద్రకుఁడును, వానికి ఋణకుఁడును, వానికి సురథుఁడును, వానికి సుమిత్రుఁడును జనింతురు. సుమిత్రునితో నిక్ష్వాకువంశము కలియుగంబున సమాప్తంబగు.

### ని మి చ రి త్ర

రాజేంద్రా ! ఇక్ష్వాకువునకు నిమి యనువాఁడు రెండవసుతుండని చెప్పితిని. అతఁడు సత్రయాగంబుఁ జేయనెంచి వసిష్ఠమహర్షిని ఋత్విక్కుగా వరించెను. అంతకుఁబూర్వమే యాఋషీశ్వరుని నింద్రుఁ డట్టి యాగార్థమే వరించియుండెను. ఆమహర్షి నిమిప్రార్థనంబును విని 'ఇంద్రునకు మాట యిచ్చితిని. వానికార్యముఁ దీర్చివత్తు. అందాఁక వేచియుండు' మనిచెప్పి యింద్రయాగంబునకుఁ బోయెను.

### నిమి వసిష్ఠులు పరస్పరము శపించుకొనుట

నిమి వసిష్ఠుని విని 'శరీరంబులు క్షణభంగురంబులు. ఎప్పుడు తలంచినది యప్పుడే చేయు టొప్పు. కాలంబుఁ బుచ్చరా'దని తలపోసి యున్యులను ఋత్విక్కులనుగా వరించి యాగంబు ప్రారంభించెను. నిమి యాగంబు జరుగుచుండఁగానే యింద్రునియాగంబు సమాప్తమయ్యెను.

వసిష్ఠుఁడు నిమి ప్రార్థనంబును దలంచి హుటాహుటి నిమిపురంబునకు వచ్చి యట యాగము జరుగుచుండుటఁ జూచి కోపవివశుఁడై 'కటా! శిష్యుండ వయ్యుఁ గులగురువునకు నపచారం బొనర్చితివి గావున నీకు శరీరపతనం బగుఁగాక!' యని శపించెను. నిమి యాశాపంబును విని 'అయ్యా! ధర్మం బును విచారింపవైతివి. ధర్మంబును విచారింపని నీదేహంబు పడుఁగాక!' యని ప్రతిశాపం బిచ్చెను.

### నిమి విదేహుఁ డగుట

రాజా! ఇరువురదేహంబులు పరస్పరశాపహతంబులై పడెను. ఆయాగంబునకు వచ్చినమునులు నిమిదేహంబును గంధద్రవ్యంబులలో నుంచి కాపాడుచు యాగసమాప్తిఁ గావించి యాకళేబరంబును దేవతల యొద్దకుఁ గొనిపోయి నిమి బ్రదుకునట్లు వరంబును వేఁడిరి. దేవత లామునులకుఁ బ్రీతులై వారు కోరినవరం బిచ్చిరి. నిమి సజీవుఁడై 'సురలారా! ఈదేహబంధము నాకు వలదు. ప్రాజ్ఞులు భగవత్పదాబ్జయోగంబు నభిలషింతురేగాని నశ్వరమైనదేహయోగంబును గోరరు. నీటిలో మీలకు వలె దుఃఖమోహభయం బైనసంసారంబునందు దేహంబునకు నన్నిచోట మృత్యుభీతి వెన్నంటియుండు' ననెను. సుర లదివిని 'నిమీ! నీవు విదేహుఁడవై ప్రాణులనేత్రంబులందు నిమేషోన్మేషంబులరూపంబున నుండు' మనిరి. అతఁ డట్లే యయ్యెను.

### జనకుని పుట్టుక

రాజా! నిమి యట్లగుటంజేసి వానిరాజ్యంబునకు నరాజకత్వము సంభవించెను. మహర్షు లదిచూచి నిమిదేహంబును మథించిరి. వాని దేహంబునుండి పురుషుఁ డొకఁడు జనించెను. అతఁ డట్లు జనించుటంజేసి వానికి జనకుఁ డను పేరిడిరి. జనకుఁడు విదేహునివలనఁ గలుగుటంజేసి విదేహుఁడనియు, మథనంబున జనించుటంజేసి మిథిలుఁడనియుఁ బిలువఁ బడెను. మిథిలానగరం బమ్మిథిల నిర్మితంబగు.

### వసిష్ఠుఁడు కుంభసంభవుఁ డగుట

రాజేంద్రా! వసిష్ఠుఁడు దేహంబును బాసి పునర్జన్మంబునకు వేచి యుండి మిత్రావరుణులందుఁ జేరెను. వారు కొండొకనాఁడు దేవవేశ్యయైన యుర్వశిని గామించి వీర్యస్ఖలనంబునొంది యావీర్యంబు నొకకుంభమం దుంచిరి. అందుండి వసిష్ఠుఁడు జనించి కుంభసంభవుం డనఁబరఁగెను.

విదేహునకు ఉదావసుఁడు, వానికి నందివర్ధనుఁడు, వానికి సుకేతుఁడు, వానికి దేవరాతుఁడు, వానికి బృహద్రథుఁడు, వానికి మహావీర్యుఁడు, వానికి సుధృతి, వానికి ధృష్టకేతుఁడు, వానికి హర్యశ్వుఁడు, వానికి మరుఁడు, వానికిఁ బ్రతిబంధకుఁడు, వానికిఁ గృతరయుఁడు, వానికి దేవమీఢుఁడు, వానికి విధృతుఁడు, వానికి మహాధృతి, వానికిఁ గీర్తిరాతుఁడు, వానికి మహారోముఁడు, వానికి స్వర్ణరోముఁడు, వానికి హ్రస్వరోముఁడు, వానికి సీరధ్వజుఁడుఁ గలిగిరి.

### సీరధ్వజుఁడు - సీతాజననము

రాజేంద్రా! సీరధ్వజుఁడు యజ్ఞార్థము భూమిని జక్కచేయుటకై దున్నుచుండెను. వానినాఁగటిచాలులో సీతాదేవి యుద్భవించెను. అతఁ డిక్ష్వాకువంశ్యుఁ డగుటంజేసి మూలపురుషుని పేర వానిని జనకుం డురు. మఱియు విదేహునిరాజ్యం బధిష్ఠించుటంజేసి విదేహుఁడనియు వానిని బిలుతురు. భూమినుండి పుట్టుటంజేసి భూసుతయనియు, విదేహునింటఁ బెరుఁగుటఁజేసి వైదేహియనియు, నాఁగటిచాలునఁ బుట్టుటంజేసి సీత (నాఁగలిచాలు) యనియు, జనకవంశపోషితయగుటంజేసి జానకి యనియు నామెకుఁ బేర్లువచ్చెను.

### సీరధ్వజునివంశము

సీరధ్వజునకుఁ గుశధ్వజుఁడును, వానికి ధర్మధ్వజుఁడును గలిగిరి. ధర్మధ్వజునకుఁ గృతధ్వజుఁడును, మితధ్వజుఁడును జనించిరి. వారిలోఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుఁడును, మితధ్వజునకు ఖాండిక్యుండును బుట్టిరి.

### కేశిధ్వజ ఖాండిక్యులు

రాజా! కేశిధ్వజుఁ డాత్మజ్ఞానవేత్త యయ్యెను. ఖాండిక్యుఁడు తండ్రియైన మితధ్వజునివలనఁ గర్మతంత్రంబు నేర్చెను. జ్ఞానకర్మంబులకుఁ బొందుగలుగమింజేసి ఖాండిక్యుఁడు కేశిధ్వజునకు వెఱచి పఱచెను.

### కేశిధ్వజునివంశము - మైథులులు

కేశిధ్వజునకు భానుమంతుఁడును, వానికి శతద్యుమ్నుఁడును, వానికి శుచియు, వానికి సనద్వాజుఁడును, వానికి నూర్ధ్వకేశుఁడును, వానికి నజుఁడును, వానికిఁ గురుజిత్తును, వానికి నరిష్టనేమియు, వానికి శ్రుతాయువును, వానికిఁ బార్శ్వకుఁడును, వానికిఁ జిత్రరథుఁడును, వానికి క్షేమాపియు, వానికి హేమరథుఁడును, వానికి సత్యరథుఁడును, వానికి నుపగురువును, వానికి నగ్న్యంశంబున సావనుఁడును, వానికి సువర్చసుఁడును, వానికి సుభాషణుఁడును, వానికి శ్రుతుఁడును, వానికి జయుఁడును, వానికి విజయుఁడును, వానికి ధృతుఁడును, వానికి ననఘుఁడును, వానికి వీతిహవ్యుఁడును, వానికి ధృతియు, వానికి బహుళాశ్వుఁడును, వానికిఁ గృతియు, వానికి మహావశియు జనించిరి.

రాజా! వీరెల్లరు మైథు లనఁబడుదురు. వారు గృహస్థులుగా నుండియు యాజ్ఞవల్క్యాదిమహర్షులను సేవించి వారిప్రసాదంబున నాత్మజ్ఞానముఁ బడసి ద్వంద్వంబు లెడసి ముక్తిఁగాంచిరి.

### చంద్రవంశము

రాజా! సూర్యవంశమందలి రాజులవంశానుక్రమంబును జెప్పితిని. చంద్రవంశక్రమము వినుము.

### చంద్రుని యుత్పత్తి

భగవంతుని నాభికమలంబునుండి బ్రహ్మ పుట్టుట వింటివిగదా. బ్రహ్మకు అత్రి జనించి సర్వవిధంబులఁ దండ్రికి సాటియై పరఁగెను. ఆమహాత్ముని నేత్రంబులనుండి కొంతకాలానఁ డానందబాష్పంబు స్రవించెను. ఆబాష్పంబుతోడఁ జంద్రుఁ డుదయించెను. ఆనందాశ్రువు

లమృతాత్మకంబులు గావున దానితోడ నుదయించినచంద్రునకు నమృతమయత్వము స్వభావసిద్ధమయ్యెను. ఆచంద్రుని బ్రాహ్మణులకు నోషధులకు నక్షత్రంబులకుఁ బతిగా బ్రహ్మ నియమించెను.

### చంద్రుఁడు తారను హరించుట

చంద్రుఁడు రాజయి ముల్లోకంబులు గెలిచి రాజసూయయాగం బొనర్చి పదవీగర్వితుఁడై బృహస్పతిభార్యయైన తారయింటికిఁ బోయి యాయింతిని బలాత్కారముగాఁ గొనివచ్చెను. గురుఁ డాసంగతిఁ దెలిసి చంద్రునొద్దకుఁ బోయి తనభార్య నిమ్మని వేఁడెను. చంద్రుఁడు వానిని నిరాకరించెను.

### దేవదానవయుద్ధము

ఆసంగతి వేల్పులు విని గురుపక్షముఁ జేరిరి. వేల్పులగురువైన బృహస్పతికిని దానవాచార్యుఁడైన శుక్రునకును దీర్ఘవైరంబు గావున శుక్రాచార్యుఁడు చంద్రునిపక్షమయ్యెను. అదినిమిత్తంబుగా దేవదానవ యుద్ధంబు పొడమెను. సురాచార్యునిపక్షంబు డీలుపడెను.

### తార మరల బృహస్పతిని జేరుట

అప్పుడు హరుఁడు తనగురుపుత్రుఁడైన బృహస్పతిస్థితి విని భూతగణంబుతోడ వచ్చెను. మహేంద్రాదులు వానివెంట నిలిచిరి. ఉభయపక్షంబులు హోరాహోరిఁ బోరాడిరి. సురాసురులు పెక్కండ్రు చచ్చిరి. రెండుకులంబులు రూపుమాయున ట్లుండెను. బృహస్పతితండ్రి యంగిరసుఁ డప్పుడు బ్రహ్మకడకుఁ జని యుదంతంబెల్ల వానికి వినిచెను. బ్రహ్మదేవుఁడు వచ్చి చంద్రు నదలించి తారను బృహస్పతికి నిప్పించెను. యుద్ధము చల్లారెను.

### తారకుఁ సుతుఁ డుదయించుట

రాజా! అత్తఱి తార నిండుగర్భవతిగా నుండెను. గురుఁ డది చూచి—

'ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియ కైవడి ధర్మకీర్తులన్
బొగ్గులుచేసి జారు శశిఁ బొంది కటా! కడు వేల దెచ్చుకొం
టెగ్గుఁ దలంపఁగా వలదె? యిప్పుడు గర్భము దించుకొమ్ము నీ
మ్రగ్గఁగఁ జేసెదన్ జెనఁటి! మానవతుల్ నినుఁజూచి మెత్తురే?'

'అసతీ! స్త్రీవి యగుటంజేసియు సంతానకాంక్షుఁడను గావునను నిన్ను బూదిసేయనైతి' నని పరుసంబుగాఁ బలికెను. అంతలోన నయ్యింటికిఁ గాన్పుతటియై దానిగర్భంబునుండి సువర్ణకాంతిమంతుఁడు సుతుఁ డుదయించెను.

### తారాసుతునకై గురుచంద్రుల వివాదము

రాజా! ఆబిడ్డను జూచినంతనే గురునకును సోమునకును బుత్ర వాత్సల్యంబు పైకొనెను. 'ఇతఁడు నాకొడుకు; ఇతఁడు నాకొడుకు' అని వారిద్దఱుఁ దగవులాడసాగిరి. వారితగవు తీర్చుటకై ఋషులువచ్చి తార నవ్వేలకుఁ బిలిచి నిజము చెప్పుమనిరి. ఆయింతి లజ్జావశంబున బదులాడ దయ్యెను. అప్పు డాబాలుఁడు తల్లింజూచి 'అమ్మా! సిగ్గేల? కలరూపు చెప్పు' మని కోపస్వరంబునఁ బలికెను. అంతలోన బ్రహ్మ వచ్చి యాకాంత నేకాంతంబునకుఁ జీరి,—

'మ. చెలువా! నీయెలసిగ్గు వాపి గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁడీ
లలితాకారుఁ గుమారుఁగన్నయతఁ డేలా దాఁప? నిప్పాటు నీ
తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము కాంతల్ గాముకల్ గారె? మా
టల నిందేమియుఁ బోదుపో యొరులతోడం జెప్ప విన్పింపవే?'

అని బుజ్జవంబులాడెను. ఆయబల బ్రహ్మకు మఱుఁగాడనోడి 'ఈబిడ్డ చంద్రునకుఁ బుట్టె' నని రహస్యముగా నుడివెను.

### బుధజననము

అంతట సోముఁ డాబిడ్డను గ్రహించెను. వానికి బుధుఁ డనుపేరు పరమేష్ఠి నిర్దేశించెను.

### పురూరవుఁడు

రాజా! బుధునకు నిళయందుఁ బురూరవుఁడు జనించుట చెప్పితిని. పురూరవుఁడు పుట్టువుతోడ రూపశీలౌదార్యవిక్రమతేజోమూర్తియై వన్నెకెక్కెను.

### ఊర్వశికి శాపము

ఒకనాఁ డింద్రలోకంబున దేవసభ జరిగెను. ఆసభయందు సురలును మునులును నిండియుండిరి. సురవేశ్యలనాట్యము జరుగుచుండెను. అత్తఱి నారదమహర్షి యటకువచ్చి ప్రస్తావవశంబునఁ బురూరవుని గుణశీలరూపాతిశయంబులను శ్లాఘించెను. ఆమాట లూర్వశి యనునచ్చర లేమచిత్తంబు నాకర్షించెను. అందులకు నటనున్న మిత్రావరుణు లాగ్రహించి మానుషరూపంబు నొందుమని యాయింతిని శపించిరి.

### ఊర్వశీపురూరవుల సమాగమము

రాజా! ఒకనాఁడు పురూరవుఁడు వనవిహారము చేయుచుండఁగా నొకకాంతామణి కొమ్మెలుంగుఁదీవియ యో యననొప్పుచుఁ దటాలున వానియెదుట నిలిచెను. ఆరాజు దానిరూపవయోవిలాసంబులకు హర్షపులకాంకితుఁడయ్యెను. వెనువెంటనే మదనుఁడు వానిలోఁ జొచ్చి యతని నాడింపసాగెను.

పురూరవుఁ డాయింతికి స్వాగతంబు పలికి 'రమణీ! నాతోడఁ బెక్కేండ్లు క్రీడింపు' మనెను. ఆకాంతయు వానిపయిఁ జూడ్కినిలిపి 'మోహనాకారా! ఊర్వశి యని నన్నుఁ బేర్కొందురు. మనపొందు కొన్నినియమంబులకు లోనైయుండు. ఆ నియమంబు లెవ్వియందువా? నీమనోభీష్టంబులు వేఱొకతెవలను బోరాదు. నాతోడనున్న యీమేషంబులు రెండు నాకుఁ బుత్రతుల్యంబులైయుండు; ఆ రెంటిని నీవు నెల్లడ యుంతు; వానినిఁ గాపాడవలయును. ఘృతంబును నాకు భోజనంబుగా నిచ్చుచుండవలయును. సంగమకాలంబునఁదక్క నితరవేళలం దెప్పుడైనను దిసమొలతో నీవు నాకంటఁ బడరాదు.' ఈసంకేతంబులకు

సమ్మతింతువేని నీతోడ నుందు. ఇందేది తప్పినను మనకు వియోగంబు సిద్ధ' మనెను. పురూరవుఁ డాసమయంబులనెల్ల నంగీకరించి దానిని గ్రహించెను. తనకై తా వలచివచ్చిన యచ్చర మచ్చకంటి నెవఁడు నిరాకరింపనోపు ?

### ఊర్వశీపురూరవుల విహారము

రాజా ! ఆకామినీకాముకు లట్లు జతఁగూడి రత్నసౌధాంతరంబు లందును దేవతావనంబులందును రత్నకూటంబులందును గమలేందీవర సుందరసరోవరంబులందును గిరికందరంబులందును యథామతి విహరింప సాగిరి. వారి నెయ్యంబులును మక్కువలు నింతనరావు. ఇరువురపందుఁ బయ్యెద యడ్డమైనను వారికిఁ బ్రాణంబులు వెడలునట్లుండెను.

### ఊర్వశీపురూరవుల వియోగము

అట్లు పెక్కేండ్లు గడచెను. అంతలో నూర్వశికి శాపావసాన కాలం బయ్యెను. ఒకనాఁడు మహేంద్రుఁడు సభలోఁ యూర్వశి లేకుం డుట చూచి 'కటా ! ఆమెలుఁగుబోడి లేమి నాసభ సొంపొంద' దని పలికి యాసొగసులాడి యెందున్నను గొనిరండని గంధర్వులకు నాజ్ఞా పించెను. వా రామాటతోడఁ దరలి పురూరవునిపురంబుఁజొచ్చి నాఁటి నడిరేయిఁ గన్నుపొడిచినను గానరాని-చీఁకటిలో నూర్వశి మేఁకల రెంటి నపహరించిరి. ఆమేషంబు లొక్క పెట్టున నార్వసాగెను. ఆయఱపులు విని యూర్వశి మేల్కాని 'అయ్యో ! నాబిడ్డలైన మేఁకల నెవ్వరో హరించికొనిపోవుచున్నారు. ఇతఁడు వీరాతివీరుఁడని నమ్మి నాథునిగా గ్రహించితి. నాబిడ్డ లిట్టు లేడ్చుచున్నప్పటికి నీతఁడు పడకవదలఁడు. ఆడుదానివలె వెఱచెఁగాఁబోలు!' అని వాపోవుచు 'అయ్యో ! నీ బిగి కౌఁగిలి వదలు; నన్ను విడువు; అతిలోలుపుండవును గడుంగడుఁ బిఱికి వాఁడవు నగుట యెఱుంగక చెడితి' నని దూఱులాడెను.

ఊర్వశిమాటలు పురూరవునకు వాఁడితూపులై తాఁకెను. శూలా ఘాతంబులకు మదకుంజరంబువలె నయ్యెత్తిపొడుపులకు నతఁడు చివ్వ

క్కన లేచి, నిద్రలో వస్త్రము వీడియుండుటఁగూడ యెఱుంగక ఖడ్గముఁ బూని మేఁకలఱచు దిక్కుఁబట్టి వడివడింబోయి దొంగలను జోపి మేషం బులను మరలించుకొనివచ్చెను. అట్లు వచ్చిన పురూరవుని దిసమొల నున్న వాని నూర్వశి చూచి తనసంకేతంబును దలంచి వెంటనే యందుండి పోయెను.

### పురూరవుఁ డూర్వశికై భ్రిమ్మరుట

పురూరవుఁడు పాన్పునొద్దకుఁ బరువునఁ బోయెను. అట వాని పత్ని గానరాదయ్యెను. అతనిగుండియలు ఝల్లుమనెను. ఆతేఁడు పిచ్చివాఁడువలె నై పురంబువెడలి యూర్వశినిఁ దలంచుచు దానితోడిదే లోకంబుగా నెంచుచు భూమియెల్లఁ గ్రుమ్మరసాగెను.

### ఊ ర్వ శీ స ం ద ర్శ న ము

రాజా! ఆతఁ డట్లు గ్రుమ్మరుచుఁ బల్లటిల్లుచుఁ గొండొకనాఁడు కురుక్షేత్రంబునకు వచ్చి యట నేవురుచెలియలతోడ విహరించుచున్న యూర్వశిని గాంచి సంతోషపరవశత్వంబున నయ్యింతిని డాసి 'పత్నీ! నిలునిలుము. బాసతప్పుట తగునా? నన్ను విడనాడిపోవుట న్యాయమా? ప్రియా! రారమ్ము. నీసల్లాపామృతంబున నన్ను నుజ్జీవింపఁజేయుము. నీకై యీశరీరం బింత దవ్వు వచ్చెను. నీవు ప్రసన్నవుగానిచో నాయీ దేహంబు కంకగృధ్రంబులపాలగు' నని దీనాతిదీనంబుగా వేఁడెను.

ఊర్వశి వానిని విని 'రాజేంద్రా! శరీరత్యాగంబుఁ గావింతు నందువు. పౌరుషవంతు లట్లు పలుకుదురా? నెలఁతలనెయ్యంబు నిత్యంబు గాదని యెఱుంగవా? చెలువులచిత్తంబు వృకహృదయంబువలెఁ గ్రూరం బును దయాదాక్షిణ్యరహితంబును నిత్యకోపనంబు నై యుండు. స్త్రీ సాహసం బనుమాట లోకవిదితమేగదా. గోరంతనేపంబు గలిగినను వా రంతకును దెగింతురు. చాపల్యంబు వారి నెడఁబాయదు. నూత్న ప్రియత్వంబు వారికిఁ బుట్టువుతోడఁ బుట్టెను గావున వారు క్రొత్తవారిని గామించుచుందురు. స్త్రీలమురిపెంబులు బూటకంబులు. ఆసలగతి

యెఱుంగక యజ్ఞులు వారిని నమ్మి చరింతురు. అయ్యా! సమయము వచ్చెనేని వారు భర్తనైనను దోఁబుట్టువునైనను జంపుటకుఁ జంపించుటకు వెనుదీయరు. ఇంతటనైనను దెలివితో వర్తించుట మేలగు.

రాజేంద్రా! నీదైన్యంబునకు నెంతయు జాలియయ్యెడు. నీయౌదార్యమునకై యొకమాటఁ జెప్పెద వినుము. ఒకయేఁడు గడచిన తర్వాత నొకరేయి నాతో నుందువు. నీకు సంతానప్రాప్తియు నగు. నెమ్మదిఁ బోయిరమ్ము' అని పలికెను. పురూరవుఁ డామాట విని యూర్వశి గర్భవతి యగుట గ్రహించి యందుండి మరలి వానినగరంబునకుఁ బోయెను.

ఒకసంవత్సరము గడచినంతటఁ బురూరవుఁడు కురుక్షేత్రంబునకుఁ బోయి పుత్రవతియైనయూర్వశిని గాంచి యారేయి దానితో వసించెను. తెల్లవాఱినంతనే వానికి వియోగసమయము జ్ఞప్తికివచ్చెను, అందులకై యతఁ డెంతయు నలమటింపసాగెను. ఊర్వశి వానిపాటుఁ గాంచి 'రాజా! ఈగంధర్వుల నుపసర్పింపుము. వారు నన్ను నీ కిత్తు' రనెను. పురూరవుఁ డట్లే గావించెను. గంధర్వులు జేనిని గనికరించి యగ్నిస్థాలి నొకటి వానికిచ్చిరి. అదియే యూర్వశిగా నతఁడు భావించి దానింగొని స్వపురంబునకువచ్చి యాస్థాలిని వనమందుంచి ప్రతిదినము రాత్రిపూఁట దానిని జింతించుచుండెను. ఆచింతనఫలంబుగాఁ గర్మబోధకంబైన వేదత్రయంబు వానిహృదయంబున స్ఫురించెను.

### వేదవిభాగము

అంతటఁ బురూరవుఁడు స్థాలినుంచినచోటికిఁ జని దానిని వెదకెను. అది గానరాదయ్యెను. ఆచోట శమీవృక్షంబును దాని గర్భంబున నశ్వత్థవృక్షంబును మొలచియుండెను. పురూరవుఁ డదిచూచి 'ఈయశ్వత్థమందు నాయుంచిచన్న యగ్ని యుండు' నని భావించి యా రాగిచెట్టుకొమ్మలు రెండు విఱిచి క్రిందిపుడుక యూర్వశిగాను మీఁది పుడుకను దన్నుగాను సంకల్పించి యూర్వశీలోకకాముఁడై మథించెను.

ఆమథనఫలంబుగా నగ్ని యుదయించెను. అతఁ డాయగ్నిని బుత్త్రుఁడుగా గ్రహించి వానికి వేదవిహితసంస్కారపూర్వకంబుగా గార్హపత్యాదిరూపంబులను మూఁటిఁగూర్చి యూర్వశీలోకంబును గోరి యజ్ఞంబుగావించి యజ్ఞేశ్వరు నారాధించెను.

రాజా! కృతయుగమందు సర్వవాఙ్మయంబైన ప్రణవం బొక్కటే వేదంబుగాను, నారాయణుఁ డొక్కఁడే దేవుఁడుగాను, అగ్ని యొక్కఁడు గాను, హంసనామవర్ణంబు దక్క నితరవర్ణంబు లెవ్వియు లేకయు నుండెను. త్రేతాయుగమందుఁ బురూరవునివలన నవ్విధంబున వేదత్రయం బేర్పడెను. కారణం బేమందువా? కృతయుగమందు సత్త్వము ప్రధానం బగుటం జేసి జనులెల్లరుఁ బ్రాయికంబుగా ధ్యాననిష్ఠాపరులై యుండిరి. త్రేతయందు రజస్సు ప్రధానమైనందున జనులచిత్తం బేకాగ్రమగుటయు ధ్యానపరంబగుటయుఁ గష్టమయ్యెను. ఆకారణంబున వేదవిభాగంబు గావింపఁబడి రజోగుణానుకూల్యమైన కర్మమార్గము ప్రకటితమయ్యెను. పురూరవుఁ డట్లగ్నిని సంతానంబుగాఁబడసి గాంధర్వలోకంబు నొందెను.

### పురూరవసంతానము

రాజా! పురూరవునకు నూర్వశివలన ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుఁడు, విజయుఁడు, జయుఁడు ననుకుమారు లార్గురు జనించిరి. వారిలో శ్రుతాయువునకు వసుమంతుఁడును, సత్యాయువునకు శ్రుతంజయుఁడును, రయునకు ఏకుఁడును, జయునకు అమితుఁడును, విజయునకు భీముఁడును జనించిరి. భీమునకుఁ గాంచనుఁడు, వానికి హోత్రకుఁడు, వానికి జహ్నుఁడు పుట్టెను. జహ్నుఁడు గంగాప్రవాహంబును తనపుటిసిటఁ దాల్చి యాచమించెను. జహ్నునకుఁ బూరుఁడు, వానికి బాలకుఁడు, వానికి అజకుఁడు, వానికిఁ గుశుఁడు జనించిరి. కుశునకుఁ గుశాంబుఁడును, ధూర్తయుఁడును, వసువును, కుశనాభుఁడు నను నల్వురుఁ బుట్టిరి. వారిలోఁ గుశాంబునకు గాధి జనించెను.

జమదగ్ని జననము

గాధి సత్యవతిని బెండ్లాడెను. వారికి నొకపుత్రిక జనించెను. ఆబాలను ఋచికుఁ డనుముని భార్యగాఁ గోరి గాధి నడిగెను. గాధి యామాట విని 'కటా! ఇతఁడు వనవాసి; కట్టబట్టయుఁ గుడవఁగూడుఁ గలుగదు. నాపుత్రికయన్ననో మహాకోమలాంగి. నాబిడ్డ నితని కె ట్లియ్యనో ర్తు? ఇయ్యనన్నచో నితఁ డేమిసేయునోగదా!' యని లోలోనఁ దలపోసి 'మునివర్యా! శరీరంబంతయు ధవళమై యొక్క చెవిమాత్రము నల్లగానుండునట్టి యశ్వంబులవేయింటి నొసంగినవానికి నాపుత్రిక నిత్తునని సంకల్పించితి' నని చెప్పెను. ఋచికుఁడు వాని భావంబును గ్రహించి వరుణునిఁ బ్రార్థించెను. ఆదేవుఁడు గాధికోర్కెఁ దీర్చెను. ఋచికుఁ డాహయంబులను బడసి వానిపుత్రికను గాధి కిచ్చి పెండ్లి చేసెను.

అంత ఋచికుఁడు తనభార్యకు నత్తకును బుత్రసంతానంబుఁ గలిగింప సంకల్పించి యజ్ఞంబుచేసి మంత్రప్రభావంబున బ్రహ్మక్షత్రవర్ణంబులకుఁ దగినట్లుగాఁ జరుద్వయంబు నమర్చియుంచి స్నానార్థంబు నదికిఁ బోయెను. ఆసమయంబున గాధిపత్ని తనపుత్రికను బిలిచి 'అమ్మా! నీభర్త మనకై చరుద్వయంబును గల్పించెను. వానిని గ్రహించుదము. కొనిర' మ్మని చెప్పెను. సత్యవతి యాచరుపాత్రంబులరెంటిని దెచ్చెను. ఆచరువులలో నొకటి బ్రాహ్మణమంత్రాభిమంత్రితమై ఋచికుని భార్యకుఁగా రెండవది క్షత్రమంత్రాభిమంత్రితమై సత్యవతికిఁగా సంకల్పింపఁబడియుండెను. ఆసంగతి యెఱుంగక యాబాల తనకుఁగా నిర్ణయింపఁబడిన చరువును దల్లికిచ్చి తల్లికిఁగా నిర్ణయింపఁబడినదానిని దాను బుచ్చుకొనెను.

అంతలోన ఋచికుఁడు నీరాడివచ్చి చరుయుగంబును గానక భార్యను బిలిచి యడిగెను. ఆమెసంగతిని దెలిపెను. ఋచికుఁ డదివిని 'ఆహా! నీకుఁగా సిద్ధపఱచినదానిని నీతల్లి కిచ్చితివి; ఆమెకుఁగా

నమర్చినదానిని నీవు గ్రహించితివి. ఈవ్యత్యాసఫలంబుగా నీకు ఘోరుం డై నసుతుండును, నీతల్లికి బ్రహ్మవేత్తయైన పుత్రకుండును జనించు' ననెను. ఋచికునిభార్య యామాట విని సంతాపమంది 'మునీంద్రా! ఘోరుండైన కుమారు నే నొల్ల' నని ప్రార్థించెను. ఋచికుఁడు కరుణించి 'అట్లగు నేని నీపౌత్రుఁడు ఘోరుఁ డగుఁగాక! అని చెప్పెను. సత్యవతికి జమదగ్ని యనుకుమారుఁడు పుట్టెను. అంత సత్యవతి తనువును దవ్యజించి లోక పావనియైన కౌశికీనదిగా మాఱెను.

### పరశురామావతారము

ఆజమదగ్ని రేణుపుత్రియైన రేణుకను బరిణయం బయ్యెను. వారికి వసుమన్వాదులు జనించిరి. వారిలోఁ గడపటివాఁడు వాసుదేవాంశమునఁ బుట్టి రాముఁ డనుపేర నొప్పి హైహయవంశంబును నిర్మూలించెను. మఱియు నక్కాలంబున క్షత్త్రియకులంబు రజస్తమోమలినాక్రాంతమై ధర్మంబుఁ దప్పి వర్తించుచు నుండెను. వారు భూమికి దుర్వహులైరి. రాముఁడు క్షత్త్రకులంబు నిఱువదియొక్కమాఱు వెదకివెదకి సంహరించి భూభారంబును దగ్గించెను.

### క్షత్త్రసంహారకారణము

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకుని విని 'మునిసత్తమా! క్షత్త్రియులు రామున కేమితప్పుచేసిరి? అతఁడు వారియెడ నట్లు పగఁబూనఁ గారణ మేమి?' యని యడిగెను. వానికి శుకుఁ డిట్లనియెను.

రాజేంద్రా! హైహయులలోఁ గార్తవీర్యార్జునుఁ డనువాఁ డొకఁ డుండెను. అతఁడు నారాయణాంశజుఁడైన దత్తాత్రేయుని సేవించి వానిప్రసాదంబున సహస్రబాహువులును, శత్రుదుర్జయత్వంబును, అవిచ్ఛిన్నతేజోబలయశోవీర్యశ్రీలను, అణిమాదియోగసిద్ధులను బడసి యెదురులేక గాలిరీతి లోకసంచారంబు సేయసాగెను.

అతఁ డట్లు సంచరించుచుఁ గొండొకనాఁడు స్త్రీజనంబుతోఁ డం జని నర్మదానదిలో జలక్రీడ సలుపుచుఁ దనవేయిభుజంబులను జాచి

తత్ప్రవాహంబు నడ్డగించెను. ఆనదీజలంబుబ్బి యుబికి పొరలి తీరమం దున్న మాహిష్మతీపురంబును గ్రమ్మెను. అత్తఱి నచట రావణుఁడు శివ పూజ గావించుచుండెను. ఆజలంబురావణుని శిబిరంబు నాక్రమించెను. దానవేశ్వరుఁ డా సంగతి విని పరవీరోత్సేకంబును సహింపలేక వాని పయికి దాఁడివెడలెను. హైహయేశ్వరుఁడు దనవేయిభుజంబులలో దశముఖు నిఱికించికొని తత్పురస్త్రీలమ్రోల వానినిఁ గోఁతిరీతి నాడించి ప్రాణంబులతో విడిచిపెట్టెను.

కార్తవీర్యుఁ డొకనాఁడు వేటకై యడవికిఁ బోయి యాదృచ్ఛి కంబుగా జమదగ్ని యాశ్రమంబుఁ జొచ్చెను. రాజువచ్చుట యమ్ము నీంద్రుఁ డెఱిఁగి వానికిఁ దదీయసేనావర్గసహితంబుగా నాతిథ్యముచెప్పి తత్సత్కార్యంబునకై వాని కామధేనువు నాజ్ఞాపించెను. ఆతిథ్యసత్కా రంబులు మహాద్భుతంబుగా జరిగెను. కార్తవీర్యుఁ డాచిత్రంబును జూచి 'అహో! ఈమునీశ్వరుని విభవంబుమ్రోల నాదియు నొకవిభవమా? ఇదంతయుఁ గామధేనుకల్పితంబుగదా?' యని తలపోసి దానినిబట్టి తెచ్చుటకై రాజభటుల నాజ్ఞాపించెను. ఆభటులు చని దర్పంబున దానిని దూడతోఁడఁబట్టి బంధించి తద్గోవత్సంబులయఱపులఁగూడఁ జెవిపెట్టక మాహిష్మతీపురంబునకుఁ గొనిపోయిరి.

### పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట

అంతలోన జమదగ్నిసుతుఁడు పరశురాముఁ డాశ్రమంబునకు వచ్చెను. అతనికి సంగతి దెలిపిరి. ఆమాట చెవిఁబడినంతనే యతఁడు పాదతాడితభుజగంబుపగిది రేఁగి కవచంబుఁ దొడిఁగి పరశువును బూని కోదండతూణీరబాణంబులను గైకొని గజంబుమీఁదికి సింహంబుపగిది నయ్యర్జునిమీఁదికిఁ బోయెను. అట్లు శరచాపపరశుధారియై మూర్తి కొన్న రవితేజంబోయన వచ్చిన యాజటాధారిని గార్తవీర్యుఁడు పదునేఁ డక్షౌహిణీసైన్యంబుతో ఢీకొనెను. ఉభయపక్షంబులు మాహిష్మతీ నగరసమీపంబునఁ దలపడెను. పరశురాముఁడు విజృంభించి వైరి

సైన్యంబుఁజొచ్చి రణక్రీడరో యనఁ బరశువుతో మనోజవంబునఁ బదునేడక్షౌహిణులను రూపుమాపెను. యుద్ధరంగమెల్లఁ దెగినశిరంబులతోఁ విఱిగినభుజంబులతోఁ జచ్చినసారథులతోఁ గూలినరథంబులతోఁ దొల్లిన వాహనంబులతో రుధిరప్లుతమై మహాఘోరంబుగాఁ దోఁచెను.

కార్తవీర్యుఁడు వానిసైన్యగతికిఁ గోపవివశుఁడై వామహస్తంబుల నేనూఱింట నేనూఱుచాపంబులు ధరించి దక్షిణహస్తంబుల నేనూఱింట నేనూఱుశితభల్లంబులు గొని సంధించి యేకకాలంబున నన్నింటిని రామునిపయిఁ బ్రయోగించెను. జడదారి తన యేకచాపంబుననే యేనూఱుబాణంబులకు నేనూఱుప్రతిశరంబులు వైచి వానినెల్లఁ ద్రుంచెను. అంతట హైహయుఁడు శిలలను వృక్షంబులనుఁ బర్వతంబులను బెఱికి రామునిపయిఁ గురిపింపసాగెను. రాముఁ డంతకుఁడో యన నైజకఠోరపరశువుతో హైహయుని పంచశతకరంబులను గదళీస్తంభంబుల నట్లు దఱిగి వానిశిరంబు డుల్లనేసెను. అర్జునునిపాటు చూచి వానిసుతులు పదివేవురుఁ బఱచిరి. అంతటఁ బరశురాముఁడు కామధేనువును సవత్సంబుగాఁ గొని యాశ్రమంబుచేరి గోవును దండ్రికి నప్పగించి జరిగినసంగతి వానికి విన్నవించెను.

### పరశురాముఁడు పాపప్రాయశ్చిత్తంబు చేసికొనుట

రాజేంద్రా! జమదగ్ని యాసంగతి విని 'రామా! రాజు సర్వదేవమయుఁడుగాని యేతన్మాత్రుఁడు గాఁడు. అట్టివానిని గేవలరోషవశుండవై చంపి పాపంబు నొడిగట్టితివి. మనము బ్రాహ్మణులము. క్షమాగుణంబు బ్రాహ్మణకులలక్షణంబు. ఆగుణంబును బట్టి మనకుఁ బూజ్యత గలుగుచున్నది. బ్రహ్మవర్చసంబు శమంబున సూర్యప్రభయట్లు వర్ధిల్లు. శమంబుగలవారికి దుర్లభంబు గలుగదు. లోకగురుఁడు పరమేష్ఠిపదంబు నధిష్ఠించుట శమంబుననేగదా. భగవానుఁడు శాంతంబునకు మహాసంతుష్టుఁ డగు.'

'వత్సా! మూర్ధాభిషిక్తుఁడై రాజపదంబు నలంకరించినవానిని

జంపుట బ్రహ్మహత్యాదిదోషంబునకంటె మించినదోషంబగు. ఆమహాపాతకంబు సామాన్యప్రాయశ్చిత్తంబులఁ బాయదు. భగవానుని స్మరించుచుఁ దీర్థసేవచేసి దానిని బాయు' మని చెప్పెను. పరశురాముఁడు తండ్రియాజ్ఞఁ దలఁదాల్చి యొక్కయేఁడు తీర్థంబులసేవించి మరలి యాశ్రమంబునకు వచ్చెను.

### జమదగ్ని వానిభార్యయైన రేణుకను జంప నాజ్ఞాపించుట

రాజేంద్రా! ఒకనాఁడు రేణుక స్నానార్థము గంగకుఁ బోయెను. అత్తటి నటఁ జిత్రరథుం డనుగంధర్వుఁడు తోడియచ్చరలఁగూడి జలక్రీడ సలుపుచుండెను. రేణుక వానిని జూచినంతనే దానిచిత్తం బొకింత యతనిపయి వ్రాలెను. ఆకారణంబున నయ్యింతి కొండొకతడ వట నుండెను. అంతలోన నక్కాంతకు హోమసమయము జ్ఞప్తికివచ్చి 'అయ్యో! జాగుసేసితి; మునీంద్రుఁడు శపించునేమో' యనుచు భయాకులయై త్వరత్వరగా నాశ్రమంబునకువచ్చి తాఁదెచ్చిననీటికలశంబును దింపి జమదగ్నియెదుటఁ గేలుమోడ్చి నిలిచెను.

ఆమునీంద్రుఁడు రేణుకామానసవ్యభిచారంబును గ్రహించి కోపవశుఁడై కొడుకులఁ బిలిచి 'పుత్రకులారా! ఈపాపాత్మురాలిని గడతేర్పుఁ' డనెను. తల్లిని జంపుటకు వారు సమ్మతింపరైరి. అంత నతఁడు పరశురాముని జూచి 'ఈరేణుకను దానిపుత్త్రులను జంపు' మనెను. పరశురాముఁడు తండ్రియొక్కతపస్సమాధిప్రభావంబు నెఱుంగుఁ గావున మాఱాడక వారినెల్లఁ జంపి 'నాయనా! నీయాజ్ఞ నొనర్చితి; వీరెల్లరుఁ బునర్జీవితు లగునట్లుగా వీరికి వధస్మృతి గలుగకుండునట్లుగా వరం బనుగ్రహింపు' మని ప్రార్థించెను. జమదగ్ని యట్లే వరం బిచ్చెను. రేణుకాదులు నిద్రనుండి మేల్కాంచినట్లు లేచి యథాపూర్వ ముండిరి.

### కార్తవీర్యునిపుత్త్రులు జమదగ్నిని జంపుట

రాజా! కార్తవీర్యునిపుత్త్రులు వారితండ్రిని జమదగ్నిసుతుఁడు చంపినందులకుఁ బగఁబూని ప్రతీకారం బొనర్ప నిశ్చయించి సమయమ్ము

గాచియుండి పరశురామాదులు వనంబునకుఁ బోవుట యెఱింగి జమదగ్ని యాశ్రమంబుఁ జొచ్చి యగ్నిహోత్రగృహంబున భగవద్ధ్యానపరుఁడై యున్న యమ్మునీంద్రుని తలఁద్రుంచి పఱచిరి. రేణుక యదిచూచి గోడు గోడుమని యేడ్చుచు 'రామా! రామా!' యని కేకలు వైచెను. ఆ యఱపులు విని పరశురాముఁ డన్నలతోడఁ బఱచివచ్చి తండ్రిగతిఁ జూచి 'హా! తండ్రీ! మమ్ము వదలి స్వర్గంబునకుఁ దరలితివా?' యని కొండొకతడవు విలపించి 'సోదరులారా! పితృదేహంబును గాపాడుచు మీ రిందే యుండుఁడు. ఇదే నేను మఱల వచ్చెద' ననిచెప్పి గొడ్డలి మూపునఁదాల్చి మాహిష్మతీపురంబునకుఁ జని హైహయులను వారి బంధువులతోడ వధించి వారితలలు పురమధ్యంబున రాశిగాఁ బడవైచెను. వారిరక్తంబు లేఱులై ప్రవహించెను.

### క్షత్రసంహారము - శమంతపంచకము

రాజా! పరశురాముని క్రోధాగ్ని యంతతోఁ జల్లాఱదయ్యెను. అతఁ డిఱువదియొక్కమాఱు చని క్షత్రియకులంబును వెదకివెదకి వధించి వారిరక్తంబులను దొమ్మిదిమడువులుగా శమంతపంచకంబున నిర్మించి యలుక నుంత చల్లారి యాశ్రమంబునకు వచ్చి తండ్రితలను వాని బొందెకుఁ దగిలించి వివిధయజ్ఞంబులచేత యజ్ఞేశ్వరు నారాధించి తాను సాధించిన భూమండలంబునందుఁ దూర్పుభాగంబును హోతకును, దక్షిణ దిక్కును బ్రహ్మకును, పశ్చిమదిశను నధ్వర్యునకును, ఉత్తరభాగంబు నుద్గాతకు సమర్పించి తదితరఋత్విజులకు నవాంతరదిక్కుల నొసంగి మధ్యదేశంబును గశ్యపునకు నార్యావర్తంబు నుపద్రష్టకు నిచ్చి శేషిం చినభాగంబును సదస్యులపరంబుచేసి నవభృథంబును సరస్వతీనదీజలంబుల సలిపి పాపవిముక్తుఁడై మేఘుం బెడసిన సూర్యుండువలెఁ దేజరిల్లెను.

### జమదగ్ని సప్తర్షిమండలం బధిష్ఠించుట

రాజా! పరశురాముని యజ్ఞప్రభావంబున జమదగ్ని సజీవుఁడై సప్తర్షిమండలం బధిష్ఠించి యట సప్తమఋషియై నేఁడు నుండును. పరశు రాముఁడును రానున్నమన్వంతరంబున సప్తర్షులలో నొక్కఁడై వెలయును.

ఆమహాత్ముఁ డిప్పుడు దండంబు వదలి మహేంద్రనగరంబున నున్నాఁడు. రాజా! భగవానుఁడు భూభారంబును దొలఁగించుటకై భార్గవకులంబునఁ బరశురాముఁడుగా నవతరించి క్షత్రియక్షయంబు గావించెను. వెలుగుట విలుగుటకొఱకే యన్నట్లు రజస్తమస్సులు వృద్ధియగుట తన్నాశనంబునకే యగు.

## విశ్వామిత్రునిచరిత్రము

రాజేంద్రా! ఋచికునిభార్యకుఁ జరుప్రభావంబున మహాతేజోమూర్తి యైనపుత్రుఁడు విశ్వామిత్రుఁ డనువాఁడు జనించి, రాజయ్యుఁ దీవ్రతపోవిశేషంబున బ్రాహ్మణ్యంబును సాధించెను. వానికి నూటొక్కరు సుతులు గలిగిరి. వారిలో నడిమివానికి మధుశ్ఛందుఁ డను పేరిడిరి. ఆకారణంబున వారెల్లరు మధుశ్ఛందు లనఁ బరగిరి.

ఆకాలంబున హరిశ్చంద్రుఁ డనురాజు యాగంబు సంకల్పించెను. ఆయాగంబునకు మనుష్యుని మేధ్యపశువుగా నిశ్చయించిరి. తదర్థము భార్గవుండైన యజీగర్తునియొక్క కొడుకులలో నడిమివానిని శునశ్శేఫును విలిచి తెచ్చిరి. ఆమఖంబునకు సుర లెంతయుఁ బ్రీతులై మేధ్యార్థము తేఁబడిన శునశ్శేఫునకు వరం బిచ్చిరి. అతఁడు తద్వరఫలంబుగా మేధ్యబాధనుండి తప్పి బ్రతికెను. దేవతలచేత నట్లు రక్షితుం డగుటంజేసి యతఁడు దేవరాతుఁడు నాఁబరఁగెను.

## దేవరాతుఁడు కౌశికుఁ డగుట

విశ్వామిత్రుఁడు దేవరాతుని దనపుత్రునిగా భావించి వెంటఁగొని వచ్చి నిజసుతులను బిలిచి 'సుతులారా! ఈదేవరాతుని నేను పుత్రునిగా గ్రహించితిని. ఇతనిని మీరు మీజ్యేష్ఠభ్రాతగా నెన్నుకొను' మనెను. విశ్వామిత్రునిపుత్రులలో మొదటి యేఁబదిమంది యందులకు నియ్యకొనరైరి. విశ్వామిత్రుఁ డాగ్రహించి 'ఛీ! మ్లేచ్ఛులగుదురుగాక!' యని వారిని శపించెను. తర్వాతఁ దక్కినకొడుకులనుగూడ నతఁ డ్లట్లే యడి నెను. వారు తండ్రిమాటకు బద్ధులై వాని నన్నగా గ్రహించి తమమనస్సు

లైరి. అందులకు విశ్వామిత్రుఁడు సంతసించి 'పుత్రులారా! మీరు నామాటను బాలించి నాకుఁ బుత్రత్వంబును గూర్చితిరి గావున మీరును బుత్రవంతు లగుదురుగాక. ఈదేవరాతుఁడు పుట్టువుంబట్టి భార్గవుం డయ్యు నాకుఁ బుత్రుఁడైనకారణంబునఁ గౌశికుండనఁబడుఁ గాక!' యనెను.

రాజా! విశ్వామిత్రునకు మఱికొందఱుతనయులు అష్టకుఁడు, హారీతుఁడు, జయంతుఁడు, సుమదుఁడు మున్నగువారు గలిగిరి. ఆపుత్రులలోఁ గొందఱు తండ్రిశాపంబునకును గొందఱు వానియనుగ్రహంబునకును బాత్రులగుటంజేసియు భార్గవుఁడైన దేవరాతుఁడు పుత్రుఁడగుటంబట్టియు వారిగోత్రంబు భిన్నప్రవరం బయ్యెను.

### పురూరవవంశక్రమము

పురూరవునకు నాయువు జనించెను. వానికి నహుషుఁడు క్షత్రవృద్ధుఁడు, రజి, రంభుఁడు, అనేనుఁ డనువారు పుట్టిరి. వారిలో క్షత్రవృద్ధునకు సుహోత్రుఁడు గలిగెను. వానికిఁ గాశ్యుఁడు, కుశుఁడు, కృత్స్నమఘుఁ డనువారు గలిగిరి. కృత్స్నమఘునకు శునకుఁడును, వానికి శౌనకుండును జనించిరి. శౌనకుఁడు పెక్కుయజ్ఞంబులుచేసి మహాముని యయ్యెను. కాశ్యునకుఁ గాశియు, వానికి రాష్ట్రుఁడును, వానికి దీర్ఘతపుఁడును, వానికి ధన్వంతరియుఁ బుట్టిరి. ధన్వంతరి హరియంశంబునఁ బ్రభవించి యాయుర్వేదప్రవర్తకుఁడై యజ్ఞభాగార్హుఁ డయ్యెను.

ధన్వంతరికిఁ గేతుమంతుఁడును, వానికి భీమరథుఁడును, వానికి దివోదాసుఁడును, వానికి ద్యుమంతుఁడును బుట్టిరి. ద్యుమంతునకుఁ బ్రతర్దనుఁ డనియు, శత్రుజిత్తనియు, వత్సుఁడనియు, ఋతధ్వజుఁడనియు, కువలయాశ్వుఁ డనియు బిరుదాంకంబులు గలిగెను. వానికి నలర్కాదులు జన్మించిరి. వారిలో నలర్కుఁ డఱువదియాఱువేలేండ్లు యౌవనవంతుఁడుగా నుండి రాజ్యముపాలించి మహాకీర్తిఁ బడసెను. వానికి సన్నతి, వానికి సునీతుఁడు, వానికి సుకేతనుఁడు, వానికి ధర్మకేతువు, వానికి

సత్యకేతువు, వానికి ధృష్టకేతువు, వానికి సుకుమారుఁడు, వానికి వీతిహోత్రుఁడు, వానికి భర్గుఁడు, వానికి భార్గభూమియు జనించిరి. వీరెల్లరుఁ గాశివంశ్యులైన క్షత్రవృద్ధులు.

రంభునకు రభసుఁడు, వానికి గభీరుఁడు, వానికిఁ గృతుఁడు జనించిరి. కృతునివలన విప్రకులంబు ప్రభవించెను. అనేనునకు శుద్ధుఁడు, వానికి శుచి, వానికిఁ ద్రికకుత్తుఁ బుట్టిరి. త్రికకుత్తునకు శాంతరజుఁడు పుట్టి బ్రహ్మజ్ఞానియై చరితార్థుఁడయ్యెను. రజికి మహాపరాక్రమవంతులై పుత్రు లేనూరుగురు గలిగిరి. రజికాలములో సురాసురులకు యుద్ధము పొసఁగెను. దేవతలు రజిసాహాయ్యంబును గోరిరి. అతఁడు రాక్షసులను సంహరించి యింద్రునకు స్వర్గంబు నిచ్చెను. దేవేంద్రుఁడు రజి యొద్దకు వచ్చి 'అయ్యా ! నేను మఱల నింద్రపదవి నొందుట ప్రహ్లాదునకు సమ్మతముగాదు. వానికి నెంతయు భయపడుదు. ఈస్వర్గరాజ్యంబును నీవే యేలుము. రాజ్యమునే గాదు నన్నుఁగూడ నేలు' మని యతనియడుగుల వ్రాలి స్వారాజ్యంబును వానికి మఱల సమర్పించెను.

రాజా ! రజి చన్నంతటఁ స్వారాజ్యంబును దనకు మఱల నిమ్మని యింద్రుఁడు రజిపుత్రులను గోరెను. వారు తత్ప్రణయంబును నిరాకరించి యజ్ఞభాగంబునుగూడ తామే గ్రహింపసాగిరి. అప్పు డింద్రుఁ డొకయభిచారేష్టిని గావించెను. ఆయిష్టిప్రభావంబున రజిపుత్రులకు మనోభ్రంశము గలిగెను. అంతట నింద్రుఁడు వారినెల్లఁ జంపి తద్వంశంబును నిశ్శేషితం బొనర్చెను.

క్షత్రవృద్ధునిమనుమఁడైన కుశునకుఁ బ్రీతియు, వానికి సంజయుఁడును, వానికి జయుఁడును, వానికిఁ గృతుఁడును, వానికి హార్యశ్వనుఁడును, వానికి సహదేవుఁడును, వానికి భీముఁడును, వానికి జయత్సేనుఁడును, వానికి సంకృతియు, వానికి జయుఁడును, వానికి క్షత్రధర్ముఁడును గలిగిరి. వీరెల్లరుఁ క్షత్రవృద్ధవంశ్యరాజులైరి.

## నహుషవంశము

రాజేంద్రా! ఇఁక నహుషునివంశంబును వినుము. నహుషునకు యతి, యయాతి, సంయాతి, యాయాతి, వియతి, ధృతి యనుసుతు లార్గురు; శరీరికి షడింద్రియంబు లట్లు పుట్టిరి. యతి యుక్తవయస్కుఁ డైనంతనే నహుషుఁడు వానికిఁ బట్టముఁగట్ట యత్నించెను. యతి తండ్రికి మ్రొక్కి 'నాయనా! రాజ్యపాలనంబు పరమార్థబోధకుఁ బ్రతిబంధకం బగు. అది నాకు వల'దని చెప్పి జ్ఞానమార్గంబుఁ ద్రొక్కి సిద్ధిఁ గాంచెను.

## యయాతిచరిత్ర

రాజా! నహుషుఁడు కొండొకనాఁడు శచీదేవిని ధర్షించెను. అందులకు నగస్త్యాదు లాగ్రహించి 'స్థానభ్రష్టుఁడవై యజగరం బగుదువుగాక!' అని వానిని శపించిరి. ఆశాపకాలంబు వచ్చి నహుషుఁడ జగరంబయ్యెను. అప్పుడు యయాతి రాజయి తమ్ములనల్వురను బంచి చతుర్దిగ్విజయంబు గావించి, శుక్రునిపుత్త్రికను వృషపర్వునిపుత్త్రిక నిర్వురఁ బరిగ్రహించెను.

రాజేంద్రా! శుక్రుఁడు బ్రహ్మర్షి యగు. యయాతి క్షత్త్రియుం డగు. వారివివాహము ప్రతిలోమవివాహంబు గాదా యని శంకింతువు గాఁబోలు! సంగతి వినుము.

వృషపర్వుఁడు దానవేశ్వరుఁడు. వానికి శర్మిష్ఠ యనుపుత్త్రిక యుండెను. శుక్రుఁడు దానవగురువగుట లోకవిదితము. వానికి దేవయాని యనుకూఁతు రుండెను. ఒకనాఁడు శర్మిష్ఠ దేవయానితోను సఖీజనంబుతోను బురోపవనవిహారంబునకుఁ జని యటఁ బుష్పితలతాతరువులవలన నేత్రంబులకును, కుశపికాదిమధురరుతంబులవలన వీనులకును విందులొనఁగని కొండొకతడవు విహరించి వికచతామరంబులతో మృదుల సైకతంబులతో నొప్పారుచున్న సరోవరమందు జలక్రీడలాడఁ దలంచెను. ఎల్లరుఁ దమతమచీరెలు విచ్చి తీరంబుననుంచి కొలనుజొచ్చి యొండొరు పయి నీళ్లు చల్లుచు మునుఁగుచు లేచుచు విహారోత్సుకలై యుండిరి.

అత్తఱి మహేశ్వరుఁడు పార్వతితోడ వృషభారూఢుఁడై నింగిఁ జను చుండెను. శర్మిష్ఠాదులు పార్వతీమహేశ్వరులనుజూచి లజ్జించి తటాలున నీటినుండి లేచి గబగబ చీరలు గట్టుకొనిరి. ఆవేగిరపాటులో శర్మిష్ఠ ప్రమాదవశంబున దేవయానిచీరెఁ గట్టెను. దేవయాని తనచీరెను శర్మిష్ఠ కట్టినందులకు నలుకవహించి తోడిసఖులఁ జూచి 'చెలులారా! మాకుఁ గట్టనైన చీరె నిది కట్టుట మంత్రపూతపురోడాశంబును గుక్క తాఁకిన ట్లయ్యెను. ఎవరు నిజతపంబున జగంబెల్ల సృజించినట్టి పరమపూరుషునకు సుముఖులై వేదతేజంబును ధరించి లోకమార్గ దీపకు లగుదురో, ఎవరు లోకపతులైన సురేశ్వరులకుమాత్రమేగాక విశ్వాత్ముఁ డైనహరికిఁగూడఁ బూజ్యు లగుదురో, యట్టి బ్రాహ్మణకులమునకు మీఁదుమిక్కిలి భార్గవవంశమునకుఁ జేరుదుము. దీనితండ్రి మాతండ్రికి శిష్యుఁడగు. ఇంతమాత్రంబేనియు విచారింపక శూద్రుఁడు వేదంబును బోలె నీచెడిపె నాచీరెఁగట్టె' నని నిందావచనంబు లాడెను.

శర్మిష్ఠ యాకటుకుఁబల్కులకుఁ బన్నగివలె రోజుచుఁబొప్పూచు నాడుగఱచి 'గయ్యాళీ! కాకులరీతి మాముంగిట దారాడి పొట్టపోసి కొనునట్టి నీగొప్పవృత్తిని మఱచితివా? నీమహదైశ్వర్యంబు నెఱుంగనివా రెవరు? ఈయాత్మస్తుతు లేల?' యని యాదేవయాని నట నొకపాడుబావిలోఁ ద్రోచి వస్త్రంబులు గొని తోడిసఖులతోడ నగరునకుఁ బోయెను.

అత్తఱి యయాతి వేఁటకై యడవికి వచ్చియుండి యాదృచ్ఛికంబుగా నబ్బావిలో దిసమొలనున్న యింతినిఁ జూచి యెంతయు జాలిపడి తనవల్లెవాటును గట్టవైచెను. ఆకాంత యాగుడ్డను గట్టికొనెను. అంత నతఁడు తనచేయూఁత నిచ్చి యాపడఁతిని బావిలోనుండి లేవఁదీసి గట్టు చేర్చెను. ఆకాంతామణి వానియెడఁ బ్రేమబంధురయై 'పురుషాగ్రణీ! నీవు నాపాణిని గ్రహించితివి గావున నాకు భర్తవైతివి. ఒండొరుఁ జెల్లాడ. బావిలోఁబడి దిక్కులేకున్న నాకు నిన్ను భర్తగా దైవంబు

కూర్చెను. శుక్రాచార్యునిపుత్రికను; దేవయాని యని నన్నుఁ బిలుతురు. నీవు క్షత్రియుండవగుట గ్రహింతు. మనవివాహము ప్రతిలోమమై యశాస్త్రంబగునని జంకవలదు. తొల్లి నేను బృహస్పతి సుతుండైన కచుని శపించితిని. నాకు బ్రాహ్మణుఁడు పతి గాకుండునని యతఁడు ప్రతిశాపం బిచ్చెను. నాప్రణయంబుఁ ద్రోయవల' దని పలికెను. యయాతి యావచనంబులు విని 'ఇదంతయు దైవవిధానంబగు. నాచిత్తం బియ్యింతియందుఁ దలిగె' నని తలపోసి 'కళ్యాణీ! నీయిష్టం బగుఁగాక' యని చనెను.

రాజా! దేవయాని యంతట నేడ్చుచుఁ దండ్రియొద్దకుఁ బోయి సంగతియెల్ల వానికి వినిచెను. భార్గవుఁ డాసంగతి విని 'కటా! నేను పురోహితవృత్తి నుండుటంగదా నా కిట్టిచేటు సంభవించె నని తలంచి యావృత్తిని వర్జించి భిక్షావృత్తిని గ్రహించి పుత్రికతోడ నప్పురంబు వదలిపోయి దేవతలకు శుభంబుఁ గోరసాగెను. వృషపర్వుఁ డదివిని హుటాహుటిఁ జని యాగురుపాదంబులఁ బడి ప్రార్థించెను.

రాజా! భార్గవుఁడు దీర్ఘక్రోధి గాఁడు గావున వృషపర్వునకుఁ బ్రీతుఁడై 'దానవేశ్వరా! ఈబిడ్డను విడనాడనోప. దీనికోర్కెఁ దీర్తువేని తిరిగి వత్తు' నని చెప్పెను. వృషపర్వుఁడు దేవయానివంక మఱలి 'అమ్మా! నీకోర్కె యేమో తెలుపుము; 'తప్పక చేయుదు' ననెను. ఆబాలతేని వంకఁ జూచి 'రాజా! నాతండ్రి నన్నెవ్వనికిని యెందుఁబనిచినను శర్మిష్ఠ తనపరిచారికలతోడ నన్ననుసరించి రావలయు' నని కోరెను. వృషపర్వుఁడు రాజ్యశ్రేయంబును గార్యభారంబును బర్యాలోచించి యట్లే యనెను.

అంత భార్గవుఁడు యయాతికి దేవయాని నిచ్చి శర్మిష్ఠను నిజపుత్రికకుఁ బరిచారికఁగా నియమించి 'రాజా! ఎన్నఁడేనియు నీ వీశర్మిష్ఠను బడుకకుఁ గూర్పరా' దని యానతిచ్చెను. యయాతి యామాటకు సమ్మతించి దేవయానీశర్మిష్ఠలతో స్వపురంబున సుఖంబుండెను.

ఒకనాఁడు యయాతి యేకాంతంబుగా నుండఁగా శర్మిష్ఠ వాని కంటఁబడి సంతానార్థినియై వాని నాత్మభర్తగా వరించెను. యయాతి యామాట విని 'ఈకాంతామణి సంతానార్థిని యయ్యెను. భార్గవుని యాన యట్లున్నది. ఏమిసేయనగు' నని తలపోసి విధివిధానం బిట్లున్న దని నిశ్చయించి శర్మిష్ఠమనంబుఁ దీర్చెను.

రాజా ! యయాతికి దేవయానియందు యదువు, తుర్వసుఁ డను పుత్రు లిద్దఱును; శర్మిష్ఠవలన ద్రుహ్యుఁడు, అనుఁడు, పూరుఁడు నను సుతులు ముగ్గురును జనించిరి. శర్మిష్ఠ యట్లు పుత్రవతి యగుట దేవయాని విని యలిగి పుట్టింటికిఁ బోయెను. యయాతి దానివెనుకఁ జని బహువిధంబుల నూరార్పులు పలికి తుదకు నయ్యింతిపాదంబులుగూడ నొత్తెను. ఎందునను దేవయాని కోపం బుడుగదయ్యెను.

ఆలోకశుక్రాచార్యులు నిజపుత్రికవలన నుదంతం బెఱిఁగి 'ఓరీ! స్త్రీవశుఁడవై యానదప్పితివి. నీదియు నొకపౌరుషమా ? శరీరులకు ముదిమివలన వైరూప్యంబగు. అట్టిది యిప్పుడే నీకుఁ గలిగెడుఁగాక' అని శపించెను. యయాతి యాశాపంబును విని 'భార్గవా! నాకు నీసుత యందుఁ గామతృప్తి గలుగదు. నా యీముదిమి నొరున కిచ్చి వాని జవ్వనంబును నేను గైకొని నాకామతృప్తిని బడయునట్లుగా వరంబిమ్మని వేఁడెను. భార్గవుఁ డంగీకరించెను.

రాజేంద్రా ! యయాతి యంత స్వపురంబునకువచ్చి పెద్దకొడుకును యదువును బిలిచి 'వత్సా ! నీతాతవలన నాకు నకాలవార్ధక్యము సంభవించెను. ఈముదిమిని నీవు గ్రహించి నీజవ్వనంబును నా కిమ్ము. నాకు నింతకు విషయభోగేచ్ఛ తీఱదు. కొన్నియేండ్లు రమించి తర్వాత నీజవ్వనంబును నీకిచ్చి నాముదిమిని నేను గొందు' ననెను. ఆమాట యదువు విని 'తండ్రీ ! గ్రామ్యసుఖంబును భోగించినందాఁక పురుషునకు శాంతి గలుగదు. అట్లు భోగించుటకు యావనంబు వలయును. కాఁబట్టి నీకోర్కెఁ దీర్పఁజాలి' ననెను. అట్లే తుర్వసుఁడును ద్రుహ్యుఁడును

బల్కెరి. ఆసంగతి పూరువు విని 'తండ్రీ ! ఎవ్వనివలన నా యీతనువు గలిగెనో వానికి దాని నిచ్చుటకన్నఁ బ్రత్యుపకారంబు గలుగదు. తండ్రి ప్రసన్నుఁడైనచోఁ బుత్రునకు సర్వము సిద్ధించు. తండ్రితలంపు గ్రహించి చేయువాఁ డుత్తమపుత్రుఁడు. తండ్రివలనఁ జెప్పఁబడి చేయు వాఁడు మధ్యముఁడు; అట్లు చేయునప్పుడు శ్రద్ధఁ గొననివాఁ డధముఁడు; తండ్రి చెప్పినను జేయనివాఁడు నీచుఁడు; గాని సుతుఁడు గాఁడు; అంతియగాదు. అతఁడు పితృపురీషప్రాయుఁడగు' అనిచెప్పి వానికిఁ దన యౌవనంబు నిచ్చి వానిముదిమిని దాను గ్రహించెను. యయాతి యంతట మిక్కిలి సంతోషించి దేవయానితోఁడ విషయసుఖంబుల ననుభ వించుచుండెను. ఆయింతియు వానికి మెప్పుఁ గూర్చుచుండెను. అట్లు యయాతి రాజ్యం బేలుచు వివిధయజ్ఞంబుల భగవంతు నారాధించెను.

అట్లుండఁ గొండొకనాఁడు యయాతికిఁ దటాలున నిర్వేదంబు గలిగి 'కటా ! ఆకాశంబున మేఘంబులువోలె జగత్తు భగవానుని యందుఁ బుట్టుచు గిట్టుచు నున్నది. అట్లు తోఁచుట యింద్రియవృత్తి ఫలంబుగాని వేఱుగాదు. ఆవృత్తి యడంగినచోఁ దజ్జనితభావంబు నడంగు. ఇట్టి యశాశ్వతమైనదానికిఁ జిక్కి యాత్మహానిఁ జేసికొంటిని. ఇంతటనైన మేల్కాంతుఁగాక ' అని నిశ్చయించి దేవయానిని బిలిచి యిట్లనియెను.

భార్గవీ ! తొల్లి మేఁకపో తొకటి యడవిలోఁ దిరుగుచు యాదృ చ్ఛికముగా నొకబావియొద్దకుఁబోయి యందుఁబడియున్న యాఁడుమేఁకను జూచి జాలిపడి దానిని దనకొమ్ములతో బావినుండి యెత్తి యొడ్డుచేర్చెను. ఆయాఁడుమేఁక తనకుఁ బ్రాణదానం బొనర్చిన యాపోతును గామిం చెను. ఆరెండు జతఁగూడి విహరింపసాగినవి. తక్కినమేఁకలుగూడ విడువక యాపోతునే యనుసరించెను. ఆపోతు మేఁకలనెల్లఁ దృప్తిపఱచు చుండెను. బావిలోనుండి లేవఁదీసినమేఁక యది సహింపక యలిగి యాపోతును వదలిపోయెను. ఆపోతు దానికై యెంతయుఁ బరితపిం

చుచు వివిధగతుల దాని ననునయించెనుగాని యామేఁకమనస్సు కరఁగ దయ్యెను. అంతట నపోఁతు చేసినతప్పునకుఁ బ్రాయశ్చిత్తంబుగా దాని వృషణంబులను గోసిరి. అది మహాదైన్యమంది మొఱలిడెను. దానిగోడు చూడనేరక దానివృషణంబులను యథాపూర్వము గూర్చిరి. అంత నది సంతసించి బావిలోనుండి తాను లేవనెత్తినమేఁకతో రమించుచు నదే లోకంబుగా నుండెను. ఏండ్లు పూండ్లు గడచెను. ఎన్నఁటికిని దానికిఁ దృప్తికలుగదయ్యెను.

దేవయానీ! నాగతియు నిట్టిదేగదా. మాయకుఁజిక్కి యాత్మ స్వరూపంబును మఱచితి. సుదతీ! కామంబునకు మేరగానరాదు. సృష్టిలో నున్న ధనధాన్యపశుస్త్రీలెల్ల లభించినను కాముకుఁడు సంతృప్తిపడయఁడు. భోగించుకొలఁది కామము నెయ్యిపోసినయగ్నియట్లు పెచ్చుపెరుఁగు చుండునేగాని యెన్నండును శమింపదు. కామకార్యం బేమందువా? కామము రాగద్వేషాదులను గలిగించును. తత్ఫలంబుగా నేను, నీవు, నాది, నీది అనెడి వైషమ్యంబు జనించును. ఆవైషమ్యము సర్వానర్థంబులకు మూలంబగు. కామంబును జయించుట యెట్లందువా? దానికి లోఁబడకయుండుట యొక్కటే యుపాయము. అట్లుచేయుట వైరాగ్యం బనఁబడు. వైరాగ్యంబు వృద్ధియగుకొలఁది రాగద్వేషంబులు సన్నగిలి నశించును. తన్నాశనంబుతోడ సమదృష్టి చొప్పడును. సమదర్శనునకు సుఖంబు స్వతస్సిద్ధము.

కాఁబట్టి సుఖంబును గోరువాఁడు వెంటనే తృష్ణను ద్యజింపవల వలయును. తృష్ణ పోవుటకు నింద్రియంబులు వశపడవలయును. ఆపని యంతసులభముగాదు. మహావిద్వాంసులుగూడ నింద్రియంబులను నిరోధింపలేక సోహమ్మనిరి. అన్నియింద్రియంబులకన్న నుపస్థేంద్రియంబు మహాబలవత్తరము, ఆకారణంబుననే పురుషుఁ డేకాంతంబుగాఁ దల్లితోఁ గాని, సోదరితోఁగాని తుదకు బిడ్డతోఁగాని యుండరా దనిరి.

తలోదరీ ! నీతోడ వేయేండ్లు సమస్తవిషయంబులను సేవించితిని. క్షణక్షణంబునకుఁ దద్విషయంబులయెడఁ గోరికలు పెరుఁగసాగెను. ఒకనాఁటికిని సుంతేనియుఁ దృప్తిగలుగదయ్యెను. ఆసంగతిని బర్యాలోచించి వాస్తవసుఖప్రాప్తికి మార్గంబేమని విమర్శించితిని. కోరికలను వదలుటయే మార్గమని దోఁచెను. అంతటఁ గోరికలను ద్యజించితిని. అట్లు కోరికలను వదలినను మనస్సు నిలుకడఁ జెందకుండెను. మనస్తత్త్వంబును విమర్శించితిని. మనస్సునకు నేదే నొకటి యాలంబనం బుండవలయు ననియు, అది నిరాలంబముగా నుండఁజాలదనియుఁ దేలెను. ఉత్తమమైనయాలంబనం బేది యని యోచించి యవిచ్ఛిన్నమును శాశ్వతానందాత్మకంబునైనవస్తువు పరబ్రహ్మమే యని నిశ్చయించి బ్రహ్మమునందు మనస్సును గూర్చితిని. వెనువెంటనే యహంకారము జాతెను; దానితోడ ద్వంద్వభావంబు నడలెను. సంగమదోషం బెంతవానినైనను గలంచి పూర్వస్థితికిఁ దెచ్చును. ఆదోషంబు తప్ప వలయునన్నచో నేకాంతవాసం బెంతయు ననుకూలించును. తదర్థము వనవాసినై మృగంబులతోఁడఁ జరింపనున్నాఁడ.

దేవయానీ ! విషయసుఖం బెట్టిదైనను దొలుదొల్తఁ గొంత సుఖదాయకంబుగాఁ దోఁచినను క్షణికం బగుటయేగాక దుఃఖపర్యవసాయకం బగు. సంసారము విషయసంగరూపంబుగాని వేఱుగాదు. కావున సంసారేచ్ఛ యెట్టకేలకు నాత్మనాశకరంబగు. ఈసంగతి యెఱింగి స్వానుభవసిద్ధము చేసికొన్నవాఁ డాత్మదర్శి యగు. వానిదృష్టి మఱలఁ దుచ్ఛంబులవంక మఱలదు.' అనిచెప్పి పూరునకు వానియౌవనంబు నిచ్చి తాను ముదిమిని గ్రహించి, ద్రుహ్యునిఁ బూర్వదక్షిణదిగ్దేశంబునకును యదువును దక్షిణదేశంబునకును, తుర్వసును బశ్చిమదేశంబునకును, అనువు నుత్తరదేశంబునకును బాలకులనుగా నియమించి బూరువును సార్వభౌమపదవికి నభిషేకించి యతని ననుసరించి వర్తించునట్లు ద్రుహ్యాదులకుఁ గట్టడిచేసి వనంబునకుఁ బోయెను.

రాజా! యయాతికి నాత్మజ్ఞానం బుదయించినంతనే తత్పూర్వం బెండ్లుపూండ్లుగా నతఁ డనుభవించిన విషయసుఖంబులెల్ల రెక్కలువచ్చిన పక్షులు గూడ్లనట్లు లేచి పఱచెను. అతఁడు క్రమక్రమంబుగా శుద్ధ బ్రహ్మచిత్తుఁడై దివ్యపదంబుఁ జేరెను.

రాజా! యయాతి బోధించిన మేఁకపోతుగాథ దేవయానికిఁ దొలుదొల్త నెగతాళిగాఁ దోఁచెను గాని క్రమక్రమంబుగాఁ దత్త్వార్థంబు దానిమది నాఁటెను. ఆకాంత తదర్థంబును బర్యాలోచించి 'కటా! ప్రాణులసంయోగవియోగంబులు చలిపందిరిలోని బాటసారుల కలయికఁ బోలు. అట్టి మాయావిరచితక్షణికంబులను నమ్మినవారిగతి దుర్గతి కాకమానదు. జగత్తుసంగతి చూడఁగా స్వప్నప్రాప్తార్థముగా నున్నది. ఇప్పటికైనను నాకు నింతమాత్రమేనియుఁ దెలివి గలుగుట భగవదనుగ్రహముగాని వేఱుగాదు' అని తలపోసి సర్వసంగపరిత్యాగంబు గావించి భగవంతునియందుఁ జిత్తంబును హత్తించి యాత్మలింగంబును వదలెను.

రాజేంద్రా! సర్వభూతనివాసుఁడును శాంతుఁడును బ్రహ్మోత్తుఁడును సర్వకర్తయు నైనవాసుదేవుఁ డొక్కఁడే శరణంబు. ఇదే వానికి నమస్కరించుచున్నాను.

### పూరువంశము

రాజేంద్రా! ఏవంశము నీజన్మంబునకుఁ గారణంబగునో, ఏవంశంబు పెక్కండ్రు బ్రహ్మవంశ్యులను రాజర్షులను గాంచి ప్రసిద్ధిఁగాంచెనో యాపూరువంశము సంగతి వినుము.

పూరునకు జనమేజయుఁడు, వానికిఁ బ్రాచిన్వంతుఁడు, వానికిఁ బ్రవిరోధనమన్యుఁడు, వానికిఁ జారుఁడు, వానికి సుద్యుఁడు, వానికి బహుగతుఁడు, వానికి శర్యాతి, వానికి సంయాతి, వానికి రౌద్రాశ్వుఁడును జనించిరి.

రౌద్రాశ్వునకు ఘృతాచి యను నప్సరసయందు ఋతేపుఁడు,కక్షేపుఁడు, సతేపుఁడు, కృతేపుఁడు, జతేపుఁడు, సన్నతేపుఁడు, ధర్మేపుఁడు, సత్యేపుఁడు, వ్రతేపుఁడు, వనేపుఁడు ననుపుత్రులు పదుగురు పుట్టిరి. వారిలో ఋతేపునకు నంతిసారుఁడు జనించెను. వానికి సుమతి, ధ్రువుఁడు, అప్రతిరథుఁ డనువారు ముగ్గురుకొడుకులు పుట్టిరి. అప్రతి రథునకుఁ గణ్వుఁడు, వానికి మేధాతిథి, వానికిఁ బ్రస్కందాదులును జనించి బ్రాహ్మణులైరి. సుమతికి రైభ్యుఁడు, వానికి దుష్యంతుఁడుఁ బుట్టిరి.

## దు ష్యం త చ రి త్ర ము

రాజా ! దుష్యంతుఁడు రాజ్యపాలనంబుఁ జేయుచుఁ గొండొక నాఁడు వేఁటకై యరణ్యంబునకుఁ జని యాదృచ్ఛికంబుగాఁ గణ్వమహర్షి యాశ్రమంబుఁ బ్రవేశించి యందొకకన్యారత్నంబును జూచి 'ఏమి! ఈ సుందరీమణి నిజలావణ్యతేజోవిశేషంబున దిక్కులకుఁ గాంతిఁ గలిగించు చున్నది. ఈపూఁబోఁడి రమాదేవియోగాక స్త్రీరూపంబు దాల్చిన దేవమాయయో కాఁబోలు! ఈనవలామణిని గాంచినంతనే వేఁటతమిం గలిగిన నాయాయాసంబెల్లఁ దీఱినట్లయ్యె. ఈకమలాక్షిసంగతి విచా రింతుఁగాక' అని తలపోసి తనవెంట వచ్చినసేననెల్ల నచటనే వదలి కొలఁదిపరివారంబుతో లోపలకుఁ బోయి యాబాలారత్నంబును డాసి 'యువతీరత్నమా ! ఎవ్వతెవు ? ఎవ్వరిదానవు ? నిర్జనంబైన యియ్యర ణ్యంబున నేమిసేయుదువు ? రాజకన్యకవని భావింతును. కాకున్నచో నాచిత్తంబు నీయందుఁ దగులదు. ఏలయందువా ? పూరువంశజుల హృదయం బెన్నడు నధర్మపరంబుగాదు' దనెను. ఆకన్నె వానిని విని 'అయ్యా ! విశ్వామిత్రునకు మేనకయందు జనించితిని. నన్ను శకుంతల యందురు. నాపుట్టుపూర్వంబును భగవానుఁడు కణ్వమహర్షి యెఱుంగు. ఇదిగో యియ్యాసనం బలంకరించి పూజలంది నీవారాన్నంబు భుజించి నేద తేఱుమగు. ఇంతలో ఋషియు వచ్చు' ననెను.

దుష్యంతుఁ డాపల్కులకు సంతసించి 'కాంతామణీ! కుశికవంశజకు నీకు నిట్టి వినయోపచారసంపద నైజమేగదా! రాజకన్యకలు వరుని గాంధర్వవిధి వరింతురు. నీయెడ నాహృదయంబు లీనమయ్యెను. నా మనంబునేయు' మనిచెప్పి యాసుదతి నొడఁబఱచి దానిని గాంధర్వవివాహంబున గ్రహించి గర్భంబుఁ బ్రసాదించి వఱువాత స్వపురంబునకుఁ దరలెను.

రాజా! శకుంతల కాలక్రమంబునఁ బుత్త్రుని గనెను. వానికిఁ గణ్వమహర్షి రాజోచితవిధానంబున జాతకర్మాదిసంస్కారంబులు గావించి భరతుఁ డని పేరిడెను. ఆబాలుఁడు భగవదంశంబునఁ బుట్టుటం జేసి బాల్యంబుదొట్టి మహావిక్రమోన్నతుఁడై సింహంబులఁబట్టి యాడుచుండెను. కొండొకనాఁడు శకుంతల ఋషివచనంబుమేరకు నబ్బాలుని గొని దుష్యంతునియొద్దకుఁ బోయెను. ఆతఁడా మెను బుత్త్రునిఁ బరిగ్రహింప నొల్లకుండెను. అప్పుడు గగనవాణి సమీపించి 'రాజేంద్రా! తల్లి యనునది సంచివోలె నాధారమాత్రమగు. పుత్త్రుఁడు జనకుని రూపాంతరంబుగాని వేఱుగాఁడు. నీపుత్త్రుని భరింపుము. శకుంతల నవమానింపవలదు. ఈబాలుఁడు నీకు వంశకరుండగు. ఇతనివలన నీకు నరకప్రాప్తి తొలఁగు. ఈనిసువు వాసుదేవాంశజుఁడుగాని యేతన్మాత్రుఁడుగాఁడు. బ్రహ్మణ్యుండును సత్యసంధుఁడును గుణజ్ఞుండు నైన నీకీర్తి వర్ధిల్లు. ఈభరతుని భరింపు' మనెను. దుష్యంతుఁ డట్లే యని వారిని గ్రహించి సంతసించెను.

### భరతునిచరిత్రము

రాజేంద్రా! భరతుఁడు భగవదంశంబున జనించినకారణంబున వానిదక్షిణహస్తతలంబునఁ జక్రరేఖయుఁ బాదంబులందుఁ బద్మకోశరేఖయు నుండెను. భరతుఁడు దుష్యంతునితర్వాత రాజ్యాభిషిక్తుఁడై గంగాతీరంబున నేఁబదియైదుహయమేధంబులను, యమునాతీరంబున డెబ్బదియెనిమిదిహయమేధంబులను దీర్ఘతపుఁ డనువాని పౌరోహిత్యంబ

బునఁ గావించి యపరిమితధనంబు లొసఁగి కీర్తిపాత్రుఁడయ్యెను. మఱియు నతఁడు దీక్షాపూర్వకంబుగా నగ్నిచయం బొనర్చి బ్రాహ్మణులకు నొక్కొక్కనికి నొక్కొక్కద్వంద్వము చొప్పున గోవుల నిచ్చెను. పదుమూఁడు వేలయెనుబదినాలుగోవు లొకద్వంద్వ మగు.

భరతుఁ డట్లు నూటముప్పదిమూఁడుహయమేధంబులు గావించుట నిఖిలరాజలోకంబునకు మహాశ్చర్యకరమయ్యెను. మఱియు నతఁడు తుష్కారంబునందుఁ జతుర్దశనియుతగజంబులను దెల్లనిదంతంబులు గలవానిని హిరణ్మయభూషణంబులతోడ దానం బిచ్చెను. భరతుఁడు గావించిన లోకోత్తరకార్యంబుఁ దత్పూర్వరాజులు గాని తదనంతరరాజులుగాని చేసియెఱుంగరు.

రాజా ! భరతుఁడు దిగ్విజయంబు వెడలి కిరాతహూణయవనాంధ్రవంగశకకష్వాదిరాజులను మఱియు నబ్రహ్మణ్యులైనరాజులను గెలిచెను. తొల్లి యసురులు సురల నోడించి దేవాంగనలను గొనిపోయి రసాతలంబునఁ జెఱపెట్టియుండిరి. భరతుఁడు వారినెల్లఁ జెఱనుండి విడిపించి స్వర్గమందు స్వస్థానంబులఁ జేర్చెను. వానిరాజ్యమందలి ప్రజలకు భూమియు నంతరిక్షంబుఁ దమకై తామే సర్వకామంబులఁ గూర్చుచుండెను. భరతుఁ డట్లిరువదివేలేండ్లు సామ్రాజ్యభోగంబుల ననుభవించి యైహికంబులే గాక ప్రాణంబులుగూడ నస్థిరంబులని తలంచి యుపరతిఁ గాంచెను.

## భ ర తు ని సం తా న ము

భరతుఁడు విదర్భరాజతనయలను మువ్వురఁ బెండ్లాడెను. అతఁ డప్పుడప్పు డాభార్యలతో 'నాకుఁ బుట్టినపుత్రులసదృశు లనుచుండెను.ఆమాట యాఱాచకన్నియలు మదిలో నుంచి తాము గన్నకొడుకులసదృశులుగా రేని వారియందు వ్యభిచారంబును భర్త శంకించునేమో యని భావించి వారికిఁ బుట్టినబిడ్డలను దల్లులే చేసేతలఁ జంపుచుండిరి. ఆకారణంబున భరతునివంశము తుదిముట్టునట్లయ్యెను. అతఁ డంతటఁ బుత్రార్థముమరుత్స్తోమం బనెడియజ్ఞముఁ జేసి యజ్ఞేశ్వరు నారాధించెను.

మరుత్తుడు భరతునకు సంతసించి భరద్వాజుని వానికి దత్తపుత్త్రునిగా నిచ్చిరి.

### భరద్వాజుఁడు

రాజేంద్రా! భరద్వాజుఁ డెవఁ డందువా? పూర్వము బృహస్పతి వానిభ్రాతృభార్యయైన మమతను గర్భవతిగా నున్నదానిని గామించి గ్రామ్యధర్మంబునకుఁ జిక్కెను. అప్పు డాయింతిగర్భములో నున్న శిశు వెంతవారించినను వినక సురగురుఁ డాబిడ్డను శపించి తనవీర్యంబు నక్కాంతాగర్భంబున నుంచెను. ఆనెలఁతకుఁ గుమారుఁడు జనించెను. అంత నయ్యింతి యాపుత్త్రకుని దా నుగ్రహించినచోఁ దనయందు నిజభర్త జారత్వంబును శంకించునని వెఱచి యానిసువును ద్యజించిపోవఁ దలంచెను. బృహస్పతి యది గ్రహించి 'మూఁఢా! క్షేత్రవీర్యంబుల రెంటిసంయోగంబున నితఁడు పుట్టెను గావున ద్వాజుఁ డనవొప్పు. వీనిని భరింపు' మనెను. మమత యామాట విని 'ఇతఁడు మనయుభయులకు జనించె నంటివి కాఁబట్టి నీవే వీనిని భరింపు' మనెను. అట్లు వారు పరస్పరము వివాదపడుట మరుత్తులు చూచి యాబిడ్డను దెచ్చి పెంచి భరతునకుఁ దద్వంశంబును నిలుపుటకై దత్తపుత్త్రుని జేసిరి.

### భరతవంశము

భరతవంశము వితథమైనతర్వాత నప్పుత్త్రకుఁడు వచ్చుటం జేసి వానిని వితథుఁ డనిరి. మఱియు నతఁడు ద్వాజుఁడై మరుత్తుచేత భరింపఁబడుటం జేసి భరద్వాజుఁడనియుఁ బేర్కొనఁబడెను. వానికి మన్యుఁడు జనించెను. మన్యునకు బృహత్క్షత్త్రుఁడు, జయుఁడుఁ మహావీర్యుఁడు, నరుఁడు, గర్గుఁ డనువారు పుట్టిరి. నరునకు సంస్కృతి జనించెను. వానికి గురుఁడు రంతిదేవుఁ డనువారు గలిగిరి.

### రంతిదేవుఁడు

పరీక్షిన్నరేంద్రా! రంతిదేవునిచరిత్ర మహాద్భుతము. వానిం గూర్చి చెప్పఁబూనినచో నేండ్లుఁబూండ్లుపట్టును. నిదర్శనార్థం బొక్కటి

చెప్పెద వినుము. ఇది సంపాదింపవలయుననిగాని యిది దాఁపవలయు ననిగాని కలలోఁగూడ నతఁడు తలంపడు. ఏలయందువా ? సర్వముఁ బ్రారబ్ధాధీనమని వానినిశ్చయము. వానిదేహాధారణం బెట్లందువా ? ఏది యెప్పుడు దైవోపలబ్ధం బగునో దానిని భుజించి తృప్తిచెందును. ధనార్జనరక్షణభావంబులు లేమింజేసి యతఁ డెల్లప్పుడు నిష్కించనుఁడై యుండెను. అతఁడేగాఁడు; వానికుటుంబముగూడ నిరంతరము క్లేశము లనే వరించుచుండెను.

### రంతి దేవుని పరీక్షించుట

ఒకనాఁడు వానికి ఘృతపాయససంయావతోయంబులు లభించెను. అతఁ డట్లు ప్రాప్తమైనదానిని గుటుంబసహితంబుగా భుజింపనుండెను. అత్తఱి క్షుత్పిపాసాతురుఁ డొకద్విజుఁడు కేవలదుర్బలత్వంబున వడంకుచు వానికి నతిథి యయ్యెను. రంతిదేవుఁ డాయతిథిని మహాదరముతోఁ బూజించి 'అహో ! భగవానుఁ డెల్లప్రాణులందుఁ గలఁడు. ఈరూపంబున నేఁడు నాకు నతిథి యయ్యెను. ఇంతకన్న భాగ్యమేమి గలదు' అని భావించి తనకు లభించినదానిని వానికిఁ బెట్టెను. అయ్యతిథి దానిని గుడిచిపోయెను.

అంతట రంతిదేవుఁడు శేషించినదానిని గుటుంబమునకుఁ బంచి కుడువనుండెను. అంతలో నొకశూద్రుఁడు 'హరి, హరి' యనుచు నన్నంబుఁ బెట్టుమనివచ్చెను. శేషాన్నంబును మొదట వానికిబెట్టి మిగిలినదానిని రంతిదేవుఁడు కుటుంబసహితముగా భుజింపయత్నించెను. అంతలో నొకఁడు కుక్కలను వెంటఁగొని 'రాజేంద్రా ! నేనును నా కుక్కలు నాఁకటఁ జావనున్నాము. ఆహారం బిడు'మని యడిగెను. రంతిదేవుఁడు మిగిలినయన్నంబును వానికి వానికుక్కలకుఁబెట్టి 'సర్వము హరిమయ'మ్మని వానికి మ్రొక్కెను. అతఁడు వానికుక్కలతోడ నయ్యన్నంబును దినిపోయెను.

రాజేంద్రా! నాఁడు వానికి గ్రుక్కెఁడునీరుమాత్రము మిగిలెను. అతఁడానీరే పదివేలని త్రావనుండెను. అంతలోఁ జండాలుఁ డొకఁడు వచ్చి 'రాజా! దాహము, గ్రుక్కెఁడు నీ రిమ్మని యరచెను. రంతిదేవుఁడు వానిదైన్యంబునకు నెంతయు జాలిపడి 'దేవా! కొందఱు అణిమాదిసిద్ధులనుగోరుదురు. కొందఱు మోక్షంబును గోరుదురు. అవియెవ్వియు నేనొల్ల. సకలభూతంబులకు సుఖంబునుగూర్చి తద్భూతంబులదుఃఖంబును నాకు ననుగ్రహింపు' మని లోలోన ధ్యానించి 'అయ్యో! ఇతఁడు పిపాసాతురుఁడై చావనున్నాఁడు. స్వప్రాణంబులను ధారవోసియేని దీనులను రక్షించుటకన్న వేఱొండుధర్మంబుగాని పుణ్యంబుగాని గలుగదు. వీనిప్రాణంబును గాపాడుదునేని నాయాఁకలిదప్పులేగాక నాశరీరశ్రమభ్రమంబులును దైన్యక్లమంబులును శోకమోహవిషాదంబులును సమసిపోవు' నని నిశ్చయించి తాను చావనుండియు నాచండాలునకు నయ్యుదకం బిచ్చెను. ఆచండాలుఁ డానీరు ద్రావి లేచినప్రాణంబులు మఱలవచ్చినట్లయి మహాసంతోషముతోఁ జనెను.

రాజేంద్రా! రంతిదేవునకుఁ దర్వాత నలువదిదినంబులు పుడిసెడు నీరుగూడఁ బ్రాపింపకుండెను. అట్టి దురవస్థ సంప్రాప్తమైనను సుంతయు నతఁడు చలింపఁడాయెను. అప్పుడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురు వానికడకువచ్చి 'రంతిదేవా! నీమనోబలంబును నీసమదృష్టిని బరీక్షించుటకై యిట్లుచేసితిమి. నీకెంతయుఁ బ్రీతియయ్యె' ననిరి. రంతిదేవుఁడు వారిని బూజించి నిస్సంగుఁడు నిస్పృహుఁడు గావున నెద్దియు వారిని గోరక తదేకభక్తి నుండెను. అతఁ డట్లు నిష్కాముఁడై చిత్తంబు నీశ్వరార్పణం బొనర్చినఫలంబుగా గుణమయమైనమాయ స్వప్నంబు వోలెఁ దనంతటతానే తొలంగెను. ఆతఁడు కృతార్థుఁ డయ్యెను.

రాజేంద్రా! మఱియొకవిశేషము. రంతిదేవునిసంసర్గంబునఁజేసి తదనుచరులెల్లరుఁ భగవన్ముఖులై యోగసిద్ధిం గాంచి కృతార్థులైరి. సంసర్గబలం బెంతో యూహింపుము. రాజా! సత్సంసర్గంబునఁ [illegible]

బెట్లో దుస్సంసర్గంబున నశ్లేగిడుగలుగు. ఈరహస్యం బెఱింగి సత్సంసర్గం బును బుధు లంతగాఁ బ్రబోధింతురు.

### గర్గ మహావీర్యాదుల వంశములు

రాజా! గర్గునకు శినియు, వానికిగార్గ్యుఁడు జనించిరి. ఆవంశము బ్రహ్మకుల మయ్యెను. మహావీర్యునకుఁ ద్రయ్యారుణి, కవి, పుష్కరారుణి యను కుమారులు పుట్టి వారును బ్రాహ్మణులైరి. బృహత్క్షత్త్రునకు సుహోత్రరుఁడు, వానికి హస్తి జనించెను. హస్తి వానిపేర హస్తినా పురంబును నిర్మించెను. హస్తికి అజమీఢుఁడు, ద్విమీఢుఁడు, పురు మీఢుఁడను వారుపుట్టిరి. అజమీఢునకు నొక్కభార్యవలనఁ బ్రియమే ధాదులు జనించి బ్రాహ్మణులైరి; వేఱొక్కభార్యవలన బృహదిషుఁడు, వానికిబృహద్ధనుఁడు, వానికిబృహత్కాయుఁడు, వానికిజయద్రథుఁడు, వానికివిశ్వజిత్తు, వానికిసేనజిత్తు గలిగిరి. సేనజిత్తునకు రుచిరాశ్వుఁడు, దృఢహనుఁడు, కాశ్యుఁడు, వత్సుఁడు ననువారు పుట్టిరి. రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుఁడు, వానికిఁబృథుసేనుఁడు, వానికిఁబారుఁడు, వానికి నీపుఁడు జనించెను. నీపునకుఁ బెక్కండ్రు భార్యలుండిరి. ఆభార్యలవలన వానికి నూర్గురు కొడుకులును శుకకన్యయైన కృత్వియనుపత్ని యందు బ్రహ్మదత్తుఁ డనువాఁడును బుట్టిరి. బ్రహ్మదత్తుఁడు సరస్వతి యనుదానివలన విష్వక్సేనుఁ డనువానిని బడసెను. అతఁడు జైగీషవ్యుని యుపదేశంబునంది యోగీశ్వరుఁడై యోగతంత్రంబును రచించెను. విష్వక్సేనునకు నుదక్సేనుఁడును భల్లాదులును జనించి బృహదిషుకులంబునకు మూలమైరి.

ద్విమీఢునకు యవీనరుఁడు, వానికిఁ గృతిమంతుఁడు, వానికి సత్యధృతి, వానికి దృఢనేమి, వానికి సుపార్శ్వుఁడు, వానికి సుమతి, వానికి సన్నతిమంతుఁడు, వానికిఁ గృతి జనించిరి. కృతి హిరణ్యనాభుని తోడ యోగవిద్య నభ్యసించి ప్రాచ్యసామసంహితాషట్కంబు గానము చేసి ప్రసిద్ధుఁడయ్యెను. కృతికి నుగ్రాయుధుఁడు, వానికి క్షేమ్యుఁడు, వానికి సువీరుఁడు, వానికిఁ బురంజయుఁడు, వానికి బహురథుఁడుఁ జనించిరి. పురుమీఢునకు సంతానంబు గలుగదు.

అజమీఢునకు నళినియను వేఱొకభార్యవలన నీలుఁడు పుట్టెను. వానికి శాంతి, వానికి సుశాంతి, వానికిఁ బురుజుఁడు, వానికి నర్కుఁడు, వానికి భర్మ్యాశ్వుఁడు, గలిగిరి. భర్మ్యాశ్వునకు ముద్గలుఁడు, యవీనరుఁడు, బృహదిషుఁడు, కాంపిల్యుఁడు సృంజయుఁ డనువారు జనించిరి. ఆపంచ సుతులు పంచవిషయంబులకుఁ జాలుదురని భర్మ్యాశ్వుఁ డన్నందున నయ్యైవురను బాంచాలు రనిరి. వారిలో ముద్గలునిసంతానంబు బ్రాహ్మణ మయం బయ్యెను. మఱియు ముద్గలునివలన మౌద్గలగోత్రం బేర్పడెను.

ముద్గలునకు దివోదాసుఁడు నహల్యయుఁ గలిగిరి. అహల్యను గౌతముఁడు గ్రహించెను. వానికి శతానందుఁడు వానికి సత్యధృతి జనించెను. శత్యధృతి ధనుర్వేదవిశారదుఁ డయ్యెను. వానికి శరద్వంతుఁడు పుట్టెను. ఆశరద్వంతుఁడు కొండొకనాఁ డుర్వశినిఁ జూచి కామి యయ్యెను. కామోద్రేకంబున వానికి రేతస్స్ఖలనం బొదవెను. అత్తఱి శంతనుఁడు మృగయావినోదియై యటఁ జరించుచుండి శరద్వంతుని వీర్యంబును శరస్తంభంబునందు సంతరించెను. అందుండి కృపాచార్యుఁ డును కృపియుఁ బ్రభవించిరి. కృపిని ద్రోణాచార్యుఁడు గ్రహించెను.

దివోదాసునకు మిత్రాయువు, వానికిఁ జ్యవనుఁడు, వానికి సుదాముఁడు, వానికి సహదేవుఁడు, వానికి జంతువుఁ బుట్టిరి. జంతువు నూర్గురుకొడుకులను గనెను. వారిలోఁ గడపటివాఁడు పృషదునకు ద్రుపదుఁడు జనించెను. ద్రుపదునకు ద్రౌపదియు, ధృష్టద్యుమ్నాదులు గలిగిరి. ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతుఁడు పుట్టెను. ద్రుపదాదులు పాంచాలు రనఁబడిరి.

అజమీఢునకు ఋక్షుఁడను మఱియొకకొడు కుండెను. వానికి సంవర్ణుఁడు, వానికిఁ గురువుఁ గలిగిరి. కురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నుఁడు, నిషధుఁడు పుట్టిరి. పరీక్షిత్తునకు సంతానము గలుగదు. సుధనువునకు సుహోత్రుఁడు, వానికిఁ గ్నతి, వానికి నుపరిచరవసువు

జనించిరి. ఆవసువునకు బృహద్రథుఁడు కుసుంభుఁడు మత్స్యుఁడు ప్రత్యగ్రుఁడు చేదిషుఁడు మున్నగువారు జనించి చేదిదేశాధిపతులైరి.

బృహద్రథునకు వేఱొకభార్యయందుఁ గుశాగ్రుఁడు, వానికి ఋషభుఁడు, వానికి సత్యహితుఁడు, వానికిఁ బుష్పవంతుఁడు, వానికి జహ్నుఁడును; మఱియొక భార్యయందు రెండుశకలంబులును బుట్టెను. ఆయింతి యాఖండంబులను ద్యజించెను. ఆతునియలను జర యనునది తీసికొనిపోయి యొకటిగాఁ గూర్చెను. అట్లుచేర్చినంతనే యామూర్తి పురుషాకారంబును దాల్చి జీవతంతుఁ డయ్యెను. అతఁడు జరచేత సంధింపఁబడి జీవించుటంజేసి జరాసంధుఁ డనుపేరఁ బరఁగెను. వానికి సహదేవుఁడు వానికి సోమాపి వానికి శ్రుతశ్రవుఁడు గలిగిరి.

రాజా! పరీక్షిత్తుతమ్ముఁడైన జహ్నునకు సురథుఁడు, వానికి విదూరథుఁడు, వానికి సార్వభౌముఁడు, వానికి జయత్సేనుఁడు, వానికి రథికుఁడు, వానికి అయుతాయువు, వానికి క్రోధనుఁడు, వానికి దేవాతిథి, వానికి ఋక్షుఁడు, వానికి భీమసేనుఁడు, వానికిఁ బ్రతీపుఁడు గలిగిరి. ప్రతీపునకు దేవాపి, శంతనుఁడు, బాహ్లికుఁడు పుట్టిరి. దేవాపి తండ్రిరాజ్యంబును ద్యజించి వనమునకుఁ బోయెను. అంతట శంతనుఁడు రాజయ్యెను. ఆశంతనుఁడు పూర్వజన్మంబున మహాభిషుఁ డనుపేరఁ బరఁగెను. శంతనుఁడు వానిచేతితో దాఁకినంతనే యెట్టిముదుసలియు నవయౌవనవంతుఁడును బరమశాంతుఁడు నగుచుండెను. ఆకారణంబున వానికి శంతనుఁ డనుపేరు వచ్చెను.

శంతనుఁడు రాజ్యమేలుచుండఁగాఁ గొండొకనాఁడు వర్షము తొమ్మిదియేండ్లపర్యంతముఁ గురియకుండెను. అప్పుడు బ్రాహ్మణులు శంతనునొద్దకువచ్చి 'రాజా! రాజ్యము జ్యేష్ఠపుత్రునిదగు. అతఁడు జీవించియుండఁగా వానిరాజ్యంబును నీవు గ్రహించితివి. ఆకారణంబున నీవు పరివేత్తకు సాటియగుదువు. అట్టివానిపాలనంబున వానలు గురియ వనిరి. శంతనుఁ డంతట భయములుదేరి వనవనాంతరంబులు వెదకి యెట్టె

కేళకు దేవాపిని గాంచి సంగతి తెలిపి రాజ్యంబును గ్రహింపుమని ప్రార్థించెను. శంతనుఁ డట్లు పోవుటకుఁబూర్వమే వానిమంత్రి కొందఱు బ్రాహ్మణులను దేవాపియొద్దకుఁ బంపెను. వారట్లుపోయి దేవాపికిఁ బాషండమతంబును బోధించిరి. ఆ కారణంబున నతఁడు మనోభ్రాంతి నొంది వేదనిందఁ గావింపసాగెను. ఆసంగతి వెల్లడియయ్యెను. వేద నిందకుఁడు రాజ్యార్హుఁడు గాఁడని జనులు దేవాపిని నిగ్రహించి శంతనుఁడే న్యాయమైన ప్రభువని నిశ్చయించిరి. అట్లు శంతనునిదోషంబు పరిహృత మయ్యెను. వానలు యథారీతిఁ గురిసెను.

రాజేంద్రా! దేవాపి యోగనిష్ఠుఁడై యిప్పుడు కలాపగ్రామంబున నున్నాఁడు. కలియుగము సమాప్తమై కృతయుగంబు ప్రారంభించునప్పు డతఁడు ప్రక్షీణమైనసోమవంశంబు నుద్ధరించును.

బాహ్లీకునకు సోమదత్తుఁడు, వానికి భూరి, భూరిశ్రవుఁడు, శలుఁడు గలిగిరి. శంతనునకు గంగానదివలన భీష్ముఁడుపుట్టి వీరయోధశిఖామణియై భార్గవుని యుద్ధమందు మెప్పించెను. మఱియు భీష్ముఁడు మహావిద్వాంసుఁడును ధర్మతత్త్వవేత్తయుఁ బరమభాగవతుఁడునై శాశ్వతకీర్తిఁబడసెను. శంతనుఁడు సత్యవతి యనుదానిని బెండ్లాడి దానివలనఁ జిత్రాంగద విచిత్రవీర్యులనుకొడుకుల నిరువురఁ బడసెను. చిత్రాంగదుఁడు చిత్రాంగదుఁ డను గంధర్వునితోఁ బోరి మడిసెను.

అత్తఱిఁ గాశీరాజునకు నంబిక నంబాలిక యనుపుత్రిక లిరువు రుండిరి. వారికి స్వయంవరవివాహము చాటిరి. భీష్ముఁడుపోయి యాకన్యలనిద్దఱఁ దెచ్చి విచిత్రవీర్యునకుఁ బెండ్లిచేసెను. అతఁడు వారితోడిదే లోకంబుగానుండి రోగపీడితుఁడై నిస్సంతానంబుగాఁ గాలధర్మ మొందెను. అంతలో వారివంశంబు లుప్తముగా నుండెను. అప్పుడు సత్యవతి తనపుత్రుఁడైన బాదరాయణుని రప్పించి వంశంబు నిలుపఁగోరి విచిత్రవీర్యునిభార్యలైన యంబికాంబాలికలను నియోగించెను. బాద

రాయణునకు వారిక్షేత్రంబులందు ధృతరాష్ట్రుఁడు, పాండువుఁ విదురుఁడు జనించిరి.

రాజేంద్రా! బాదరాయణుఁడు సత్యవతికిఁ బుత్త్రుఁ డనుట యెట్లందువా? సత్యవతి శంతనుని వివాహమాడక పూర్వము పరాశర మునీంద్రునివలన భగవదంశసంభూతుఁడైన నాతండ్రిని బాదరాయణుని గనెను. ఆమహర్షి వేదరక్షకుఁ డగుటయేగాక పరమగుహ్యంబైన యీపురాణంబును రచించి పైలాదులు శిష్యులెందఱో యున్నను నాకు మాత్రమే బోధించెను.

ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనాదులు నూర్గురు కొడుకులును దశ్శలయను పుత్రికయు జనించిరి. పాండురాజునకుఁ గుంతి, మాద్రియనుభార్య లుండిరి. అతఁడు మునిశాపవసంబున మైథున క్రియకు దూరుఁడగుటం వానికి వారివలన సంతానంబు గలుగుటకు వీలులేకుండెను. కుంతి యనుభార్య పతినియోగంబున ధర్మదేవత నుపాసించి యుధిష్ఠిరుని, మరుత్తు నుపాసించి భీమసేనుని, సురేంద్రు నుపాసించి యర్జునుని బడసెను. మాద్రియు నశ్వి యశ్వినుల నుపాసించి నకుల సహదేవులను గాంచెను. ఆయేవురు ద్రౌపదిని ధర్మపత్నినిగా గ్రహించిరి. ద్రౌపది యుధిష్ఠురునివలనఁ బ్రతివింధ్యుని, భీమసేనునివలన శ్రుతసేనుని, అర్జుననివలన శ్రుతకీర్తిని, నకులునివలన శతానీకుని, సహదేవునివలన శ్రుతకర్మని బడసెను.

యుధిష్ఠిరుఁడు పౌరవతి యనుభార్యయందు దేవకుని గాంచెను. భీముఁడు హిడింబవలన ఘటోత్కచుకుని, గ్వాళి యనుదానివలన సర్వగతుఁ డనువానిని బడసెను. నకులుఁడు కరేణుమతియందు నిరమిత్రుని, సహదేవుఁడు పార్వతియైన విజయయందు సుహోదరుని గాంచిరి. అర్జునుఁడు ఉలూపి యనునాగకన్యకవలన నిరావంతుని, మణలూరుపతికూంతురైన చిత్రాంగదవలన బభ్రువాహనుని, శ్రీకృష్ణునిసోదరియైన సుభద్రవలన నభిమన్యుని బడసెను. అభిమన్యుఁడు బాల్యమందే శస్త్రాస్త్ర

విద్యగఱచి యతిరథులకు నతిరథుఁడై వీరశిఖామణి యన నొప్పుచు నుత్తర యనుకన్యను నీతల్లిని వివాహమాడెను. ఆకాంతామణి గర్భవతిగానుండఁగాఁ గురుపాండవయుద్ధము పొసఁగెను. ఆయుద్ధములో నభిమన్యుఁడు వీరస్వర్గమందెను.

ఉభయపక్షములవారుఁ బదునెనిమిది యక్షౌహిణీసంఖ్యాకులారణంబున నశించిరి. కౌరవులవంశంబున ధార్తరాష్ట్రుండునుఁ బాండవవంశంబున బంచపాండవులు శేషించిరి. పాండవులయెడ ద్రోణునిపుత్త్రుఁడశ్వత్థామ పగఁబూని పాండవవంశంబు నిర్వంశం బగునట్లు బ్రహ్మాస్త్రంబును బ్రయోగించెను. అప్పుడు నీవు నీతల్లియైన యుత్తరయొక్క గర్భమం దుంటివి. శ్రీకృష్ణభగవానుఁ డాయస్త్రంబునుండి నిన్ను రక్షించెను. నీవు సుఖముగా జనించితివి. నీకు జనమేజయుఁడును శ్రుతసేనుఁడును భీమసేనుఁడును ఉగ్రసేనుఁడును గలిగిరి.

## భవిష్యద్రాజక్రమము

రాజేంద్రా! నీవంశక్రమంబును దెలిపితిని. రాఁబోవురాజుల వంశక్రమంబును సూచింతు వినుము.

నీకుఁ దక్షకునివలన మృతిగలుగు. నీయనంతరము నీజ్యేష్ఠపుత్త్రుఁడు జనమేజయుఁడు రాజయి నీమృతికిఁ గారణంబైన తక్షకునిఁజేసి వానికులంబునెడఁ బగఁబూని సర్పయాగంబు గావించును. ఆయాగమందుఁ బెక్కుసర్పంబులు హోమకుండాగ్నింబడి దగ్ధములై నశించును. అంత నతఁడు కావషేయుఁడైన మరు వసువానిని బురోహితునిగా వరించి హయమేధయాగంబుచేసి దిగ్విజయుఁడై తర్వాత పెక్కుయజ్ఞంబు లొనరించును.

జనమేజయునకు శతానీకుఁ డనువాఁడు జనించి కృపాచార్యునితోడ నస్త్రవిద్యను యాజ్ఞవల్క్యునితోడ వేదంబును బఠించి క్రియాజ్ఞానసంపన్నుఁడై శౌనకుని గొలిచి యాత్మజ్ఞానంబుఁ బడయును. శతానీకునకు సహస్రానీకుఁడు, వానికి నశ్వమేధజుఁడు, వానికి నసీమకృష్ణుఁడు,

వానికి నిచకుఁడు జనింతురు. అత్తఱి హస్తినాపురంబు గంగాప్రవాహం బున మునుఁగు. నిచకుఁ డంతటఁ గౌశాంబీపురంబును నివాసంబుగాఁ జేసికొనును.

నిచకునకు సుప్తుఁడు, వానికిఁ జిత్రరథుఁడు, వానికి శుచిరథుఁడు, వానికి వృష్టిమంతుఁడు, వానికి సుషేణుఁడు, వానికి సుపీతుఁడు, వానికి నృచక్షుఁడు, వానికి సుఖానిలుఁడు, వానికిఁ బరిప్లవుఁడు, వానికి సునయుఁడు, వానికి మేధావి, వానికి నృపంజయుఁడు, వానికి దూర్వుఁడు, వానికి నిమి, వానికి బృహద్రథుఁడు, వానికి సుదాసుఁడు, వానికి శతానీకుఁడు, వానికి దుర్దమనుఁడు, వానికి విహీనరుఁడు, వానికి దండపాణి, వానికి మిత్రుఁడు, వానికి క్షేముఁడు బుట్టుదురు. రాజేంద్రా! బ్రహ్మక్షత్రమూలంబును దేవర్షిమాన్యంబునై వెలసిన యీసోమవంశీయ వంశంబు కలియుగంబున క్షేమకునితో నంతరించు.

## మా గ ధ వం శ ము

తర్వాత మాగధులు వత్తురు. ఆవంశక్రమంబు వినుము. మాగధులలో జరాసంధునిసంగతిఁ జెప్పితిని. వానికి సహదేవుఁడు, వానికి మార్జారి, వానికి శ్రుతశ్రవుఁడు, వానికి అయుతాయువు, వానికి నరమిత్రుఁడు, వానికి సునక్షత్రుఁడు, వానికి బృహత్క్షత్రుఁడు, వానికిఁ గర్మజిత్తు, వానికి శ్రుతంజయుఁడు, వానికి విప్రుఁడు, వానికి శుచి, వానికి క్షేముఁడు, వానికి సువ్రతుఁడు, వానికి ధర్మనేత్రుఁడు, వానికి శ్రుతుఁడు, వానికి దృఢసేనుఁడు, వానికి సుమతి, వానికి సుబలుఁడు, వానికి సునీతుఁడు, వానికి సత్యజిత్తు, వానికిఁ బురంజయుఁడు జనింతురు. ఈరాజుల పరిపాలనంబు వేయేండ్లు జరుగును. ఇది పూరువంశ వృత్తాంతము.

## అ ను వం శ క్ర మ ము

పరీక్షిన్నరేంద్రా! యయాతిపుత్త్రులలో అను వసుహాఁ ద్రొక్కఁ దన్న దెలిపితిని. అనువునకు సభానరుఁడు, చక్షుఁడు, పరోక్షుఁ డను మువ్వురు

జనించిరి. సభానరునకుఁ గాలనాథుఁడు, వానికి సృంజయుఁడు, వానికిఁ బురంజయుఁడు, వానికి జనమేజయుఁడు, వానికి మహాశాలుఁడు, వానికి మహామనుఁడుఁ గలిగెను. మహామనునకు ఉశీనరుఁడు, తితిక్షుఁడు పుట్టిరి. ఉశీనరునకు శిబి, వనుఁడు, క్రిమి, దర్పుఁడు జనించిరి. వారిలో శిబికి వృషపర్వుఁడు, సువీరుఁడు, మద్రుఁడు, కేకయుఁడుఁ బుట్టిరి. తితిక్షునకు రుశద్రథుఁడు, వానికి హేముఁడు, వానికి సుతపుఁడు, వానికి బలి గలిగెను. బలికి సంతానంబు గలుగదు. అతని క్షేత్రంబున దీర్ఘతపుం డనువానికి అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్ర, ఆంధ్రులనువా రార్గురు పుట్టిరి. వారి పేరఁ దత్తదేశంబు లేర్పడెను.

అంగునకు అనుమంతుఁడు, వానికి దివిరథుఁడు, వానికిఁ జిత్రరథుఁడు జనించెను. చిత్రరథుఁడు మహాధర్మరతుఁడై ప్రసిద్ధికెక్కెను. అతనికి రోమపాదుఁ డనునామాంతరంబుగూడ నుండెను. రోమపాదుఁడు దశరథునకుఁ బరమమిత్రుఁడుగా నుండి స్వసంతానము లేమికతన సఖుఁడైన దశరథుని పుత్రికను శాంత యనుదానిని బుత్రికగా గ్రహించెను.

రాజా! ఆరోమపాదుని దేశంబున వానలు కురియకుండెను. ఋశ్యశృంగుఁడు వచ్చినయెడల వానగురియు ననిరి. రోమపాదుఁడు ఋశ్యశృంగుని దోడితెచ్చుటకై వేశ్యలను బంపెను. వారుపోయి తమనాట్యసంగీతవిభ్రమాలింగనంబుల ఋశ్యశృంగుని వశపఱచికొని వానినిఁ దమదేశంబునకుఁ గొనివచ్చిరి. అతఁడు వచ్చినంతనే వానలు గురిసెను. రోమపాదుఁడు తనపుత్రికను శాంతను ఋశ్యశృంగున కిచ్చి పెండ్లి చేసెను. ఆఋశ్యశృంగుని దశరథుఁడు తనరాజ్యంబునకుఁ దోడి తెచ్చి వానిమూలంబునఁ బుత్రకామేష్టి గావించి సుతులను బడసెను.

తర్వాత రోమపాదునకుఁ జతురంగుఁడు జనించెను. చతురంగునకుఁ బృథులాక్షుఁడు పుట్టెను. వానికి బృహద్రథుఁడు బృహత్కర్ముఁడు బృహద్భానుఁ డనువారు జనించిరి. బృహద్రథునకు బృహన్మనస్సు, వానికి జయద్రథుఁడు, వానికి విజయుఁడు జనించెను. విజయునకు సంభూతి

యందు ధృతి, వానికి ధృతవ్రతుఁడు, వానికి సత్కర్ముఁడు వానికి నతి రథుఁడు నుదయించెను.

అతిరథుఁడు కొండొకనాఁడు గంగాతీరంబున విహరించుచుండఁగా నయ్యేటిలో నొకపెట్టె కొట్టుకొనివచ్చెను. అతఁ డాపెట్టెను బట్టికొని విచ్చిచూడఁగా నందొకబాలుఁ డుండెను. అతఁ డాబాలుని దెచ్చి పెంచెను. రాజా! ఆబాలుఁ డెవఁ డందువా? కుంతీదేవి పాండురాజును బెండ్లాడకపూర్వం బామెకు సూర్యమంత్రంబు నుపదేశించిరి. ఆమంత్ర ప్రభావంబు నెఱుంగఁ గుతూహలినై యామె సూర్యు నుపాసించెను. ఆయింతికి సద్యోగర్భముగలిగి పుత్త్రుఁడుదయించెను. కుంతి యదిచూచి తనకన్యాత్వంబునకుఁ గళంకు గలుగునని భయపడి యాశిశువు నొక పెట్టెలో నుంచి గంగలో వదలెను. ఆపెట్టె యతిరథునకుఁ జిక్కి యందున్న బాలుఁడు వానిచేతఁ బోషింపఁబడెను. అతఁడే కర్ణుడని ప్రసిద్ధికెక్కెను.

### ద్రుహ్యుని సంతతి

ద్రుహ్యునకు బభ్రుఁడు, వానికి సేతువు, వానికి నారబ్ధుఁడు, వానికి గాంధారుఁడు, వానికి ఘర్మఁడు, వానికి ఘృతుఁడు, వానికి దుర్మదుఁడు, వానికిఁ బ్రచేతసుఁడు నుదయించిరి. ప్రచేతసునకు నూర్గురు కొడుకులు పుట్టి మ్లేచ్ఛరాజులై యుత్తరదిక్కు నాక్రమించిరి.

### తుర్వసు సంతతి

తుర్వసునకు వహ్ని, వానికి భర్గుఁడు, వానికి భానుమంతుఁడు, వానికిఁ ద్రిసానుఁడు, వానికిఁ గరంధముఁడు, వానికి మరుత్తుఁడు, జనించెను. మరుత్తునకు సంతానము గలుగదు. అతఁడు పౌరవుఁడైన దుష్యంతునిఁ బుత్త్రునిగా స్వీకరించెను. ఆదుష్యంతుఁడు రాజ్యలోభంబునఁ జేసి మరుత్తును వదలి మఱలఁ బూరువంశంబుఁ జేరెను.

### యదువంశక్రమము

రాజేంద్రా! యయాతికి దేవయానివలన యదువు తుర్వసుఁడు ననుకొడుకులు గలిగిరని చెప్పితిని. వారిలోఁ దుర్వసునివంశముఁ దెలిపి

తిని. యదువంశము వినుము. ఈయదువంశంబున భగవానుఁడు మనుష్య రూపంబున నవతరించుటవలనఁ దద్వంశచరిత్రను వినుట యనఁగా భగవల్లీలలు వినుటయగు. కాఁబట్టి యదువంశచరిత్ర మహాపుణ్యవంతంబును నిఖిలపాతకహరంబునగు.

యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుఁడు, రిపుఁడు నను పుత్రులునల్వురు గలిగిరి. వారిలో సహస్రజిత్తునకు శతజిత్తు పుట్టెను. వానికి మహాహయుఁడు, వేణుహయుఁడు, హేహయుఁ డనువారు జనించిరి. హేహయునకు ధర్ముఁడు, వానికి నేత్రుఁడు, వానికిఁ గుంతి, వానికి సోహంజి, వానికి మహిష్మంతుఁడు, వానికి భద్రసేనకుఁడుఁ బ్రభవించిరి. భద్రసేనునకు దుర్మదుఁడు, ధనికుఁడు నుదయించిరి. ధనికునకుఁ గృతవీర్యుఁడు, కృతాగ్ని, కృతవర్మ, కృతౌజస్సుఁ బుట్టిరి.

కృతవీర్యునకుఁ గార్తవీర్యార్జునుఁడు పుట్టి సప్తద్వీపాధిపతియై దత్తాత్రేయమహర్షివలన యోగవిద్యఁ గఱచి మహోన్నతగుణసంపన్నుఁడై వెలసెను. మఱియు యజ్ఞదాన తపోయోగశ్రుతవీర్యజయాదులందు వానికి సాటిగలుగరైరి. రాజా! ధనమెచ్చిన మదమెచ్చు; మదమెచ్చిన దుర్గుణంబులు మానక హెచ్చు నందురు. కార్తవీర్యార్జునుఁడు సప్తద్వీపాధిపతియై సమస్తధనసమృద్ధిగలిగినను వానికి స్మృతి దొలఁగదు గావున నతఁడు ధనమదవిమోహితుఁడుగాక యొకవంకషడింద్రియసౌఖ్యంబులను జూఱగొనుచుండియు హరిభక్తి నెన్నఁడుఁబాయక యెనుబదియైదువేలసంవత్సరంబులు రాజపరిపాలనంబుచేసెను.

వానికి వేయిమంది పుత్రులు జనించిరి. వారిలో జయధ్వజుఁడు శూరసేనుఁడు, వృషణుఁడు, మధువు, ఊర్జితుఁ డనువా రైదుగురు మహావీరులై విఖ్యాతిఁ గాంచిరి. జయధ్వజునకుఁ దాళధ్వజుఁడు పుట్టెను. వానికి వీతిహోత్రుఁడు మున్నగువారు నూర్గురుకొడుకులు పుట్టి సగరుని మహత్తర [illegible] బలంబునకు బలిరైరి. మధువునకు వృష్ణుఁడు

గలిగెను. వానికి వృష్ణిమొదలైనవారు జనించిరి. మధువంశ్యులు మాధవులనియు వృష్ణివంశ్యులు యాదవులనియుఁ బేర్కొనఁబడిరి.

యదువునకుఁ గ్రోష్టుఁడు, వానికి వృజినవంతుఁడు, వానికి శ్వాహితుఁడు, వానికి ఖేరుశేకుఁడు, వానికిఁ జిత్రరథుఁడు, వానికి శశిబిందుఁడు పుట్టిరి. శశిబిందుఁడు మహాయోగియయ్యుఁ జక్రవర్తిపదంబు నలంకరించి చతుర్దశమహారత్నంబులను సంపాదించెను. అవి యేవి యందువా? గజ హయ రథ స్త్రీ బాణ ధనుర్నిధి మాల్య వస్త్ర వృక్ష శక్తి పాశ మణి ఛత్ర విమానంబులు పదునాల్గుఁ జతుర్దశమహారత్నంబులనంబడు.

శశిబిందువునకుఁ బదివేవురుభార్య లుండిరి. వారికి దశలక్ష సహస్రపుత్త్రులు గలిగిరి. వారిలోఁ బృథుశ్రవుఁడు మున్నగువారు గణుతికెక్కిరి. పృథుశ్రవునకు ధర్ముఁడు వానికిఁ గుశనస్సు గలిగెను. అతఁడు నూఱుహయమేధంబులుచేసెను. కుశనస్సునకు రుచకుఁడు వానికిఁ బురుజిత్తు, ద్రుముఁడు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుఁడు జనించిరి.

జ్యామఘుఁడు శైబ్య యనుదానిని వివాహమాడెను. వానికి దానియందు సంతానము గలుగకుండెను. అతఁడు వేఱొకతెను బెండ్లాడఁ దలంచియు శైబ్యకు వెఱచి ద్వితీయవివాహంబును మానెను. అట్లుండఁగాఁ గొండొకనాఁ డతఁడు రథారూఢుఁడై పోవుచుండఁగా నొకానొకకన్య వైరిగృహంబునుండి తప్పించుకొని వచ్చుచు జ్యామఘునకు నెదురయ్యెను. అతఁ డాయింతిని రథం బెక్కించుకొని వచ్చుచుండెను. శైబ్య యదిచూచి 'కపటాత్మా! ఈరథంబున నేను గూర్చుండ నైనతావు నాక్రమించిన యీపెయొవతె?' యని యడిగెను. అతఁడు భార్యకు జంకి 'ఇది నీకోడ' లనెను. శైబ్య యామాటకు నవ్వు దాల్చి 'అయ్యా! నేను గొడ్రాలను; నాకు సవతు లెవ్వరును లేరు. ఇది నాకుఁ గోడలగు టెట్లు?' అనెను. జ్యామఘుఁ డాయెత్తిపొడుపుమాట విని 'దేవీ! బుట్టఁబోవుసుతునకు నీపె భార్యయై నీకుఁ గోడలగు

ననెను. రాజా! జ్యామఖుఁడు బహుకాలంబుగా విశ్వేదేవులను బితరుల నారాధించుచుండెడువాఁడు గావున వా రామాట నంగీకరించిరి. వారి యనుగ్రహఫలంబుగా శైబ్య గర్భవతియై సుతుని గనెను. అతనిని విదర్భుఁ డనిరి. ఆవిదర్భునకు నక్కన్నియను బెండ్లిచేసిరి.

విదర్భునకు దానియందుఁ గుశుఁడు క్రథుఁడు, రోమపాదుఁడు జనించిరి. రోమపాదునకుఁ బభ్రుఁడు, వానికిఁ గృతి, వానికిఁ గుశికుఁడు, వానికిఁ జేది, వానికి దమఘోషుఁడు ప్రభవించిరి. క్రథునకుఁ గుంతి, దానికి ధృష్టి, వానికి నిర్వృతి, వానికి శార్హ్యుఁడు, వానికి వ్యోమఁడు, వానికి జీమూతుఁడు, వానికి వికృతి, వానికి భీమరథుఁడు, వానికి నవరథుఁడు, వానికి దశరథుఁడు, వానికి శకుని, వానికిఁ గుంతి, వానికి దేవదాసుఁడు, వానికి దేవక్షత్త్రుఁడు వానికి మధువు, వానికిఁ గురువశుఁడు, వానికి ననువు, వానికిఁ బురుహోత్రుఁడు, వానికి నంశువు, వానికి సాత్వతుఁడు పుట్టెను.

సాత్వతునకు భజమానుఁడు, భజదివ్యుఁడు, వృష్ణి, దేవావృధుఁడు, అంధకుఁడు, మహాభోజుఁడు ననుకొడుకు లేడ్వురు గలిగిరి. భజమానుఁడు భార్యాద్వయంబును గ్రహించెను. అందొకదానికి నిమ్రోచి, కంకణుఁడు, వృష్ణి యనువారును; రెండవదానికి శతజిత్తు సహస్రజిత్తు, అయుతజిత్తు అనువారును బుట్టిరి. దేవావృధువునకు బభ్రుఁడు జనించెను. రాజేంద్రా! దేవావృధుబభ్రువుల ప్రభావం భింతనరాదు. వారికృపావిశేషంబునఁ బదునాల్గువేలు నలువదియొక్కరు మోక్షభాగ్యంబుఁ గాంచిరి.

మహాభోజుఁడు పరమధర్మాత్ముఁడై వెలసెను. అతనివంశమువా మహాభోజు లనంబరఁగిరి. వృష్ణికి సుమిత్త్రుఁడు, వానికి యుధాజిత్తు, వానికి శిని, వానికి ననమిత్త్రుఁడు, వానికి నిమ్నుఁడు జనించిరి. నిమ్నునకు సత్త్రాజిత్తు, ప్రసేనుఁడు, శిని యనువారు గలిగిరి. శినికి సత్యకుఁడు

వానికి యుయుధానుఁడు, వానికి జయుఁడు, వానికి గుణి,
యుగంధరుఁడు పుట్టిరి.

అనమిత్రునకుఁ బృశ్ని, వానికి శ్వఫల్కుఁడును జిత్రకుఁడును గలిగిరి. శ్వఫల్కునకు గాదిని యనుదానియందు అక్రూరుఁడు, ఆసంగుఁడు, సారమేయుఁడు, మృదురుఁడు, మృదుపదుఁడు, శివుఁడు, వర్మదృక్కు, ధృష్టవర్మఁడు, క్షత్రోపేతుఁడు, అరిమర్దనుఁడు, శత్రుఘ్నుఁడు, గంధమాదుఁడు, ప్రతిబాహువు ననుకుమారులు పదుమువ్వురును సుచారువను నొకపుత్రికయు జనించిరి. అక్రూరునకు దేవలుఁడు అనుపదేవుఁడును గలిగిరి. చిత్రరథునకుఁ బృథువును, వృష్ణికి విదూరథాదులు పలువురు ప్రభవించిరి. అంధకునకుఁ గుకురుఁడు, భజమానుఁడు, శుచి, కంబళబర్హిషులు నుదయించిరి. కుకురునకు వృష్ణి, వానికి విలోమతనయుఁడు, వానికిఁ గపోతరోముఁడు, వానికి ననుఁడుఁ గలిగిరి. అనువునకుఁ దుంబురుఁడు నెయ్యుఁడయ్యెను. అయ్యనువునకు దుందుభి, వానికి రవిద్యోతుఁడు, వానికిఁ బునర్వసువు నొకభార్య వలనను, వేఱొకభార్యవలన ఆహుకుఁడు, ఆహుకి యనుపుత్రియు జనించిరి. ఆహువునకు దేవకుఁడు ఉగ్రసేనుఁడు గలిగిరి. దేవకునకు దేవలుఁడు, అనుపదేవుఁడు, సుదేవుఁడు, దేవవర్ధనుఁ డనుపుత్రులు నల్గురును; ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి యనుపుత్రిక లేడ్వురును జనించిరి. ఆకన్నియల నేడ్వురను వసుదేవుఁడు వివాహమాడెను.

ఉగ్రసేనునకుఁ గంసుఁడు, సునాముఁడు, న్యగ్రోధుఁడు, కహ్వుఁడు, శంకువు, సుభువు, రాష్ట్రపాలుఁడు, విసృష్టుఁడు, తుష్టిమంతుఁ డనుకుమారులును; కంస,కంసవతి, కంక, సురభువు, రాష్ట్రపాలిక యనుకుమారికలును గలిగిరి. ఉగ్రసేనుని పుత్రికలను వసుదేవునితమ్ములు వివాహమాడిరి.

అంధకునికుమారుఁడైన భజమానునకు శూరుఁడు, వానికి విదూ

రథుఁడు, వానికి శిని, వానికి భోజుఁడు, వానికి హృదికుఁడు జనించిరి. హృదికునకు దేవమీఢుఁడు, శతధనువు, కృతవర్మ పుట్టిరి. దేవమీఢునకు శూరుఁడు, వానికి మారిషయనుభార్యయందు వసుదేవుఁడు, దేవభాగుఁడు, దేవశ్రవుఁడు, ఆనకుఁడు, సృంజయుఁడు, శ్యామకుఁడు, కంకుఁడు, అనీకుఁడు, వత్సకుఁడు, వృకుఁడు జనించి మహానిష్కల్మషులని పొగడ్తఁగాంచిరి. రాజా! శూరునకు వసుదేవుఁడు పుట్టినప్పుడు దేవదుందుభులు మ్రోసెను. ఆకారణంబున వానికి ఆనకదుందుభి యను నామాంతరము సిద్ధించెను. మఱియు శూరునకుఁ బృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస్సు, రాజాధిదేవి యనుపుత్త్రికలేవురుగలిగిరి. వారిలోఁ బృథను శూరుఁడు వానిమిత్త్రుఁడైనకుంతి యనువానికిఁ బుత్త్రికగా నిచ్చెను. ఆకారణంబునఁ బృథకుఁ గుంతి యనుమాఱుపేరు వచ్చెను. ఆకుంతికిఁ దద్వివాహాపూర్వము కర్ణుని గన్నసంగతిఁ జెప్పితిని.

శ్రుతదేవను కారూషుఁడైన వృద్ధశర్మ పెండ్లాడి మునిశాపవశంబున దైత్యత్వము నొందెను. వారికి దంతవక్త్రుఁడు జనించెను. శ్రుతకీర్తిని గేకయరాజు దృష్టకేతుఁడు వివాహమై ప్రవర్ధనాదిసుతులను పదిమందిని బడసెను. జయత్సేనుఁ డవంతిదేశాధిపతియై రాజాధిదేవిని బెండ్లాడి విందానువిందులను కొడుకులఁ గాంచెను. దమఘోషుఁడు చేదిదేశాధినాథుఁడై శ్రుతశ్రవస్సును గ్రహించి శిశుపాలుని గనియెను. వసుదేవునితమ్ముఁడు దేవభాగుఁడు ఉగ్రసేనుని పుత్త్రికయైన కంసను బెండ్లియై చిత్రకేతువు బృహద్బలుఁడు ననువారలఁ బడసెను. దేవశ్రవుఁడు కంసవతి యనుభార్యయందు సువీరుఁడు, ఇషుమంతుఁడు ననువారలఁ గాంచెను. కంకుఁడు కంక యనుదానివలన బకుఁడు, సత్యజిత్తు, పురుజిత్తులఁ బడసెను. సృంజయుఁడు రాష్ట్రపాలికవలన వృషదుర్మర్షణాదులను గనెను. శ్యామకుఁడు సురభూమివలన హరికేశహిరణ్యాక్షులను బడసెను. వత్సుఁడు మిత్రకేశి యనునచ్చరబోఁడిని వరించి దానివలన

వృకాదిపుత్రులను బడసెను. వృకుడు దూర్వాక్షివలనఁ దక్షుఁడు, పుష్కరుఁడు, సాల్వుఁడు మున్నగుసుతులఁ బడసెను. అనీకుఁడు సుదామ యనుదానివలన సుమిత్రానీకబాణాదులను గాంచెను. ఆనకునకుఁ గర్ణిక యనుదానియందు ఋతుధామ జయులు పుట్టిరి.

### వసుదేవవంశము

రాజేంద్రా! వసుదేవునకుఁ బౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇళ, ధృతిదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి మున్నగువారు భార్యలైరి. వారిలోఁ బౌరవికి సుభద్రుఁడు, భద్రబాహుఁడు, దుర్మదుఁడు, భద్రుఁడు, భూతుఁడు మున్నగువారు పన్నిద్దఱును; రోహిణికి బలుఁడు, గదుఁడు సారణుఁడు, దుర్మదుఁడు, విపులుఁడు, ధ్రువుఁడు, కృతుఁడు మున్నగువారును; భద్రకుఁ గేశి యను వాఁడును; మదిరకు నందోపనందకృతక శూరాదులును; రోచనకు హస్త హేమాంగదాదులును; ఇళకు నురువల్కలాదులును; ధృతిదేవకుఁ ద్రిపృష్ఠుఁడును; శాంతిదేవకుఁ బ్రశమప్రశ్రితాదులును, ఉపదేవకుఁ గల్పవృష్ట్యాదులును; శ్రీదేవకు వసు హంస సుధన్వాదిషట్కంబును; దేవరక్షితకు గదాదులు తొమ్మండ్రుగురును; సహదేవకుఁ బురూధ శ్రుతముఖ్యాదు లెనమండ్రుగురును గలిగిరి.

రాజా! దేవకి కీర్తిమంతుఁడు, సుషేణుఁడు, భద్రసేనుఁడు, ఋజువు, సమదనుఁడు, భద్రుఁడు, సంకర్షణుఁ డనుపుత్రుల నేడ్వురఁ గని వారినెల్లఁ గంసునకు నప్పగించెను. తర్వాత భగవానుఁ డెనిమిదవ సుతుఁడై యాసుదతిగర్భంబునఁ బొడమెను. నీపితామహి సుభద్ర భగవానునకు సోదరియై జనించెను.

రాజా! ఎప్పుడెప్పుడు ధర్మగ్లానియు నధర్మవృద్ధియు నగునో యప్పుడప్పు డెల్ల భగవానుఁ డవతరించును. అంతియగాని వానికిఁ గర్మంబులు కలుగుటగాని, తత్ఫలానుభవార్థము పుట్టుటగాని గలుగదు.

ప్రాణులు కర్మవశంబున జన్మించును. భగవానుఁడన్ననో వానియోగ మాయ నధిష్ఠించి యవతరించును. ప్రాణులజన్మంబునకు వారు స్వతంత్రులు గారు. భగవానుని యవతారము వాని యిచ్ఛాధీనమై యుండు. ఆమహాత్ముని మాయాశక్తి దురత్యయము. దానిని దాటుటకుఁ బరమేశ్వరానుగ్రహం బొక్కటే సాధనంబగు. వానికి శరణిల్లినవారికిఁ దదనుగ్రహము సర్వసిద్ధము.

నవమస్కంధము సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక

| పు. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 18 | సెంజలి | సెంజీలి |
| 7 | 87 | నవసుఁడు | సవసుఁడు |
| 7 | 24 | తచ్చరాసన | తచ్ఛరాసన |
| 9 | 13 | అంబోధి | అంభోధి |
| 10 | 11 | పధికులు | పథికులు |
| 17 | 17 | ధర్మంబులు | కర్మంబులు |
| 23 | 1 | యధోచితమై | యథోచితమై |
| 27 | 19 | XVV | XV |
| 29 | 18 | వినిశుకయోగిని | శుకయోగినివిని |
| 30 | 4 | కామాంబుల | కామంబుల |
| | 10 | సెందఱనో | సెందఱనొ |
| 32 | 23 | తలఁచి | తలచి |
| 33 | 12 | అహాకారంబు | అహంకారంబు |
| 35 | 19 | గవిసంబు | గపిశంబు |
| 37 | 18 | లాంచనము | లాంఛనము |
| 38 | 2 | అనుష్టానంబు, | అనుష్ఠానంబు |
| 40 | 13 | అనారబ్ద | అనారబ్ధ |
| 45 | 2 | తద్ఖడ్గము | తత్ఖడ్గము |
| | 14 | రత్నాధికము | రత్నాదికము |
| | 24 | మన్నాఁడు | నున్నాఁడు |
| 46 | 18 | పూర్వము; | పూర్వము |
| 52 | 11 | విశేషంబుల | విశేషంబులు |
| | 18 | కారణంబును | కారణంబున |
| | 15 | అత సిద్ధి | అత స్థితి |
| | 18 | రెంటికి | కురెంటికి |
| 53 | 9 | గవి | గతి |
| 55 | 1 | పరిచ్ఛిన్నుఁడు | పరిచ్ఛిన్నుఁడు |
| 56 | 25 | భోధించితివి | బోధించితివి |
| 59 | 22 | సభావ | స్వభావ |
| 63 | 3 | బాధకరంబు | బాధకంబు |
| | 12 | నిర్వ్యాప్తుల | నిర్వ్యాపృతుల |
| 64 | 16 | ఒక | బక |
| 65 | 23 | తెఱుంగుట | సెఱుంగుట |
| 73 | 12 | రాదుల | ర్యాదుల |
| | 15 | ప్రియ | ప్రియు |
| 79 | 6 | కర్తృకియాః | కర్తృకయాః |
| | 8 | భూయిష్టా | భూయిష్ఠా |
| | 10 | అహాలీనాం | అహూతీనాం |
| | 15 | ప్రాణాయోజనే | ప్రాణాయాజనే |
| | 17 | సర్వతత్వ | సర్వసత్వ |
| 81 | 12 | ప్రతక్రమ | ప్రతక్రతు |
| 90 | 22 | అగోశంబు | అగోశంబు |
| 102 | 7 | ఆనందాలకు | ఆనందాదులకు |
| 103 | 21 | వ్యాధులుగా | వ్యాధులుగాని |
| 106 | 16 | పాదాంగుష్టంబు | పాదాంగుష్ఠంబు |
| 107 | 16 | దృశ్యంబలకు | దృశ్యంబులకు |
| 109 | 2 | దలలో | దనలో |
| | 19 | వ్యవహించును | వ్యవహరించును |
| | | ప్రారబ్ద | ప్రారబ్ధ |
| 110 | 5 | అంతాంత | అంతాంతర |
| 113 | 15 | బాధకరంబులు | బాధకంబులు |
| 114 | 18 | కాఁగలింప | కౌఁగిలింప |
| 115 | 8 | దుష్కృతంబు | దుష్కృతంబు |
| 117 | 3 | తల | దల |
| 118 | 5 | చూచువాఁడు | చూచువారు |
| 121 | 6 | రోగగ్రస్థుఁడు | రోగగ్రస్తుఁడు |
| 123 | 2 | డివి | వీని |
| 124 | 10 | అజామీళుఁడు | అజామిళుఁడు |
| 125 | 1 | మూఁట | మూట |
| | 4 | అజామీళుని | అజామిళుని |
| | 20 | వారిని | వారినివిని |
| 134 | 2 | నామోచ్ఛారణ | నామోచ్చారణ |
| 136 | 9 | ,, | ,, |

| పు. | బంతి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 140 | 20 | పాపపునరంబురంబునకు | పాపపునంబురంబునకు |
| 142 | 25 | తీవ్రతను | తీవ్రతను |
| 143 | 7 | ప్రారబ్దంబు | ప్రారబ్ధంబు |
| | 11 | ప్రారబ్ద | ప్రారబ్ధ |
| 144 | 16 | సోముఁడు | — |
| | 17 | అట్లగుటకు సెంతయు | అట్లగుటకుసోముఁడెంతయు |
| | 22 | నిష్పాద | నిష్పాద |
| 147 | 16 | నిరూఢుఁడవై | నిగూఢుఁడవై |
| 149 | 8 | గతవడి | కొంతవడి |
| 150 | 12 | ప్రజసర్గార్థము | ప్రజాసర్గార్థము |
| 157 | 22 | అహిర్బుధ్న్యుఁడు | అహిర్బుధ్న్యుఁడు |
| 160 | 18 | పరీక్షితు | పరిక్షిత్తు |
| | 22 | క్రేతను | క్రేవను |
| 161 | 11 | దేవేశ్వర్య | దేవేశ్వర |
| 161 | 22 | తోలఁకువ | పోలఁకువ |
| 162 | 6 | మాకు | మీకు |
| 163 | 8 | జ్యేష్ఠుఁడగును | జ్యేష్ఠుఁడగును. |
| 164 | 12 | నిర్జల | నిర్జన |
| | 19 | అస్తులను | అస్థులను |
| | 23 | ,, | ,, |
| 167 | 6 | లాధ | బాధ |
| 173 | 21 | కృమణులకు | కృపణులకు |
| 174 | 4 | అశ్వశిరోనామక | అశ్వశిరోనామక |
| | 5 | దృష్టకు | ద్వష్టకు |
| | 6 | ,, | ,, |
| 175 | 5 | ఉదాత్త | ఉదాత్త |
| 178 | 4 | ముచి | నముచి |
| 179 | 20 | భూతపరులకు | భూతపతులకు |
| 180 | 1 | ధధీచి | దధీచి |
| | 17 | అధిష్ఠింతు | అధిష్ఠించింతు |
| 182 | 11 | ప్రాదులాలకు | ప్రాకాదులకు |
| 183 | 20 | వొడ్డు | నొడ్డు |
| 184 | 5 | నాయసుర | నీయసుర |
| | 6 | దరించితివి | ధరించితివి |
| 185 | 3 | తచ్చిరంబు | తచ్ఛిరంబు |
| 186 | 25 | హాత్యవాహనుఁడు | హవ్యవాహనుఁడు |
| 194 | 14 | పుట్టువలు | పుట్టువులు |
| 199 | 24 | చిరాత్ములు | చిదాత్ములు |
| 202 | 7 | సంత | సుంత |
| 210 | 19 | దేవభక్తి | దైవభక్తి |
| 213 | 11 | ప్రహ్లాదునకు | ప్రహ్లాదునకు |
| | 17 | నణ | గణ |
| 215 | 19 | స్వకృతాపరాధ | స్వకృతాపరాధ |
| 216 | 18 | ఉచ్ఛిష్ట | ఉచ్ఛిష్ట |
| | 19 | పెంటుకలు | పెండుకలు |
| | 20 | సంధ | సంధ్య |
| 217 | 9 | తత్వ్రతం | తద్వ్రతం |
| | 11 | అయోధ్య | అయోధ్య |
| | 22 | వెంగిలి | యెంగిలి |
| 219 | 1 | వెంగిలి | ఎంగిలి |
| | 22 | వటువాఁత | వటువాత |
| 220 | 11 | బవి | బలి |
| | 16 | వేద్యాతులలో | వేద్యాదులలో |
| 221 | 17 | వేఁకువ | వేకువ |
| 222 | 7 | గ్రస్థ | గ్రస్త |
| 225 | 3 | సెట్లు | లెట్లు |
| | 9 | నవినా | నవినా |
| | 20 | వాసనాధనం | వాసవాధీనం |
| 226 | 6 | రజః ప్రకృతి | రజః ప్రకృతి |
| | 7 | కలవారికి | కలవారిని |
| 228 | 15 | భగవద్వ్యవ | భగవద్వ్యవ |
| 232 | 2 | ప్రార్థనలగుటకు | ప్రార్థనలగుటకు |

| పు. | బంతి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 304 | 16 | పఠించును | నఠించును |
| | 18 | సంన్యాసము | సన్న్యాసము |
| | 21 | గృహామందు | గురుగృహామందు |
| | | తపించి | వసించి |
| 306 | 14 | యాయ్యాత్ముని | యయ్యాత్ముని |
| | 18 | గంధి | సంధి |
| | 19 | చేయునప్పుడా | చేయునప్పు |
| 307 | 8 | పురోడాదిని పర్వ | పురోడాశాదిని ర్వప. |
| 318 | 5 | మాఖమాస | మాఘమాస |
| | | మఖాపూర్ణిమ | మఘాపూర్ణిమ. |
| 320 | 23 | ధిఃకారంబు | ధిక్కారంబు |
| 326 | 1 | ఫలముదానిభోగ | ఫలభోగ |
| | 20 | బుధి | బుద్ధి |
| 329 | 4 | సంకర | నంకుర |
| | 10 | అగ్న్యధికంబు | అగ్న్యాదికంబు |
| 330 | 15 | ఏకమేమ | ఏకమేవ |
| 332 | 8 | వలువకొ | నలువకొ |
| 333 | 11 | దైవత | రైవత |
| 335 | 5 | అంతలో | అంతతో |
| | 10 | గర్జంబున | గర్భంబున |
| 340 | 12 | శిఖలంబట్టి | శిఖరంబులబట్టి |
| | 15 | వనకల్లోల | తనకల్లోల |
| | 20 | ఈచుచు | ఈనుచు |
| 341 | 13 | ఉత్పల | ఉత్పల |
| | 17 | వదంతర | తదంతర |
| 342 | 7 | శతవాతము | శీతవాతము |
| 344 | 12 | అనుచు | అగుచు |
| 345 | 23 | ఏకాంత | ఏకాంతు |
| 346 | 1 | అతీంద్రియు | నతీంద్రియు |
| 347 | 4 | చూడఁదే | చూడఁడె |
| | 13 | దీక్షవిత | దీనువిత |
| | 23 | ప్రోద్దిత | ప్రోత్థిత |
| 350 | 21 | నిపతశైన | నిరతశైన |

| పు. | బంతి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 351 | 9 | మందనాద్రి | మందరాద్రి |
| | 15 | అపరేశ్వరుఁడు | అమరేశ్వరుఁడు |
| | 19 | నీసేవ | నీసేత |
| | 24 | లేచిచచ్చిపడిరి | చచ్చిపడిరి |
| 352 | 10 | అంశాంబులు | అంశాంశంబులు |
| | 12 | వద్యావధ్యులు | వధ్యావధ్యులు |
| | 18 | వారినివెంట | వెంట |
| 353 | 23 | త్రయామయుండు | త్రయీమయుండు |
| 354 | 1 | ఓజస్సహో | ఓజో |
| 356 | 18 | ఓర్ప | ఓర్వ |
| | 24 | ఉద్పాద | ఉత్పాద |
| 358 | 22 | మంథరగిరి | మందరగిరి |
| 359 | 10 | మత్స్యపాది | మత్స్యకచ్ఛపాది |
| 361 | 15 | వల్లనాట | వల్లకాట |
| 362 | 19 | విషాధులను | విషావధులను |
| 364 | 7 | చెవి | తీవి |
| | 13 | వెదుక | వెదక |
| 365 | 2 | మమంగళంబు | మంగళంబు |
| 366 | 1 | లోచనంబులను | లోచనంబులును |
| | 21 | ధిఃకరించిరి | ధిక్కరించిరి |
| 370 | 23 | సెగరెను | సెగిరెను |
| 371 | 13 | స్కంధుఁడు | స్కందుఁడు |
| 372 | 8 | షడి | పది |
| | 23 | సేసను | సేనను |
| 374 | 15 | సహాస్రాయత | సహస్రాయుత |
| 376 | 9 | ప్రాతి | ప్రీతి |
| 377 | 4 | భాషంబు | భాషంబులు |
| 378 | 14 | స్థన | స్తన |
| 379 | 15 | ఉండి | ఉండు |
| 381 | 5 | బాహ్యాంభ్యంతర | బాహ్యాభ్యంతర |
| | 11 | అస్థేయము | అస్తేయము |
| | 16 | కర్ణంబులను | కర్ణంబును |
| 382 | 12 | మంత్రాహుతి | మంత్రాహుతి |

| పు. | పంక్తి. | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 382 | 18 | ఉచ్చైఛ్శ్రవ | ఉచ్చైశ్శ్రవ |
| | 14 | కాంచక | కాంచన |
| | 19 | మాల్యను | మాలను |
| 383 | 11 | కొలను | కొలఁకు |
| 385 | 3 | ఎఱించి | ఎఱింగి |
| 387 | 12 | మాఖ | మాఘ |
| | | అంతరంబున | అంతంబున |
| | 13 | వేయువ | వేకువ |
| 388 | 15 | జపించిదానిని | జపించి |
| 391 | 12 | బులతోc | బులతో |
| 392 | 4 | శుక | మశ |
| | 13 | నొకవ్యక్తి | యొకవ్యక్తి |
| | 28 | నఫల | సఫల |
| 393 | 9 | ప్రహ్హాదుఁడు | ప్రహ్లాదుఁడు |
| | 26 | వైరి | వైరము |
| 394 | 4 | వుత్రత్వంబు | పుత్రత్వంబు |
| | 8 | నెందు | యెందు |
| | 10 | నడువ | నడవ |
| 396 | 6 | విష్ణు | విష్ణువీ |
| 404 | 22 | యోగ్యంబులైన | యోగ్యంబైన |
| 405 | 11 | తరుణ | వరుణ |
| 406 | 10 | జీవిభూతి | నీవిభూతి |
| | 22 | అదివిని | అదితిని |
| 403 | 3 | పిత్రృ | పితృ |
| | 14 | సృష్ఠించి | సృష్టించి |
| 412 | 15 | పాలివీళ | పాలితేశ |
| | 20 | నిర్మాల్యకే | నిర్మాల్లకే |
| 413 | 4 | నిందించు | నిద్రించు |
| 415 | 3 | పురస్కరంబు | పురస్సరంబు |
| 417 | 13 | నారసి | నొరసి |
| | 15 | గోష్ఠి | గోష్ఠము |
| 418 | 2 | లబ్దంబు | లబ్ధంబు |
| 423 | 13 | భగునకు | నభగునకు |
| 426 | 7 | సకలోపకర | సకలోపకరణ |
| 426 | 11 | పురస్కరము | పురస్సరము |
| 431 | 18 | శ్రాద్ద | శ్రాద్ధ |
| | 20 | వెంగిలి | యెంగిలి |
| 433 | 20 | పుంసువన | పుంసవన |
| 434 | 5 | అయ్యసువు | అనిసువు |
| | 9 | ద్వీపాయవ | ద్వీపాయత |
| 435 | 7 | నీసగించుచు | నీసడించుచు |
| 440 | 10 | వెసరు | నెసరు |
| 449 | 15 | వీరాదివీరులు | వీరాధివీరులు |
| 45[illegible] | 15 | గతికిపోసకు | గతికిపోఁచకు |
| 454 | 24 | యాజ్ఞేశ్వరుం డయ్యె | యజ్ఞేశ్వరుండ వయ్యె |
| 455 | 15 | సృష్టమై | సృష్టమై |
| | 7 | అనును | అనుచు |
| 456 | 14 | చాల | చార |
| 464 | 20 | బుజ్జవంబు | బుజ్జనంబు |
| 468 | 18 | అంచితన | అచింతన |
| 469 | 21 | పిటిసిట | పుడిసిట |
| 479 | 23 | చీరెలు | చీరలు |
| 480 | 4 | చీరెను | చీరను |
| | 6 | చీరె | చీర |
| | 13 | ,, | ,, |
| 481 | 7 | తలిగె | తగిలె |
| | 19 | శరిన | శరిష్ఠ |
| 482 | 12 | ఆలోక | ఆలోన |
| 484 | 23 | సోహమ్మనిరి | దాసోహమ్మనిరి |
| 486 | 6 | తగ్గాథా | తద్గాథా |
| 489 | 2 | అగ్నిచయం | అగ్నిచయనం |
| 490 | 16 | వితధ | వితథ |
| 491 | 5 | నిష్కృంచుఁడై | నిష్క్రంచనుఁడై |
| 493 | 6 | సుహోదరుఁడు | సుహోత్రుఁడు |
| | 19 | బృహదిదిషు | బృహదిషు |
| 494 | 10 | శత్యధృతి | సత్యధృతి |
| 495 | 8 | జీవతంతు | జీవవంతు |

| పు. | బంతి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 495 | 11 | పరిక్షిత్తు | పరీక్షిత్తు |
| 496 | 9 | యోగనిషుండై | యోగనిష్ఠుండై |
| | 18 | గఁధర్వుని | గంధర్వుని |
| 497 | 1 | పాండవుఁవిదు | పాండవువిదు |
| | 11 | వసంబున | వశంబున |
| | 17 | యుధిష్ఠురు | యుధిష్ఠిరు |
| 498 | 6 | ధార్తరాష్ట్రుండు | ధృతరాష్ట్రుండు |
| 500 | 9 | తత్తదేశంబు | తత్తద్దేశంబు |
| | 22 | దెచ్చి | తెచ్చి |
| 500 | 22 | పుత్రకామేష్ఠి | పుత్రకామేష్టి |
| 502 | 4 | పాతహారంబు | పాతకహరంబు |
| | 18 | గాన | గాక |
| 503 | 12 | గుశనన్ను | నుశనన్ను |
| | 13 | కుశనన్నునకు | ఉశనన్నునకు |
| | 26 | బుట్టఁబోవు | పుట్టఁబోవు |
| 504 | 23 | వాము | వాయు |
| 506 | 15 | ప్రవరన | ప్రతర్దన |
| 507 | 6 | కేవరక్షిత | దేవరక్షిత |